**చెంబు-** చేమంత, తంబుగ, గడ్డుకము, సగ్గెడ, కర్కరి

**చెట్టు-** వృక్షము, మహీరుహము, విటపి, పాదపము, తరువు, కుజము, అనో కహము, కుటము, సాలము, పలాశి, ద్రుమము, భూజము

**చెట్టుపట్ట-** త్వక్కు, త్వచము, చోచకము, చోచము, పట్ట, బరడు, బెరడు

**చెప్పులు-** జోళ్ళు, పాపోసులు, మలకడాలు, పాదరక్షలు, ఉద్దాలు, ఉపానహము, సమ్మాళిగలు, సంభరువులు, చర్మపా దుకలు

**చెమట-** ఘర్మము, నిదాఘము, స్వేదము

**చెఱకు-** అంగారిక, అసిపత్రము, ఇక్షువు, కరటము, కర్కశము, రసాలము, స్థూలము, కన్నుల ప్రాను, ఇంచు

**చెరువు-** గుంట, తటాకము, పద్మాకరము, సరస్సు, కొలను

**చెలికత్తె-** ఆళి, గోల, వయస్య, సఖి, చెలిమి(కత్తె), సకి, చెలిమికత్తియ

**చెలికాడు-** అంటుకాడు, అనుగు, ఉద్ది కాడు, చెలువుడు, ననువుకాడు, నెచ్చెలి, నెయ్యరి, నెయ్యుడు, నేస్తకాడు, నేస్తి, నేస్తు, పొత్తుకాడు, బోటికాడు, మిత్త, సంగడికాడు, సంగడీడు, సంగాడి, సంగాతకాడు, సంగాతి

**చెల్లెలు-** అనుజ, అనుజాత, చెల్లి, చెల్లె, చెలియలు, జామి, యామి, భగిని, స్వస

**చెవి-** కర్ణము, శ్రోత్రము, శ్రుతి, శ్రవణము, శ్రవస్సు, శ్రోతస్సు వీను, జానుగు, శ్రవము, వచోగ్రహము

**చెవిటివాడు-** ఏడుడు, కణ్వుడు, బధిరుడు, లవుటి, లవిటి

**చెవుల పిల్లి-** కుందేలు, చెవులపోతు, మృదులోమక, లంబకర్ణము వనాఖువు, లోమకర్ణము. శశము. శూలి, కుందేలు, శశకము, శూలిక

**చేట-** (చెరిగెడు వనిముట్టు) శూర్పము, ప్రస్ఫోటనము, సూర్పము

**చేట చెవుల వేల్పు-** ముక్కంటి గారాబు ముద్దుపట్టి, పనిచెరుపుల దొర, టింగ ణాసామి, ఇద్దరు తల్లుల ముద్దు బిడ్డడు, వెనకయ్య, ఒంటికొమ్ము దేవర, పాప జందెముల మేటి, గుజ్జువేల్పు, కొక్కు తేజి రౌతు, పిళ్ళారి, కుడుముల తిండి కాడు, జమిలి తల్లుల బిడ్డ, కోడి టెక్కపు వానన్న, పుంజదారి పెద్ద, ఏనుగు మొగం బు దేవర (చూ॥ విఘ్నేశ్వరుడు)

**చేద-** అంబువాహిని, సేచనము, సేచని, బాల్చీ, బొక్కెన, బొక్కాణము, సేక్త్రము

**చేదు-** కటువు, కనరు, కషాయము, తిక్తము, వికటగంధము

**చేదోడు-** చేయూత, చేలాగు, కైలాగు, కైదండ, హస్తావలంబనము, సాయము

**చేదుబీర-** కోశాతకి, కృతవేదన, క్ష్వేల, జాలిని

**చేప-** అండజము, ఝషము, మీనము, మత్స్యము, శకులి, మీను, మచ్చెము, తెరగంటి, రాజీవము

**చేమంతి-** చామంతి, సేమంతిక, కురంట కము, శతపత్రిక, సేవంతి

**చేయి-** చెయి, కయి, కై, కేలు, కరము, కులి, పాణి, హస్తము, చెట్ట, చెయ్యి

**చైత్రము-** తొలినెల, ముత్తెపు రిక్కనెల, సురభి, మధువు, చైత్రికము

**చొంగ-** చొల్లు(ళ్ళు), జొల్లు, లాల, సృణిక, స్యందిని, లసీక,

**చొక్కాయి-** చోలము, చోలా, చట్టు, కమీజు,

కుబ్బసము, జుబ్బ, కంచులిక, కూర్పాసకము (చూ॥ అంగీ)

**చొక్కు-** పారవశ్యము, మైమరపు, విస్మృతి

**చోద్యము-** అక్కజము, ఆశ్చర్యము, అచ్చెరువు, అద్భుతము, అబ్రము, అబ్బురము, చిత్రము, సోద్దెము, విస్మయము, నివ్వెర, చోద్యము

**జంగము-** జంగముడు, శివారాధకుడు, జంగమయ్య, లింగధారి,

**జంట-** ద్వంద్వము, ద్వయము, యుగళము, యుగము, యుగ్మము, యమళము, యుగళి, కవ, జత, యుతకము, యుగలి (చూ॥ టెక్కెము)

**జండా-** జెండా, పడగ, బావుటా, లలామము, సిడెము

**జందియము-** జందెము, జన్నిదము, బ్రహ్మసూత్రము, యజ్ఞోపవీతము, ఉపవీతము, పోఁచ

**జగము-** జగత్తు, భువనము, లోకము, విష్టపము, ప్రపంచము

**జడబిళ్ళలు-** రాగిడి, జిలిబిలి, చేమంతి బిళ్ళ, చేరు చుక్క, మొగలి రేకు, బాలపాశ్య, పాపట బొట్టు

**జబ్బు-** అస్వస్థత, తెగులు, తెవులు, నలత, జాడ్యము, రుగ్మము, నుస్తీ, అంగజము, జ్వరము, (చూ॥ రోగము)

**జమ్మి-** ఈశానము, కంటకి, కేశమథని, జంబు, జయ, దురితదమని, ఇష్ట, పింగ, ప్రియదర్శిని, భద్ర, రామకము, వహ్ని గర్భ, విజయ, శంకర, శమి, శమీరము, సక్తుఫల, సముద్ర, శివ

**జలగ-** అలగర్ద, అస్రప, జలమక్షిక, జలసూచి, జలాదని, జలాయుక, జలిక, జలూక, జలౌక(సము) రక్తప, రక్తసందంశిక, చర్మటి, శంకుముఖి

**జలతారు-** జరతారు, జరబా (జీ) జు జరీ, సరిగ, సరిగె

**జలాంతర్గామి-** జలాటిని, జలాంతర్నౌక ఆంభసికము

**జవ్వాది-** జవా(జి)ది, జవ్వాదు, జదువాయి, గంధ రాజము, సంకుమదము, స్నిగ్ధము, జవ్వాజి

**జాజికాయ-** జాతిజము, జాతిఫలము, మదశౌండజము, మద్యసారము, జాతిసారము, జాతికము,

**జాపత్రి-** జాజిపత్రి, జాతిపత్రి, జాతికోశము, సుమనస్సు, జాతికోశి

**జామీను-** అడ్డము, పూచీ, హామీ, బాధ్యత, పూచిక, జిమ్మేదారి

**జారత్వము-** వ్యభిచారము, రంకాట, పడుపు, చీకటి తప్పు

**జారినది-** గళితము, స్ఖలితము, పన్నము, స్రస్తము, భ్రష్టము, ధ్వస్తము

**జిలుగు-** జినుగు, జిలువు, సాలువు, సాలు, సేలు, వలిపము, వెలిపము, వలిసె, వలువు, వల్వ (సన్నని వస్త్రము)

**జిల్లేడు-** అర్కము, వసుకము, స్ఫోటము, అస్ఫోటము, గణరూపము, వికీరణము, అర్కపర్ణము, మందారము

**జీడి-** అగ్నిముఖి, అరుష్కరము, భల్లాతకి, వీరవృక్షము

**జీడిమామిడి-** ముంత మామిడి, అగ్రబీజము, పృథగ్బీజము

**జీలకర-** జరణము, జీరకము, మాధవము, మాధ్వీకము, లఘుకణము, సవహ, సుషేని, హృద్య, శీతకణ, జీలకఱ్ఱ

**జిలుగు**- జిలుగు, బెండు, బొండు చెండు, సితవీర్య, స్వర్ణపుష్పి

**జువ్వి**- కందరాళము, కళింగము, గర్దభాండము, జంటి, పూగమండము, ప్లవంగము, ప్లవకము, యూపకము యూపద్రువు

**జూదరి**- ధూర్తుడు, ధార్తుడు, అక్షదేవి, కితవుడు, అక్షధూర్తుడు, వందెగాడు ద్యూతకృత్తు, జూదగాడు, జూజరి, శరండుడు

**జొన్నలు**- జొనలము, జోనళము, జూర్ణము, యావనాళము, మొక్కలు, తారతండులము, జోనాళము

**జోరీగ**- భంకారి, భంగారి, భంభరాలి, పశుమక్షిక

**జోహార్లు**- ఏటికోళ్ళు, కయిమోడ్పులు, డింగిళ్ళు, జోతలు, కైచాపులు, జేజే టెంకనాలు, చెంకనాలు, డెంకణాలు, జోబిళ్ళు, జోదిళ్ళు, జోడిళ్ళు (చూ॥ నమస్కారము)

**జ్యేష్ఠ**- ఐంద్రి, ఐంద్రము, తాటిరిక్క

**జ్యేష్ఠము**- జ్యేష్ఠము, శుక్రము, తాటిరిక్కనెల

**జ్యోతిష్కుడు**- జోస్యుడు, దైవజ్ఞుడు, గణకుడు, సాంవత్సరుడు, జ్ఞాని, కార్తాంతికుడు, జ్యోతిషుడు

**టీక**- టిప్పణి, టిప్పణము, వ్యాఖ్య, వక్కాణము, టిప్పనము, భాష్యము

**టెక్కెము**- కేతువు, జయ, జయంతి, పతాక, వైజయంతి, కేతనము, ధ్వజము, (చూ॥ జండా)

**టేకు**- తేకు, ఖరచ్ఛదము, గృహద్రుమము, తిరకము, శ్రీపర్ణిక, మహాపత్రము, మహా శాకము, వరదారువు, శ్రీపర్ణి; హలీనము

**టోపీ**- టెక్కి, టొప్పి, తోపి, తపారము, తపారు, ఖోలకము, కుళ్ళాయి, కుళ్ళాయ

**డాణము**- డాణెము, ఠాణా, ఠాణ, ఠాణెము, శిబిరము

**డీవి**- టీవి, టెక్కు, నిక్కు, రేవ బిట్టు, చెట్టు, నీటు, తెక్కు

**డబ్బు**- దుడ్డు, సొమ్ము, ధనము, నగదు, పైకము, రూకము, రొక్కము. అర్థము, విత్తము, ద్రవ్యము, ద్రవిణము

**డాలు**- అడ్డనము, అరిగె, ఖేటకము, కేడెము, పలక, ఫలకము, హరిగ

**డేగ**- దీపకము, పత్రి, శ్యేనము, కణుజు, అణుజు, లగుడు, బైరి, వేసడము, సాళువము, సాళ్వము

**డోకు**- వాంతి, కక్కు, ప్రచ్ఛర్దిక, వమనము, చరిది, ఓకరింత, ఓకిలింత, ఓకలి

**ఢక్క**- డక్కియ, డక్కె; డక్కి, డమరువు, ఢంక, డమారము

**తండ్రి**- తాత, జనకుడు, పిత, అబ్బ, అయ్య, అప్ప, నాయన, గురువు, జన్యుడు, పితరుడు

**తండ్రి తండ్రి**- తాత, పితామహుడు

**తండ్రి తల్లి**- అవ్వ, అవ, పితామహి, నాయనమ్మ, మామ్మ

**తండ్రి తాత**- ముత్తాత, ప్రపితామహుడు

**తగరము**- ఉదధీరము, కురూప్యము, తమరకము; తమరము, త్రవువు, నాగము, పిచ్చటము, ప్రలంబము, రంగము, సీసము

**తడిసినది**- ఆర్ద్రము, సార్ద్రము, క్లిన్నము, సమున్నము, ఉత్తము, స్తమితము

**తప్పెట**- డప్పు, తప్పెట, తమ్మటము, తమటము, ఆనకము, పటహము

**తమలపాకు**- పటలిక, నాగవల్లీదళము, (తమలపాకు తీగ) నాగవల్లి తాంబూలి, తాంబూలవల్లి.

**తమ్ముడు-** అనుజుడు, అనుజన్ముడు, కనిష్ఠుడు, యవీయుడు, అవరజుడు, సహో దరుడు, సోదరుడు, తంబు

**తరవాణి-** కూటినీళ్ళు, కలి, పుల్లనీళ్ళు, శు(క-క్ల)ము, సారామ్లము

**తర్జుమా-** అనువాదము, భాషాంతరీకరణము

**తలంటు-** అభ్యంగనము, అభ్యంజనము, ప్రసాధనము, తలయంటు, తలగడుగు

**తలగడ-** ఆనుడు బిళ్ళ, ఒరుగుబిళ్ళ, తలయంపి, తలాపి, తల్లపి, ఒరుగు, దిండు, బాలీసు, బిల్ల, మొత్త, ఉపధానము, బాలిశము, దురాడము, తలాటి, తలాడ, గండువు, తల్లడ, ఒరుగంబిల్ల

**తల-** ఉత్తమాంగము, శిరస్సు, శీర్షము, మూర్ధము, మస్తకము

**తలవెంట్రుక-** చికురము, కుంతలము, వాలము, కేశము, శిరోరుహము

**తలుపు-** అలారము, అరరి, కవాటము, కపాటము, కువాటము

**తల్లి తండ్రి-** తాత, మాతామహుడు

**తల్లితోడ బుట్టిన దానికూతురు-** మాతృష్వసేయి, మాతృష్వస్రేయ

**తల్లితోడబుట్టినదాని కొడుకు-** మాతృష్వసేయుడు, మాతృష్వస్రీయుడు

**తల్లి-** జనయిత్రి, ప్రసువు, మాత, జనని, అమ్మ, అవ్వ, కన్నది

**తాంబూల పాత్రము-** తాంబూలదాని, తాంబాళము, ఆకుసంబెళ, ఆడపము, కుప్పె, కరతిత్తి, పాందాను, సంబెళ, హడపము

**తాంబూలము-** వీడియము, విడియము, విడెము, తమ్ములము, వీడెము, వీడ్యము

**తాకట్టు-** ఉద్ధర, ఉద్ధరువు, కుదువ. తనఖా, పడిదియ, విక్షేపము, వారకము ఆయకము,

**తాటికల్లు-** తాలకి, తాళకి, తాలతి, కాపిశాయనము, మద్యము

**తాటిచెట్టు-** తాలము, తృణరాజము, తాడు, తాళము

**తాటి పడగవాడు-** కప్పుదేవరయన్న, కత్తి వలువ ప్రోడ, తెల్లని మైదంట, బలి యుడు, దుక్కివాలు దాలుపు, జమున గొంగ, నల్లవలువదాల్పు, కడ చుక్కపె రిటి తొయ్యలి పెనిమిటి, వెన్నదొంగ యన్న (చూ॥ బలరాముఁడు)

**తాబేలు-** తామేలు, గుహ్యము, కచ్ఛపము, కమఠము, కూర్మము, మాషాదము

**తార్పుడు కత్తె-** మాధవి, సంబళి, బడబ, గణేరుక, బడవ, దొంతకత్తె, వంత కత్తె, తారుపుకత్తె, పొంతకత్తె

**తిను-** మెక్కు, కుడుచు, ఆరగించు, కోలు, మెసగు, కతుకు, బోసేయు, సాపడు, భుజించు, మెసవు,

**తిప్పతీగ-** అమృత, చంద్రవల్లరి, యాగవల్లి, సోమలత, ద్విజప్రియ

**తిమింగలము-** అర్ధశఫరము, దండపాలము, తిమిరి

**తిమ్మిరి-** తిమిరి, తిమురు, బోమ

**తిరస్కృతి-** అనాదరము, పరిభవము, పరీ భావము, తిరస్క్రియ, రీఢ, అవజ్ఞ, అమర్షణము, తిరస్కారము

**తిరుగు-** అడ్డు, క్రాలు, క్రుమ్మరు, చరించు, చెరలాడు, త్రిమ్మరు

**తిరునాళ్ళు-** జాతర, జాత్ర, ఉత్సవము, తీర్థము. సంబరము

**తిలకము-** నామము, బొట్టు, చుక్క, కావు, లలాటిక

**తివాసి-** ఆస్తరణము, ఆస్తరము, జము కాణము, జంబుకాణము, జంబుఖానా, జమ్కు ఖాణము

**తీగ-** తీగియ, తీవ, తీవె, తివ్వ, లత, లతిక, వల్లరి, వల్లి, తీగె, తీవియ

**తీతువు-** టిట్టిభము, తిత్తిరము, తిత్తిరి, లకుముకి పిట్ట, తీతువ, ఖరక్వాణము

**తుంగముస్తలు-** కుటన్నటము, దాశపురము, పరిపేలవము, ప్లవము, గోవర్ధము, ఘనము, కైవర్తి

**తుపాకి-** గుంటిక్రోవి, క్రోవి, అదరులక్రోవి, తుపాకు

**తుమ్మ-** చంద్ర, వెలితుమ్మ, అరిమేదము, అజభక్షము, లోహిల మారకము, విట్ఖదిరము, కంటాలువు, తీక్ష్ణకంటకము

**తుమ్ము-** ఛిక్క, క్షపథువు, క్షవము, క్షుతము, కాసము, విక్షావము

**తుమ్మెద-** అళి, ఇందిందిరము, ఘండము, చంచరీకము, జమిలిముక్కాలి, తేటి, తేనెదిండి, ద్విరేఫము, పుష్పంధయము, బంభరము, భృంగము, భ్రమరము, మధుకరము, మధుపము, అలి, మధుపాళి, రోలంబము, షట్పదము, సారంగము

**తులసి-** అమృత, కరీంజరము, కరిల్లకము, కాండమణి, కాసఘ్నము, కాయస్థ, కృష్ణపర్ణి, గంధహారిణి, గౌరి, తీవ్ర, పవిత్ర, పాపఘ్ని, బిల్వగంధ, బృంద, మాధవి, లక్ష్మి, సుభగ, హరిప్రియ, తొలసి

**తులారాశి-** తౌలము, త్రైలి, జూకము, ధటము, జలవిషువము,

**తూము-** తూపరాణము, తూపరము, ఒప్పరము, మదుము

**తెప్ప-** ప్లవము, ఉడుపము, తరండము, ఖేలము, సంగడి, దోనె, ద్రోణి, క్షుద్ర నౌక

**తెర-** అడ్డువల, పరదా, అపటి, కాండపటము, గండవడము, జ(య) వనిక, తిరస్కరిణి

**తెలుగు-** తెనుగు, తెన్గు, తెన్గు, ఆంధ్రము; ఆంధ్రి, త్రిలింగము

**తెలుగు దేశము-** తెల్గు దేశము, ఆంధ్ర ప్రదేశము, ఆంధ్ర రాష్ట్రము, త్రిలింగ దేశము (అన్నపూర్ణ)

**తెలుగుసేత-** ఆంధ్రీకరణము, తెనిగింపు, తెనుగుసేత

**తెలుపు-** విశదము, శ్వేతము, శుక్లము, పాణ్డురము, అవదాతము, సితము, గౌరము, వళక్షము, ధవళము, అర్జునము, తెల్ల, వెల

**తెల్లవంకాయ-** శ్వేత భంటిక, వార్తాక, శలాటువు, శ్వేతవృంతాకము

**తెల్లవావిలి-** అనంత, ఇంద్రాణి, ఇంద్రసుర, కాకనాశని, నిర్గుండి, శుక్లపృష్ఠకము, సింధుకము,

**తేటియల్లెవాడు-** అలరు విల్తుడు, ఆమని చెలి, ఇంచు విల్కాడు, కన్నుల విల్తుడు, కమ్మ విల్తుడు, చెఱ్ఱర, వింటిజోదు, చక్క నయ్య, చిలుక తత్తడి, జాబిల్లి యల్లుడు, నన విల్తుడు, మీను మొనలి సిడెంబుల వేటి, లచ్చి కొమరుడు, సిరిపట్టి, తామర తూపలి, కలిమి లేమ చూలి, నెలయల్లుడు, గాడ్పుటరదపు దొర, బేసి కైదువ జోదు (చూ॥ మన్మథుడు)

**తేనె-** క్షౌద్రము, పవిత్రము, పుష్పరసము, మధువు, పుష్పాసవము మాక్షికము, కుసుమాసవము, సారఘము, తేనియ

**తేలు-** అళి, కాలిక, ద్రుణము, ద్రోణము, ద్రుణి వలీనము, వలపురుగు, పొట్టియ, వృశ్చికము, పృదాకువు, స్మరము, విషపుచ్ఛము

**తైతక్కలు-** గెంతులు, ఎగుర్లు, చిందులు, తేతెయ్యలు, తొక్కుళ్ళు

**తొండ-** అండజము, కృకలాశము, శరండము, కృకలాసము, గాత సంకోచి, జాహకము, దురారోహము, శరండము, కామరూపి, బింబము, ఊసరవెల్లి, సరటువు, కృకలాకువు

**తొట్రుపడు-** తడబడు, తొట్టుపడు, (తత్తర, తబ్బిబ్బు, తికమక) పడు

**తొడ-** అంకపాలిక, ఉత్సంగము, ఊరువు, కోలము, క్రోడము

**తొడిమ-** కాడ, కామ, కాండము, తొడిమె, వృంతము

**తొలుత-** మును, మున్ను, ముందు, తొలి, తొల్లి, మునుపు, పూర్వము

**తోక-** తొంక, జాఘని, పుచ్ఛము, వాలము, లాంగులము, లాంగూలము.

**తోటకూర-** కొయ్యగూర, చిలుకతోటకూర, నీరుతోటకూర, ఆరామశాకము, అంబు బాష్పము, మహాబాష్పము, శాకిని, పెరుగాకు, కంబాలకూర, ఛిక్కని, ఛిల్లిక, జీవంతిక

**తోడియల్లుడు-** షడ్డకుడు, సడ్డకుడు, జగిలెడు, జగిలెకాడు

**తోడేలు-** ఈహామృగము, వృకము, కోకము, గొఱియల సూడు

**తోలు-** అంట, అట్ట, చట్ట, తాట, తొక్క, తొడప, పట్ట, కళాసము, కళవసము

**త్రాడు-** శుల్బము, వరాటకము, రజ్జువు, వటి, గుణము, పాశము

**త్రాసు-** తక్కెడ, పోతవము, తౌలి, ఏషణి; తరాజు, నారాచి, తరాసు, త్రిశూలము, ధట(క)ము, తుల, ముమ్మొనవాలు, ముమ్మొన కైదువు, త్రిశిఖము, శూలము

**త్రేపు-** త్రేవు, త్రేన్పు, ఉద్గారము

**దండయాత్ర-** అభిక్రమణము, ముట్టడి, దాడి, ధాటి, సూయాణము, యానము

**దండు-** గుంపు, గుమి, తండ, బృందము, సమూహము

**దంతమలము-** బంపు, పుష్టిక, పాచి

**దంపతులు-** ఆలుమగలు, జంపతులు, జాయాపతులు, భార్యాభర్తలు

**దగ్గర-** చెంత, చేరువు, వద్ద, చెంగట, సరస, కురంగట, ఒద్ద, దాపు, కురంట (చూ॥ సమీపము)

**దగ్గు-** డగ్గు, కాశము, కాసము, గదాగ్రణి, ఉక్కిస, ఉబ్బసము, కక్కువాయి, గస, క్షయధువు

**దనియాలు-** కొత్తిమిరి విత్తులు, అల్లక, ఉగ్ర, ఉపదంతము, ధనికము, ధనీయకము, ధాన్యాకము, ధేనిక, ఖిదవేదకము, బీజధాన్యము, వేషణ, వేసవారము, శాకయోగ్యము, స్వర్ణిక

**దబ్బచెట్టు-** కిమ్మిరము, నాదేయి, శర్కరాంకము

**దబ్బనము-** దబ్బడము, బృహత్సూచి, మోటుసూది

**దయ్యము** - గాలి, గాము; గ్రహము, పిశాచము, బూచి, సోకుడు

**దరకా(ఖా)స్తు-** అర్జీ, విజ్ఞాపనము, విజ్ఞాపన పత్రము, వినతి పత్రము, విజ్ఞాన పత్రము, మనవి కమ్మ

**దాడిచేయు-** ఎత్తు, దండెత్తు, దళమెత్తు, పాటొగ్గు, మార్కొను, మొనయు, మోహరించు

**దానము-** త్యాగము, తేగము, చాగము, ఈవి, ఈగి,

వితరణము, విహాపితము, విశ్రాణనము, పుడుకు. ఉత్సర్గము. ఉత్సర్జనము, వర్జనము

**దారిద్ర్యము-** దైన్యము, దౌర్గత్యము, ఎద్దడి, పేదరికము, లేమి, నిప్పచ్చరము, నెవ్వ, సంపద్రాహిత్యము, లేవడి, లేమిడి

**దారిమకాము-** బస, విడిది, అంచె, మజిలీ, మకాము

**దాసి-** తొత్తు, దాది, ధాత్రి, పరిచారిక, బానిస; బోన(ము) కత్తె, వరపుడు, పాకుడు, సేవకురాలు

**దాహము-** ఉదన్య, తృష్ణ, తృట్టు, తర్షము, దగ, దూప, దప్పి, పిపాస, దప్పిక, డప్పి

**దిక్కు-** దిశ, కకుభము, కాష్ఠ, ఆశ, హరితము, దెస, కడ, చెరగు

**దిరిసెనము-** దిరిసనము, కింకిణీ ఫలము, పాండువు, ప్లవకము, భండిలము, మృదు పుష్పకము, శిరీషము, శుకద్రువు, శుకపుష్ప, శ్యామతీర్థ

**దీపము-** దివ్వియ దివ్వె దివ్వము, దీబె, దీపిక, స్నేహాలము, కజ్జల ధ్వజము, దోషాతిలకము, జోతి, తిర్లిక, తిల్లిక, పంజు, ఇలాయి, దివిటీ, గృహమణి

**దుఃఖము-** పీడ, బాధ, వ్యథ, కస్తి, కృచ్ఛ్రము, అభీలము, బాము, వెత, వంత, గోడు, వగవు, నొగులు, కొందలము, ఆలమట, క్లేశము

**దున్నపోతు-** కాసరము, మహిషము, ులాయము, సైరిభము, పోతు, ఎనుపోతు, దుంత, దున్న

**దుప్పటి-** దుప్పటము, రగ్గు, రజాయి, స్థూలశాటకము, రాంకవము, ద్విపటి

**దురద-** కండూతి, కసిమిరి, జిల, తీట, తీంట్రము, కండూయ, నుస, కండువు

**దురదగొండి-** దూలగోవెల, తీటకోవెల, ఆత్మగుప్త, బుషభి, కండూర, జాంగలి

**దుర్గంధము-** కంపు, పుస్తు, గబ్బు, దుర్వాసన

**దుర్భిణి-** దూరదర్శని, సూక్ష్మదర్శని, గుణీకృత దర్శని

**దువ్వెన-** ఈర్పెన, చిక్కోల, పన్నె, కంకతిక, కేశమార్జకము, చిక్కంటి, కంకతము

**దూట-** దవ్వ, మొవ్వ, మోవు, దుంట

**దూడ-**లేగ, వత్సము, క్రేపు, పడ్డ, పెయ్య; తువ్వాయి

**దూత-** రాయబారి, దూతుడు, వార్తికుడు, సందేశహారుడు, రాజ్యబారి, వార్తాహరుడు,

**దూలగొండి-** శూకశింబ, శూకశింబి(క), కండూకరి, కసికచ్ఛువు

**దేవతలసభ-** సుధర్మ, దేవసభ, వేల్పుల సభ, సుధర్మి (స్వధర్మ)

**దేవతలు-** అమరులు, నిర్జరులు, త్రిదశులు, విబుధులు, సురలు, సుపర్వులు, సుమనస్సులు, త్రిదివేశులు, దివౌకసులు, అదితేయులు, దివిషదులు, ఆదిత్యులు, అమర్త్యులు, అమృ తాంధసులు, బర్హిర్ముఖులు, క్రతుభు క్కులు, గీర్వాణులు, దానవారులు, బృందారకులు, జేజేలు, వేలుపులు

**దేవదారు-** శుక్రపాదపము, పారిభద్రకము, పూతిదారువు దారువు, ద్రుకిలిమము, భద్రదారువు, పూతికాష్ఠము

**దేవభాష-** గీర్వాణము, వేల్పుల బాస, సంస్కృతము, దేవవాణి, దైవవాణి,

**దేవవృక్షములు-** మందారము, పారిజాత ము, సంతానము, కల్పవృక్షము, హరిచందనము, చాగపుమ్రాను, తెరగంటి మ్రాను, తెల్లచెట్టు, తెరగంటి మ్రాకు, పెట్టు మ్రాకు

**దేవేంద్రుడు-** ఇంద్రుడు, మరుత్వంతుడు, మఘవుడు, సాకశాసనుడు, వృద్ధశ్రవసుడు, సునాసీరుడు,

పురందరుడు, జిష్ణువు లేఖ ర్షభుడు, శక్రుడు, శతమన్యువు, దివస్పతి, సుత్రాముడు, వజ్రి, వాసవుడు, వృత్రహంత, సురపతి బలారాతి, జంభభేది, నముచి సూదనుడు, సంక్రందనుడు, దుశ్చ్యవనుడు, ఆఖండలుడు, సహస్రాక్షుడు, గట్టుదాయు, పారుతపసియింటి పంచకోడి, ఒడలి చూపాడ యడు, ఎక్కుడు మొగుల్ గల ప్రోడ, జేజే, తూరువు(దణి) తేడు; మలగొంగ, తెల్లయేనుగు నెక్కి తిరిగెడు దొర, తూర్పు మాగాణమేలెడు మణియగాడు, వేగన్నుల స్వామి, వేలుపు రేడు, మబ్బురౌతు, విన్మాపువజీరు, కరిజేజేయన్న

**దేశము-** కులము, జనపదము, జన్యము, నాడు, రాజ్యము, రాష్ట్రము, విషయము, సీమ

**దొంగ-** ఎతుబరికాడు, తెక్కలికాడు, ముచ్చు, ఎత్తుబరికాడు, కొల్లకాడు, జాజరకాడు, తెరువాటుకాడు, కన్నగాడు, వల్లడికాడు, రేద్రిమ్మరి గజిముచ్చు, గరిడిముచ్చు, మునిముచ్చు, తవళి, దోపు(డు) కాడు, మోసరి, గడిదొంగ, చోరుడు, స్తేనుడు, దస్యుడు, తస్కరుడు

**దొండ-** ఆర్తదళము, ఓష్ఠి, తుండికేరి, తుంబి, బింబి, బింబిక, రక్తఫల

**దొర-** ఎకిమీడు, ఆర్యుడు, ఈశ్వరుడు, నాథుడు నాయకుడు, ప్రభువు, భరం డుడు, భరణ్యుడు, సేవ్యుడు, స్వామి, పబువు, సామి, అధిపుడు, ఏలిక

**దోమ-** ఘోషము, ఉద్దంశము, దంశి-చులి మ్లుచము, రణరణము, మశకము, దంశము

**దోషి-** అపరాధి, ముద్దాయి, నిందితుడు, దోషకారి, దోసి

**దోస-** ఉర్వారువు, కాండారువు, కంటక, కర్కటి, కపిలాక్షి, వత్సాక్షి, కాళింగి, కోశఫలము, కృష్ణవల్లి, చిర్భట, తుందిలఫల

**దౌడ-** దవుడ, దవడ, తాలువు, హనుక, కాకుదము దౌడలమూలము, తాలుమూలము, హనుమూలము అంకిలి, అక్కిలి, అంకు

**ద్రాక్ష-** కృష్ణ, గొస్తని, మధురస, మృద్వీక, స్వాద్వి

**ద్వీపము-** అంతరీపము, దీవి. లంక, నడు గడ్డ, (నీటినడిమిదిబ్బ)

**ధనాగారము-** కోశాగారము, బొక్కసము. బండారము, బండరము భండారము, భాండాగారము, ఖజానా, భాండరము

**ధనిష్ఠ-** మద్దెలరూపు రిక్క, దాసనము, వసువు, శ్రవిష్ఠ

**ధనూరాశి-** ధనువు, చాపము, కోదండము, కార్ముకము

**ధ్వని-** శబ్దము, నినాదము, నినదము, ధ్వాసము, రవము, రావము, స్వనము, స్వానము, నిర్ఘోషము, నాదము, నిస్వానము, నిస్వనము, ఆరావము, విరావము, రొద, సద్దు, కూత, చప్పుడు, రవళి, అలుకుడు

**నందనవనము-** కందసారము, మిశ్రకము, నందనము

**నకిలీ-** కృత్రిమము, కృతకము, తచ్చన, కాపటికము, అసహజము

**నక్క-** శివ, భూరిమాయువు, గోమాయువు, మృగధూర్తక, సృగాలము, సగ్గాలము, క్రోష్టువు, ఫేరువు, ఫేరవము, జంబు కము, సగ్గారి

**నక్షత్రము-** ఋక్షము, తార, తారక, చుక్క, రిక్క, ఉడువు, భము

**నగ-** అలంకారము, ఆభరణము, కలాపము,

ప్రతిసరము, భూషణము, తొడవు రవణము, సొమ్ము

**నటి-** ఆటది, నర్తకి, శైలూషి, శైలూషికి, లాసకి, లాసిక, బంధకి, నట్టువరాలు

**నట్టువుడు-** నట్టుగుడు, నట్టు(వ)కాడు, నట్టువాడు, నటుడు, నాగరకుడు, భారతుడు, శైలాలి, శైలూషుడు, నర్తకుడు

**నడుము-** అవలగ్నము, కౌను, మధ్యమము, లేగౌను, వలగ్నము

**నత్తగుల్ల-** గుల్ల, క్షుద్రకంబువు, క్షుద్ర శంఖము, క్షుల్లకము, జలబింబము, శంఖనఖము

**నత్తు-** బేసరి, బులాకి, ముక్కుకాడ, (చూ॥ అడ్డబాస)

**నది-** కూలంకష, ఆపగ, నిమ్నగ, స్రోతస్విని, అధ్వగ, కడలివెలది, తటిని, ఝరి, సరిత్తు

**నమస్కారము-** నతి, జోత, దండము, మ్రొక్కు, చేమోడ్పు, ప్రణతి, ప్రణా మము, వందనము, గొబ్బిళ్ళు, జాగిలి, టెంకణము (చూ॥ జోహార్లు)

**నరము-** నారి, నాడి, తంత్రి, త్రిపుటము, ధమని, శిర, స్నసి, స్నాయువు

**నర్తనశాల-** ఆటపట్టు, నాట్యశాల, ఆనర్తము, ఆటపాక, నృత్యశాల, నాట్యమం దిరము

**నర్మదానది-** రేవ, సోమోద్భవ, మేఖలకన్యక

**నలికండ్లపాము-** నలికిరి, నలికీచు, అంజనిక, రక్తపుచ్ఛిక, నల్లిక, మిండ, అవికిరి

**నలుపు-** కృష్ణము, లాసితము, శ్యామము, కాలము, శ్యామలము, మేచకము, కప్పు

**నల్లజీలకఱ్ఱ-** కారవి, కాలిక, కృష్ణజీరకము, జ్వరశోధిని, పతింబర, పర్ణాశము, శోఫము, పృధ్వి, శూలఘ్న, సుషవిక, స్థూలకరణ, క్షోణి

**నల్లమందు-** అభిని, అఫేనము, అహిఫేనము, ఉపవిషము, ఖష్ఠసరసము

**నల్లమద్ది-** ఇనుమద్ది, అజకర్ణము, పూతి శమనము, రథద్రుమము, శ్వేతఘ్నము

**నల్లావలు-** అనురి, కృష్ణిక, క్షవము, క్షుతాభిజనము, రాజిక

**నల్లి-** ఉత్కుణము, ఉద్దంశము, కిటిభము, మత్కుణము, మొగిటి

**నల్లేరు-** నల్లెరు, వజ్రాక్షి, వజ్రవల్లి, శృంఖల, కులిశోదర, క్రోష్టఘంటిక

**నవ్వు-** అలరింత, స్మితము, (ఉప) హసితము, హసనము, హాసము, హసము, హాస్యము

**నాంది-** మంగళాశాసనము; శుభారంభము

**నాగలి-** కుంతలము, గోకిలము, లాంగలము, సీరము, హలము, దుక్కివాలు, నాగేలు

**నాచు-** కుంభిక, కావారము, కుంభి, కుంభికము, కుత్వణము, కుష్ఠహారి, గాంగే యము, గృష్టి, ఘృష్టి, జంబాలము, జర్జరము, జలకేశము, జలనీలి, జల వల్కలము, జలాంచలము, నీలిక, మంజులము, వారాహి, వారిచత్వరము, వారిపర్ణ, వారిమూలి, వితున్నము, వ్యవక, శేవలము, శైవలము, శైవాలము

**నాట్యము-** ప్రేంఖ, నర్తనము, నటనము, నృత్యము, నృత్తము, లాస్యము, ఆట

**నాడెకాడు-** నాణెకాడు, కోమటి, వ్యాపారి, బేహారి, వర్తకుడు, బచ్చు

**నాణెము-** నాణ్యము, నాణకము, నాడెము

**నాతము-** బత్తెము, వేతనము, జీతము, కూలి, కర్మణ్య, భృత్య

నానా -- అనేక

**అంకపొంకములు-** అంకాపొంకములు, అంకాపొంకాలు

**అంటురోగము**- ముక్కడి
**అంతస్తు**- అంతరువు, మాడిగ
**అగసాలెవానిదిమ్మ**- డాకలి, దాగలి
**అగసాలెవానిపొది**- కమటము, కమ్మటము
**అగ్నిదేవుని భార్య**- అగ్నాయి, గభస్తి, స్వాహాదేవి
**అడ్డబొట్టు**- తిర్యక్పుండ్రము
**అప్సరస**- వేల్పుచెలి, అచ్చర, దేవకాంత
**అబద్ధపుసాక్ష్యము**- కూటసాక్ష్యము
**అభివాదము**- ప్రణిపాతము, ప్రణిపత్తి
**అమానుదస్త్రా**- అశ్మఫాలము, కల్వము, ఖల్లము
**అమ్మెడువాడు**- విక్రేత, విక్రయకుడు
**అయోధ్య** - సాకేతము
**అశ్వమలము**- లద్ది, గువ్వ
**ఆంక్ష**- వెలి, నిషేధము
**ఆంగ్లేయులు**- పాశ్చాత్యులు, హూణులు
**ఆచమనము**- అచమనము, ఆచామము, ఉపస్పర్శము
**ఆటవిడుపు**- ఉడుకువ, విశ్రాంతి, విరామము
**ఆడుపడుచు**- ననంద, ననాంద, ననందిని
**ఆడు ఏనుగు**- కరిణి, కుంభిని, హస్తిని
**ఆడు కొక్కెర**- బలాక, కారాయిక
**ఆడుచీమ**- పిపీలి, రాణిచీమ, పిపీలిక
**ఆడుతాబేలు**- కచ్ఛపి, కమఠి, డులి, ధులి
**ఆపోశనము**- ఆపోసనము.
**ఆబగొడు**- వాపిరికొట్టు
**ఆలస్యము**- జాగు, తడవు, విలంబ(న)ము
**ఆవకాయ**- సార్షపము, ఊరుగాయ
**ఆవడ**- ఆమవడ, దాధికము
**ఆవులింత**- జృంభము, ఉజ్జృంభణము
**ఆశీస్సు**- దీవెన, ఆశాసనము, ఆశీర్వాదము
**ఆషాఢము**- శుచి,మోదుగు
**ఇంటిపేరు**- ఉపనామము, వంశనామము
**ఇందువారము**- సోమవారము, అకులవారము
**ఇనుపగుదియ**- పరిఘము, ముద్గరము, భిండివాలము, లవుణి
**ఇరుదలపాము**- డుండువు, డుండుభము, కంకతము
**ఈడ్గిలబడు**- ఈడిగిల్లు, కుతికిలబడు, కుదికిలు, చతికిలబడు
**ఉగాది**- సంవత్సరాది
**ఉత్తరాపోశనము**- అపోసానము, అపోశనము
**ఉత్తరాది వారి సంగీతము**- ఔత్తరాహికము, హిందుస్థాని
**ఉపక్షేపము**-బీజన్యాసము-(దశరూపకము)
**ఉపాధ్యాయురాలు**-ఉపాధ్యాయ, ఉపాధ్యాయి
**ఉపాయనము**- ఉపారము, సలాడిద, సూడిదె
**ఉప్పెన**- సముద్రోల్బణము, పోటు
**ఉలి**- శేవణము, చీరణము, చీనము
**'ఋ'కారచిహ్నము**- వట్రువ, వట్రువసుడి
**ఋణవృద్ధి**- వడ్డీ, తేమానము, వృద్ధి
**ఎగిరిపడెడు చేప**- శఫర, ప్రోష్ఠి
**ఎముకలపైనిర్మించినది**-ఏడుకము, ఏడూకము, స్తూపము
**ఏకదినోత్సవము**- ఏకాహము
**ఏడురోజులుచేయునది**-సప్తాహము
**ఏడువందలు**-ఏడ్నూర్లు, సప్తశతము

**ఏనుగు చెక్కిలి-** కరటము, గండము

**ఏలము-** ఏలాము, వేలము

**ఐరేని (కుండలు)-** పూజకుండలు, పూజెగులు, కాసరికుండలు

**ఒప్పందపత్రము-** కరారునామ, ఖరారునామ, నిర్ణయ పత్రము

**ఒలపక్షము-** పక్షపాతము, వలపక్షము

**ఓంకారము-** ఉద్గీథము, ప్రణము, బ్రహ్మాక్షరము

**కంకరరాయి-** కర్కరము

**కండచీమ-** ఉలంగవము, సూలశీర్ష, పిపీలిక

**కడుపుమీది ముడుతలు-** వళులు, స్రుక్కులు

**కప్పసాసరు-** జోడుతపేలా

**కమ్మరికొలిమితిత్తి-** భస్త్రిక, భస్త్ర, భస్త్రాక

**కవి-** కయి, అభీకుడు

**కాకిరాయి-** అయోఖనిజము, అయో మూలకము

**కాగలస్వభావము కలవాడు -** భవిత, భవిష్ణువు

**కాగితము-** కాకిత(ద)ము, కాకలము, కాగదము

**కాడి-** నొగ, యుగము, కూబరము

**కాబేజి-** గోబి, గొబిగడ్డ

**కాలీప్లవరు-** గోబిపువ్వు

**కాశీ-** వారణాసి, బనారసు

**కాశీగణపతి-** ఢుంరి (వినాయకుడు)

**కాశియందలి సూర్యమూర్తి-** లోలార్కుడు, ఉదయార్కుడు మొ

**కాశీగుంటలాట-** ఓమన గుంటలాట

**కీలుకాడు -** సూచకుడు, సూత్రధారి; స్థాపకుడు

**కుంకుడుకాయ-** ఫేనిలము, కుంకుడు చెట్టు- అరిష్టము

**కుంటివాడు-** ఖంజుడు, శ్లోణుడు, పంగువు

**కురుక్షేత్రము-** కురుజాంగలము, శమంత పంచకము

**కృత్రిమకథ-** కల్పితకథ, కూటాఖ్యానము

**కృష్ణపక్షము-** బహుళ పక్షము, కరిపక్కము, తామిస్రము

**కొంగ కాళ్ళవాడు-** ఊర్ధ్వజానువు, ఊర్ధ్వజ్ఞువు

**కొనువాడు-** క్రయికుడు

**కోడిగుండెకాయ-** కన్నెము

**క్రొత్తముట్టు-** సమర్త

**ఖనిజము-** మూలకము

**గంజాయిగొట్టము-** చిలుము, చిల్లము

**గంటెలు-** సజ్జలు, సర్జము, గర్ముత్తు

**గండ్రచీమ-** ఉలంకలము

**గట్టువాలు-** గంధహారిక, గంధకారిక, సైరంధ్రి

**గడప-** కడప, సిరికమ్మి, లచ్చికమ్మి

**గడ్డకట్టు-** గరవడు, ఘనీభవించు

**గద-** గుదియ

**గళ్ళాయి-** గళ్ళా, గరగడ, గరాట, గరాటు

**గాదె-** గరిసె, కుసూలము

**గాలిపీల్చుట-** ఉచ్ఛ్వాసము, పూరకము

**గావి విడుచుట-** నిశ్శ్వాసము, రేచకము

**గిలాబాచేయువాడు-** సూనరి, పలగండుడు, లేపకుడు

**గాలిగుడి(గుడికట్టు)-** పరివేశము, పరి శేషణము, పరివేషము

**గుణింతము-** గుణితము

**గురుపత్ని-** ఆచార్యాని, ఉపాధ్యాయాని, ఒజ్జసాని

**గొంగళి పురుగు-** కంద్వోఘము, కంబళిపురుగు

**గోరు చిక్కుపాదు**- మటిక, మట్టిక, బాకుచి

**గోరుచిక్కుడుకాయ**- గోకరకాయ

**చక్రవడ్డీ**- చక్రవృద్ధి, (మిండవడ్డీ)

**చక్రవాళ పర్వతము**- చుట్టుగొండ, చుట్టుగట్టు

**చట్టము**- శాసనము, దురాయి

**చప్పిడి ముక్కువాడు**- అవనాటుడు, అవటీటుడు, అవభ్రటుడు

**చిటిక**- అంగుళిస్ఫోటనము, అంగుళి మోటనము, ఛోటిక

**చిన్నగుడ్లగూబ**- క్షుద్రపేచకము, ఢుండులము

**చిన్నగొడ్డలి**- టంకిక, కురారిక

**చూలిక**- చూళిక, నేపథ్యసూచితము

**చెదలు**- వమ్రి, వమ్రిక, చేకొఱుదు

**చెలియలికట్టు**- వారణ, ఏనాదము, చెల్లెలికట్ట

**జడ**- జట, జుటకము, తుస్తము

**జడముడి**- జూటము, జూటకము

**జనుపనార**- శణ సూత్రము, సణసూత్రము

**జల్లెడ**- చాలని, పాటీరము

**జింక చర్మము**- ఐణము, ఐణేయము, హారి ణము

**జిల్లా అధికారి**- మాండలికుడు, మండలాధిపుడు

**జీతముపై ఆధారపడువాడు**- వైతనికుడు, జీతగాడు

**జున్ను** - కిలాటి

**జున్నుపాలు**- పీయూషము, పేయూషము, ముఱ్ఱుబాలు

**జుల్మానా**- జరిమానా, వట్టము, దండువు

**జూదపలక**- అష్టకాంగము, అక్షవాటము, అష్టాపదము, నెత్తపలక

**జూలు**- జట, సట

**జోకొట్టు**- చిచ్చు కొట్టు

**తనది**- స్వీయము, స్వకీయము, సొవము, సొంతము

**తలారి**- ఆరెకుడు

**తనికీ**- పరీక్ష, పరామరిక

**తస్సనాలు**- తంటాలు, ఉల్లంకులు

**తాపీపనివాడు**- పలగండుడు, సూనరి

**తారుమారు**- విటతటము, పల్లటము

**తాళపుచెవి**- కూచిక, బీగము

**తిరుమల**- వేంకటాచలము, శేషాద్రి, సప్తగిరి ఏడుకొండలు

**తుంపర**- చినుకు, తుప్పర, జలకణము, తూపర

**తుపాకిగుండు**- తూటా, గుండు

**తులాదండము**- తూనికకోల, తూనుకోల

**తూనికరాయి**- ఊర్ధ్వమానము

**తెరచాటు**-నేపథ్యము, తెరవెనుక, నైపథ్యము

**తెలికపిండి**- తిలపిష్టము, పిణ్యాకము

**తెలికలవాడు**- గాండ్లవాడు, తిలపీడుడు

**తెలివికలవాడు**- వివేకి, ప్రాజ్ఞుడు, మేధావి, మేధిరుడు

**తేగ**- తాళాంకూరము, గేబు

**తొంటచేతివాడు**- దోర్గంతువు, కుకరుడు, కుణి

**తొలిచూలుబిడ్డ**- ప్రష్ఠౌహి, పష్ఠౌహి

**తోటమాలి**- మాలి, మయిలి

**తోడికోడలు**- యాత

**తోరణము**- వందనమాల

**తొడు**- తవుడు, కంబూకము, కండనము

**త్రిదండము**- ముక్కోల

**త్రిభుజము-** ముమ్మొనపటము

**దక్షిణము-** దక్కినము, అవాచి

**దక్షిణాదివారి సంగీతము-** కర్ణాటక సంగీతము

**దస్తావేజు-** క్రయపత్రము, క్రయవేద్యము

**దానిమ్మపండు-** దంతబీజము, దంతబీజ(కము), దాడిమఫలము

**దారిపన్ను-** కాలరి, కాలారి

**దారిబత్తెము-** శంబలము, సంబలము, పాథేయము

**దాల్చినచెక్క-** గుడత్వక్కు, గుడత్వచము

**దావాగ్ని-** కార్చిచ్చు, ఎరగలి, వనవహ్ని

**దిస్పమొల-** అంగమొల, దిసమొల, చిత్తల

**దుశ్శకునము-** అపశకునము, అవశకునము

**దెసమొలగలస్త్రీ-** కోటరి, కోటవి

**దేవాంగి-** కువిందుడు, తంతువాయుడు, సాలెవాడు

**దేశాంతరగతి** - వలస

**దేశాంతర వాసము-** ప్రవాసము

**దేవునిపాదుకలు-** శరగోపము, శరకోపము, శరారి

**దొంగసొత్తు-** తోత్రము, తోప్త్రము.

**దోమతెర-** మశహరి, చతుష్కి

**ద్వారక-** కుశస్థలి, సుధర్మి

**ధన్వంతరి-** అబ్ధిజుడు

**నంగిమాట-** తుంబుకము

**నక్కదోస-** ఏర్వారువు

**నత్తివాడు-** లోహలుడు

**నమకము-** శతరుద్రీయము

**నరకము-** నారకము, నిరయము, దుర్గతి.

**నర్మము-** పరిహాసము, అగ్రామ్యపరిహాసము

**నవాసాగరము, నవాసారము -** యవక్షారము, నవక్షారము, యవభస్మజము

**నాగస్వరము-** మౌరి, నాగసరము, మవురి.

**నాటకరంగము-** రంగము, రంగస్థలము.

**నాటకమున స్త్రీపాత్రధారి-** భ్రకుంశుడు, భ్రుకుంశుడు, భ్రూకుంశుడు.

**నాణెములసంచి-** జాలెము,జాలియ, జాలియము

**నాదస్వరము-** సన్నాయి, సొన్నాయి, సోనాయి

**నాది-** మదీయము, మామకము, మామకీనము

అనేకము))

**నానుడి-** జనశ్రుతి, కింవదంతి, లోకోక్తి, సామెత, వాడుక, వానొడి

**నారచీర-** వల్కలము, ఏసె, చోలకము, క్షామము, పొత్తిచీర

**నారింజ-** దంతశరము, చోళకి, దంతహర్షము, కంటకి, నాగరంగము, సురం గము, గోరక్షము, కిమీరము, గంధ పత్రము, నారంగము, శీరము

**నారి-** జ్యా, మౌర్వి, గుణము, గొనయము, శింజిని, గొనము, అల్లెత్రాడు

**నారి కురుపు-** నారిపుండు, నాడీవ్రణము తంతికురుపు, సెలపుండు, నాలికురుపు

**నాలిక-** జిమ్మ, జిహ్వ, రసన, రసజ్ఞ, ముఖ చరము, నాలుక; నాల్క, కాకువు, నాలువు.

**నాలిముచ్చు-** కుటిలుడు, చెనటుడు, నాలి బూతము, తులువ, పలువ, దుష్టుడు, లండుబోతు బండుడు, భండుడు

**నాళిక-** నాలిక, క్రోవి, గొట్టము

**నావ-** నౌక, కప్పలి, కలము, తరండము, తరణి, తారణి, పోతము, వహనము; వహిత్రము, హోడము, తరీషము

**నాశము-** అంత్యము, అవసానము, అవసాదము, క్షయము, క్షీణము, ధ్వంసము, ప్రళయము, లయము, శిథిలము, వినాశనము

**నాసాపుటము-** ముక్కుజెరము, ముంజెరము, పోటము, చెరము, ముకుగోళ్ళు

**నాసావంశము-** ముకుదూలము, ముకు కంబము, ముక్కుదండి, ముక్కు కంబము

**నింద-** అవర్ణము, ఆక్షేపము, నిర్వాదము, గర్హణము, దూఱు, సెగ్గింపు, అపదూఱు, అధిక్షేపము

**నిచ్చెన-** ఆరోహణము, అధిరోహిణి, నిశ్రేణి

**నిడుద-** ఆయతము, ఆయామము, ఆరోహము, దైర్ఘ్యము, విస్తృతము, పొడువు, నిడివి, పొడుగు,

**నిద్ర-** శయనము, స్వాపము, స్వప్నము, సంవేశము, నిదుర, నిద్దుర, కునుకు; కూర్కు, కనుమోడ్పు

**నిధి-** శేవధి, నిక్షేపము, పాతర, లిబ్బి, గుప్తి

**నిమ్మ-** ఐరావతము, రుద్రాక్షము, రైవత కము, ఈడ, దంతహర్షము, కరుణము, కాకఫలము, క్షుద్రామ్ల, దంతశరము గిలము, జంబిరము, జంబీరము, జంభీరము, జంభము, జంభరము, లికుచము నింబూకము, నింబువు

**నియంత-** నియామకుడు, విధాయకుడు, శాసకుడు, శాస్త్రసర్వాధికారి

**నీచము-** అధమము, అవమము, అవద్యము, అణకము, అర్వము, యాప్యము, ఉక్కితము, కుపూయము, కుత్సితము, ఖేటము, క్షుల్లకము, గర్హ్యము, జఘ న్యము, న్యక్షము, నికృష్టము

**నీటిసుడి-** ఆవర్తము, జలావర్తము, తాలూరము, సుడి, అంభసాంభ్రమము

**నీడ-** ఆతపాభాసము, ఛాయ, అనాతపము

**నీరుకోడి-** బొల్లకోడి, బుడకోడి, పుల్లగోరక, గుండగి, చిలవ

**నీరుల్లి-** ఎఱ్ఱగడ్డ, ఎఱ్ఱమిల్లి, క్రిమిఘ్నము, నికేతనము, పలాండువు, ముఖదూషణము, లోహిత కందము, విశ్వగంధము, సుకందము

**నీలికబురు-** గాలి వార్త, గాలికబురు, పుకారు, వదంతి, జనశ్రుతి, బూటకములు

**నుదురు-** నొసలు, లలాటము, ఫాలము, రరాటము, నిటలము, అ(లి)ళికము, భాలము

**నులి-** పురి, వెంటి, పెన, మెలి

**నువ్వులు-** తిలలు, ఫలకము, సారాలము, పూతధాన్యము, సుబంధము, స్నేహఫలము

**నూగారు-** రోమరాజి, ఆరు, రోమావళి

**నూనె-** తిలరసము, తిల్యము, తైలము, తిలచమురు

**నూయి-** ప్రహి, అంధువు, ఉదపానము, కూపము, బావి, నుయి, నుయ్యి, చలము, దొరవు

**నెపము-** నెవము, మిష, సాకు, హేతువు, వంక, కారణము

**నెమలి-** మయూరము, బర్హిణము, బర్హి, నీలకంఠము, హరి, కలాపి, భుజంగ భుక్కు, సారంగము, శిఖావలము, శిఖి, కేకి, నెమ్మి, నమ్మి, నెమిలి

**నేయి-** ఆజ్యము, అమృతము, ఘృతము, బభ్రువు, వాజము, నెయ్యి, హవిస్సు, స్నేహము, సర్పి

**నేరేడు-** జంబుకము, జంబువు, జంబూకము, జాంబవము, నాదేయి, నీలఫల, రాజఫల,

రాజార్హ, శుకప్రియ, శ్యామల, సుదర్శన, సురభిపత్ర, సూక్ష్మఫల

**నేర్పుకాడు-** అభిజ్ఞుడు, నిపుణుడు, చతురుడు, ప్రవీణుడు, నిష్ణాతుడు, కుశలుడు, దిట్ట, వెరవరి, శిక్షితుడు

**నేలగుమ్మడి-** భూకర్కారువు, క్షీర శుక్లిక, విదారి, శ్లేష్మకండక, నేలగుమ్మడు, వృష్యకందము, వృష్యపర్ణి

**నేలతామర-** నేలతమ్మి, మెట్ట తామర, స్థల పద్మిని

**నోరు-** మూతి, వా, వాయి, అననము, ఆస్యము, తుండము, ముఖము, వక్త్రము, వదనము

**న్యాయము-** అర్థము, అభినీతము, అభ్రేషము, ఔపయికము, దేశరూపము, కల్పము, ధర్మము, న్యాయ్యము, సారము, భజమానము, యుక్తము, సమంజసము, పాడి, తగవు

**నెమలి కన్ను-** చంద్రకము, చంద్రము, పించెము, పించియము. కన్ను

**న్యాయవాది-** స్మృతి పారకుడు, వకీలు, నైయాయికుడు, సభికుడు

**న్యాయాధికారి-** తగవరి, తీర్పరి, ప్రాడ్వివా (వే)కుడు, ధర్మాధికారి

**పంక్తి-** ఆలి, ఆళి, ధార, పరంపర, పాళి, వరుస, బంతి

**పంటియిగురు-** ఇగురు, చిగురు, పలుకుదురు, దంత వేష్టము, దంత వల్కలము

**పండితుడు-**విద్వాంసుడు, విపశ్చిత్తు, సూరి, బుధుడు, సుధి, ప్రాజ్ఞుడు, విచక్షణుడు

**పంది-** అఖనికము, ఆఖువు, కిటి, కిరి, కుముఖము, కోలము, క్రోడము, గృష్టి, ఘృష్టి, ఘోణి, దంష్ట్రి, రోమశము, సూకరము, స్థూలనాశము, ఒంటరి, కొమ్ముకాడు, గుర్గురింత, చప్పరింత, ముట మెకము

**పంది కొక్కు-** మూషి (ష)కము, ఆఖువు, ఉందురము, ఖానకము, గర్తాటము, గృహభూదారము, దీర్ఘదేహి, రోమశము, కొక్కు, మూసకము

**పండుగు, పండువు, పండుగ-** ఉత్సవము, ఉద్ధవము, పండువ, వేడుక, పర్వము, పబ్బము, పర్వణి

**పందెము-** పన్నిదము, పణితము, పణము, ఒడ్డనము

**పక్షి-** ఖగము, విహంగము, విహగము, విహంగమము, విహాయసము, వాజి, శకుంతము, శకుని, శకునము, ద్విజము, పతత్రము, పత్రి, గరుత్మంతము, పతగము, అండజము, నగౌకసము, పక్కి, పిట్ట, పులుగు, గువ్వ, పతంగము

**పక్షిగూడు-** పంజరము, గూడు, చవుట, చౌట

**పక్షిరెక్క-** గరుత్తు, గరి, పతత్రము, పక్షము, నెరి, వాజము

**పగడము-** అబ్ధిపల్లవము, అంగారకమణి, భౌమరత్నము, విద్రుమము, ప్రవాళము, మహారక్తము, పవడము, ప్రవాలము, వల్లికము

**పగలు-** పవలు, దివసము, దినము, ఘస్రము, అహము, వాసరము

**పగ్గము-** ప్రగ్రహము, మోకు, వరాటకము, వరాటిక, మ్రోకు అభీషు(శు)వు

**పచ్చ-**అశ్మగర్భము,గారుడము, మరకతము, రాజనీలము, రోహిణేయము,

**పచ్చపెసలు-** ముద్గము, ఖండీరము, మసూరము, పీతముద్గము, హరిముద్గము

**పటకారుడు-** ఆలేఖకుడు, చిత్రకారుడు, చిత్రకుడు, తౌలికుడు, ముచ్చి, మాలికుడు

**పటము-** ఆలేఖ్యము, చిత్తరువు, చిత్రము, చిత్తర్వు, నగాసు బొమ్మ

**పటిక బెల్లము-** గుడశర్కర, కండ చెక్కర, సితోపల, ఫాణితము, మాధవి, కలకండ

**పట్టణము-** పట్నము, పత్తనము, పురము, ప్రోలు, నగరము, స్థానీయము, నిగ మము, బస్తీ

**పడక-** జౌశీరము, తలిమము, తల్పము, పఱుపు, పాన్పు, మెత్త, శయనము, శయ్య, శిరము, సెజ్జ

**పడవ-** తరంతి, మంగిని, ఖేలము, తార ణము, తరండపాద

**పడవ తెడ్డు-** తెడ్డు, గడ, క్షేపణి, తర్దువు, పీలి, చుక్కాని, చుక్కాను

**పతివ్రత-** సతి, సాధ్వి, మనస్విని, ఆర్య, గరిత, క్రొత్తడి

**పదునైనది-** క్షుతము, ఖర, తీక్ష్ణము, నిశితము, శాతము, వాడియైనది

**పద్మము-** తామర పువ్వు, నళినము, మహోత్పలము, శతపత్రము, పుండరీకము, నాళీకము, సారసము, సరసీరుహము, బిసప్రసూనము, రాజీవము, పుష్కరము, తమ్మి, అంభోరుహము, అరవిందము, కమలము

**పద్మరాగము-** కురువిందము, అరుణోపలము, మాణిక్యము, మానికము, కెంపు, శోణరత్నము

**పనస-**ఖపుష్పము, గర్భకంటకము, చంపాలువు, పూతఫలము, ప్రాక్ఫలము, చంపకోలము, చంపాలము, బృహత్ఫలము, శిఖావరము

**పని-** కర్మము, కృత్యము, క్రియ, చెయ్వు, చేత, చెయిది, వ్యాపారము

**పరగణ-**తాలూకా, మండలము, వంటెము, వంటియము (ఫిర్కా- ఉపమండలము)

**పరిమళము-** సువాసన, వలపు, తావి, కమ్మన, కంపు, సుగంధము, ఆమోదము, సౌరభము

**పరివారము-** అభిజనము, పరిజనము, మంది, స్వజనము, హితవర్గము, సిబ్బంది

**పరిశోధన-** పరిశీలన, పరీక్ష, విచారణము, శోధన, సమీక్ష, సంశోధన, సాంపరాయము, గవేషణము, గాలింపు

**పరిషత్తు-** సభ, కూటము, సదస్సు, సమా వేశము

**పరిహాసము-** నర్మము, పరీహాసము, పరిహసనము, పరియాచకము, ఎగతాళి, గేలి, నవ్వు, పరాచకము, కోడిగము

**పరుగెత్తు-** పారు, పరువెత్తు, పరువిడు గునుకెత్తు, గునుకు, ఓడిగిలు, ఓడిగిల్లు, ఉరుకు, ప్రధావించు

**పరుసవేది-** స్పర్శవేధి, స్పర్శమణి, రసవాదము

**పర్యాయము-** తడవ, తూరి, తేప, పరి, పారి విడుత, దఫా

**పర్వతము-** గట్టు, గుబ్బలి, మహీధ్రము, శిఖరి, క్ష్మాభృత్తు, ధరము అద్రి, గోత్రము, గిరి, గ్రావము, అచలము, శైలము, మల

**పల్లకి-** సవారి, మేనా, (చూ॥ అందలము)

**పల్లము-** గుంట, ఒరకము, గొల్లము, గతుకు

**పల్లు-** రదనము, దశనము, రదము, దంతము

**పల్లె-** పాలెము, పాళెము, వాడ, గూడెము, పల్లియ, గ్రామము, కుప్పము

**పల్లేరు-** పలంకషము, శ్వదంష్ట్ర, గోకంటాకము, ఇక్షుగంధము, స్వాదుకంటకము

**పళ్ళెము -** పళ్లియము, అరివాణము, పళ్ళెరము, పళ్ళము, కంచము, పుటకము, శరావము, తబుకు, తట్టి, కందువు తలియ, హరివాణము, పాత్రము, తెలె

**పవళించు-** పరుండు, పన్నుండు, తెన్నుండు, శయనించు, అత్తమిల్లు

**పశుశాల-** కొట్టము, కొట్టాము, దొడ్డి, గోగ్రంధి, గోశాల, గోష్ఠము, గోస్థానము

**పసుపు-** ఉమ్మ్యము, గౌరాభము, జయంతిక, తుంగి, పీతక, పీతిక, దార్వి, విభా వరి, విషఘ్ని, శర్కరి, హరిద్ర, శర్వరి, సువర్ణ, రంజని, మంగలప్రద, హరిత్తు

**పసుపురంగు-** కాంచని, గౌరము, హరిద్ర, పీత, అళది, హాళది

**పస్తు-** ఉపవాసము, ఉపాసము, ఇల్లి, నిట్రు, నిప్పస్తు, నుంకు లంకనము, లంకణము, ఉపోషణము, ఉపోషితము, ఉపోషము, లంఘనము

**పాక-** అకుటిల్లు, గుడిసె, శాల, పర్ణశాల, పూరిపాక, పూరిగుడిసె

**పాగ-** ఉష్ణీషము, ఖోలకము, తలచుట్టు, పాగా

**పాచికలు-** అర్ధ సొరెలు, అర్ధసాళ్ళు, అక్షము, కవర, దేవనము సొగటాలు, పాశకము, సొరెలు

**పాదము-** అడుగు, అంఘ్రి, చరణము, పదము, మూలము, అంజ, అజ్జ, హజ్జ

**పాదచారి-** పత్తి, పదగుడు, పదాతి, కాల్బంటు

**పాదరసము-** అమరము, చపలము, చలము, తారాభము, దేహదము, పారదము పాదరము, మహారసము, రసరాజము, శివధాతువు, అశోకము

**పాపము-** కిల్బిషము, కల్మషము, కలుషము, వృజినము, అంహము(స్సు), అఘము, దురితము, దుష్కృతము, దోషము, దోసము, పాప్మము, ఏనస్సు, అంకము, పాతకము

**పాముపడగ-** పడగ, ఫణము, దర్వి, భోగము, స్ఫటము

**పాము పొర-** అహికోశము, నిర్మోకము, నిర్వయని, కుబుసము, కూసము, కుప్పసము, కుపసము, కూచము, నిర్ల్వయని

**పారిజాతము-** వారిజము, మందారము, నింబతరువు, పారిజము, పారిభద్రము

**పాలు-** అవదోహము, ఊధస్యము, క్షీరము, గోరసము, దుగ్ధము, పాయి, పయస్సు, పేయము, మధువు, సుధ,

**పార్వతీదేవి-** ఉమ, కాత్యాయని, గౌరి, కాళి; హైమవతి, ఈశ్వరి, శివ, భవాని, రుద్రాణి, శర్వాణి, అపర్ణ, పార్వతి, సర్వమంగళ దుర్గ, మృడాని, చండిక, అంబిక, ఆర్య, దాక్షాయణి, గిరిజ, మేనకాత్మజ, నారాయణి, భార్గవి, శారద, జయ, గట్లరాయని పట్టి, ముక్కంటి వెలది, ఏనుగుల గొంగ తత్తడి నెక్కుదంట

**పాలుపొరకట్టు-** పాలతరక, పాలతొరక, పాలతేట, సంతానిక

**పావకోళ్ళు-** పాకోళ్ళు, పాగలు, పావలు, పాదుకలు, పాంకోళ్ళు, సంబవులు, సంబాళిగలు, సమ్మాళిగలు, అడియొత్తులు

**పావురము-** కలకంఠము, కలరవము, కపోతము, పారావతము, పారువము, బెళ్ళగాడు, బెళవాయి

**పించెము-** నెమలి పురి, పింఛము, బర్హము, పిచ్ఛము, శిఖి పిచ్ఛము, కలాపము, శిఖండము, శిఖిపుచ్ఛము, వర్హము, పించియము

**పిక్క-** జంఘ, జంగ

**పిచ్చికారి-** చిమ్మనగ్రోవి, పిచికారి, చిమ్మన గొట్టము, బుఱ్ఱకొమ్ము, బుఱ్ఱట, బుఱ్ఱట కొమ్ము

**పిచ్చుక-** కలవింకము, చటకము, నీల కంఠము, పిట్ట, పిచుక

**పిడికిలి**- గుప్పిలి, ఖటికము, పిడి, ముష్టి, ఖటకము

**పిడుక**- పిడక, ఉత్పలము, కరీషము, గరిండము, గవారము, గోగ్రంధి, పిష్టిక

**పిడుగు**- అశని, నిర్ఘాతము, భిత్తిక, వజ్రము, సారంగము, హీరము

**పిదప**-పిమ్మట, తర్వాత, అనంతరము, తదుపరి

**పిన్నగ్రద్ధ** - చిరంభణము, చిల్లము, చింద, ఆతాపి, ఆతాయి

**పిన్నమ్మ**- చిన్నమ్మ, పిన్ని, పినతల్లి

**పిప్పళ్ళు**- ఉపకుల్య, కణ, కోలనామ, చపల, దంతీ ఫలము

**పిరికి**- త్రస్నువు, త్రస్తుడు, భీరుడు, భీలుకుడు, కోచ, పంద, వెఱపరి, భీరువు, భీరుకుడు, భేరువు

**పిఱుదు**- కటకము, కటీరకము, కాంచీపదము, జఘనము, నితంబము, ఖల్లము ప్రోధము, శ్రోణి, మొత్త, కకుద్మతి

**పిల్లకాలువ**- బోదె, బోదియ, చింక, దోని

**పిల్లి**- బిడాలము, మార్జారము, మార్జాలము, చీలి ఓతువు

**పిల్లిపెసర**- ముద్గ, కోశిల, క్షుద్రసహ, మార్జాల గంధక, హ్రస్వ

**పీఠము**- ఆసనము, గద్దియ, పీట, సంవేశనము

**పీడించు**- ఈండ్రించు, పల్లార్చు, పొలార్చు నొప్పించు, పీకు, సంకటపెట్టు,బాధించు

**పీనుగు**- శవము, సబము, కటము, కళేబరము, బడుగు, మృతకము

**పీలిక**- అంపె, కప్పడము, జడక, చీలిక, చినుగు, చింపి, పేలిక, పేలికె

**పుక్కిలించు**- గుప్పలించు, గుప్పటించు, గండూషించు, పుకిలించు

**పుచ్చ**- ఉర్వారుకము, కళింగము, ఛత్రారుణి

**పుట్ట**- కులకము, ఖోలకము, నాకువు, శక్రశిరము, వల్మీకము, మడువ, స్యమీకము, వామలూరువు, వామలూరము

**పుట్టగొడుగు**- ఛత్రాకము, భూకవచము,

**పుట్టుక**- ఉత్పత్తి, ఉద్భవము, జననము, ప్రసవము, భవము, భావము, పుట్టువు,

**పుట్టుమచ్చ**- జటులము, కాలకము, తిలకాలకము, పిప్లవు, జడులము

**పుడిసిలి**- కొణిదిలి, కొడిదిలి, కొడిద, చులుకము చేర, గండూషము

**పుణ్యము**- ధర్మము, శ్రేయము, సుకృతము పున్నెము

**పునర్వసు**- అదితి, ఆదిత్యము, దేవమాత, పొదరిండ్ల చుక్క

**పునుగు**- పూతిగడ్డ, జాలిక, పూతికోశ

**పుప్పొడి**- పుష్పపరాగము, సుమనోరజము

**పుబ్బ**- పాముకంటి చుక్క, భగాఖ్యము, భాగ్యము

**పురీషము**- అవస్కరము, ఉచ్చారము, కల్కము, మలము, విష, విట్టు, శకృత్తు, శమలము, గూథము

**పురిటిల్లు**- అరిష్టము, ప్రసవగృహము, సూతికాగృహము

**పురుషునకు**- తోడబుట్టిన దాని కొడుకు, భాగినేయుడు, మేనల్లుడు, మేనయల్లుడు

**పుఱ్ఱె** - కపాలము, కరకము, కరోటి, కర్పరము, తలపాల, పుచ్చె, భగాలము, పునుక, పున్క

**పులిహోర**- పులియోర, పులియోగిరము, చిత్రాన్నము, కలవంటకము

**పులుసు**-ఆమ్లిక, పుల్లన, పులుపు, అమ్లము

**పుల్లబచ్చలి-** అమ్లకలంబి, అమ్లి, గోదావల్లి, భ్రమణిక

**పుష్పము-** ప్రసూనము, కుసుమము, సుమము, పువ్వు, అలరు, పువు, పూ, విరి, సూనము, పుప్పము, సుమనస్సు

**పుష్యమాసము-** పుష్యము, పౌషము, తిష్యము, పౌషి, సహస్యము, తైషము,

**పుష్యమి-** ఆద్యము, ఇజ్యము, తిష్యము, వాగీశము, గురునామకము, తొండరూపు రిక్క

**పుష్యరాగము-** పుష్యము, పీతస్ఫటికము

**పుస్తకము-** కబ్బము, కావ్యము, గ్రంథము, కోశము, సంపుటము, పొత్తము, వహి, కవిత

**పూగుత్తి-** స్తబకము, మంజరి, గుళుచ్ఛము, గుచ్ఛము

**పూర్వ ఫల్గుని-** భగాఖ్యము, పుబ్బ

**పూర్వాభాద్ర-** ఎనిమిది కాళ్ళచుక్క, అజైకపాత్తు, ప్రోష్ఠపదము

**పూర్వాషాఢ-** జలము, తొలునీటిరిక్క

**పూర్ణిమ-** పౌర్ణమి, పున్నమి, జ్యోత్స్ని, రాక, పూర్ణమాసి

**పెండలము-** పిండాలువు, గ్రంధిలము, తాంబూల పత్రము, లాలకందము

**పెండ్లి-** వివాహము, ఉపయమము, పరిణ యము, ఉద్వాహము, పాణిపీడనము, పరిగ్రహము, నిర్వేశము, పాణిగ్రహణము

**పెండ్లి తాంబూలము-** నిశ్చితార్థము, ప్రధానము, పయిడి ముడుపు

**పెట్టె-** పేటిక, మందసము, మంజూష, సందుక, పదరము కరోటము

**పెడమోము-** మారు మొగము, అరఁగలి, కొతుకు, జుడుగు, పెడము,

**పెత్తండ్రి-** పెదతండ్రి, పెదనాన్న, పెద్దయ్య

**పెదవి-** వాతెర, పల్కట్టు, పలుదెఱ, మోము, అధరము, ఓష్ఠము, బింబము, వెూవి, దంతవాసస్సు

**పెద్దపులి-** శార్దూలము, ద్వీపి, వ్యాఘ్రము, పుండరీకము, వ్యాళము, పృదాకువు, పసిదిండి, మెకముల దిండి, చారలమెకము, మువ్వన్నెగల మెకము, బెబ్బులి, పులి

**పెద్దమ్మ-** దారిద్ర్య దేవత, అలక్ష్మి, ఐంద్రి, నిరృతి, కాలకంరిక, త్రిజ్యేష్ఠ, జ్యేష్ఠాదేవి

**పెనము-** కందువు, కటాహము, భాజనము, స్వేదని, అగ్నిష్ఠము, కంచ, స్వేదనిక

**పెరుగు-** క్షీరజము, దధి, తైరు, పెరువు, పెర్వు, శ్రీఘనము, పెర్గు, కలుపు

**పెసర-** గంధసారము, మసూరము, ముద్గము, హరితశాబరి, హరిమస్తకము

**పేగు-** ఇడ, ధమని, నాడి, పురీతత్తు, సిర, అంత్రము, ప్రేగు

**పేడ-** పెంట, గోవిట్టు, గోహన్నము, జలగము, భూమిలేపనము, గోమయము

**పేను-** ఓకణము, ఓకోదని, ఓకణి, కిటిభము, ఉద్దంశము, ఉత్కుణము, కేశకీటము, యూక(ము), వీక్ష, ఈరు, ఈపి, అంటుపేను

**పేము-** ప్రేము, బెత్తము, వేత్రము, వేణువు, వంశము, కీచకము, వానీరము

**పేరంటాలు-** నాకిని, నాగిని, జక్కిని, జక్కిణి, పేరటాలు

**పేరు-** సంజ్ఞిక, అభిధ, అభిధానము, నామము, ఆఖ్య, అభిఖ్య, అహ్వ, ఉపాధి, సంజ్ఞ, ఆహ్వాయము

**పైట-** పయ్యెద, పయ్యెర, పయ్యట, పయంట, పైయద

**పైరు-** పయిరు, సస్యము, సస్సెము, కలమము, పంట

**పొంగరాలు-** పూరీలు, పోళీలు, పోలీలు, పోలెలు

**పొందిక-** అమరిక, ఇమిడిక, ఒందిక, ఒమ్మిక, ఎనయిక, కుదిరిక

**పొగ-** ఆవిరి, అగ్నివాహము, ఖతమాలము, ధూమము, మేఘయోని, మేచకము, ధూపము, వ్యామము, శిఖిధ్వజము, పొవ

**పొగడ-** పొవడ, కేసరము, వకుళము, విశారదము

**పొట్టివాడు-** ఖర్వుడు, హ్రస్వుడు, వామనుడు, గిటక, పొట్టి, కుఱుచ, గిట్ట, టింగణ, గిడ్డ, గిఱక, గుజ్జు, బురక, గున్న, కొట్కి, కొట్ర

**పొట్టేలు-** తగరు, వృష్ణి, రోమశము, ఏడము, మేఢ్రము శృంగిణము, గడ్డరము, మెంరము, మేంరము వృధు శృంగము, రోహిషము, అగ్గితత్తడి

**పొడవు-** ఉచ్చ్రత, ఉన్నతి, ఉచ్ఛ్రాయము, ఉత్సేధము, తుంగత, ఊర్ధ్వత, ఉన్నాహము

**పొడుము-** గుండ, చూర్ణము, నలి, పొడి, నుగ్గు, తుమురు, నురుము పిండి

**పొత్రము-** పొత్తరము, ఉపల, రుబ్బురాయి, మెరియ

**పొద-** చిట్ట, జీబు, జొంపము, డొంక, తుప్ప, పొదరు, ఈరము, ..దళి, కక్షము, గుల్మము

**పొదరిల్లు-** పొద, పొదరుటిల్లు, కుంజము, నికుంజము,

**పొన్నగంటికూర -** కాండపుష్ప, పత్తూర ప్రియ, మత్స్యగంధ, మత్స్యాక్షి

**పొలము-** అశ్మంతము, ఇడ, ఇర, క్షేత్రము, చేను, పుడమి, వేవిలి, రాజిక, మన్నెము

**పోక-** అక్రోటము, అమరపుష్పము, కరమట్టము, క్రముకము, ఖపురము, ఘోంటా ఫలము, చిక్కణము, పూగము, శౌభము, సురంజనము, స్రంపి, హ్రస్వకము

**పోలిక-** ఉపమ, తుల, సమానము, సాటి, సామ్యము, సాదృశ్యము,

**పోవు-** ఏగు, అరుగు, గమించు, చను, నిర్గమించు, పనివిను, వెడలు

**పోషించు-** ఏలు, పెంచు, ప్రోచు, మనుచు, సంతరించు

**పౌరుషము-** కడిమి, గండు, బీరము, మగటిమి, మగతనము, విక్రమము

**ప్రతిధ్వని-** మారుమ్రోత, ప్రతిశ్రుతి, ప్రతిధ్వానము

**ప్రతివాది-** ప్రతికక్షి, ప్రతిద్వంద్వి, విరోధి, ప్రత్యర్థి

**ప్రత్తి-** అంబరము, అఖరము, ఏకాష్టి, కర్పసి, ఆచ్ఛాదనఫల, కార్పాసము

**ప్రధానుడు-** ప్రముఖుడు, ప్రవేకుడు, అనుత్తముడు, ఉత్తముడు, ముఖ్యుడు, వర్యుడు, వరేణ్యుడు, ప్రబర్హుడు, అనవరార్ధ్యుడు, అగ్రుడు, ప్రాగహరుడు, అగ్ర్యుడు, అగ్రీయుడు, అగ్రియుడు

**ప్రబ్బలి-** అభ్రపుష్పము, రథము, వానీరము, విదులము, వేతసము, వేత్రము, శీతము, నాదెయు, నిచులము

**ప్రభుత్వము-** శృంగము, రాజ్యము, ఆళితనము, దొరతనము

**ప్రమిద-** ప్రమ్మిద, పమిద, ప్రమ్మిదె

**ప్రయాణము-** గమనము, గమము, ప్రస్థానము, యాత్ర, వ్రజ్య, పయనము

**ప్రవాహము-** ధార, వేగము, స్రోతస్సు, వరద, వెల్లువ, ఓడిక, వెల్లి, నిట్ట, వెల్లిక

**ప్రశ్న-** ఆకాంక్ష, ప్రశ్నము, పృచ్ఛ, సవాలు

**ప్రసవము-** కానుపు, కాన్పు, పురుడు, ప్రజనము, ప్రసూతి

**ప్రహరి-** ప్రాకారము, పారి, పారిగోడ, అవి, బవరి, కంధావాటము, వారణము

**ప్రాణగొడ్డము-** ప్రాణఘ్నము, ప్రాణఘ్న, ప్రాణనాశనము, ప్రాణహరము

**ప్రాతఃకాలము-** ప్రత్యూషము, అహర్ముఖము, కల్యము, ఉషస్సు, ప్రత్యుషస్సు, ప్రభాతము, ప్రత్యుష

**ప్రాతది-** పురాణము, ప్రతనము, ప్రత్నము, పురాతనము, చిరంతనము

**ప్రాప్తము-** లబ్ధము, భావితము, విన్నము, ఆసాదితము, ఆపాదితము

**ప్రియము-**అనుగు, అర్మిలి, ఇంపు, ఇష్టము, కూర్మి, గారవము, గాదిలి గారాము, చెల్మి, నెయ్యము, పేర్మి ప్రేముడి, మక్కువ, ముద్దు, హితము

**ప్రియురాలు-** అంటుకత్తె, నేస్తురాలు, నెచ్చెలి, సంగాతికత్తె, పొత్తుకత్తె

**ప్రేమ-** అనురక్తి, అనురాగము, అభిమానము, అనుబంధము, ప్రణయము, రాగము

**ప్రొద్దు తిరుగుడు-** సూర్యకాంత, సూర్యాను వర్తిని, సూర్యపర్ణి, సూర్యపత్రము, సూర్య క్రాంత

**ప్రొయ్యి-** అశ్మంతము, అంతిక, అధిశ్రయణి అశ్మంతకము, చుల్లి, పొయి, ప్రొయి

**ఫిరంగు-** పేరంగి, పిరంగి, శతఘ్ని, బంబాసు

**బంగారము-** స్వర్ణము, సువర్ణము, హిరణ్యము, కనకము, హేమము, హాటకము, తపనీయము, గాంగేయము, భర్మ, కర్బురము, చామీకరము, జాత రూపము, మహారజతము, కాంచనము, రుక్మము; జాంబూనదము, పసిడి, బంగరు, బంగారు; పైడి, పొన్ను, జాళువా, పుత్తడి, కడాని, మేలిమి, అపరంజి, ఉదిరి, కలధౌతము

**బంజరు-** పోరంబోకు, బీడు, ఊసరము, చవిటీ, చేటు, పఱ్ఱ, చెలిక, చౌటినేల

**బండి-** అనస్సు, కణిబి, కుబ్రము, కూబరి, కూవరి, చంకరము, చక్రపాదము, చక్రి, స్యందనము, తేరు, అరదము, గంత్రి, గాడి, శకటము

**బండికన్ను-** బండికలు, బండికల్లు, చాయమేకు, చిలుక, చీల, జంజిక, అక్షము, అణి, ఆణి, అధిష్ఠానము, అరి, ఉపధి, కుందము, కేశవాయుధము, రథాంగము

**బండిసీల-** అక్షకీలము, ఉదద్ధ్రము, అణి

**బంతి-** కందుకము, గేందుకము, గేందువు, చెండు, కండుకము

**బందీ-** బంధితుడు, ఖైదీ, కారాగుప్తుడు

**బక్కవాడు-** అలిపిరివాడు, అల్పిరి, పీల, బడుగు, బడువు, బక్క, వక్కి, వగ్గు, బెండుమానిసి, దుర్బలుడు

**బగ్గీ-** గుఱ్ఱపు బండి, జట్కా, టాంగా, గాడీ

**బచ్చలి-** అయడి, కలంబిక, పోరకి, ఉదకి, మదఘ్ని, మోహన, వల్లిక, వృంతాక, వృత్తక, వృశ్చికప్రియ

**బజ్జి-**పడిదెము, పడిదియము, పొంగనాలు

**బట్టతలవాడు-** ఖల్లీటుడు, బభ్రువు, చెంబు తలవాడు, ఖల్వాటుడు, ఖర్వాటుడు, ఇంద్రలుప్త కుడు

**బట్టీ -** ఆవము, బట్టె; బట్టియ

**బడుగు-** బికారి, దరిద్రుడు, చేబోడి, నిర్ధనుడు, పేదవాడు; అకించనుడు, నిరుపేద, నిర్భాగ్యుడు, కీనాశుడు, పకీరు

**బయిరాగి-** బైరాగి, విరాగి, విరక్తుడు, సన్న్యాసి, సన్యాసి, త్యాగి

**బలము-** ఆయతి, ఉక్కు, ఓజస్సు, కుశలము, తేజస్సు, దార్ఢ్యము; దిట్ట, ద్రవి ణము, దిష్ట్యము, పరాక్రమము; పౌరుష ము, ప్రాణము, ప్రభవము, విక్రమము, శుష్మము, శక్తి, శౌర్యము, సత్త్వము, స్థామము, స్థేమము

**బలరాముడు-** బలదేవుడు, రేవతీ రమణుడు, రాముడు, శీరపాణి, బలభద్రుడు, అచ్యుతాగ్రజుడు, రౌహిణేయుడు, (చూ॥ తాటి పడగవాడు)

**బలియుడు-** దండివాడు, లావరి, బలిమి కాడు,బల్లిదుడు; ప్రబలుడు, మొక్కలీడు

**బల్లి-** ముసలి, గృహగోధిక, గౌళి, పల్లి

**బస-** తెంకి, పట్టు, నెలవు, బిడారు, మనికిపట్టు, స్థానము, స్థావరము, విడిది

**బసవడు-** ఆలపోతు, ఆబోతు, ఇద్వరము, గిబ్బ, గోపతి, షండము, మోపురపు టెద్దు, రంకెల మెకము

**బాణపు ములికి-** నాళి(ళీ) కము, ఫలము, అలుగు, అల్గు, చిలుకు, ములికి, ముల్కి, సెల

**బాణము-** అజిహ్మగము, అయోగ్రము, అశుగము, ఇషువు, కలంబము, అలుగు ఖురాలము, ఖేలి, పత్రి, మార్గణము, రోష ము, శరము విశిఖము, కోల, ములిగి, అమ్ము, తూపు, పృషత్కము

**బాతు-** అటి, అడి, అతి, అడె(డే)లు, బాతువు

**బానిస-** గులాము, గుల్లాము, బానిసె, పాదకి, పొత్తుదాసి, బోనకత్తె

**బాబాయి-** బాబయ్య, చిన్నాన్న, పినతండ్రి, తాతగుపు

**బాల్యము-** శైశవము, అలరు, ప్రాయము, చిన్నరికము, పిన్నరికము, చిన్నతనము, పిన్నతనము

**బాలెంతరాలు-** ప్రసూత, ప్రసూతిక, పురుటాలు, సూతి, ప్రజాత

**బాలుడు-** చిన్న, రింగణా, పిన్న, పసివాడు, బొట్టెడు మాణవకుడు, పోరడు, కుఱ్ఱడు, అబ్బి, దుడుకడు

**బాహుపురి-** కేయూరము, అంగదము, బాహులము, బాహుత్రాణము

**బిడ్డ-** తోకము, అపత్యము, సంతతి, సంతు, పట్టి, చూలు, దుడ్డె, బిడ (కుమారున కును కొమార్తెకును సమానమైన పేళ్ళు)

**బియ్యము-** బీయము, ప్రాలు, తండులము

**బీర-** కర్కశచ్ఛర, కోశాతకి, ఘంటారి, జాంగ (గు)లము, జాలిని, పీతక, పీతపుష్ప

**బుజ్జగించు-** పుస్లాయించు, ఓదార్చు, పుస లాయించు, ఉపలాలించు

**బుట్ట-** గూడ, పుట్టిక, పుటిక, పుట్టి, గరిడియ, సజ్జ, కరడు

**బుడగ-** బుగ్గ, బుదబ్బుదము, ఫేణాగ్రము, ఫేనాగ్రము

**బుడబుక్క-** హుడుక్క, హుడుక, డుబుడుక్క, బుడుబుడుక్క

**బుధవారము-** సౌమ్యవారము

**బుధుడు-** బోధనుడు, సోమజుడు, హేముడు, సౌమ్యుడు, విడ్జుడు

**బుద్ధుడు-** అక్షర చరణుడు, అద్వయవాది, కనిష్ఠకుడు, కులిశాసను ఁ, గోపేశుడు, గౌతముడు, త్రిశరణుడు, తీర్థకుడు, దశభూమీశుడు, ధర్మచక్షుడు, పంచజ్ఞానుడు,

భగవంతుడు, మహాబలుడు, మాయాదేవీ సుతుడు, లోకజిత్తు, శాక్య ముని, శౌర్ధోదని, షడభిజ్ఞుడు, సర్వజ్ఞుడు, సమదర్శి

**బురద-** అసలు, అడుసు, ఊబి, కర్దమము, పంకము, రొంపి, జంబాలము, నిషద్వరము, బంద, బాడె, జొచ్చు

**బురదపాము-** అలగర్దము, అజగర్దము, నీరుకట్టె, నీటిపాము

**బూరుగు-** కంటక ద్రుమము, కర్కటి, చిరజీవి, తులిని, తూలఫల, దారణి, దీర్ఘద్రుమము, దురారోహము, నకులి, పిచులము, మోచకి, రక్తోత్పలము, రోచ నము, శాల్మలి

**బృహస్పతి-** సురాచార్యుడు, గీష్పతి,గురువు, జీవుడు, అంగిరసుడు, వాచస్పతి, ఆర్యు డు, సూరి, వాగీశుడు, వచసాంపతి

**బృహస్పతి వారము** - గురువారము, లక్ష్మివారము

**బెజవాడ-** విజయవాడ, ఇంద్రకీలాద్రి నగరము

**బెత్తము-** వేత్రము, నమసము

**బెల్లము-** అరుణము, ఇక్షవము, గండోలము, గుడ(క)ము, గులము, ద్రవ జము, ఫాణి, మోదకము, స్వాదు

**బెస్త-** కైవర్తుడు, అగ్నికుల క్షత్రియుడు, జాలరి

**బేసి-** అసమము, విషమము, అయుక్కు

**బొంతకాకి-** ఆసురము, మాలకాకి, ఐంద్రి, కాకోలము, ద్రోణకాకము

**బొక్కెన-** చేద, ద్రోణము, ద్రోణి, బాల్చి, సేచని, బొక్కాణము

**బొట్టు-** చుక్క, కలాపకము, తిలకము, పుండ్రము, బిందువు

**బొజ్జ కలవాడు-** బొజ్జివాడు, పొట్టవాడు, లంద, దొంద, తుందిలుడు

**బొబ్బట్లు-** ఒబ్బట్లు, పోళీలు, పోళిగలు, పోలికలు, ఓళిగలు, హోళిగలు

**బొబ్బర్లు-** అలనందెలు, అలసాంద్రము, కుల్మాషము, యువకము, రాజమాషము, అలచందలు

**బొమ్మచీర-** బొమ్మ పొత్తిక, పొత్తె, పొత్తియ, పొత్తి

**బొమ్మంచులు-** బవంతి, కరయంచు, మదావళి, మాదళము, మదావళము, ఉడుత చారలు

**బొల్లి-** సిబ్బెము, సిబ్బియము, సోబె, సోబియ, కిలాసము

**బోదకాలు-** పుట్టకాలు, ఏనుగుకాలు, వల్మీక పాదము, శ్రీపదము, శ్లీపదము

**బోయవాడు-** మృగవధాజీవుడు, మృగ యుడు, లుబ్ధకుడు, వ్యాధుడు, శబ రుడు, కోయవాడు

**బ్రహ్మచారి-** ఉపనీతుడు, వటువు, వడువు, వర్ణి

**బ్రహ్మదేవుడు-** ఆత్మభువు, సురజ్యేష్ఠుడు, పరమేష్ఠి, పితామహుడు, హిరణ్యగ ర్భుడు, స్వయంభువు, చతురాననుడు, ధాత, అబ్జయోని, ద్రుహిణుడు, విరించి, కమలాసనుడు, స్రష్ట, ప్రజాపతి, వేధ, విధాత, శతధృతి, (చూ॥ వేల్పుపెద్ద)

**బ్రహ్మాండము-** అజాండము, కమలజాండము, కంజభవాండము, వేధోండము, హిరణ్మయాండము, బొమ్మగ్రుడ్డు

**బ్రాహ్మణుడు-** ద్విజుడు, అగ్రజన్ముడు, భూదేవుడు, విప్రుడు, భూసురుడు, పాఱుడు, పుడమివేల్పు, బాపడు, జన్ని గట్టు, బాడబుడు

**భగవంతుడు-** దయ్యము, దేవర, దేవుడు

**భరణి** - అంతకము, యమము, యామ్యము, బరిణెచుక్క

**భర్త-** జన్యుడు, ధవుడు, నాథుడు, పతి, ప్రియుడు, మగడు, వరుడు, వల్లభుడు

**భస్మము-** అర్ఘటము, ఉల్క, భసితము, రక్ష, కరక, బదడు, భూతి బుగ్గి, బుసి, బసుమము, బూడిద, బూతి, విబూది, నివురు, నిగురు

**భాగము-** వంతు, పాలు, అంశము, వాటా

**భాద్రపదము-** భాద్రము, భాద్రపది, భాద్రి, ప్రోష్టపదము, ప్రౌష్టపదము

**భార్య-** పత్ని, పాణిగృహీతి, అర్ధాంగి, ద్వితీయ, సహధర్మిణి, జాయ, దార, ఆలు, పెండ్లాము, ఇల్లాలు, కళత్రము, ప్రోయాలు, జని, క్షేత్రము

**భార్యయొక్కచెల్లెలు-** మరదలు, యంత్రిణి, స్యాలిక, శ్యాలిక, కేలికుంచిక

**భార్యతోడబుట్టినవాడు-** బావమరది, స్యాలుడు, శ్యాలకుడు, స్యాలకుడు

**భాష-** బాస, నుడి, వాణి, నొడి, భాషిక

**భాషితము-** ఉక్తము, ఉదితము, లపితము, జల్పితము, ఆఖ్యాతము

**భిక్ష-** బిచ్చము, బికిరము, బిక్కిరము, తిరిపము, ముష్టి, యాయవారము

**భిక్షాపాత్రము-** కప్పెర, కొప్పెర, చిప్ప, అక్షయపాత్ర, కటాహము, కమరము, కర్పరము, ఖర్పరము

**భిక్షువు-** . ముష్టివాడు, అడుగుకొనువాడు, యాచకుడు, తిరపగాడు, అర్థి, బిచ్చగాడు, మార్గణుడు, వనీపకుడు

**భీతి-** దరము, త్రాసము, భయము, వెఱపు, ఎద, ఆళుకు, ఉద్వేగము, భీ, ఓజ, దిగులు, అదరు, బెదరు

**భుజము-** బుజము, మూపు, రెట్ట, అఱ క(డ), అఱకడము, ఎఱుక, కొప్పరము, అంసము, నితంబము, ప్రగ్రహము, ప్రవేష్టము, వాహము

**భుజించుట-** మెసవు, మెసగు, మెక్కు, బొక్కు, తిను, కుడుచు, ఆరగించు, సాపడు, నమలు, ఆహరించు

**భూమి-** అచల, అనంత, విశ్వంభర, రస, స్థిర, ధరిత్రి, ధరణి, క్షోణి, క్షితి, సర్వంసహ, వసుమతి, వసుధ, ఉర్వి, వసుంధర, గోత్ర, పృధివి, పృధ్వి, క్ష్మా, అవని, మేదిని, మహి, విపుల, గహ్వరి, ధాత్రి, ఇల, కుమ్భిని, జగతి, రత్నగర్భ

**భేరి-** దుందువు, నగారా

**భోజనము-** అన్నము, బుత్తి, బువ్వ, తిండి, బోనము, ఓదనము, ఆశనము, జగ్ధి, ఖాదనము, భుక్తి, ఓరెము, కడి, లేహము, ఓగిరము, కుడుపు

**భ్రమరాంబిక-** శైలపుత్రి, బ్రహ్మచారిణి, చంద్ర ఘంటాదేవి, కూష్మాండ దుర్గ, స్కన్ద మాత, కాత్యాయని, కాల(ద్ద)రాత్రి, మహాగౌరీ దేవి, సిద్ధిధాత్రి

**మంగలి-** అంతావసాయి, క్షురి, గ్రామణి, దివాకీర్తి, నాపితుడు, ముండి, అంష్ఠుడు

**మంగళవారము-** జయవారము, కుజవారము, భౌమవారము, కులవారము

**మంగళ సూత్రము-** మంగల సూత్రము, పసుపుత్రాడు, పుస్తె, తాళి, తాలి, బొట్టు దారము, శుభ సూత్రము

**మంచము-** కంకటి, ఖట్వ(ము) ఖట్వీక, పర్యంకము, కంకటి

**మంచు-** నీహారము, తుషారము, తుహినము, హిమము, ప్రాలేయము, మిహిక, హిమిక, ఇవము, వడ, ఇగము, వలి, ఈము

**మంత్రి-** అమాత్యుడు, ప్రెగడ, ప్రెగ్గడ, నియోగి, మంతిరి, మంతు, సచివుడు

**మఖ-** జన్నపు చుక్క, పితృభము, పైత్రము, మేఖలము

**మచ్చ-** డాగు, కళ్ళు, మరక, కళంకము

**మచ్చరీడు-** మచ్చరి, మచ్చరగొట్టు, చలపకారి, చలమరి, చలపాది, ఏవకాడు, వెక్కసి, ఈర్ష్యాళువు

**మజ్జిగ-** మార్జిక, మోరట, రసాయనము, మోరి, తక్రము, చల్ల, కాలశేయము, గోరసము, ఘన రసము, ఘోలము, ఘోళము, మథితము, కచ్చరము, కటురము, ఘలము

**మట్టిగడ్డ-** గడ్డ, పెడ్డ, పెల్ల, బెత్తిక లోష్ఠము, మట్టి బెడ్డ

**మట్టె-** మట్టియ, చుట్టు, పిల్లాణి, పిల్లాడి, బిబ్బిలికాయ

**మఠము-** మటము, ఆశ్రయము, చైత్యము, నిలయము, ప్రవ్రజ్య

**మణిశిల-** ఉత్తమ, కవర, కల్యాణిక, కునటి, గోథ, నాగమాత, మనశ్శిల, విగంధ, సురాగము, కరివీరకము

**మద్దిచెట్టు-** అర్జున వృక్షము, ధనంజయము, సాలము, కుశికము

**మద్దెల-** మర్దలము, మర్దళము, మద్దళ, మృదంగము, అంక్యము

**మధుమేహము-** అతిమూత్రము, మధు ప్రమేహము

**మధ్యవ్రేలు-** నిడివి వ్రేలు, నడివ్రేలు, కర్ణిక, మధ్యమాంగుళి

**మనుమడు-** పౌత్రుడు, పట్టిపట్టి, నప్త, (కూతురు కొడుకు - నప్త, పట్టిపట్టి, దౌహిత్రుడు)

**మనుమరాలు-** (కొడుకుకూతురు) పౌత్రి, నప్త్రి, పట్టిపట్టి (దౌహిత్రి, పట్టిపట్టి - కూతురు కూతురు)

**మనువర్తి-** మనోవర్తి, జీవనభృతి, భృతి, భరణము

**మనుష్యుడు-** మానుషుడు, మర్త్యుడు, మనుజుడు, మానవుడు, నరుడు, పురుషుడు, పూరుషుడు, జనుడు

**మన్మథుడు-** మనసిజుడు, మారుడు, మకరధ్వజుడు, మదనుడు, మీనకేతనుడు, అనంగుడు, కాముడు, పంచశరుడు, ఆత్మభువు, స్మరుడు, కందర్పుడు, ఋష్యకేతువు (చూ॥ తేటియల్లెవాడు)

**మరణము-** పంచత, కాలధర్మము, ప్రళయము, త్యజము, అంతము, నాశము, మృత్యువు, నిధనము, దీర్ఘనిద్ర, ప్రమీల నము, కాలము

**మఱ్ఱిచెట్టు-** కర్మజము, క్షీరకాష్ఠ, క్షీరి, జటి, న్యగ్రోధము, గుటిక, పాదరోహము, బహుపాత్తు, యక్షావాసము, రోహి, వటము, విటపి, క్షీరము

**మరుగు-** అంతరము, అంతర్ధ, అంతర్ధి, అపవారణము, అపిధానము, ఆచ్ఛాదనము, తిరోధానము, పిధానము

**మరువము-** కులకము, జంబీరము, ఖరపుష్పము, తిల్వకము, తిల్లకము, శీతలము, దలామలము

**మల్లె-** అష్టాపది, ఆస్ఫోట, కుటజ, నారీష్ట, ప్రమోదని, భద్రవల్లి, మల్లిక, వల్లిక, విట ప్రియ, శ్రీపది, షట్పద ప్రియ, సురూప, సులభ, సువర్ష, సౌమ్య, సుచ్ఛిద్ర

**మహిషము-**వాహద్విషము, కాసరము, సైరి భము, దుంత, ఎనుబోతు, జమునెక్కి రింత, దున్న, లులాయము

**మాంగల్యము-** తాళిబొట్టు, శతమానము, పుస్తె, బొట్టు

**మాంసపు చక్కిలము-** పుస్తము, (వేపుడు మాంసము చుస్తము)

**మాచి పత్రి-** కుక్కురము, గ్రంధిపర్ణము, శుకము, స్థౌణేయము, బర్హపుష్పము

**మాట-** ఉక్తి, గోవు, పలుకు, భారతి, భాషితము,

లపనము, లసితము, వక్తవ్యము, వచనము, వ్యాహారము, ఇడ, ఇర, ఇల

**మాణిక్యము-** అరుణోపలము, కూప్యము, తరుణము, పద్మరాగము, రంగమణి, రత్న రాట్టు, లక్ష్మీపుష్పము, శృంగారి, సౌగంధికము, కురువిందము, శోణఫలము

**మాత్ర-** గుళిక, గోలీ, గుళిగ, గుటిక, మందు బిళ్ళ, ఘుటిక

**మాదిరి-** నమూనా, మోస్తరు, మచ్చు, రీతి

**మాదీఫలము-** అంబుకేసరము, కేసరామ్లము, ఫలపూరము, బీజపూరము, (మాతు)లుంగము, రుచకము, వనబీజము, సీధురాక్షము, సుపూరము, మాదిఫలము శ్వఫలము

**మానేరు-** మానెరు, కోష్ఠ, చందన, ప్రతానిక, తూమెన, శాబరి, జ్యోతిష్మతి

**మామిడి-** ఆమ్రము, అంబరీషము, అమ్రాతకము, చూతము, కామశరము, కీరేష్టము, కోకిలానందము, మాకందము, అంబాళము, అంబష్ఠ, అమ్లాతకము, రసాలము, కపిచూడ, కపిచూతము, కపీతనము

**మారేడు-** బిల్వము, బిలువము, శాండిల్యము, శైలూషము, మాలూరము, శ్రీ ప్రదము

**మార్గము-** అయనము, ఋతి, సృతి, పంథ, వర్త్మము, అధ్వము, రస్తాపదవి, త్రోవ, దారి, తెన్ను, తెరువు, తెర్వు, తెరగు, పథము

**మార్గశిరము-** మార్గశీర్షము, మార్గాయణి, ఆగ్రహాయణి, సహము, జింక తల రిక్క, నెల

**మార్గస్థుడు-** అధ్వగుడు, అధ్వన్యుడు, తెరువరి, పాంథుడు, బాటసారి, ఇత్వరుడు

**మాలవాడు-** ప్లవుడు, జవంగముడు, శ్వప చుడు, చండాలుడు, పుల్కసుడు, మాతంగుడు, అంత్యజుడు, అంతేవాసి

**మావటివాడు-** మావటీడు, మావంతు, ఇభ్యుడు, మేధుడు, అంకుశధారి, అంబ ష్ఠుడు, మేండుడు, అధోరణుడు

**మాసిక-**అతుకు, అదుకు, అస్తరు, అస్తరువు

**మిక్కిలికంటిదేవర-** జడదారి, గిబ్బరైతం, మిన్నేటితాల్పు, నెలతాల్పు, ముక్కంటి, మరుగొంగ, జక్కులరేని చెలికాడు, తిగ ప్రోలుదాయం, గట్టువిల్దారి, తెలివేల్పు, బేసికన్సామి పునుకతాల్పు, ముమ్మొన వాల్దంట, నల్లనైదువగేస్త, వినువాకమో టైరి, కప్పుపదువపెనిమిటి, సెగకంటిజోదు, గుజ్జువేల్పుతండ్రి (చూ॥ ఈశ్వరుడు)

**మిగులు -** ((మివులు

**నానావర్ణ సంకరము-** శబలము, చిత్రము, కర్బురము, కల్మాషము

**నాలుకపాచి-** కులుకము, జిహ్వామలము

**నిలువుబొట్టు-** ఊర్ధ్వపుండ్రము, (తిరు) నామము

**నీటిపాము-** డుండువు, డుండుభము

**నీరింకిన కొబ్బెర-** కురిడి, కురిడీ

**నీలిమందు-** శ్యామిక, స్యామిక

**నువ్వులు ఆడెడు యంత్రము-** గానుగ, గానిగ, గానువు, గాన్గ

**నువ్వులు పండునేల-** తిల్యము, తైలీనము

**నృసింహస్వామి-** కంబమయ్య, నృసింహుడు

**నెమలిజుట్టు -** శిఖండము, శిఖండకము

**నేతిబీర-** ఘృతకోశాతకి

**నోము-** వ్రతము, బతము

**న్యాయస్థానము-** అక్షపటలము, న్యాయసభ

**పండితపుత్రుడు-** దేవానాంప్రియుడు, శుంఠ

**పండితమ్మన్యుడు-** శాస్త్రగండుడు

**పందిరి-** కురాళము, చప్పరము, చప్రము, పందిలి

**పగలు రాత్రిసమముగ నుండు కాలము-** విషువము, అర్ధరాత్రార్ధదివసము

**పడమర-** ప్రతీచి, అపర, పశ్చిమము

**పతాక-** ప్రాసంగికము

**పతాకానాయకుడు-** పీఠమర్దుడు, నాయక సహచరుడు

**పదికోట్లు-** అర్బుదము, శంకువు, దశకోటి

**పద్యపాదము-** చరణము, అంఘ్రి, పాదము

**పప్పుకట్టు-** జుషకము

**పరశురాముడు-**భార్గవుడు, జామదగ్న్యుడు

**పలకపుల్ల-** బలపము, ఖటిని, ఖటిక

**పాతిపెట్టుట-** ఖననము

**పాలపిట్ట-** చిత్రవాజము, కికిది (దీ)వము, చాషము

**పిండప్రదానము-** పార్వణము

**పిచ్చికుక్క-** అలర్కము

**పిత్తు-** శర్దించు

**పిల్లనగ్రోవి ఊదువాడు -** వాంశికుడు, వైణవికుడు, వేణుధ్మడు

**పుట్టతేలు-** మండ్రగబ్బ, షడ్బిందువు

**పుడిసిలి-** ప్రసృతి

**పురికొల్పువాడు-** ఈరకుడు, ప్రేరకుడు

**పురిటిమైల-** జాతాశౌచము, సూతకము

**పురుషనృత్యము-** తాండవము

**పులగము-** కుల్మాషము

**పులిపిరికాయ-** పులిపిరి, కేమము

**పుస్తకములమ్మువాడు-** గ్రాంధికుడు, పౌస్తికుడు

**పూజారి-** దేవకులికుడు, అర్చకుడు

**పూలముడుపు-** సీమంతము, సీమంతోన్నయము

**పెకలించు-**కోరాడు, కుళ్ళగించు, కెల్లగించు

**పెట్టుబడి -** మదుపు

**పెట్రోలు-** శిలేయము, శిలాతైలము

**పెడసరము-** మిడసరము

**పెసరకట్టు-** పడిదియము, పడిదెముచి, జుషకము.

**పొణక-** గుమ్మి, బుట్ట

**పౌరోహిత్యము-** ఒజ్జనము, ఒజ్జరికము

**ప్రకరి-** అవాంతరోపకథ

**ప్రకాశము-** సర్వశ్రావ్యము

**ప్రతికృతి-** ప్రతిక్రియ, ప్రతియత్నము, ప్రతీకారము

**ప్రశ్నించువాడు-** ప్రష్ట, పృచ్ఛకుడు

**ప్రాయశ్చిత్తము-** ప్రాచితము, అపచితి

**ప్రేగు-** ప్రేవు, అంత్రము, ఆంత్రము, అంతర్ధి

**ప్రేగులరచుట-** ఆంత్రకూజము, కర్దనము, ఉదరనాదము

**ఫిరంగి గుండు-** దంచన

**బంటుచీమ -** సిపాయి చీమ

**బండము-** సరకు, సామగ్రి

**బటానీలుపూ-** కలాయము

**బట్టబయలు-** బటాబయలు, బటాకబయలు

**బడబాగ్ని-** ఔర్వము, వార్వపుటగ్గి, జలేంధనము, బడబానలము

**బావంచాలు-** బాకుచి సోమఖండ, భూకేశి

**బాసికము-** లలామకము

**బృందగానము-** సామూహిక గానము

**బొబ్బరింత-** గర్జనము, చక్కారము, సింహనాదము

**బ్రహ్మపట్టణము-** విరాలి, ఆనందిని

**బ్రహ్మవిల్లు-** ఖచితము

**మంగలిపొది-** కకపాల, ఖరాలికము, భాండి

**మండలాకారనృత్యము-** హల్లీసకము, గొండ్లి

**మగచీమ-** రాజుచీమ, మిండచీమ, గండుచీమ

**మగతుమ్మెద-** మిండతుమ్మెద, గండు తుమ్మెద

**మట్టిమూకుడు-** పాలిక, జాదర

**మణిమంథము-**మణిబంధము, సైంధవ లవణము

**మద్దెల వాయించువాడు-** మార్దంగికుడు, స్వాంకికుడు

**మరతుపాకి-** దంచనము, దెంచనము

**మరుగుదొడ్డి-** పాయిఖానా, కిరము

**మసిధానము-** సిరాబుడ్డి, మేలాంధువు, మేళమణి, మసిధాని

**మాంసము విక్రయించువాడు-** మాంసికుడు, వైతంసికుడు

శేషము))

**మిడుత-** మిడత, చీరకము, పతంగము, శలభము

**మిథునము-** జమిలి, జోడు, దోయి, దొందము, ద్వాయి, యమళము, యుగళము, యురకము

**మిరియము-** ఊషణము, కోలకము, కృష్ణము, మరీచము, వేల్లజము

**మీగడ-** మీవడ, మింగడ మస్తువు, మండము, పాలతెట్టె

**మీగాలు-** పాదాగ్రము, ప్రపదము

**మీసము-**కూర్చము, మీస, శ్మశ్రువు మాసురి

**ముంగిస-** నకులము, కోటీరము, పింగళము, బభ్రువు, బలి, ముంగి, వంచ కము, సర్పారి

**ముంజేయి-** కక్ష, కక్ష్య, కఫోణి, కీలము, కూర్పరము, ప్రకోష్టము మణిబంధము, ముంగేలు, మణికట్టు

**ముందు-** తొలి, తొల్లి, తొలుత, పూర్వము ముందర, మును (పు), మున్ను

**ముక్కంటి తలపువ్వు-** చుక్కలదొర, రేవెల్గు, తమ్ములపగవాడు, కలువల రేడు, తొగరేడు, చీకటివేరు విత్తు, రేయేలిక, చలివెలుగు (చూ॥ చంద్రుడు)

**ముక్కు-** ఘ్రాణము, గన్ధవహ, ఘోణ, నాస, నాసిక, నశ్య, ముకు

**ముక్కుపొడి-** పొడుము, నస్యము, ముకుపొడి, నస్తము

**ముక్కులేనివాడు-** ముక్కిడి, వ్యగ్రుడు, విఖ్యుడు అనాసికుడు

**ముఖము-** ఆన్యము, ఆననము, వక్త్రము, వదనము, మొగము, మోము

**ముట్టుత-** ఆత్రేయి, బహిష్ఠ, పుష్పిణి, రజస్వల (చూ॥ ఋతుమతి)

**ముత్యము-** కువలము, పాణి, ముక్తాఫలము, మౌక్తికము, సారంగము,ముత్తెము

**ముత్యాల దండలు-** (వివిధములు) - ముక్తావళి, ఏకావళి, హారము, చీరము, దేవ ఛ్ఛందము, ఇంద్రఛ్ఛందము, విజయ ఛ్ఛందము, గుచ్ఛము, గుచ్ఛార్ధము, గోస్త నము, ముత్తెనరము, ముత్తెనరి, కట్ల దండ, గుండ్లపేరు, చంద్రహారము, పలుకసరి

**ముత్తైదువ-** పుణ్యస్త్రీ, సుమంగలి, పేరంటాలు, ఐదువరాలు

**ముదుగు కోక-** కిత్తనార, చాగనార, జిడ్డి, మోటుగుడ్డ, స్థూలశాటకము

**ముద్ద-** పిడుచ, పిడచ, కబళము, కవళము, పిండలి, అడ

**మునగచెట్టు**- (కాక్షీవము, కృష్ణశాలి,) (ప్రభాంజనము, శిగువు; మోచక,) (ముఖగంధము, సుమూలము,) శోభనకము, స్వాదుగంధి

**ముమ్మరము**- అధికము; మిక్కుటము

**ముయ్యాకు పొన్న**- అంశుమతి; త్రిగుణ; త్రివర్ణి, సాలపర్ణి, సౌమ్య; స్థిర.

**మురళి**- వేణువు, పిల్లన గ్రోవి, వంశి, వాసె గ్రోలు, వాసిగ్రోలు (ఊలగొట్టము)

**ముల్లంగి**- కటిమూలము, గజకంద, గృంజనము, శీక్షారకము, భాలేయము, హస్తి కందము, హస్తిదంతకము, హరిపర్ణము

**ముసలివాడు**- ప్రవయుడు, స్థవిరుడు, వృద్ధుడు, జీర్ణుడు, జరుడు, ముది, ముదుసలి

**మూకుడు**- ఉదంచనము, కూర్మపృష్ఠము, ఋజీవము, ఋచీషము, ఖల్లికవర్ధమానము, దబ్బు, బూరెల మూకుడు, శరావము

**మూత్రము**- ఉచ్చ, కాల్మడి, ఉత్మము, కల్కము, కాయుజలము, నీరుముట్టు, ప్రస్రావము, మేహము

**మూపురము**- అంసకూటము, కకుదము, కందము, వహము, స్కంధము, ఊపు రము, కకుత్తు

**మూల**- అస్రపము, అంకుసపుమాద్రి, నిర్బతి, సోకుచుక్క

**మృగశిర**- ఐందవము, చాంద్రము, జింకతల చుక్క, నిశాకరము, మృగము, సౌమ్యము, హిమదీధితి

**మెంతి**- మేంధి, మేధిక, వస్తిక, కుంచిక

**మెట్టు**- మెట్టిక, మెటిక, చీడి, పావంచ, సోపానము, సౌపానము, తంతె

**మెడ**- అఱ్ఱు, కుత్తిక, కుత్తుక, కుతిక, కుతుక, గొంతుక, పీక, కంఠము, కంధి, కంధరము, గళము, గ్రీవము

**మెయిపాలు**- వృత్తాంతము, వార్త, ఉదంతము, ప్రవృత్తి

**మెరకనేల**- మిట్ట, మెట్ట, మిఱ్ఱునేల

**మెరుపు**- శంప, శతహ్రద, విద్యుత్తు, సౌదామిని, చపల, చంచల, తటిత్తు, సంప, హ్రాదిని, ఐరావతి, క్షణప్రభ, సౌదామని, క్షణద్యుతి, మించు

**మేక**- అజ, ఛగలి, చింబు, ఛాగి, చుచ్చుచిత్రల, మెంక (ఛగలము, ఛాగము, బస్తము, మేషము ఊర్ణము, ఉరణము, ఒర్కరము మేకపోతు)

**మేకు**- గసిక, చీల, ముల్లు, మొల, సీల, శంకువు, మొల్ల

**మేఘము**- మొగులు, అంబుదము, అంభోదము, అభ్రము, అంబుభృత్తు, కంధరము, కజ్జలము, క్షరము, ఖచరము, ఖద్యోతము, ఖతమాలము, ఘనము, జలదము, జలధ రము, జలముచము, జీమూతము, తటిత్వతి, తోయదము, దర్దురము, ధారాధరము, ధూమ యోని, నీరదము, పయోధరము, వనదము, వలాహకము, వారివాహము, స్తనయిత్నువు, నీరుతాలుపు, మబ్బు, మంచుదారి, మొగిలు, మొయిలు, మొగులు ఖలాహకము

**మేడ**- పురము, నగరు, సౌధము, మాడిగ ఉప్పరిగ

**మేడి**- అంజూరం, అవుష్ప, ఔదుంబరము, జంతుఫలము, సదాఫలము, సుప్రతిష్ఠము

**మేనకోడలు**- స్వస్రీయ, స్వస్రేయి

**మేన బావ**- పైతృష్వసేయుడు, పైతృష్వ స్రేయుడు

**మేనమరది**- (తనకంటె చిన్న) చూ పైన

**మేన**- (తల్లి తరపు) - మాతృష్వసేయుడు, మాతృష్వస్రీయుడు (బావ, మరది) (కూతురు) మాతృష్వసేయి, మాతృ ష్వస్రీయ

**మేనమామ**- మాతులుడు, మామకుడు,

**మేనమామ భార్య-** మాతుల, మాతులి; మాతులాని

**మేర-** కర, క్రమము, గడి, కాష్ఠ, ధారణ, నియమము, ప్రమాణము, మరియాద, సంధ్య, సంస్థ, స్థితి, సీమ

**మేరు పర్వతము-** మేరువు, సుమేరువు, హేమాద్రి, రత్నసానువు, సురాలయము, భద్రము, వేలుపుగొండ, పసిడి, గట్టు, జేజేలగట్టు

**మేషరాశి-** అజము, మేషము, క్రియము

**మైకము-** అపస్మారము, అపస్మృతి, మత్తు, మోహము, మూర్ఛ, సొమ్ము, సొలవు, మగత, సుమాళము, మైమరపు

**మైనము-** సిక్థకము, వికసము, మదనము, మధూచ్ఛిష్టము

**మైలుతుత్తము-** కర్పరి, మయూరకము, శిఖిగ్రీవము, తత్తము, తుత్థాంజనము, తుత్తినాగము, వితున్నకము

**మొగలి-** ఇందుకలిక, కంకుకచ్ఛద, కంట దళ, కేతకి, క్రకచచ్ఛదము, జంబాలము, దీర్ఘపత్రము, ద్రోణీదళ, ద్రోణీలము, సూచీపత్రము, శివ ద్విష్ట, హానీలము, గొజ్జగి, గేదగి

**మొగ్గ-** మొగడ, కుట్మలము, కోరకము, జాలము, ముకుళము

**మొగ్గరము-** ఒడ్డనము, పన్నుగడ, మొగరము, వ్యూహము

**మొటిమ-** మొటిమె, (ముఖ) దూషిక, బొటిమ, బొటిమె, అవగండము, యువ గండము

**మొద్దు-** మొరడు, మోటు, మోడు, మ్రోడు, స్థాణువు

**మొల-**కటి, కటీరము, జఘనము, వితంబము, శ్రోణి

**మొలక-** అంకురము, నిసువు, మొక్క, మొటిక, మొట్టిక, మోటిక, మోసు

**మొసలి-** అంబుమర్కటము, అసిదంష్ట్రము, కుంభి, కుంభీరము, గిలగ్రాహము, గ్రాహము, జలకంటకము, జలసూక రము, జలసూచి, ఝషము, ఝషాశ నము, నక్రము, మకరము,

**మోకాలు-** ముడుకు, ముడుము, కుర్పరము, జానువు

**మోక్షము-** కైవల్యము, ముక్తి, శ్రేయము, అమృతము, నిర్వాణము

**మోచేయి-** మోచెయి, కపణి, కఫోణి, కూర్ప(ర)ము, కీలము, కూబరము

**మొక్కుబడి(కట్టు)-** ముడుపు, మీదు, కానుక, అర్పణము

**యముడు-** పెతరుల స్వామి, జముడు, కాలుడు, ధర్మరాజు, పితృపతి, సమవర్తి, పరేతరాట్టు, కృతాంతుడు, యమునా భ్రాత, శమనుడు, దండధరుడు, శ్రాద్ధదేవుడు, వైవస్వతుడు, అంతకుడు

**యౌవనము -** పరువము, ప్రాయము, జవ్వనము, పాయము, ఈడు

**యుద్ధము-** అయోధనము, జన్యము, ప్రధనము, మృధము, సమీకము, సమ రము, రణము, కలహము, విగ్రహము, కలి, సంస్ఫోటము, సంగ్రామము, ఆహ వము, ఆజి, సమిత్తు, యుద్ధము, పెన కువ, జగడము, కయ్యము, బవరము, కలను, చివ్వ, అలము, పోట్లాట, అని, దురము, పోరు

**యోధుడు-** అస్త్రజీవి, అరభటుడు, ఉష్ణుడు, క్షిపకుడు, యోధ, భటుడు, కాలరి, కాల్బంటు, జోదు, బంటు, సిపాయి, దిట్ట, వేంటి, మొనగాడు, వడికాడు, ధీరుడు, వీరుడు, తెంపరి, ఎక్కటి, పోటరి, వాడిమగడు, బిరుదుబంటు

**రంకులాడి -** అసతి, ఇత్వరి, చెడిపె, స్వైరిణి, కులట, ధర్షిణి, పాంసుల, ధర్షణి, పుంశ్చలి, రంకుటాలు

**రంధ్రము-** కుహరము, సుషిరము, వివరము, బిలము, బెజ్జము, ఛిద్రము, నిర్వ్యథనము, రోకము, కన్నము, కలుగు, బొఱియ, లాగ, బొక్క, చిల్లు, తూటు

**రంపము-** క్రకచము, క్రకరము, కరగసము, కరపత్రము, పత్రదారకము, తాలాంకము, శాణము

**రక్షితము-** త్రాతము, త్రాణము, అవితము, గోపాయితము, గుప్తము

**రతము-** మన్మథ సంగరము, విషయము, హిండనము, మన్మథకేళి, శృంగారము, రహస్సు, మైథునము, సంభోగము

**రథము-** అరదము, తేరు, నేత్రము, శతాంగము, స్యందనము

**రసి-** స్రావము, పూయము, (చీము)

**రసీదు-** కరారునామా, ఋజునామా, చెల్లుచీటి (నీటిపన్నురసీదు - వారినామా)

**రాక్షసులు-** అసురులు, దనుజులు, దానవులు, దైత్యులు, నిశాచరులు, పలాశనులు సోకుమూకలు, సురద్విషులు, దైతేయులు, పూర్వదేవులు, రజనీచ రులు, శుక్రశిష్యులు, నక్తంచరులు, రక్క సులు వేల్పుదాయలు, పుణ్యజనులు

**రాగి-** తామ్రకము, శుల్బము, ద్వ్యషము, వరిషము, ఉదుంబరము

**రాచకురుపు-** రాచపుండు, రాజవ్రణము, మహావ్రణము

**రాజు-** ప్రభువు, పార్థివుడు, భూపాలుడు, భూవుడు, భూరమణుడు, మన్నీడు, మన్నియ, మన్నియడు, మన్నెరాయడు, మహీక్షితుడు, రా, ఱేడు, సామి, జన పాలుడు

**రాజ్యసభ-** శాశ్వత సభ, ఎగువ సభ, కేంద్ర స్థాయిసభ, రాష్ట్రాల పరిషత్తు, పరోక్ష ప్రతినిధుల సభ

**రాణి-** రాజ్ఞి, దేవేరి, ఏలికసాని, పట్టపుదేవి, మహిషి

**రారాజు-** రాజరాజు, రారేడు, చక్రవర్తి, సార్వభౌముడు

**రాత్రి-** నిశ, నిశీథిని, త్రియామ, క్షణద, క్షప, విభావరి, తమస్విని, రజని, యామిని, తమి, శర్వరి, అసుర, శ్యామ, మాపు, రే, రేయి, రాతిరి

**రాద్ధాంతము-** సిద్ధాంతము, సారాంశము, నిగ్గు, నికరము, కృతాంతము, సిసలు

**రాబందు-** అరిష్టము, రాపులుగు, కంకము, కంకణము, లోహపృష్టము, కాలపృష్ట ము, సుదర్శనము, బోరువ, భేరుండము

**రాయబారము-** దూత్యము, దౌత్యము, దూత కృత్యము

**రాహువు-** తమస్సు, స్వర్భానుడు, సైంహికే యుడు, విధుంతుదుడు, భుజగుడు, ఖండసరశువు, కృష్ణవర్త్మ, గ్రహము, తలగాము

**రుద్రాక్షము-** రుదురాక, రుదురక్క, శివప్రి యము, అక్షము, శర్వాక్ష

**రుధిరము-** ఎఱ్ఱి, కీలాలము, అస్రము, నెత్తురు, నెత్రు, రక్తము, శోణితము

**రెక్క-** గరి, గరుత్తు, పక్షము, ఛదము, తనూరుహము, నెరి, వాజము, పత్రము, రెట్ట

**రెట్టింపు-** ద్విగుణము, ఇబ్బడి, ఇమ్మడి, జంట, దంట, దుగ, జమిలి, రెంట, రెట్టి, ఇనుమడి, దువ

**రెప్ప-** కందెర, కనురెప్ప, దృక్ఛదము, నేత్రచ్ఛదము, పుటము, పక్ష్మలము

**రెల్లు-** ఇక్ష్వాలిక, ఇషిక, కాశము, గుంద్ర, కాండేక్షువు, చామరపుష్పము, లేఖనము, శారదము, శ్వేత చామరము

**రేఖ-** గీత, చార, రేక, బిరి

**రేగు-** అమ్లము, కంటకి, కోలము, గూఢఫలము, చండి, దృఢబీజము, బదరి, యుగకంటక, కర్కంధువు, స్నిగ్ధచ్ఛద

**రేలచెట్టు-** ఆరగ్వధము, వ్యాధిఘాతము, రాజకృక్షము, శంసాకము, ఆరేవతము, చతురంగుళము, సువర్ణకము

**రేవతి-** కడచుక్క, మీనురూపు రిక్క, పూష, అంత్య

**రైతు-** పంటకాపు, కర్షకుడు, కృషికుడు, కృషీవలుడు వ్యవసాయదారు, సేద్యగాడు

**రోకలి-** అయోగ్రము, గోకీలము, పేశలము, ముసలము, కండని, శంఖము, సంబ ము, గోకిలము

**రోగము-** జోరము, ఆమయము, ఉపతాపము, గదము, గరము, గ్లాని, తమో వికారము, భుజిష్యము, రుక్కు, రుజ, వ్యాధి (చూ॥ జబ్బు)

**రోహిణి-** బండి రిక్క, ఆత్మభువు, పద్మ యోని, ప్రాజాపత్య

**రౌతు-** అశ్వికుడు, అశ్వసారుడు, శవుతు, రాహుత్తుడు

**లక్క-** లాక్షము, రాక్షము, జతువు, అలక్తము, జతూక, జతుక, ద్రుమామయము, పలంకష, రంగమాత, కృమిజ

**లక్ష్మీదేవి-** పద్మాలయ, పద్మ, కమల, శ్రీ, హరిప్రియ, ఇందిర, లోకమాత, మా, రమ, మంగళ దేవత, భార్గవి, మాయ, మాధవి, లచ్చి, కలుముల జవరాలు, పచ్చవిల్తుని తల్లి,

**లత్తుక-** కుసుంభిక, యావకము, లక్తకము

**లవంగపుపట్ట-** త్వక్కు, త్వచము, ఉత్కటము, పత్రము, చోదము, వరాంగకము

**లవంగాలు-** శ్రీ పుష్పము, శ్రీ సంజ్ఞము, దీప్యము, కరావువు, దేవకుసుమము

**లవము-** భాజ్యము, భాజనీయము, (విభాజ్యము) హార్యము, (భాగింపబడు సంఖ్య)

**లేడి-** ఇఱ్ఱి, చీవము, పృషతము, ప్రియకము, మృగము, రంకువు, రురువు, రోహితము, వాతాయువు, వృజినము, శంబ రము, ఇఱ్ఱి, సారంగము, హరిణము, కందలి, కురంగము

**లొడితిలి-** లొడితి, జుట్టిలి, జుట్ట, జుత్త, జుత్తిలి, ప్రాదేశము

**లోకసభ-** కేంద్రస్థాయి సభ, దిగువసభ, అశాశ్వత సభ, ప్రజాప్రతినిధుల సభ

**లోభి-** కదర్యుడు, లుబ్ధుడు, పిశునుడు, కృపణుడు, మితంపచుడు, పిసినిగొట్టు

**వంకాయ-** వంగ, వార్త, వార్తాకువు, వార్తాకి, వార్తకము

**వంచకురాలు-** మాయలాడి, జగజంత, దాటకత్తె, జజ్జరకత్తె, టక్కరి, తక్కరి

**వంటకట్టె -** వంటచెరకు, ఇధ్మము, ఏధము, ఇంధనము, సమిధలు, చిదుగులు

**వంటవాడు-** సూపకారుడు, వల్లవుడు, ఆరాళికుడు, ఆంధసికుడు, సూదుడు, ఔదనికుడు, గుణుడు, పాచకుడు, బానసీడు

**వంటసాల-** బోనపుటిల్లు, వంటకొట్టము, సువారంపుటిల్లు, అట్టశాల,పాకస్థానము, బానసము, మహానసము, రసవతి

**వంతెన-** వారధి, సేతువు, అట్టెడ

**వంశము-**సంతతి, గోత్రము, జననము, కులము, అన్వయము, వంగసము, వంగడము

**వజ్రాయుధము-** హ్రాదిని, వజ్రము, కులిశ, భిదురము, పవి, భిదువు శతకోటి, దంభోళి, అశని, స్వరువు, భిత్తిక

**వట్టము-** నష్టము, తరుగు, దండుగు

**వట్టివేళ్ళు-** అభయము, సమగంధిక, వీరణ, దీర్ఘమూలము, ఉశీరము

**వడగల్లు-** అంబుఘనము, వర్షోపలము, పయోఘనము, ఆకాశ స్ఫటికము, మేఘాస్థి, మేఘకఫము, కరక

**వడ్రంగి-** వడ్లంగి, వడ్లవాడు, త్వష్ట, రధకారుడు, వర్ధకి

**వడ్లు-** అకృష్టము, తృణధాన్యము, నీవారము నివ్వరిధాన్యము, పాకి, శాలిధాన్యము

**వనము-** తోపు, తోట, ఆరామము, ఉద్యానము, వనిక, ప్రమదావనము, కుటపము

**వరగోగు-** కులక ప్రియము, గుడఫలము, గుల్మవినాశనము, పీలువు, బృహత్పీలువు, విరేచనఫలము

**వరుణుడు-** ప్రచేతనుడు, పాశి, నీటిఱేడు, యాదసాంపతి, అప్పతి, ప్రాచేతనుడు, ప్రచేతుడు, పడమటిదొర, వల్లెత్రాడు తాల్పు, నీళ్ళరాయడు, ఏటిబోటి మగల యెకిమీడు, నీటి యొడయడు, అపాం పతి, మొయిలు ఱేడు, మేఘాధిపతి, జడిస్వామి, మొసలి రైతు

**వర్తకుడు-** వైదేహకుడు, సార్ధవాహుడు, వ్యాపారి వణిజుడు, పణ్యాజీవుడు, ఆపణికుడు

**వర్షఋతువు-**క్రొక్కారు, ఘనాకరము, చాతకానందము, ప్రావృట్కాలము, తొలకరి, జలదాగమము

**వలయము-** వర్తులము, గుండ్రము, మండలము, కుండలము

**వసంతఋతువు-** ఆమని, ఇష్మము, కామ సఖము, కుసుమాకరము, మదనము, వసంతము

**వసారా-** పంచ, (పాక) పంచపాళి, పంచాది

**వస్త్రము-** పుట్టము, దువ్వలువ, చీరె, చీర, కోక, వలువ, ఆచ్ఛాదనము, వాసము, చేలము, వసనము, అంశుకము, అంబ రము, పటము

**వస్తాదు-** పహిల్మాను, మల్లుడు, జట్టి, పోటరి

**వాచాలుడు-** ప్రేలరి, ప్రలాపి, వాచాటుడు, వదరుబోతు, జల్పాకుడు

**వాది-** ఫిర్యాది, పూర్వవాది, వ్యాజ్యెగాడు

**వాన-** ఆసారము, మేఘపుష్పము, జడి, జల్లు వర్షము, వృష్టి తొలకరి

**వానకోయిల-**చాతకము, స్తోకకము, సారంగము

**వానపాము-** కించులుకము, వర్షాభువు, ఎఱ్ఱభూనాగము, గండూపదము

**వాము-** ఓమము, ఇందులేఖ, కారవి, ఖరాశ్వ, తీవ్ర, తురుష్క, దీవ్యము, మయూరము, యవని, యూకము, లోచమస్తకము

**వాయుదేవుడు-** శ్వసనుడు, స్పర్శనుడు, మాతరిశ్వుడు, సదాగతి, పృషదశ్వుడు, గంధవహుడు, గంధవాహుడు, అనిలుడు

**ఆశుగుడు-** సమీరుడు, నభస్వంతుడు, మారుతుడు, మరుత్తు, జగత్ప్రాణుడు, సమీరణుడు, వాతుడు, పవనుడు, అతి బలుడు, నీటి తాత, గాలి, కరువలి, తెమ్మెర, వలి, మరుతేరు

**వాల్మీకి-** పుట్టచూలి, పుట్టబుట్టువు, ప్రాచేతసుడు, బొరియచూలి

**విగ్రహము-** ప్రతిమానము, ప్రతిబింబము, ప్రతిమ, ప్రతియాతము, ప్రతిచ్ఛాయ, ప్రతికృతి, అర్చ, ప్రతినిధి

**విఘ్నేశ్వరుడు-** ఏకదంతుడు, గణాధిపుడు, వినాయకుడు, ద్వైమాతురుడు, గజాననుడు, లంబోదరుడు, హేరంబుడు (చూ॥ చేట చెవుల వేల్పు)

**విటుడు-** కోడెకాడు, ననుపుకాడు, మిండడు, జారుడు మిండగీడు, వ్యభిచారి

**విడుత-** విడత, తడవ, దఫా, వాయిదా

**విడువబడినది-** త్యక్తము, హీనము, విధుతము, సముజ్ఝితము, ధూతము, ఉత్సృష్టము

**విడ్డూరము-** వింత, తమాష, విచిత్రము, వెగడు

**వితంతువు-** విధవ, ముండమోపి, విశ్వస్త, అనాథ, ముసుగు

**విత్తుట-** ఉప్తి, (బీజా) వానము వికిరణము, నాటడము, విత్తడము, వెద

**వినయము-** అడ(ణ)కువ, అణుకువ, డిందు, మందట, నమ్రత, విధేయత

**వినిమయము-** మారకము, చెలామణి, వ్యతిహారము వైమేయము

**విపత్తు-** ఆపద, అపత్తు, బెడద, దెసచేటు, చేడ్పాటు, గొడవ, ఆర్తము, గోరము, ఇడుము, వెత, కస్తి

**విరజాజి-**జాజి, నవమల్లిక, నేపాళి, వాసంతి, సుకుమారి

**విరివి-** మెండు, సమృద్ధి, దండి, పుష్కలము, వెగ్గలము, అధికము

**విలుకాల్లు-** అస్త్రి, ధనుర్ధారి, ధన్వి, ధానుష్కుడు, నిషంగి

**విల్లు-** అస్త్రము, ఇష్వానము, కార్ముకము, కోదండము, చాపము,ధనువు, ధన్వము, ధర్మము, విలు, సింగాణి, సింగిణి

**విశాఖ-**త్వాష్ట్రము, ద్విదైవత్యము, చేటరిక్క, ఐంద్రాగ్నము, రాధ, కుమ్మరసారె చుక్క

**విశాలము-** భూరి, ప్రాయము, విగ్రహము, వితానము, విప్పు, విస్తారము, విరివిడి, విపులము, విశంకటము

**విషము-** విసము, అమృతము, శ్రీ, క్ష్వేళము, గరళము, గరదము, గరము, బాస టము, పాషాణము

**విష్ణువు -** దైత్యారి, చక్రపాణి, మాధవుడు, పీతాంబరుడు, శ్రీపతి, పుండరీకాక్షుడు, గరుడ వాహనుడు, అచ్యుతుడు, (చూ॥ సోకుమూకలగొంగ)

**విసనకఱ్ఱ-** చామరము, సురటి, వింజామరము, వీజన, వ్యంజనము, వీవన, వీచోపు

**విహారము-** వాహ్యాళి, షికారు, వయాళి, వయ్యాళి, పరిక్రమము, పచారు

**వీణ-** ఘోషవతి, తతము, వల్లకి; విపంచి, విపంచిక

**వీణానాదము-** ప్రక్వాణము, ప్రక్వణము, నిక్వణము, నిక్వాణము, క్వణము

**వీరముద్రికలు-** వీరమద్దళము, వీరమద్దెలు, వీరమద్దియలు

**వీర్యము-** ఇంద్రియము, కలము, రేతస్సు, గుణము, శుక్రము, శుక్లము

**వృత్తాంతము-** చరిత్రము, ఉదంతము, ప్రవృత్తి, వార్త

**వెండి-** కలధౌతము, దుర్వర్ణము, నిష్కము, ఖర్జురము శుక్లము, శ్వేతము, రూప్య ము, రజతము, చంద్రము

**వెండితెర-** (సినిమా) శనామణి, సుడామడ, చలన చిత్రము

**వెండ్రుకలు-** అంగజములు, అలకములు, కేశములు, కురులు, చికురములు, నెఱులు, శిరోరుహములు, కచములు

**వెట్టి (చాకిరి)-** అమిడి, అమంజి, వట్టి(చాకిరి)

**వెదురు-** వంశము, త్వచిసారము, వంశము, శతపర్వము, యవఫలము, వేణువు మస్కరము, తేజనము, కంటకము, సతీలము, తృణధ్వజము

**వెదురుగణుపు-** గ్రంధి, గునుపు, పర్వము, పరువు, (బుడిపి)

**వెన్న-** గవీనము, దధిజము, నవనీతము, నవోద్ధృతము, మంధజము, మంధసారము, హైయంగవీనము, తక్రసారము, సారజము, మిసిమి

**వెన్నెముక-** అనూకము, కశేరువు, కోలెమ్ము, నిట్టెము, నెట్టిమ్ము, వెన్నుపూస

**వెఱ్ఱివాడు-** అపస్మారి, ఉన్మత్తుడు, తిక్క, వెంగలి, వెంబరవిత్తు, వెకలి, వెడగు, వేదుఱు

**వెల-** ఖరీదు, ధర, విలువ, మూల్యము, శుల్కము, అర్ఘువు

**వెలగ-** ఆమ్లఫలము, కపిత్థము, తక్రభిత్తు, దంతశరము, దధిత్థము, దధిచ్ఛత్రము, దృఢఫలము, పుష్పఫలము, మాలూ రము, లింగవర్ధనము, సురభిచ్ఛదము, కరభవల్లభము

**వెలిగారము-** కనకక్షారము, టంకణము, ద్రావణకము, రంగక్షారము, రసఘ్నము, రసశోధనము, లోహశుద్ధిదము, టంగరము

**వెలితి-** కొరత, లోటు, తరుగు, కొదువ

**వెల్లుల్లి-** గృంజనము, భూతఘ్నము, రాహూచ్ఛిష్టము, లశునము లోహితము, శుక్ల మూలము, సోనహము, జుగుప్సితము

**వేగము-** శీఘ్రము, త్వరితము, లఘువు, అరము, సత్వరము, చపలము, అవిలం బితము, ఆశు, వేగిరము, త్వర, వేగ, వడిగ, గ్రక్కున, గ్రన్నన, గొబ్బున, దిగ్గున వైళము

**వేటకుక్క-** శ్వానము, జాగిలము, విశ్వకద్రువు జోడంగి, జోనంగి, జోనగి, వేపి

**వేట-** ఆఖేటము, ఖేటము, మృగము, వెంట

**వేడి-** సెగ, సెక, చురుకు, సంతాపము, ప్రతాపము, నిదాఘము

**వేదము-** అమ్నాయము, ఋషి, ఛందస్సు, నిగమము, తొలిపలుకు, ప్రాబలుకు, ప్రామినుకు, ప్రాజదువు, మినుకు

**వేప-** సర్వతోభద్ర, మాలకము, పిచుమర్దము, పారిభద్రకము, శుకప్రియము, శుభ్రదము, కైడర్యము, కైటర్యము

**వేరుపనస-** బహిర్గంధి, మహాఫలము, మూలఫలము, మహాస్వాదువు

**వేల్పు పెద్ద-** అంచరౌతు, తమ్మిచూలి, తగవుల జడదారి తండ్రి, తమ్మిగద్దెరేడు,

ఇంచువిలుతునియన్న బొమ్మ, జేజేలమిన్న, నలుమొగంబుల వెల్పు, నలువ, తాత (చూ॥ బ్రహ్మదేవుడు)

**వేవిళ్ళు-** చిట్టుములు. బయ్యంకలు, బైకలు, బయికలు, దోహదము

**వేశ్య-** గణిక, రోవెలది, ఆటవెలది, భోగిని, వాడవదినె, వెలయాలు, వారకాంత, గ్రామణి, సాని, వేద్కకత్తె

**వేశ్యావాటిక-** భోగమువాడ, సానివాడ, వేశ్యము

**వైడూర్యము-** వైదూర్యము, కేతురత్నము, బాలరాజము, ప్రావృష్యము, బాలసూర్యము

**వైతాళికుడు-** ప్రబోధకుడు, ఉద్బోధకుడు,

**వైద్యుడు-** వెజ్జు, జైవాతృకుడు, దోషజ్ఞుడు, భిషక్కు, భిషజుడు, రోగహారి, అగదంకారుడు

**వైశాల్యము-** వితానము, పరపు, విరివి, విస్తీర్ణము వింగడము. పరిణాహము

**వైశ్యుడు-** ఊరుజుడు, ఆర్యుదు, భూమిస్పృశుడు, విశుడు, గుప్త, కోమటి, బచ్చు, బేరి, శెట్టి, శ్రేష్ఠి

**వ్యాజ్యము-** తగవు. వివాదము. పెనకువ, దావా

**శంఖము-** అబ్జము, కంబువు, చిందము, దరము, బూరగొమ్ము, వలమురి, శుక్తి, సంకు, కూత్తకైదువు

**శచీదేవి-** ఇంద్రాణి, పులోమజ, పౌలోమి, శతావరి, చారుధర ఐంద్రి

**శతభిషము-** నూరు చుక్కల ప్రోవు, నీటరేని రిక్క, ప్రాచేతము, వారుణము

**శత్రువు-** రిపువు, వైరి సపత్నుడు, ద్విషత్తు, ద్వేషణుడు, దుర్హృదుడు, ద్విట్టు, విపక్షుడు, అమిత్రుడు దస్యువు శాత్రవుడు, అరాతి, ప్రత్యర్థి, పరిపంథి, అసహనుడు, ద్వేషి, జిఘాంసువు, విరోధి, ప్రత్యవసాత, పరుడు

**శనగలు-** సెనగలు, చణకము, సతీనము, హరేణువు

**శని-** మందుడు, కాళుడు, ఛాయాపుత్రుడు, అర్కజుడు, సౌరి, సూర్యపుత్రుడు, మొదలిగాము పట్టి, పంగుడు, సౌరి

**శనివారము-**మంద వారము, స్థిరవారము,

**శపథము-** ప్రతిజ్ఞ, ప్రతిన, పణము, పరిగ్రహము, ప్రత్యయము, ప్రమాణము, సత్యము, సమయము, ఆన, ఒట్టు, బాస,

**శరదృతువు-** పంటకారు, వెన్నెలకారు, శరత్కాలము, జలదక్షము

**శరీరము-** గాత్రము, వపుస్సు, వపువు సంహననము, వర్ష్మ, విగ్రహము, కాయము, దేహము, మూర్తి, తనువు, మే, మై, మయి, మెయి (చూ॥ ఒడలు)

**శర్కర-** ఉపల, కలకండ, కండ చక్కెర, ఖండశర్కర, పంచదార, పులకండము, రసాల, సికత, సీత

**శవవాహనము-** ఖటి, ఖట్టి, ఖట్టిక, పాడె, కంపరము, ఖడువు, ఖాటిక

**శస్త్రము-** ఆయుధము, ప్రహరణము, పోరుముట్టు, పోటుముట్టు, దళపము

**శాసన సభ-** విధాన సభ, ప్రజాసభ, అశాశ్వత సభ, (ప్రజా) ప్రతినిధుల సభ

**శిరోరత్నము-** చూడామణి, తలమానికము, శిరోభూషణము

**శిల-**పాషాణము, ప్రస్తరము; గ్రావము, ఉపలము, అశ్మము, దృషత్తు, జాయి, కల్లు

**శివుని విల్లు-** అజకవము, అజగవము, అజ గావము, (అజీగ(గా)వము), పినాకము

**శిశిర ఋతువు-** చలికారు, దస్రము, శైషము, శీతకాలము, సీతము

**శిశువు-** పోతము, డింభకము, పృధుకము, బిడ్డ, నిసుగు, నిసువు, పిల్ల, కుఱ్ఱ, బుడత, పాప, కూన

**శిశ్నము-** ఉత్తమాంగము, కామాంకుశము, జఘన్యము, ధ్వజము, మేఢ్రము, మేహనము, లాంగలము, పురుషాంగ ము, చర్మదండము, శేఫము, సాధనము, కామ కోల, చుల్లి, బుల్ల, చుల్ల

**శిష్యుడు-** చట్టు, అంతేవాసి, ఛాత్రుడు, సిసువుడు

**శుక్రుడు-** దైత్యగురువు, భార్గవుడు, సోకు టొజ్జ కవి, భృగువు, సితుడు కావ్యుడు

**శుభము-** శమ్, శివము, అరిష్టము, రిష్టము, భద్రము, కల్యాణము, భావుకము, భవికము, భవ్యము, శస్తము, లగ్గు, బాగు, మేలు, లెస్స, మంగళము,

**శూద్రుడు-** వృషలుడు, జఘన్యుడు, జఘ న్యజుడు

**శూన్యము-** ఉళక్కి, హుళక్కి, వట్టిది? రుత్త, ఉత్త(ది)

**శూలము-** బల్లెము, భల్లము, ఈటె, మొనవాలు, మొనకైదువు

**శ్మశానము-** కాడు, కామల, ఒలుకులమిట్ట, మసనము, వలికి, వల్లకాడు మరుభూమి, రుద్రభూమి, ప్రేతభూమి, అంతశయ్య, కామలము

**శ్రమ-** అలయిక, బడలిక, అలపు, సేద, వడ, అలసట

**శ్రవణము-** కరివేల్పు రిక్క, మురజిత్తు, శ్రీకాంతము, శ్రీశము, హరి

**శ్రాద్ధము-** తద్దినము, ప్రత్యాబ్దికము, (పైత్రము, పైతృకము - తండ్రిది)

**శ్రీ శైలము-** శ్రీగిరి, శ్రీనగరము, శ్రీఘట్టము, శ్రీ పర్వతము, సిరిగట్టు, సిరిగుబ్బ

**శ్వేత కాంభోజిక-** తెల్ల గురిగింజ, శిఖండిని శ్వేతపాకి,

**శ్వేత ద్వీపము-** జంబూద్వీపము, తెల్లదీవి

**షండుడు-** ఆడంగి, క్లీబుడు, పండుడు, పేడి, కొజ్జా, ఊబ, శంరుడు ఉదుంబ రుడు, అన్నగళ, నపుంసకుడు

**సంకీర్ణము-**

**మినుములు-** ఉద్దలు, మాషకము, ధాన్య మాషము

**మినుములు పండునేల-** మాష్యము, మాషీణము

**ముంజూరు-** వలభి, వడభి

**ముక్కుతో మాట్లాడువాడు-** మున్మిలుడు, మున్మినుడు

**ముఖ్యము-** వర్యము

**ముగ్గు-** రంగవల్లి, పరిక, మ్రుగ్గు

**ముడుపులువేయునది-** హుండి, హుండీ, ఉండిగ

**ముద్ర-** ముద్దర, అచ్చు

**ముసుగు(వు)-** అవకుంఠ(న)ము, ఆచ్ఛాద నము, కప్పు

**ముహూర్తము-** మూరుతము, లగ్గము

**మూగ-** ముంగ

**మూలవ్యాధి-** అర్మము, అర్మస్సు

**మృతాశౌచము** - మైల, సూతకము, శావము, మృతకము

**మెదడు-** మస్తిష్కము, గోదము, క్రొవ్వు

**మెరుపుతీగ-** విద్యుల్లత, విద్యుల్లేఖ, శంపాలత

**మేషాదిరాసుల ఉదయము-** లగ్గము, లగ్న ము, లగనము

**మైదానము-** ఈరిణము, ఇరిణము

**మైల-** అశౌచము, మయిల

**మొగలేరు-** సువర్ణముఖి, సువర్ణముఖరి

**మొలనూలు-** కటిమాలిక, కటిత్రము, సప్తకి, కాంచి, మేఖల

**యక్షగానము-** బయలాట, వీధినాటకము

**యమునానది-** కాళింది, శమన, స్వన, సూర్యతనయ

**రాక్షసులతల్లి-** దితి, దైత్యమాత

**రాజకుమారుడు-** భర్తృదారకుడు, యువరాజు

**రాజకుమారి-** భర్తృదారిక

**రాసిలోమూడవభాగము-** ద్రేక్కము, ద్రేక్కా ణము, ద్రేష్కాణము

**రాహువు-** అకాయుడు, కలాదుడు

**రెండుక్రోసులదూరము-** గవ్యూతి, గవ్యూ తము

**రేపనుయోచనలేనివాడు-** అశ్వస్తనుడు, అశ్వస్తనికుడు

**రోలు-** కండని, ఉలూఖలము

**లంచము-** అమిషము, ఉపచారము

**లౌకికము-** ఐహికము, ఐహలౌకికము తౌక్యము

**వడ్డీవ్యాపారము-** కుసీదము, వార్ధుష్యము

**వడ్డీవ్యాపారి-** వార్ధుషి, వార్ధుషికుడు, కుసీదుడు

**వడ్లుపండునేల-** శాలేయము, వ్రైహేయము

వత్తి- వర్తి, వటి, దశ

**వలయాకార స్త్రీ పురుష నృత్యము-**రాసము

**వలసవచ్చినవాడు-** కాందిశీకుడు, శరణార్థి

**వలె-** బలె, పోలె, వంటి

**వాదశీలి-** వైతండికుడు (ప్రాంవాదికుడు)

**వానపాము-** ఏటిక, ఎఱ్ఱ

**వానప్రస్థుడు-** అడవినెలవరి

**వామనుడు-** త్రివిక్రముడు, బలిధ్వంసి

**విటుడు-** ఏకవిద్యుడు, సహాయుడు(ద రూ)

**విదూషకుడు-** హాస్యకాడు, సహాయుడు

**వినదగనిది-** (తనలో) అశ్రావ్యము, స్వగతము

**విద్యార్థి-** అధ్యేత

**విభూతిరేఖలు-** త్రిపుండ్రము

**విష్ణుదేవుని గద, కత్తి విల్లు, శంఖము-** కౌమోదకి, నందకము, శారఙ్గము, పాంచజన్యము

**విస్తరాకు-** విస్తరి, ఆకు, కుట్టుడాకు

**వీపు-** వెన్ను, పృష్ఠము, పుత్త

**వీరణము-** వీరాణము, డంగురము, రుంజ

**వెండ్రుకల తెలుపు-** నరపు, పలితము

**వెండ్రుకలను నలువుజేయునది-** అంజనకేశి, హట్టవిలాసిని

**వెట్టిపనికాడు-** ఆజువు, విష్టి

**వేషము-** వేసము

**వేసవారము-** వేశవారము, సాంబారుపొడి

**వ్యాజ్యపుపిలుపు-** అహ్వాయము

**శకునపక్షి-** సకినంపుపుల్గు, పైడికంటి, కనకాక్షి

**శకునము-** సకినము, సగినము

**శాతము-** సాతము

**శాలువు-** పాలువు, సాలుక

**శాబ్దికుడు-** వైయాకరణుడు

**శాసనకారులు -** శాసనకృత్తులు, శాసన కర్తలు

**శిల్పి-** అశ్మికుడు, కలాపుడు, స్థపతి, అశ్మకు ట్టకుడు

**శిల్పివులి-** అశ్మకుట్టకము, చీర్ణము

**శివుని జడముడి-** కపర్ద(క)ము జూటము

**శుక్రవారము-**భృగువాసరము, కులవారము

**శుక్లపక్షము-** చాంద్రము, తెలిపక్కము

**శ్రామికచీమ-** కూలిచీమ

**శ్రీరాముడు-** దాశరధి, కౌసల్యానందనుడు

**సంకలితము-** కూర్చబడినది

కలగాపులగము))

**సంకెళ్ళు-** శృంఖలములు, బేడీలు, గొడియ, అరదండ(డా)లు, అందువు, గొలుసులు, నిగళము

**సంచి-** గోతాము, గోనె, వట్నము, గోణి, జోలె, తిత్తి, పట్టా, గోతము

**సంతకము-** దస్తూరీ, చేవ్రాలు, వ్రాలు, వ్రాత, ఒప్పము

**సంపంగి-** సంపగి, సంపె(ం)గ, సంపగియ, కాంచనము, చంపకము, చాంపేయము, పుష్పేందువు, శుభగము, సురభి, స్థిర, పుష్పము, హేమాంగము

**సంప్రదాయము-** ఆచారము, అనుష్ఠానము, ధర్మము, ఆచరణము, ప్రచరము

**సంవత్సరము-** వర్షము, వత్సరము, ఏడు, వత్సము, ఏడాది, సాలు, మాసలము

**సంశయము-** అనుమానము, అంతకము, త్రుటి, శంక, ద్వాపరము, యుతకము, సందియము, సందేహము

**సంస్థ-**సంఘము, పరిషత్తు, సమితి, సదస్సు

**సకిలింత-** హేష, హ్రేష, హ్లేష

**సత్తు-** సీసకము, కుష్ఠకము, బీజము, సీసము

**సత్యము-** నిజము, నిక్కువము, నిక్కము, తిధ్యము, బుతము, యధార్థము, నిలువరము, యధాతధము

**సత్రము-** సత్తరువు, ధర్మకాల, ప్రతిశ్రయము, మండపము, లంగరుఖానా

**సన్నెకల్లు-** గుండ్రాయి, సన్నె, దృషత్తు, శూన, షేషణి, సన్నియ, సనె

**సబ్బు-** అటకలి, చవురు, చౌరు

**సభ-** సమజ్య, పరిషత్తు, గోష్ఠి, సమితి, ఓలగము, కొలువు, సదము, సంసతి, సంపత్తు, పడసాల

**సభాపతి-** సభాధ్యక్షుడు, సభానాయకుడు, సదసస్పతి, కొలువుపెద్ద, కొలువు తల మానిసి

**సమస్తము-** విశ్వము, అశేషము, నిశ్శేషము, సర్వము, అఖిలము, సమగ్రము, సకలము, అఖండము, సంపూర్ణము, అనూనము, అవికలము

**సమీపము-** నికటము, ఆసన్నము, సదేశము, అభ్యా(శ)సము, వసధము, సవేశము, ఉపకంఠము, అన్తికరము, అభ్యర్ణము, అభ్య గ్రము, అభిశము (చూ॥ దగ్గర)

**సముఖము-** ముందట, ఎదుట, మ్రోల, ముంగల, సమక్షము

**సముద్రము-** అబ్ధి, అకూపారము, పారావారము, ఉదధి, సింధువు, అర్ణవము, రత్నాకరము, జలనిధి, పాథోనిధి, మున్నీరు, కడలి, సంద్రము పాథోధి, జలధి, జలనిధి

**సమూహము-** నివహము, సందోహము, విసరము, స్తోమము, నికరము, వ్రాత ము, సంఘాతము, సముదాయము, బృందము, నికురుంబము, వితానము, ప్రకరము, పటలము, చక్రము, జాలము, బారు, దండు, దళము, గుమి, కూటు, గుంపు, మూక, మంద

**సమ్మె-** కట్టు కట్టు, సమ్మియ, బందు, స్తంభనము అవష్టంభము

**సరస్వతీ దేవి-** బ్రాహ్మి, భారతి, భాష, వాక్కు, వాణి, శారద, వలుకుల వెలది, నలువ రాణి, నలువపడతి

**సర్పము-** భుజగము, భుజంగము, విషధరము, చక్రి, వ్యాళము, సరీసృపము, కుండలి, చక్షుశ్రవము, కాకోదరము, ఫణి, దర్వీకరము, దందశూకము, ఉరగము, పన్నగము, భోగి, పవనాశము, లేలిహానము, ద్విరసనము, వ్యాళము, కుంభీనసము, పాము, పడగదారి, గాలి మేతరి, విషదారి, చిల్వ, కనువినికి, చిలువ

**సవతి తల్లి కొమార్తె-** వైమాత్రేయి

**సవతి తల్లి కుమారుడు-** విమాతృజుడు, వైమాత్రేయుడు, వైమాత్రుడు

**సాంవత్సరికము-** ఏడుడి, ఆబ్దికము

**సాటి-** ఉద్ది, జత, జోక; జోడు, దీటు, సమము ధర్మము, ప్రతి, మాఱు, తుల్యము, సదృశము, సమానము, ఎన

**సాన-** ఒఱగల్లు, కటీక, కషము, నికషము, శాణము

**సామెత-** సాటువ, చాటువ, నానుడి, లోకోక్తి, చాటువు, సామ్యోక్తి

**సారథి-** నియంత, యంత, ప్రాజిత, సూతుడు, క్షత్త, దక్షిణస్థుడు, రథకుటుంబి, చాతురికుడు

**సాలెపురుగు-**లూత, తంతువాయుము, ఊర్ణ నాభము, అష్టాపదము, శలక, చెలగము, చెలది

**సాళువా(పంట)-** సారువా, సాల్వా, సాళువ, దాళ్వా, దాళువ

**సింహము-** జడలమెకము, ఏనుగుల గొంగ, తెల్లడాలు మెకము, తెరనోటి మెకము, సింగము, బొబ్బ మెకము, మృగేంద్రము, హరి, పంచాస్యము, హర్యక్షము, కేసరి, జగరిపువు, మృగాధిపము, కంఠీరవము, పింగదృష్టి

**సిగ్గు-** హ్రీ, త్రప, వ్రీడ, లజ్జ, నాన, సిబ్బితి, పుచ్ఛటీక, బిడియము, పుయిలోట,

**సిలాజిత్తు-** అశ్మజతువు, అగజము, గుగ్గులము, గైరికము, అశ్మలాక్షము, పాషాణ జము, శిలామలము, శిలావ్యాధి, శిలాస్వేదము, శైల ధాతుజము

**సివంగి-** తరక్షువు, సివ్వగి, చివగి చివ్వగి

**సివము-** సిగము, ఆవేశము, పూనకము, శివము

**సిస్తు-** సిద్ధాయము, కరము, కప్పము, పన్ను

**సుంకము-** కప్పము, అరి, భాగధేయము, శుల్కము, రుసుము

**సుడిగాలి-**చక్రవాతము, రజశ్చక్రము, వాతూలము, వాతావర్తము, సురకరువలి, సురగాలి

**సుదర్శనము-** చుట్టువాలు, సుడివాలు, వట్రువాలు, బటువువాలు, వేయంచు లవాలు, చక్రము, చక్రాయుధము, కడిదలుగు, చుట్టుగైదువు, బటువు కైదువు, బటువడిదము, బటువు గత్తి, సుడికత్తి, సుడియడిదము, చుట్టలుగు

**సుద్ద-** ఖటి(క)ని, కఠినిక, ఖడి, ధవల మృత్తిక, పాకశుక్ల, వర్ణిక, శ్వేత(సిత) ధాతువు

**సూది-** కుట్టుసూది, ఆరె, సూచి, సూచిక సీవని, కంటాణి, కంటాళము,

**సూక్ష్మతరము-** తనీయము, అణీయము. అల్పీయము అల్పతరము, అల్పాల్పము

**సూక్ష్మదర్శని-** అణుదర్శని, గుణీకృత దర్శని

**సూక్ష్మతమము-** అణిష్ఠము, అల్పిష్ఠము

**సూర్యుడు-** అర్యముడు, ఆదిత్యుడు, ద్వాదశాత్ముడు, దివాకరుడు, భాస్కరుడు,

అహస్కరుడు, బ్రధ్నుడు, ప్రభాకరుడు, వివస్వంతుడు, హరిదశ్వుడు, వికర్త నుడు, అర్కుడు, మిహిరుడు, అరుణుడు, తరణి, మిత్రుడు, చిత్రభానుడు, విరోచనుడు, విభావసువు, గ్రహపతి, త్విషాంపతి, అహర్పతి, భానుడు, సవిత, రవి, కర్మసాక్షి, జగచ్చక్షువు, త్రయీత నువు, ప్రద్యోతనుడు, దినమణి, పద్మినీవల్లభుడు, హరి, జగము, చుట్టము, జగముకన్ను వెడివేలుపు, ప్రొద్దుతోవల రాయడికాడు, పవలుసేయు, వేలుపు, పచ్చగుఱ్ఱాల వజీరుడు, వేడివెలుగు, రేవెల్లుజోడు, జంటారు మేనులస్వామి, చీకటిగొంగ, చదలుమానికము, ఏడుగుఱ్ఱముల తేజెక్కుజోదు, జక్కవలతేడు, వేయిచేతుల తేడు, వెలుగుల యెకిమీ డు, మింటితెరువరి

**సేన**- ధ్వజిని, వాహిని, అనీకిని, చమువు, వరూధిని, బలము, సైన్యము, చక్రము, అనీకము, మొన, వీడు, కటకము, దండు, దళము

**సేనాపతి**-దండనాయకుడు, పడవాలు, పడాలు, బలాధ్యక్షుడు, సేనాధిపతి, వాహినీ పతి, వరూధినీ ధవుడు, దణి, దండముఖుడు, దణాపెద్ద, సైన్యాధ్యక్షుడు

**సేవ**- ఊడిగము, ఊడియము, కొల్వము, కొలువు, చాకిరి, ఉపచారము, దాస్యము, పరిచర్య, శుశ్రూష

**సేవకుడు**- కింకరుడు, కుర్వంతుడు, దాసుడు, పరిచారకుడు, భటుడు, భృత్యుడు, నవుకరు, నౌకరు, గులాము, డింగరుడు. బంటు, బానిసీడు, లెంక, వరవు, వరవుడు, కడారుడు

**సొంటి**- ఇంద్రభేషజము, ఊషణము, కంద రము కటుకము, కటు భద్రము, కతూత్కటము, కఫారి, నాగరము, మహౌషధము విశ్వభేషజము. శుంఠి

**సొరంగము**- బిలము భూగృహము, సురంగము, నేలమాలె

**సోకుమూకల గొంగ**- సోకుల సూడు, రక్కసులగొంగ, చుట్టుత్రాలుదారి, సుడివాలు జోదు, లచ్చిమగడు, సిరిపుట్టుముద్దాల్పు, సిరిదొర, తమ్మికంటి, పక్కిడాలురేడు, గరుడి రౌతు, తాతతండ్రి, సంకుదా రి పచ్చవిల్తుని తండ్రి (చూ॥ విష్ణువు)

**సోమరి**- అలసుడు, అలస్యుడు, అనుషుడు, మందుడు, శీతకుడు, స్వైరుడు

**స్నానము**- మజ్జనము, గాహనము, అవగాహ(న)ము, మునుక, తానము, నీరా టము, బుడక, మునక

**స్తంభము**- కంభము, కంబము, గుంజురాడు, నిట్రాడు, మొక్కరము(రాట)

**స్త్రీకి తోడబుట్టిన వాని కొడుకు**- భ్రాతృవ్యుడు మేనల్లుడు, మేనయల్లుడు

**స్త్రీ**- అబల, యోష, నారి, ప్రతీపదర్శని, వామ, వనిత, మహిళ, అంగన, భీరువు, కామిని, ప్రమద, మానిని, కాంత, లలన, ముద్దియ, మగువ, సుదతి, పడతి, అతివ, ఉగ్మలి, ఇంతి, తొయ్యలి, నవల, నాతి, పైదలి, ఉవిద, చేడియ, అన్నువ, వెలది, బోణి, బోటి, చాన, తెఱవ, లేమ, ఎలనాగ, నెలత, పొలతి, సీమంతిని

**స్త్రీలు**- సిగ్గిడి (సిగ్గులేనిది) సిగ్గరి, సిగ్గరికత్తె సిబ్బితికత్తె (సిగ్గుగలది) చండి, భామిని, కోపన (కోపముగలది) గచ్చురాలు పాన్నికొమ్మ, జాళువాబొమ్మ (యోగ్యురాలువలెనటించునది) వెంబర. ప్రల్లదురాలు(దుష్టురాలు) పెడసరకత్తె, పాలసు రాలు (మూర్ఖురాలు)

గద్దరి (దిట్టతనముగలది) కట్టడి. (కరిను రాలు) బంకెత. లుబ్ధ (లుబ్ధురాలు) స్వాధీన పతిక, వాసక సజ్జిక, విరహోత్కంఠిత, ఖండిత, కలహాంతరిత, విప్రలబ్ధ, ప్రోషిత భర్తృక, అభి సారిక (నాయికలు)

**స్తుతి-** వము, స్తవము, స్తోత్రము

**స్నేహము-** ప్రేమ, ప్రియము, హార్దము, సాంగత్యము, మైత్రి, నెయ్యము. నేస్తము, నేయము, నెయ్యమి, నెమ్మి, నెమ్మిక, పొందు, మాలిమి

**స్వతంత్రుడు-** ప్రావృతుడు, స్వైరి, స్వచ్ఛనుడు,

**స్వర్గము-** ఖము, త్రిదివము, త్రిదశాలయము, త్రివిష్టపము, దివము, నాకము, వినుప్రోలు, వేల్పుటెంకి, దివి

**స్వర్ణకారుడు-** అగసాలె వాడు, నాడింధముడు, రుక్మకారుడు, కంసాలి, కలాదుడు

**స్వాతి-** కెంపు సవతు రిక్క, కరువలి రిక్క, అనిలము, సమీరణము

**హంస-** శ్వేత గరుత్తు, చక్రాంగము, మాన సౌకము, మానసౌకసము, అంచ, తెలిపిట్ట, నల్వతేజి

**హంసాధిరూఢ -** హంసారూఢ, హంసవాహన, హంసయాన, హంస గామిని (చూ॥ సరస్వతి)

**హంసి-** హంసిక, చక్రాంగి, వారట, వరట, (ఆడుహంస)

**హత్య-** వధ, ఖూనీ, సంహరణము, సంహారము, మారణము, శ్రధనము, సూదన ము, హననము

**హర్షము-** ఆనందము, మోదము, ప్రీతి సుఖము, సంతసము, సమ్మదము, ప్రమదము, శర్మ, హాళి, అరుసము

**హస్త-** అర్క- సవిత, హస్తము. సావిత్రము, కయిసాటి చుక్క

**హస్తినాపురము-** కరిపురము, ఇభపురము, గజపురము

**హారతి-** ఆరతి, నివ్వాళి, నివాళి, నివాళిక,

**హారము-** భాజకము, హీరకము, విభాజకము, (భాగించు సంఖ్య)

**హాలాహలము -** హాలహలము, హాల హాలము, హహలము, కాలకూట మను విషము

**హిమాద్రి-** తుషారాద్రి, తుహిన శైలము, శీత నగము, అద్రి రాజము, మంచుకొండ, చలిమల, వలిదిబ్బ, వలిమల

**హృదయము-** ఎద, ఎడద, డెందము, ఉల్లము, చిత్తము, స్వాంతము, చేతము, మనస్సు, చేతస్సు

**హృద్రోగము-** హృదయ రోగము, హృద యవ్యాధి, హృదయ జ్వరము, గుండె జబ్బు

**హేమంత ఋతువు-** మంచుకారు, హేమం తము, హేమము, మంచుకాలము,

**హోలీ పండుగ-** హోళి, హోలిక; వసంతోత్సవము, మన్మథోత్సవము, కామదహ నోత్సవము, హోలాక

**హ్లాదము-** సంతోషము, ఆనందము, ఆహ్లాదము, ప్రహర్షము, ప్రమోదము





# వ్యుత్పత్త్యర్థములు

**అంకకాడు** - పట్టుదల కలవాడు (చలమరి) కళంకము కలవాడు (చంద్రుడు-కళంకి)

**అంకకారుడు** - ఆటలలో గెలుపును నిర్ణయించు అధికారి (మొనగాడు)

**అంకగణితము** - సంకలన వ్యవకలన భాగహారాదులను అంకెలలో తెలుపు శాస్త్రము (అంకవిద్య)

**అంకపత్రము** - అధికారముద్ర కల కాగితము (ప్రభుత్వ సీలు కలది-స్టాంపు)

**అంకశాయి** - ఒడిలో నిద్రించువాడు (శిశువు)

**అంకావతారము** - పూర్వాంకముతో విడిపోవకయే ఉత్తరాంకము అవతరించుట

**అంకాస్యము** - పూర్వాంకము తుదనున్న పాత్రములచే ఉత్తరాంకార్థము సూచింపబడుట (అంకముఖము)

**అంకితము** - గుర్తువేయబడినది, కృతి ఈయబడినది

**అంకురము** - కానబడునది (గింజ మొలకరూపమున - మొలక)

**అంకురార్పణము** - అన్నప్రాశన, ఉపనయన, వివాహాది శుభకర్మములకు తొలుత నాచరించెడి కర్మము

**అంకుశధారి**-అంకుశమను నాయుధమును పట్టెడువాడు (మావటీడు)

**అంకుశము** - దీనిచే ఏనుగునకు గుర్తుపడును (అంకుసము-సృణి)

**అంకుశముద్ర** - చేతి వ్రేళ్ళతో అంకుశాకారముగ పట్టెడిముద్ర

**అంకుసవుమూర్తి** - అంకుశాకారము గల మూలానక్షత్రము (సోకుచుక్క)

**అంక్యము** - కరకకాయవంటి యాకారము గల్గి తొడమీద నుంచుకొని వాయింపబడునది (మద్దెల)

**అంగజ** - దేహమున బుట్టినది (కూతురు)

**అంగజము** - దేహమునందు బుట్టినది (రోగము-మత్తు) దేహమునుండి పుట్టినది (వెంట్రుక, చెమట, గోరు, మొ )

**అంగజన్ముడు** - దేహమున బుట్టినవాడు (మన్మధుడు, కొడుకు)

**అంగజుడు** - దేహమున బుట్టినవాడు (మన్మధుడు, కొడుకు)

**అంగదట్టము** - స్త్రీలు చీరలోపల కట్టుకొనెడు బట్ట (లంగా, పరికిణీ)

**అంగదము** - అవయవమును రక్షించునది (బాహుపురి, కేయూరము)

**అంగన** - చక్కని అవయవముల అమరిక గలది (అందగత్తె)

**అంగభవము** - శరీరమున బుట్టినది (నెత్తురు, గోరు, చెమట, మొ )

**అంగభవుడు** - చూ అంగజన్ముడు

**అంగమొలవేలుపు** - దిసమొల గల దేవుడు (శివుడు - దిగంబరుడు)

**అంగరకా** - అవయవములను కాపాడునది (చొక్కా)

**అంగరాగము** - దీనిచే శరీరము రంజిల్లును (చందనాది పరిమళ ద్రవ్యము)

**అంగరుహము** - శరీరమున మొలచునది (రోమము)

**అంగరేకు** - చూ అంగరకా

**అంగలేపము** - శరీరమునకు పూసికొను పరిమళద్రవ్యము (చందనము - అంగరాగము)

**అంగవికలుడు** - అవయవ లోపము కలవాడు (అవిటివాడు)

**అంగవిక్షేపము** - నృత్యము చేయునప్పుడు శరీరావయవముల నిటు నటు ద్రిప్పుట (అంగహారము)

**అంగవిద్య** - అవయవములందలి మచ్చలు అరచేతి రేఖలను బట్టి శుభాశుభములను తెలుపు శాస్త్రము (సాముద్రికము)

**అంగసంగము** - స్త్రీ పురుషావయవముల కలయిక (కౌగిలి మొ )

**అంగసంస్కారము** - దీనిచేత అంగములు లెస్సగా జేయబడును (అభ్యంజనము, స్నానము)

**అంగహారము** - చూ అంగవిక్షేపము

**అంగహీనుడు** - అవయవ లోపము కలవాడు (అవిటివాడు, మన్మధుడు)

**అంగాంగీభావము** - అంగమునకును అంగికినిగల అవినాభావ సంబంధము

**అంగారకమణి** - అంగారక గ్రహమునకు ప్రీతికరమైన మణి (పగడము - ప్రవాళము)

**అంగారకర్కటి** - నిప్పుల మీద కాల్చిన రొట్టె

**అంగారకర్పరము** - లోహాదులను కరగించుట కుపయోగించెడి మూస)

**అంగారకారి** - అంగారక గ్రహమునకు శత్రువు (బుధుడు)

**అంగారకుడు** - నిప్పువంటి (ఎఱ్ఱని) వర్ణము కలవాడు, అంగములను పీడించువాడు, సంచరించువాడు (కుజుడు)

**అంగారణి** - నిప్పులుగాని బొగ్గులుగాని కలది (కుంపటి)

**అంగారధాని** - నిప్పులు దీని యందుంచబడును (కుంపటి)

**అంగారధానిక, అంగారధారిక** - నిప్పులు దీనియందు ధరింపబడును (హసని - కుంపటి)

**అంగారపాత్రి** - నిప్పు బొగ్గులకు బాత్రమైనది (కుంపటి)

**అంగార పుష్పము** - ఎఱ్ఱనైన పూలుకలది (ఇంగుదీవృక్షము)

**అంగారకపూరిక** - నిప్పులపై కాల్చిన పెద్దరొట్టె

**అంగారపోణి** - నిప్పులపై కాల్పబడినది (రొట్టె అంగరుల్లె)

**అంగార వల్లరి** - నిప్పువన్నెగల పూగుత్తులు గలది (కొనుగు)

**అంగారవల్లి** - ఎఱ్ఱని తీగలు గలది (గంటుబారంగి)

**అంగారశకటి** - నిప్పునకు శకటమైనది (కుంపటి, పొయ్యి)

**అంగారిణి** - నిప్పు గల్గి యెఱ్ఱనై ప్రకాశించునది (కుంపటి - హసని)

**అంగారి** - అంగారములు గలది (హసంతి, - కుంపటి)

**అంగిటిముల్లు** - అంగిట ముల్లు వలె నుండునది (కొండనాలుక)

**అంగుడుదుడిపి** - కొండెములు చెప్పెడి వాడు (కొండె.ాడు)

**అంగుళిత్రము** - వ్రేళ్ళను రక్షించునది (విలుకాని హస్తకవచము - తోలు తొడుగు)

**అంగుళిత్రాణము** - వ్రేళ్ళను కాపాడునది (అంగుళిత్రము)

**అంగుళిముద్ర** - అంగుళి సంబంధమైన ముద్ర

**అంగుళి ముద్రిక** - నామాది చిహ్నములు గల ఉంగరము (ముద్దుటుంగరము)

**అంగుళీయకము** - అంగుళియందు ఉండునది (ఉంగరము)

**అంగుష్ఠము** - చేతియందు ప్రాధాన్యము వహించునది (అంగమునందుండునది, బొటనవ్రేలు అంగుటము)

**అంగుష్ఠ్యము** - అంగుష్ఠమున బుట్టినది (బొటన వ్రేలి గోరు)

**అంఘస్సు** - దీనిచేత జనులు నరకమును పొందుదురు (పాపము - అంహస్సు)

**అంఘ్రి** - దీనిచే బోవుదురు (పాదము)

**అంఘ్రిజుడు** - బ్రహ్మదేవుని పాదములందు జనించినవాడు (శూద్రుడు)

**అంఘ్రిపము** - పాదములచే (వ్రేళ్ళచే) పానము చేయునది (పాదపము - చెట్టు)

**అంఘ్రిపర్ణి** - చెట్టు మొదటనుండి ఆకులు గలది (కోలపొన్న)

**అంఘ్రిపానుడు** - కాలివ్రేలు కుడుచుకొనువాడు (పసిపిల్లవాడు - శిశువు)

**అంఘ్రిసంధి** - పాదమునకు సంధియైనది (అంఘ్రిస్కంధము - చీలమండ)

**అంఘ్రిస్కంధము** - పాదమునకు స్కంధము వంటిది (చీలమండ)

**అంచగఱులపాన్పు** - హంసతూలికలతో గావించినశయ్య (హంసతూలికా తల్పము)

**అంచగుఱ్ఱపుజోదు** - హంసవాహనము నెక్కెడు యోధుడు (బ్రహ్మ)

**అంచగుఱ్ఱపు రౌతు** - హంసవాహన మధిరోహించు వేల్పు (బ్రహ్మ)

**అంచతత్తడి చెలియ** - హంస వాహనముగల బ్రహ్మదేవుని భార్య (సరస్వతి)

**అంచతేజి** - హంస వాహవముగా గలవాడు (బ్రహ్మ)

**అంచతేజిపొలతి** - హంస వాహనము గలవాని భార్య (సరస్వతి)

**అంచపదము** - వ్రాత దోషములున్నచోట పెట్టెడు హంసపాదాకృతి (x) గల గుర్తు (హంసపాదు)

**అంచయాన** - హంసయొక్క నడకవంటి ఒయ్యారపు నడకగలది (స్త్రీ-హంసగమన)

**అంచయేనుగు మావంతు** - హంస యనెడు ఏనుగునకు మావటీడయిన వాడు (బ్రహ్మ)

**అంచరవుతు** - హంసనెక్కి సంచరించువాడు (బ్రహ్మ)

**అంచరౌతు** - హంసనెక్కి సంచరించువాడు (బ్రహ్మ)

**అంచలవిడిది** - హంసల విడిదియైనది (ఆకాశగంగ)

**అంచునాడె** - అంచునేతకు ఉపయోగించెడు కొమ్మునాడె (అంచులాడె)

**అంచులవాడు** - బట్టలకు అంచులు అద్దువాడు (చిత్రకారుడు - జీనిగిరివాడు, ముచ్చి)

**అంజనకాడు** - అంజనము వేసి నిధి, నిక్షేపాదులను గనిపెట్టువాడు

**అంజనకేశి** - వెంట్రుకలను నల్లగా జేయుసుగంధ ద్రవ్యము (హట్టవిలాసిని)

**అంజనము** - పడమటి దిక్కును కాపాడు ఏనుగు (పడమటి దిగ్గజము)

**అంజనాద్రి** - కాటుక వన్నెగల కొండ (అంజనగిరి)

**అంజనశలాక** - కన్నులకు కాటుక పెట్టుకొను కణిక

**అంజనావతి** - కాటుకవంటి దేహకాంతి గలది (సుప్రతీకమను ఈశాన్య దిగ్గజము యొక్క భార్య)

**అంజనిక** - ఈశాన్య దిగ్గజమగు సుప్రతీకము యొక్క భార్య ( అంజనావతి)

**అంజిష్ణువు, అజిష్ణువు** - తన కిరణములచే జగత్తును పూయువాడు (సూర్యుడు - దినమణి, అంజిష్ణుడు)

**అంటని జేజే** - అంటరాని వేల్పు (అగ్నిదేవుడు - అర్చిష్మంతుడు)

**అంటుపూస** - ముత్తెపు చిప్పలో అంటి యుండు ముత్తెము (ముక్తాఫలము)

**అంటుపోగులు** - పురుషులు తాల్చు చెవికమ్మలు (తమ్మంట్లజత)

**అండకోశము** - అండముల యొక్క కూటమి (ముష్కము)

**అండజ** - కస్తూరి మృగము యొక్క అండముల వలన బుట్టునది (కస్తూరి - మృగమదము)

**అండజము** - గ్రుడ్డు వలన బుట్టునది (ఉడుము, పక్షి, చేప, కోడిపిల్ల, మొ॥)

**అండజుడు** - గ్రుడ్డు నుండి జన్మించినవాడు (గరుడుడు, అనూరుడు)

**అండప్రసువు** - గ్రుడ్లను బెట్టునది, గ్రుడ్డు నుండి పుట్టినది (పక్షి)

**అండము** - దీనినుండి పిల్ల వెడలును (గ్రుడ్డు)

**అంతఃకరణము** - లోపలి కరణేంద్రియము (మనస్సు)

**అంతఃకుటిలము** - లోపల వంకర కలది (శంఖము - కూతకైదువు)

**అంతఃకృమి** - లోన పురుగులు గలది (మేడిపండు)

**అంతఃక్రిమి** - క్రిములు పుట్టు రోగము గలవాడు (అంతఃకృమి)

**అంతఃపటము** - పెండ్లి సమయమున వధూవరుల నడుమ పట్టెడు తెర

**అంతః పాతితము** - నడుమ చేర్పబడినది

**అంతః పాలుడు** - అంతఃపురము నందలి కావలివాడు (అంతపాలుడు)

**అంతఃపురము** - రాజస్త్రీలుండెడు లోని గృహము (రాణివాసము)

**అంతఃపురికుడు** - అంతఃపురము నందలి సేవకుడు (కంచుకి)

**అంతఃపుష్పము** - కన్నె పండ్రెండవ యేటినుండి ఈడేరు వరకును గల కాలము (ఋతురక్తము)

**అంతకుడు** - నాశనము నొందించువాడు (యముడు - శమనుడు)

**అంతగుడు** - విద్యమొదలగువాని యంతు చూచినవాడు (పారగుడు)

**అంతపాలుడు** - దేశము యొక్క సీమను రక్షించువాడు (అధికారి) అంతఃపురము నందలి కావలివాడు (అంతఃపాలుడు)

**అంతము** - దీనియందు పాశబద్ధుడౌను (మృతి-చావు) నాశమును బొందునది (తుద)

**అంతరాగ్ని** - శరీరములోని అగ్ని (జఠరాగ్ని)

**అంతరజ్ఞుడు** - పరేంగితము తెలిసినవాడు, తారతమ్యము లెరిగినవాడు

**అంతరస్థుడు** - లోననుండువాడు (జీవుడు-ప్రాణి) నడుమనుండు వాడు (మధ్యవర్తి)

**అంతరాకాశము** - హృదయమునందలి యాకాశము, హృదయాకాశము

**అంతరాపత్య** - లోపల శిశువు కలది(గర్భిణి)

**అంతరాభవదేహము** - జననమరణముల మధ్య తిరుగాడు ప్రాణి (కారణశరీరి)

**అంతరాభవసత్యము** - చావునకు పుట్టుకకు మధ్య తిరుగాడు ప్రాణి

**అంతరాయము** - నడుమనెడతెగుట (విఘ్నము, ఆటంకము)

**అంతరాళతరంగము** - రేడియో తరంగములు బయల్వెడలి కొంత భూమిచుట్టును వ్యాపింపగా మిగిలిన ప్రసారశక్తి(ఆకసముదెస) అంతరాళ మును బ్రవేశించుట (ఆకాశ తరంగము)

**అంతరాళము** - అవకాశము నిచ్చునది (అన్ని దిక్కుల నడిమిచోటు, నడిమిచోటు)

**అంతరింద్రియము** - లోని ఇంద్రియము (మనస్సు)

**అంతరిక్షగము**-ఆకాశమున సంచరించునది (పక్షి)

**అంతరిక్షచరము** - అంతరిక్షగము (ఆకాశమున సంచరించునది) పక్షి, విమానము

**అంతరిక్షము** - తనలో నక్షత్రములు గలది దీని లోపలను జగత్తు చూడబడును (ఆకాశము)

**అంతరీక్షము** - భూమికి, స్వర్గమునకు మధ్య కానబడునది (ఆకాశము)

**అంతరీపము** - దీనియందు జలము అంతర్గతమై యుండును నీటి నడుమనున్నది (లంక-నడుగడ్డ)

**అంతర్మనస్కుడు** - చింతచే లోపల నలగిన మనస్సు కలవాడు (ఖిన్నుడు)

**అంతర్మనుడు** - ధ్యానమున మునిగినవాడు

**అంతర్మహానాదము** - లోన మహానాదము కలది (శంఖము)

**అంతర్గామి** - లోపలకు పోవునది

**అంతర్నాటకము** - నాటకమున ప్రదర్శింపబడు వేరొక నాటకము

**అంతర్ముఖుడు** - బయటికి సంసారివలె గన్పడుచు లోన బ్రహ్మజ్ఞాన పరిపూర్ణుడైనవాడు (అంతర్నిష్ఠుడు)

**అంతర్మృతము** - కడుపు లోపలనే చనిపోయిన శిశువు

**అంతర్యామి** - లోన బ్రవేశించి యింద్రియములను బ్రవర్తింపజేయునది (పరమాత్మ, వాయువు), మాయను ఉపాధిగా జేసికొనిన బ్రహ్మము (ఈశ్వరుడు)

**అంతర్లాప** - సమాధానము గర్భితమై యుండునట్లు అడిగెడు కఠిన సమస్య (అంతర్లాపిక) ఉదాహరణ - ఎద్దీశునకశ్వంబగు? పై ప్రశ్నకు "ఎద్దీశున కశ్వంబగు" సమాధానము (ఆంధ్రచంద్రాలోకము)

**అంతర్లాపి** - చూ అంతర్లాప

**అంతర్వంశికుడు** - అంతఃపురమున గావలి కాయువాడు (అంతర్వేశ్మికుడు)

**అంతర్వత్ని** - గర్భము కలది (చూలాలు)

**అంతర్వర్తి** - లోననుండు వాడు (జీవుడు)

**అంతర్వాణి** - శరీరమున శాస్త్రరూపమైన సరస్వతి కలవాడు (పండితుడు)

**అంతర్వాహిని** - భూమి లోపల ప్రవహించునది (ఏఱు, సరస్వతీనది)

**అంతవాసి** - దగ్గరనుండు వాడు (శిష్యుడు, గ్రామాంతమున వసించువాడు) (చండాలుడు)

**అంతశయ్య** - జీవితాంతమును బొందిన వానిశయ్య (శ్మశానము, శవవాహనము)

**అంతశ్శరీరము** - స్థూల శరీరమునకు లోపలి సూక్ష్మ శరీరము

**అంతస్సుఖుడు** - ఆత్మయందు సుఖించువాడు (యోగి)

**అంతావశాయి** - గ్రామాంతమున నివసించువాడు (చండాలుడు)

**అంతావసాయి** - నఖ కేశాంతములను ఛేదించువాడు (మంగలి, ఉదర పోషణార్థము జంతువులను ఛేదించు వాడు (చండాలుడు)

**అంతేవాసి** - దగ్గర నుండువాడు (శిష్యుడు) గ్రామాంతవాసి (చండాలుడు)

**అంతోదాత్తము** - కడపటి వర్ణముపై గల ఉదాత్త స్వరము

**అంత్యఋణము** - మానవుడు తీర్చవలసిన దేవ-ఋషి-పితౄణములలో చివరిది

**అంత్యకర్మము, అంత్యక్రియ** - చనిపోయిన వానికి జేయు దహన సంస్కారము (ఉత్తరక్రియ)

**అంత్యప్రాసము** - మొదటి పాదము చివర ప్రయోగించిన వర్ణమును మార్పుచేయక ప్రతిపాదము చివరను ప్రయోగించుట

**అంత్యభము** - చివరి (రాశి, నక్షత్రము) (మీనము, రేవతి)

**అంత్యానుప్రాసము** - పదాంత వర్ణములు, మరల మరల వచ్చునట్టి ఒక శబ్దాలంకారము

**అంత్రము** - శరీరము దీనిచే బంధింపబడును (ప్రేగు)

**అందదుకు** - ఎక్కువ అతుకులు కలది

**అందుకము** - దీనిచేత కట్టుదురు (ఏనుగును గట్టు గొలుసు) (అందువు)

**అంధంకరణము** - అంధునిగాజేయునది (చీకటి)

**అంధకరదీపిక** - గ్రుడ్డివాని చేతిలోని దివ్వె - వాని కెంతమాత్రమును ప్రయోజనకారి కాదనుట

**అంధకరిపువు** - అంధకాసురునికి శత్రువు (శివుడు)

**అంధకసూదనుడు** - అంధకాసురుని సంహరించినవాడు (శివుడు)

**అంధకారము** - లోకులనంధులుగా జేయునది (చీకటి)

**అంధకారి** - అంధకరిపువు (శివుడు), అంధునిగాజేయునది (చీకటి)

**అంధతమస** - కటిక చీకటి గలది (రాత్రి)

**అంధధి** - మానసికాంధకారము కలవాడు (అజ్ఞాని)

**అంధము,** - అంధునిచేయునది, (చీకటి)

**అంధిక** - గ్రుడ్డి వానినిగా జేయునది (రాత్రి, జూదము)

**అంధుడు** - వికలత్వమును పొందిన కన్నులు గలవాడు (గ్రుడ్డివాడు)

**అంధులము** - దర్శన మాత్రముచే విరహుల నంధులనుగా జేయునది (దిరిసెనము - శిరీషము)

**అంపకాడు** - అమ్ము చేతబట్టినవాడు (విలుకాడు)

**అంపగతి** - బాణమునకు గట్టెడి పక్షిరెక్క (తూలిక)

**అంపదొన** - అమ్ములపొది (ఇషుధి)

**అంపవెల్లి** - బాణముల ప్రవాహము (అంపర)

**అంపసాల** -ఆయుధాగారము (అంబకశాల)

**అంబ** - లోకములకు దల్లియైనది (పార్వతి)

**అంబటిచేయి** - అంబలి త్రాగు చేయి (కుడిచేయి)

**అంబటిప్రొద్దు** - అంబలిత్రాగువేళ (మధ్యాహ్నము)

**అంబరగము** - ఆకాశమున జరించునది (పక్షి, విమానము)

**అంబరగుడు** - ఆకాశమున సంచరించువాడు (వేల్పు)

**అంబరదము** - వస్త్రము నిచ్చునది (ప్రత్తి)

**అంబపలుకు** - తల్లిమాట (ఆజ్ఞ, దీవెన)

**అంబరమణి** - ఆకాశమున మణివలె ప్రకాశించువాడు (సూర్యుడు - ద్యుమణి)

**అంబరము**-శబ్దమును ధరించునది (ఆకాశము)

**అంబరయుగము** - కట్టుపంచె మరియు పై పంచె (పంచెలచాపు)

**అంబరాంతము** - భూమ్యాకాశములు కలసినట్లు కనబడుచోటు వస్త్రము యొక్క కొన (అంచలము)

**అంబరాంబరుడు** - ఆకాశము వస్త్రముగా గలవాడు (శివుడు - దిగంబరుడు)

**అంబరీషము** - వేచబడు వస్తువులచే మ్రోయునది (మంగలము - వేపుడు చట్టి)

**అంబరౌకసుడు** - ఆకసము స్థానముగా గలవాడు (వేల్పు)

**అంబారుపిడుజు** - పశువుల యొడలి నుండి రక్తమును బీల్చెడి జంతువు (జలగ, కొఱుజు)

**అంబిక** - సమస్తమును జనింపజేయునది లోకములకు తల్లి (పార్వతి - సర్వమంగళ)

**అంబికానాథుడు** - పార్వతికి ప్రభువు (శివుడు పార్వతీపతి)

**అంబికాపుత్రుడు** - పార్వతి కొడుకు (వినాయకుడు - కుమారస్వామి) అంబిక కొడుకు (ధృతరాష్ట్రుడు)

**అంబికేశ్వరుడు** - చూ అంబికానాధుడు

**అంబుకంటకము** - నీటిలో ముల్లువలె నుండునది (మొసలి - జలకంటకము)

**అంబుకిరాతము** - నీట కిరాతుని వలె నుండి హింసించునది (మొసలి - హ్రదగ్రహము)

**అంబుకీశము, అంబుకూర్మము** - నీటికోతి వలె నుండు జంతువు (మొసలి - శింశుమారము)

**అంబుగజము** - నీటియందు ఏనుగువలె బలము గలది (మొసలి - నీటికోతి)

**అంబుఘనము** - ఘనీభవించిన నీరు (వడగల్లు)

**అంబుచరము** - నీటియందు సంచరించునది (చేప - జలచరము)

**అంబుచామరము** - నీటి వింజామరవలె నుండునది (నాచు - శైవాలము)

**అంబుజ గర్భుడు** - విష్ణుని నాభికమలమునకు గర్భము అయినవాడు (బ్రహ్మ)

**అంబుజన్మము** - నీట బుట్టుక గలది (పద్మము, శంఖము, సారసపక్షి)

**అంబుజన్ముడు** - ఉదకమున జనించినవాడు (చంద్రుడు, అగ్ని)

**అంబుజమిత్రుడు** - పద్మములకు మిత్రుడైనవాడు (సూర్యుడు)

**అంబుజము** - ఉదకమున బుట్టినది (పద్మము)

**అంబుజవైరి, అంబుజారి** - పద్మములకు శత్రువైనవాడు (చంద్రుడు)

**అంబుజానన** - పద్మము పీఠముగా గలది (లక్ష్మీదేవి)

**అంబుజాసనుడు** - కమలము ఆసనముగా గలవాడు (బ్రహ్మ)

**అంబుజుడు** - ఉదకమున జనించినవాడు (చంద్రుడు)

**అంబుజోదరుడు** - పద్మము ఉదరమున కలవాడు (విష్ణువు)

**అంబుతస్కరుడు** - నీటిని హరించువాడు (సూర్యుడు)

**అంబుతాలము** - నీటిలో తాటివలె నుండునది (నాచు)

**అంబుదము** - జలము నిచ్చునది (జలదము - మేఘము)

**అంబుదేవము, అంబుదైవము** - తొలునీటి రిక్క (పూర్వాషాఢ)

**అంబుధరము** - నీటిని ధరించునది (మేఘము, తుంగ)

**అంబుధి** - ఇందు నీరు ధరింపబడి యుండును (జలధి - సముద్రము)

**అంబుధీశుడు** - సముద్రమునకు ప్రభువగువాడు (నీటిరేడు - వరుణదేవుడు)

**అంబుధీషుధి** - సముద్రము అమ్ముల పొదిగా గలవాడు (శివుడు)

**అంబునాథుడు** - సముద్రమునకు ప్రభువు (వరుణదేవుడు - అంబుపతి)

**అంబునిధి** - నీటి పాతరను ధరించునది (సముద్రము - జలనిధి)

**అంబుపతి** - అంబునాథుడు (నీటిరేడు)

**అంబుపము**- నీటిని త్రాగునది(సముద్రము)

**అంబుప్రసాద(న)ము** - నీటిని తేర్చునది (చిల్లగింజ - కతకము)

**అంబుభవము** - నీటబుట్టునది (తామరపూవు)

**అంబుభృత్తు** - నీటిని భరించునది (మేఘము, సముద్రము, ముస్తె)

**అంబుమర్కటము** - నీటియందు మర్కటాకారముగల జంతువు (మొసలి, నీటికోతి)

**అంబుమాత్రజము** - నీటియందు మాత్రమే పుట్టునది (శంఖము - శంబూకము)

**అంబుముక్కు** - నీటిని విడుచునది (అంబుముచము) (మేఘము)

**అంబుముచము** - అంబు ముక్కు (మేఘము)

**అంబురాజు** - నీటిరేడు (వరుణుడు)

**అంబురాశి** - ఉదకములకు ప్రోగు అయినది (నీటికుప్ప - జలనిధి)

**అంబురుహ** - ఉదకమున పుట్టుక కలది

**అంబురుహము** - నీటియందు పుట్టినది (పద్మము)

**అంబువల్కలము** - నీటియందు వస్త్రము వలె ఉండునది (నాచు)

**అంబువాహము** - నీటిని మోయునది (మేఘము)

**అంబువాహి** - నీరు మోయువాడు (మేఘుడు)

**అంబువాహిని** - నీటిని ఎత్తిపోసెడు కొయ్య సాధనము (దోనె), నీరు మోయు స్త్రీ

**అంబువిహారము** - నీటియాట (నీరాటము - జలక్రీడ)

**అంబువు** - ధ్వనియుక్తమై ప్రవహించునది (జలము)

**అంబుసర్పిణి** - నీటిలో ప్రాకునది (జలగ)

**అంబుసేచని** - నీటిని ఎత్తిపోయు బొక్కెన

**అంబేద** - దిట్టతనము లేనివాడు (అసమర్థుడు)

**అంభసాంభ్రమము** - నీటియందు దొట్రుపాటుతో గూడినది (నీటిసుడి - జలావర్తము)

**అంభసువు** - నీటపుట్టునది (నత్తగుల్ల - క్షుద్రశంఖము)

**అంభస్సారము** - నీటిసారము (ముత్యము)

**అంభోజగర్భుడు** - శ్రీ విష్ణుని నాభి కమలమునకు సంతానమైనవాడు (బ్రహ్మ)

**అంభోజజని** - తామరపూవునందు పుట్టుక కలవాడు (బ్రహ్మ)

**అంభోజజన్ముడు** - (చూ॥పై)

**అంభోజమిత్రుడు** - పద్మములకు మిత్రుడైనవాడు (సూర్యుడు - అంబుజమిత్రుడు)

**అంభోజము** - నీటిలో పుట్టినది (బెగ్గురుపక్షి, తామరపువ్వు)

**అంభోజయోని** - విష్ణుని నాభికమలము ఉత్పత్తి స్థానముగా గలవాడు (తమ్మిచూలి - బ్రహ్మ)

**అంభోజవైరి** - అంబుజవైరి

**అంభోదము** - నీటి నిచ్చునది (అంబుదము - మేఘము)

**అంభోధరము** - చూ అంబుధరము

**అంభోధి** - చూ॥ అంబుధి (సముద్రము)

**అంభోనిధి** - నీటిపాతర (జలనిధి - అంబుధి)

**అంశచక్రము** - గ్రహగతులను తెలుపునట్టి జాతక చక్రము

**అంశము** - విభజింపబడునది (భాగము)

**అంశలుడు** - భాగమును దీసికొనువాడు (భాగస్వామి - అంశభాక్కు, అంశహారి)

**అంశహరుడు, అంశహారి** - భాగమును దీసికొనువాడు (అంశలుడు)

**అంశి** - భాగముగలవాడు (జ్ఞాతి)

**అంశిక** - దాయభాగముగలస్త్రీ

**అంశుకము** - తంతువుల చేత ఇంచుకంత పలుకునది (వసనము - కోక)

**అంశుధరుడు** - కిరణములను ధరించువాడు (సూర్యుడు)

**అంశుపతి** - కిరణములకు ప్రభువు (సూర్యుడు)

**అంశుభృత్తు** - చూ అంశుధరుడు

**అంశుమంతము** - ప్రకాశముగలది

**అంశుమంతుడు** - కిరణములు కలవాడు (సూర్యుడు, చంద్రుడు)

**అంశుమతి** - నిడుపైనవేళ్ళను కిరణములు గలది (ముయ్యాకుపొన్న)

**అంశుమత్ఫల** - కాంతియుక్తములైన ఫలములు గలది (అరటిచెట్టు)

**అంశుమాలి** - కిరణమాలికలు గలవాడు (సూర్యుడు)

**అంశువు** - వ్యాపించునది(కిరణము, కాంతి)

**అంశ్యము** -పంచదగినది (అంశనీయము)

**అంసకూటము** - మూపున శిఖరము వలె ఉండునది (కకుదము, ఎద్దు మూపురము)

**అంసత్రము** - భుజశిరస్సులను కాపాడునది (భుజకవచము)

**అంసభారము** - మూపుమీది భారము(కావడి)

**అంసము** - భారముచే బీడింపబడునది (మూపు-భుజశిరము)

**అంసలుడు** - ఘనమైన భుజశిరస్సులు గలవాడు (బలసినవాడు-మాంసలుడు)

**అంస్యము** - మూపున ఉండదగినది (అంసత్రము ॥మొ॥)

**అంహతి** - దీనిచే పాపము తొలగును (దానము)

**అంహస్సు** - ప్రాయశ్చిత్తముచే తొలగి పోవునది దీనిచేత జనులు నరకమును బొందుదురు (పాపము-అంఘస్సు)

**అంఘ్రి** - దీనిచే నడతురు (పాదము - అంఘ్రి)

**అంఘ్రిపము** - వేళ్ళతోనీటిని త్రాగునది (చెట్టు - అంఘ్రిపము)

**అంఘ్రిసంధి** - చూ అంఘ్రిసంధి

**అంఘ్రిస్కంధము** - పాదమునకు స్కంధము వంటిది (అంఘ్రిస్కంధము - చీలమండ)

**అకచము** - వెంట్రుకలులేనిది (బట్టతల)

**అకము** - సుఖముకానిది, సుఖములేనిది (దుఃఖము, పాపము)

**అకర** - సేవించుటచే రోగాదులవలని దు ఖమును తొలగించునది (ఉసిరిక)

**అకర్ణము** - చెవులులేనిది (పాము-కంటివిన్కరి)

**అకర్తృకము** - ఇతరకర్తృత్వములేనిది (బ్రహ్మము)

**అకల్క** - మాలిన్యములేనిది (వెన్నెల - చంద్రిక)

**అకల్యము** - రోగముగలది, (అనారోగ్యము)

**అకాండశూల** - ఆకస్మికముగా కలుగునొప్పి

**అకాయుడు** - శరీరములేనివాడు (రాహువు, పరమాత్మ, మన్మథుడు)

**అకాలసహుడు** - సమయము వచ్చు వరకును వేచియుండనివాడు

**అకించనుడు** - కొలది ద్రవ్యమైనను లేనివాడు (దరిద్రుడు)

**అకించిజ్జ్ఞుడు** - ఎంతమాత్రము తెలియని వాడు (అజ్ఞాని)

**అకించిత్కరుడు** - ఏమియు చేయలేనివాడు (వ్యర్థుడు)

**అకిల్బిషుడు** - పాపములేనివాడు (పవిత్రుడు)

**అకుంఠము** - అడ్డులేనిది, వాడిపోనిది

**అకుతోభయుడు** - ఎవరివలనను దేని వలనను భయపడనివాడు (ధైర్యశాలి)

**అకుప్యము** - ఎవరిచేతను కోపింపరానిది (వెండి,బంగారము)

**అకుహుడు** - మోసగింపనివాడు (సత్యశీలుడు)

**అకూపారము** - మర్యాదచేత భూమిని నింపనిది, ఆవలి దరియందు భూమి లేనిది కుత్సితము గాని దరికలది (సముద్రము)

**అకూపారుడు** - భూమండలమును దన కిరణము లచే నిండించువాడు(సూర్యుడు)

**అకూర్చుడు** - గడ్డము, మీసలు మొలవని పేడి వాడు

**అకూవారము** - చూ॥అకూపారము

**అకృతము** - చేయబడనిది, తప్పుగా చేయబడినది

**అకృతాత్ముడు** - బ్రహ్మజ్ఞానము లేనివాడు (అజ్ఞాని)

**అకృతాస్త్రుడు** - అస్త్రవిద్యా పాటవము లేనివాడు

**అకృతోద్వాహుడు** - వివాహము కానివాడు (బ్రహ్మచారి)

**అకృత్యము** - చేయదగనిది (తప్పు)

**అకృత్రిమము** - కల్పితము కానిది (సహజము)

**అకృష్టపచ్యము** - దున్నిన భూమియందు పండునది (నివ్వరి)

**అకృష్టరోహి** - దున్నినభూమిలో మొలచునది (అకృష్టపచ్యము)

**అకృష్ణకర్ముడు** - సత్ప్రవర్తనము కలవాడు (పుణ్య కర్ముడు)

**అకృష్ణము** - నలుపుకానిది (స్వచ్ఛమైనది, కర్పూరము)

**అకేశుడు** - బట్టతలవాడు (ఖర్వాటుడు)

**అకోటము** - వంకలేక నిటారుగా పెరుగునది (పోకచెట్టు)

**అక్కరగండడు** - ఆవశ్యక కార్యదీక్ష కలవాడు

**అక్కలవాడ** - వంటలక్కలుండెడి వీధి

**అక్కుగొల్లు** - హృదయమునకు గ్రుచ్చుకొన్న బాణము (హృదయ శల్యము)

**అక్కుపక్షి** - బక్కవానికుపమానముగా చెప్పెడు పక్షి విశేషము

**అక్కుముల్లు** - మనస్సునకు బాధ కలిగించునది (హృదయ శల్యము - అక్కుగొల్లు)

**అక్రియుడు** - విధులను పాటింపనివాడు (సోమరి) చేయవలసిన పనిలేనివాడు (నిష్క్రియుడు - దేవుడు)

**అక్లిష్టము** - సుబోధకమైనది

**అక్లిష్టవ్రతుడు** - వ్రతాచరణమున ఆయాసము పొందనివాడు

**అక్షకుశలుడు** - పాచికలాడుటయందు నిపుణుడు (అక్షవిదుడు)

**అక్షకూటము** - కంటికి శిఖరము వలె నుండునది (కనీనిక - కనుపాప)

**అక్షచక్రము** - ఇంద్రియముల సముదాయము

**అక్షజము** - ఇంద్రియముల వలన జనించునది (ప్రత్యక్షజ్ఞానము)

**అక్షతలు** - క్షయములేనివి (అక్షింతలు)

**అక్షతుడు** - నాశము లేనివాడు (శివుడు)

**అక్షదర్శకుడు** - వ్యవహారములను విచారించువాడు, జూదమును పర్యవేక్షించు అధికారి

**అక్షదేవి** - పాచికలచే గ్రీడించువాడు (కితవుడు, జూదరి)

**అక్షద్యువు** - పాచికతో ఆడునట్టివాడు (జూదరి)

**అక్షద్యూతికము** - పాచికలాటయందలి కలహము

**అక్షద్రుగ్ధుడు** - జూదమున మోసగింపబడిన వాడు

**అక్షధరము** - అక్షములుకలది (బండి చక్రము)

**అక్షధూర్తిలము** - బండికాడికి కట్టబడునది (ఎద్దు)

**అక్షధూర్తుడు** - అక్షములయందు ధూర్తుడు జూదమాడుటవలన కుటుంబమును జెరుచు వాడు

**అక్షపటలుడు** - న్యాయమును నిర్ణయించువాడు (న్యాయాధిపతి - తగవరి)

**అక్షపాదుడు** - పాదమున నేత్రము కలవాడు (న్యాయశాస్త్రకర్తయగుగౌతముడు)

**అక్షమాల** - 'అ'కారము మొదలు 'క్ష' కారము వరకుగల వర్ణముల మాలిక ఆవర్ణములకు మారుగ స్ఫటికాదులను కూర్చిన మాల (తావళము)

**అక్షయపాత్ర** - బిచ్చగాని గిన్నె (ముష్టిచెంబు)

**అక్షయము** - క్షయము లేనిది, ఇల్లు లేనిది (పరమాత్మ)

**అక్షయ్యము** -క్షయింపజేయుటకు వీలు కానిది

**అక్షయ్యోదకము** - శ్రాద్ధకాలమున పిండప్రదానానంతరము తేనెయు, నువ్వులును కలిపి యిచ్చెడుజలము

**అక్షరచణుడు** - లిపివ్రాయుటయందు నేర్పరి (వ్రాతకాడు - లేకరి)

**అక్షరచుంచువు** - అక్షరములచే ప్రసిద్ధుడు (లేకరి - అక్షరచణుడు)

**అక్షరచ్యుతకము** - పదములలోని అక్షరములను తగ్గించుచు చెప్పెడు చిత్ర కవిత్వము (ఉదా- కవయామి, వయామి, యామి)

**అక్షరజీవి** - వ్రాతవృత్తి వలన జీవించు వాడు (అక్షరజీవకుడు)

**అక్షరతూలిక** - అక్షరములు వ్రాయుట కుపయోగించునది (కలము)

**అక్షరభూమిక** - వ్రాయుటకుపయోగించు పలక

**అక్షరము** - నాశనము పొందనిది (పరమాత్మ, ధర్మము)

**అక్షరముఖుడు** - అక్షరమయములగు శాస్త్రములు ముఖమున నున్నవాడు (పండితుడు)

**అక్షరవిన్యాసము** - వర్ణ సముదాయమునుపయోగించి వ్రాయబడినది (పత్రిక, వ్యాసము ॥మొ॥)

**అక్షరాభ్యాసము** - విద్యారంభకాలమున బాలునిచే వర్ణములను దిద్దించుట

**అక్షరాస్యుడు** - చదువుకొనిన వాడు (అక్షర ముఖుడు)

**అక్షరుడు** - నాశము లేనివాడు (శివుడు, విష్ణువు)

**అక్షవతి** - పాచికలు కలది (జూదము)

**అక్షవాటము** - పాచికలాడు పలక (నెత్తపలక - జూదపలక) జూదమాడెడుచోటు (ద్యూత గృహము) వీరులు సాధనచేయు చోటు (వ్యాయామశాల)

**అక్షవాముడు** - జూద నియమములను పాటింపనివాడు

**అక్షవిదుడు** - పాచికలు వేయుటలో నేర్పరి (జూదరి)

**అక్షవిద్య** - జూదమందలి నేర్పు (ద్యూతకళ)

**అక్షశాలికుడు** - ద్యూతగృహమును నడుపువాడు

**అక్షశౌండుడు** - జూదమున నేర్పుకలవాడు

**అక్షసూత్రము** - 'అ' కారము మొదలు 'క్ష' కారము వరకుగల వర్ణములకు ప్రతిగా రుద్రాక్షలు మున్నగు వానిచే కూర్పబడినది

**అక్షహృదయము** - జూదమునందలి రహస్యము, అత్యధిక సంఖ్యగల వస్తువులనైనను జూచినంత మాత్రమున మొత్తము జెప్పగల విద్య

**అక్షావపనము** - పాచిక లాడెడు పలక (నెత్తపలక)

**అక్షాంశము** - అక్షరేఖ పరిధిలో మున్నూట అఱువదవ భాగము

**అక్షారము** - చవుటి ఉప్పుతో చేయబడినది (సముద్రపు ఉప్పు)

**అక్షింతలు** - పూజించునపుడును, ఆశీర్వదించునపుడును ఉపయోగించెడు పసుపు కలిపిన బియ్యము (అచ్చతలు - సేసబ్రాలు)

**అక్షికూటము** - కంటికి శిఖరము వలె నుండునది (కనుగ్రుడ్డు - కనీనిక)

**అక్షిభేషజము** - కంటిమందు (కాటుక)

**అక్షియోనికుడు** - నేత్రాకారముగా బయటికి జూపట్టెడి సహస్రయోనులు గలవాడు (ఇంద్రుడు)

**అక్షివికూణితము** - లజ్జాదికముచే నించుకంత సంకోచమును బొందినకంటిచూపు (క్రీగంటి చూపు)

**అక్షౌహిణి** - 21870 రథములను, 21870 గజములను, 65610 గుఱ్ఱములను, 109350 కాల్బలమును గలసేన (అక్షోహిణి)

**అఖండము** - ఖండముగానిది (సంపూర్ణము, సమస్తము)

**అఖిలము** - దున్నబడనిది (నేల)

**అఖాతము** - మనుష్యులచే త్రవ్వబడనిది (సముద్రము, పుణ్యతీర్థము మొదలగునవి)

**అగచరము** - వృక్షము (కొండ)ల యందు సంచరించునది (కోతి)

**అగచాట్లమారి** - ఆపదలు పొందు, కలిగించు స్వభావము కలవాడు (అగచాట్లపోతు)

**అగజము** - చెట్టున బుట్టినది, పర్వతము నుండి పుట్టినది (శిలాజిత్తు)

**అగజాజాని** - పార్వతి భార్యగా గలవాడు (శివుడు)

**అగజాత** - పర్వతరాజగు హిమవంతుని పుత్రిక (పార్వతి - హైమవతి)

**అగడుకాకి** - కాకివలె కర్ణ కఠోరముగా నరుచువాడు (ప్రేలరి)

**అగదంకారుడు** - మందులచే రోగము లేకుండ చేయువాడు (వైద్యుడు)

**అగదము** - రోగము లేకుండ జేయునది (ఔషధము)

**అగపాట్లమారి** - ఇడుమలు పడువాడు

**అగమము** - నడువలేనిది (పాము, చెట్టు, కొండ)

**అగము** - నడువలేనిది (చెట్టు, కొండ)

**అగమ్యము** - (నడువరానిది) చేరరాని అడవి మార్గము, సంగమమునకు దగనిది (పరస్త్రీ)

**అగస్త్య భ్రాత** - అగస్త్యమునికి దోడబుట్టిన వాడు అనామకుడును,నిష్ప్రయోజకుడును

**అగస్త్య మూత్రము** - అగస్త్యమునిచే త్రాగి తిరిగి విడిచిపెట్టబడినది (సముద్రము)

**అగస్త్యుడు** - వింధ్య పర్వతము నణచినవాడు (ఒక ఋషి)

**అగస్త్యోదయము** - భాద్రపద మాసాంతమున గలుగు అగస్త్య నక్షత్రోదయము (జలములు తేరును)

**అగూఢ గంధము** - దాపరాని వాసన గలది (ఇంగువ)

**అగూఢము** - వ్యంగ్యము - గూఢము కానిది (గుణీభూత వ్యంగ్యములలో నొకటి)

**అగౌకసము** - అగము నివాసముగా గలది (సింహము, పక్షి)

**అగ్గించుకొను** - తన్ను తాను పొగడుకొను

**అగ్గికంటిసామి** - అగ్నివలె భస్మము చేయ సమర్థమగు మూడవ నేత్రము గలవాడు (శివుడు - నిప్పుకంటి దొర)

**అగ్గికోల** - నిప్పులు కురిసెడు బాణము (ఆగ్నేయాస్త్రము - అగ్గిములికి)

**అగ్గిచూలి** - ఈశ్వర తేజమును ధరించిన అగ్ని హోత్రుని బిడ్డడు (కుమారస్వామి)

**అగ్గితత్తడి** - అగ్నిదేవునకు వాహనమైనది (పొట్టేలు)

**అగ్గితూపు** - చూ అగ్గికోల

**అగ్గిపాపడు** - అగ్నిదేవుని బిడ్డ (కుమార స్వామి)

**అగ్గిపిడుగు** - నిప్పులు గ్రక్కెడు పిడుగు (నిప్పు పిడుగు)

**అగ్గిబుడ్డి** - నిప్పురవ్వలు పైకెగసెడు బాణసంచు (చిచ్చుబుడ్డి)

**అగ్గిములికి** - నిప్పులు కురిసెడు కోల (ఆగ్నేయాస్త్రము)

**అగ్ని** - ఊర్ధ్వముగను, వక్రముగను జ్వలించు వాడు

**అగ్నిజుడు** - అగ్ని దేవుని వలన బుట్టినవాడు (కుమారస్వామి, అగ్నిసుతుడు)

**అగ్నికేతువు** - అగ్నికి జెండా అయినది (పొగ - ధూమము)

**అగ్నిగతశలభము** - ముందు వెనుకలు, కష్టసుఖము లాలోచింపక ఫలమను భ్రాంతిచే అగ్నిలో పడు మిడుత

**అగ్నిగర్భ** - అగ్ని గర్భమందు గలది (శమీవృక్షము)

**అగ్ని గర్భము** - లోపల అగ్ని గలది (సూర్య కాంతమణి, అరణి)

**అగ్ని చిత్తు** - అగ్ని చయనము చేసినవాడు

**అగ్నిజాతము** - అగ్ని నుండి పుట్టినది (బంగారు, నీరు)

**అగ్ని జిహ్వుడు** - అగ్నియే జిహ్వగా గలవాడు, తీక్ష్ణమైన వాక్కులు గలవాడు (వరాహమూర్తి)

**అగ్నిదుడు** - ఇండ్లకు నిప్పుపెట్టువాడు (ఆతతాయి)

**అగ్నిదృక్కు** - అగ్నివలె తీక్ష్ణమైన చూపుగలవాడు (శివుడు)

**అగ్ని ద్వారము** - ఆగ్నేయ దిశయందున్న ద్వారము

**అగ్నిధారణము** - నిత్యము హోమాగ్నిని ఆరిపోకుండ కాపాడుకొనుట

**అగ్ని పరీక్ష** - అగ్నిమూలముగా దోషాదోషములను పరీక్షచేయుట

**అగ్ని బాహువు** - అగ్నికి బాహువు అయినది (పొగ)

**అగ్ని బీజము** - అగ్ని ద్వారమున హేమముగా పుట్టినది (బంగారము)

**అగ్ని బీజాక్షరములు** - ఇ, ఈ, ఐ, ఖ, చ, ర, ద, ఫ, ర, స, అను పదియక్షరములు

**అగ్నిభము** - అగ్నివలె ప్రకాశించునది (బంగారము) అగ్నిదేవతాకమైన నక్షత్రము (కృత్తిక)

**అగ్నిభువు** - శివ వీర్యమును గ్రహించిన అగ్ని వలన బుట్టిన వాడు (అగ్గిపాపడు - కుమారస్వామి)

**అగ్నిమంథనము** - అరణిలో నిప్పు పుట్టించుట

**అగ్ని మంథము** - రాపిడిచే నిప్పు పుట్టించుట

**అగ్ని మాంద్యము** - ఆకలి తగ్గుట (అజీర్ణరోగము)

**అగ్నిమిత్రుడు** - అగ్ని దేవునకు స్నేహితుడు (వాయువు)

**అగ్ని ముఖ** - అగ్ని ముఖముగా గలది (గాయత్రి)

**అగ్ని ముఖుడు** - అగ్నియందు హోమ ద్రవ్యములను వేల్చుట కభిముఖుడై యుండువాడు (అగ్నిహోత్రి, బ్రాహ్మణుడు)

**అగ్నిరజము** - నిప్పువలె ప్రకాశించునది (ఆరుద్ర పురుగు)

**అగ్నిరేతస్సు** - అగ్నియొక్క వీర్యము (బంగారము)

**అగ్ని వర్ధకము** - ఆకలిని పెంచునది

**అగ్ని వాసస్సు** - ఎఱ్ఱని వస్త్రము కలది

**అగ్నివాహనము, అగ్నివాహము** - అగ్ని దేవునకు వాహనమైనది (గొఱ్ఱె, మేక - అగ్గితత్తడి)

**అగ్ని శిఖము** - నిప్పువంటి కొనలు కలది (బాణము, బంగారము. దీపము)

**అగ్నిష్టోమము** - వసంత కాలమున 5 దినములలో పూర్తికావించెడి యాగ విశేషము

**అగ్నిసఖుడు** - అగ్నికి స్నేహితుడైన వాడు (వాయువు)

**అగ్ని సుతుడు** - అగ్నిభువు (అగ్గిపాపడు - కుమార స్వామి)

**అగ్నిసూత్రము** - ఉపనయన కాలమున బ్రహ్మచారి మొలకు ధరించుమౌంజి (మౌంజీమేఖల)

**అగ్నిస్తంభనము** - అగ్గి యొక్క దహన శక్తిని ఆపుట

**అగ్నిహోత్రము** - అహితాగ్నులు ప్రాత స్సాయం కాలములయందు జేసెడి హోమము (దధి రూపమైన హవిస్సు, అగ్ని)

**అగ్నిహోత్రి** - ప్రాతస్సాయంకాలములందు నిత్యమును అగ్ని కార్యము చేయువాడు

**అగ్నీషోమీయము** - అగ్నియు, సోముడును దేవతలుగా గల యాగము (అగ్నిషోమీయము)

**అగ్నౌకరణము** - వేల్పులనుద్దేశించి అగ్నియందు హవిస్సులను వేల్చుట

**అగ్రకాయము** - శరీరము యొక్క పై భాగము (కేతు గ్రహము)

**అగ్రగణ్యుడు** - మొదట లెక్కింపదగినవాడు (శ్రేష్ఠుడు)

**అగ్రగుడు** - ముందు నడచువాడు (మొదటివాడు)

**అగ్రజ** - తనకంటె ముందు పుట్టినది (అక్క)

**అగ్రజన్ముడు** - ముందు పుట్టినవాడు (అన్న), అగ్రజాతుడు (బ్రాహ్మణుడు)

**అగ్రబీజము** - కాయచివర గింజ గలది (జీడి మామిడి)

**అగ్రభువు** - అగ్రకులమున బుట్టినవాడు (బ్రాహ్మణుడు) దేవతలలో ముందుగా బుట్టినవాడు (బ్రహ్మ)

**అగ్రతస్సరుడు** - ముందు పుట్టినవాడు (అన్న), ముందు నడచువాడు (మొనగాడు, నాయకుడు)

**అగ్రహారము** - రాజుచే బ్రాహ్మణమాత్ర నివాసమునకై నిర్మాణము చేయబడిన గ్రామభేదము

**అగ్రియుడు** - ముందు పుట్టినవాడు (అన్న)

**అగ్రేదిధిషువు** - మారుమనువు దానిని బెండ్లాడినవాడు అక్కకు ముందు వివాహిత యగు చెల్లెలు

**అగ్రేదిధిషూపతి** - అక్క కంటె ముందు పెండ్లాడిన దాని మగడు

**అగ్రేసరుడు** - ముందు నడచువాడు (శ్రేష్ఠుడు)

**అఘనాశనుడు** - పాపమును పోగొట్టువాడు (శివుడు, విష్ణువు), అఘుడను రాక్షసుని సంహరించినవాడు (శ్రీకృష్ణుడు)

**అఘభోజి** - దేవతలకు గాని, పితరులకు గాని, అతిథులకు గాని పెట్టక తాను దినువాడు

**అఘమర్షణము** - జలములందుండి మూడుమారులు జపించుటచే మహా పాతకములను నశింపజేసెడు ఋగ్వేద మంత్రము

**అఘము** - ధన్యుని జెరుపనిది, కర్తను బొందునది (పాపము, దుఃఖము)

**అఘశంసి** - ఇతరుల దోషములు మాత్రమే ప్రకటించువాడు (రంధ్రాన్వేషి)

**అఘోరము** - అతి భయంకరమైనది

**అఘోరుడు** - ఎవనికంటె భయంకరుడు లేడో అతడు (రుద్రుడు)

**అఘౌఘము** - పాప(ముల) సమూహము

**అఘ్న్య** - చంపదగనిది (ఆవు)

**అఘ్న్యము** - చంపతగనిది (ఎద్దు)

**అఘ్రేయము** - వాసన చూడదగనిది (మద్యము)

**అచల** - కదలనిది (భూమి, పర్వతము)

**అచలకీల** - పర్వతముల కీలలుగా గలది (భూమి)

**అచలజ** - పర్వతరాజగు హిమవంతుని కొమార్తె (పార్వతి - అగజాత)

**అచలత్విట్టు** - స్థిరమైన కాంతి గలది (కోకిల)

**అచలము** - చలింపనిది (పర్వతము, బ్రహ్మము)

**అచలుడు** - చలింపనివాడు (శివుడు, ఆత్మ)

**అచింత్యము** - తలపరానిది (చెడు, మృతి)

**అచిరద్యుతి** - క్షణిక కాంతి గలది (మెరువు, అచిరప్రభ)

**అచేతనము** - చైతన్యము లేనిది (జడము)

**అచ్యుతజాగరవేళ** - (విష్ణుప్రీతికరమైన) ఏకాదశి రాత్రి, వైకుంఠైకాదశిరాత్రి

**అచ్యుతవాసము** - విష్ణుదేవునకు నివాస స్థానము (రావిచెట్టు)

**అచ్యుతుడు** - తన పదవి నుండి చ్యుతి నొందనివాడు (శివుడు, విష్ణువు)

**అచ్ఛగుండ్లపేరు** - స్వచ్ఛమైన పూసలదండ (స్ఫటికమాల)

**అచ్ఛదనుడు** - ఇల్లు లేనివాడు

**అచ్చనగుండ్లు** - బాలికలాడు గచ్చకాయలు (అచ్చన గాయలు)

**అచ్చుకట్టు** - పొలమును మడులుగా కట్టు

**అచ్యుతుడు** - నాశనము లేనివాడు (పెరుమాళ్ళు)

**అజ** - పుట్టుకలేనిది

**అజంభము** - దంతములు లేనిది (కప్ప)

**అజంభుడు** - పండ్లు లేనివాడు (సూర్యుడు)

**అజకవము** - బ్రహ్మను, విష్ణువును సంతోషపెట్టినది (త్రిపురాసుర సంహారమునకుపయోగించిన ధనువు) శివుని విల్లు - పినాకము

**అజకావము** - శివుని విల్లు

**అజగంధిక** - గొఱ్ఱె వాసనవంటి వాసన కలది (వాయింటచెట్టు - ఖరపుష్ప)

**అజగంధిని** - మేకకొమ్ముల వంటి ఫలములు గలది (జుట్టువచెట్టు - అజశృంగి)

**అజగరము** - మేకను మ్రింగునది నిత్యమైన విషము గలిగినది ఎప్పుడును మేలు కొననిది (పెనుబాము)

**అజగవము** - అజగవము యొక్క అస్థివికారమైనది విష్ణువు శరరూపమున కలది (శివుని విల్లు - పినాకము, అజగావము)

**అజఘన్యుడు** - అధముడు కానివాడు. (ఉత్తముడు)

**అజజీవికుడు** - మేకల వర్తకముచే జీవించువాడు (గొల్లవాడు)

**అజప** - (హంస) గాయత్రీ మంత్ర విశేషము ఉచ్ఛ్వాస, నిశ్శ్వాసములచేతనే అప్రయత్నముగా జపింపబడునది

**అజపాత్తు** - పూర్వాభాద్ర (ప్రోష్ఠపదము)

**అజబంధువు** - దేవానాంప్రియుడు (మూర్ఖుడు)

**అజభక్షము** - మేకలచే తినబడునది (వాయింట)

**అజమారుడు** - మేకలను చంపువాడు (కసాయివాడు)

**అజముఖుడు** - గొఱ్ఱెతల తలగా నమర్చబడినవాడు (దక్షప్రజాపతి)

**అజమోద** - గొఱ్ఱె కంపు వంటి కంపు కలది (వాము అజమోదిక)

**అజయ** - తిమ్మిరి కలిగించునదగుటచే జయము లేనిది (గంజాయి)

**అజయ్యుడు** - ఎప్పుడును జయింపరాని వాడు

**అజరుడు** - ముదిమిలేని వాడు (వేలుపు)

**అజలోమము** - మేక వెంట్రుకవంటి నూగు గలది (దూలగొండి)

**అజవాహనుడు** - అజము వాహనముగా గలవాడు (అగ్ని)

**అజశృంగి** - గొఱ్ఱె కొమ్ములవంటి కాయలు గలది (జుట్టువుచెట్టు)

**అజాండ పరీక్ష** - మేకకు వృషణము లెన్ని అవి ఎట్టివి అను వ్యర్థ పరీక్ష (ప్రయోజన శూన్యమైనదనుట)

**అజాగరము** - ఎంతమాత్రము నిద్దురపట్ట నీయనిది బుద్ధివికాసిని (గుంటకలగర)

**అజాగళస్తనము** - మేక మెడ చన్ను వలె ప్రయోజన శూన్యమనుట

**అజాజి** - స్వాభావికమై మందాగ్నిని బోగొట్టునది (జీలకఱ్ఱ)

**అజాజీవుడు** - మేకలను గాచుటవలన జీవించువాడు

**అజాతశత్రువు** - శత్రువులు లేనివాడు

**అజానికుడు** - మేకల క్రయవిక్రయాదులు చేయువాడు (గొల్లవాడు)

**అజాపత్య** - బ్రహ్మ యొక్క లోకము (సత్యలోకము)

**అజాయుద్ధము** - ఆరంభ శూరత్వము గల మేకల పోట్లాట

**అజిగీషువు** - జయేచ్ఛ లేనివాడు

**అజితుడు** - జయింపబడనివాడు (శివుడు, విష్ణువు)

**అజితేంద్రియుడు** - ఇంద్రియములను జయింప జాలనివాడు (విషయాసక్తుడు)

**అజినపత్త్ర** - తోలువంటి రెక్కలుగలది (గబ్బిలము - చీకువాయి)

**అజినయోని** - ప్రశస్త చర్మమునకు స్థానమైనది (జింక)

**అజిహ్మాగము** - చక్కగా (తిన్నగా) బోవునది (బాణము)

**అజిహ్మము** - వంకరకానిది (చక్కనిది, సరియైనది)

**అజిహ్వము** - నాలుకలేనిది (కప్ప)

**అజీకవము** - శివుని విల్లు (పినాకము - అజీగవము)

**అజీగర్తము** - నివసించుటకు బిలము కలది పాము - బిలేశయము

**అజీగావము** - చూ॥ అజగవము

**అజుడు** - పుట్టుక లేనివాడు (శివుడు, విష్ణువు, బ్రహ్మ, పరమాత్మ, జీవుడు, మొ॥)

**అజైకపాత్తు** - పూర్వాభాద్ర నక్షత్రము

**అజైడకము** - మేకలయు గొఱ్ఱెలయు మంద (అజావికము)

**అజ్జయలుగుపుల్లు** - పాదమాయుధముగా గల్గు పుల్గు (కోడిపుంజు - అడుగుకైదువు పుల్గు)

**అజ్జవాలు** - పాదము ఆయుధముగా గలది (కోడి - చరణాయుధము)

**అజ్ఞాతము** - తెలియబడనిది

**అజ్ఞేయము** - తెలియ శక్యము కానిది (మాయ)

**అటకలి** - ఒడలి జిడ్డును మకిలిని బోగొట్టెడు నురుగు బిళ్ళ, నలుగుబిండి మొదలైనవి.

**అటవి** - వేటకై దిరుగాడు చోటు (అడవి)

**అటావికాకారుడు** - శూద్ర స్త్రీకి చిత్రకారుని వలన బుట్టినవాడు (తాపీపనివాడు)

**అడకత్తెర** - పోకలు కత్తిరించు కత్తెర (పోక కత్తెర)

**అడవికాపు** - అడవి యందుండునది (కోతి)

**అడవికుక్క** - కుక్క యాకారము గలిగి అడవి యందు సంచరించునది (తోడేలు)

**అడవిగీము** - అడవి గృహముగా గలది (వానరము)

**అడవిచిచ్చు** - చెట్లరాపిడి వలన బుట్టు నిప్పు (దావాగ్ని - కార్చిచ్చు)

**అడవి తిరుగుడు** - అరణ్యమునందు సంచరించునది (కోతి, రుసి)

**అడవిద్రిమ్మరి** - అడవులయందు సంచరించునది (కోతి, అడవినట్టు)

**అడవి నెలవరి** - అడవులయందు సంచరించునది (కోతి - అడవి మనికి)

**అడవిపుట్టువు** - అడవియందు బుట్టినది (ఐరావతము, చదలేన్గు)

**అడవిమనికిపట్టు** - అరణ్యము నివాస స్థానముగా గలవాడు (జడదారి)

**అడిదండలు** - అపరాధి చేతులకు తగిలించు సంకెళ్ళు (అరదండాలు)

**అడిదపుమెకము** - కత్తివంటి కొమ్ములు గలది (ఖడ్గమృగము)

**అడుగు కైదువుదునేదారి** - పాదము ఆయుధముగా గల ప్రభువు (వామన రూప విష్ణువు)

**అడుగుకైదువుపుల్గు** -పాద మాయుధముగా గలది (కోడిపుంజు)

**అడుగుచూపరి** - పాదమున కన్ను కలవాడు (గౌతముడు)

**అడుగుచెమ్మగలాడు** - గంగ యుద్భవించిన కారణమున పాదములయందు తడిగలవాడు (విష్ణువు)

**అడుగుదోదుమి** - పాదము ఆయుధముగా గలది (కోడి, అడుగు కైదువుపులుగు)

**అడుగుపుట్టువు** - బ్రహ్మదేవుని పదముల యందు బుట్టినవాడు (శూద్రుడు), విష్ణుపాదములయందు బుట్టినది (గంగ)

**అడుగువాకగలాడు** - పాదమున గంగానది గలవాడు (విష్ణువు)

**అడుగువాలుపులుగు** - పాదములు ఆయుధములుగా గల పక్షి (కొడి)

**అడుసుబుట్టువు** - బురదయందు పుట్టినది (తామర పూవు)

**అడ్డపాప** - చేతులలో అడ్డముగా బట్టదగిన శిశువు

**అడ్డవేడెము** - సర్పగమనమువలె నుండెడు అశ్వధారా విశేషము (రేచితము)

**అడ్డసాళ్ళాడు** - పాచికలు వేయు (సొగటాలాడు)

**అణిమ** - సూక్ష్మముగా జేయునది (అష్ట సిద్ధులలో నొకటి)

**అణిష్ఠము** - అన్నిటికంటెను అతి చిన్నది (పరమాణులేశము, ప్రోటాన్లు)

**అణువాదము** -పరమాణువులు నిత్యములు జగత్కారణములునని చెప్పెడి తార్కిక వాదము

**అతటము** - ఒడ్డులేనిది (కొండచరియ)

**అతద్గుణము** - ఇతర వస్తువుయొక్క గుణమును పొందదగిన కారణ ముండియు బొందనట్లు వర్ణింపబడినది (ఉదా - నీ కీర్తి యొక్క తెల్లదనముచే కళకంఠుని కంఠమైనను దెల్లనగును గాని నీ శత్రువుల యపకీర్తి తెలుపుగాదు - శత్రురాజులకీర్తి తెల్లబడదగియుండియు కాలేదు - అతద్గుణాలకారము)

**అతనువు** - శరీరము లేనివాడు (మన్మథుడు)

**అతికాముకము** - మిక్కిలి కామేచ్ఛకలది (కుక్క)

**అతికాయుడు** - అసాధారణమైన యాకారము గల మానవుడు

**అతికేసరము** - ఎక్కువ కింజల్కములు కలది (గొజ్జగిచెట్టు)

**అతిక్రూరము** - మిక్కిలి క్రూరమైనది (శని గ్రహము, కుజ గ్రహము)

**అతిఖట్వుడు** - మంచమును మించిన పొడవు గలవాడు

**అతిగంధము** - ఎక్కువ వాసన గలది (గంధము, సంపెంగ)

**అతిగవుడు** - బుద్ధిలేక పోవుటయందు గోవు నతిక్రమించిన వాడు (మూర్ఖుడు), వాక్కులక గోచరుడు (పరమాత్మ)

**అతిగుహ** - గుహను మించి ఏపుగా పెరుగునది (కోలపొన్నచెట్టు)

**అతిఘుము** - మిక్కిలి హింసించునట్టిది (కోపము, ఆయుధము)

**అతిచర** - ఎక్కువగా అల్లుకొనునది (మెట్టతామర)

**అతిచ్ఛత్రము** - గొడుగును మించి గుబురుగా పెరుగునది (గొడుగుగడ్డి, కుక్కగొడుగు)

**అతి జాగరము** - ఎల్లప్పుడును మేలుకొని యుండునది (నల్లకొంగ)

**అతిజాతుడు** - తల్లిదండ్రుల గుణములను మించి పుట్టినవాడు

**అతి తీక్ష్ణము** - ఎక్కువ కారము గలది, మిక్కిలి వాడియైనది

**అతిథి** - తిథ్యాది కాలనియమములేక యింటికి భోజనమునకు వచ్చువాడు

**అతిదుష్టము** - ముండ్లచే దున్సహమైనది (పల్లేరుచెట్టు)

**అతిదేశము** - ఒకదాని ధర్మమును సామ్యమును బట్టి వేరొక దానియందు ఆరోపించుట

**అతిధన్వుడు** - శ్రేష్ఠమైన విల్లు కలవాడు (మహాధానుష్కుడు)

**అతిధృతి** - అతిశయించిన ధైర్యము గలవాడు

**అతిపత్రము** - మిక్కిలి విశాలమైన ఆకులు కలది (టేకు)

**అతిపన్నము** - నకాలమున చేయక నిలిపి వేయబడినది, కడచిపోయినది (అగ్ని హోత్రాదులు, కాలము, మార్గము)

**అతిబల** - శ్రీరామలక్ష్మణులకు విశ్వామిత్రుడుపదేశించినయొక విద్య

**అతిబలుడు** - మిక్కిలి బలము గలవాడు (వాయుదేవుడు)

**అతిబ్రహ్మచర్యుడు** - అతిక్రమించిన బ్రహ్మచర్య వ్రతము గలవాడు

**అతిభారగము** - ఎక్కువ బరువుతో బోవునది (గాడిద)

**అతి మంగల్యము** - అతి మంగళ ప్రదమైనది (మారేడుచెట్టు)

**అతిమానుషము** - మానవశక్తికి మించినది (దివ్యము)

**అతిమాయుడు** - మాయనతిక్రమించిన వాడు (ముక్తుడు)

**అతిమోక్ష** - పూల నధికముగా విడుచునది (విరజాజి)

**అతిమృత్యువు** - మృత్యువు నతిక్రమించునది (మోక్షము)

**అతిమోద** - అధిక పరిమళము కలది (విరజాజి చెట్టు)

**అతిరక్తము** - మిక్కిలి ఎఱ్ఱనిది (మందార పుష్పము)

**అతిరథుడు** - విలుకాండ్ర సమూహముతో నొంటిగ యుద్ధము చేయువాడు

**అతిరేచకము** - మిక్కిలి విరేచన కారియగు ఓషధి (కారికొల్లి చెట్టు)

**అతిరోమశము** - ఎక్కువ రోమములు కలది (పెద్దకోతి - అడవిమేక)

**అతిలోమశము** - దట్టమైన రోమములు కలది (అడవిమేక, అతిరోమశము)

**అతివ** - ఎక్కువ వన్నెలు కలది (పుణ్యస్త్రీ)

**అతివర్ణాశ్రమి** - వర్ణాశ్రమ ధర్మములను అతిక్రమించువాడు

**అతివాసము** - శ్రాద్ధమునకు బూర్వ దినమున జేయు నుపవాసము

**అతివృష్టి** - రహదారులు జలమయ మగునట్లు దినముల తరబడి కురిసెడు వాన

**అతివైశసనము** - మిక్కిలిగా బాధపెట్టునది

**అతివ్యాప్తి** - మితిమీరి వ్యాపించుట (లక్షణ దోషము), కొమ్ములు గలది గోవు (గో లక్షణముగా చెప్పిన కొమ్ములు గలిగి యుండుటయను ధర్మము మహిషము నందు పట్టుటచే అతివ్యాప్తి దోషము సంభవించినది )

**అతిశయోక్తి** - వలసిన దాని కంటె నెక్కువగా వర్ణింపబడిన పలుకు

**అతిశ్వము** - బలమునను, నీచత్వమునను గుక్కను మించినది (అడవి పంది)

**అతి సారకి** - విరేచనము లెక్కువగా నగు రోగ విశేషము గలవాడు

**అతిసౌరభము** - మిక్కిలి పరిమళము కలది (మామిడిచెట్టు)

**అతీంద్రియుడు** - ఇంద్రియములకు గోచరము కానివాడు (పురుషుడు - ఆత్మ)

**అతీత మహిషీ బంధము** - గృహస్థుగా నున్నప్పుడు పెంచిన ప్రేమచేత సన్న్యాసాశ్రమము దీసికొన్నను గేదెపై మమకారము విడువ కుండుట

**అత్త** - తన కూతురు నిచ్చుటచే అత్తు కొనునది

**అత్తెసరు** - అన్నములో గంజి అత్తుకొని పోవునట్లు పెట్టెడి ఎసటి నీరు

**అత్యంకుశము** - అంకుశమునకు సైతము లొంగనిది (మదపుటేనుగు)

**అత్యంతవాసి** - ఎల్లప్పుడును గురువు చెంతనుండువాడు (శిష్యుడు)

**అత్యంత సంయోగము** - ఎడతెగని సంబంధము

**అత్యంత సుకుమారము** - మిక్కిలి కోమల మైనది (అరటిచెట్టు)

**అత్యంతాభావము** - త్రికాలములయందును లేకుండుట (త్రికాలములయందు నుండెడి సంసర్గాభావము)

**అత్యంతికము** - అతిచేరువలో నున్నది

**అత్యంతీనుడు** - యుద్ధాదులయందు దరచుగా బోవు స్వభావము కలవాడు

**అత్యధ్వుడు** - దారి తప్పిన బాటసారి

**అత్యమ్లు** - మిక్కిలి పుల్లనిది (అడవిదబ్బ, మాదీఫలము)

**అత్యయము** - కాలము నతిక్రమించిపోవుట, (మరణము) శుభావహవిధిని మీరినది (దోషము)

**అత్యామ్లము** - మిగుల పులుపుగలది (చింతచెట్టు)

**అత్యుక్తి** - వలసిన దానికంటె అధికముగా చెప్పుట, అత్యద్భుతమును, మిథ్యా రూపమునగు ఔదార్యాది వర్ణనగల అలంకారము

**అత్యుగ్రము** - మిక్కిలి తీవ్రమైన పరిమళము గలది (ఇంగువ)

**అదంతము** - దంతములు లేనిది (జలగ), హ్రస్వ "అ"కారము అంతమున గలది

**అదంష్ట్రము** - దంతములు లేనిది (కోరలు తీసిన పాము)

**అదత్తము** - అల్పమైనదానము (చెల్లని ఈవి)

**అదమ్యము** - లొంగదీసికొన వీలుకానిది

**అదయుడు** - దయలేనివాడు (క్రూరుడు నిర్దయుడు)

**అదరుగ్రోవి** - అదరులు (నిప్పునలుసులు) చిమ్మెడు గొట్టము బెదరు పుట్టించు గొట్టము (తుపాకి)

**అదరుప్రేత** - అదరునట్లు కొట్టెడు దెబ్బ

**అదవ** - దిక్కులేనివాడు (పేద), మగడు లేనిది (అనద)

**అదితిజుడు** - కశ్యపునకు అదితియందు బుట్టిన వాడు వేలుపు

**అదితినందనుడు** - తల్లియగు నదితిని సంతసింప జేయువాడు (ఇంద్రుడు - )

**అదీనము** - పేదరికము లేనిది (సంపన్నము), బలహీనము కానిది (ఏనుగు)

**అదురుగ్రోవి** - బెదరు పుట్టించు గొట్టము (తుపాకి)

**అదురేటు** - ఉన్నట్లుండి (ఏమరు పాటున) భయ పడునట్లు కొట్టెడి దెబ్బ (అదరు వేటు)

**అదువకాపు** - కౌలునకు తీసికొని సేద్యము చేయు కాపు (భూస్వామికి గుత్తమొత్తము చెల్లింతునని ఒప్పుకొని వ్యవసాయము చేయుకాపు)

**అదృశ్యకరణము** - వస్తువులను కనబడకుండ జేసెడు విద్య

**అదృష్టము** - చూడబడనిది

**అదేవమాతృకము** - కాలువల ద్వారా నదీ జలము పంపిణీ చేయబడిన పంట పొలము (నదీ మాతృకము)

**అదేశ్యము** - దేశ్యపదము కానిది (తత్సమ, తద్భవ, గ్రామ్య, అన్యదేశ్యాదులలో ఒకటి), స్వదేశీయము కానిది (అన్యదేశ్యము)

**అదోహము** - దోహనవేళకానిది (పాలుపిదుక కూడని సమయము)

**అద్దంతరపుసిరి** - నడుమ కాలమున వచ్చిన (చేరిన) సంపద (నడమంతరపుసిరి)

**అద్దగడియ** - పండ్రెండు నిమిషముల కాలము

**అద్దగోడ** - ఆవరణ కుడ్యము

**అద్దాపురుషుడు** - మంచి గుణములచె మనుష్యుడుగా గుర్తింపబడిన వాడు (ఉత్త ముడు)

**అద్భుతము** - (అత్ ఆశ్చర్యార్థకమైన అవ్యయము) ఆశ్చర్యమునకు ఉత్పత్తి స్థానము (అబ్బురము)

**అద్మరుడు** - భక్షించు స్వభావము గలవాడు (తిండి పోతు)

**అద్యతనము** - కడచిన రాత్రి యొక్క చతుర్థ యామము మొదలుకొని రాబోవు రాత్రి యొక్క ప్రథమ యామము ముగియు వరకు గల కాలము, నిన్నటి నడురేయి మొదలుకొని నేటి నడురేయి వరకు గల కాలమని పక్షాంతరము

**అద్యశ్వీన** - నేడో రేపో ప్రసవించు స్త్రీ (నిండు చూలాలు)

**అద్యావధి** - నేడు అవధిగా కలది

**అద్రి** - ఫలమూల ద్వారమున భక్షింపబడునది (పర్వతము)

**అద్రికీల** - దీనికి కులపర్వతములు కీలముల వంటివి (భూమి)

**అద్రికుక్షి** - అద్రికి కుక్షివంటిది (కొండగుహ)

**అద్రిజ** - పర్వతరాజగు హిమవంతునకు బుట్టినది (పార్వతి)

**అద్రిజాతము** - పర్వతమున బుట్టినది (శిలాజిత్తు)

**అద్రినందన** - అద్రిజ

**అద్రిభిత్తు** - పర్వతముల రెక్కలను ఛేదించిన వాడు (ఇంద్రుడు)

**అద్రిభిదుడు** - కొండలను పగుల కొట్టినవాడు (ఇంద్రుడు - అద్రిభిత్తు)

**అద్రిభువు** - హిమవంతుడను పర్వత రాజు నకు బుట్టినది (పార్వతి)

**అద్రిరాజు** - పర్వతములకు ప్రభువు (హిమవంతుడు)

**అద్వయవాది** - సమస్తమును చిత్స్వ రూపము, దానికంటె రెండవది లేదని వాదించువాడు (బుద్ధుడు)

**అద్విషరాగీ** - ఇష్టానిష్టములు లేనివాడు

**అద్వైతానందము** - జీవ బ్రహ్మైక్యాను భవము వలన గలిగెడు ఆనందము

**అద్వైతి** - జీవబ్రహ్మైక్యమును బోధించు మతమువాడు

**అధఃకాయము** - దేహము యొక్క క్రింది భాగము

**అధఃకృతము** - క్రిందు పరుపబడినది

**అధఃపుష్పి** - క్రిందు మొగమైన పూలు గలది (సదాప, బెండ)

**అధనుడు** - ధనము లేనివాడు (దరిద్రుడు)

**అధమర్ణుడు** - అధమమైన ఋణము కలవాడు (అప్పుతీసికొన్నవాడు)

**అధరము** - ముఖము యొక్క అధో భాగమున నుండునది (పెదవి)

**అధర్వణి** - అధర్వవేదము తెలిసిన బ్రాహ్మణుడు

**అధర్వణుడు** - బ్రహ్మ విద్యను అంగిరునకు బోధించిన ముని, అధర్వ వేదము తెలిసిన బ్రాహ్మణుడు

**అధరారణి** - ఒరపిడి చేసి నిప్పు పుట్టించుటకు వీలగు క్రింది కొయ్య

**అధశ్చరుడు** - కన్నము నుండి ప్రవేశించి ఇంట జొచ్చువాడు (దొంగ)

**అధశ్శయుడు** - నేలపై బరుండు వాడు

**అధశ్శల్యము** - క్రిందు మొగమైన ముండ్లు గలది ఉత్తరేణి చెట్టు)

**అధశ్శిరస్సు** - అధోముఖముగా నున్నది (ఒక నరకము)

**అధికమాసము** - ఒక సంవత్సరములోనే రెట్టింపుగా వచ్చెడు సూర్యసంక్రమణము లెని చాంద్రమాన మాసము

**అధికృతుడు** - అందరిమీద నియోగింప బడినవాడు, అధికారముచేయువాడు (అధికారి)

**అధిక్షిప్తుడు** - కూట సాక్ష్యములచే నిందింప బడినవాడు (ఆక్షేపితుడు - ప్రతిక్షిప్తుడు)

**అధిగుణము** - ఎక్కుపెట్టబడిన నారి కలది (విల్లు), శ్రేష్ఠమైన గుణము కలవాడు (గుణవంతుడు)

**అధిజిహ్వము** - ఒకటి కంటె మించిన జిహ్వలు గలది (సర్పము)

**అధిత్యక** - పర్వతము మీద నుండెడు భూమి

**అధిదేవత** - అధిష్ఠించి యుండెడు దేవత

**అధిదేవుడు** - నర్వ దేవతలను మించిన పరమేశ్వరుడు

**అధినగ్నిక** - పదునొకండు వత్సరముల కన్యక

**అధిపుడు** - అధికమును బాలించువాడు (ఏలిక)

**అధిప్రజుడు** - ఎక్కువ బిడ్డలు గలవాడు

**అధిభువు** - సేవకునకు మీదై యుండువాడు (ప్రభువు)

**అధిభూతము**- సమస్తభూతముల యందును చరించుచుండునది (పరమాత్మ)

**అధిమంథము** - నిప్పుకొరకు మథించు కొయ్య (అరణి)

**అధిమాసము** - రవి సంక్రమణము లేని మాసము అధికమాసము-మలమాసము

**అధియోధుడు** - ముందు నిలిచి యుద్ధము చేయు వీరుడు (గొప్పయోధుడు)

**అధిరథుడు** - రథము మీదనున్నవాడు (సారధి)

**అధిరోహణి** - ఎక్కుటకు అనువైన సాధనము (నిచ్చెన)

**అధిరోహుడు** - గజాదులపై నెక్కువాడు (మావటివాడు మొ॥)

**అధివాసరము** - శ్రాద్ధ దినమునకు పూర్వ దినమున చేయు ఉపవాసము

**అధివిన్న** - భర్త వేరొక స్త్రీని వివాహమాడి నందుకు అలిగి ఇలువెడలి పోయిన మొదటి భార్య, మొదట పెండ్లాడబడినది (పెద్దభార్య)

**అధివేత్త** - భార్య జీవించి యుండగా మరియొక స్త్రీని వివాహమాడినవాడు

**అధివేదనికము** - మరియొక స్త్రీని బెండ్లాడునపుడు మొదటి భార్యకు భర్తచే ఈయబడిన ధనము (స్త్రీ ధనము)

**అధిశ్రయణి** - దీనిపై పాకము చేయుబడును (ప్రొయ్యి)

**అధిష్ఠితము** - నివాసముగా చేసికొనబడినది

**అధీతి** - అధ్యయనము చేసినవాడు

**అధీనుడు** - ఇతరులకు లోబడినవాడు

**అధీయానుడు** - వేదాధ్యయనము చేయు విద్యార్థి

**అధీర** - పరుష వాక్యములచేత భర్తను వేధించు శృంగార నాయిక

**అధీరుడు** - ధైర్యము లేనివాడు

**అధీశ్వరుడు** - సామంతరాజులచే సేవింపబడువాడు (చక్రవర్తి)

**అధునాతనము** - ప్రస్తుత కా·లమునకు సంబంధించినది

**అధూమకము** - పొగలేని నిప్పు

**అధృష్టుడు** - దిట్టతనము లేనివాడు

**అధోక్షజుడు** - ఇంద్రియ జన్యజ్ఞానము నతిక్రమించిన వాడు, జితేంద్రియులకు ప్రత్యక్ష మగువాడు (శ్రీమహావిష్ణువు)

**అధోగంత** - భూమిలో సంచరించునది (ఎలుక)

**అధోఘంట** - దిగువను గంటల వంటి కాయలు గలది (ఉత్తరేణి)

**అధోభుక్తము** - భోజనానంతరమున త్రాగునది (నీరు, మందు, మొ॥)

**అధోభువనము** - దిగువ (క్రింద) నుండు లోకము (పాతాళ లోకము)

**అధోరేచకము** - కుష్ఠ రోగమును బోగొట్టు రేల చెట్టు (కుష్ఠ సూదనము)

**అధోలోకము** - దిగువ నుండు లోకము

**అధోవాయువు** - గుద స్థానము నుండి పోవు వాయువు (అపాన వాయువు)

**అధ్యక్షము** - ఇంద్రియములను బొందునది (ప్రత్యక్ష జ్ఞానము)

**అధ్యక్షుడు** - ఇంద్రియ గోచరమైన వాడు, చూపు, ఆజ్ఞల ద్వారమున అందరి మీద వ్యాపించువాడు (అధికారి)

**అధ్యయనము** - గురుముఖమున జరుగు వేద పఠనము

**అధ్యస్తము** - ఆరోపింపబడినది

**అధ్యాత్మదృశుడు** - అంతరాత్మను దెలిసి కొన్నవాడు

**అధ్యాత్మవిదుడు** - వేదాంత శాస్త్రము తెలిసిన వాడు

**అధ్యాపకుడు** - వేదమును విద్యార్థులకు జెప్పువాడు

**అధ్యాపయిత** - శిష్యులచే వేదాధ్యయనము చేయించువాడు, (గురువు) విద్యార్థులకు చదువు చెప్పువాడు (ఉపాధ్యాయుడు)

**అధ్యాప్యము** - చదివింప తగినది

**అధ్యారూఢము** - ఎక్కబడినది. ఆక్రమింప బడినది

**అధ్యారోపము** - ఒకదాని గుణమును మరియొక దాని యందున్నట్లు భ్రమించుట

**అధ్యావాహానికము** - అత్తవారింటికి బోవునపుడు కూతునకు తల్లిదండ్రులు ఇచ్చు ధనము (సారె, అరణము)

**అధ్యాసము** - ఒక దానిని మరియొక దానినిగా భావించుట (మిధ్యా జ్ఞానము)

**అధ్యాహారము** - ఆకాంక్షచే లేనిపదములను వాక్యపూరణమునకై తెచ్చుకొనుట

**అధ్యూఢ** - సవతి తనముచే విలపించునది (మొదటి భార్య)

**అధ్యూధ్ని** - పెద్ద పొదుగులు గల యావు

**అధ్యేత** - చదువువాడు (విద్యార్థి)

**అధ్యేయము** - అధ్యయనము చేయదగినది

**అధ్యేషణ** -అర్హులను (పూజ్యులను) సత్కార పూర్వకముగా ఒక కార్య పర్యవేక్షకులుగా ప్రవర్తింపజేయుట

**అధ్వగ** - మార్గమున బ్రవహించునది (నది)

**అధ్వగుడు** - మార్గమున నడచువాడు, (బాటసారి)

**అధ్వనీనుడు** - శీఘ్రముగా నడచువాడు, (పధికుడు)

**అధ్వన్యుడు** - బాగుగ నడువ జాలినవాడు, (తెరువరి)

**అధ్వపతి** - మార్గమును గాచుచుండుటచే బ్రభువైన వాడు, (సూర్యుడు)

**అధ్వపుడు** - రహదారుల యధికారి

**అధ్వము** - బలమును భక్షించునది (త్రోవ)

**అధ్వరము** - వైదిక మార్గమును బొందించునది

**అధ్వర్యుడు** - యజ్ఞమునందు యజుర్వేద విధానమును నడుపు ఋత్విక్కు

**అధ్వశల్యము** - మార్గమున పాదములకు వస్త్రములకు దగుల్కొని శల్యమువలె బాటసారులను బాధించునది, (ఉత్తరేను - అపామార్గము)

**అధ్వాంతము** - కటిక చీకటి కానిది. (సంజ చీకటి)

**అధ్వాంతశాత్రవము** - దారికి శత్రువు వంటిది, (దుండిగము చెట్టు)

**అధ్వానము** - దారి తెలియనిది, (తప్పుదారి)

**అనంగము** - అవయములు లేనిది, (ఆకాశము మనస్సు)

**అనంగలేఖ** - కాముకీ కాముకు లొండొరులకు వ్రాసికొనెడు ప్రణయ లేఖ, (ప్రేమలేఖ)

**అనంగుడు** - అవయవములు లేనివాడు, (మన్మధుడు)

**అనంత** - అంతములేనిది (భూమి)

**అనంతము** - అంతము లేనిది, (ఆకాశము) శాశ్వతమైనది (పరబ్రహ్మము)

**అనంతముడులు** - సర్పాకారము గల చెవిపోగులు (నాగు పోగులు)

**అనంతరజ** - పురుషునకు తన యనంతర జాతి స్త్రీ యందు గల్గిన కూతురు, (అక్క, చెల్లెలు)

**అనంతరజుడు** - పురుషునకు తనయనంతర జాతి స్త్రీ యందు గల్గినవాడు, (అన్న, తమ్ముడు)

**అనంతరము** - ఎడములేనిది, (అవ్యవధానము)

**అనంతవిజయము** - హద్దులేని జయములు కలది, (ధర్మరాజు శంఖము)

**అనంతశయనము** - అంతము లేని శయనము, (మరణము)

**అనంతశయనుడు** - ఆదిశేషునిపై పవళించు వాడు (విష్ణువు)

**అనంతుడు** - అంతము లేని వాడు, (ఆదిశేషుడు, విష్ణువు)

**అనంశము** - విభాగము లేనిది

**అనక్షరము** - పలుకరానిది, (తిట్టు)

**అనక్షరుడు** - అక్షరజ్ఞానము లేనివాడు (మూర్ఖుడు)

**అనగారము** - పాడుపడిన ఇల్లు

**అనగారుడు** - ఇల్లు లేని వాడు, (సన్న్యాసి)

**అనఘుడు** - పాపము లేనివాడు (శివుడు, విష్ణువు)

**అనడ్వాహము** - బండిలాగునది, (ఎద్దు)

**అనద్యతనము** - అద్యతనము కానికాలము,

**అనధ్యక్షము** - కంటికి కనబడనిది,

**అనధ్యయనము** - వేదాది పఠనమునకు నిషిద్ధమైన కాలము

**అనధ్యాయతిథులు** - వేద పఠనమునకు విసర్జనీయ తిథులు, (పాడ్యమి, అష్టమి, చతుర్దశి, పౌర్ణమి, అమావాస్య క్షయతిథిలో ఉదయము 5 గడియలు వృద్ధిలో 3 గడియలు విడువ దగినవి)

**అనన్యగతికుడు** - ఇతర మార్గము లేనివాడు

**అనన్యచింతుడు** - ఒకదానియందే మనస్సు లగ్నము చేయువాడు

**అనన్యచిత్తుడు** - ఒకదానియందే మనస్సు నిల్పువాడు

**అనన్యపూర్వ** - పూర్వ మెవ్వడును భర్తగా లేనిది, (కన్య)

**అనన్య పూర్వుడు** - పూర్వ మెవ్వతియు భార్యగా లేనివాడు, (అవివాహితుడు)

**అనన్యము** - మరియొకటి లేనిది,వేరుకానిది

**అనన్య వృత్తి** - ఒక విషయముననే మనస్సును నిల్పినవాడు

**అనన్య శరణ్యుడు** - వే రెవరును రక్షకుడుగా లేనివాడు, (సర్వేశ్వరుడు)

**అనన్య శాసనుడు** - తనపై మరియొకరి శాసనము లేనివాడు, (స్వతంత్రుడు)

**అనన్వయము** - ఉపమానోపమేయములు ఒకటే యగుట, (చంద్రుడు చంద్రునివలె కాంతిమంతుడు చంద్రునికి సాటి చంద్రుడే. ఉపమానము చంద్రుడు ఉపమేయము చంద్రుడే), అన్వయము పొసగనిది

**అనపత్యుడు** - సంతానము లేనివాడు

**అనపాయము** - ఎడబాటు లేనిది

**అనపేక్షుడు** - కోరికలు లేనివాడు (నిరీహుడు)

**అనభ్ర వృష్టి** - మబ్బులేని వాన

**అనయము** - శుభావహము గానిది, నీతి లేనిది, (ఆపద, మోసము)

**అనర్గలము** - అడ్డు (గడియ) లేనిది

**అనర్ఘము** - వెలకట్టరానిది, (విలువైనది)

**అనర్థకారుడు** - దండుగ పనులుచేయు వాడు, హాని చేయువాడు

**అనలము** - దీనిచే ప్రాణులు జీవింతురు, (అగ్ని)

**అనలుడు** - లోకములకు జీవనాధారమైన వాడు, (కాష్ఠాదుల చేత చాలుననుట లేనివాడు (అగ్నిదేవుడు)

**అనవచ్ఛిన్నము** - ఎంతమాత్రము విభాగింపబడనిది, ఎడతెగనిది

**అనవరతము** - ఎడతెగుట లేనిది

**అనవరార్ధ్యము** - నికృష్టము కానిది (గొప్పది)

**అనవస్కరము** - బాగుగా కడుగుటచే నిర్మలమైనది

**అనశ్వరము** - నాశనము లేనిది, (శాశ్వతము)

**అనశనము** - భోజనము చేయకుండుట, (ఉపవాసము)

**అనసూయ** - అసూయ లేనిది, (అత్రిమహాముని భార్య)

**అనస్సు** - దీనిచే వాహనము జీవించును శబ్దము చేయుచు పోవునది (బండి)

**అనాగతము** - రాబోవునది

**అనాగత విధాత** - రాగల కష్టములకు తరణోపాయమాలోచించి యుంచుకొన్న వాడు (ముందుచూపు కలవాడు)

**అనాగతార్తవ** - పొందని ఋతు ధర్మము కలది

**అనాఘ్రాతము** - వాసన చూడబడనిది

**అనాతురుడు** - వేగిరపడనివాడు

**అనాత్మజ్ఞుడు** - పరమాత్మ స్వరూపము తెలియని వాడు

**అనాత్మ్యము** - తన కుటుంబముపై (మమకారము) అభిమానము లేకుండుట

**అనాది** - చాల కాలముగా నున్నది, మొదలు లేనిది

**అనాది జటిలుడు** - తొలి నుండి జడలు కలవాడు (శివుడు)

**అనాది నిధనుడు** - జనన మరణములు లేనివాడు, (పరమాత్మ)

**అనాదిమధ్యాంతము** - ఆది, మధ్య, అంతము లేనిది, (పరమాత్మ)

**అనాదీనవము** - దోషము లేనిది

**అనాదేయము** - స్వీకార యోగ్యము కానిది (తీసికొనరానిది)

**అనామకుడు** - పేరులేని వాడు (అగస్త్యభ్రాత మొ॥)

**అనామయము** - రోగము లేనిది (ఆరోగ్యము)

**అనామిక** - ప్రసిద్ధమగు నామము లేనిది (ఉంగరపు వ్రేలు - దర్భవ్రేలు)

**అనాయత్తము** - సిద్ధము కానిది

**అనార్తవము** - ఋతు నియమము లేక సర్వకాలము లందుండునది

**అనార్యజుష్టము** - ఆర్యులు ఆచరింపనిది (చెడ్డది)

**అనార్యతిక్తము** - అనార్యదేశమున బుట్టిన తిక్తము (కిరాతతిక్తము - నేలవేము)

**అనావృత్తి** - తిరిగి జన్మమురాకుండునది (ముక్తి)

**అనావృష్టి** - బొత్తుగా వానలు లేకుండుట

**అనాస్థుడు** - ఆసక్తి లేనివాడు

**అనాస్వాదితము** - రుచి చూడ బడనిది,

**అనాహతము** - ఉదుక బడనిది, (క్రొత్త వస్త్రము) చిరుగులేనిది, (వస్త్రము) భోగింపబడనిది, (క్రొత్తది) అనాహతమను పేరుగల చక్రము (శరీరము నందలిది)

**అనిదంపూర్వము** - పూర్వమందు లేనిది (అపూర్వము)

**అనిబద్ధ నెరబం ట్లరుగు దారి** - యుద్ధమున మరణించిన వీరులు పోవు మార్గము (సూర్యమార్గము)

**అనిమిత్తము** - కారణము లేనిది, అపశకునము

**అనిమిషము** - రెప్పపాటు లేనిది, (చేప)

**అనిమేషుడు** - రెప్పపాటు లేనివాడు (అనిమిషుడు - దేవత)

**అనిరుక్తము** - స్పష్టముగా పలుక బడనిది, స్పష్టముగా చెప్పబడనిది (లక్షణము లేనిది)

**అనిరుద్ధ పదము** - అడ్డగింపబడని మార్గము గలది (ఆకాశము)

**అనిరుద్ధుడు** - ఇతరులచే అడ్డగింపబడని వాడు (శివుడు, శ్రీకృష్ణుని మనుమడు) అవతారములందెవ్వని చేతను నిరోధింప బడనివాడు (విష్ణువు)

**అనిలఘ్నము** - వాతరోగమును బోగొట్టునది (అనిలఘ్నకము - తాండ్ర)

**అనిలాత్మజుడు** - వాయుదేవుని కుమారుడు (ఆంజనేయుడు, భీముడు - అనిలజుడు)

**అనిలసఖుడు** - వాయుదేవుని చెలికాడు (అగ్ని)

**అనిలసారథి** - వాయుదేవుని సారథి (అగ్ని)

**అనిలాంతకము** - వాతరోగమును బోగొట్టునది (గారచెట్టు)

**అనిలాశనము, అనిలాశి** - గాలి ఆహారముగా గలది (పాము)

**అనిలుడు** - ప్రాణులకు జీవనాధారమైన వాడు (వాయుదేవుడు)

**అనీకస్థుడు** - ఏనుగులను శిక్షించుటయందు నేర్పరి (మావటివాడు), యుద్ధమున నిలుచువాడు (వీరుడు)

**అనీకిని** - మూడు చమువులు గలది, (729 రథములు, 729 ఏనుగులు, 2187 గుఱ్ఱములు, 3645 కాలిబంట్లు సంఖ్యగల సేన చమువు)

**అనుకథనము** - అధికారులకు జెప్పుకొనుట (మనవి)

**అనుకనీయుడు** - కనిష్ఠుని కంటె పూర్వుడు, (నల్గురిలో మూడవవాడు)

**అనుకరణము** - ధ్వన్యాదులను (బడబడ, దడదడ) దెలుపునపు డుపయోగించు పదము, ఇతరులు చేసినటుల చేయుట

**అనుకర్షణము** - వెనుక సూత్రములోని పదములను తర్వాతి సూత్రములతో అన్వయించుట

**అనుకల్పము** - ముఖ్య కల్పమున అప్రధానమగు వేదాంగము

**అనుకామీనుడు** - తన యిష్టానుసారముగా బ్రవర్తించువాడు

**అనుకూలుడు** - నాయికలలో ఒకతెయందు విశేషానురక్తి జూపు నాయకుడు

**అనుకృతము** - ఒరులాచరించిన రీతిననుసరింప బడినది

**అనుక్రమణి(క)** - క్రమము ననుసరించినది (విషయసూచిక)

**అనుక్రోశము** - దీని కారణముగా దుఃఖము కల్గును (కనికరము)

**అనుక్షణము** - క్షణ క్షణము (ఎల్లప్పుడు)

**అనుగవీనుడు** - గోవులను వెంబడించు వాడు, (గొల్లవాడు)

**అనుగృహ్ణానుడు** - కరుణించుచున్నవాడు

**అనుచరుడు** - అనుసరించి చరించువాడు (సేవకుడు, సహాయుడు)

**అనుజ** - తన పిమ్మట పుట్టినది (చెల్లెలు)

**అనుజన్ముడు** - అనుసరించి జన్మించినవాడు (తమ్ముడు)

**అనుజుడు** - అనుజన్ముడు

**అనుజ్ఞాతుడు** - ఆజ్ఞాపింప బడినవాడు

**అనుజ్యేష్ఠుడు** - జ్యేష్ఠునకు తరువాతి వాడు

**అనుతర్షణము** - దీనితో పానము చేయుటకు ఇష్టపడుదురు (కల్లుముంత)

**అనుత్తమము** - ఉత్తమము కానిది (అధమము) దేనికంటె శ్రేష్ఠమైనది లేదో అది, (సర్వశ్రేష్ఠము)

**అనుత్తమర్ణుడు** - ఉత్తమమగు ఋణము లేనివాడు (అధమర్ణుడు)

**అనుదాత్తము** - ఉదాత్తము కాని అచ్చు (నీచై రనుదాత్త, ముఖము నందలి తాల్వాది స్థానముల క్రింది భాగమున వాయ్వా ఘాతముచే నిష్పన్నమగు అచ్చు

**అనుదారుడు** - ఎక్కువ ఉదార స్వభావము కలవాడు (దాత) ఉదారుడు కాని వాడు (దాత కానివాడు) అనుసరించిన భార్య కలవాడు భార్య ననుసరించి యుండు వాడు

**అనుద్భూత శక్తి** - జడత్వముగా పడియుండుటచే వెల్లడి కాని శక్తి (గతిశక్తి లేకపోవుటచే వెల్లడి కాని శక్తి - విజ్ఞాన శాస్త్రము)

**అనునాసికము** - ముఖ నాసికల రెండింటి తోడను ఉచ్చరింపబడు వర్ణము (అను స్వారము ఙ, ఞ, ణ, న, మ లు)

**అనుపరి** - పన్ను వసూలు చేయు అధికారి (సుంకరి)

**అనుపతనము** - ఒకదాని వెంట ఒకటి పడుట

**అనుపదము** - అడుగుల ననుసరించునది మాట మాటకు అనుసరించునది (వ్యాఖ్య మొ॥) పాటలో చరణ చరణమునకు వెనుక పాడెడి తొలి చరణము (పల్లవి)

**అనుపమ** - నైర్ఋతి దిక్కు నందలి యాడేనుగు

**అనుపల్లవము** - పల్లవి ననుసరించి వచ్చు చరణము

**అనుపనీతుడు** - వడుగు కానివాడు

**అనుపసేచనము** - ద్రవ పదార్థము లేని ఆహారము (పులుసు, చారు, మజ్జిగ మొదలగునవి లేని భోజనము)

**అనుపాతము** - ఒకదాని వెంట ఒకటి పడుట (అనుపతనము)

**అనుపానము** - ఔషధముతో కలిపి సేవించునది, మందుమ్రింగిన పిమ్మట పుచ్చుకొనునది, అన్నముతో గూడ తినదగిన వ్యంజన, చోష్య, లేహ్యాదులు

**అనుపు** - బాటసారులు చెల్లించు సుంకము, నాల్గు దారులు కలియు కేంద్రము (కూడలి) దనుకసాగనంపు (వీడ్కోలు)

**అనుపేతుడు** - అనుపనీతుడు, గురువు నొద్ద చదువ నారంభింపనివాడు

**అనుప్రవాదము** - ఆనోట ఆనోట వ్యాపించిన నీలి వార్త (వదంతి)

**అనుప్రశ్నము** - ఉపాధ్యాయుడు బోధించిన అంశముపై అనుమాన నివృత్తికై వేయు ప్రశ్న

**అనుప్రాసము** - శబ్ద సామ్యము కలుగునట్లు చెప్పబడిన శబ్దాలంకారము, ప్రాసాక్షరమును యతి స్థానముల ముందు వెనుకల నుంచుట, ఇచ్ఛానుసారమొక యక్షరమే మరల మరల ప్రయోగించుట

**అనుప్లవుడు** - తన వెంట వచ్చువాడు (సేవకుడు)

**అనుపుపెట్టు** - సహాయార్థము తోడు పంపు

**అనుబంధము** - ప్రధానము ననుసరించి యుండునది (అప్రధానము), జరుగుచున్నదాని ననువర్తించుట

**అనుబంధుడు** - గురువు లేక తండ్రి లోనగువారిని మార్గదర్శకులుగా చేసికొని నడుచుకొనువాడు (శిష్యుడు, కుమారుడు)

**అనుభావనము** - ముఖ కవళికలచే మనస్సు నందలి భావములను సూచించుట

**అనుభాషణము** - ఒద్దికగా మాటాడుట (ముచ్చటించుట)

**అనుమతి** - చతుర్దశీయుక్తమైన పూర్ణిమ, సమ్మతి

**అనుమననము** - ఎక్కువగా ధ్యానించుట

**అనురధ్య** - రాజమార్గమునకు కుడి ఎడమలగల కాలిబాట

**అనుమానము** - సాధన సామగ్రిచే సాధ్య వస్తువనుమేయింపబడుట (పదార్ధ జ్ఞానమునకు సాధనమైన ఒక ప్రమాణము - చూడని విషయమును జూచిన విషయము వలన దెలియుట)

**అనుమాపకము** - అనుమితికి హేతువైనది (తర్కపంచావయక వాక్యములలో రెండవది పర్వతము వహ్నిమంతము వక్షము ధూమవత్త్వము వలన (అనుమాపకము) ఇది హేతువు

**అనుమితి** - అనుమానము వలన (పరామర్శము వల్ల) గలిగిన జ్ఞానము, లింగ పరామర్శ జన్య జ్ఞానము (పెక్కు పర్యాయములు వంట యిల్లు మున్నగు వానియందు వ్యాప్తిని ఎచ్చట ధూమముండునో అచ్చట వహ్ని యుండు ననెడి సాహచర్య నియమమును గ్రహించి పర్వతమందు పొగచూచి అచ్చట నిప్పు ఉండునాయని సందేహము కలవాడై వ్యాప్తిని (సాహచర్య నియమమును) స్మరించుకొనిన పిమ్మట పర్వతము వహ్ని వ్యావ్య ధూమవంతము అనెడు జ్ఞానమును పొందుచున్నాడు దీనికే లింగపరామర్శమని వ్యవహారము)

**అనుమృతుడు** - మరణించిన వాని వెంట మరణించినవాడు

**అనుమేయము** - ఊహింపదగినది

**అనుమోదనము** - ఆనందమును కలుగజేయునది

**అనుయాయి** - అనుసరించువాడు

**అనురంజకుడు** - రంగులు వేయువాడు, సంతోష పెట్టువాడు

**అనులాపము** - మరల మరల చెప్పుట

**అనులోమ** - భర్త కంటె తక్కువ జాతి దగు భార్య

**అనులోమజుడు** - అనులోమకు బుట్టిన వాడు

**అనులోమభవుడు** - గొప్ప జాతి పురుషునికి తక్కువ జాతి స్త్రీకిని బుట్టినవాడు

**అనులోమము** - క్రమము ననుసరించునది (సక్రమము)

**అనువత్సరము** - 'ఇడావత్సరము' ననుసరించు సంవత్సరము యుగ చక్రము నందలి ప్రజాపతి అధిష్ఠాతగా గల నాల్గవ సంవత్సరము (సంవత్సరము, పరివత్సరము, ఇడావత్సరము, అనువత్సరము, ఇద్వత్సరము = యుగ(చక్ర)ము)

**అనువాకము** - మరల చెప్పుట, ఋక్కుల యొక్క గాని యజుస్సుల యొక్క గాని సమూహము

**అనువాచనము** - అధ్వర్యుని అనుమతి చొప్పున హోత ఋక్కులను బఠించుట

**అనువాదము** - ఒకరు చెప్పిన దానిని మరల చెప్పుట, ఒక భాషలోని విషయమును మరొక భాషలోనికి మార్చుట (భాషాంతరీకరణము)

**అనువేశము** - పెద్దవాని వివాహమునకు బూర్వము చిన్నవాడు పెండ్లాడుట

**అనుశతికము** - నూటిచే కొనబడినది

**అనుశయానుడు** - పశ్చాత్తాపము చెందు చున్నవాడు

**అనుశాయి** - అనుభవింపగా మిగిలిన పుణ్యపాపముల వాసన కలవాడు (జీవుడు)

**అనుశ్రుతము** - వారినోట వారినోట విన్నది, వేద సంప్రదాయము వలన వచ్చినది,

**అనుశ్రుతి** - ప్రస్తావన విషయమును గురించి అన్యసంభాషణములను శ్రద్ధతొ వినుట

**అనుష్టుప్పు** - పాదమునకు ఎనిమిది వర్ణములు గల శ్లోకము దీనిచే (నిరంతరము) దేవతలు స్తుతింప బడుదురు

**అనుష్ఠానము** - శాస్త్ర విహిత కర్మాచరణము

**అనుస్వారము** - స్వరము (అచ్చు) ననుసరించి వచ్చునది (బిందువు-సున్న)

**అనుస్వారయతి** - బిందు పూర్వకములగు క, చ, ట, త, ప వర్గము లందలి వరుస నాల్గక్షరములతో క్రమముగా అనునాసికాక్షరములగు ఙ, ఞ, ణ, న, మ లకు యతి చెల్లుట

**అనుహార్యము** - అనుకరింపదగినది

**అనూకము** - పాయకుండునది, (వంశము, స్వభావము)

**అనూచానము** - పరంపరగా ప్రాప్తించిన విద్యాదికము

**అనూపజము** - తడినేలలో పుట్టునది (అల్లము)

**అనూపము** - జలము సమృద్ధిగా గలచోటు

**అనూరుడు** - తొడలు లేనివాడు (సూర్యసారధి)

**అనృజుడు(వు)** - కుటిల హృదయుడు (కుత్సితుడు)

**అనృణి** - ఋణము లేనివాడు, (కాలాంతరమున పొందబడునది లేనివాడు)

**అనృతము** - ఋతము కానిది (అసత్యము)

**అనృశంసుడు** - హింస చేయనివాడు

**అనేకజము** - ఒకటి కంటె ఎక్కువ సారులు పుట్టునది (రెండింటి నుండి పుట్టునది - పక్షి - ద్విజము)

**అనేకపము** - రెండింటితో త్రాగునది (ద్విపము - ఏనుగు)

**అనేకలోచనుడు** - ఎక్కువ కన్నులు కలవాడు, (శివుడు, ఇంద్రుడు)

**అనేక శఫములు** - చీలిన గిట్టలుకలవి (ఆవు, జింక, మేక, మొ॥)

**అనేకార్థము** - నానార్ధములు కల పదము

**అనేడమూకుడు** - వినుటకు మాటాడుటకు తగనివాడు (చెవిటి - మూగ)

**అనేడుడు** - (మంచి) వినుటకు తగనివాడు (మూర్ఖుడు)

**అనేహస్సు** - నశింపనిది (కాలము)

**అనోకహము** - బండి యొక్క గమనమును ఆపునది (చెట్టు)

**అన్నకావడి** - ఎందుకు కొరగానివాడు (తిండిపోతు) అన్నపూర్ణకావడి,

**అన్నకుత్తి** - అన్నము వడ్డించు పనిముట్టు (గరిటె - హస్తము)

**అన్నదుడు** - అన్నమిచ్చువాడు (సూర్యుడు, అగ్ని - అన్నదాయి)

**అన్నప్రాశనము** - శిశువునకు తొలిసారిగా అన్నము తినిపించు శుభకర్మ విశేషము (అన్నప్రాశము)

**అన్నభేది** - అన్నమును అరగించునది (ఒకమందు దినుసు)

**అన్నమయ కోశము** - స్థూలదేహము (అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, అనందమయ కోశములలో మొదటిది)

**అన్నము** - తినబడినది

**అన్నశుద్ధి** - కూరలు అన్నము వడ్డించి సంస్కారార్థము అన్నము మీద నేయి వేయుట (అభిమారము)

**అన్నాదుడు** - అన్నము తినువాడు (మనుష్యుడు)

**అన్నాబత్తి** - సాంబ్రాణికడ్డీ (ఊదువత్తి)

**అన్నింటి తిండిపోతు** - సర్వభక్షకుడు (అగ్ని - అన్ని తినువాడు)

**అన్నెకారి** - అన్యాయము చేయు స్త్రీ

**అన్యచిత్తుడు** - మరొక దానియందు మనస్సు గలవాడు

**అన్యతమము** - పెక్కింటిలో ఒకటి

**అన్యతరము** - రెంటిలో నొకటి

**అన్యపుష్టము** - తల్లికంటె వేరగు కాకిచే బోషింపబడి౦ నె (కోయిల)

**అన్యపూర్వ** - మాటమనువు చేసికొన్న స్త్రీ, ఒకనికి మాటయిచ్చి వేరొకనికి పెండ్లి చేయబడిన స్త్రీ

**అన్యభృతము** - ఇతరులచే బోషింపబడినది (పరభృతము - కోయిల)

**అన్యభృత్తు** - ఇతరమైన దానిని (కోయిలను) పెంచునది (వాయసము - కాకి)

**అన్యవాది** - ప్రతిజ్ఞకు భిన్నముగా వాదించు వాడు (ప్రతివాది)

**అన్యవాపము** - మరియొక పిట్ట గూటిలో తన గ్రుడ్లను బెట్టునది (పికము - కోకిల)

**అన్యాపదేశము** - మనోభావము స్ఫురించునట్లుగా మరియొక దానిని చెప్పుట

**అన్యోన్యాధ్యాసము** - తారుమారుగా ధర్మములను ఆరోపించుట

**అన్యోన్యము** - పరస్పరము, ఒకదాని వలన ఒకటి శోభిల్లుచుండునట్లు వర్ణించెడు అలంకారము (రాత్రిచే చంద్రుడు చంద్రునిచే రాత్రియు శోభిల్లుచున్నవి)

**అన్యోన్యాభావము** - పరస్పరాభావము ఒండొండు గామి పటము ఘటము కాదు ఘటము పటము కాదు పటతాదాత్మ్యము ఘట మందులేదు పటతాదాత్మ్యా భావమే ఘట మందున్నది

**అన్యోన్యాశ్రయము** - రెండు విషయములు ఒకదానికొకటి ఆశ్రయములైయుండు వాక్యార్థదోషము

**అన్వయజ్ఞుడు** - వంశక్రమము వారి చరిత్ర పూర్తిగా తెలిసినవాడు

**అన్వయము** - దీనిచే నంబంధింవబడును (వంశము)

**అన్వయవ్యాప్తి** - హేతువు ఉన్నచోటునందెల్ల సాధ్యము ఉండుననుట (వంట యింట వలె ఎచ్చట ధూమము ముండునో అచ్చట వహ్నియుండును )

**అన్వర్థము** - అనునరించిన అర్థము కలది (సార్థకము)

**అన్వవాయము** - ముందు వెనుక, పూర్వము పరము అని అన్వయింపబడునది (జాతి, వంశము)

**అన్వాధేయము** - వివాహానంతరము స్త్రీ తన బంధువర్గమునుండి పొందిన కానుకలు (చదివింపులు)

**అన్వారోహణము** - భర్త చితిలోపడి భార్యయు మరణించుటకు సిద్ధమగుట

**అన్వాహార్యకము** - యజ్ఞము చేయించిన ఋత్విజుల కిచ్చునట్టి దక్షిణ

**అన్వాహార్యము** - పితృ యజ్ఞమున దక్షిణాగ్ని యందు పక్వము చెయబడిన అన్నము

**అన్వీక్షకి** - ప్రత్యక్ష శబ్ద ప్రమాణములచే ఈక్షితమైన విషయమును అను ఈక్షణ మొనది

**అపకర్త** - అపకారము చేయువాడు (అపకారి)

**అపక్రమము** - యుద్ధాదుల నుండి పారిపావుట క్రమము లెనిది

**అపచారము** - పెద్దల యెడల జేయు తప్పు

**అపచుడు** - ఉత్తమమగు గృహస్థాశ్రమమున నుండియు నితరుల కన్నము పెట్టక తన పొట్ట నింపుకొనువాడు

**అపజయము** - ప్రతికక్షి చూపిన తన వాదము నందలి దోషము నంగీకరించుట (ఇందు 22 అంశములు కలవు ప్రతిజ్ఞా హాని, ప్రతిజ్ఞాంతరము, అపసిద్ధాంతము, హేత్వాభాసము)

**అపటీకుడు** - టీక విడిచి మూలము మాత్రమే చదువువాడు, దుప్పటి లేనివాడు

**అపతోక** - సంతతి పోయినది, ఈచుక పోయిన ఆవు

**అపత్యపదము** - సంతతి కల్గుటకు [illegible]నది (యోని - ఆడుగురి)

**అపత్యము** - నరకమున పడకుండ [illegible] (సంతానము)

**అపత్యవిక్రయి** - తన సంతానము [illegible] పంపువాడు శుల్కము తీసికొని [illegible] పెండ్లి చేయువాడు

**అపత్య శత్రువు** - తన సంతతికి శత్రువు (తెలు, సర్పము, పీత)

**అపత్రపిష్ణువు** - లజ్జ స్వభావముగా గలవాడు (సిగ్గరి - బిడియపడువాడు)

**అపదము** - కాలు లేనిది సుబంతము - తిఙంతము [illegible] (ధాతువు ప్రత్యయము మొ॥)

**అప[illegible]ంతరము** - అడుగైనను ఎడము లేనిది పదముచేత గూడ వ్యవధానము లేనిది (అపటాంతరము-కూడియున్నది)

**అపదిశము** - రెండు దిక్కుల మద్య భాగము

**అపధ్వస్తుడు** - బహిష్కరింపబడిన వాడు

**అపన్థ** - మార్గము కానిది (తప్పుడుదారి)

**అపప్రయోగము** - వ్యాకరణ విరుద్ధమైన పద సమాస వాక్యాది ప్రయోగము, అస్త్రాదులను తప్పుగా వాడుట

**అపభ్రంశము** - సంస్కృతము నుండి భ్రంశము నొందినది

**అపమృత్యువు** - హఠాత్తుగా సంభవించిన మరణము

**అపరకర్మ** - చనిపోయిన వానికి చేయు కర్మ (ఉత్తరక్రియ)

**అపరరాత్రము** - రాత్రి చరమ భాగము

**అపరాంగము** - ప్రధాన రసభావాదులకు అప్రధాన రసభావాదు లంగములగుట (ఒక గుణీభూత వ్యంగ్యము)

**అపరాజిత** - ఎప్పుడును పరాజయమును బొందనిది (పార్వతి)

**అపరాధ పరిశోధకుడు** - అపరాధులను సాక్ష్యాధారములతో బయట పెట్టెడు [illegible] (పత్తేదారు)

**అపరాధము** - [illegible] చెలింపవలసిన ద్రవ్యము [illegible]దండు[illegible] [illegible]ంసింపబడుదురు (తప్పు)

**అపరాహ్ణము** - [illegible] యొక్క కడపటి బాగము

**అపరిగ్రహము** - ఏదియు స్వీకరింప కుండుట

**అపరిచ్ఛదుడు** - అప్రశస్తములగు వల్వలు కలవాడు

**అపరిచ్ఛిన్నము** - అవధులు లేనిది (పరమాత్మ)

**అపరోక్షము** -చక్షురాదీంద్రియ గోచరమైనది

**అపర్ణ** - ఆకులను సయితము తినక శివునకై తపము చేసినది పోగొట్టబడిన ఋణము గలది (పార్వతి)

**అపలాపము** - తెలిసిన దానిని మరుగుపరిచి చెప్పుట

**అపవర్గప్రదుడు** - మోక్షము నిచ్చువాడు (విష్ణువు)

**అపవర్గము** - దుఃఖాదులను వర్జించుట (మోక్షము)

**అపవర్జనము** - పాపమును వర్జించునది (దానము)

**అపవిద్ధుడు** - తల్లిదండ్రులు విడువగా మరియొకరిచే పుత్రుడుగా దీసికొనబడిన వాడు (ద్వాదశవిధ పుత్రులలో నొకడు)

**అపశదుడు** - నికృష్టుడై చెడువాడు (అల్పుడు)

**అపశబ్దము** - వ్యాకరణ సాధువు కాని దుష్టపదము

**అపశుచము** - దుఃఖము లేనిది (జీవుడు)

**అపశ్రీకుడు** - సంపద పోయినవాడు (దరిద్రుడు)

**అపసదుడు** - బ్రాహ్మణునకు గ్రింది మూడు వర్ణముల స్త్రీలయందు గాని క్షత్రియునకు క్రింది రెండు జాతుల స్త్రీలయందు గాని వైశ్యునకు శూద్ర స్త్రీయందు గాని కలిగిన పుత్రుడు (అనులోమ పుత్రుడు)

**అపసరము** - ఒకనియాస్తి మరియొకనికి జెందుటకు దగిన ఆధారపత్రము

**అపసర్పుడు** - ఊరూర దిరిగి సమాచారము తెలిసికొని వచ్చి రాజునకు జెప్పువాడు (వేగులవాడు - గూఢచారుడు)

**అపసవ్యము**-కుడివైపున నున్నది (దక్షిణము), కుడి భుజము మీద నుండి ఎడమ చేతి క్రిందికి ధరింపబడిన జన్నిదము)

**అపసారికటకము** - ధన చిహ్నితమైన నాభ్యంతరము గల కటకము (అపసారి కటకములు మూడు రకములు అవి ద్విపుటీయ, తలపుటీయ కుంభపుటీయములు)

**అపసారితుడు** - తొలగింపబడినవాడు, తరుమబడినవాడు

**అపస్నాతుడు** - జ్ఞాత్యాదుల మరణము నిమిత్తము స్నానము చేసినవాడు, సంస్కారార్థము స్నానము చేయింపబడిన మృతకళేబరము

**అపస్మారము** - మోహ దుఃఖాదులచే గలిగెడి యావేశము (పైత్త్యరోగ విశేషము)

**అపస్మారి** - స్మృతి తప్పినవాడు, సొమ్మజబ్బు కలవాడు

**అపస్వరము** - వేదాదులందు స్వరస్థానమున దప్పుగా జెప్పిన స్వరము

**అపహార్యము** - అపహరింపదగినది

**అపహాసము** - శరీరము కంపించునట్లుగా నవ్వెడి నవ్వు

**అపహాస్యము** - గేలిసేయ దగినది

**అపాంక్తుడు** - పంక్తిభోజనమున కర్హుడు కానివాడు

**అపాంక్తేయుడు** - పంక్తిభోజనమున నిషేధింపబడినవాడు

**అపాంపతి** - జలములకు ప్రభువు (సముద్రుడు, వరుణుడు)

**అపాంసుల** - దోషములేని స్త్రీ (పతివ్రత)

**అపాత్రీకరణము** - పాత్రుడగు బ్రాహ్మణుని అపాత్రునిగా జేయునది (నిందిత ప్రతిగ్రహాది దోషము)

**అపాదానము** - రెండింటికి కలిగిన విశ్లేషణమున స్థిరముగా నిలుచునది

**అపానము** - మూత్రాదుల నధోముఖ మగునట్లు త్రోసివేయు జీవనాధారమగు వాయువు

**అపామార్గము** - వ్యాధులను బొగొట్టునది (ఉత్తరేణి)

**అపారపారము** - ఈవలి దరియు అవలిదరియు లేనిది (సముద్రము)

**అపాసంగము** - అమ్ములతో కూడియుండునది (తూణీరము)

**అపాస్తుమాటలు** - పలుకకూడని మాటలు (అప-అస్తు-మాటలు, దురుక్తులు)

**అపాస్తుంకారము** - అనుకొనని రీతిగా పల్కెడు శాపముతో కూడిన దీవన (అభిమన్యుని పద్మవ్యూహము చీల్చుటకు పంపుచు ధర్మనందనుడాడిన మాటలు "నీక విజయము గల్గుగాక" నీకు - అవిజయము, నీకే విజయము అను రెండర్థములు స్ఫురించునవి

**అపుంస్క** - మగడు లేని స్త్రీ (విధవ - అవద)

**అపుత్రకుడు** - పుత్ర సంతతిలేనివాడు, పుత్రులు మరణించినవాడు

**అపుష్టము** - అర్థపుష్టి నీయజాలని పదము (ప్రకృతమున కుపయోగింపని పదము ఉదా-తునిమె వింశత్యర్ధానను వింశత్యర్థ రధుని నందనుడు వింశత్యర్ధాననుడు = ఇరువదిలో నగమగు తలలవాడు = దశకంఠుడు వింశత్యర్థనందనుడు = దశరథతనయుడు = రాముడు రావణుని సంహరించె ననుట)

**అపూర్ణము** - క్రియాన్వయము సంపూర్ణము కానిది (ఒకానొక వాక్యదోషము)

**అపూర్వవాదము** - చేసిన కర్మమువలన బుణ్యపాపరూపమగు నపూర్వము కలుగునని చెప్పునది (పూర్వమీమాంసా వాదము)

**అపూర్వవిధి** - ఇతర ప్రమాణము వలన బ్రాప్తము కాని విషయములను విధించువాక్యము

**అపేతరాక్షసి** - పోగొట్టబడిన రాక్షసి వంటి పాపము కలది (తులసి)

**అపోశానము, అపోసానము** - భోజనమునకు మొదటను చివరను పుడిసిట నీరు పోసికొని మంత్ర పూర్వకముగా పుచ్చుకొనుట

**అప్చరము** - (అప్సరము) నీటియందు దిరుగునది (చేప, మొసలి)

**అప్పతి** - ఉదకములకు బ్రభువు (వరుణదేవుడు, సముద్రుడు)

**అప్పసము** - బోదెల నడుమ చిరుకాలువ, ఎడతెగక నీరు పారునది

**అప్పిత్తము** - నీటిని శోషింపజేయునది (అగ్ని)

**అప్సరము** - నీటిలో తిరుగునది

**అప్పుబుట్టువు** - నీటియందు బుట్టినది (పద్మము)

**అప్రకాండము** - స్కంధము లేనిది (చిన్నపొద, తుప్ప)

**అప్రకృతము** - ప్రస్తుత విషయమునకు సంబంధింపనిది

**అప్రజాత** - సంతానవంతురాలు కానిది (గొడ్రాలు)

**అప్రతిగ్రాహకుడు** - ఇతరుల వలన నేమియు గ్రహింపనివాడు

**అప్రతిద్వంద్వుడు** - శత్రువులు లేనివాడు (అప్రతిరథుడు)

**అప్రతిపక్షుడు** - శత్రువులు లేనివాడు (అప్రతిద్వంద్వుడు)

**అప్రతిపత్తి** - ఏమియును దోచకపోవుట

**అప్రతివీర్యుడు** - సాటిలేని పౌరుషము కలవాడు

**అప్రతీతము** - శాస్త్రపురాణాదులందు ప్రసిద్ధమై కావ్యాదులందు ప్రయుక్తము కానిది (ఒక పదదోషము)

**అప్రదక్షిణము** - ఎడమ ప్రక్కగా జుట్టి వచ్చుట (అపసవ్యముగా తిరుగుట)

**అప్రధానము** - ముఖ్యము కానిది (అముఖ్యము)

**అప్రమేయము** - పరిమితి నిర్ధారింప శక్యము కానిది

**అప్రయుక్తము** - కవులు ప్రయోగింపని పదము (నిఘంటువులయందు కలిగి కావ్యములందు ప్రయోగింపబడని పదము (ఒక పదదోషము) ఉదా - ద్రవిణైలబిలుడదుశ్చ్యవన ఖేటమహాభోగి సంస్తుతుడనగ (ఇలబిలుడు=కుబేరుడు, దుశ్చ్యవనుడు = ఇంద్రుడు)

**అప్రయోజకుడు** - కార్యనిర్వాహకత్వ సామర్థ్యము లేనివాడు

**అప్రయోజనము** - అర్థవిశేషమును దెలుపనిది (ఒకానొక పదగత దోషము)

**అప్రసాదము** - ప్రసాద గుణము లేనిది (కఠిన శైలి కలది)

**అప్రస్తుత ప్రశంస** - ప్రకృత విషయమునకు సంబంధింపని సంభాషణము

**అప్రాకృతము** - ప్రాకృత భాషకు చెందనిది, అసాధారణమైనది

**అప్రాప్తవ్యవహారుడు** - వ్యవహార యోగ్యమగు వయస్సు సమీపింపనివాడు

**అప్రామాణికము** - ప్రమాణము లేనిది (అప్రమాణము)

**అప్రాశ్యుడు** - పంక్తియందు భుజింపదగని వాడు

**అప్రియంవదుడు** - పరుషములు పలుకు వాడు

**అప్సరసలు** - ఉదకమునందు జనించిన వారు (దేవవేశ్యలు)

**అప్సుచరము** - జలచరము (చేప)

**అప్సుజము** - ఉదకమున బుట్టినది (అంబుజము)

**అఫలుడు** - మగతనము లేనివాడు (కొజ్జా)

**అబద్ధము** - బంధింపబడనిది అసంగతమైనది

**అబద్ధముఖుడు** - అసత్యవచనములచేత నియమము తప్పిన ముఖము గలవాడు (ముఖరుడు - దుర్ముఖుడు, వదరుబోతు)

**అబము సుబము** - అన్నెము పున్నెము, అశుభము శుభము

**అబల** - బలము లేనిది (ఆడుది)

**అబాధకము** - బాధింపనిది

**అబోధవేళ** - అనధ్యయన సమయము

**అబ్జ** - ఉదకములయందు బుట్టినది (లక్ష్మి, సుర)

**అబ్జజుడు** - విష్ణుని నాభికమలమున బుట్టినవాడు (బ్రహ్మ - అబ్జభవుడు)

**అబ్జబాంధవుడు** - తామరలకు బంధువైనవాడు (సూర్యుడు)

**అబ్జమిత్రుడు** - తామరలకు మిత్రుడు (సూర్యుడు)

**అబ్జమైరేయము** - కమలమందలి (మద్యము) మధువు

**అబ్జము** - నీటియందు బుట్టునది (ఉప్పు, తామరపువ్వు)

**అబ్జయోని** - పద్మము ఉత్పత్తి స్థానముగా గలవాడు (బ్రహ్మ - తమ్మిచూలి)

**అబ్జారి** - పద్మములకు శత్రువు (చంద్రుడు - అబ్జవైరి)

**అబ్జుడు** -క్షీరసాగరమధనమున బుట్టినవాడు (చంద్రుడు, ధన్వంతరి)

**అబ్దము** - నీటి నొసగునది (మేఘము)

**అబ్ధి** - జలము లిందు ధరింపబడును, ఇట నీరు నిలుచును (సముద్రము, కొలను)

**అబ్ధికఫము** - సముద్రమునకు (శ్లేష్మము) కపము వలె కనిపించునది (నురుగు)

**అబ్ధిజ** - క్షీర సాగర మథనమున ఉద్భవించినది (లక్ష్మి - మున్నీటిచూలి)

**అబ్ధిజము** - సముద్రము నుండి పుట్టినది (శంఖము)

**అబ్ధిజుడు** - పాల్కడలి త్రచ్చగా బుట్టినవాడు (ధన్వంతరి - దేవ వైద్యుడు చంద్రుడు - అమృతాంశుడు)

**అబ్ధినగరి** - సముద్రము నందలి పట్టణము (ద్వారక)

**అబ్ధినవనీతము** - పాలకడలిని చిలుకగా బుట్టిన వెన్న (అమృతము - కడలివెన్న)

**అబ్ధిపల్లవము** - సముద్రమునకు చిగురు వంటిది (పగడము)

**అబ్ధిమాండూకి** - సాగరమున గప్పవలె నుండునది (ముత్యపుచిప్ప)

**అబ్ధిమేఖల** - సముద్రము మొలత్రాడుగా గలది (భూమి - కడలిమొలనూలు)

**అబ్ధివధువు** - సముద్రుని భార్య (నది)

**అబ్ధిశయనుడు, అబ్ధిశయుడు** - ప్రళయ కాలమున సముద్రము శయ్యగా గలవాడు (విష్ణువు - కడలియల్లుడు)

**అబ్ధిసారము** - సముద్రమునకు సారమైనది (ముత్యము, సాగరసారము)

**అబ్భక్షము** - నీరు ఆహారముగా గల సర్ప భేదము

**అబ్భక్షుడు** - నీటిని మాత్రమే త్రావుచు నిరాహారదీక్ష, తపోవ్రతాదులు చేయువాడు

**అబ్రాశి** - నీటి ప్రోగు (సముద్రము)

**అభంగములు** - నాశనము లెనివి (కీర్తనలు)

**అభంగురము** - నశింపనిది (శాశ్వతమైనది)

**అభయడిండిమము** - యుద్ధమున సేనలను ఉత్సాహ పరుచుటకు మ్రోయించు వాద్య విశేషము

**అభయదాయి** - భయము లేదు, కాపాడెదనని మాట యిచ్చువాడు

**అభయముద్ర** - భయపడ వలదని చూపెడి (హస్తముద్ర)

**అభవుడు** - పుట్టుక లేనివాడు (శివుడు)

**అభికుడు** - వలపు గలవాడు (కాముకుడు)

**అభిక్రమణము** - శత్రువుల కెదురుగా పోవుట (అభిక్రమము)

**అభిఖ్య** - పిలువ బడునది (పేరు)

**అభిగమము** - ప్రియమున స్నేహితుని కెదురేగుట, యుద్ధమున ఎదుర్కొన బోవుట (అభిగమనము)

**అభిగ్రహణము** - చూచుచుండగనే దొంగిలించుట

**అభిఘారము** - సంస్కారార్థము అన్నముపై నేయివేయుట

**అభిచరణము** - శత్రునాశము కొరకు చేయు యాగకర్మము

**అభిచారకుడు** - హింసార్థమైన హోమ కర్మము చేయువాడు, భూతవైద్యము చేయువాడు

**అభిజాతుడు** - మంచి కులమున బుట్టినవాడు

**అభిజిత్తు** - ఉత్తరాషాఢ చివరి పాదమును శ్రవణము యొక్క మొదటి పాదమును కలిసినది

**అభిధ** - సంకేతితార్థమును స్ఫురింపజేసెడు శబ్దశక్తి (అభిధ, లక్షణ, వ్యంజనలలో అభిధ రెండు రకములు రూఢి పూర్వకాభిధ, యోగ పూర్వ కాభిధలు)

**అభినందితము** - ప్రశంసింపబడినది, మెచ్చుకొనబడినది

**అభినయము** - అవయవములు కదలించుచు మనోభావములను సూచించుట

**అభినవాయము** - నిలుకడగా వచ్చు రాబడికి క్రొత్తగా జేరినది (కొత్తరాబడి)

**అభినిర్ముక్తుడు** - సాంధ్యకృత్యములను చేయక సూర్యాస్తమయ సమయమున నిద్రించువాడు

**అభిని** - చెట్టుయొక్క జిగురు పదార్థము (నల్లమందు మొ॥) వ్యసనాభిలాష - (అపిని)

**అభినివేశము** - చేసితీరవలయు ననెడి పట్టుదల (అభిలాష - కోరిక)

**అభిన్నము** - చీల్పబడనిది, వేరుకానిది

**అభిప్లవము** - అంతటను వెల్లివిరియుట (ఉపద్రవము)

**అభిప్లుతము** - అంతటను వ్యాపించినది

**అభిమనస్కుడు** - కార్యమున కభిముఖమైన మనస్సు గలవాడు

**అభిమర్శనము** - పరస్త్రీని చెరుచుట

**అభిమానము** - రూప, విద్యా, వాహన ధన ధాన్యాదుల వలన గలిగెడు దర్పము, ఆత్మ గౌరవము

**అభియాచనము** - ఇమ్మని వేడికొనుట

**అభియాతి** - జయార్థమెదుర్కొని పోవువాడు

**అభియాయి** - భయము లేక శత్రువుల నెదుర్కొనువాడు

**అభియోక్త** - అభియోగము మోపువాడు (వాది)

**అభియోజనము** - వ్యాజ్యము వేయుట, ఎదిరించుట

**అభిరూపుడు** - అనురూపము కలవాడు (చంద్రుడు, మన్మథుడు, పండితుడు)

**అభివర్ణనము** - గుణాదికమును అధికముగా వివరించుట

**అభివాదము** - గోత్రనామములు చెప్పుచు పాదములకు మ్రొక్కుట

**అభివ్యాపకము** - అంతటను వ్యాపించి యుండునది

**అభివ్యాప్తి** - అంతటను అలముకొనుట

**అభిశంసకుడు** - లేని నేరములను మోపు వాడు

**అభిశస్తుడు** - పరుష వాక్యములచేత పీడింపబడినవాడు, చేయని నేరము మోపబడినవాడు

**అభిశాపము** - లేని నేరము మోపుట (అభిశపనము)

**అభిషవణము** - యజ్ఞాంగమైన స్నానము, సోమరసము పిండుట కుపయోగించు సాధనము (అభిషవణి)

**అభిషవము** - కల్లుతీయుట, సారాయి కాచుట

**అభిషిక్తుడు** - స్నానము చేయింప బడిన వాడు, పట్టాభిషేకము చేయబడినవాడు

**అభిసంపాతము** - ఇందు ఎదురెదురుగా కలియుదురు (యుద్ధము), అభిముఖముగా కలియుదురు (కలయిక)

**అభిసరణము** - నాయకుడు నాయికను లేక నాయిక నాయకుని కలియుటకై సంకేత స్థలమునకు బోవుట

**అభిసారము** - ప్రియురాలు ప్రియుని కొరకు గాని ప్రియుడు ప్రియురాలి కొరకు గాని సంకేత స్థలమునకు పోవుట, సంకేత స్థానము

**అభిసారికటకము** - ఋణ చిహ్నితమైన

నాభ్యంతరము గిఽ కంకము (ఇవి మూడు రకములు ద్వికుంభీయ. తలకుంభీయ, పుట కుంభీయములు)

**అభిసారిణి** - ప్రియుని సంకేత స్థలమునకు రప్పించుకొనునది ప్రియుని నిమిత్తము సంకేత స్థలమునకు బోవునది(అభిసారిక)

**అభిసారుడు**-అనుసరించువాడు (సేవకుడు)

**అభీకుడు** - భయము లేనివాడు (కవి, ప్రభువు)

**అభీరుడు** - గోవులను మళ్లించువాడు (గొల్లవాడు)

**అభీష్టము** - అన్నివిధముల చేతను పొందుటకు నిశ్చయింపబడినది, ఇష్టమైనది

**అభూతము** - అసత్యమైనది

**అభూతాహరణము** - ఆ సమయమున కుపయోగపడునట్లు నెపము పెట్టి చెప్పుట

**అభూతపూర్వము** - ఇంతకు పూర్వము లేనిది

**అభేదయతి** - శాస్త్రమున అభేదముగా ఒప్పుకొనబడిన అక్షరములకు యతి చెల్లుట (వపయోరభేదః వ - ప, ఫ, బ, భ లతో, లడయోరభేదః ల - డలకు ర-ల లకు అభేదనియతిచె యతి చెల్లును)

**అభేద్యము** - పగులగొట్ట శక్యము కానిది (వజ్రము)

**అభ్యంగనము** - దేహమునకు నూనె మొదలగునవి రాచికొనుట (తలంటు)

**అభ్యంజనము** - కంటికి కాటుక పెట్టుట, (చూ॥ అభ్యంగనము)

**అభ్యంతరము** - దిక్కుల మధ్య ప్రదేశము

**అభ్యగ్రము** - అభిముఖమైన అగ్రభాగము కలిగినది అతిచేరువలో నున్నది (దాపైనది)

**అభ్యమనము** - అపథ్య పదార్థములను సేవించుట

**అభ్యమితుడు** - రోగముచేత బీడింపబడు వాడు (రోగి)

**అభ్యమిత్రీణుడు** - శత్రువులకు ఎదురుగా నిలుచువాడు

**అభ్యమిత్రీయుడు** - శత్రువులకెదురుగా మోహరించువాడు (అభ్యమిత్రుడు)

**అభ్యర్థి** - సహాయము కోరువాడు, పదవి, ఉద్యోగము మొదలగునవి ప్రయత్నించు వాడు

**అభ్యర్థితుడు** - ఆదరించి పూజింపదగిన వాడు (ఇష్టుడు, శ్రేయోభిలాషి)

**అభ్యవకర్షణము** - నాటిన (కొఱ్ఱు, ముల్లు) వానిని పెకలించి తీయుట, కలుపు తీయుట (నిర్హారము)

**అభ్యవస్కందనము** - శత్రువు బలహీనుడగు నట్లు దెబ్బతీయుట (ముట్టడి, దోపుడు)

**అభ్యవహృతము** - తినబడినది (అన్నము)

**అభ్యసూయ** - గుణముల యందు దోషారోపణము చేయుట (కిట్టమి, ఓర్వమి)

**అభ్యాకర్షము** - ద్వంద్వ యుద్ధమున మల్లులు జబ్బలు చరచుట

**అభ్యాఖ్యాతుడు** - లేని నేరము మోపబడినవాడు

**అభ్యాఖ్యానము** - బూటకపు వ్యాజ్యము (మిధ్యాభియోగము)

**అభ్యాగతుడు** - భోజన కాలమున వచ్చిన యతిధి

**అభ్యాగమము** - పెద్దలకు ఎదురు వెళ్ళుట

**అభ్యాగారికుడు** - కుటుంబ పోషణము నందు ఎక్కువ శ్రద్ధ జూపువాడు

**అభ్యామర్దము** - దీనియందు దన్యోన్యము (సైన్యమున) మెదుపుదురు (యుద్ధము అభ్యామర్దనము)

**అభ్యాసాదనము** - దీనిచేత శత్రువు నొప్పింపబడును (దాడి - ముట్టడి)

**అభ్యుత్థానము** - గౌరవముచే లేచి ఎదురువచ్చుట

**అభ్యుదితుడు** - సూర్యోదయ సమయమున నిద్రించువాడు

**అభ్యుద్గతుడు** - ఉన్నత స్థితికి వచ్చినవాడు గౌరవముతో ఎదురువచ్చువాడు,

**అభ్యుపాయనము** - కార్యలాభమునకై కానుకలు ఇచ్చుట (లంచము, కానుక)

**అభ్యుషితుడు** - స్వామిని కాచుకొని యుండు వాడు (సేవకుడు)

**అభ్యూహము** - తర్కము, ఊహ

**అభ్రంకషము** - మబ్బుల నొరయునది (కొండ) ఆకాశమును ఒరయునది (మిక్కిలి ఎత్తయినది)

**అభ్రకము** - మేఘముతో సమానమైన వర్ణము కలది

**అభ్రగము** - ఆకసమున బోవునది (పక్షి)

**అభ్రగంగ** - ఆకాశగంగ (మందాకిని)

**అభ్ర పిశాచము** - ఆకాశమున సూర్యాది గ్రహములకు వెరపు గలిగించువాడు (రాహువు తలగాము)

**అభ్రపుష్పము** - మేఘములందు పుష్పా కారముగ నుండునది (నీరు) మేఘ వర్ణము వంటి పుష్పములు కలది (ప్రబ్బలి)

**అభ్రమాతంగము** - ఆకాశమున సంచరించునట్టి ఏనుగు, (ఐరావతము)

**అభ్రము** - నీటిని భరించునది (మేఘము)

**అభ్రమువల్లభము** అభ్రమువను ఆడేనుగునకు భర్త

**అభ్రముపు** - మందగమన యగుటచే ఆకసమున సంచరింపని తూర్పు దిక్కు నందలి ఆడేనుగు

**అభ్రి** - మ్రుఱికిని గోకి శుభ్రము చేయుటలో నుపయోగించునది (కఱ్ఱగుద్దలి), మోదుగు కఱ్ఱతో పదనుగా చెయబడిన త్రవ్వుకోల (భూమిని త్రవ్వుసాధనము)

**అభ్రియము** - మేఘమున బుట్టినది (మెఱుపు)

**అమంగలము** - అశుభమైనది (అశుభము అముదపుచెట్టు)

**అమరకము** - శిస్తునకు భూమిని సేద్యగానికిచ్చుట

**అమరగురువు** - దేవతల గురువు (బృహస్పతి)

**అమరతటిని** - దేవలోకమందలి నది (మందాకిని)

**అమరతరువు** - దేవతల వృక్షము (కల్పతరువు)

**అమరనాయకరము** - యుద్ధకాలమున సాయ పడుటకిచ్చిన గ్రామముల పై దొరతనము

**అమరనాయకుడు** - అమరకపు గ్రామముల నాయకుడు. దేవతల నాయకుడు (ఇంద్రుడు)

**అమరప్రభువు** - దేవతలకు ప్రభువు(ఇంద్రుడు)

**అమరరత్నము** - వేల్పుల కోర్కె లీడేర్చు మణి (చింతామణి)

**అమరలోకము** - దేవతలుండెడు లోకము (స్వర్గము)

**అమరాపగ** - దేవలోకమందలి గంగ

**అమరాలయము** - దేవతలకు నివాసస్థాన మైనది

**అమరావతి** - ఇంద్రుని రాజధాని

**అమరుడు** - చావులేనివాడు (దేవత)

**అమర్త్యుడు** - మరణములేనివాడు, (మర్త్యుడు కానివాడు = వేల్పు)

**అమర్షణుడు** - సహనము లేనివాడు

**అమర్షహాసము** - మనస్సు నందలి కోపము నణచిపెట్టి పైకి నవ్విన నవ్వు

**అమర్షి** - కోపము గలవాడు, ఓర్వలేనివాడు

**అమహాదర్థకములు** - స్త్రీలు, తిర్యక్కులు

(పశుపక్ష్యాదులు) జడములు (ప్రాణములేనివి) గాని విశేష్యములును, విశేషణములును అమహదర్దకములు (ద్రౌపది, చిలుక, గృహము, మొదలగునవి)

**అమాంతగాడు** - చిల్లరబేరమెక్కువగా గలవాడు

**అమాంబాపతు** - అసలు వడ్డీలతో కూడినది (మొత్తము)

**అమాత్యుడు** - మంత్రముతో గూడియుండు వాడు (మంత్రి)

**అమానుదస్తా** - చిన్నరోలు రోకలి

**అమానుషము** - మనుష్య కృత్యము కానిది, మనుష్య శక్తికి మించినది

**అమావాస్య** - కలిసియున్న సూర్యచంద్రులు కలది (అమాస)

**అమితాశనుడు** - మితి మీరి తినువాడు (తిండిపోతు)

**అమిత్రుడు** - మిత్రుడు గానివాడు (శత్రువు)

**అముక్తము** - ముక్తి నొందనిది

**అముదువడి** - దేవునకు సమర్పించు మహానైవేద్యము (నైవేద్యపుటన్నము)

**అముష్యాయణుడు** - మంచి కులమున బుట్టినవాడు, వాని గాంచిన గోత్రము గల తండ్రికొడుకు

**అమూర్తము** - రూపము లేనిది

**అమూలము** - కారణము లేనిది

**అమూల్యము** -వెలలేనిది, మిక్కిలి వెలగలది

**అమృతకరుడు** - అమృతమయములగు కిరణములు కలవాడు (చంద్రుడు)

**అమృతపుడు** - అమృతమును పానము చేసినవాడు (వేల్పు)

**అమృతము** - దీనియందు మరణము లేదు (ముక్తి), మరణమును బొందింపనిది (సుధ)

**అమృతసూతి** - పాలకడలిని బుట్టినవాడు (చంద్రుడు)

**అమృతాంధసుడు** - అమృతమన్నముగా గలవాడు (వేల్పు - అమృతాశి)

**అమృతాంధసుడు, అమృతాంశువు** అమృతకరుడు (చంద్రుడు)

**అమృతాక్షరములు** - హ్రస్వాక్షరములు

**అమృతాశనుడు** - అమృతాంధసుడు

**అమృతాపహరణుడు** - అమృతమును హరించినవాడు (గరుడుడు)

**అమృతుడు** - మరణము లేనివాడు (వేల్పు, ధన్వంతరి)

**అమృష్యుడు** - సహింపరానివాడు

**అమేధసుడు** -మేధ లేనివాడు(బుద్ధిహీనుడు)

**అమేధ్యము** - అపవిత్రమైనది (మలము, పురీషము)

**అమోఘము** - దండుగు కానిది, వ్యర్థము కానిది (సఫలమైనది)

**అమ్మలక్కలు** - అమ్మ అక్క అని ఒకరినొకరు పిలుచుకొను ఇరుగు పొరుగు స్త్రీలు

**అమ్ముడుకడచు** - పెండ్లి కూతురు అత్తవారింటికేగు

**అమ్ము పొది** - బాణములుండు పొది

**అమ్మువేటునేల** - గొప్ప విలుకాని బాణము పడునంత దూరముగల భూమి (ప్రవ్యాధము)

**అమ్లవృక్షము** - పుల్లని పండుగల చెట్టు (చింత)

**అయథార్థము** - యథార్థము కానిది

**అయథార్థానుభవము** - ఒక వస్తువునందు తాననుకొన్న ధర్మము లేకున్నను అట్టి

ధర్మమున్నట్లు తలంచెడి జ్ఞానము (అయథార్థా నుభవము మూడు విధములు సంశయము, విపర్యయము, తర్కము)

**అయనము** - సూర్యుని దక్షిణోత్తర దిశల గమన కాలపరిమితి

**అయన ప్రవాహము** - వివిధ పద్ధతులలో అయనీకరణము జరిగినప్పుడు సంభవించిన అయనులను తగిన విద్యుత్ క్షేత్రములో ఉంచగా సంభవించునది

**అయనీకరణము** - పరమాణు కేంద్రకమగు ధన విద్యుత్తులో పరిభ్రమించు ఋణ విద్యుత్స ముదాయమునకు (ఎలక్ట్రాన్లకు) తగు శక్తినిచ్చి ధనవిద్యుదావేశము కల్గించు పద్ధతి (అయనీ కృత స్థితికి దెచ్చు విధానము)

**అయనులు** - రేడియో ధార్మికత వలన పుట్టు కిరణములుగాని, ఎక్స్ కిరణములు (రంజను కిరణములు) గాని గాలిలో కలిసినప్పుడు గాలి అణువుల నుండి ఎలక్ట్రాన్లు విడిపోవగా మిగిలిన గాలి అణువులు

**అయస్కాంతము** - ఇనుము నాకర్షించునది పురిలేని పట్టుదారముతో వ్రేలాడగట్టిన యెడల ఉత్తర దక్షిణములను చూపునది (సూదంటురాయి)

**అయస్కారుడు** - ఇనుప పనిచేయువాడు (కమ్మరి)

**అయాజ్యయాజనము** - కూడనివానిచే యజ్ఞము చేయించుట

**అయిదుకైదువుల జంత** - అయిదు బాణములు కలవాడు (మన్మథుడు) (అశోకము, అరవిందము, చూతము, నవమల్లిక, నీలోత్పలము - ఉన్మాదనము, తాపనము, శోషణము, స్తంభనము, సమ్మోహనము )

**అయిదుతూపులజోదు** - అయిదు బాణములు కల యోధుడు (మన్మథుడు)

**అయిదు పదిగావించు** - భాగములు ఖండించు, చేతులు జోడించి నమస్కరించు (జోడించిన 10 వ్రేళ్ళగును) ముందుంచిన పాదమును వెనుక పాదముతో కలుపు (వెనుకంజవేయు)

**అయిదువ** - మంగళ సూత్రము, పసుపు, కుంకుమ, గాజులు చెవ్వాకు అను అయిదు అలంకారములు కల యాడుది (పుణ్యస్త్రీ)

**అయుక్ఛదము** - బేసి సంఖ్యగల యాకులు గలది (ఏడాకులయరటి)

**అయుగనేత్రుడు** - బేసి కన్నులు గలవాడు (అయుగ్మనేత్రుడు - శివుడు)

**అయుగశరుడు** - బేసి సంఖ్యగల బాణములు గలవాడు (మన్మథుడు - అయుగ్బాణుడు)

**అయుగసప్తి** - ఏడు గుఱ్ఱములు కలవాడు (సూర్యుడు)

**అయుగ్మపర్ణము** - అయుక్ఛదము

**అయుగ్మవాహుడు** - అయుగసప్తి (సూర్యుడు)

**అయుగార్చి** - బేసి సంఖ్యగల నాల్కలు గలవాడు (అగ్ని) (కాలి, కరాళి, విస్ఫులింగిని, ధూమ్రవర్ణ, విశ్వరుచి, లోహిత, మనోజవ అగ్ని నాలుకలు)

**అయోగము** - దోషయుక్తమైన తిథివారాదుల కూడిక

**అయోగవి** - శూద్రునకు వైశ్య స్త్రీయందు బుట్టినది

**అయోగవుడు** - శూద్రునకు వైశ్య స్త్రీయందు కలిగినవాడు

**అయోగ్రము** - ఇనుపకట్టు వేసినది (రోకలి ముసలము)

**అయోధ్య** - యుద్ధము చేసి గెలువ శక్యము కానిది

**అయోనిజుడు** - యోని నుండి పుట్టనివాడు (శివుడు, విష్ణువు)

**అయోముఖము** - ఇనుప మొనకలది (బాణము, రోకలి)

**అయౌగికము** - వ్యుత్పత్త్యర్థము లేని పదము (రూఢము)

**అయ్యంగారు** - వైష్ణవ బ్రాహ్మణుల పేర్ల చివర చేర్చుపదము

**అరంగమము** - త్వరితగతిని బోవునది (బాణము)

**అరము** - బండి చక్రము యొక్క ఆకు

**అరకన్ను** - సగము మూసిన కన్ను

**అరక్రొన్నెలతూపు** - అర్ధచంద్రాకృతిగల బాణము

**అరణము** - వధూవరులకు వివాహ కాలమున నీయబడు ధనాదికము

**అరణి** - మథించి నిప్పు పుట్టించు కొయ్య

**అరణ్యచంద్రిక** - అడవియందు కాచిన వెన్నెల

**అరణ్యచరము** - అడవియందు సంచరించునది (కోతి మొ॥)

**అరణ్యరోదనము** - అడవిలోని ఏడ్పు (గోడు వినువారుండరను భావము)

**అరణ్యము** - మృగాదులచే యధేచ్ఛముగా సంచరింపబడునది

**అరత్ని** - చాచిన చిటికెన వ్రేలుగల పిడికిటితో గూడినమూర

**అరదండము** - అపరాధి యొక్క చేతులకు తగిలించు సంకెలలు (అడిదండలు)

**అరపదిమోముల వేల్పు** - అయిదు ముఖములు కలదేవుడు (శివుడు)

**అరబారతల్లుల యరిది బిడ్డ** - ఆర్గురు తల్లుల బిడ్డడు (కుమారస్వామి)

**అరమెయి జోటివాడు** - నగవు వేనను ఆడుదియైనవాడు (సాంబమూర్తి)

**అరవచాకిరి** - అరవలు డబ్బుకై హద్దుపద్దు లేనంత చాకిరి చేయుదు రనుట

**అరవిందబాంధవుడు** - పద్మములకు బంధువైనవాడు (సూర్యుడు)

**అరవిందమిత్రుడు** - పద్మములకు మిత్రుడైనవాడు (సూర్యుడు)

**అరవిందము** - కేసరములను బొందియుండునది

**అరవిందసదుడు** - పద్మము గృహముగా గలవాడు (బ్రహ్మ)

**అరవిందసూతి** - విష్ణుని నాభి కమలమున బుట్టిన వాడు (బ్రహ్మ)

**అరవిందాక్షుడు** - తామరపూవులవంటి కనులు గలవాడు (విష్ణువు)

**అరవిందాలయ**-పద్మము నివాస స్థానముగా గలది (లక్ష్మి)

**అరవిందాసనుడు** - విష్ణుని నాభికమలము పీఠముగా గలవాడు (బ్రహ్మ)

**అరవిందిని** - అరవిందములు కలది (సరస్సు), తామరతీగ, తామరలగుంపు

**అరసంజ** - ప్రదోషకాలము (మూనిమాపు)

**అరసము** - శృంగారాది రసము లేనిది

**అరాచకము** - కట్టుబాటు లేనిది (అల్లరి)

**అరాజకము** - రాజులేని దేశము

**అరాతి** - సంహరించువాడు (శత్రువు)

**అరిందముడు** - శత్రువును అణచువాడు, అరిషడ్వర్గమును అణచువాడు (శివుడు)

**అరిగాపు** - శత్రువులను నిరోధించుటకు బెట్టిన కావలి

**అరిత్రము** - ఓడ దీనిచే నడుపబడును (ఓడనడపెడు తెడ్డు)

**అరిత్రగాధము** - తెడ్డునకు దగులునంత మెరకగలది

**అరిషడ్వర్గము** - కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము అను వాని సముదాయము (అంతశ్శత్రువులు)

**అరిష్టతాతి** - (రిష్టము = అశుభము) రిష్టము కానిది శుభము చేయువాడు, మేలు చేయువాడు (శివతాతి)

**అరిష్టము** - మంత్రాదులచే రక్షింపబడి పిశాచాదులచే పీడింపబడని బాలకాదులు గలది (పురుటిల్లు) (శుభము, కీడు, వేప, కాకి, వెల్లుల్లి, కుంకుడు, కల్లు, అనిష్ట స్థానగతమైన సూర్యాదిగ్రహము, ఉత్పాతాదులు)

**అరిష్టసూదనుడు** - అశుభమును బోగొట్టు వాడు (శివుడు, విష్ణువు) కాకాసురుని నేత్రమును గ్రహించి చంపకవిడిచిన వాడు (శ్రీరామ చంద్రుడు)

**అరీతి** - రసమునకు అనుకూలముగాని పదములతో దోషము కూర్పబడిన వాక్యము (ఒకానొక వాక్యము ఉదా - విటజన హృదయ గ్రసనాగ్రహ గ్రహిళ దృష్టి సమగ్రో దగ్ర మతివ శృంగారమనన్) (గ్రసన, ఆగ్రహ, సమగ్ర, ఉదగ్రాది పదముల ఆడంబరము, శృంగార రసమున ప్రయోగింపరాదు)

**అరుంతుదము** - మర్మస్థానమును బాధించునది

**అరుంధతీ ప్రదర్శనము** - ముంచుగా సమీపము నందలి పెద్ద నక్షత్రమును జూపి పిమ్మట అరుంధతీ నక్షత్రమును జూపుట

**అరుచిరము** - వ్యంగ్యము వాచ్యము కంటె అనుందరముగా నున్నది (ఒక గుణీభూతవ్యంగ్యము)

**అరుణలోచనము** - ఎఱ్ఱని కన్నులు గలది (పావురము)

**అరుణసారథి** - అరుణుడు సారధిగా గలవాడు (సూర్యుడు)

**అరుణాత్మజ** - సూర్యుని కొమార్తె (యమునా నది, తపతీనది)

**అరుణాత్మజుడు** - సూర్యతనయుడు (శని, యముడు, సావర్ణి, మనువు, జటాయువు, సుగ్రీవుడు, కర్ణుడు)

**అరుణానుజుడు** - అరుణుని తమ్ముడు (అనూరుని తమ్ముడు - గరుత్మంతుడు)

**అరుణార్చి** - ఎఱ్ఱని కాంతి గలవాడు (సూర్యుడు)

**అరుణావరజుడు** - అరుణునకు బిమ్మట బుట్టినవాడు (అరుణానుజుడు) (గరుడుడు)

**అరుణుడు** - ఎఱ్ఱని కాంతిగలవాడు, సంచరించువాడు (సూర్యుడు, సూర్య సారధి)

**అరుణోదయము** - సూర్యసారధియగు అరుణుని దిగ్దర్శనకాలము

**అరూషుడు** - దేని చేతను గప్పబడనివాడు (సూర్యుడు)

**అర్కకాంత** - సూర్యుని భార్య (సంజ్ఞాదేవి, ఛాయాదేవి)

**అర్కతనయ** - సూర్యుని యొక్క కొమార్తె (అరుణాత్మజ)

**అర్కతనయుడు** - అరుణాత్మజుడు

**అర్కపత్రము, అర్కపర్ణము** - సూర్యుని వలె వెడిమిగల యాకులు గలది (జిల్లేడు చెట్టు)

**అర్కప్రియ** - సూర్యుని భార్య (అర్కకాంత)

**అర్కబంధువు** - సూర్యునకు జుట్టము (తామర), సూర్యవంశియుడు (బుద్ధుడు)

**అర్కభము** - సూర్యుడు ప్రవేశించు నక్షత్రము

**అర్కవివాహము** - జిల్లేడు చెట్టును కన్యకగా పెండ్లియాడుట (మూడవ భార్యను పెండ్లాడుటకు ముందుగావించునది పెండ్లాడిన భార్య నాల్గవదియగును)

**అర్కవ్రతము** - మాఘశుద్ధ సప్తమి మొదలగు దినములందు సూర్యుని గురించి చేయు వ్రతము సూర్యుడు మెల్ల మెల్లగా (సముద్రనదీతటాకాదుల) జలములు గ్రహించునట్లు రాజు ప్రజల నుండి పన్నులు రాబట్టి వానిని తిరిగి ప్రజా క్షేమమునకై వినియోగించు నియమము

**అర్కుడు** - సర్వజనులచే పూజింప బడువాడు (సూర్యుడు)

**అర్కేందు సంగమము** - సూర్య చంద్రుల సమావేశము (అమావాస్య)

**అర్ఘ్యప్రదానము** - త్రి సంధ్యల యందును సూర్యుని గురించి బ్రాహ్మణులచే నీయబడు నర్ఘ్యోదకము

**అర్ఘ్యము** - పూజార్థ ముపయోగించెడు పుష్పాదికము

**అర్చకత్వము** - భగవంతున కనుదినము చేయు పూజాదికము

**అర్చిష్మంతుడు**-కాంతి గలవాడు (సూర్యుడు, అగ్ని)

**అర్చిష్మతి** - అగ్ని దేవుని రాజధాని

**అర్జుక** - ధనమును గడించునది (వెలయాలు)

**అర్ణోదము** - జలము నిచ్చునది (మబ్బు)

**అర్ణోరాశి** - జలరాశియైనది (సముద్రము)

**అర్ధచంద్రకము** - నెమలి పురిలోని అర్ధ చంద్రాకారమగు భాగము

**అర్ధచంద్రము** - అర్ధచంద్రుని వంటి మొన గల బాణము, అర్ధచంద్రుని యాకారము గలది (నక్షత్రము, అభినయ హస్తము)

**అర్ధతూరము** - యుద్ధారంభమున మ్రోయించు భేర్యాదివాద్యధ్వని

**అర్ధజరతి** - వ్రేలాడు కుచములు నల్లని వెండ్రుకలు గల స్త్రీ శరీరమున సగభాగము ముదుసలి తనమును మిగిలిన భాగము పడుచుదనమును కలది

**అర్ధధారము** - ఒకవైపు పదను గల కత్తి

**అర్ధదూషణము** - ధనమును దుబారా చేయుట త్రాగుడు, జూదము, వ్యభిచారము మున్నగు వ్యసనము లందు ధనము పాడుచేయుట ఒక వ్యసనము

**అర్ధనారీశ్వరుడు** - సగము స్త్రీయు సగము పురుషుడు నైనవాడు (సాంబమూర్తి)

**అర్ధపుడు** - ద్రవ్యమును పాలించువాడు (కుబేరుడు - అర్ధపతి)

**అర్ధప్రయోగము**-ఒ 'జతంత్రమును నడుపుట

**అర్ధమాణవకము** - పండ్రెండు పేటల ముత్యాల దండ (అర్ధమాణవము)

**అర్ధము** - అర్థింపబడునది (ధనము)

**అర్ధరథుడు** - సమరథుని కంటె తక్కువ (వాడు) వీరుడు

**అర్ధరాత్రార్ధ దివసము** - పగలు రాత్రి సమముగా నుండు కాలము (విషువత్తు)

**అర్థవాదము** - నిందాస్తుతులలో నొకటి ప్రయోజనముగా గల వాక్యము, ప్రకరణ ప్రతిపాద్య విషయ ప్రశంస (బలపర్చుట) గాని తద్విపరీతమగునట్టి దానిని నిందించుట గాని ప్రయోజనముగా గలది (1 ఉపక్రమము, ఉపసంహారము, 2 అభ్యాసము,3 అపూర్వత, 4 ఫలము,5 అర్థవాదము, 6 ఉపపత్తియను షడ్లింగములలోనిది )

**అర్థవిద్య** - రాజనీతిని వివరించు శాస్త్రము (అర్థశాస్త్రము)

**అర్థవైశసుడు** - సగము చంపువాడు

**అర్థసీరి** - పంటలో భాగము గలవాడు (పాలికాపు)

**అర్థహారము** - ఏబది నాలుగు సరముల ముత్యాల దండ

**అర్థాంతరన్యాసము** - విశేషమును సామాన్యముచే గాని సామాన్యమును విశేషముచే గాని సమర్థించుట

**అర్థాపత్తి** - ఒక సత్యాంశమును వేరొక దానిపై ఆధారపడి గ్రహించుట, (మీ మాంసి కు లంగీకరించు ఒకానొక ప్రమాణము)

**అర్థాలంకారము** - అర్థము నాశ్రయించి యుండునది

**అర్థాసనము** - రాజు తన సింహాసనమున కూర్చుండ బెట్టుకొని చేయు సత్కారము

**అర్భకము** - తల్లి నాధారముగా గొనునది (బిడ్డ)

**అర్యాణి** - అర్యుని భార్య (వైశ్య స్త్రీ - అర్య)

**అర్శసుడు** - మూలవ్యాధి కలవాడు

**అర్శోఘ్నము** - మూలవ్యాధిని బోగొట్టునది (కంద, మజ్జిగ, నల్లజీడి)

**అర్శోహితము** - మూలవ్యాదిని గుదుర్చునది (నల్లజీడి)

**అలంకరిష్ణువు** - అలంకరించుకొను స్వభావము గలవాడు (అలంకరిష్ణుడు)

**అలంకారము** - కావ్య సరస్వతికి శోభను గూర్చునది

**అలంఘ్యము** - దాటుటకు వీలుకానిది

**అలక** - తానుండు స్థలమును అలంకరించునది (కుబేరుని రాజధాని)

**అలకలు** - అలంకరింపబడునవి (ముంగురులు)

**అలకి పుట్టువు** - కుంభమున వుట్టినవాడు (అగస్త్యుడు, ద్రోణుడు)

**అలక్ష్యము** - లక్ష్యార్థము లేని పదము

**అలరమ్ము** - పుష్పబాణము (పూవుటల్లు)

**అలరుజిరాజోదు** - పువ్వులు బాణములుగా గలవాడు (మన్మథుడు)

**అలరుబోడి** - పుష్పమువలె సుకుమార శరీరముగల స్త్రీ

**అలరుబోణి** - పువువంటి మెత్తని శరీరము కలది (పూబోడి)

**అలరువిలుకాడు** - పుష్పములు బాణములుగా గల విల్లు గలవాడు (మన్మథుడు)

**అలరువిలుకానియన్న** - మన్మథునకు అన్నయైన వాడు (బ్రహ్మ)

**అలరువిలుదాలుపు** - పుష్పములు బాణము లుగా గల వింటిని ధరించువాడు

**అలరు విల్తునిమేనమామ** - మన్మథుని మేనమామ (చంద్రుడు)

**అలరుసాయకవైరి** - మన్మథుని శత్రువు (శివుడు)

**అలర్కము** - కర్ణుని తొడదొలచిన కీటకము, పిచ్చిపట్టిన కుక్క

**అలసుడు** - పనుల పట్ల శ్రద్ధజూపనివాడు (సోమరి)

**అలాతము** - కాలునని భయముచే తాకబడనిది (కొరవి - ఉల్ముకము)

**అలిందము** - వాకిటి వెలుపలి నలు చదరపు చోటు

**అలాబువు** - నీళ్ళలో మునుగనిది (సొరకాయబుఱ్ఱ)

**అలిని** - తుమ్మెదల గుంపు

**అలిప్రియము** - తుమ్మెదలకు ప్రియమైనది (ఎఱ్ఱకలువ)

**అలివేణి** - తుమ్మెదవలె నల్లని రంగుగల వేణి గలది (స్త్రీ)

**అలుక్సమాసము** - విభక్తి లోపము లేని సమాసము ఉదా కంఠేకాలుడు

**అలౌకికుడు** - లోకవ్యవహార జ్ఞానము లేనివాడు

**అల్పంపచము** - వండుకొను చిన్న పాత్ర

**అల్పంపచుడు** - కొంచెముగా వండుకొను వాడు (లోభి)

**అల్పప్రాణము** - ఉచ్చారణమునందు తక్కువ ప్రాణవాయువు ఉపయోగింపబడునది (వర్గ ప్రథమ, తృతీయ పంచమాక్షరము లును యణ్ణులును అల్పప్రాణములు = క, చ, ట, త, ప, గ, జ, డ, ద, బ, ఙ, ఞ, ణ , న, మ, య, ర , ల, వ, లు ) (పరుష, సరళ, అనునాసిక, అంతస్థములు)

**అల్పము** - మంచి వస్తువుల నుండి తొలగింపబడునది

**అల్పసరస్సు** - చిన్న మంచి నీటిగుంట

**అల్పాయువు** - తక్కువ యాయుర్దాయము కలది (పొట్టేలు)

**అల్పిష్ఠము** - మిక్కిలి అల్పము (అల్పతమము)

**అల్పీయము** - రెండింటిలో అల్పమైనది (అల్పతరము)

**అల్లితెమ్మెరలు** - సుఖమనిపించు (హాయినిగొల్పు) చల్లగాలి (అల్లిగాలి - పిల్లతెమ్మెరలు)

**అల్లియము** - వివాహానంతరము అల్లునికి అత్తవారింట తొలిసారి పెట్టెడు విందు (మనుగుడుపు = అల్లెము)

**అళి** - తోక కలది (తేలు)

**అళింజరము** - జలమును నశింప జేయునది (కాగు - మణికము, అలింజరము)

**అళిందము** - తల వాఁకిటి ప్రక్కనుండు గది, వాకిటికి వెలుపలనున్న చోటు (అలిందము)

**అవకతవక** - సందర్భ శుద్ధి లేనిది

**అవకరము** - చీపురు కట్టతో ఊడ్చి పారవేయబడు దుమ్ము

**అవకాశము** - స్థలమునకును స్థలమునకు నడిమి భాగము, పనికిని పనికిని మధ్య వచ్చెడు వ్యవధానము

**అవకీర్ణి** - పరస్త్రీ గమనాదుల చేత నష్టమైన బ్రహ్మచర్యాది వ్రతము కలవాడు (జారినవ్రతము కలవాడు)

**అవకృష్టుడు** - వెడల గొట్టబడినవాడు, ఇల్లు తుడుచుట మొదలగు పనులు చేయువాడు (సేవకుడు)

**అవగథుడు** - ప్రాతస్స్నానము చేసినవాడు

**అవగదితము** - దూషింపబడినది

**అవగ్రహము** -గ్రహనిరోధముచే నేర్పడిన అనావృష్టి దోషము

**అవచయము** - పూజార్థము పుష్ప ఫలాదులను కోయుట

**అవజ్ఞాలంకారము** - ఒక వస్తువు యొక్క గుణముచే వేరొక వస్తువునకు గుణము కలుగకపోవుట అట్లే దోషముచే దోషము కలుగకపోవుట ఘంటము సముద్రమున ముంచినను కుండెడు నీటిని గ్రహించు చున్నది (అధికాశ్రయమునకు అధిక పలమురాలేదు) తామరలు ముడుచుకొన్నను పూర్ణిమా చంద్రునకు హానియేమి?

**అవటకచ్ఛపము** - బొరియలోని తాబేలు వలె లోకజ్ఞానములేని వానిని దెల్పుటలో వాడబడునది

**అవటము** - ఎలుకలను పాములను రక్షించునది, దీని నుండి లోకులు తమ్ము కాపాడుకొందురు (రంధ్రము, గోయి)

**అవటీటుడు** - చప్పిడి ముక్కు కలవాడు (అవభ్రటుడు)

**అవటూదేశము** - దేహము నందలి పల్లముగా నుండు భాగము, పెడతల భాగము

**అవడీనము** - పక్షి క్రిందు ముఖముగా దిగునప్పటి గమన విశేషము

**అవతరణము** - దేవతలు భూమిపై మనుష్యాది రూపములను ధరించి పుట్టుట

**అవతారము** - దేవతలు మనుష్యాద్యా కారములతో జన్మించిన రూపము

**అవతారిక** - కావ్యాదిని రచింపబడు తదుత్పత్తి విషయిక, కవికృత ప్రస్తావము

**అవతీర్ణము** - దాటబడినది

**అవతోక** - పోయిన దూడగల ఆవు

**అవద్యము** - ఉచ్చరింపదగనిది

**అవధానము** - మనస్సు ఒక విషయము నందు నిలిచియుండుట (ఏకాగ్రత) వివిధ విషయములను ధారణచెయు సామర్థ్యము కలిగియుండుట (అష్టావధానము)

**అవధాని** - వేదమును అభ్యసించినవాడు పెక్కు విషయములను బుద్ధి కుశలతతో ధారణ చేయువాడు (శతావధాని)

**అవధాయకుడు** - అవధానము చెయువాడు

**అవధూతుడు** - కేవల బ్రహ్మజ్ఞాన పరుడై ఆశ్రమ నియమములను కూడ దాటిన వాడు

**అవనాటుడు** - చప్పిడి ముక్కు కలవాడు (అవటీటుడు)

**అవని** - రాజుచే రక్షింపబడునది, ధాన్యాదుల నొసగి ప్రజలను రక్షించునది (భూమి)

**అవని(నీ)ధరము** - భూమిని ధరించునది (పర్వతము)

**అవని(నీ)ధ్రము** - చూ॥ పై

**అవని(నీ)పతి** - భూమికి ప్రభువు (రాజు)

**అవని(నీ)పాలుడు** - భూమిని పాలించువాడు (రాజు)

**అవని(నీ)రుహము** - భూమియందు బుట్టునది (చెట్టు)

**అవపాతము** - ఏనుగులను బట్టుటకై త్రవ్వి పైన సన్నపాటి కఱ్ఱలను పేర్చి మట్టిజల్లిన గొయ్యి

**అవబోధకుడు** - మేలుకొలుపువాడు (సూర్యుడు)

**అవభాషణము** - పొరపాటుగా మాటాడుట

**అవభాసము** - ఒకటి మరియొకటిగా తోచుట (భ్రాంతి)

**అవభృథము** - యజ్ఞాంతమున న్యూనాతిరిక్త దోష నివారణార్థము చేయబడు కర్మము

**అవభ్రటుడు** - చప్పిడి ముక్కువాడు

**అవమంత** - అవమానించువాడు

**అవమతము** - అవమానింప బడినది (అవమానితము - అవజ్ఞాతము)

**అవమము** - మూడు తిథులు కలిసిన దినము (అధమము)

**అవమర్శము** - కోపముచేగాని, వ్యసనముచే గాని మిక్కిలి యాకాంక్షచేగాని గర్భసంధి యందు బ్రకాశించిన బీజార్థమును గురించి చేయబడు పర్యాలోచనము (అపవాదము, సంఫేటము విద్రవము, ద్రవము, శక్తి, ద్యుతి, ప్రసంగము, ఛలనము, వ్యవసాయము, విరోధనము, ప్రరోచనము, విచలనము, ఆదానము అను 13 అవమర్శ సంధి కంగములు)

**అవయవ పంచకము** - ప్రతిజ్ఞ, హేతువు, ఉదాహరణము, ఉపనయనము, నిగమనము అను 5 అవయవముల సమాహారము

**అవయవము** - అన్యోన్యము కూడియుండునది

**అవరజ** - తరువాత బుట్టినది (చెల్లెలు)

**అవరజుడు** - తరువాత బుట్టినవాడు (తమ్ముడు, శూద్రుడు)

**అవరుద్ధతరంగము** - యానక ద్రవ్యము తరంగశక్తి కబళింపబడి కంపన విస్తారమును కోల్పోయిన తరంగము

**అవరోధము** - రాజస్త్రీలున్న కారణమున అడ్డగింపబడు భవనము (అంతఃపురము)

**అవరోధికుడు** - అంతఃపురమున అడ్డగించు వాడు (కంచుకి)

**అవలేపనము** - శరీరమునకు పూసికొను చందనాది ద్రవ్యము

**అవలేహము** - నాకి తినదగిన ఔషధాదికము (లేహ్యము)

**అవశకునము** - భావి కార్యప్రాప్తికి అశుభ సూచకమైన గుర్తు (దుశ్శకునము)

**అవశీలనము** - ముడుచుకొని యుండునది (తేలు)

**అవశ్యాయము** - శైత్యమును బొందునది (మంచు)

**అవసరనైవేద్యము** - మహా నైవేద్యమునకు ముందుగనిచ్చు నైవేద్యము, కార్యసిద్ధి కొరకు ఇతరులకిచ్చు కానుక (లంచము)

**అవస్కందము** - అకస్మాత్తుగా శత్రువులపై బడుట

**అవస్కంది** - స్త్రీలను చెరుచువాడు, శత్రువుపై బడువాడు

**అవస్కరము** - ఊడ్చి ప్రోగుచేసిన చెత్త (దుమ్ము), వంట పాత్రలో అడుగంటి మాడిన అన్నము

**అవస్థ** - కాలకృతమైన స్థితి విశేషము కాలక్రమమునుబట్టి శరీరమున కలిగెడు పరిణామము (బాల్య, కౌమారాది దశ)

**అవస్థితము** - నిలుకడ కలది

**అవహిత్థ** - లజ్జాదులచే హర్షాది వికారములను కప్పిపుచ్చుట (వికారగోపనము)

**అవహృతము** - జరిమానాగా పుచ్చుకొన బడినది

**అవాంతరదిక్కు** - రెండు దిక్కులు కలియు చోటు (మూల)

**అవాంతరము** - నడుమ సంభవించినది

**అవాక్పుష్పి** - క్రిందు ముఖముగల పుష్పములు కలది (పెద్ద సదాప, బ్రహ్మదండి)

**అవాచి** - దక్షిణాయనమున సూర్యుడుదయించు దిక్కు అపరాహ్ణకాలమున సూర్యుడు పొందు దిక్కు (పడమర)

**అవాచీనము** - తలక్రిందైనది, దక్షిణ దిక్కునందు బుట్టినది

**అవాచ్యము** - చెప్పదగనిది, చెప్పుటకు వీలుకానిది

**అవారపారము** - వారించు ఒడ్డులేనిది (సముద్రము)

**అవాల్తాపడు** - ఒకరు చెల్లింపవలసిన ధనమునకు చెల్లింపని పక్షమున తాను చెల్లింతునని పూచీపడు

**అవావటుడు** - స్త్రీకి సవర్ణుడగు అన్య పురుషుని వలన కలిగినవాడు

**అవాసుడు** - వస్త్రమును ధరింపనివాడు

**అవిందువు** - చనిపోవుచున్న సంతానము కల స్త్రీ (అవింద)

**అవికటము** - గొఱ్ఱెల సమూహము, వంకరకానిది

**అవికటోరణము** - మందనుండి బహుమానముగా నీదగిన గొఱ్ఱె

**అవిటి** - శక్తి లేనిది, అవయవలోపము కలవాడు (అంగవికలుడు)

**అవితథము** - అసత్యము కానిది.

**అవిదుగ్ధము** - మేకపాలు (అవిమరీసము)

**అవిద్య** - విద్యకు విరోధి (అజ్ఞానము), సంసారము సత్యము పరమాత్మకు చెందినదను భ్రాంతి

**అవిద్యావరణ శక్తి** - అవరణ శక్తి వస్తు స్వరూపమును కప్పివుచ్చగా దాని స్థానమున మరొక వస్తువు యొక్క అభాసను విక్షేపించు శక్తి

**అవినాభావము** - ఎడతెగని సంబంధము

**అవిముక్తము** - శివపార్వతులచే విడువబడ కుండునది (వారణాసి)

**అవిముక్తేశ్వరుడు** - కాశీ క్షేత్రమునకు ప్రభువు (విశ్వనాథుడు)

**అవిమృష్ట విధేయము** - వర్ణ్యాంశ మప్రధానముగా గూర్పబడు పదము అవిమృష్ట విధేయాంశ మనబడు (ఒకానొక పదదోషము)

**అవియోగవ్రతము** - వైధవ్యము కలుగ కుండుటకై మార్గశిర శుక్ల తృతీయ యందు స్త్రీలు ఆచరించు వ్రతము

**అవిషము** - విషము లేనిది, విషమునకు విరుగుడైనది (సముద్రము, స్వర్గము)

**అవిసోఢము** - గొఱ్ఱెపాలు (అవిమరీసము)

**అవీచి** - అలలు లేనిది (ఒకానొక నరకము)

**అవీర** - మగడును బిడ్డలును లేని యాడుది

**అవేక్షితము** - పరిశీలింపబడినది

**అవైదికుడు** - వేదోక్త విధులను పాటింపని వాడు

**అవ్యక్తము** - రూపాదులు లేకపోవుటచే తెలియబడనిది (పరమాత్మ)

**అవ్యథము** - పాదములచే నడవనిది (పన్నగము - పాము)

**అవ్యము** - గొఱ్ఱెకు సంబంధించినది (గొఱ్ఱెబొచ్చు మొ॥)

**అవ్యయము** - లింగ, వచన విభక్తి శూన్యమైన పదము

**అవ్యయీభావము** - అవ్యయము కానిది దీనిచే అవ్యయమగును పూర్వపదము యొక్క అర్థము ముఖ్యముగా గలది (మొదటి పదము అవ్యయము, రెండవది నామవాచకముగా నుండును)

**అవ్యయుడు** - నాశనము లేనివాడు (శివుడు, విష్ణువు)

**అవ్యవహితము** - ఎడము లేనిది

**అవ్యాప్తి** - చెప్పిన లక్షణము లక్ష్యము నందు ఒకచోట వ్యాపింపకుండుట (గోవు నల్లగా నుండును) (తెల్లావునందు అవ్యాప్తి కలిగెను సరిపడలేదు)

**అవ్యాప్యము** - (వ్యాప్తి విశిష్టము వ్యాప్యము) వ్యాప్తిలేనిది, కాలిన యినుప గుండు నందు నిప్పున్నను పొగలేదు నిప్పుండు చోట పొగయుండుననెడి సాహచర్య నియమము లేదు కనుక నిప్పు పొగకు అవ్యాప్యము

**అవ్యుత్పన్నము** - అవయవార్థము లేనిది (పదము)

**అవ్యుత్పన్నుడు** - వ్యుత్పత్తి జ్ఞానము లేనివాడు

**అశకుంభి** - నీటిమీద బుట్టిన కొలది కాలముననే జలమంతయు వ్యాపించునట్టి గడ్డి (కుంభిక)

**అశక్తుడు** - సమర్థుడు కానివాడు

**అశన** - తినవలెనను కోరిక (ఆకలి)

**అశనాయ** - అశనమును గోరునది (ఆకలి)

**అశనాయితుడు** - ఆకలిగొన్నవాడు

**అశని** - ముల్లోకములను భుజింప సమర్థమైనది (వజ్రాయుధము, పిడుగు)

**అశబ్దవాది** - ప్రధానము జగత్కారణమని వాదించువాడు (సాంఖ్యుడు)

**అశరీరము** - క్రియలేని వాక్యము (అక్రియము - ఒకానొక వాక్యదోషము)

**అశరీరవాణి** - ఆకాశమున బుట్టెడు పలుకులు

**అశిరస్కుడు** - తల లేనివాడు (రాహువు)

**అశిశ్వి** - సంతానము లేని స్త్రీ (గొడ్రాలు)

**అశీతికుడు** - ఎనుబది యేండ్ల వయసు కలవాడు

**అశీతిద్వయము** - ఎనుబది రెండు పన్నములు గలది (వేదము)

**అశేషము** - మిగులు లేనిది

**అశోకము** - శోక నాశకర వృక్షము

**అశోకుడు** - శోకము లేనివాడు, భక్తుల శోకములను పోగొట్టువాడు (విష్ణువు)

**అశౌచము** - మైల (మృతాశౌచము), పురుడు (జాతాశౌచము)

**అశౌచసంకరము** - అశౌచము నడుమ మరియొక అశౌచము వచ్చుట

**అశ్మకుట్టకము** - రాళ్ళను చెక్కుట కుపయోగించు సాధనము (ఉలి)

**అశ్మకుట్టకుడు** - రాళ్ళను మలచువాడు (శిల్పి)

**అశ్మకుట్టుడు** - రాతితో జూర్ణము చేసికొని పదార్థములను తినువాడు (వానప్రస్థుడు), రాళ్ళు మలచువాడు (శిల్పి)

**అశ్మకేతువు** - రాయి కేతువు వలె గలది, పాషాణమును భేదించుకొని పుట్టెడు చెట్టు (పాషాణభేది వృక్షము)

**అశ్మగర్భజము** - చెకుముకి రాయి రాపిడికి పుట్టిన నిప్పు

**అశ్మగర్భము** - రాయి ఉత్పత్తి స్థానముగా గలది (పచ్చ)

**అశ్మజతువు** - రాతినుండి లక్కవలె వచ్చెడు సారము (సిలాజిత్తు)

**అశ్మజము** - రాతి నుండి పుట్టినది (సిలాజిత్తు)

**అశ్మదారణము** - రాతిని మలచునది (ఉలి)

**అశ్మభాలము** - ఔషధాదులు చూర్ణము చేయు లోహపాత్ర విశేషము (అమాను దస్తా, కల్వము)

**అశ్మరి** - మూత్రము బంధించు రోగము (మూత్ర కృచ్ఛ్ర రోగము)

**అశ్మరీఘ్నము** - మూత్రబంధరోగమును బోగొట్టునది (అశ్మరీహరము)

**అశ్మలాక్షము** - అశ్మజతువు

**అశ్మసారము** - ధాతినుండి తీయబడు సారము (ఇనుము, సిలాజిత్తు)

**అశ్మహ** - (అశ్మభిత్తు) పాషాణిభేది వృక్షము

**అశ్రపుడు** - రక్తము త్రాగువాడు (రాక్షసుడు)

**అశ్రవణము** - చెవులు లేనిది (పాము)

**అశ్రీకము** - సంపదను హరింపజేయునది

**అశ్రీకుడు** - ధనము లేనివాడు

**అశ్రువు** - కపోలములయందు వ్యాపించునది (కన్నీరు - నేత్రాంబువు)

**అశ్లీకము** - సంపదను హరింపజేయునది

**అశ్లీలము** - తగనిమాట (పామరజనవాక్కు), వ్రీడామంగళజుగుప్సాకరమగు అర్థమును జెప్పుట (అర్థగత దోషము)

**అశ్వకిని** - గుఱ్ఱపు మూతి చుక్క (అశ్వినీ నక్షత్రము)

**అశ్వకుటి** - గుఱ్ఱపుసాల (లాయము)

**అశ్వఖరజము** - గుఱ్ఱమునకు గాడిదకును బుట్టినది (కంచర గాడిద - అశ్వతరము)

**అశ్వగమన పంచకము** - అస్కందితము, ధోరితకము, రేచితము, వల్గితము, ప్లుతము అను అశ్వగమనములు

**అశ్వఘ్నము** - ఇది తినినచో గుఱ్ఱములు చనిపోవును (తెల్లగన్నేరు)

**అశ్వతరము** - కోడెదూడ, కంచరగాడిద

**అశ్వతరి** - ఆడుకంచర గాడిద

**అశ్వత్థకము** - అశ్వత్థవృక్షము ఫలించు కాలమున చేయదగిన విధులు

**అశ్వత్థము** - మఱ్ఱి మొదలగు వృక్షముల కంటె ఎక్కువ కాలముండనిది

**అశ్వపాలుడు** - గుఱ్ఱములను రక్షించువాడు

**అశ్వబడబము** - ఆడు, మగ గుఱ్ఱముల గుంపు

**అశ్వమహిషిక** - గుఱ్ఱమునకును దున్నపోతునకును గల సహజ వైరము

**అశ్వముఖి** - కిన్నర జాతి స్త్రీ

**అశ్వముఖుడు** - గుఱ్ఱము యొక్క ముఖము వంటి ముఖము గలవాడు (కిన్నరుడు)

**అశ్వమేధము** - గుఱ్ఱమును బలిపశువుగా జేసి సార్వభౌముడు చేయుయాగము

**అశ్వయుక్కు** - గుఱ్ఱములను పూన్చువాడు

**అశ్వవిదుడు** - అశ్వ హృదయమను విద్య తెలిసినవాడు.

**అశ్వశాల** - అశ్వకుటి

**అశ్వశాస్త్రము** - అశ్వ లక్షణాదికములు దెలుపు శాస్త్రము

**అశ్వషడ్గవము** - ఆఱు గుఱ్ఱముల సమూహము

**అశ్వసృగాలిక** - గుఱ్ఱమునకును నక్కకును గల సహజవైరము

**అశ్వస్తనికుడు, అశ్వస్తనుడు** - రేపటికి అవసరమగు వస్తువులను జాగ్రత్త పెట్టుకొనని వాడు

**అశ్వహృదయము** - గుఱ్ఱము యొక్క హృదయమును తెలిసికొనుట కుపయోగించు విద్య

**అశ్వారి** - గుఱ్ఱమునకు శత్రువు (దున్నపోతు)

**అశ్వి** - గుఱ్ఱములు కలవాడు

**అశ్వికము** - గుఱ్ఱముచే లాగబడునది (గుఱ్ఱపుబండి, రథము)

**అశ్విని** - గుఱ్ఱపు ముట్టి వంటి యాకారము గల నక్షత్రము

**అశ్వినులు** - అశ్వరూపధారులగు సంజ్ఞాసూర్యులకు బుట్టినవారు (అశ్వినీ దేవతలు)

**అశ్వీనము** - ఒక దినములో గుఱ్ఱము పోదగిన మార్గము

**అషడక్షీణము**-ఆఱుకన్నులకు గోచరింపనిది (మూడవ వానికి తెలియని రహస్యము)

**అష్టకము** - ఎనిమిది శ్లోకములు కాని, అధ్యాయములు కాని కలది (బిల్వాష్టకము మొ॥), ఎనిమిదింటి సమూహము

**అష్టకర్మములు** - స్నానము, సంధ్య, జపము, హోమము, స్వాధ్యాయము దేవపూజనము, ఆతిథ్యము, వైశ్వదేవము అను 8 కర్మములు

**అష్టకష్టములు** - ఎనిమిది ఆపదలు (దాస్యము, దారిద్ర్యము, భార్యా వియోగము, యాచనము, యాచకులకు లేదనుట, స్వయంకృషి, అప్పుపడుట, దేశాంతరగమనము)

**అష్టకాంగము** - ఎనిమిది గళ్ళుగల పాచికలాడు పలుక

**అష్టక్షీరములు** - ఏనుగు, లొట్టిపిట్ట, గుఱ్ఱము, గొఱ్ఱె, మేక, గేదె, ఆవు, స్త్రీల పాలు

**అష్టగతికుడు** - ఎనిమిది గతి విశేషములు కలవాడు (రాజు)

**అష్టదిగ్గజములు** - 8 దిక్కుల యందుండు గజములు (ఐరావతము, పుండరీకము వామనము, కుముదము, అంజనము, పుష్పదంతము, సార్వభౌమము సుప్రతీకము)

**అష్టదిగ్గజకవులు** - అల్లసాని పెద్దన, ధూర్జటి, నందితిమ్మన అయ్యలరాజు రామ భద్రుడు, మాదయగారి మల్లన, పింగళి సూరన, తెనాలి రామకృష్ణుడు,రామరాజ భూషణుడు, సంకుసాల నృసింహ కవి అను ఎనమండుగురు కవులు

**అష్టపది** - జయదేవ కృతములగు గీత గోవిందములోని గీతము

**అష్టపాత్తు** - ఎనిమిది పాదములు గలది (సాలెపురుగు, శరభమృగము)

**అష్టభోగములు** - ఎనిమిది భోగములు (అన్నము, వస్త్రము, శయ్య, ఆభరణము, తాంబూలము, పుష్పము, గంధము, స్త్రీ)

**అష్టమంగళము** - మొగము, తోక, జూలు, రొమ్ము, గొరిజలు (4), ఈ ఎనిమిది మాత్రము తెల్లగా నుండు గుఱ్ఱము ఎనిమిది మంగళ వస్తువుల సముదాయము సింహము, ఎద్దు, ఏనుగు, కలశము, చామరము, పతాకము, భేరి, దీపము బ్రాహ్మణుడు, గోవు, అగ్ని, బంగారము ఘృతము, ఆదిత్యుడు, జలము, రాజు

**అష్టమదములు** - అన్నము, అర్థము, విద్య, స్త్రీ, కుల, రూప యౌవనములు ఉద్యోగము అనువాని వలన కలుగు మదములు

**అష్టలక్ష్ములు** - ధన, ధాన్య, జయ, రాజ్య, ధైర్య, బల, మోక్ష, సంపల్లక్ష్ములు ఎనిమిది

**అష్టసిద్ధులు** - అణిమ, మహిమ గరిమ లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశిత్వము, వశిత్వము అను ఎనిమిది రకములైన యోగమహిమలు (అష్టభూతులు)

**అష్టశ్రవుడు** - ఎనిమిది చెవులు గలవాడు (అష్టశ్రవసుడు - బ్రహ్మ)

**అష్టాంగము** - ఎనిమిది అంగములు కలది (ప్రణామవిశేషము, యోగ విశేషము మొదలగునవి) తల, రొమ్ము, చేతులు, మోకాళ్ళు, వ్రేళ్ళు, మనస్సు, వాక్కు, దృష్టి (అను ఎనిమిదింటిచే చేయబడునది) 2 యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహార,

ధ్యాన, ధారణ, సమాధి అను ఎనిమిది అంగములు గలది

**అష్టాకపాలము** - ఎనిమిది మట్టి పాత్రలలో సంస్కరింపబడినది (పురోడాశాదికము)

**అష్టాక్షరి** - ఎనిమిది అక్షరములతో గూడిన తారకమంత్రము (ఓమ్, న, మో, నా, రా, య, ణా, య)

**అష్టాదశ వర్ణనములు** - నగరము, సముద్రము, ఋతువు, సూర్యుడు, చంద్రుడు, ఉద్యానము, జలక్రీడ, మధుపానము, రతి, విరహము, వివాహము, పుత్రోదయము, ద్యూతము, ప్రయాణము, నాయకాభ్యుదయము, యుద్ధము, శైలము, రాజు పదునెనిమిది వర్ణనలు

**అష్టాధ్యాయి** - ఎనిమిది అధ్యాయములు గల పాణిని రచించిన సంస్కృత వ్యాకరణ గ్రంథము

**అష్టాపదము** - ఎనిమిది పాదములు గలది (సాలెపురుగు, శరభమృగము), ఎనిమిది ధాతువులలోను శ్రేష్ఠమైనది (బంగారము - బంగారము, వెండి, రాగి, ఇనుము, సత్తు, తగరము, కంచు, సీనము) ప్రతి పంక్తి యందును ఎనిమిదేసి పంక్తులు కలది (నెత్తపలక)

**అష్టావక్రుడు** - ఎనిమిది వంకరలు గల శరీరముతో జన్మించినవాడు (ఒక ఋషి)

**అష్టావధానము** - ఎనిమిది భిన్నాభి ప్రాయముల నొక్క కాలమున వెలిపుచ్చు ధారణ శక్తి

**అష్టావధాని** - చతురంగము, కవిత్వము, చిత్రలేఖనము, గణితము, పఠనము, సంగీతము, వ్యస్తాక్షరి, యుక్తి చెప్పుట మొదలగు అంశములయందు మనస్సు నిలుపగలవాడు.

**అష్టైశ్వర్యములు** - చూ అష్టసిద్ధులు

**అష్టోత్తరశతము** - నూట ఎనిమిది

**అసంఖ్యాతము** - ఇన్నియని లెక్కింప వీలుకానిది

**అసంప్రజ్ఞాత సమాధి** - ఏకాగ్రదృష్టికి విషయము లేక జ్ఞానము - జ్ఞేయము - జ్ఞాత అనుభేదములు నశించినది (ద్రష్టయు - దృశ్యము అనుభేదము నశించినది)

**అసంబద్ధ ప్రలాపము** - అప్రస్తుత ప్రసంగము

**అసంస్కృతము** - వ్యాకరణాదులచే సంస్కరింపబడనిది (అపశబ్దము)

**అసత్ఖ్యాతి** - మిథ్యాజ్ఞానము, (ముత్యపు చిప్పయందు రజతభ్రాంతి); అపకీర్తి

**అసదద్వైత** - స్వశాఖాధ్యయనము పరిత్యజించి అన్యశాఖాధ్యయనము చేయువాడు

**అసద్ధేతువు** - దోషయుక్తమగు హేతువు (హేతువు వలె కనబడనివి హేత్వాభాసములు ఇవి 5 విధములు వ్యభిచారము, విరుద్ధము, సత్ప్రతి పక్షము, అసిద్ధము, బాధితము)

**అసమనయనుడు** - మూడు కన్నులు గలవాడు (అసమాక్షుడు - శివుడు)

**అసమబాణుడు** - 5 బాణములు కలవాడు (మన్మథుడు)

**అసమర్థము** - యోగమాత్ర ప్రసిద్ధమైన పదము (ప్రకృతమునకు సరియైన అర్థము సులభముగా బోధపడనిది ఉదా - శరధరరాజ నికేతను గురు పంకజ చక్రహస్తుగొలుతు (ఒకపద దోషము))

**అసమర్థసమాసము** - పరస్పరాన్వయము లేని పదముల సమాసము

**అసమవాయికారణము** - ఉపాదానము నందుండునది (సమవాయికారణము నందుండునది పటమునకు తంతువుల

నంయోగము బౌద్ధులు, సాంఖ్యులు నమవాయి, అనమవాయికారణములకు భేదము లేదందురు)

**అసమవృత్తము** - నాల్గు పాదములు సమముగా నుండని వృత్తము (విషమవృత్తము)

**అసమశరుడు** - అసమబాణుడు

**అసమాక్షుడు** - మూడు నేత్రములు కలవాడు (అసమనేత్రుడు - శివుడు)

**అసమీక్ష్యకారి** - గుణదోష విచారము చేయక కార్యము ప్రారంభించువాడు

**అసమేషువు** - 5 బాణములు కలవాడు (మన్మధుడు)

**అసలుబుట్టువు** - పంకజము

**అసహాయశూరుడు** - సహాయము లేకయే యుద్ధరంగమున నిలువగల వీరుడు

**అసాధారణ హేతువు** - అన్ని సపక్షము లందును విపక్షము లందును కూడ ఉండని హేతువు (సాధ్యమున్న చోటు నందును, సాధ్యములేని చోటునందును కూడ నిశ్చయముగ ఉండని హేతువు ఉదా - శబ్దము నిత్యము శబ్దమగుట వలన - ఇచ్చట శబ్దము పక్షము నిత్యత్వము సాధ్యము శబ్దత్వము హేతువు - ఈ హేతువు నిత్యములగు ఆకాశాదులందును (సపక్షములందు) లేదు - అనిత్యములగు (విపక్షము) ఘటాదులందును లేదు ఒక శబ్దమందు మాత్రమే యుండును

**అసాధువు** - వ్యాకరణ విరుద్ధమైనది,

**అసిక్ని** - అంతఃపురమున బనిచేయుదాసి

**అసితపక్షము** - పాడ్యమినుండి అమావాస్య వరకు నుండు పదునైదు దినములు (బహుళపక్షము)

**అసితము** - తెలుపుకానిది (నలుపు)

**అసితాంగము** - నల్లని దేహము కలది (కత్తి)

**అసితాననము** - నల్లని ముఖము కలది (కొండముచ్చు)

**అసితుడు** - నల్లనివాడు (శ్రీకృష్ణుడు, శని)

**అసిదంష్ట్రము** - కత్తులవంటి కోరలు గలది (మొసలి)

**అసిద్ధహేతువు** - (హేత్వాభాసము) ఆశ్రయాసిద్ధము, స్వరూపాసిద్ధము, వ్యాప్యత్వాసిద్ధము అని అసిద్ధ హేతువులు మూడు విధములు

**అసిధారావ్రతము** -కత్తియంచుపై నిలుచుట వలె కఠిన నియమములుగల వ్రతము

**అసిధావకుడు** - కత్తులకు బదను పెట్టువాడు

**అసిధేనుక** - ఖడ్గమునకు పిల్లవంటిది (అసిధేనువు - చురకత్తి)

**అసిపత్త్రము** - కత్తుల వంటి ఆకులు గలది (చెరకు)

**అసిమిగొల్లెన** - గోనెలతో ఇరుప్రక్కలను వంపుగా వేసిన గుడారము

**అసుందరము** - వ్యంగ్యార్థము కంటె వాచ్యార్థమే చమత్కారముగ నుండుట (అరుచిరము ఒక గుణీభూత వ్యంగ్యము)

**అసురసంధ్య** - రాక్షసులకు బలము పెరుగుసంధ్య (మరుసంజ)

**అసురాచార్యుడు** - రాక్షసుల గురువు (శుక్రాచార్యుడు - కావ్యుడు)

**అసురుడు** - దేవత గానివాడు, దేవతలను పారద్రోలువాడు (రాక్షసుడు)

**అసురుసురగు** - శ్రమచే తూలు

**అసువులు** - వీనిచే చలనము కలుగును (ప్రాణములు)

**అసూయ** - గుణములందు దోషారోపణము చేయుట

**అసూర్యంపశ్య** - సూర్యునిగాని, ఎండనుగాని చూడనిది (అంతఃపురస్త్రీ)

**అసృగ్ధర** - నెత్తుటిని ధరించునది (చర్మము - త్వక్కు)

**అసృగ్వహ** - రక్త ప్రసరణము జరుగునది (రక్తనాళము)

**అసేచనకము** - ఎంత చూచినను మనస్సునకు సంతృప్తి కలుగనిది (మిక్కిలి సుందరమైనది)

**అస్ఖలితబ్రహ్మచారి** - వేదాధ్యయనము చేయుచు, స్త్రీల విషయమై తొట్రుపాటుపడక బ్రహ్మచర్య దీక్ష సాగించువాడు

**అస్తంగతుడు** - నశించినవాడు, అస్తమించిన వాడు

**అస్తాచలము** - సూర్యుడస్తమించు పడమటి కొండ (అస్తాద్రి)

**అస్తుంకారము** - కానిమ్మని పలుకుట (అంగీకారము)

**అస్త్రకంటకము** - ముల్లువలె నుండు అస్త్రము (బాణము)

**అస్త్రకారుడు** - శస్త్రములు చేయువాడు (కమ్మరి - అస్త్రకారి)

**అస్త్రజీవుడు** - అస్త్ర, శస్త్రములపై ఆధార పడువాడు (యోధుడు, ఆయుధజీవి)

**అస్త్రము** - మంత్రముచే ప్రయోగింప బడునది

**అస్త్రవిద్య** - అస్త్రముల ప్రయోగోప సంహారములను దెలుపువిద్య

**అస్థితుండము** - ఎముక వంటి ముక్కు గలది (పక్షి)

**అస్థిధన్వుడు** - ఎముకయే ధనుస్సుగా గలవాడు (శివుడు)

**అస్థిపంజరము** - ఎముకలగూడు

**అస్థిభక్షము** - ఎముకలను గొరుకునది (కుక్క)

**అస్థిమాలి** - ఎముకల మాలలను మెడలో వేసికొన్నవాడు (శివుడు)

**అస్థియుక్కు** - విరిగిన ఎముకలను గూర్చునది (నల్లేరు)

**అస్థివిగ్రహుడు** - మిక్కిలి కృశించి ఎముకల గూడువలె నుండు వాడు (బక్కచిక్కిన వాడు భృంగి)

**అస్థిశృంఖల** - విరిగిన ఎముకలను కలుపునది (నల్లేరు)

**అస్థిసంచయము** - శవదహనమైన తరువాత ఎముకలను ప్రోవుచేయు కర్మము (సంచయనము)

**అస్థిసంధి** - ఎముకయు ఎముకయు కలియుచోటు విరిగిన ఎముకను చీలవేసి అతుకుట

**అస్థిసారము** - ఎముకలలో నుండు (ద్రవము) సారము (అస్థిజము - మజ్జ)

**అస్థిహారుడు** - ఎముకలతో కూర్చినమాలను ధరించినవాడు (శివుడు - అస్థిమాలి)

**అస్పృశ్యము** - తాకశక్యము కానిది (అగ్ని) అంటరానిది (అపవిత్రము)

**అస్ఫుటము** - గూఢముగా ఉండునది వ్యంగ్యము స్పష్టముగ లేనిది (ఒక గుణీభూత వ్యంగ్యము)

**అస్రజము** - రక్తముచే ఏర్పడునది (కండ)

**అస్రప** - నెత్తురు పానము చేయునది (జలగ)

**అస్రపుడు** - రక్తము త్రాగువాడు (అశ్రపుడు రాక్షసుడు)

**అస్రము** - చేత మీంట బడునది (కన్నీరు) ప్రవహించునది (రక్తము)

**అస్రువు** - కంటిని వ్యాపించునది (అశ్రువు)

**అస్వప్నుడు** - స్వప్నములు లేనివాడు (దేవత వేలుపు)

**అస్వము** - సొంతము కానిది (అస్వకము)

**అస్వరము** - స్వరము కానిది (అచ్చుకానిది), హీనమైన స్వరముగలది

**అస్వస్థుడు** - మనస్సు కుదురులేని వాడు

**అస్వాధ్యాయుడు** - వేదాధ్యయనము చేయని బ్రాహ్మణుడు

**అహంకారి** - గర్వము కలవాడు

**అహంప్రథమిక** - నేను ముందు నేను ముందని యొకరినొకరు మీరుట (అహంపూర్వికి)

**అహంయువు, అహంవాది** - తన్ను గూర్చి తాను గొప్పగా చెప్పుకొనువాడు (అహంకారి, గర్వి)

**అహమగ్రిక** - నేను ముందని ప్రథమ స్థానమునకై (ఆధిక్యమునకై) తగవు లాడుట

**అహమహమిక** - యుద్ధాదులందు నేను ముందు నేను ముందని రోషమున వాదులాడుట (అహంపూర్వికి)

**అహరహము** - దినదినము (ప్రతిదినము)

**అహర్దానము** -పితృదేవతల ప్రీతి కొరకు చేయబడు పిండజలాది దానము (పితృయజ్ఞము)

**అహర్నాథుడు** - పగటికి నాథుడు (సూర్యుడు అహఃపతి)

**అహర్నిశము** - రేయింబవలు

**అహర్పతి** - పగటి వేలుపు (అహఃపతి - సూర్యుడు)

**అహర్బాంధవుడు** - పగటి యందు ప్రజలకును, ప్రభువగుటచే బగటికిని బంధువైనవాడు (సూర్యుడు)

**అహర్మణి** - పగటి యందు మణి వలె ప్రకాశించు వాడు (సూర్యుడు - ద్యుమణి)

**అహర్ముఖము** - పగటిలో తొలి భాగము (ప్రాతఃకాలము)

**అహల్యము** - దున్నుటకు వీలుకానిది

**అహల్యాజారుడు** - అహల్యకు విటుడైన వాడు (సహస్రాక్షుడు - ఇంద్రుడు) దున్నబడని నేలయందు వర్షించువాడు

**అహల్యానందనుడు** - కుమారుడగుటచే అహల్యను సంతోషపెట్టినవాడు (శతానందమహర్షి)

**అహస్కరుడు** - పగలు గలుగజేయువాడు (సూర్యుడు - అహఃకరుడు)

**అహింసావాది** - హింస కూడదనువాడు (బౌద్ధభిక్షువు)

**అహి** - చరించునది, హింసించునది (పాము)

**అహికోశము** - పాము పై కుబుసము

**అహితుండికుడు** - పాముల నాడించి జీవించు వాడు (పాములవాడు - వ్యాళగ్రాహి)

**అహిద్విషము** - పాములకు శత్రువు (గరుత్మంతుడు, నెమలి)

**అహిద్విషుడు** - నాగులకు శత్రువు, (గరుత్మంతుడు, ఇంద్రుడు)

**అహినకులిక** - సర్పమునకును ముంగిసకును గల సహజ వైరము

**అహిపతి** - సర్పములకు ప్రభువు (సర్పరాజు)

**అహిఫేనము** - పాము విషమువలె భయంకరమైనది (నల్లమందు)

**అహిభుక్కు** - పాములను భక్షించు (వాడు) నది (గరుత్మంతుడు, నెమలి - పాప మేపుడు)

**అహిభూషణుడు** - పన్నగ భూషణుడు (శివుడు)

**అహిభృత్తు** - సర్పములు నగలుగ ధరించువాడు (శివుడు)

**అహిమన్యువు** - పాము పగవంటి పగ కలవాడు

**అహిమాంశువు** - తీక్ష్ణమైన కిరణములు కలవాడు (సూర్యుడు)

**అహిమారకము** - పాములను జంపునది (ముంగిస, నెమలి)

**అహిమారకుడు** - సర్పములను జంపువాడు (గరుత్మంతుడు)

**అహిమార్కుడు** - తీక్ష్ణముగా ప్రకాశించు పూజనీయుడు (చండసూర్యుడు)

**అహిరిపువు** - సర్పములకు శత్రువు

**అహీంద్రుడు** - సర్పములకు రాజు (ఆదిశేషుడు)

**అహీరణి** - రెండు తలల పాము (ఇరుదలలపాము)

**అహేతుకము** - కారణము లేనిది

**అహోరాత్రము** - పగలును రేయును

**అహ్రీకుడు** - సిగ్గులేని వాడు



**ఆంకుశికుడు** - అంకుశము ఆయుధముగా గలవాడు (మావటీడు)

**ఆంగము** - శరీరమునకు సంబంధించినది

**ఆంగవిద్యుడు** - శరీరావయవ లక్షణములను బట్టి శుభా శుభాదులను తెలుపు సాముద్రిక విద్య తెలిసినవాడు

**ఆంగారము** - అంగారముల సమూహము (బొగ్గులరాశి)

**ఆంగికము** - అవయవముల కదలికలచే జరుపబడినది (అభినయ విశేషము, స్త్రీల హావభావాదికము)

**ఆంగిరసము** - అంగములకు రస రూపమైనది

**ఆంగిరసుడు** - అంగి(గీ)రసుని కుమారుడు (బృహస్పతి)

**ఆంజని** - కాటుక కల బరిణె (కాటుక కాయ)

**ఆంజనేయుడు** - అంజనకు బుట్టినవాడు (హనుమంతుడు)

**ఆంతరజ్ఞుడు** - లోపలి మర్మము తెలిసిన వాడు

**ఆంతరము** - పైకి గనబడనిది (గూఢము)

**ఆంతరాళము** - మధ్య భాగమునకు సంబంధించినది

**ఆంత్రికము** - ప్రేగులకు సంబంధించినది

**ఆంధసము** - అన్నమునకు సంబంధించినది (అన్నరసము)

**ఆంబికేయుడు** - పార్వతీదేవి యొక్క పుత్రుడు, (విఘ్నేశ్వరుడు, కుమారస్వామి), అంబికాతనయుడు (ధృతరాష్ట్రుడు)

**ఆంభసికము** - నీటియందుండునది (చేప, జలాంతర్గామి)

**ఆకషికుడు** - గీటుపెట్టి బంగారమును పరీక్షించుటలో నేర్పరి

**ఆకాంక్ష** - క్రియనుబట్టి కర్తృ కర్మాదులను విశేష్యమునుబట్టి విశేషణములను రాబట్టుటకై వేయు ప్రశ్నము, వాక్యాన్వయ సిద్ధికొరకు ఒక పదము వేరొక పదమును అపేక్షించుట

**ఆకాత్యము** - చిన్న విషయమును పెద్దదిగా చేసి గగ్గోలు పెట్టుట

**ఆకాలికము** - అకాలమందు బుట్టినది, పుట్టిన వెంటనే నశించునది

**ఆకాలికి** - పుట్టిన వెంటనే నాశమునొందునది (మెరుపు - విద్యుత్తు)

**ఆకాశకక్ష్య** - ఆకాశము భూమియు కలిసినట్లు చుట్టును కనబడు ప్రదేశము (దిక్చక్రము)

**ఆకాశగంగ** - ఆకాశమునందుండెడి గంగానది (మందాకిని - మిన్నేరు)

**ఆకాశజనని** - దుర్గములోని వారు వెలుపలి వారిని చూచుట కనువుగా అక్షము లేర్పరచిన గోడ (ప్రగండి)

**ఆకాశదీపము**- రవి తులారాశియందుండగా నొకమాసము కాలము సాయం కాలమున ఎత్తైన చోట్ల పెట్టెడు దీపము (కార్తిక దీపము)

**ఆకాశపంచాంగము** - పరస్పర సంబంధము లేక పెక్కు దోషములతో నిండిన చరిత్రాదికములు

**ఆకాశటఃములు** - అం, ఞ, జ ణ, న, మ, శ, క్ష అను పది యక్షరములు

**ఆకాశభాషితము** - రంగస్థలమున ప్రవేశించిన పాత్రధారి ఆకసము వంకజెవిపెట్టి ఏదియో వినుచున్నట్లభి నయించి చెప్పుట (పాత్రానుక్తకథనము),ఆకాశమునందుండి యదృశ్యులగు వేల్పుల వలన బుట్టిన మాట (ఆకాశవాణి)

**ఆకాశము** - దీనియందంతటను సూర్యాదులు ప్రకాశింతురు

**ఆకాశరక్షి** - కోట వెలుపలి ప్రాకారము నందుండి కావలి కాయువాడు (భటుడు)

**ఆకాశవాణి** - ఆకారము కనబడక ఆకసమున వినబడు వచనము

**ఆకాశరామన్న అర్జీ** - విలాసము తెలియబడని వ్యక్తి యొక్క దరఖాస్తు

**ఆకుపూజ** - తమలపాకులతో చేయుపూజ

**ఆకుమడుపు** - ఈనెలు తీసి సున్నము రాచిన తమలపాకుల చుట్ట

**ఆకురాయు** - కత్తులు మొదలగు వానిని సానబట్టుటకుపయోగించు గరుకురాయి, ఒకానొక పక్షి విశేషము

**ఆకూతి** - ఇది చేయుదుననెడి సంకల్పము (ఆశయము)

**ఆకృతి** - ప్రతిపాదమునకు 22 అక్షరములు కల ఛందస్సు

**ఆకృతి గణము** - ఉదాహరింపబడిన పదములను బట్టి అదే పోలికగల మరికొన్నిటి సమూహము (గ్రహింపబడుట) (వ్యాకరణము)

**ఆకేకరము** - కొంచెము ఓరగజూచునది (కన్ను)

**ఆకోత్తు** - తమలపాకులలో వేసికొను విధముగ వక్కలు కత్తిరించు కత్తెర (అడకొత్తు)

**ఆక్రందనము** - రోదనతో గూడిన పిలుపు (మొఱ్ఱ)

**ఆక్రందితుడు** - ఆర్తుల మొరవిని రక్షించుటకు పూనుకొనువాడు (ఆర్తరక్షకుడు)

**ఆక్షద్యూతికము** - జూదము వలన సంభవించిన వైరము

**ఆక్షపాదము** - అక్షపాద మహర్షిచే వ్రాయబడినది (గౌతముని న్యాయ శాస్త్రము)

**ఆక్షారితుడు** - పరస్త్రీ గమనము (వ్యభిచారము) చేసితివని నిందింప బడినవాడు

**ఆఖండలుడు** - శత్రువులను ఖండించువాడు (ఇంద్రుడు)

**ఆఖాతము** - పరులచే త్రవ్వబడకయే స్వయముగా ఏర్పడిన జలాశయము (పెద్దమడుగు)

**ఆఖుకరీషము** - కన్నము నుండి ఎలుకలు తోడి పోసిన మట్టికుప్ప

**ఆఖుభుక్కు** - ఎలుకలను భక్షించునది (పిల్లి, పాము)

**ఆఖువాహనుడు** - ఎలుక వాహనముగా గలవాడు (విఘ్నేశ్వరుడు)

**ఆఖువిషహా** - ఎలుక విషమును హరించు ఓషధి (దేవతాడము)

**ఆఖువు** - అంతటను కన్నములు త్రవ్వునది (ఎలుక, పందికొక్కు)

**ఆఖూత్కరము** - ఎలుకలు త్రవ్వి పోసిన మట్టికుప్ప (ఆఖుకరీషము)

**ఆఖేటము** - మృగమిందు వెరపింపబడును (వేట)

**ఆఖ్య** - దీనిచేత పిలువబడును (పేరు)

**ఆఖ్యానము** - రామాయణ, భారతాదుల నడుమ పూర్వము జరిగిన దానిని చెప్పుట (ఉపకథ)

**ఆఖ్యాయిక** - వాస్తవముగా జరిగిన కథను చెప్పెడి గద్య కావ్యము

**ఆగంతుకము** - ఒక కవి రచించిన గ్రంథములో నడుమ క్రొత్తగా జేర్పబడినది (ప్రక్షిప్తము) హఠాత్తుగా వచ్చునది

**ఆగంతువు** - అకస్మాత్తుగా వచ్చు(నది)వాడు (విందు, అతిథి)

**ఆగడపలు** - దట్టమైన మేఘపంక్తి

**ఆగమము** - మిత్రునివలె అధికముగా వచ్చి చేరెడు వర్ణము, (వ్యాకరణము), తంత్రశాస్త్రము

**ఆగమాపాయి** - ఉత్పత్తి నాశములు గలది (అశాశ్వతమైనది)

**ఆగవీనుడు** - గోవులను ఉదయము నుండి సాయంకాలము వరకును మేపువాడు (గొల్లవాడు)

**ఆగస్సు** - కుటిలముగా బొందునది, దీనిచేత కుటిలముగా జరింతురు (తప్పు, పాపము)

**ఆగాయిత్యము** - చూ ఆకాత్యము (పాపము, అపరాధము)

**ఆగ్నీధ్రము** - యజ్ఞవేదికలో ఉత్తర భాగమున ఋత్విజుడుండు స్థానము

**ఆగ్నేయము** - అగ్నికి సంబంధించినది

**ఆగ్నేయస్నానము** - శరీరమునందంతటను విభూతిని బూసికొనుట

**ఆగ్నేయుడు** - శివుని తేజమును ధరించిన యగ్నికి స్వాహాదేవి యందు గల్గినవాడు (కుమారస్వామి)

**ఆగ్రయణము** - క్రొత్తగా వచ్చిన ధాన్యముతో చేయు యజ్ఞము (ఆగ్రయణేష్టి చేసియే క్రొత్త అన్నమును భుజింపవలెను)

**ఆగ్రహాయణికము** - మార్గశీర్ష పూర్ణిమనాడు చెల్లింపదగిన ఋణము

**ఆఘుర్ణణి** - భూషణాదికమును రాచి శుభ్రము చేయుటకుపయోగించు కుంచె (ఆఘూర్ణణి)

**ఆఘాతనము** - అపరాధులను వధించుచోటు, కసాయివాడు పశువులను కోయునట్టి కొట్టము

**ఆఘాత్యము** - గోరంతలు కొండంతలుగా జేసి ఏడ్చుట

**ఆఘారము** - నైఋుతి దిక్కున ప్రారంభించి ఈశాన్యముతో సమాప్తము చేయు హోమము, దక్షిణ పరిధిని సడలించి తూర్పుగాను ఉత్తరముగాను ఆజ్యాదికమును అగ్నియందు పడవేయుట

**ఆఘోషణము** - అంతటను తెలియ బరుచుట (చాటింపు, ప్రకటన)

**ఆచంద్రతారకము** - చంద్రుడును, నక్షత్రములు ఉండునంత వఱకు

**ఆచంద్రార్కము** - చంద్రుడును సూర్యుడును ఉండునంత వరకు

**ఆచమనము** - ఉదకము దీనియందు బానము చేయబడును (ఉపస్పర్శము)

**ఆచయకుడు** - పుష్పాదికమును ప్రోగుచేయుట యందు నేర్పరి

**ఆచాంతము** - ఆచమనము చేయబడినది

**ఆచారలాజలు** - రాజు లూరేగునపుడు మంగళార్థము ముత్తైదువలు చల్లు, పేలాలు

**ఆచారవేది** - ఆచారమునకు వేదికవంటిది (ఆర్యావర్తము)

**ఆచారి** - మంచి నడవడిక కలవాడు

**ఆచార్య** - వేదమునకు అర్థము చెప్పు స్త్రీ

**ఆచార్యాని** - ఆచార్యుని భార్య (గురుపత్ని)

**ఆచార్యుడు** - వేద వ్యాఖ్యానము చేయు పండితుడు

**ఆచూషణము** - శరీరమందలి విషాదులను (పీల్చి) లాగుట కుపయోగించు వైద్య సాధనము

**ఆచ్ఛేదనము** - నిర్బంధముగా కొనిపోబడినది, పూర్తిగా చీల్చ బడినది

**ఆచ్ఛోదనము** - మృగములిందు ఖండింపబడును (వేట)

**ఆజకము** - మేకల యొక్క సమూహము

**ఆజన్మసురభిపత్త్రము** - పుట్టినదాదిగా పరిమళించెడి ఆకులు గలది (మరువము)

**ఆజానుబాహువు** - మోకాళ్ళ వరకు వ్రేలాడు (నిడుదలైన) చేతులు కలవాడు

**ఆజానేయము** - శర ఘాతములచే రక్తము స్రవించుచున్నను రౌతు చెయు సూచనలను గుర్తించి మెలగు ఉత్తమాశ్వము

**ఆజి** - బాణములను దీనియందు వేయుదురు దీనియందు సంచరింతురు (యుద్ధము, చదరమైన నేల, క్షణకాలము) ఏడు ప్రవ్యాధముల దూరము (మేర)

**ఆజీవము** - దీనిచే బ్రతుకుదురు (వృత్తి)

**ఆజువు** - దుఃఖము దీనిచేత పుట్టింపబడును (వెట్టిపని)

**ఆజ్ఞాచక్రము** - కనుబొమల నడుమనుండు ఒక చక్రము (షట్చక్రముల లోనిది)

**ఆజ్యము** - అన్నాదులయందు పోయదగినది (నేయి)

**ఆజ్యావేక్షణము** - దుష్ట నక్షత్రమున బుట్టిన శిశువులను రజస్వలయైన భార్యను జూచుటకు ముందుగా అరిష్ట నివారణార్థము తైలమున వారి ప్రతిబింబమును జూచెడు స్మార్త సంస్కార విశేషము

**ఆటతిప్ప** - క్రీడార్థమేర్పరిచిన కొండ

**ఆటవికము** - ఆటవికులతో కూర్చిన సేన

**ఆటవికుడు** - అడవిలో నుండువాడు

**ఆటవిడుపు** - ఆడుకొనుటకు విద్యార్థులను విడిచిపెట్టుట

**ఆడంబరము** - శత్రు హృదయము నెత్తివేయునది దీనిచేత పిరికివాండ్రు నిగ్రహింపబడుదురు (యుద్ధవాద్య ధ్వని, ఏనుగు ఘీంకారము)

**ఆఢకికము** - తూమెడు విత్తనములు పండునేల తూమెడు (4 కుంచముల) బియ్యము ఉడుకు పాత్ర (ఆఢీకీనము)

**ఆఢ్యంకరణము** - సంపన్నునిగా జేయునది (వ్యాపారము)

**ఆఢ్యుడు** - అంతట నితని దలతురు (ధనికుడు)

**ఆతంకము** - దీనిచేత ప్రయానమున బ్రతుకుదురు (రోగము, భయము)

**ఆతంచనము** - అంతట వ్యాపించుట (తోడుపెట్టుట, వేగము)

**ఆతతాయి** - చంపుటకు ఉద్యమించినవాడు (దుర్మార్గుడు)

**ఆతపత్త్రము** - ఎండనుండి కాపాడునది (గొడుగు)

**ఆతరణము** - రేవు దాటించెడు వానికిచ్చు కూలి (పడవ కూలి - తరపణ్యము, ఆతరణము)

**ఆతాపి** - ఇతర జాతి పక్షులను బాధించునది

**ఆతాయి** - ఇతర (జాతి) పక్షులను శిథిలముగా (పిన్నగ్రద్ద) జేయునది (ఆతాయి - చీరపపిట్ట)

**ఆతారము** - పడవ నడుపువానికిచ్చు కూలి

**ఆతి** - ఎల్లప్పుడు తిరుగునది (ఆడేలను పక్షి - ఆటి)

**ఆతిదేయము** - అతిధికి చేయదగినది (విందు)

**ఆతిథేయుడు** - అతిధి సత్కారము చేయువాడు

**ఆతిథ్యము** - అతిధి కొరకైనది (అతిధి సత్కారము)

**ఆతివాహికుడు** - మరణానంతరము జీవుని పరలోకమునకు తీసికొనిపోవు వేల్పు (అతి యాత్రికుడు)

**ఆతురుడు** - అంతట వేగిరము గలవాడు (రోగి)

**ఆతుర సన్న్యాసము** - రోగాదుల యందు

జీవితముపై విరక్తి నొంది స్వీకరించు సన్న్యాసము

**ఆతోద్యము** - వాయింపబడునది (తత, ఆనద్ధ, సుషిర, ఘనములు-వీణె, మద్దెల, పిల్లన గ్రోవి, తాళము అనెడు చతుర్విధ వాద్యములు)

**ఆత్తగంధుడు** - గర్వ భంగము చేయబడిన వాడు

**ఆత్మ** - ఎడతెగక తిరుగునది (శాశ్వతమైనది), స్వకర్మ ఫలమును భుజించువాడు (క్షేత్రజ్ఞుడు)

**ఆత్మంభరి** - తనపొట్ట నింపుకొనువాడు (కుక్షింభరి)

**ఆత్మకథ** - తనయొక్క కధ

**ఆత్మగుప్త** - దీనివలన శరీరము దాచబడును (దూలగొండి)

**ఆత్మఘాతము** - తన్ను జంపుకొనుట (ఆత్మహత్య)

**ఆత్మఘోషము** - కుకుకో కోయని తన పేరును బలుకునది (కోడి) కాకా అని తన పేరును తానే చాటునది (కాకి)

**ఆత్మజ** - తనవలన బుట్టినది (కూతురు)

**ఆత్మజుడు** - తనవలన బుట్టినవాడు (కొడుకు)

**ఆత్మజ్ఞుడు** - తన్ను దానెరిగినవాడు (ఆత్మగ్రాహి)

**ఆత్మదర్శము** - శరీరమును జూపునది (అద్దము)

**ఆత్మనిష్ఠుడు** - ఆత్మజ్ఞానమును మాత్రము అన్వేషించువాడు

**ఆత్మనేపదము** - ధాతుబోధితమగు ఫలము (క్రియాఫలము) కర్తకు చెందుటను తెలియజేయునది

**ఆత్మప్రభము** - తనంతట తాను ప్రకాశించునది (బ్రహ్మము)

**ఆత్మభువు** - తనకు తానే పుట్టినవాడు (బ్రహ్మ, విష్ణువు, శివుడు), హృదయమున బుట్టువాడు (మన్మధుడు)

**ఆత్మవిదుడు** - తన్ను తానెరింగినవాడు

**ఆత్మసంభవుడు** - తనంత తానే పుట్టినవాడు (బ్రహ్మ, శివుడు, పరమాత్మ), తన శరీరమున బుట్టినవాడు (పుత్త్రుడు)

**ఆత్మసముద్భవుడు** - ఆత్మసంభవుడు

**ఆత్మసాత్కృతము** - తనచే లోబరుచుకొన బడినది

**ఆత్మస్తుతి** - తన్ను తాను బొగడుకొనుట

**ఆత్మహత్య** - తన్నుతాను జంపుకొనుట

**ఆత్మారాముడు** - ఆత్మయందు మాత్రమే రమించువాడు (యోగి)

**ఆత్మోపముడు** - ఆకారాదికము నందు తన్నుపోలు వాడు (కుమారుడు)

**ఆత్రేయి** - అత్రి కూతురు వలె బొందరానిది (రజస్వల)

**ఆత్రేయుడు** - అత్రి మహాముని యొక్క కుమారుడు(దుర్వాసుడు,దత్త్రాత్రేయుడు)

**ఆదమరచు** - ఒడలుమరచు

**ఆదర్శము** - దీనియందు తన నీడ కనబడును (అద్దము)

**ఆది** - ముందుగా వ్యవహరింపబడునది

**ఆదికారణము** - ఆరంభకాలమందు కారణమైనది (ముఖ్యకారణము)

**ఆదికావ్యము** - తొలి కావ్యము (రామాయణము)

**ఆదితేయుడు** - అదితికి కశ్యపుని వలన బుట్టినవాడు (వేలుపు)

**ఆదిత్యవారము** - ఏడువారములలో మొదటిది (భానువారము)

**ఆదిత్యహృదయము** - సూర్యపరమైనట్టి రామాయణాంతర్గత స్తోత్రము

**ఆదిత్యుడు** - అదితి కొడుకు (సూర్యుడు)

**ఆదిత్యులు** - అదితి కొడుకులు (దేవతలు)

**ఆది పంచకము** - భారతములోని ఆది పర్వము మొదలుకొని ఉద్యోగపర్వము వరకు గల 5 పర్వములు

**ఆదిభిక్షుకుడు** - మొట్టమొదట భిక్షమెత్తిన వాడు (శివుడు)

**ఆదివరాహము** - మొదట వరాహావ తారమును ధరించిన వాడు (విష్ణువు)

**ఆదివారము** - ఆదిత్యవారము

**ఆదిశక్తి** - మొదటి శక్తి స్వరూపము (దుర్గ)

**ఆదీనవము** - దీనులను బొందునది (క్లేశము)

**ఆదీపకుడు** - ఇండ్లకు నిప్పంటించువాడు, ఒకరిపై కొకరిని కయ్యమునకు పురికొల్పువాడు

**ఆదీపనము** - రంగవల్లులు పెట్టి గృహాదులను అలంకరించుట

**ఆదేవకుడు** - జూదమాడువాడు (జూదరి)

**ఆదేశము** - ఒకదాని స్థానమున వచ్చిన మరియొక వర్ణము (స్థానాక్రమణము), ప్రభుత్వ శాసనము (ఆజ్ఞ)

**ఆదేష్ట** - అధ్వర తంత్రమునుపదేశించువాడు

**ఆద్యంత రహితము** - మొదలును జివరయు లేనిది

**ఆద్యూనుడు** - తిండి మీదనే దృష్టి నిలుపువాడు (తిండి పోతు), ఒకరి చేతి కూటికి కనిపెట్టుకొనియుండు వాడు (ఔదరికుడు)

**ఆథర్వణము** - అథర్వముల సమూహము, అథర్వవేద విహితమగు అభిచారాగ్ని కర్మము

**ఆధర్షణము** - వాదమును ఖండించుట, పరులను అన్యాయముగా పీడించుట

**ఆధాత** - సంస్కార పూర్వకముగా అగ్నిని స్థాపించువాడు

**ఆధానము** - సంస్కారాది పూర్వకముగా హవ్యాదికమును ఉంచుట

**ఆధారశక్తి** - సర్వాధారకారకమైన పరమేశ్వర శక్తి శరీరమునందలి మూలాధార శక్తి (మాయ)

**ఆధారాధేయ సంబంధము** - ఆధారమునకును, ఆధేయమునకును (ఉంచతగినది) గల సంబంధము

**ఆధికరణికుడు** - న్యాయ విచారణ చేయువాడు (న్యాయాధికారి)

**ఆధి దైవికము** - దేవతల వలన సంభవించినది, దైవము వలన కలిగినది

**ఆధి భౌతికము** - పంచ భూతముల వలన గలిగిన సుఖదుఃఖాదికము

**ఆధివేదనికము** - రెండవ పెండ్లి చేసికొనువాడు మొదటి భార్యకిచ్చిన ధనాదికము (స్త్రీ ధనము)

**ఆధిస్తేనుడు** - కుదువ పెట్టిన వాని (సొమ్మును) వస్తువులను వాని యనుజ్ఞ లేకయే వాడుకొనువాడు

**ఆధోరణుడు** - ఏనుగులను అదుపులో పెట్టువాడు (మావటీడు)

**ఆధ్మాత్మికము** - ఆత్మవలన కలిగినది

**ఆనందము** - బంధుమిత్రాదులతో హృదయ పూర్వకముగా సంభాషించి సంతోష పరుచుట

**ఆనందభుజుడు** - ఆనందము ననుభవించు చున్నవాడు (సుషుప్త్యవస్థలో నున్న జీవుడు)

**ఆనందమయకోశము** - పంచకోశములలో అయిదవ కోశము (విజ్ఞానమయ కోశమునకు

ఆత్మ, ఆనందమయ పురుష రూపునకు ప్రియము తలమోద ప్రమోదములు కుడి ఎడమ పక్షములు, ఆనందము మధ్యభాగము, బ్రహ్మము ప్రతికారియైన పుచ్ఛము), (వేదాంతము)

**ఆనకదుందుభి** - జననకాలమున దేవతలచేత మ్రోగింపబడిన దుందుభి ధ్వనులు కలవాడు (వసుదేవుడు)

**ఆనకము** - సైనికులను ఉత్సాహపరుచునది (మద్దెల)

**ఆనద్ధము**-మద్దెల మొదలగు చర్మవాద్యము

**ఆనాయము** - చేపలు పట్టుట కుపకరణ మైనది (వల)

**ఆనాయ్యము** - గార్హపత్యాగ్ని నుండి తీసికొని రాబడిన దక్షిణాగ్ని

**ఆనిలి** - వాయుదేవుని కుమారుడు (హనుమంతుడు, భీముడు)

**ఆనుకల్లు** - అనుకొనుట కుపకరించు కల్లు (ఊతకల్లు)

**ఆనుగ్రామికము** గ్రామమునకు అనుకొనియున్నది

**ఆనుశాసనికము** - శాసించుటకు తగినది

**ఆనుషంగికము** - ప్రసంగ వశమున వచ్చినది

**అనూపము** - చెమ్మనేల నుండునది (ఎనుబోతు)

**ఆన్వీక్షకి** - న్యాయ వైశేషికాది తర్కవిద్య, విజ్ఞానము తెలుపబడు రాజవిద్య (రాజవిద్యలు - ఆన్వీక్షకి, త్రయి, వార్త, దండనీతి)

**ఆపగ** - ఉదక సమూహముచే బోవునది (నది)

**ఆపగేయుడు** - (శంతనుని వలన) గంగకు బుట్టినవాడు (భీష్ముడు)

**ఆపతి** - ఉచ్ఛ్వాస రూపమున లోపల పడుచున్న వాయువు (ప్రాణము)

**ఆపతితము** - దైవ వశమున సంభవించినది

**ఆపద్ధర్మము** - విపత్కాలమందు అనుసరింప వలసిన ధర్మము

**ఆపన్న సత్త్వ** - గ్రహింపబడిన గర్భము గలది (గర్భిణి)

**ఆపమిత్యకము** - ఒక వస్తువునిచ్చి దాని స్థానమున గ్రహింపబడిన మరియొక వస్తువు

**ఆపస్సు** - వ్యాపించునది (నీరు)

**ఆపాంగ్యము** - కడకన్నులకు పెట్టబడునది (కాటుక)

**ఆపాదనము** - సంపాదనము

**ఆపాదమస్తకము** - పై నుండి పాదముల వరకు, పాదము మొదలుకొని తల వరకు

**ఆపానము** - అనేకులు కూడి మద్యపానము చేయు చోటు (కల్లుపాక)

**ఆపింజరము** - ఎరుపు పసుపు కలిసిన రంగు గలది (బంగారము)

**ఆపీనము** - పాలు చేపినపుడు వృద్ధి పొందునది (పొదుగు), తోడిన కొలది నీరు ఊరి వృద్ధి పొందునది (నూయి)

**ఆపూపికుడు** - అట్లు అమ్మి జీవించువాడు, అపూపములు (దోసెలు) తినువాడు

**అపూర్వమాణము** - అంతటను వ్యాపించు చున్నది

**ఆపోశనము** - భోజన సమయమున నాద్యంతములయందు పుడిసిటజలము పోసికొని సమంత్రకముగా పుచ్చుకొనుట (ఆపోసనము)

**ఆప్రచ్ఛనము** - బంధువులను కుశల ప్రశ్నలచే ప్రీతులను జేయుట

**ఆబాల గోపాలము** - బాలుడు మొదలు గోపాలుడు వరకు గల జన సమూహము

**ఆబిడ్డ** - పాలుకుడుచుట మానిన ఆవుపెయ్య

**ఆబూతికాడు** - అధికముగా తినువాడు (తిండిపోతు)

**ఆబోతురవుతు** - ఆబోతు నెక్కువాడు (శివుడు - ఆబోతురౌతు)

**ఆబ్దికము** - ప్రతి సంవత్సరము పితృదేవతల నిమిత్తమై చేయు శ్రాద్ధము (తద్దినము)

**ఆభరణము** - అంతటను శోభ కొరకు ధరింపబడునది (నగ)

**ఆభాషణము** - ఒకరినొకరు పలుకరించుకొనుట

**ఆభాస** - లేనిది ఉన్నట్లు తోచుట,

**ఆభిచరిణికము** - శత్రుమారణ వశీకరణాదులకు సాధనమైన మంత్రాదికము

**ఆభిచారికము** - (ఆభిచరిణికము)

**ఆభిజాత్యము** - సత్కులమున బుట్టుట

**ఆభిధానికుడు** - కోశమును వ్రాసినవాడు

**ఆభిషేచనికము** - పట్టాభిషేకమున కుపయోగించునది

**ఆభిరి** - గొల్లపడుచు

**ఆభీలము** - భయమును గొల్పునది (భయంకరము)

**ఆభ్యుదాయికము** - పితృమాతృ కులాదుల నుండి లభ్యమైన స్త్రీ ధన విశేషము

**ఆమనిచెలి** - వసంతునకు స్నేహితుడు (మన్మథుడు)

**ఆమపాత్రము** - పచ్చికుండ

**ఆమయము** - దీనిచే పీడింపబడుదురు (రోగము)

**ఆమయావి** - రోగము గలవాడు

**ఆమరసము** - రక్తమగుటకు తయారుగానున్న అన్నరసము

**ఆమలకము** - ఆరోగ్యమునిచ్చు గుణము గలది (ఉసిరికాయ)

**ఆమవడ** - పొగిచిన పెరుగులో నానవేసిన వడ (ఆమ్లవటిక - ఆవడ)

**ఆమశ్రాద్ధము** - బియ్యము, శాకము మొదలగునవి పచనము చేయకయే పెట్టెడు శ్రాద్ధము

**ఆమాశయము** - శరీరములో అపక్వాన్నముండెడు భాగము

**ఆమిక్ష** - వేడి పాలలో పెరుగు పోయుట వలననైన వికారము (పాలవిరుగుడు - కూకు)

**ఆమిషప్రియము** - మాంసము నందు మక్కువ గలది (రాపులుగు)

**ఆమిషము** - రోగము గలుగజేయునది (మాంసము), పొందబడునది (కానుక, లంచము)

**ఆమిషాశి** - మాంసమును దినువాడు (రాక్షసుడు - పొలదిండి)

**ఆముక్తమాల్యద** - తనచే ధరింపబడిన మాల్యము శ్రీరంగేశుని మెడలో నలంకరించినది (గోదాదేవి - విష్ణు చిత్తీయమను గ్రంధము)

**ఆముక్తము** - ధరింపబడినది, విడిచి పెట్టబడినది

**ఆముఖము** - జరుగబోవు నాటకమును గూర్చి నటమారిష విదూషకాదులతో సూత్రధారునిచే ప్రస్తావింపబడునది (ప్రారంభము - ప్రస్తావన)

**ఆముఖాంగములు** - కథోద్ఘాతము, ప్రవృత్తము, ప్రయోగాతిశయములను ఆముఖాంగములలో ఒకటి యుండ దగును (ప్రస్తావనాంగములు - స్థాపనాంగములు)

**ఆముష్మికము** - పరలోకమున గల్గునది (ఆముత్రికము)

**ఆముష్యకులిత** - సద్వంశమున జన్మించుట

**ఆముష్యాయణుడు** - ప్రసిద్ధ వంశుడగు తండ్రి వలన బుట్టినవాడు (కులీనుడు)

**ఆమూలాగ్రము** - మొదటినుండి చివరి దాక (పూర్తిగ)

**ఆమోదము** - దూరముగా వ్యాపించెడి పరిమళము, సంతోషము

**ఆమ్నాయము** - గురు శిష్యపరంపరగా అభ్యసింపబడునది (వేదము)

**ఆమ్రపేశి** - ఎండబెట్టిన కండగల మామిడి బ్రద్ద

**ఆమ్రాతకము** - మామిడిని ఇంచుకంత అనుసరించి యుండునది (అంబాళము), ఎండిన మామిడి (రసము) గుజ్జు (అంబాళము, మామిడితాండ్ర)

**ఆమ్రేడితము** - ద్విరుక్తము యొక్క పర రూపము, సంతోష సంభ్రమాదులచేత రెండు మూడు పర్యాయములు పలుక బడిన శబ్దము

**ఆయకట్టు** - రాబడి యొక్క నిర్ణయము (వచ్చుబడి) చెరువు మొదలుగా వాని క్రిందకు వచ్చు సాగుబడి నేల మొత్తము

**ఆయకాడు** - పన్ను వసూలుచేయు అధికారి

**ఆయతనము** - దీనియందు జ్ఞానాది సంపాదనార్థము యత్నము చేయుదురు (ఇల్లు, గుడి, బౌద్ధాలయము)

**ఆయతికాడు** - ధనార్జన చేయువాడు (గడనకాడు), ప్రభుత్వాదాయమును కాపాడు వాడు (కోశాధికారి)

**ఆయవారమెత్తు** - ఇంటింటికి తిరిగి ధాన్యమునుగాని, బియ్యమునుగాని యాచించుట (బిచ్చమెత్తు)

**ఆయస్థానము** - సుంకము వసూలుచేయు చోటు

**ఆయుధజీవి** - ఆయుధముచే జీవించువాడు (ఆయుధికుడు - యోధుడు)

**ఆయుర్వేదము** - ఆయుర్వర్ధక మార్గములను తెలుపునట్టి యొక వేదము (వైద్యశాస్త్రము)

**ఆయుష్కర్మము** - ఆయుర్వృద్ధి కరమగు పని (క్షౌరము)

**ఆయుష్కాముడు** - దీర్ఘాయువును గోరు వాడు

**ఆయుష్మంతుడు** - పెద్దకాలము జీవించు వాడు

**ఆయోగవుడు** - వైశ్యస్త్రీయందు నాల్గవ జాతి వానికి బుట్టినవాడు (వడ్రంగి

**ఆరంభవాదులు** - పరమాణు సమ్మేళనము వలన జగత్తు పుట్టునను వారు (న్యాయ, వైశేషికాది మతస్థులు)

**ఆరంభశూరత్వము** - (కార్యాది) ప్రారంభించునపు డెక్కువ ఆడంబరము కలిగి రానురాను సన్నగిల్లినది

**ఆరకాటీ** - ఓడ నడపువాడు (నావికుడు - సరంగు)

**ఆరకూటము** - సువర్ణము యొక్క మాయా రూపము వలె ప్రకాశించునది (ఇత్తడి - పిత్తలము)

**ఆరఘట్టము** - కూపోదకమును పైకి రప్పించు యంత్ర విశేషము (ఏతము)

**ఆరజము** - మనస్సును హరించునది (ఇంపైనది)

**ఆరట్టజము** - ఆరట్టదేశమునందు బుట్టిన మేలుజాతి గుఱ్ఱము (పంజాబులో ఈశాన్యప్రాంతము ఆరట్టము)

**ఆరణేయుడు** - ఆరణియందు పడిన వ్యాసుని వీర్యమును దినుటచే శుకము నకు జన్మించినవాడు (శుకయోగి)

**ఆరణ్యకుడు** - అడవులయందుండువాడు (వానప్రస్థుడు)

**ఆరతి** - దేవతా విగ్రహముల యెదుట ధూపదీపాదులను త్రిప్పుట

**ఆరాధ్యుడు** - పూజింపదగినవాడు (శైవుల గురువు)

**ఆరామము** - ఇందు క్రీడింతురు (తోట)

**అరివేరపుతాపసి** - కలహములు కల్పించెడు ముని (తగవులజడదారి - నారదుడు)

**ఆరుగాళ్ళ జీవము** - ఆరుకాళ్ళు కలిగినది (సాలీడు)

**ఆరుగాళ్ళ పురుగు** - ఆఱు పదములు కలది (షట్పది - తుమ్మెద)

**ఆరుణి** - అరుణుని సంతతి (ఉద్దాలకుడను ఋషి, యముడు)

**ఆరుద్రపురుగు** - ఆరుద్ర కార్తెలో చూపట్టెడి పురుగు

**ఆరుమోముల వేల్పు** - ఆరు ముఖములు గల దేవుడు (కుమారస్వామి)

**ఆరుమోములసామి** - ఆరుమోముల వేల్పు

**ఆరురిక్కల ప్రోగు** - కృత్తికా నక్షత్రము

**ఆరేవతము** - దీనిచేత రోగము ఎగిరిపోవును (ఆరగ్వధము - రేలచెట్టు, రేలపండు)

**ఆరోపము** - ఒకవస్తువునందు మరియొక వస్తు ధర్మమున్నట్లు చెప్పుట

**ఆరోహణము** - ఎక్కుటకు సాధనమైనది (మెట్టు, నిచ్చెన)

**ఆర్కి** - సూర్యుని కుమారుడు (శని, యముడు, వైవస్వతమనువు)

**ఆర్గురు తల్లుల కొమరుడు** - కుమారస్వామి (షాణ్మాతురుడు)

**ఆర్జుని** - అర్జునుని కుమారుడు (అభిమన్యుడు, బభ్రువాహనుడు)

**ఆర్ద్రకము** - తడిగలది (అల్లము - శృంగ బేరము)

**ఆర్య** - శ్రేష్ఠురాలు (పార్వతి, పూజ్యురాలు)

**ఆర్యకము** - గయలో పితృదేవతల కొరకు చేయు శ్రాద్ధ విశేషము

**ఆర్యపుత్రుడు** - దృశ్య కావ్యాదులయందు వాడబడు భర్తృ పర్యాయ వాచకము, మాన్యుడగు వాని పుత్రుడు

**ఆర్యావర్తము** - పూర్వ పశ్చిమ సముద్రములకును వింధ్య హిమవత్పర్వతము లకును నడుమగల సీమ

**ఆర్యుడు** - కర్తవ్యమునననుసరించు పూజ్యుడు, ఆర్యావర్తమున నివసించువాడు

**ఆర్షభ్యము** - అబోతుగా విడువదగిన కోడె

**ఆర్షము** - ధర్మార్థము వరుని వలన గోమిధునము దీనికొని కన్యనిచ్చి నక్రమముగ జేయు వివాహము, (బ్రహ్మము, దైవము, ఆర్షము, ప్రాజాపత్యము అను నాల్గు విధములగు వివాహములు బ్రాహ్మణునకు ప్రశస్తములు)

**ఆలకాపరి** - గోవులను కాచువాడు (గోపాలుడు, కృష్ణుడు)

**ఆలపనము** - రాగమును కళలు వెయుచు పాడుట (రాగము తీయుట)

**ఆలమెకము** - గోవులను ఏమార్చు జంతువు (నక్క)

**ఆలయము** - జనులిందు చేరి అణగియుందురు (ఇల్లు), లయమగు వరకు

**ఆలరేడు** - ఆవులకు ప్రభువు (అబోతు - బసవడు)

**ఆలవట్టము** - ఉపచారార్థము వస్త్రముతో గుండ్రముగా జేసిన విసనకఱ్ఱ, రాజాదులకు ఎండతగుల కుండుటకు పట్టునది (గుడ్డగొడుగు)

**ఆలవాలము** - నీరునిల్చుటకై త్రవ్వబడునది (పాదు)

**ఆలానము** - దీనియం దేనుగును దెచ్చి కట్టుదురు (ఏనుగు గట్టు స్తంభము)

**ఆలాపము** - ఎక్కువగా (లెస్సగా) బలుకుట (మాటలాడుట)

**ఆలాస్యము** - పెద్ద ముఖము కలది (మొసలి)

**ఆలింపనము** - పండుగ దినములందు గోడలకు సున్నమువేసి, తోరణములు కట్టి ముగ్గులు పెట్టి గృహము నలంకరించుట

**ఆలీఢము** - కుడికాలు ముందునకు నెడమ కాలు వెనుకకును జాచి నిలుచు విలు కాని నిలుకడ

**ఆలీఢకము** - దూడలు గెంతులు వేయుచు గ్రీడించుట

**ఆలెగాడు** - తన క్రింద కొలువు చేయువాడు (చేజీతగాడు)

**ఆలెప్రొయ్యి** - నాలుగైదు వంటకములు ఏకకాలమున చేయ వీలగునట్టి ప్రొయ్యి

**ఆలేఖకుడు** - చిత్తరువు వ్రాయువాడు,

**ఆలేఖని** - చిత్తరువులు వ్రాయు కుంచె

**ఆళుగ** - గరుకైన శరీరముగల ఉడుము వంటి అడవి జంతువు (ఆళువ -శల్యకము)

**ఆళుతనము** - దొరతనము, అధికారము (ప్రభుత్వము)

**ఆళ్వారు** - ద్రావిడ ప్రబంధకర్తయగు విష్ణుభక్తుడు (ఆళ్వార్లు పన్నిద్దరు - పేయాళ్వార్ మొ॥)

**ఆవకాయ** - ఆవపిండి నూనె కారము మొదలగు పదార్థములతో నూరబెట్టిన మామిడికాయ (ఊరుగాయ)

**ఆవనేయుడు** - భూదేవి కుమారుడు (అంగారకుడు)

**ఆవరణశక్తి** - (చైతన్యమును) వస్తు స్వరూపమును గప్పి పుచ్చునది (మాయా శక్తి)

**ఆవర్తని** - కలియబెట్టుటకు సాధనమైనది (గరిటె)

**ఆవర్తము** - నీటియందు జక్రము విధమున దిరుగునది (నీటిసుడి)

**ఆవసథము** - సన్న్యాసులు మొదలగువారు బసచేయు మఠాదికము

**ఆవాపకము** - ముంజేతికి తొడుగబడునది (ముంజేతి మురుగు)

**ఆవాపము** - నీళ్ళు అంతట నిలువబడును (పాదు)

**ఆవాయకము** - ఆడుదాని చేతి మట్టిగాజు

**ఆవాలము** - ఉదకము దీనియందు కదలు చుండును (పాదు)

**ఆవాహనము** - విగ్రహాదులయందు దైవశక్తిని ప్రవేశింప జేయునప్పటి మంత్రోచ్చారణము

**ఆవికము** - గొఱ్ఱెకు సంబంధించినది (పాలు) గొఱ్ఱె బొచ్చుతో జేయబడిన కంబళి

**ఆవృత్తము** - వల్లింపబడినది, గుండ్రముగా త్రిప్పబడినది

**ఆవేగము** - సుఖదుఃఖాదుల యందు గలుగు తొట్రుపాటు

**ఆవేదకుడు** - అభియోగము మోపువాడు (వాది) విన్నవించువాడు

**ఆవేశనము** - పనులు చేయించువారు ప్రవేశిం చునది (శిల్పశాల)

**ఆశంసువు** - తనకులేని వస్తువుపై కోరిక కలవాడు

**ఆశరుడు** - హింసించువాడు (రాక్షసుడు)

**ఆశితము** - తృప్తిగా భుజింపబడినది,

**ఆశీవిషము** - కోరలయందు విషము గలది (పాము)

**ఆశుకవిత్వము** - అప్పటికప్పుడు సందర్భము ననుసరించి చెప్పెడి కవిత్వము

**ఆశుగము** - వడిగా బోవునది (బాణము, గాలి)

**ఆశుశుక్షణి** - త్వరగా ఎండించు (నది) వాడు (సూర్యుడు, అగ్ని)

**ఆశ్రమము** - సన్న్యాసులు నివసించునది (మఠము), రెల్లు మొదలగు వానితో నేయబడిన కుటీరము

**ఆశ్రయాశుడు** - తన కాధారమగు కాష్ఠాదికమును భుజించువాడు (అగ్ని)

**ఆశ్రయాసిద్ధము** - సాధ్యమగు విషయమున కాధారమగు పదార్థము లేకపోవుట (గగనారవిందము పరిమళము గలది సరోజారవిందమువలెనె యనుచోట సాధ్యమున కాశ్రయమగు గగన పద్మముండుటయే సంభవము కాదు)

**ఆశ్వము** - అశ్వ సమూహము, గుఱ్ఱములచే లాగబడునది (రథము)

**ఆశ్వయుజము** - అశ్వినీ నక్షత్రముతో గూడిన పూర్ణిమ గల మాసము (ఏడవ మాసము)

**ఆశ్వినేయులు** - అశ్వినీ దేవతల యంశమున జనించినవారు (నకుల సహదేవులు)

**ఆశ్వీనము** - గుఱ్ఱమొక దినములో నడువదగినంత ప్రదేశము

**ఆషాఢము** - ఆషాఢ నక్షత్రముతో గూడిన పూర్ణిమ గల మాసము, బ్రహ్మచారి ధరించెడు మోదుగు దండము

**ఆసంగము** - ఒక్క విషయమునందే మనస్సును కేంద్రీకరించుట

**ఆసందిని** - పేముతో చేసిన చెక్కడము

**ఆసాది** - గ్రామదేవతను పూజించు అర్చకుడు (ఆసాదివాడు)

**ఆసారము** - అంతటను కురియునది (జడివాన)

**ఆసుగ్రోవి** - నేతగాడు పడుకుదారము జొప్పించెడు గొట్టము (ఆసుమ్రాను)

**ఆసుతీవలుడు** - సోమరసమును తీసెడి యాజ్ఞికుడు

**ఆసురము** - కన్యయొక్క తల్లిదండ్రులకును కన్యకును యథాశక్తి ద్రవ్యమిచ్చి యథేచ్ఛగా జేసికొను పరిణయము (ఆసురము వైశ్య శూద్రులకు ప్రశస్తము) బొంతకాకి (ద్రోణము)

**ఆసురీణము** - నల్లావాలు పండునేల

**ఆసేచనకము** - ఎంతసేపు చూచినను తృప్తి తీరనిది

**ఆస్కందితము** - వేగముగా పరువెత్తెడి అశ్వగమన విశేషము (ధోరితకము, రేచితము, వల్గితము, ప్లుతము మొ॥)

**ఆస్తరణము** - కూర్చుండుటకు పరచినది (చాప, కంబళి) గజాశ్వాదుల మీద పరచబడినది

**ఆస్తికుడు** - వేద ప్రామాణ్యము నంగీకరించువాడు పరలోకమున్నదని (భగవంతుడున్నాడని) నమ్మువాడు

**ఆస్ఫోట** - కొంచెముగా వికసించునది (అడవిమల్లె)

**ఆస్ఫోటని** - రత్నములకు రంధ్రము వేసెడి సూది తొలుచుటకు పనికివచ్చు వడ్రంగి వాని పనిముట్టు (తొరవణము - బర్మా)

**ఆస్యము** - భక్ష్యవస్తువులిందు వేయబడును (నోరు, ముఖము)

**ఆస్రపుడు** - నెత్తురు త్రాగువాడు (రాక్షసుడు)

**ఆస్రవము** - దీనిచేత ఇంద్రియములు చెదరును (అలసట)

**ఆస్వాదకుడు** - అనుభవించువాడు

**ఆహతము** - కలుగనేరనిది (కుందేటికొమ్ము - సంభవముకానిది) కొట్టబడినది, ఇనుమడింపబడినది

**ఆహతలక్షణుడు** - మంచి గుణములచే ప్రసిద్ధుడు (త్యాగశౌర్యాది గుణ ప్రసిద్ధుడు)

**ఆహవనీయము** - హోమము చేయుదగినది (హవిరాదికము)

**ఆహవము** - ఇందు పరస్పరము పిలువబడుదురు (యుద్ధము, యాగము)

**ఆహాదము** - నీరు త్రాగుటకై పశువుల పిలుచునది (నూతి యొడ్డుననుంచ బడిన నీటి తొట్టె)

**ఆహితలక్షణుడు** - ఆహతలక్షణుడు

**ఆహితాగ్ని** - వేద సంస్కార ప్రకారముగా అగ్నిహోత్రమును కాపాడుకొనువాడు

**ఆహిరి** - రాత్రి 9 గం॥ నుండి 12 గం॥ వరకు పాడదగిన స్త్రీ రాగ విశేషము

**ఆహుతము** - దేవతల ప్రీతికొరకు అగ్నియందు వేల్వబడినది

**ఆహేయము** - (అహి) పామునకు సంబంధించినది (విషము, చర్మము)

**ఆహోపురుషిక** - గర్వముచే దన్ను గొప్పగా సంభావించుకొనుట (అహోపురుషిక)

**ఆహ్నికము** - పగటి భాగమున చేయదగిన కర్మము

**ఆహ్వాయము** - పిలుచుటకు సాధనమైనది (పేరు)

**ఇంగితము** - దీనిచేత అభిప్రాయ మెరుగబడును (అభిప్రాయమును ప్రకటించుచేష్ట)

**ఇంగితజ్ఞుడు** - ఎదుటి వాని మనోభావము లను గ్రహించువాడు

**ఇంగిలికాయలు** - చిన్న మంచినీటి చేపలు

**ఇంచిమంచి** - అల్పాహారము, చిరుతిండి (ఉంచిమంచి)

**ఇంగుదము** - ఊర్ధ్వముగా బోవునది, చాంచల్యమును పోగొట్టునది (గారచెట్టు తాపస తరువు)

**ఇంచుకడలి** - చెరకుసంద్రము

**ఇంచుబోడి** - చెరకు వలె మనోహరమైన శరీరము గలది (స్త్రీ - ఇంచుబోణి)

**ఇంచుమించులాడు** - ఎచ్చు తగ్గులు పలుకు

**ఇంచువింటి చెంచు** - చెర[illegible] విల్లుగా గల దొర (మన్మధుడు)

**ఇంచువిలుకాడు** - చెరకు విల్లుగా గలవాడు

**ఇంచువిలుదాలుపు** - చెరకు విల్లు తాల్చిన వాడు (మన్మధుడు)

**ఇంచువిలుదాల్పు చెయ్వు** - సంభోగము

**ఇంతి కొపుంజు** - ఇంతి కొరకు రాత్రి కోడిపుంజువలె కూసినవాడు(దేవేంద్రుడు)

**ఇందిందిరము** - పద్మసంపదతో కూడినది (తుమ్మెద)

**ఇందిర** - పరమైశ్వర్యవతి (లక్ష్మి)

**ఇందిరాలయము** - లక్ష్మికి నివాస స్థానమైనది (పద్మము)

**ఇందీవరము** - లక్ష్మీదేవిచే వరింపబడినది, ఇంద్రియములను సంతోషపెట్టునది (నల్లకలువ - ఇందివరము)

**ఇందుడు** - తన కిరణములచే దడుపువాడు (చంద్రుడు - శీతాంశుడు)

**ఇందుకాంతము** - చంద్ర కిరణముల తాకిడిచే కరగునది (చంద్రకాంతము), చంద్రునకు ప్రియమైనరాయి

**ఇందుమౌళి** - చంద్రుడు శిరోభూషణముగా గలవాడు (చంద్రమౌళి - శివుడు)

**ఇందురజము** - కర్పూర చూర్ణము

**ఇందులోహము** - చంద్రుని వలె ప్రకాశించు లోహము (వెండి - ఇందులోహకము)

**ఇందువదన** - చంద్రుని వంటి మొగము గలది (చంద్రానన)

**ఇందువల్లి** - చంద్రవల్లి (సోమలత)

**ఇందువు** - మంచు కిరణములతో దడుపువాడు (చంద్రుడు)

**ఇందువ్రతము** - చంద్రకళ యొక్క క్షయ వృద్ధుల ననుసరించి ఆచరించువ్రతము (చాంద్రాయణ వ్రతము)

**ఇంద్రకీలము** - అర్జునుడు తపస్సు చేసిన కొండ

**ఇంద్రకృష్ణము** - మానవ ప్రయత్నము లేకయే వర్షజలము చేతనే పండునది (ధాన్యము)

**ఇంద్రగోపము** - ఇంద్రుడు ప్రభువుగా గలది (ఆరుద్రపురుగు)

**ఇంద్రచ్ఛందస్సు** - వేయిపేటలు గలహారము

**ఇంద్రజిత్తు** - ఇంద్రుని జయించినవాడు (మేఘనాధుడు)

**ఇంద్రద్రువు** - (అర్జున నామకమవుటచేత) ఇంద్రునికి ప్రియమైన వృక్షము (ఏరుమద్ది)

**ఇంద్రధనుస్సు** - మేఘములపై ధనురాకారముగా నేర్పడు రంగురంగుల సూర్యకిరణ సమూహము (ఇంద్ర చాపము - వాల్మీకము)

**ఇంద్రధ్వజము** - భాద్రపద శుక్ల ద్వాదశి యందు రాజు సస్యవృద్ధికరమగు వానకురియుటకై ఇంద్రప్రీతిగా ఎత్తునట్టి ధ్వజము

**ఇంద్రలోకము** - ఇంద్రుడు ప్రభువుగా గల లోకము (స్వర్గము)

**ఇంద్రాగ్ని** - మేఘము వలన గలుగు నిప్పు (మెరుపు)

**ఇంద్రాణి** - ఇంద్రుని భార్య (శచీదేవి)

**ఇంద్రాయుధము** - ఇంద్రుని ఆయుధము

**ఇంద్రారి** - ఇంద్రునకు శత్రువైనవాడు (రాక్షసుడు, వృత్రాసురుడు)

**ఇంద్రావరజుడు** - ఇంద్రునకు బిమ్మట బుట్టినవాడు (ఇంద్రుని తమ్ముడు ఉపేంద్రుడు)

**ఇంద్రియగోచరము** - ఇంద్రియములకు గోచరమగునది (శబ్దస్పర్శ రూపాదికము)

**ఇంద్రియబోధకము** - ఇంద్రియముల కుద్రేకము కల్గించునది

**ఇంద్రియము** - ఇంద్రుడు అధిదేవతగా గలది (వీర్యము)

**ఇంద్రియ సన్నికర్షము** - ఇంద్రియములకు దమతమ విషయముల తోడి సంబంధము

**ఇంద్రియారాముడు** - సదా శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదుల యందానక్తి కలవాడు (విషయలోలుడు)

**ఇంద్రుడు** - ఐశ్వర్యము కలవాడు

**ఇంద్రోత్సవము** - ఇంద్రుని గూర్చి జరిపెడు ఉత్సవము

**ఇంధనము** - దీనిచేత అగ్ని ప్రకాశించును (వంటకట్టె)

**ఇక్షుకీయ** - చెరకు విశేషముగా గలభూమి

**ఇక్షుకుట్టకుడు** - చెరకు బెల్లముగా వండువాడు

**ఇక్షుధన్వుడు** - చెరకు విల్లుగా గలవాడు (మన్మధుడు)

**ఇక్షుయంత్రము** - చెరకు రసము తీసెడు యంత్రము (చెరకు గానుగ)

**ఇక్షువాటిక** - చెరకు పండెడు పొలము (చెరకుతోట), చెరకు పంట పండించెడు తోట

**ఇక్షువికారము** - చెరకు రసము రాను రాను

బెల్లము, చక్కెర, కండ చక్కెర మొ॥లగు విశుద్ధ రూపములుగా తయారగుననుట

**ఇక్షు శాకటము** - చెరకు ఎక్కువగా పండెడు పొలము

**ఇగురగట్టు** - తిండిలేకుండ మాడ్చు

**ఇగురుగైదువు జోదు** - చిగురాకు ఆయుధముగా గల యోధుడు (మన్మథుడు)

**ఇగురుబోడి** - చిగురు వలె సౌకుమార్యము గల యాడుది (ఇగురుబోణి)

**ఇచ్చకదారి** - ముఖప్రీతికై మంచి పనులు చేయువాడు

**ఇచ్చకాలమారి** - ముఖ ప్రీతికరములగు మాటలు పల్కెడు నైజము కలవాడు

**ఇచ్చగొండి** - ముఖప్రీతి కరములగు కృత్యములు చేయువాడు

**ఇచ్ఛమానికము** - కోరికలను తీర్చెడి మణి (చింతామణి)

**ఇటకావము** - ఇటుకలు కాల్చుట కేర్పరచిన సెగపట్టు (ఇటికావము)

**ఇట్బరము** - కామముతో సంచరించునది (ఆబోతు)

**ఇట్టికాడు** - ఈటెతో యుద్ధము చేయువాడు (ఈటెకాడు)

**ఇట్టికావము** - ఇట॰ ॰వము

**ఇడావత్సరము** - చూ అను వత్సర వివరణము

**ఇడుమ్రాను** - కోరికలు తీర్చు చెట్టు (ఇచ్చు చెట్టు - కల్పతరువు)

**ఇడ్వరము** - ఇట్బరము

**ఇతరేతరాశ్రయము** - ఒకదాని నొకటి ఆశ్రయించి యుండుట

**ఇతిహాసము** - ఇట్లు జరిగెనని చెప్పెడు పూర్వరాజుల చరిత్రము కలది (భారతము, కాశ్మీరరాజ తరంగిణి మొ॥)

**ఇత్తిగ** - పాచికల మీద మూడు చుక్కలజత (ఇరుతిగ - ఆఱు)

**ఇత్తిగమోముల బలియుడు** - ఆఱుమోముల సామి (కుమారస్వామి - షణ్ముఖుడు)

**ఇత్వరము** - స్వేచ్ఛగా దిరిగెడు స్వభావము కలది (ఆబోతు - షండము)

**ఇత్వరి** - కామోద్రేకముతో సంచరించు స్త్రీ (రంకుటాలు)

**ఇద్దరు తల్లుల ముద్దు బిడ్డడు** - గంగా పార్వతుల గారాబుపట్టి (గణపతి)

**ఇధ్మజిహ్వుడు** - సమిధల వలన బయలు వెడలిన జ్వాలలు నాలుకలుగా గలవాడు, కట్టెలు తినెడు జిహ్వకలవాడు (అగ్ని)

**ఇధ్మప్రప్రశ్చనము** - కట్టెలను నరకునది (గొడ్డలి)

**ఇధ్మము** - చూ ఇంధనము (సమిధ)

**ఇనిమనుమడు** - ముని మనుమని కొడుకు, మునిమనుమని మనుమడు

**ఇనుడు** - సదా సంచరించువాడు (సూర్యుడు, రాజు)

**ఇనుప ॰ ॰ట్లు** - ఈనునట్టి మేకలు

**ఇనుమనుమడు** - మనుమని కొడుకు, మునిమనుమని కొడుకు

**ఇనుమనుమరాలు** - మునిమనుమని కూతురు

**ఇబ్బంది** - అధికమగు కట్టుబాటు, రెండు జాతుల పందులకు పుట్టిన పంది, అడవి పందికిని ఊరపందికిని పుట్టిన పంది

**ఇబ్బందిగాడు** - బెబ్బులికిని చిరుతపులికిని పుట్టిన పులి (ఎలుగుబంటి)

**ఇబ్బంది గుజ్జము** - సంకరజాతి గుజ్జము

**ఇభనిమీలిక** - తినినయెడల ఏనుగునకైనను మత్తు కలుగజేసి కనులు మూత పడునట్లు చేయునది (గంజాయి)

**ఇభపోట** - మగ చిన్నెలు గల ఆడేనుగు

**ఇభము** - మదమును పొందునది

**ఇభ్యుడు** - ఏనుగు నెక్కుటకు అర్హుడు (ధనికుడు, రాజు)

**ఇరమ్మదము** - జలముచే వృద్ధి పొందునది (వజ్రాగ్ని)

**ఇరసాలునామా** - భూమి పన్ను వివరముల పట్టీ

**ఇరుగాలిపసి** - రెండు కాళ్ళ పశువు (అజ్ఞాని - మొద్దు)

**ఇరుచేవంచ తలలదొర** - పదితలల ప్రభువు (రావణుడు)

**ఇరుదంతి** - రెండు దంతములు కలది (ఏనుగు - ద్విరదము)

**ఇరుదలదొర** - రెండు తలల దేవుడు (అగ్ని)

ఇరుదల దొరతేజి - అగ్నిదేవుని వాహనము (పొట్టేలు - ఇరుదలతేజి)

**ఇరుదలవులుగు** - రెండు తలలు గల పక్షి (గండభేరుండ పక్షి - ఇరుదల గ్రుడ్డు కాన్పు)

**ఇరుబుట్టువు** - రెండు పుట్టుకలు గలవాడు (బ్రాహ్మణుడు)

**ఇరులగొంగ, ఇరులదాయ, ఇరులసూడు** - చీకటికి శత్రువు (సూర్యుడు, చంద్రుడు, అగ్ని)

**ఇరువాడికైదువు** - ఇరువైపుల పదనుగల కత్తి

**ఇరువాయికట్టు** - మలమూత్ర బంధరోగము

**ఇరువాయిపక్కి** - రెండు నోళ్ళు గల పక్షి (గండభేరుండపక్షి)

**ఇఱ్ఱింకచూపులు** - లేడిచూపులవంటి బెదరు చూపులు

**ఇఱ్ఱిదాల్పుబావ** - చంద్రునకు బావయైన వాడు, (విష్ణువు)

**ఇర్లవేటగాడు** - చీకటిని వేటాడువాడు (సూర్యుడు, చంద్రుడు, అగ్ని)

**ఇలాధరము** - భూమిని ధరించునది (పర్వతము)

**ఇలారము** - స్థానము మార్చుకొనుటకు వీలగు గుడిసె

**ఇలుకూచి** - ఇల్లు విడువని యాడుది

**ఇలువేలుపు** - ఇంటి దైవము (కులదైవము)

**ఇల్లటకాడు** - ఇల్లరికముండెడి యల్లుడు

**ఇల్లడపెట్టు** - వస్తువులను కుదువపెట్టు, కోరినప్పుడు ఇచ్చు షరతు పై దాచి యుంచు

**ఇల్లరికము** - అత్తవారింటనే అల్లుడు భార్యతో చేయు కాపురము

**ఇల్లాలు** - ఇంటి యందలి స్త్రీ (గృహిణి)

**ఇల్లోనారాయణమ్మ** - ఎంగిలి చేతితో కాకిని గూడ అదలింపనిది (అతిలోభి)

**ఇవపుగుబ్బలి** - చలిమల (మంచుకొండ)

**ఇవవు గుబ్బలిబిడ్డ** - హిమవంతుని కూతురు (పార్వతి)

**ఇవవు గుబ్బలి బిడ్డ సవతి** - గంగాదేవి

**ఇవము మేపరి** - హిమమును భక్షించువాడు (సూర్యుడు - చలిదాయ)

**ఇవముసూడు** - మంచునకు శత్రువైనవాడు (చలిదాయ - వేడివెలుగు = సూర్యుడు)

**ఇవురుబోణి** - చిగురువలె మనోజ్ఞయగు నాడుది (ఇవురుబోడి)

**ఇషము** - చైత్రయాత్ర దీనియందు కలుగుచున్నది గెలవపలెనని ఇచ్చ కలవారు దీనిని కోరుదురు (ఆశ్వయుజ మాసము)

**ఇషీక(ము)** - నాగేలు వలెనిడివైనది (ఏనుగు కనుగ్రుడ్డు)

**ఇషుధి** - అమ్ములను ధరించునది (అమ్ములపొది - తూణీరము)

**ఇషువు** - లక్ష్యమును గూర్చి వెడలునది (బాణము)

**ఇష్ట గంధము** - మంచి వాసన కలది

**ఇష్టగోష్ఠి** - ఇష్టమైన సంభాషణము (ఇష్టాగోష్ఠి)

**ఇష్టిపచుడు** - దేవతార్థము గాక స్వార్థమునకై వండుకొనువాడు (రాక్షసుడు, లోభి)

**ఇష్యము** - ఇచ్ఛింపబడునది (వసంత ఋతువు)

**ఇష్వాసము** - బాణములను జిమ్మునది (విల్లు)

**ఇష్వాసుడు** - బాణములను వేయువాడు (విలుకాడు)

**ఇష్వుడు** - ఉపదేశము కొరకు ఆశ్రయింప దగినవాడు (ఆచార్యుడు, గురువు)

**ఇసుకపులకండము** - ఇసుకవలె నుండు శర్కర (కండ చక్కెర)

**ఇసుళ్ళు** - వర్షము వెలిసిన పిమ్మట దీపము చుట్టును చేరు రెక్కల పురుగులు (రెక్కచెదలు)

**ఇహాగతుడు** - ఈ లోకమునకు (భూలోకమునకు) వచ్చినవాడు

**ఇహాముత్రఫలము** - ఇహపరములందలి కర్మఫలము

**ఇహీ** - పరిహాస ధ్వనికి అనుకరణము

**ఈక్షణిక** - రాబోవు శుభాశుభములను జెప్పునది (సోదికత్తె - దైవజ్ఞ)

**ఈక్షణికుడు** - చేతియందలి రేఖలను జూచి శుభాశుభఫలములను జెప్పువాడు (సాముద్రికుడు)

**ఈగపులి** - ఈగలకు పులి వంటిది (సాలెపురుగు - చెలగము)

**ఈగికాడు** - దానముచేయు శీలము కలవాడు (దాత - ఈవికాడు, త్యాగి)

**ఈగిమ్రాను** - కోర్కెలు తీర్చెడి చెట్టు (కల్పవృక్షము - ఇచ్చుచెట్టు)

**ఈగులకెంపు** - కోర్కెలు తీర్చెడి రతనము (చింతామణి - పుడుకుగల్లు)

**ఈగుల మొదవు** - కోరికలను తీర్చెడి గోవు (కామధేనువు - పుడుకు దొడుకు)

**ఈదుతూపు** - చల్లగాలితో కూడిన అస్త్రము (వాయవ్యాస్త్రము)

**ఈదుమ్రాను** - ఈదుటకు సహాయమగు మ్రాను (ఈదుగొయ్య)

**ఈలకోడి** - ఈలవలె ధ్వని చేయు పురుగు (ఈల పురుగు - కీచురాయి, చిమ్మట)

**ఈవికాడు** - ఈగికాడు

**ఈవిమ్రాను** - ఈగిమ్రాను

**ఈవులకెంపు** - ఈగుల కెంపు

**ఈవుల మొదవు** - ఈగులమొదవు

**ఈవులరతనము** - కోర్కెలు తీర్చుమణి (చింతామణి)

**ఈశానము** -ఈశ్వరుని పంచముఖములలో నొకటి

**ఈశానుడు** - ఐశ్వర్యము కలవాడు (శివుడు)

**ఈశుడు** - ఐశ్వర్యయుక్తుడు (ప్రభువు, శివుడు)

**ఈశ్వరవిభూతి** - లోకమున స్థాన విశేషములందు గల ఈశ్వరాంశము

**ఈశ్వరి** - ఈశ్వరుని భార్య (పార్వతి)

**ఈశ్వరుడు** - స్వభావముచేతనే ఐశ్వర్య యుక్తుడైనవాడు (శివుడు)

**ఈష** - లాగబడి పోవునది (ఏడికోల - లాంగలదండము), నూట ఎనుబది ఎనిమిది అంగుళముల ప్రమాణము

**ఈషణము** - తొందర పెట్టునది (కోరిక)

**ఈషాదంతము** - నాగేటికోల వంటి దంతము కలది, (పెద్ద దంతములుగల ఏనుగు)

**ఈషిక** - చిత్తరువులు వ్రాయు కుంచె (చూ॥ ఇషీక)

**ఈసపిట్ట** - శరీరము పై ముండ్లు గలిగిన గుండ్రని చేప

**ఈసుకాడు** - అసూయ కలవాడు (ఈర్ష్యాళువు)

**ఈహమానుడు** - కోరుచున్నవాడు

**ఈహామృగము** - మృగములను కోరునది (తోడేలు), మృగమువలె నలభ్యయగు నాయికను గోరుట ఇతి వృత్తముగా గల నాల్గు అంకముల నరదివ్యనాయక ప్రతి నాయక రూపము ఈహామృగము (రుక్మిణి పరిణయము ఉదాహరణము)

**ఉంకుటుంగరము** - వధూవరులు పెండ్లి చేసికొనుటకు అంగీకరించి వరస్పరము మార్చుకొనెడి ఉంగరము

**ఉంకువు** - వరుడు కన్యార్థము మామకుగాని కన్యకు గాని ఇచ్చు ద్రవ్యము (కన్యాశుల్కము - ఓలి)

**ఉంఛవృత్తి** - పొలములో రాలెన ధాన్యపు గింజలనేరుకొని తినువృత్తి

**ఉండక్రోవి** - గుండ్రని చేపట్టుగల చేతి కఱ్ఱ (లాతము - ఊనుకోల)

**ఉండవిల్లు** - మట్టి ఉండలు వేయు విల్లు

**ఉండసురియ** - గుండ్రని చేపట్టుగల కత్తి

**ఉందురువు** - తనముట్టెతో వస్తువును ద్రవింపజేయునది (పందికొక్కు, ఎలుక)

**ఉఖ్యము** - (ఉఖము = కుండ) కుండ యందు వండబడినది (పిండివంట మొదలగునవి)

**ఉగ్గము** - చేతపట్టుకొని పోవుటకు వీలుగా పాత్రాదులకు కట్టెడు త్రాడు

**ఉగాది** - చైత్రమాసము నందలి మొదటి దినము (సంవత్సరాది)

**ఉగ్రంపశ్యము** - క్రూరముగా జూచునది (పెద్దపులి మొ॥)

**ఉగ్రగంధము** - గాటయిన పరిమళము గలది (సంపెంగ, ఇంగువ)

**ఉగ్రధన్వుడు** - భయంకరమైన విల్లుగల వాడు (శివుడు, ఇంద్రుడు)

**ఉగ్రాక్షుడు** - భయంకరమైన మూడవ కన్ను కలవాడు (శివుడు)

**ఉగ్రుడు** - భయమును కలుగజేయువాడు (శివుడు), క్షత్రియునకు నాల్గవజాతి స్త్రీయందు బుట్టినవాడు

**ఉచ్చండము** - మిక్కిలి కోపము గలది, మిక్కిలి వేడి కలది

**ఉచ్చంద్రము** - రాత్రి యొక్క చివరి భాగము (అపరరాత్రము)

**ఉచ్చలము** - చలించు స్వభావము కలది (మనస్సు)

**ఉచ్చాటము** - పిశాచాదులను వదలించుట

**ఉచ్చాసనుడు** - చట్టము నతిక్రమించువాడు (అవిధేయుడు)

**ఉచ్చింగటుడు** - కోప స్వభావము కలవాడు

**ఉచ్చూడము** - జెండా పై భాగమున కట్టిన కుచ్చు

**ఉచ్చైఃశ్రవము** - ఉన్నతమైన కీర్తి కలది, నిక్కిన చెవులు కలది, బిగ్గరగా మాటాడిన గాని వినలేనిది (చెవిటిది) (ఇంద్రుని గుఱ్ఱము - నిక్కువీనుల జక్కి)

**ఉచ్చిఖము** - పైకెగయు జ్వాలలు కలది

**ఉచ్ఛిష్టాన్నము** - ఇతరులు తినగా మిగిలిన యన్నము పంక్తి భోజనములో అందరు భుజింపక పూర్వమొకడు లేచినచో మిగిలినవారి యన్నము

**ఉచ్ఛృంఖలము** - స్వేచ్ఛ నొందినది

**ఉజ్జనకల్లు** - నునుపు చేయుటలో ఉపయోగించు రాయి

**ఉటజము** - గడ్డితో గాని యాకులతోగాని కట్టబడిన యిల్లు (పర్ణశాల - ఆకుటిల్లు)

**ఉట్టిపడు** - ఆకారాదులయందు పోలికలు స్పష్టముగా దోచు, ఆకస్మికముగా కలుగు

**ఉడుగోత పిందె** - చెట్టు కాపుడిగిన పిమ్మట పుట్టు పిందె

**ఉడుపకుక్క**- ఉడుము, కుందేలు మున్నగు వానిని వేటాడెడు కుక్క

**ఉడుపతి** - నక్షత్రములకు ప్రభువు (చంద్రుడు)

**ఉడుపథము** - నక్షత్ర మార్గము (ఆకాశము)

**ఉడుపము** - నీటినుండి కాపాడునది (తెప్ప)

**ఉడ్డకేలు గలాడు** - నాలుగు చేతులు గల వేల్పు (శ్రీవిష్ణువు)

**ఉడ్డకేల్దొరబిడ్డ** - వెన్నని కొడుకు (బ్రహ్మదేవుడు)

**ఉడ్డమోము వేలుపు** - నాలుగు ముఖములు గల దేవుడు (బ్రహ్మ - చతురాననుడు)

**ఉత్కంఠిత** - ప్రియుడు వేళకు రాక జాగుచేయుచున్నాడని వికలచిత్తయగు నాయిక

**ఉత్కరము** - యజ్ఞభూమి యందు ధూళి మొదలగునవి యుంచు చోట

**ఉత్కర్షకము** - గొప్పతనమును (అతిశయమును) కల్గించునది

**ఉత్కలికాప్రాయము** - కటువైన యక్షరముల తోడను సమాసములతోడను గూడిన గద్యభేదము

**ఉత్కలుడు** - కుల మర్యాదలను మీరినవాడు (కులభ్రష్టుడు)

**ఉత్కలితము** - చీలలు కొట్టి బిగింపబడినది

**ఉత్ఖాతకేళి** - ఏనుగులు, ఖడ్గమృగములు, అడవి పందులు మున్నగునవి, దంతములు కొమ్ములు కోరలతో భూమిని కోరాడుట (వప్రక్రీడ)

**ఉత్ఖాతదంష్ట్రోరగము** - పెరికి వేయబడిన కోరలు గల సర్పము (పైకి భయంకరముగా కన్పట్టుచు నిరపాయ కరముగ నుండునది)

**ఉత్తమము** - మూడు వర్ణములకు తక్కువ కాని పదములలో కడపటి వర్ణము

**ఉత్తమర్ణుడు** - ఉత్తమమైన ఋణము కలవాడు (అప్పిచ్చినవాడు - ఉత్తమర్ణి)

**ఉత్తమాంగము** - శరీరావయవములలో శ్రేష్ఠమైనది (శిరము)

**ఉత్తరకాండము** - రామాయణమునందలి ఏడవభాగము

**ఉత్తరకాయము** - దేహము యొక్క ఊర్ధ్వ భాగము

**ఉత్తర క్రియలు** - మరణించిన వాని నుద్దేశించి చేయు దహన సంస్కారాదికము

**ఉత్తరజందెము** - యజ్ఞోపవీతం వలె ధరించు ముత్యాల హారము, సువర్ణ సూత్రము (ఉత్తరజన్నిదము)

**ఉత్తరపక్షము** - రెండవదియగు కృష్ణపక్షము, హేతువు వల్లను వ్యాప్తివల్లను దృష్టాంతములచే సిద్ధించిన సంశయాంతము (సాధ్యమున్నదని నిశ్చయము) కల్గినది (సిద్ధాంతము)

**ఉత్తరపదము** - సమాసములోని చివరి పదము

**ఉత్తరము** - పూర్వపక్ష ఖండనము, తగు సమాధానము

**ఉత్తరాయణము** - సూర్యు డుత్తర దిక్కుగా ప్రయాణము చేసెడి ఆఱునెలల కాలము

**ఉత్తరారణి** - మథించి అగ్ని పుట్టించు కొయ్యలలో పైది (క్రింది కొయ్య - అధరారణి)

**ఉత్తరార్ధము** - రెండవ సగము. దేహము యొక్క పై భాగము

**ఉత్తరాసంగము** - మీది అవయవమందు పొందబడినది (పైబట్ట)

**ఉత్తరిగ (గె)** - నలువది పూసలు గ్రుచ్చిన హారము (చీరము)

**ఉత్తరీయము** - శరీరము పైభాగము నందుండునది (ఉత్తరాసంగము)

**ఉత్తానశయ** - వెలికిల పరుండునది (చంటిపాప)

**ఉత్తారకుడు** - దాటించువాడు

**ఉత్తుషము** - వేచుట వలన పొట్టుపోయినది (పేలాలు)

**ఉత్థానము** - యోగనిద్ర నుండి లేచుట

**ఉత్థానైకాదశి** - శ్రీమహావిష్ణువు నిద్రనుండి మేల్కొనెడు ఏకాదశి (కార్తికమాస శుక్లపక్షమందలి ఏకాదశి)

**ఉత్పచిష్ణువు** - పైనుండి పండెడు స్వభావము కలది (తృణాది)

**ఉత్పతిష్ణువు** - పైకెగయు స్వభావము కలది

**ఉత్పలము** - కలువల వంటి పువ్వులు గల మందు చెట్టు (చెంగల్వకోస్టు - అప్యము), కండలేనిది

**ఉత్పలశారిబ** - నల్లకలువల వంటి పువ్వులు గలది (సుగంధిపాల)

**ఉత్పలి** - కలువలు గలది (సరస్సు)

**ఉత్పవనము** - దర్భ పవిత్రమును నీటిలో ముంచి కదలించుటచే శుద్ధిచేయుట

**ఉత్పాదకము** - వెరపు కలిగించునది, సామాన్య మృగములకు వలె నాలుగు కాళ్ళను వీపు మీద నాలుగు కాళ్ళను కలిగిన శరభ మృగము (అష్టపాత్తు)

**ఉత్పాదశయము** - కాళ్ళు పైకి బెట్టుకొని నిద్రించునది (తీతువుపిట్ట - టిట్టిభము)

**ఉత్ప్రేక్ష** - విషయికున్న ధర్మములు విషయము నందుండుటచేత విషయి యొక్క తాదాత్మ్యమును విషయమునకు జెప్పుట (విషయి = ఉపమానము, విషయము = ఉపమేయము) (ఉపమేయము ఉపమానముగా నూహింపబడుట)

**ఉత్సంగుడు** - సంగము విడిచినవాడు (సన్న్యాసి)

**ఉత్సర్జనము** - సంపదలను విడుచుట (దానము)

**ఉత్సర్య** - పొర్లుటకు దగిన స్థితిలో ఉన్న ఆవు

**ఉత్సవము** - జనులను ప్రేరేపించునది

**ఉత్సవిగ్రహము** - మూలవిరాట్టు విగ్రహము గాక ఊరేగింపులో మాత్రమే ఉపయోగించు విగ్రహము

**ఉత్సాహవర్ధనము** - ఉత్సాహముచే వృద్ధిపొందునది (వీరము)

**ఉదంతము** - ఉత్పన్నమైన నిశ్చయము గల్గినది (వృత్తాంతము)

**ఉదకుంభము** - నీటికుండ (ఉదక కుంభము)

**ఉదకక్రియ** - పితృ దేవతాదులకు గావించు జలతర్పణము

**ఉదక బీజాక్షరములు** - జల బీజములు (ఋ, ౠ, ఔ, ఘ, ఝ, ఢ, ధ, భ, న, ళ - లు)

**ఉదకములాడు** - నీళ్ళాడు (ప్రసవించు)

**ఉదకము** - ద్రవమై యుండునది (నీరు)

**ఉదక్య** - నాల్గవ దినమున ఉదక శుద్ధికి అర్హురాలైనది (ముట్టుది)

**ఉదక్యము** - జలమును కోరునది (పొలము)

**ఉదగద్రి** - ఉత్తర దిక్కు నందలి పర్వతము (హిమాలయము)

**ఉదజని** - అగ్ని పర్వతముల నుండి, భూరంధ్రముల నుండి వెలువడు వాయువు (సూర్య గోళమందును నక్షత్రములందును ఎక్కువగా కలది)

**ఉదజము** - ఉదకమున బుట్టునది (పద్మము)

**ఉదధి** - ఉదకమును ధరించునది (సముద్రము)

**ఉదధి మేఖల** - సముద్రము మొలనూలుగా గలది (భూమి)

**ఉదయనీయ** - యజ్ఞాంతమందు చేసెడి ఇష్టి

**ఉదయాచలము** - తూరుపు కొండ (పొడుపు కొండ)

**ఉదరంభరి** - తన పొట్టను నింపుకొన జూచువాడు

**ఉదర త్రాణము** - కడుపు రొమ్ము మొదలగు చోట ధరించెడు ఇనుప కవచము

**ఉదర శయము** - గర్భమందు బోరగిలి పరుండునది (శిశువు)

**ఉదర శయుడు** - పొట్టతో బండుకొనువాడు

**ఉదరికుడు** - పెద్ద కడుపు గలవాడు (ఉదరిలుడు)

**ఉదరిపడు** - అకస్మాత్తుగా జరిగిన దానికి త్రుళ్ళిపడు (అదరిపడు)

**ఉదర్చి** - పైకెగయు జ్వాలలు కలది (అగ్ని)

**ఉదలావణికము** - ఉప్పులో ఊరవేసినది

**ఉదవాపుడు** - పితృదేవతలకు నుదక తర్పణము చేయుజ్ఞాతి

**ఉదవాహము** - నీటిని మోయునది (మేఘము)

**ఉదాత్తము** - ముఖము నందలి తాల్వాదిస్థానముల పైభాగమున నిష్పన్నమగు అచ్చు, (వ్యాకరణము) సమృద్ధిని వర్ణించినను, వర్ణ్యమునకు శౌర్యాది సంపత్సమృద్ధిని అనవాలుగా జెప్పినను ఉదాత్తాలంకారము

**ఉదాత్తుడు** - ఉదార స్వభావము కలవాడు, ఉదాత్తత్వము కల్గిన ధీరోదాత్తుడను నాయకుడు

**ఉదానము** - శబ్దాదుల నూర్ధ్వ ముఖమునకు దెచ్చు కంఠగత వాయువు (ఉదాన వాయువు)

**ఉదాహరణము** ప్రకృతార్థమును ప్రతిపాదించుటకు ఎత్తి చూపబడునది (ఉదాహరము), తర్కమందలి ప్రతిజ్ఞ (పక్షము) హేతువు (అనుమాపకము) ఉదాహరణము, ఉపనయము నిగమనము అను అయిదంగములలో మూడవది (ఉదా - వంట యిల్లువలె ఏది ధూమవంతమో అది యగ్నిమంతము)

**ఉదిరమల** - బంగరు కొండ (మేరు పర్వతము)

**ఉదూఖలము** - మీద బయలై ఉండునది (ఉలూఖలము - రోలు)

**ఉద్గాత** - యజ్ఞమునందు సామవేద తంత్రము నడపువాడు

**ఉద్గిరణ సామర్థ్యము** - వస్తువు ఉపరి భాగము యొక్క ప్రతి చదరపు సెంటీ మీటరు నుండి ప్రతి సెకనులో వెడలు ఉష్ణ ప్రసరణ శక్తి

**ఉద్ఘాటము** - సుంకము వసూలు చేయు చోటు

**ఉద్దంతురుడు** - మిట్టపండ్ల వాడు

**ఉద్దంశము** - తరచుగా కుట్టునది (జోరీగ, నల్లి)

**ఉద్దీప్రము** - ఎక్కువ కాంతితో మండునది (గుగ్గిలము)

**ఉద్ధమము** - పిల్లనగ్రోవి ఊదుట

**ఉద్ధరణము** - ఆపదల నుండి కాపాడుట

**ఉద్ధర్త** - దీనులను ఉద్ధరించువాడు, నాశనము చేయువాడు

**ఉద్ధర్షము** - ఎక్కువ సంతోషము కలిగించునది (ఉత్సవము)

**ఉద్ధాత్యము** - గూఢార్థ పదపర్యాయమాల మరియు ప్రశ్నోత్తరమాల

**ఉద్ధానము** - అగ్నిని ధరించునది (ప్రొయ్యి)

**ఉద్ధారము** - తీసికొనబడునది (అప్పు)

**ఉద్ధ్మానము** - (ఉద్ధానము)

**ఉద్బిలము** - కన్నము నుండి పైకి వచ్చినది (ఎలుక)

**ఉద్భిజ్జము** - భూమిని ప్రక్కలించి పుట్టునది (తరుగుల్మాది)

**ఉద్భిత్తు, ఉద్భిదము** - భూమిని భేదించుకొని వచ్చునది (మొలక)

**ఉద్ధృతము** - పైకెత్తబడినది (ఉద్ఘూర్ణము)

**ఉద్యాపనము** - వ్రతాదులను పూర్తిచేయుట

**ఉద్యోగ రాఘవుడు** - రాక్షస వధోద్యోగమున నిమగ్నుడగు శ్రీరామునకు జంతుజాలము సైతము తోడ్పడుట నూచితము (సత్కార్యములకు అందరు సాయపడుదురనుట)

**ఉద్వయస్కుడు** - వయస్సుమించిన వాడు (వృద్ధుడు)

**ఉద్వహుడు** - వంశమును వృద్ధినొందించు వాడు (పుత్రుడు)

**ఉద్వాసము** - మొక్కలను సమూలముగ పెకలించుట

**ఉద్వాసనము** - విగ్రహాదులయందు నావాహనము చేసిన దేవతను బూజావసానమున స్వస్థానమునకు బంపుట, ఇంటి నుండి వెడలగొట్టుట

**ఉద్వేలము** - తీరమును దాటినది

**ఉనుపు** - బట్టలను రంగులో ముంచు

**ఉన్నతానతము** - ఎత్తుపల్లములుగా నుండుచోటు

**ఉన్మజ్జకుడు** - నీటిపై తేలువాడు

**ఉన్మత్తగంగము** - ఉన్మాదము పొంది నది వలె ప్రవహించెడు గంగ గల ఒక దేశము

**ఉన్మత్తుడు** - పిచ్చి యెక్కినవాడు

**ఉన్మదిష్ణువు** - ఉన్మాదము స్వభావముగా గలవాడు

**ఉన్మనుడు** - వికలమైన మనస్సు కలవాడు, ఇతర విషయములందు చిత్తము కలవాడు

**ఉన్మాదము** - విరహాదులచే గలుగు చిత్త భ్రాంతి, జంతువులను బీడించునది

**ఉన్మాదకము** - (తినినచో) పిచ్చి యెత్తించునది (ఉమ్మెత్త)

**ఉన్మీలితము** - వికసించినది, రెండు వస్తువులకు సామ్యము వలన లేకున్నను కారణాంతరములచే భేదమున్నట్లు వర్ణించెడు అలంకారము ఉదా - ఓ రాజా! నీ కీర్తియందు మునిగిన హిమాద్రిని దేవతలు శైత్యముచేత గుర్తింతురు

**ఉన్మూలము** - పైకి పొడుచుకొని వచ్చిన వేరు కలది

**ఉపకంఠము** - కంఠ సమీపమును బొందునది (దగ్గర)

**ఉపకథ** - ఒక కథలో నప్రధానముగా వచ్చు మరియొక కథ

**ఉపకనిష్ఠిక** - చిటికెన వ్రేలు ప్రక్కనున్నది (అనామిక - ఉంగరపువ్రేలు)

**ఉపకారిక** - ప్రయాణమునందు ఉపయోగపడునది (డేరా), పాలు, బెల్లము, బియ్యపు పిండి కలిపి ఉడికించి నెయ్యివేసిన తినుబండారము (ఉక్కెర - ఉత్కరిక)

**ఉపకార్య** - ప్రయాణ సమయమందు బడలిక తీర్చుకొను నిమిత్తము వటాదులచే జేయబడునది (గుడారము)

**ఉపకావ్యము** - సర్గలులేక పద్యములు కల కావ్యము

**ఉపకుంచిక** - ముడుతలు వడి కొంచెమై యుండునది (చిన్నయేలకులు)

**ఉపకుర్వాణుడు** - మేలు చేయువాడు, ఆచార్యుని సేవించి విద్యనభ్యసించిన పిమ్మట వారి అనుజ్ఞను పొంది గృహస్థాశ్రమమును స్వీకరింప బోవు వేద విద్యార్థి

**ఉపకూప జలాశయము** - నూతియొద్ద పశువుల నీటికై కట్టిన తొట్టె

**ఉపక్రమణిక** - గ్రంథాదిని రచింపబడు తదుత్పత్తి విషయిక కవికృత ప్రస్తావము, (కావ్యారంభ కారణాదిక ప్రస్తావన)

**ఉపక్రమము** - ప్రకరణ ప్రతిపాద్య విషయ ప్రారంభ వర్ణనము (లింగషట్కములో మొదటిది), ప్రారంభము

**ఉపక్రోష్ట** - ఓండ్ర పెట్టునది (గాడిద)

**ఉపగాత** - యజ్ఞమున ఉద్గాత యొద్ద గానము చేయు ఋత్విజుడు, ప్రధాన గాయకునికి తోడుగా పాడువాడు

**ఉపగురువు** - గురువువలె సందేహాదులను తీర్చువాడు

**ఉపచయము** - ప్రోటీనులు, కార్బో హైడ్రేటులు, క్రొవ్వు పదార్థముల వర్ణద్రవ్యములు, జీవకణ ఘటకములగు ఇతర ద్రవ్యముల సంయోజనము (సంకీర్ణ రాసాయనిక అణువులను సరళతరఘటముల క్రింద విశ్లేషించు విఘటనాత్మక ప్రక్రియ అపచయము) (వృక్షశాస్త్రము)

**ఉపచయాపచయ క్రియలు** - ప్రాణుల యందు నిరంతరము జరుగు చుండెడు రాసాయనికపు మార్పులు

**ఉపచాయ్యము** - యజ్ఞమునం దగ్ని నుంచెడి చోటు

**ఉపచారము** - ఒకదానియందుండు ధర్మమును వేరొకదానియందు ఆరోపించుట

**ఉపచార పంచకము** - గంధము, పుష్పము, ధూపదీప నైవేద్యాదికములతో పూజించుట

**ఉపజీవకుడు** - ఒకరి ననుసరించి జీవించు వాడు

**ఉపజ్ఞ** - మొదట తెలిసికొనబడునది (ఆద్యజ్ఞానము)

**ఉపదశము** - పదికి దగ్గరగా ఉన్నది (తొమ్మిది, పదకొండు)

**ఉపదశులు** - పదికి సమీపమున ఉన్నవారు (నవబ్రహ్మలు, ఏకాదశ రుద్రులు)

**ఉపదేశకుడు** - ఉపదేశము చేయువాడు (ఉపదేశి)

**ఉపద్రష్ట** - యజ్ఞాది కర్మములయందు దోషములను కనిపెట్టి సరిచేయగల సమర్థుడు (అధర్వణి)

**ఉపధ** - పదమున చివరి అక్షరమునకు ముందున్న

అక్షరము, మంత్రి మొదలగు వారి గుణములను పరీక్షించుట

**ఉపధానము** - దీనియందు కరముంప బడును (తలగడ)

**ఉపధాయి** - కరములను తలగడగా ఉపయోగించువాడు

**ఉపధ్మానము** - ఉకారము 'వ'వర్గ దీనిచే పలుకబడును (పెదవి)

**ఉపధ్మానీయము** - పెదవియందు బుట్టినది, ('ప' వర్గము) పఫలకు పూర్వముంప బడిన విసర్గము

**ఉపనక్షత్రము** - అప్రధానమగు నక్షత్రము (ఇరువదియేడు నక్షత్రములలో ఒక్కొక్క నక్షత్రమునకు ఇరువది యేడేసి చిన్న నక్షత్రములు రాశి చక్రమున ఉండును)

**ఉపనగరము** - నగరము నందలి శాఖ (పేట శాఖానగరము)

**ఉపనయనము** - వేద పరనార్హతను పొందింప జేయు సంస్కారవిశేషము (వడుగు) ఇందు బాలుడు వేద పరనార్థము గురువు కడకు తీసికొని పోబడును

**ఉపనయము** - పక్షమునకు హేతువునకు గల సంబంధము (తర్కమున నాల్గవ అవయవ వాక్యము - పర్వతము వహ్నిమంతము (పక్షము) ప్రతిజ్ఞ ఈ పర్వతమును నిప్పును వీడని పొగకలదే ఇది ఉపనయము చూ॥ ఉపనయనము

**ఉపనాయకుడు** - (నాటకాదులయందు) కొంచెము తక్కువగా నెల్ల గుణంబుల ప్రధాన నాయకుని బోలినవాడైన నాయక సహాయకుడు

**ఉపనాయిక** - నాటకాదులయందు ప్రధాన నాయిక కంటె తక్కువది యగు నాయిక

**ఉపనాహము** - (వీణ) తీగలు దీనియందు కట్టబడును (తీగలు కట్టెడు (వీణ) బిరడ)

**ఉపనిధాయకుడు** - రూపమున సంఖ్యను చూపక చెప్పక తన సంపదనొకని యొద్దదాచువాడు (ఉపనిధాత)

**ఉపనిషత్తు** - గురుని యొద్ద శిష్యునిచే బొందబడిన రహస్యము (ఆత్మవిద్య) ఆత్మ విద్యాబోధకములగు బృహదారణ్యక చ్ఛాందోగ్యాది దశోపని షత్తులు (ఉపనిషత్తులు శతాధికము)

**ఉపనీతుడు** - ఉపనయన సంస్కారము పొందినవాడు, వేదాధ్యయనార్థము గురుని సమీపమునకు దేబడిన విద్యార్థి (బ్రహ్మచారి)

**ఉపనేత** - ఉపనయన సంస్కారమును చేయు నాచార్యుడు, దగ్గరకు తెచ్చువాడు

**ఉపన్యాసము** - ఏదేని యొక విషయమును గురించి విపులీకరించి చెప్పుట, తన కార్యమును నెరవేర్చుకొనుటకైన ఒడంబడిక, సమీపమున బెట్టుట

**ఉపపతి** - మారుమగడు (విటుడు)

**ఉపపత్తి** - ప్రతిపాద్య విషయమును స్పష్టము చేయుటకై అనేక రూపములగు ఉదాహరణాదికములగు యుక్తులను తెల్పుట

**ఉపపదము** - ఒక పదమునకు అవ్యవహిత పూర్వము గానున్న పదము, ఒకనామమునకు వెనువెంట ఉచ్చరింపబడు బిరుదాది సూచకపదము (శర్మ, వర్మ మొదలగునవి)

**ఉపపాదనము** - యుక్తిచే సమర్థించుట, విషయమును వివరించి చెప్పుట

**ఉపపుష్పిక** - దీనిచే నోరు పువ్వువలె వికసించును (జృంభము - ఆవులింత)

**ఉపబర్హము** - దీనియందు తల ఎత్తబడును (ఉపబర్హణము - తలదిండు)

**ఉపభృత్తు** - యజ్ఞాదులయందుండు ఆజ్యపాత్రము

**ఉపమాత** - తల్లితో సమానమైనది (పినతల్లి, దాది)

**ఉపమాద్రవ్యము** - పోలికగా గ్రహింపదగిన వస్తువు

**ఉపమానము** - పోల్పదగిన వస్తువు, ఉపమితికి వ్యాపారముతో గూడిన అసాధారణ కారణము (తర్కశాస్త్ర గతమైన ఒక ప్రమాణము)

**ఉపమాన ప్రమాణము** - సాదృశ్యజ్ఞాన ప్రమాణము

**ఉపమితి** -సాదృశ్యము, పద పదార్థములకు గల సంబంధము

**ఉపమేయము** - వర్ణింపబడినది, పోల్ప దగినది (ముఖాది)

**ఉపయాచకుడు** - సమీపమునకు వచ్చి యాచించువాడు

**ఉపయాయి** - సమీపమునకు వచ్చువాడు

**ఉపరక్తము** - దాసన పువ్వు యొక్క సమీపమున నుండుటచే దాని మెరుపు గుణము గలదిగా తోచెడు స్ఫటికపురాయి వలె ఉపాధి సాన్నిధ్యముచే దాని గుణము గలదిగా నూహింపబడునది (జీవాత్మ)

**ఉపరక్షకుడు** - పరుల వలన అపాయము రాకుండ ప్రభువును కనిపెట్టుకొని యుండు వాడు (అంగరక్షకుడు)

**ఉపరతకర్ముడు** - లోకవ్యవహారముల యెడ విరక్తి చెందినవాడు

**ఉపరసము** - కావ్యాదులలోని ప్రధాన రసమునకు అంగమైన రసము, మందులలో చేర్పబడు ననుపానరసము

**ఉపరూపకములు** - పదునెనిమిది ఉపరూపకములు (నాటిక, గోష్ఠిమున్నగు దృశ్య ప్రబంధ భేదములు)

**ఉపలక్షకము** - వాచ్యార్థముతో పాటు అన్యార్థమును లక్షణచె దెలుపునట్టి శబ్దము

**ఉపలక్షణము** - వాచ్యార్థమునే గాక యన్యార్థమున సయితము లక్షణచే దెల్పుట

**ఉపలధిప్రియము** - ప్రియమైన వాలము గలది (చమరీమృగము)

**ఉపల** - సన్నకంటెపై నుంచి బియ్యము మున్నగువానిని పిండిచేయు రాయి (పాత్రము)

**ఉపవీతము** - ఎడమ భుజము మీద నుండి కుడిచేతి క్రిందుగా వ్రేలాడునట్లు ధరింపబడు జన్నిదము

**ఉపవేదము** - వేద సదృశమైనది (ఋగ్వేదమున కాయుర్వేదము ఉపవేదము కర్తలు బ్రహ్మ ధన్వంతరి, అశ్వినీ దేవతలు మొ॥యజుర్వేదమునకు ధనుర్వేదము విశ్వామిత్రుడు కర్త భరతముని కర్తగా గల గాంధర్వవేదము - సామవేదమునకు ఉపవేదము అధర్వణ వేదమునకు అర్థవేదము (శిల్ప, నీతి శాస్త్రాదులు) ఉపవేదముకాగా కర్త లనేకులు

**ఉపవ్యాఘ్రము** - క్రూరత్వమున పెద్దపులితొ సమానమైనది (సివంగి)

**ఉపశయము** - మృగాదులను బట్టుటకై దాగుట కనుకూలముగా త్రవ్వబడిన గొయ్యి

**ఉపశల్యము** - హద్దురాళ్ళను (మేకును) తాకునది, (ఊరిపొలిమేర)

**ఉపశాఖ** - శాఖనుండి పుట్టిన శాఖ

**ఉపశాయము** - కావలి బటులు వంతులు ప్రకారము పరుండుట

**ఉపశిష్యుడు** - శిష్యులకు శిష్యుడు (ప్రశిష్యుడు)

**ఉపశ్రుతి** - శుభాశుభ సూచకమగు ప్రాసంగిక వాక్యము

**ఉపశ్లేషణము** - ఆధారాధేయములకు గల ఏకదేశ సంబంధము

**ఉపసంక్రమణము** - ఉన్న ఆధారమును వదలి సమీపమున నుండు మరియొక యాధారమును పట్టుకొనుట

**ఉపసంఖ్యానము** - సూత్ర విషయము కంటె అధికముగా చెప్పుట

**ఉప సంగ్రహణము** - నమస్కారము కొరకు పాదములు పట్టుకొనుట, లెస్సగా సేకరించుట

**ఉపసంహారము** -విడిచి పెట్టిన బాణమును (అస్త్రమును) మరల నాకర్షించుట, ప్రకరణ అంతిమ వర్ణనము (ముగింపు - ఉపక్రమోపసంహారములు ఏకార్థక బోధకములయినపుడు ఇవి రెండును ఉపక్రమోపసంహారరూపలింగమగును)

**ఉపసదనము** - గురుని ఆశ్రయించుట

**ఉపసర్గము** - క్రియా సంబంధమేర్పడినపుడు ఉపసర్గ సంజ్ఞము(లగునవి) (ప్ర, పరా, ఉప మొదలగునవి)

**ఉపస్కరము** - శాకమును రుచికరముగా జేయు సామగ్రి (ఇంగువ, జీలకఱ్ఱ మొ॥)

**ఉపస్తరణము** - అన్నాదులు పెట్టుటకు అడుగున పరచిన యాకు

**ఉపస్థపత్రము** - యోని వంటి ఆకారము కలది (రావిచెట్టు ఆకు)

**ఉపస్పర్శము** - శరీరాంగములు స్పృశింపబడుచు ఆచరింపబడునది (ఆచమనము)

**ఉపస్మృతి** - ఋషులచే రచింపబడిన ధర్మశాస్త్ర విశేషము

**ఉపస్వేదము** - అగ్ని మొదలగు వాని సమీపమున నుండుట వలన గల్గిన యూష్మము (చెమట)

**ఉపహసితము** - పరిహసింపబడినది

**ఉపహారము** - దేవతలకును, రాజులకును, కానుకగా నిచ్చెడు ద్రవ్యము

**ఉపహ్వానము** - సమంత్రకముగా దేవతాదుల నాహ్వానించుట

**ఉపాంశుక్రీడితుడు** - రహస్య క్రీడలయందు రాజు వెంటనుండు సఖుడు (విదూషకుడు) –

**ఉపాంశువు** - ప్రక్కన ఉన్నవారికి కూడ వినిపింపకుండ మంత్రముల నుచ్చరించుట, వినబడకుండ చేయు జపము

**ఉపాకరణము** - దర్భలచే మంత్ర పూర్వకముగ సంస్కరించుట, అధ్వర్యుడు స్తోత్ర పారమును గానము చేయుటకు అనుజ్ఞనిచ్చుట

**ఉపాకర్మము** - సంస్కార పూర్వకముగ జేయు నధ్యయనారంభము (ఉపాకరణము)

**ఉపాకృతము** - సమంత్రకముగ జేయబడిన సంస్కార విశేషము (యజ్ఞపశు సంస్కారము)

**ఉపాఖ్యానము** - ప్రధానకథలో నడుమ వచ్చెడి కథ

**ఉపాత్యయము** - శాస్త్రనియమములను ఆచారములను అతిక్రమించుట

**ఉపాదానకారణము** - ముఖ్యకారణము (కుండతయారైనచో మట్టి ఉపాదాన కారణము, కుమ్మరి నిమిత్త కారణము)

**ఉపాదానము** - విషయముల నుండి ఇంద్రియములను మరల్చుట, పుచ్చుకొనుట

**ఉపాదేయము** - ఉపాదానకారణము నుండి (మట్టి నుండి) సంభవించిన కార్యము (కుండ)

**ఉపాధి** - కుటుంబ పోషణము నందు ఆసక్తి గలవాడు

**ఉపాధ్యాయ** - చదువు చెప్పు స్త్రీ - (ఉపాధ్యాయురాలు)

**ఉపాధ్యాయాని** - ఉపాధ్యాయుని భార్య (ఒజ్జసాని)

**ఉపాధ్యాయి** - ఉపాధ్యాయుని భార్య (ఉపాధ్యాయాని) చదువు చెప్పు స్త్రీ (ఉపాధ్యాయ ఒజ్జసాని)

**ఉపాధ్యాయుడు** - వేదములు చదివించు గురువు, చదువు చెప్పువాడు

**ఉపానహము** - పాదములకు కట్టుకొన బడునది (పాదుక, చెప్పులు)

**ఉపాయము** - రాజు తన వాంఛితములను బొందు సాధన విశేషము (సామ, దాన, భేద, దండోపాయములు)

**ఉపాయనము** - దీనిచేత (గురువు, రాజు) సమీపమును బొందుదురు, సమీపమునకు తెచ్చి యొసగబడును (కానుక)

**ఉపాయాతము** - సమీపించినది (రాక)

**ఉపారము** - కానుకగా నిచ్చునది (కప్పము, సూడిద)

**ఉపాలంభము** - నిందతో గూడిన దుర్వాక్యము లాడుట

**ఉపావృత్తము** - శ్రమము పోవుటకై భూమియందు పలుమరు బొర్లాడునది (గుఱ్ఱము)

**ఉపాసంగము** - బాణములు దీనియందు కూర్పబడియుండును (అమ్ములపొది - నిషంగము)

**ఉపాసనము** - దేవతాదులను సేవించుట (సమీపమునందుండుట) ఇందు బాణములు వేయుట అభ్యసింపబడును

**ఉపాహితము** - మరియొక పదార్ధముతో కూర్పబడినది (సంయోజి) సమీపమందు ఉంపబడినది అనిష్టము దీనికానన్నవై యుండును (అగ్న్యుత్పాతము)

**ఉపేంద్రుడు** - ఇంద్రుని రక్షించుట కతని సమీపమున నుండువాడు, ఇంద్రునకు తమ్ముడు, ఇంద్రలోకమునకు బైలోకమున నుండువాడు (విష్ణువు)

**ఉపేక్ష** - రాజు శత్రువులను లొంగదీసికొను సాధన విశేషము (ఇవి సప్త విధోపాయములని కొందరి మతము) ఒకానొక భావన

**ఉపోత్తమము** - రెండింటి కన్న అధికముగా గల వర్ణములలో కడపటి వర్ణముకన్న ముందున్నది

**ఉపోద్ఘాతము** - ప్రకృతార్థమును తెలియ జేయుటకు నర్థాంతరమును జెప్పుట, మిక్కిలి సమీపమునం దెరుగజేయ బడినది

**ఉప్పరమెగయు** - ఉపరితలమున కెగయు (మిన్నుముట్టు)

**ఉప్పలవాయి** - బొటనవ్రేలికి చూపుడు వ్రేలికి నడుమ నుండు చోటు (జుట్టన బొట్టన వ్రేళ్ళ నడుము)

**ఉప్పుగండ** - ఉప్పురాచి యెండ బెట్టిన మాంసపు తునుక

**ఉప్పుగొటూరు** - ఉప్పు నిలువ చేసెడు (కొట్టము) చోటు

**ఉప్పుడు బియ్యము** - ఉడికించి ఆరబెట్టిన పిదప దంచి చేసిన బియ్యము

**ఉప్పువాము** - ఉప్పు పండించెడు చోటు (ఉప్పలము)

**ఉబ్బుగడుము** - మినుప పిండి నానబెట్టిన బియ్యపు పిండి కలిపి యావిరిపై ఉడికింపగా ఉబ్బినది (ఇడ్డెన)

**ఉభయ చరము** - రెండింటి యందు తిరుగునది (ఆకాశము, భూమి = పక్షి, భూమి, జలము = తాబేలు)

**ఉభయతోముఖము** - రెండు వైపుల ముఖద్వారములు కలది (ఇల్లు)

**ఉభయతో ముఖ** - ఒకప్రక్క దూడ యొుక్క ముఖమును మరియొక ప్రక్క తన ముఖమును గలది (ఈనుచున్నయావు)

**ఉభయయతి** - యుష్మదస్మచ్ఛబ్దముల కచ్చు పరంబయి సంధి ఏర్పడి యతి చెల్లుట (సంధి జరిగి అచ్చునకు దకారమునకు యతిచెల్లుట)

**ఉభయవేతనుడు** - రెండు పక్షముల నుండియు జీతము పుచ్చుకొనువాడు, శత్రురాజుల కొల్వులోని వాడుగ నమ్మించుచారుడు

**ఉభయ వ్యంజనము** - స్త్రీ, పురుష లక్షణములు గల వ్యక్తి (పోట కొజ్జా)

**ఉమ** - ఓ బిడ్డా! వలదని తల్లిచే తపస్సు నుండి నిషేధింపబడినది, రక్షించునట్టిది, శివునకు లక్ష్మి వంటిది (పార్వతి) ఎండి గలగలలాడునవి (నల్లయగిసె)

**ఉమాపతి** - పార్వతికి మగడు (ఉమా వల్లభుడు) శివుడు

**ఉమాసుతుడు** - పార్వతియొుక్క పుత్త్రుడు (వినాయకుడు, కుమారస్వామి)

**ఉమ్జాయజగ్గాయలు** - కొంటె పనులుచేసి పారిపోవు పిల్లలు (గడుగ్గాయలు, కొంటె పిల్లలు)

**ఉమ్మాయ ముత్తెము** - తయారుచేయబడిన ముత్యము, (కృత్రిమ ముత్యము)

**ఉమ్మారావులు** - రాజకీయోద్యోగులు,

**ఉరగము** - ఉరస్సుచే ప్రాకునది (పాము)

**ఉరగరాజు** - పాములకు ప్రభువు (వాసుకి, శేషుడు)

**ఉరగారి** - పాములకు శత్రువు (నెమలి, గరుడుడు, ముంగిస, నాగారి)

**ఉరగాస్యము** - సర్పముఖము వంటి ముఖము కలది (తొల్లిక మొ॥ సాధనములు)

**ఉరణాక్షకము, ఉరణాక్షము** - మేక కన్నుల వంటి పువ్వులు గలది (తగిరస - తంటెపు చెట్టు)

**ఉరణాఖ్యము** - మేక కన్నుల వంటి పువ్వులు పూయునది (ఉరణము - తగిరస)

**ఉరభ్రము** - మిక్కిలిగా తిరుగునది

**ఉరశ్ఛదము** - రొమ్మును కప్పునది(కవచము)

**ఉరసిజము** - రొమ్మున బుట్టునది (ఉరోజము స్తనము)

**ఉరసిలుడు** - విశాలమైన వక్షఃస్థలము కలవాడు శౌర్యము కలవాడు (పరాక్రమవంతుడు)

**ఉరస్త్రాణము** - వక్షఃస్థలమును కాపాడునది (కవచము)

**ఉరస్యుడు** - భార్యయందు (ధర్మపత్ని యందు) దనకు బుట్టినవాడు (ఔరసుడు)

**ఉరసూత్రిక** - రొమ్ము వరకు వ్రేలాడు ముత్యాలదండ

**ఉరుక్రముడు** - పెద్దయడుగు లిడినవాడు (వామనరూప విష్ణువు)

**ఉరుద్రాడు** - పాలు పితుకునపుడు ఆవు వెనుక కాళ్ళకు కట్టెడు త్రాడు, (బందము)

**ఉరుబుకము, ఉరుబూకము, ఉరువుకము** వాతమును పోగొట్టు గుణము గలది (ఆముదపుచెట్టు - ఉరవూకము)

**ఉరోజము** - వక్షఃస్థలమున బుట్టినది (స్తనము)

**ఉరోభవము** - రొమ్మున బుట్టినది (కుచము)

**ఉర్లనాభము** - నాభియందు అరటినార వంటి దారములు గలది (సాలెపురుగు)

**ఉర్లుపెంజెర** - పొర్లాడు పాము (ఒకజాతిపాము) ఒకచోట పడియుండెడి కొండచిలువ (గోనసము)

**ఉర్వర** - సస్యములు పండునది (నేల)

**ఉర్వరారచన** - మట్టియందు గల పలు రకముల కణములు నీరు, సూక్ష్మజీవులు కలిసి ఒకరచనను కలుగజేయుట (పైన జెప్పిన మట్టి కణములను నీరు బంధించి పెల్లలుగా జేయును మట్టి గడ్డలు కట్టగా భూమి గుల్లబారి సస్యాభివృద్ధి కనుకూలించును)

**ఉర్వశి** - జితేంద్రియులను సయితము వశపరుచుకొనునది, నారాయణుని ఊరువుల నుండి పుట్టినది (ఊర్వశి - దేవవేశ్య)

**ఉర్వి** - విశాలమైనది, పర్వతములచే నెత్తబడినది (భూమి)

**ఉర్వీధరము** - భూమిని ధరించునది (పర్వతము)

**ఉర్వీభృత్తు**-భూమిని ధరించునది(పర్వతము) (రాజు)

**ఉర్వీరుహము** - భూమియందు మొలచునది (చెట్టు - భూజము)

**ఉర్వీశుడు** - భూమీశుడు (రాజు)

**ఉలూకము** - నేత్ర తేజములచే గాకులను దహించునది (గ్రుడ్లగూబ)

**ఉలూకారి** - గ్రుడ్లగూబ శత్రువుగా గలది (కాకి)

**ఉలూఖలము** - పై భాగమున బయలై యుండునది

**ఉలూఖల శేషము** - మొగమోటము గల యల్లుడు అత్తపెట్టిన చలిమిడి తినక చాటుగ రోటిలో మిగిలినది నాకి సరిపెట్టుకొనుట (తెడ్డునాకి ఉపవాసము మానుకొనుట వంటిది)

**ఉల్క** - మంటలేని నిప్పు (కార్చిచ్చు), వాతావరణమున కవ్వలి ప్రదేశము నుండి భూమిని చేరు తోక చుక్కల శిధిల ఖండములు (విజ్ఞాన శాస్త్రము)

**ఉల్కకము** - ఉల్కలరచనను చూపు పాషాణములు (భూమిని జేరిన శిలాఖండములు)

**ఉల్కాపాతము** - ఆకాశమునుండి రేఖాకారమగు కాంతి పుంజము పడుట (ఉల్కకములందు ఇనుము, ఆక్సిజన్, నికెలు, సిలికాను, మెగ్నీషియం, హీలియం మున్నగు మూల ద్రవ్యములు గల పాషాణములు భూమిని తాకుట )

**ఉల్కాముఖి** - కొరకచ్చువలె నుండెడి ముఖము గలది (ఆడునక్క)

**ఉల్ముకము** - అగ్నితో గూడియుండునది (కొరవి ఉల్మ్యాకము)

**ఉల్లాపము** - శోక భయాదుల వలన గల్గిన వికృతపు మాట

**ఉల్లాసము** - ఒకరి గుణ దోషముల చేత మరియొకనికి గుణ దోషములు ప్రాప్తించినట్లు జెప్పబడు అలంకార విశేషము, (నాల్గు రకములు, ఒకరి గుణము చేత మరియొకనికి గుణమును, దోషముచేత దోషమును, గుణముచేత దోషమును, దోషముచేత గుణమును ప్రాప్తించినట్లు చెప్పుట)

**ఉల్లిపాషాణము** - రుచి వాసనలేని నోటికి తెలియబడని విషము (వెంటా

ఆర్సేనియంసాహ్లము ధాతువులతో కలిసి సరళములు క్లిష్టములు నగు లవణముల నిచ్చుట)

**ఉల్లిపొర** - ఉల్లి గడ్డయొక్క పలుచని పొర

**ఉల్లుంఠనము** - లోపల క్రోధము గలిగి పైకి స్తుతించుట

**ఉల్లేఖము** - ఒక వస్తువునే యనేకులనేక విధములుగ జెప్పుటయను నొక అర్థాలంకారము (ఉదా - అత డింతుల కతనుడు, అర్థులకు కల్పకము కాలు దరులకు గా కన్పట్టె)

**ఉల్లోచము** - పై భాగము స్పష్టముగా కనబడునది (మేలుకట్టు - ఉల్లాభము)

**ఉశనసుడు, ఉశనుడు** - అసురుల మేలు గోరువాడు (శుక్రాచార్యుడు)

**ఉషపుడు** - ప్రాత కాలమును బాలించువాడు (సూర్యుడు)

**ఉషర్బుధువు** - ప్రాతః కాలమున బ్రజ్వలించునది (అగ్ని) తెల్లవారకమునుపు మేల్కొనువాడు (బిడ్డడు)

**ఉషాకలము** - ప్రాతఃకాలమున కూయునది (కోడి)

**ఉష్ట్రకంటకోదాహరణము** - ఒంటె ముండ్ల బాధ సహించుచు జమ్మిపత్రములు భక్షించుట వలన సుఖలేశమును అభిలషించునట్లు లౌకికుడు అభీష్ట విషయ సుఖ జనిత క్లేశాదికమును సహించుట

**ఉష్ట్రము**-ఎల్లప్పుడు ఎండచే తపింపబడునది (ఒంటె)

**ఉష్ట్రలగుడోదాహరణము** - లొట్టి పిట్ట తాను మోయుచున్న దుడ్డుతోడనే దెబ్బలు తిన్నట్లు మానవుడు తాను సృష్టించుకొన్న మారణాయుధములకు తానే బలియగునవుట

**ఉష్ణశూల** - ఒంటె యొక్క శూల రోగము, (రోకళ్ళతో క్రుమ్మినగాని తగ్గని రోగము - మొండికి బండ వైద్యము)

**ఉష్ణంకరణము** - వేడి చేయుటకు సాధనమైనది (కంబళి)

**ఉష్ణగుడు** - వెచ్చని కిరణములు కలవాడు

**ఉష్ణతాపారగమనము** - ఉష్ణశక్తి ఒక తావునుండి వేరొక తావునకు జేరుట (వ్యాపించుట)

**ఉష్ణతాప్రావణము** - మాధ్యమము ద్వారా ద్రవ్యాణువులు ఉష్ణతను గ్రహించి పైకి తేలి బరువగు చల్లని అణువులను క్రిందికి పంపుట ద్వారా ఉష్ణతాపార గమనము జరుగుట

**ఉష్ణతావాహనము** - (ఘన స్థితి యందలి) ద్రవ్యాణువులు తమవైపు నుండి ఉష్ణమును గ్రహించి అణువుల (మాధ్యమము) ద్వారా వ్యాపింప జేయుట

**ఉష్ణతావికిరణము** - మాధ్యమ మక్కరలేని ఉష్ణతా పారగమనము

**ఉష్ణరశ్మి** - వెడి కిరణములు కలవాడు (సూర్యుడు)

**ఉష్ణవారణము** - ఎండను వారించునది (గొడుగు)

**ఉష్ణాంశువు** - వేడి కిరణములు కలవాడు

**ఉష్ణాగమము** - ఉష్ణమధికముగా నుండు ఋతువు (గ్రీష్మఋతువు)

**ఉష్ణీషము** - వేడి తగులకుండ జేయునది (తలపాగా)

**ఉష్ణీషి** - పాగావలె నుండు జటాజూటము కలవాడు (శివుడు)

**ఉష్ణోపగమము** - ఉష్ణమెక్కువగా నుండు ఋతువు (గ్రీష్మఋతువు)

**ఉసురుచదువు** - ఆయుర్వర్ధకమగు చదువు (ఆయుర్వేదము - మన్కిమిన్కు)

**ఉసురు తొలుచదువులు** - ఆయుర్వేదవిద్య (మనికి మినుకు)

**ఊకదంపు** - ధాన్యమును దంపి ఊకను తొలగించుట

**ఊచకోత** - వరుసగా నరకుట

**ఊలమెకము** - ఊరెడు బురద నీటియందు ప్రేమ గల మృగము (పంది)

**ఊతముచేయు** - ఒకదానికొకటి జతపరచి దృఢపరచు

**ఊదకడుపు** - పెరిగిన కడుపు (స్థూలోదరము)

**ఊదుగ్రోవి** - ఊదునట్టి గొట్టము (ఊదువాద్దెము - మురళి, నిప్పూదు గొట్టము)

**ఊదువెండి** - నిప్పున పరిశుద్ధి చేయబడిన వెండి (చాది వెండి)

**ఊధస్యము** - పొదుగున బుట్టినది (పాలు)

**ఊరబంది** - ఊరియందు దిరుగు పంది

**ఊరబిచ్చుక** - ఊరియందు దిరుగు పిచ్చుక (చటకము)

**ఊరముత్తైదువ** - ఊరియందు దిరుగునట్టి జారిణి (రంకుటాలు)

**ఊరవ్యుడు** - బ్రహ్మయొక్క తొడ నుండి పుట్టినవాడు (కోమటి)

**ఊరుగాయ** - ఆవ, ఉప్పు, కారము మున్నగు వానిలోవేసి ఊరబెట్టిన మామిడికాయ

**ఊరుజన్ముడు** - తొడ నుండి పుట్టినవాడు (ఊరుసంభవుడు - కోమటి)

**ఊరుజుడు** - చూ॥ పై

**ఊరుదఘ్నము** - తొడలోతు గలది

**ఊరుపర్వము** - తొడకు కణుపువంటిది (మోకాలు)

**ఊరుభిన్నుడు** - తొడలు విరిగినవాడు

**ఊరువు** - వస్త్రముచే అచ్ఛాదింపబడునది (తొడ)

**ఊర్జితుడు** - ఉత్సాహము కలవాడు, బలము కలవాడు

**ఊర్ణనాభము** - నాభియందు అరటినార వంటి దారము గలది (సాలెపురుగు) ఐదు వ్రేళ్ళను కొంచెము వంచి కొనలు తగులకుండ పట్టిన అభినయ హస్తము

**ఊర్ణనాభి** - అరటినార వంటి దారము బొడ్డున గలది (సాలెపురుగు)

**ఊర్ణాయువు** - ఉన్ని గలది (పొట్టేలు, కంబళి, సాలెపురుగు)

**ఊర్ధ్వకాయము** - నాభిమొదలు తలచివరి వరకు గల యొడలి పై భాగము

**ఊర్ధ్వ జానువు** - ఎత్తైన మోకాళ్ళు గలవాడు

**ఊర్ధ్వదృష్టి** - యోగ దృష్టి కలవాడు (యోగి)

**ఊర్ధ్వ దేహము** - మరణానంతరము కలుగు దేహము

**ఊర్ధ్వరేతసుడు** - క్రిందకు పడని (రేతస్సు) శుక్లము గల[illegible] (శివుడు, భీష్ముడు)

**ఊర్ధ్వలోకము** - భూలోకమునకు పైలోకము

**ఊర్ధ్వ వర్త్మము** - భూలోకమునకు పైనుండెడి మార్గము (వాయుమార్గము, ఆకాశము)

**ఊర్ధ్వశాయి** - వెలికిల బరుండువాడు (బాలుడు)

**ఊర్ధ్వ శీలము** - మీదికెగయు జ్వాలలు కలది (అగ్ని)

**ఊర్ధ్వ స్రోతసుడు** - ఊర్ధ్వరేతసుడు (భీష్ముడు, శివుడు)

**ఊర్ధ్వ స్రోతస్సు** - జలాదులను వ్రేళ్ళ మూలమున బైకి తీసికొనునది (వృక్షలతాది)

**ఊర్మిక** - వ్రేలిపై కరుడు వలె నండునది (ఉంగరము)

**ఊర్మిమాలి** - తరంగములు మాలగా గలది (కడలి - సముద్రము)

**ఊర్వంగము** - ఊరువు వలె నుండు అంగము గలది (పుట్టగొడుగు)

**ఊర్వశి** - నారాయణుని తొడయందు బుట్టినది

**ఊర్వష్ఠీవము** - తొడల యొక్కయు మోకాళ్ళ యొక్కయు సముదాయము

**ఊషణము** - శోషింప జేయునది (మిరియము, సొంటి)

**ఊషరజము** - చవిటి నేలయందు పండించిన ఉప్పు

**ఊషరము** - విత్తనము జెరుచు నేల (ఉప్పు మన్ను కలది చవుటినేల)

**ఊషర బీజావాపము** - చవుటి నేల యందు విత్తనములు నాటుట (వ్యర్థ కార్యమనుట)

**ఊషరవృష్టి** - చౌటి నేలయందు కురిసిన వాన (బూడిదలో పోసిన పన్నీటి విధము)

**ఊష్మకము** - వేడిమి గల కాలము (వేసవి)

**ఊష్మములు** - ఇవి నాలుగు వర్ణములు (శ, ష, స, హ లు)

**ఊష్మాంశ** - ఒక గ్రాము నీటి తాపక్రమము ఒక డిగ్రీ సెంటీగ్రేడ్ హెచ్చు చేయుటకు కావలసిన ఉష్ణతారాశి ప్రమాణము

**ఊసరవెల్లి** - మూడు రంగులు గల తొండ (ముదురుతొండ)

**ఊసులాడు** -సమయమును వెళ్ళబుచ్చుటకై మాటాడు

**ఊహ్యము** - విచారింప దగినది

**ఋక్థము** - స్తోత్రము చేయబడునది (ధనము, బంగారము)

**ఋక్షము** - చీకటిని పోగొట్టునది (నక్షత్రము)

**ఋక్షరాజు** - ఎలుగు గొడ్లలో శ్రేష్ఠుడు (జాంబవంతుడు) నక్షత్రములకు ప్రభువు (చంద్రుడు)

**ఋక్సంహిత** - ఋగ్వేదమున మంత్రాత్మక మగు భాగము

**ఋజిష్ఠము** - మిక్కిలి ఋజువైనది (ఋజుతమము)

**ఋజుకాయుడు** - ఋజువైన శరీరము కలవాడు (కశ్యపముని)

**ఋజుగము** - తిన్నగా బోవునది (బాణము)

**ఋణగ్రస్తుడు** - అప్పుపడ్డవాడు

**ఋణదాయి** - ధనము అప్పుగా ఇచ్చువాడు (ఋణదాత)

**ఋణాంతకుడు** - తన్ను కొలుచుటచే ఋణ విముక్తి చేయువాడు (అంగారకుడు)

**ఋణార్ణము** - అప్పు తీర్చుటకై చేసిన అప్పు

**ఋతంభరుడు** - సత్యమును బాలించు వాడు (పరమేశ్వరుడు)

**ఋతధాముడు** - సత్యలోకము నివాసముగా గలవాడు (విష్ణువు)

**ఋతధ్వజుడు** - సత్యము ధ్వజముగా గలవాడు (శివుడు)

**ఋతము** - మనస్సుచే చేయు యథార్థవస్తు చింతనము (యజ్ఞము) పొందబడినది (ప్రాప్తి)

**ఋతుకాలము** - స్త్రీ ఋతుమతియైన తరువాత

పదునారు రాత్రుల కాలము (గర్భధారణకు యోగ్యమైనది)

**ఋతుపర్ణుడు** - నలునకు అక్షవిద్య నొసగిన రాజు

**ఋతుప్రాప్తము** - ఫల యోగ్య కాలమున మాత్రమే ప్రాప్తించినది (వృక్షము)

**ఋతుస్నాత** - ఋతుస్నానము చేసిన స్త్రీ

**ఋతుస్నానము** - ఋతుమతి నాల్గవ దినమున శుద్ధికొరకు జేయు స్నానము

**ఋత్విజుడు** - యజ్ఞకర్త వలన దక్షిణ స్వీకరించి యజ్ఞము చేయించు బ్రాహ్మణుడు (ఋత్విక్కు యాజకుడు)

**ఋభువులు** - సత్యముతో బుట్టినవారు (వేల్పులు) అదితి వలన బుట్టినవారు

**ఋభుక్షము** - దేవతలకు నివానస్థానమైనది (స్వర్గము)

**ఋభుక్షుడు** - వజ్ర స్వర్గములు కలవాడు (ఇంద్రుడు)

**ఋభువు** - స్వర్గమున ఉండువాడు (వేల్పు)

**ఋవడి** - ఋకారము వట్రుసుడితో గూడిన హల్లులకు, వట్రుసుడితో గూడియుండిన హల్లులన్నియు నొండొంటితోను, ఇకార ఎకారములతో గూడిన హయలు వట్రుసుడితోను యతి చెల్లుట (ఋ-కృ, వృ-మృ, హే-వృ మొ॥)

**ఋశ్యకేతనుడు** - ఋష్యమృగము టెక్కముగా గలవాడు (మన్మథుడు - అనిరుద్ధుడు)

**ఋశ్యకేతువు** - ఋష్య మృగము ధ్వజముగా గలవాడు (అనిరుద్ధుడు)

**ఋశ్యదము** - మనుబోతులను పట్టుటకై లోతుగ త్రవ్విన గొయ్యి

**ఋశ్యము** - తెల్లపాదముగల లేడి

**ఋషభతరము** - బరువులు లాగుటకు దగిన ఈడురాని ఎద్దు (చిన్నగిత్త)

**ఋషభధ్వజుడు** - ఋషభము ధ్వజముగా గలవాడు (శివుడు)

**ఋషభి** - మీసములు మున్నగు పురుష లక్షణములు గల స్త్రీ (పాళి - మీసము గలది, నరమాలిని - గడ్డము, మీసము కలది, మాచకమ్మ)

**ఋషిపంచమి** - సప్తర్షుల నుద్దేశించి ఆచరింపబడు వ్రతము భాద్రపద శుక్లపంచమి

**ఋష్యశృంగుడు** - శిరమున ఋ(శ్య)ష్య మృగము యొక్క కొమ్మువంటి కొమ్ముగలవాడు (దశరథునిచే పుత్రకామేష్టి చేయించిన మహర్షి)

**ఎండదొర** - ఎండకు ప్రభువైనవాడు (ఎండరేడు - సూర్యుడు)

**ఎండమావులు** - మట్టమధ్యాహ్నమున, ఎడారులయందు నీటివలె కనబడు సూర్యకిరణచ్ఛాయలు (మృగతృష్ణ)

**ఎండ్రి మెక్కుమెకము** - ఎంండ్రకాయలను దినునది (నక్క)

**ఎండ్రిమేతరి** - పీత మేతగా గలది (ఎండ్రి మెక్కు - మెకము)

**ఎంబన్న** - చేతకానివాడు (ఎంబెన్న - అసమర్థుడు)

**ఎకకంటిగాము** - ఒకే కన్నుగల గ్రహము (ఒంటి కంటిగాము - శుక్రగ్రహము)

**ఎకకంటి రథము** - ఒకే చక్రము గల రథము (సూర్యుని రథము)

**ఎక్కటికయ్యము** - ఒకనితో నొకడే చేయు పోట్లాట (ద్వంద్వ యుద్ధము - ఒంటి పోట్లాట)

**ఎక్కటిబవరము -** చూ॥ పై

**ఎక్కటియతి -** ల, ర, మ, వ అను నక్షరములు పాదాదిని యతి స్థానమునను అత్వముతో గూడియుండుట (ఏ యక్షరమున కాయక్షరమే యతి చెల్లునది)

**ఎక్కిరింత మెకము -** వెక్కిరించు లక్షణము గల జంతువు (కోతి)

ఎక్కుడు మెకము - గొప్ప మృగము (ఏనుగు)

**ఎక్కు బావి -** ఎక్కుటకు మెట్లుగల బావి (దిగుడుబావి - నడబావి)

**ఎగుబోద -**ఎగురుటకు రెక్కలు వచ్చిన పక్షిపిల్ల

**ఎడకత్తె -** లంజెను విటునికి తార్చునది (పొంత కత్తియ)

**ఎడకాడు -** తార్పుకాడు (కుంటెనకాడు)

**ఎడకారు -** మాఘమాసము మొదలుకొని జ్యేష్ఠ మాసము లోపల పండెడు పంట

**ఎత్తుగీతము -** సీస పద్యమునకు అనుబంధముగా వ్రాయు గీత పద్యము

**ఎత్తులకెకిమీడు, ఎత్తులవేలుపు -** పిశాచ గణములకు ప్రభువు (శివుడు - బూచులరేడు)

**ఎత్తువారి చేతిబిడ్డ -** ఒకరి నాశ్రయించి వారికనుకూలముగ నడచుకొనువాడు

**ఎద పుట్టువులు -** రొమ్మున బుట్టునవి (పాలిండ్లు)

**ఎదమచ్చగలసామి -** రొమ్మున శ్రీవత్సమును పుట్టుమచ్చ గల దేవుడు (విష్ణువు - పెరుమాళ్ళు)

**ఎద్దుతత్తడిజోదు -** నంది వాహనముగా గలవాడు (శివుడు)

**ఎనిమిదడుగుల మెకము -** ఎనిమిది కాళ్ళ మెకము (శరభమృగము)

**ఎనిమిది కాళ్ళరిక్క -** పూర్వాభాద్ర ఉత్తరా భాద్రలకు గల ఎనిమిది పాదముల నక్షత్రము (భాద్రపద - పోష్టపద)

**ఎనిమికాళ్ళరిక్కనెల -** భాద్రపదమాసము

**ఎమ్మెలాడి -** విలాసముగల యాడుది

**ఎరచిదిండి -** మాంసము దినువాడు (బోయ, రాక్షసుడు)

**ఎలదాయ సింగడు -** వైరుల పట్ల సింగము వంటివాడు

**ఎలనాగ -** యౌవనము గల యాడుది (లేజవ్వని)

**ఎలుకరౌతు -** ఎలుక నెక్కువాడు (గణపతి - కొక్కురౌతు)

**ఎలుగువిచ్చు -** సమ్మో నినాదములు చేయు

**ఎల్లమ్మ -** పొలిమేర యందుండు గ్రామదేవత (ఎల్లారమ్మ)

**ఎనళ్ళప్రొద్దు -** వంటకు ఎసరు పెట్టువేళ (సాయంకాలము)

**ఏకకాలికము -** ఒకే సమయమున జరుగునది

**ఏకకుండలుడు -** ఒకే కుండలము గలవాడు (కుబేరుడు, ఆదిశేషుడు)

**ఏకచ్ఛత్రము -** ఒకేరాజు యొక్క పాలనలో ఉన్నది

**ఏకజన్ముడు -** ముఖ్యమైన జన్మకలవాడు (రాజు) ఉపనయన రూప జన్మలేని వాడు (శూద్రుడు)

**ఏకతానుడు -** ఒక విషయమునందే మనస్సును లగ్నము చేయువాడు (ఏకాగ్రచిత్తుడు)

**ఏకదండి -** శిఖాయజ్ఞోపవీతములు విడిచి దండమును మాత్రమే ధరించిన సన్న్యాసి

**ఏకదంతుడు -** ఒక దంతము గలవాడు (వినాయకుడు)

**ఏకదృక్కు ఏకదృష్టి** - సర్వము నేకముగా జూచువాడు (జ్ఞాని) ఒకే కన్ను కలది (కాకి), ఒకే కన్ను కలవాడు (శుక్రుడు)

**ఏకపత్ని** - ఒకడే భర్తగా గలది (పతివ్రత - సాధ్వి), తనభర్తకు మరొక భార్యలేనిది (సవతి లేనిది)

**ఏకపింగళుడు** - పార్వతి శాపముచే పింగళ వర్ణము నొందిన యెడమ కన్ను గలవాడు (యక్షరాట్టు - కుబేరుడు)

**ఏకపింగుడు** - ఏకపింగళుడు (ధనపతి - కుబేరుడు)

**ఏకపిండుడు** - శ్రాద్ధమునందీయదగిన పిండము గలవాడు (సపిండుడు)

**ఏకభూమము** - ఒక అంతస్తుగలది

**ఏకముఖము** - ఒకవైపునకే యున్న ముఖము కలది

**ఏకయష్టి** - ఒంటిపేటగల హారము (ఏకావళి - ఏకయష్టిక)

**ఏకరాత్రము** - ఒక్క రాత్రిలో చేయదగిన కర్మము (వ్రతాది)

**ఏకరువు** - ఒక్కసారి మొదటి నుండి తుది వరకు జదువుట (వల్లె)

**ఏకవీడు** - ఒంటిగా దిరుగునది (ఏకచరము - అడవి పంది)

**ఏకశఫము** - రెండు పాయలుగా జీలి యుండని డెక్కలు గలది (గుఱ్ఱము, గాడిద మొ॥)

**ఏక శృంగము** - ఒక కొమ్ము కలది (ఖడ్గమృగము)

**ఏకశేషము** - విగ్రహ వాక్యమున ననేక పదములు కలిసి సమసించినపుడు ఒక పదము మాత్రమే మిగులును పితరులు = మాతా పితరులు ఇందు పితృశబ్దము శేషించినది శేషించినది లుప్తమైనదాని యర్థమును కూడ బోధించును

**ఏకసూత్రము** - ఒకే త్రాడు కలది (డమరు వాద్యము)

**ఏకాంగము** - శరీరావయవములలో ప్రధానమైన అవయవము (శిరస్సు)

**ఏకాంతి** - ఏకాగ్రచిత్తము కలవాడు

**ఏకాక్షము** - ఒక కన్ను కలది (కాకి)

**ఏకాదశ ద్వారము** - పదునొకండు ద్వారములు గలది (శరీరము = బొడ్డు, బ్రహ్మ రంధ్రము మరియు నవద్వారములు)

**ఏకావళి** - ఒంటి పేట గల హారము; పూర్వ పూర్వములకు ఉత్తరోత్తరము గాని ఉత్తరోత్తర ములకు బూర్వ పూర్వములుగాని విశేషణ భావము కలిగియుండు అలంకారము (ఉదా - ఆ రాజు కన్ను లాకర్ణవిస్తారములు కర్ణములు బాహువుల వరకు వ్యాపించినవి బాహువులు మోకాళ్ళ వరకు వ్రేలాడునవి ఇందు పూర్వ పూర్వ పదమునకు ఉత్తరోత్తరపదము విశేషణమగుచు వచ్చినది )

**ఏకాహగమము** - ఒకనాటి ప్రయాణము చేత జేరదగిన గమ్యము

**ఏకాహము** - ఒక దినములో చేయబడు ఉత్సవము

**ఏకోదరుడు** - ఒక తల్లికడుపున బుట్టినవాడు (సోదరుడు)

**ఏకోనము** - ఒకటి తక్కువ యైనది

**ఏకోనవింశతి** - ఒకటి తగ్గుటచే ఇరువది కానిది (ఏకాన్న వింశతి - పందొమ్మిది)

**ఏచకంటిచుక్క** - వంకర మంచ ు వలె నుండు ఉత్తరాషాఢా నక్షత్రము

**ఏటగలుపు** - అక్కసుతో బాడుచేయు

**ఏటిబోటిమగల యెకిమీడు** - సముద్రము లకు ప్రభువు (వరుణుడు)

**ఏటిరేడు** - నదులకు ప్రభువు (సముద్రుడు)

**ఏటుకాడు** - బాణములు ప్రయోగించు వాడు (విలుకాడు - ధానుష్కుడు)

**ఏట్రింతరాయబారము** - తీతువుపిట్ట సముద్రునితో రాయబారమంపుట వలె గొప్ప కార్యముల యందు అల్పుల సందేశము

**ఏడమూకుడు** - వినుటకును మాటలాడు కును శక్తిలేనివాడు

**ఏడికవజీరు** - ఇజ్జీ వాహనముగా గలవాడు (అగ్నిహోత్రుడు)

**ఏడుకొండల రాయుడు** - ఏడు కొండలకు పైనుండెడి సామి (వేంకటేశ్వరుడు)

**ఏడుగుఱ్ఱాల (తేరెక్కు) జోదు** - ఏడు గుఱ్ఱముల రథము నెక్కెడు యోధుడు (సూర్యుడు)

**ఏడూకము** - ఎముకలు నడుమ నుంచి కట్టిన గోడ (ఏడుకము)

**ఏణ తిలకుడు** - ఏణము చిహ్నముగా గలవాడు (చంద్రుడు)

**ఏనస్సు** - ప్రాయశ్చిత్తాదుల వలన పోవునది (పాపము)

**ఏనాళ్ళు** - ఐదు దినములు, వివాహానంత రము వియ్యంకు లొకరి కొకరు పంపెడు సారె

**ఏనిక దిండి** - ఏనుగు ఆహారముగా గలది (సింహము - గజరిపువు)

**ఏనుగుగొంగ** - ఏనుగునకు శత్రువు (సింహము - ఏనుగుదాయ)

**ఏనుగు తోలుదాల్పు** - గజాసురుని చర్మమును ధరించిన హడు (శివుడు)

**ఏనుగుపాడి** - సమృద్ధియైన పాడి

**ఏనుగుమొగము సామి** - ఏనుగు ముఖము కల దేవుడు (వినాయకుడు)

**ఏనుగురాకాసి గొంగ**-గజాసురవైరి, శివుఁడు

**ఏనుగులసూడు** - ఏనుగులకు శత్రువు (సింహము - ఏనుగులదాయ)

**ఏనుగుల సూడుమెకము** - ఏనుగులకు శత్రువగు మృగము (సింహము)

**ఏనుగు సొరము** - సప్త స్వరములలొ నొకటగు నిషాద స్వరము

**ఏరండము** - మలాదులను క్రిందికి త్రోయునది వాతమును బోగొట్టునది (ఆముదపుచెట్టు)

**ఏరువాక** - ప్రతి ఏట జేయు దుక్కియొక్క ప్రారంభము

**ఏష్యము** - మూడు తిధులు గల దినము

**ఐంగుదము** -గారచెట్టునకు సంబంధించినది (గారపండు)

**ఐందవము** - చంద్రునకు సంబంధించినది చంద్ర దేవతాకమైనది

**ఐందవాతపము** - చంద్రుని నుండి కలుగు కాంతి (వెన్నెల)

**ఐంద్రజాలికుడు** - ఇంద్రజాలము చేయువాడు (మాయావి)

**ఐంద్రము** - ఇంద్రునికి సంబంధించినది

**ఐంద్రలుప్తికుడు** - ఇంద్రలుప్తమను రోగము వలన బట్టతలయైనవాడు

**ఐంద్రవాయవము** - ఇంద్ర వాయువులు దేవతలుగా గలది

**ఐంద్రాగ్నము** - ఇంద్రాగ్నులు దేవతలుగా గల హవిరాదికము

**ఐకమత్యము** - పెక్కు రొకే యభిప్రాయము గలిగియుండుట

**ఐచ్ఛికము** - స్వేచ్ఛచే చేయబడునది

**ఐడబిడుడు** - ఐలబిలుడు (కుబేరుడు)

**ఐణము** - ఏణమునకు సంబంధించినది (జింక చర్మము మొ॥)

**ఐతరేయము** - ఒకానొక యుపనిషత్తు, ఒకానొక బ్రాహ్మణము (ఈ యుపనిషత్తు ఖండషట్క పరిమితంబగుట జేసి యాత్మ షట్కమని ప్రసిద్ధి గాంచినది)

**ఐతిహాసికుడు** - ఇతిహాసము తెలిసినవాడు

**ఐదుతూపులజోదు** - ఉన్మాదన, తాపన, శోషణ, స్తంభన, సమ్మోహనములను ఐదు రకముల బాణములు కల యోధుడు (మన్మథుడు)

**ఐదు తెగలతూపుజోదు** - ఐదు తూపుల జోదు (మన్మథుడు)

**ఐదు మోముల వేల్పు** - అయిదు మొగములు కల దేవుడు (శివుడు = ఈశానము, తత్పురుషము, వామదేవము, సద్యోజాతము, అఘోరము)

**ఐదువ** - అయిదు అలంకారములు కలది (సువాసిని = మంగళ సూత్రము, పసుపు, కుంకుమ, గాజులు, చెవ్వాకు)

**ఐరావతము** - క్షీరసాగరము నందు బుట్టిన యేనుగు (ఇంద్రుని యేనుగు)

**ఐరావతి** - ఐరావత గజము యొక్క భార్య (అభ్రముపు)

**ఐరేయము** - అన్న సంబంధమైనది (మద్య విశేషము)

**ఐలబిలుడు** - ఇలబిల యను నామె కొడుకు (కుబేరుడు)

**ఐహికదర్శి** - భూలోక వ్యాపారమందు దృష్టి కలవాడు

**ఐహికము** - ఇహలోక సంబంధమైనది

**ఒంటరులు** - ఒక జాతివారు, రణమున నిలిచి పోరాడగల అసహాయ శూరులు (కాల్బంట్లు)

**ఒంటికంటిగాము** - ఒకే కన్నుగల గ్రహము (శుక్రాచార్యుడు - ఎకకంటిగాము)

**ఒంటికంటి రామలింగము** - పొరుగు వారి కలిమిచూచి యోర్వలేనివాడు (అసహనుడు)

**ఒంటికొమ్ము దేవర, ఒంటికొమ్ము వేల్పు** - ఒక దంతము గల ప్రభువు (ఏకదంతుడు - గణపతి)

**ఒంటిజందెము వాడు** - ఒకే జందెము తాల్చునట్టి బ్రహ్మచారి (వటుడు)

**ఒంటి పల్లుదొర** - ఏకదంతుడు, గణపతి

**ఒంటిపోగు** - ఒకే కుండలమును తాల్చువాడు (బలరాముడు, కుబేరుడు)

**ఒంటిమ్రాకుల పెనుముప్పు** - విడి విడిగా నున్న వృక్షములను బెల్లగించి ముప్పు కలిగించువాడు (వాయుదేవుడు)

**ఒజ్జబంతి** - గురువు వ్రాసెడు ఒరవడి బంతి (మేలుబంతి)

**ఒజ్జలపంగనామము** - గురువుల దోషము లెత్తి చూపుట

**ఒజ్జలపుచ్చకాయ**- గురువుల లోవములను మరుగుపరుచుట, గురువులు చెప్పినవి అప్పటి కప్పుడే మరచుట

**ఒట్టిగొడ్డు తాకట్టు** - ఒట్టిపోయిన గొడ్డును వదలించుకొనుటతో పాటు కొంతసొమ్ము రాబట్టుకొనుటకై యత్నించుట

**ఒడలిచూపాడయుడు** - శరీరముచే జూడ సమర్థత గలవాడు (ఇంద్రుడు - సహస్రాక్షుడు)

**ఒడలి తాల్పుల పిండు కుసురు** - దేహధారుల కుసురైనవాడు (వాయు దేవుడు)

**ఒడలు గాలి** - శరీరమందలి గాలి (వ్యానవాయువు)

**ఒడిబ్రాలు** - నూతన వధువునకు ఒడిలో గట్టు బియ్యము

**ఒడ్డీ, ఒడ్డి** - ఉడ్డీనగతి గల పారావతభేదము

**ఒప్పిదుడు** - అలంకరించుకొన్నవాడు (అందగాడు)

**ఒరపిడి పెట్టు** - వన్నె కనుగొనుటకు బంగారము గీచి గీటుపెట్టు

**ఒరవడి** - విద్యార్థులకు వ్రాత మెరుగుపడుటకై ఉపాధ్యాయుడు వ్రాసి యిచ్చు మాదిరి పంక్తి

**ఒర గొడ్డెము** - హృదయ విదారకమైన కుత్సిత వాక్యము (వక్రోక్తి)

**ఒరుదలయేరు** - ఒక ప్రక్కనే వచ్చు తలపోటు (పార్శ్వపు పోటు)

**ఓంకారము** - ఓమ్ అను ప్రణవాక్షరము

**ఓకము** - దీనియందు అందరును కూడియుందురు (ఇల్లు, ఆశ్రయము)

**ఓకోదని** - ఆశ్రయమును దినునది (పేను)

**ఓజము** - దీర్ఘ సమాసములును అనుప్రాసములును ఎక్కువగా కలిగిన కూర్పు (ఒకానొక కావ్యగుణము)

**ఓతప్రోతము** - నాలుగు ప్రక్కల వ్యాపించి యున్నది, నిలువుగను అడ్డముగను వేయబడినది

**ఓతువు** - ఎలుకల బాధ నుండి తప్పించునది (మార్జాలము - పిల్లి)

**ఓమటి** - ఒడలిని పోషించునది (అన్నము - దోమటి)

**ఓమనగుంటలు** - ఓమన పీట గుంటలలో చింత గింజలు వేయుచు బాలికలు ఆడుకొను ఒక ఆట (కాశీగుంటలు)

**ఓరవాకిలి** - సగము తెరచి ఉంచిన తలుపులు గల గుమ్మము గలది

**ఓర్వనివాడు** - పరుల యున్నతిని జూచి సహింపని వాడు (ఈర్ష్యాళువు - అసహనుడు)

**ఓషధీశుడు** - ఓషధులకు ప్రభువు (చంద్రుడు)

**ఓష్ఠ్యము** - పెదవులయందు బుట్టునది (ప, ఫ, బ, భ, మ)

**ఔక్షకము** - (ఉక్షము = ఎద్దు) ఎద్దుల సమూహము

**ఔత్తరాహుడు** - ఉత్తరదేశపువాడు

**ఔత్తరాహికము** - ఉత్తరాది వారు పాడుకొను సంగీతము (హిందుస్థానీ)

**ఔత్తానపాది** - ఉత్తానపాదునకు సునీతియందు బుట్టిన కొడుకు (ధ్రువుడు)

**ఔత్సము** - సెలయేట బుట్టినది

**ఔదకము** - ఉదకమందు బుట్టినది (నీలమణి)

**ఔదనికుడు** - వంట చేయువాడు (పాచకుడు)

**ఔదరికుడు** - పొట్టపోసికొనుటే లక్ష్యముగా గలవాడు

**ఔదశ్వితము** - మజ్జిగతో చేయబడినది (భక్ష్యాది)

**ఔదార్యము** - అసంయుక్తాక్షరములతో గూడిన సుశబ్దార్థముల కూర్పు (ఒకానొక కావ్యగుణము)

**ఔద్దాలకము** - పుట్టనుండి త్రవ్వి తీయబడినది (పుట్ట తేనె)

**ఔధసము, ఔధస్యము** - పొదుగునకు సంబంధించినవి (క్షీరము - పాలు)

**ఔపచారము** - ఒకదాని యందుండు ధర్మమును వేరొక దాని యం దారోపించుట వలన గలిగినది

**ఔపవిభక్తికములు** - నామవిభక్తులకు వెనుక ఆగమాదేశ పూర్వకముగా వచ్చు ఇ, టి, తి వర్ణములు

**ఔపశ్లేషికము** - దగ్గరి కూడిక కలది

**ఔపానహ్యము** - చెప్పులు తయారు చేయుటకు వాడు చర్మము

**ఔరగము** - ఉరగమునకు సంబంధించినది

**ఔరభ్రకము** - గొఱ్ఱెల మంద

**ఔరభ్రము** - గొఱ్ఱె సబంధమైనది (కంబళి)

**ఔరభ్రికుడు** - గొఱ్ఱెల వలన ఆదాయము వలన జీవించువాడు (గొల్లవాడు)

**ఔరసము** - ఉరమున బుట్టినది (అక్షరము ఔరస్యము)

**ఔరసి** - తనకు ధర్మపత్నియందు బుట్టినది (కూతురు)

**ఔరసుడు** - తనకు ధర్మపత్ని యందు కల్గిన కుమారుడు

**ఔర్ణకము** - ఉన్నితో జేయబడినది (కంబళి మొ॥ - ఔర్ణము)

**ఔర్ధ్వదేహము** - ఊర్ధ్వ దేహమునకు సంబంధించిన కర్మము (అపరకర్మ)

**ఔర్ధ్వ దేహికము, ఔర్ధ్వ దైహికము** - పితరుల యుత్తరగతుల యభివృద్ధికై చేయు గోదానాది

**ఔర్వము** - ఔర్వునకు సంబంధించినది (బడబాగ్ని) ఉర్వికి సంబంధించినది (పాంశులవణము)

**ఔర్వశేయుడు** - ఊర్వశికి బుట్టినవాడు (అగస్త్యుడు, ఆయువు, వసిష్ఠుడు)

**ఔలూకము** - గ్రుడ్లగూబలగుంపు

**ఔషరము** - చౌటి నేలకు సంబంధించినది

**ఔష్ఠ్యము** - ఉష్ఠ్రములకు నంబంధించినది (ఒంటెపాలు)



**కంకటము** - శరీరమును కప్పునది (కవచము)

**కంకణము** - మౌక్తికాదులతో ప్రోయునది (హస్తభూషణము) ఒక నీటిపిట్ట (కంకడాయి)

**కంకణము గట్టు** - ఈ శుభ కార్యము చేయుదునని పూనుకొను (దీక్షవహించు)

**కంకతిక** - కేశములం దిటునటు పోవునది (దువ్వెన)

**కంకరగాడిద** - గుఱ్ఱమునకు గాడిదకు గల్గిన సంతానము (కంచరము - అశ్వతరము)

**కంకరము** - నీరెక్కువగా కలిసి యున్నది (మజ్జిగ)

**కంకశాయము** - రాపులుగు వలె బరుండునది (కుక్క)

**కంకాళము** - చూచినంతనే మనస్సునకు బాధ కల్గించునది (అస్థిపంజరము)

**కంకిపురుగు** - జొన్న చేలకు పట్టెడు పురుగు

**కంకేళి** - సుఖేచ్ఛచే దీని సమీపమున విహరింతురు (అశోక వృక్షము)

**కంచారము** - సూర్యుని పేరు కలది (అర్కము - జిల్లేడు)

**కంచి గరుడసేవ** - కంచిలో జరుగు గరుడసేవ (సులభముగా తెమలనిది)

**కంచిమేక** - పెద్ద పొదుగు గల కురుచ మేక

**కంచుకము** - (పాము) శరీరమునంటి యుండునది (పాముకుబుసము, కవచము)

**కంజజుడు** - విష్ణుని నాభికమలమున జన్మించినవాడు (బ్రహ్మ)

**కంజభవాండము** - అజాండము

**కంజము** - నీటిలో పుట్టినది (తామర)

**కంజరము** - నీటిని పీల్చునది (ఏనుగు)

**కంజాతము** - నీటియందు బుట్టినది (పద్మము)

**కంజుడు** - జలమునందు బుట్టినవాడు (బ్రహ్మ, చంద్రుడు)

**కంటకదళ** - ముండ్లతో కూడిన దళములు కలది (మొగలి)

**కంటుకద్రుమము** - ముండ్లచెట్టు (బూరుగు)

**కంటక ఫలము** - ముండ్లచే చుట్టబడిన ఫలములు కలది (పనస, పల్లేరు, ఉమ్మెత్త)

**కంటక భక్షకము** - ముండ్లను తినునది (కంటకభుక్కు - ఒంటె)

**కంటకాగారము** - ముండ్లపొద నివాసముగా గలది (తొండ)

**కంటకాశనము** - ముండ్లు ఆహారముగా గలది (ఒంటె)

**కంటతనువు** - ముండ్లతో గూడిన చర్మము కలది (వాకుడుచెట్టు)

**కంటదళ** - ముండ్లతో గూడిన దళములు కలది (మొగలి)

**కంటసరము** - మెడలో ధరించెడి గొలుసు (కంఠహారము - కంటసరి)

**కంటిపులి** - ఎద్దు మొదలైన వాని కంటి మచ్చ (కనుపులి)

**కంటివాలు** - బండి చక్రము వలె గుండ్రనైన అయుధము (సుదర్శనము - చక్రాయుధము)

**కంటి విన్కరి** - కంటితో విను శక్తి కలది (కంటివినికి - పాము)

**కంటెమ్రాను** - బావిమీద అడ్డముగా వేయుకమ్మె (అడ్డుగమ్మ)

**కంఠమాణిక** - కంఠము వలె స్పష్టముగా పలుకునది (వీణ - విపంచి)

**కంఠతాలవ్యములు** - కంఠము నుండియు తాలువుల నుండియు బుట్టినవి (ఎ,ఏ,ఐ)

**కంఠశోష** - కంఠము నొప్పి పుట్టునట్లు నొక్కి చెప్పినను ప్రయోజనము లేకపోవుట

**కంఠస్థము** - ఒప్పగించుటకు తడుముకొన కుండ వచ్చియున్నది, కంఠమందున్నది

**కంఠీరవము** - కంఠము నందు ధ్వనికలది (సింహము, పావురము ఏనుగు)

**కంఠేకాలుడు** - కంఠము నందు నలుపు గలవాడు (శివుడు)

**కంఠోష్ఠ్యములు** - కంఠము నుండియు, పెదవుల నుండియు బుట్టినవి (ఒ,ఓ ఔ)

**కంఠ్యము** - కంఠమునుండి పుట్టినవి

**కండలు కోసియిచ్చు** - కష్టముల కోర్చి పరులకు సహాయపడుట

**కండురము** - తీట గలది (కంద)

**కండువు** - గోళ్ళతో గోకవలయునది (తీట)

**కండూఘ్నము** - దురదను బోగొట్టునది (రేలచెట్టు, తెల్లావలు)

**కండ్వోఘము** - మిక్కుటమగు దురద కలిగించునది (గొంగళి పురుగు)

**కందరాకరము** - గుహలకు నిలయమైనది, (కొండ)

**కందర్పుడు** - సుఖ విషయమున గర్వించు వాడు (మన్మధుడు)

**కందర్పమథనుడు** - మన్మధుని దహించిన వాడు (శివుడు)

**కందాలరాజు** - తేరతిండి మరగి తిరిగెడు సోమరి

**కందాయము** - జ్యేష్ఠ మాసము మొదలుగా నాలుగేసి మాసముల కాలము

**కందుకము** - సంతోషమును సుఖమును ఇచ్చునది (బంతి, తలగడ)

**కందుగలదుండగీడు** - కళంకముగల ధూర్తుడు (చంద్రుడు)

**కందెర** - కంటికి తెరవంటిది (కనురెప్ప)

**కంధర** - శిరస్సును దరించునది (మెడ)

**కంధరము** - నీటిని దాల్చునది (మేఘము)

**కంధి** - నీటిని దాల్చునది (సముద్రము), శిరస్సు దీనిచే ధరింపబడును (మెడ)

**కంపాకము** - కదలికచె తెల్లమగునది (గాలి)

**కంబమయ్య** - కంబమున వెలసిన దేవుడు (నరసింహమూర్తి)

**కంబమురాయుడు** - కంబమున వెలసిన నరసింహమూర్తి

**కంబళ భోజనము** - గొంగళిలో భుజించుచు వెండ్రుకలు ఏరుటవంటిది (వ్యర్థ ప్రయత్నము)

**కంబుకంఠి** - శంఖము వంటి కంఠము గలది (స్త్రీ)

**కంబుగ్రీవ** - శంఖము వంటి కంఠముగల స్త్రీ

**కంబ్వాతాయి** - శంఖమువలె నుండు పూర్వకాయము గలది (గరుడపక్షి)

**కంసకారుడు** - కంచు పని చేయువాడు (కంచరి)

**కంసారాతి** - కంసునకు శత్రువు (శ్రీకృష్ణుడు)

**కంసారి** - కంసారాతి

**కకుంజలము** - వాననీటికై శబ్దించునది (చాతకపక్షి)

**కకుద్మంతము** - పెద్ద మూపురము గలది (ఎద్దు)

**కకుద్మతి** - మూపురము వంటి కండగలది (పిరుదు)

**కక్షశాయము** - ఎండు గడ్డిపై నిద్రించునది (కుక్క - కక్షశాయువు)

**కక్షాపటము** - కచ్చగా ఉపయోగించు వస్త్రము (గోచి)

**కంచగనము** - కప్పములేని దుకాణము ఉండు స్థలము (సంత)

**కంచగలము** - నీటిని బంధించి యుంచునది (సముద్రము)

**కచమాలము** - వెంద్రుకల వన్నెను దాల్చునది (పొగ)

**కచాకచి** - జుట్టు జుట్టు పట్టుకొని పరస్పరము పెనగులాడుట

**కచాకువు** - వెంద్రుకవలె వంకరగా బోవునది (పాము)

**కచామోదము** - కేశములకు పరిమళము కలిగించునది

**కచ్ఛపము** - పుచ్ఛము (తోక) చే బావనము చేయునది

**కచ్ఛపి** - సరస్వతి ధరించు వీణె, ఆడు తాబేలు

**కచ్ఛరుహ** - జలప్రాయ ప్రదేశమున మొలచునది (గరిక)

**కచ్ఛురుడు** - గజ్జి గలవాడు

**కజ్జలధ్వజము** - మసియే జెండాగా గలది (దీపము)

**కటంకటము** - శవమును జ్వాలచే ఆవరించునది (అగ్ని)

**కటంకటేరి** - బంగారు వన్నెను బొందునది (పసుపు - హరిద్ర)

**కటంబము** - మ్రోయింపబడునది (వాద్యము), శత్రువు దీనిచే తాకబడును (బాణము)

**కటకగవోదాహరణము** - ఆవరణలోని గోవులకు వెలుపలి (క్రూరజంతువుల) నుండి రక్షణ కలుగుటయు లోన సంభవించు ఆపదలకు రక్షణ లేక పోవునట్లుగా అపాయము, అనపాయము అన్నింటియందును మిశ్రమమై యుండు ననుట

**కటకము** - గాజు వంటి పారదర్శక ద్రవ్యముతో ఒకటి లేక రెండు వర్తుల తలములుండునట్లుగా చేయబడినది, పర్వతము చుట్టు నావరించి యుండునది (కొండచరియ), ఓఢ్ర దేశపు రాజధాని

**కట ఖాదకుడు** - నియమము లేక అన్నియును దినువాడు

**కటప్రణుడు** - మిక్కిలి రణ కండూతి కలవాడు (భీముడు)

**కటాక్షము** - నేత్రముల వెలుపలి భాగమున (గండస్థలమున) వ్యాపించునది (కడకంటి చూపు)

**కటారుడు** - స్వేచ్ఛగా నగరమున దిరుగు వాడు (కాముకుడు)

**కటాహము** - వెడల్పు మూతి గల పాత్రము (మూకుడు పట్టుకొనుటకు వీలగు చెవులు గల గంగాళము)

**కటిత్రము** - మొలను కాపాడునది (మొలనూలు - కాంచి)

**కటిసూత్రము** - మొలకు చుట్టదగినది (మొలత్రాడు)

**కటుంభర** - కారమును భరించునది (కటుక రోహిణి)

**కటుకత్రయము** - కారముగల మూడు దినుసులు (పిప్పలి, శొంఠి, మిరియాలు)

**కటుకీటము** - తొండముతో కుట్టి బాధ కలిగించునది (దోమ)

**కటుక్వాణము** - కఠినమగు ధ్వని కలది (లకుముకిపిట్ట - టిట్టిభము)

**కటుత్రయము** - మూడు కారపు దినుసులు (సొంటి, పిప్పళి, మిరియములు)

**కటుమంజరిక** - తీక్ష్ణమైన వెన్ను కలది (ఉత్తరేను)

**కటుమోదము** - గాటైన వాసన కలది (జవ్వాది)

**కటురవము** - కఠినమగు ధ్వని గలది (కప్ప)

**కటు స్నేహము** - గాటైన నూనె కలది (ఆవ)

**కట్టిక** - బెత్తము తాల్చి కొలువుచేయు ద్వారపాలుడు (కట్టికవాడు)

**కట్టుపకాసి** - పరాక్రమాదులచే మిక్కిలి ప్రకాశించు వాడు (శూరుడు)

**కట్టుబోతు** - ప్రయోగములు చేయువాడు

**కట్టుమామిడి** - పక్షులు కొరుక కుండుటకై పండ్లకు గుడ్డలు కట్టిన మామిడి (అంటుమామిడి)

**కట్టెడ** - ఎడనెడ కట్లుగల సర్పము (కట్లుపాము - కట్లపు)

**కరమర్దుడు** - భక్తుల ఆపదలను తొలగించు వాడు (శివుడు)

**కఠము** - కృష్ణయజుర్వేదము నందలి కఠ శాఖకు సంబంధించిన ఉపనిషత్తు (కఠోపనిషత్తు)

**కఠశ్రోత్రియుడు** - యజుర్వేదీయ కఠశాఖను లెస్సగా వల్లించినవాడు

**కఠాధ్యాపకుడు** - కఠశాఖను అధ్యయనము చేయించువాడు

**కఠింజరము** - కాఠిన్యమును హరించునది (తులసిచెట్టు, నల్లగగ్గెర)

**కఠినపృష్ఠము** - గట్టి వీపు గలది (తాబేలు)

**కడ కడ** - కడపటి దిక్కు (ఈశాన్యము)

**కడ కడలి** - కడ దిక్కు నందలి సముద్రము

**కడదనరుచుక్క** - కడచుక్క (రేవతి నక్షత్రము)

**కడదెస కాపరి** - కడ దిక్కును (ఈశాన్యదిశను) బాలించు ప్రభువు (శివుడు - ఈశానుడు)

**కడ పని** - మృతునకు జేయు దహనాది దేహ సంస్కారము (అంత్యక్రియ)

**కడ యేనుగు** - స్వర్గమందలి యైరావతమను దిగ్గజము

**కడలి** - కడలు అలలు గలది (సముద్రము)

**కడలి కాన్పు** - సముద్రమున బుట్టినది (కల్పవృక్షము - ఇచ్చు చెట్టు)

**కడలి కూతురు** - క్షీరసాగరమున బుట్టినది (లక్ష్మి - మున్నీటిచూలి)

**కడలి బత్తలిక దునేదారి** - సముద్రము అమ్ముల పొదిగా గల శూరుడు (శివుడు)

**కడలి మొలనూలు చేడియ** - సముద్రము మొలత్రాడుగా గల స్త్రీ (భూదేవి)

**కడలి మొలనూలు చేడియ కన్న పడతి** - భూపుత్రి (సీత)

**కడలియల్లుడు** - సముద్రుని యల్లుడైన వాడు (విష్ణువు - పెరుమాళ్ళు)

**కడలియొకిమీడు** - సముద్రమునకు ప్రభువు (వరుణదేవుడు)

**కడలిరావట్టి** - పాలసముద్రుని కుమారుడు, కొమార్తె (చంద్రుడు, లక్ష్మి)

**కడలి రాయడు** - సముద్రమునకు ప్రభువు (వరుణుడు)

**కడలివెన్న** - పాలకడలికి వెన్నవంటి వాడు (చంద్రుడు)

**కడలి వెలదుక** - సముద్రుని భార్య (గంగ)

**కడవన్నె** - బంగారము యొక్క తుది వన్నె (పదియారవ వన్నె)

**కడవన్నె గుబ్బలి** - బంగరు కొండ (మేరువు)

**కడవసము** - కట్టుకొనుటకుపయోగించు తోలు (తొలుకోక - కడాసము)

**కడవరాసి** - కుంబరాశి

**కడిదలుగు** - గొప్ప ఆయుధము (సుదర్శనము - చుట్టుకైదువు)

**కడిదిజడదారి** - భారమగు జటలు ధరించినవాడు (శివుడు - ధూర్జటి)

**కడుపు చెరువగు** - భరింపరాని దుఃఖము కల్గు

**కణజ మూషకము** - గాదె క్రింద పందికొక్కు గాదిలోని సరకులను తిని జీవించునట్లు తేరగ తిని సుఖించు వానిపట్ల వర్తించు నది

**కణాటీనము** - నూకలు, గింజల కొరకు తిరుగునది

**కణాటీరము** - కణాటీనము (కాటుకపిట్ట)

**కణాదుడు** - ధాన్యకణముల నేరి తెచ్చుకొని తిని జీవించిన యొక మహర్షి (కణభుక్కు)

**కతలకాచి** - కతలు చెప్పుటలో నేర్పు కలది (కతలకాణాచి - కధానిధి)

**కత్తళీడు** - కవచమును దాల్చినవాడు

**కత్తిపిట్ట** - విరహుల పాలిట కత్తి కోతవలె కూసెడు పిట్ట (కోయిల)

**కత్తిమీద సాము** - మిక్కిలి జాగ్రత్తతో చేయదగిన పని

**కత్తెర నెల** - కృత్తికా నక్షత్రముతో గూడిన పున్నమగల నెల (కార్తికము)

**కత్తెర బావిలీలు** - స్త్రీలు చెవులకు తాల్చెడు కుంటెన కుచ్చులు

**కత్తోయము** - మత్తు కలిగించెడు చెడ్డనీరు (కల్లు)

**కథంకథికుడు** - ఏమి ఏమి యని యడుగు వాడు

**కథానకము** - చిన్న కథలు గల గ్రంధము

**కథోద్ఘాతము** - సూత్రధారుడు ప్రయోగించిన వాక్యముగాని యర్థముగాని గైకొని పాత్రము ప్రవేశించుట "కురురాజ సుతులు స్వస్థులగుదురు గాక" అను సూత్రధారోక్తి యర్థమును గ్రహించి భీముడు ప్రవేశించుట

**కదంబకము** - కోలాహల రూపమున కుత్సితముగా మ్రోయునది (గుంపు)

**కదంబము** - విరహుల హృదయమును వికలపరుచునది (కడిమిచెట్టు)

**కదధ్వము** - కుత్సితమైన మార్గము (కాపదము - చెడుత్రోవ)

**కదన్నము** - కల్తీ ఆహారము

**కదర్యుడు** - కుత్సితుడైన ధనికుడు (లోభి)

**కదళీకంటకోదాహరణము** - ముల్లు అరటియాకులలో ఏది దెనిపై బడినను అరటియాకునకు నష్టము కల్గునట్లు పేద ధనికులలో ఎవరెవరితొ తగవు లాడినను పేదయె నష్టపోవు ననుట

**కదళీవంధ్య** - ఒక్కమారే ఫలించి పిమ్మట గొడ్డుపోవు అరటివలె ఒక్కబిడ్డను మాత్రము కన్న స్త్రీ

**కదలుతులుము** - మల్లుర ముప్పది రెండు విన్నాణములలో నొకటి

**కద్రూజము** - కద్రువకు కల్గిన సంతతి పాము

**కద్వదుడు** - అశ్లీలము లాడువాడు (పలువ)

**కనకక్షారము** - సువర్ణము కరగుట కుపయోగించు క్షారము (వెలిగారము)

**కనకాంగి** - బంగారు వన్నెగల ఆడుది

**కనకాచలము** - బంగరు కొండ (మేరువు)

**కనకాద్రి** - కనకాచలము (కడవన్నె గుబ్బలి మేరువు)

**కనకాహ్వము** - కనకము యొక్క పేరు కలది (ఉమ్మెత్తచెట్టు, నాగకేసరము)

**కనిష్ఠుడు** - వయస్సుచే మిక్కిలి తక్కువయైన వాడు (తమ్ముడు)

**కనీనిక** - కంటి నల్లగ్రుడ్డు (తారక) అన్నిటి కన్న చిన్న వ్రేలు (చిటివ్రేలు - కనిష్ఠిక)

**కనీయుడు** - మిక్కిలి నీచుడు (అల్పుడు), అతితరుణుడు (కనిష్ఠుడు)

**కనుపుల విల్కాడు** - చెరకుగడ విల్లుగా గలవాడు (ఇక్షుధన్వుడు మన్మథుడు)

**కనుబెంటి** - కాబోవు ప్రయోజనములను సూచించెడు శకునపక్షి (జీలుగుపిట్ట)

**కనుమారి** - కొండ శిఖర భాగమున నుండు సమతల ప్రదేశము (కొండ చరియ - పర్వతసానువు)

**కనుము** - మకర సంక్రమణమునకును, మనుష్యుడు మరణించిన దినమునకును, పశుబలి యిచ్చిన దినమునకును మరుచటి రోజు

**కనువినికి** - కన్నులతో వినునది (చక్షుశ్శ్రవము - పాము)

**కనువినుకలి** - కనువినికి (కన్నులవినుకలి)

**కనువినుకలి నెలవు** - పాములకు స్థావరమైనది (పుట్ట, పాతాళము - నాగలోకము)

**కనువినుకలి నెలవుపుట్టు** - పుట్టయందు బుట్టినవాడు (వాల్మీకి - పుట్టపుట్టువు)

**కనువేదురు** - చూచినంత మాత్రముననే వలచి వేదన నొందుట (కనువెఱ్ఱి)

**కన్నులపక్కి** - కన్నులతో గూడిన పురిగల పిట్ట (నెమలి - నట్టువపులుగు)

**కన్నులమ్రాను** - కణుపులు గలచెట్టు (చెరకు)

కన్నుల మ్రాన్విలుకాడు, కన్నుల విల్తుడు - ఇంచు విలుకాడు (మన్మథుడు)

**కన్నులవింటిజోదు** - కణుపులు గల వింటిని ధరించిన యోధుడు (మన్మథుడు)

**కన్నెరికము** - వేశ్య కన్య తొలి సంభోగము, కన్యాత్వము

**కన్య** - మొదటి వయసులో నున్న అవివాహిత

**కన్యాకుబ్జము** - వాయుదేవుని కారణమున కుబ్జలైన కుశనాభుని నూర్గురు కొమార్తెలను బెండ్లాడి వారితో నివసించిన పట్టణము

**కన్యాదానము** - శుల్కము కోరకయే కన్యను వరునికిచ్చి పెండ్లిచేయుట

**కన్యాశుల్కము** - వరుడు కన్య నిమిత్తమై యామె తల్లిదండ్రులకు వెలగా నిచ్చిన ధనము (ఉంకువ)

**కపటము** - బ్రహ్మపదార్థమును గూడ మరుగు పరుచునది

**కపర్దము** - సుఖముచే నిండించునది (శివుని జటాజూటము)

**కపర్ది** - కపర్దము కలవాడు (శివుడు)

**కపాటిఘ్నుడు** - తలుపు పగుల గొట్టువాడు (దొంగ)

**కపాటము** - ప్రవేశించు వారి శిరస్సును ఛేదించునది గాలిని అడ్డగించునది (తలుపు కవాటము)

**కపాలపాణి** - బ్రహ్మయొక్క తలపుఱ్ఱె చేతి యందు కలవాడు (శివుడు - పునుక కప్పెర దాల్పు)

**కపాలభృత్తు** - కపాలమును గేల ధరించిన వాడు (శివుడు)

**కపాలమాలి** - కపాల మాలికలు కలవాడు (శివుడు)

**కపాలము** - శిరస్సును రక్షించునది (తలపుఱ్ఱె), నీటిని కాపాడునది (పాలిక - కుండపెంకు), షోడశ సంధులలో నొకటి - చూ కపాలసంధి

**కపాలమోక్షము** - శవము పుఱ్ఱె దగ్ధమగుట

**కపాల సంధి** - రెండు తెగలకు బాధ్యతలు లాభములు సమానముగా గల సంధి

**కపాలి** - కపాలము భిక్షాపాత్రముగా గలవాడు (శివుడు), బ్రాహ్మణ స్త్రీయందు కైవర్తుని వలన కలిగిన సంకరజాతివాడు

**కపాలిని** - పుఱ్ఱెలు (మాలగా) గలది (కాళి)

**కపింజలము** - కోతివలె చలించునది (వానకోయిల), మనోహరముగా కూయునది (తెల్లతీతువుపిట్ట - శ్వేతతిత్తిరి)

**కపికేతనుడు** - ధ్వజమున కోతి చిహ్నముగా గలవాడు (అర్జునుడు - కపిధ్వజుడు)

**కపిజము** - కోతులు శిలలను త్రవ్వుటచే పుట్టినది (శిలారసము)

**కపిత్థము** - కోతులకు ప్రియమైన దగుటచే అవి యిందు జేరును (వెలగచెట్టు - దధిత్థము)

**కపిత్థాస్యము** - వెలగపండు వంటి మొగము గలది (ఒకజాతి కొండముచ్చు)

**కపిప్రియము** - కోతుల కిష్టమైనది (వెలగ చెట్టు, అంబాళము)

**కపి మార్గము** - కోతి పిల్లలు తమ తల్లి యెచ్చటికి బోయినను విడువక పట్టుకొన్న రీతిగా ఉపాధ్యాయుని శిష్యులు వదలకుండుట (మర్కటకిశోర న్యాయము)

**కపిల** - ఆగ్నేయ దిశయందలి యాడేనుగు, కపిలగోవు

**కపివక్త్రుడు** - పర్వతముని శాపముచే కోతి మొగము కల్గినవాడు (నారదుడు)

**కపిశము** - ఎరుపు నలుపు కలిసిన వన్నె కలది

**కపిశీర్షము** - కోతుల కిష్టమైన అగ్రభాగము (కోటకొమ్మ - దుర్గప్రాకార శిఖరము)

**కపీజ్యము** - కోతులచే కొలువబడునది (పాలచెట్టు)

**కపీష్టము** - కపి ప్రియము (వెలగ, పాలచెట్టు - క్షీరిక)

**కపోత తీర్థము** - కపోత మిథునము వలన బోధితుడై లుబ్ధకుడు ముక్తిపొందిన తీర్థము

**కపోతపాలి(క)** - చూరున నేర్పరువబడిన పావురపుగూడు

**కపోతము** - గాలిని నావగా వాడుకొననది (గువ్వ)

**కపోత వృత్తి** - ముందు కాలమునకు కూడ బెట్టుకొనక ఎప్పటికప్పుడు అవసరమగు దానిని సంపాదించుకొని జీవించుట

**కపోలము** - భక్షించు సమయమున కదలునది (దౌడ)

**కప్పదాటులవేయు** - అచ్చటచ్చట గెంతుచు ప్రక్కలకు దూకెడు కప్పవలె ముందునకు పోవు

**కప్పయెలుగుపాము** - కప్పగొంతుతో అరచుపాము, నోట జిక్కిన కప్ప యరచుటచే భ్రమకలిగించు పాము

**కప్పల తక్కెడ** - కుదురుగా నుండని కప్పలను తూచుటకు బ్రయత్నించిన అవి గెంతుచు తక్కెడను క్రిందకు పైకి ఊగునట్లు చేయును (సాధ్యముకాని, నిలుకడలేని వ్యవహారాదులయందు వాడబడు జాతీయము)

**కప్పగుత్తుక పులుగు** - కంఠమునందు నలుపు (నీలము) గల పక్షి (నీలకంఠము - నెమలి)

**కప్పుగుత్తుకవాడు** - నల్లని కంఠము గలవాడు (శివుడు - నీలకంఠుడు)

**కప్పుటిల్లాలు** - నల్లని స్త్రీ (పార్వతి - కాళి)

**కప్పుటేటిదొంగ** - యమునా నదికి శత్రువైన వాడు (బలరాముడు - హలి)

**కప్పుటైదువు** - నల్లని పుణ్యస్త్రీ (నల్లనైదువ - పార్వతి)

**కప్పుటైదువ పెనిమిటి** - నల్లని స్త్రీయగు పార్వతి యొక్క భర్త (శివుడు - కప్పుటైదువమగడు)

**కప్పు తెరవ** - కప్పుటైదువ (గౌరి)

**కప్పు తెరువుదారి** - నల్లని మార్గము (పొగ) జాడగా గలవాడు (అగ్ని - కృష్ణవర్త్మ)

**కప్పుతెరువ మేటికొమరుడు** - పార్వతి యొక్క ముద్దు కొడుకు (కుమారస్వామి)

**కప్పుదెరువరి** - కప్పు తెరువు దారి (కప్పు ద్రోవరి)

**కప్పుదేవర** - నల్లని దేవుడు (రాముడు, కృష్ణుడు)

**కప్పుదేవర యన్న** -బలరాముడు

**కప్పుముత్తైదువ** - నల్లని రూపము గల సుమంగళి (పార్వతి)

**కప్పుమెడ వలంతి** - కప్పుగుత్తుకవాడు (శివుడు)

**కప్పుమేనిగాము** - నల్లని శరీరముగల గ్రహము (శని)

**కప్పువేలుపు** - కప్పుదేవర

**కఫవిరోధి** - కఫమును బోగొట్టునది (శొంఠి, మిరియాలు)

**కఫారి** - కఫమును తగ్గించునది (శొంఠి, మిరియాలు)

**కఫోణి** - సుకరముగా కదలునది (మోచేయి)

**కబంధము** - శరీరమును నిలుపునది (జలము), నీటిని నిలుపునది (ఉదరము, సముద్రము మొ॥)

**కబరి** - శిరమును జుట్టియుండునది (కొప్పు)

**కమండలువు** - జలమును మధ్యమున ధరించునది

**కమఠము** - నీటియందు నివసించునది (తాబేలు)

**కమఠీదుగ్ధపానము** - ఆడుతాబేలు పాలు ద్రావుట వలె నసంభవమైన దానియందు వాడుక (శశ విషాణము వంటిది)

**కమల** - కమలము హస్తము నందు గలది (లక్ష్మి)

**కమలజన్ముడు** - విష్ణుని నాభి కమలము నందు జన్మించినవాడు (తమ్మిచూలి - బ్రహ్మ) కమలజాతుడు, కమలజుడు, కమలభవుడు - కమలమునందు బుట్టినవాడు (బ్రహ్మ - తమ్మిచూలి)

**కమలనాభుడు** - పద్మము నాభియందు గలవాడు (విష్ణువు)

**కమలము** - జలముచే ధరింపబడునది, నీటిని అలంకరించునది (తామరపువ్వు)

**కమలాకరము** - కమలములకు నిలయ మైనది (కమలవనము - తామరకొలను)

**కమలాక్షుడు** - తామరలవంటి కన్నులు గలవాడు (విష్ణువు)

**కమలాప్తుడు** - పద్మములకు బంధువైనవాడు (సూర్యుడు)

**కమలాలయ** - పద్మము నెలవుగా గలది (లక్ష్మి)

**కమలాసనుడు** - పద్మము పీఠముగా గలవాడు (బ్రహ్మ)

**కమలేశయుడు** - కమలము నందు బండుకొన్నవాడు (బ్రహ్మ)

**కమ్మకత్తి** - పరిమళించెడు కత్తి (పువ్వుబాకు - కుసుమాయుధము)

**కమ్మపంజు** - రత్నములు కూర్చుటచే ప్రకాశించెడు కమ్మ

**కమ్మపిల్లి** - కమ్మని వాసనగల పిల్లి (పునుగుపిల్లి - కస్తురిపిల్లి)

**కమ్మవిలుకాడు, కమ్మవిల్తుడు** - మధురమైన చెరకు విల్లుగా గలవాడు (తియ్య విల్కాడు మన్మధుడు)

**కమ్మవిల్తునిమామ** - మన్మధునకు మామ (చంద్రుడు)

**కయిజీతగాడు** - జీతమునకు కుదిరిన యుద్ధ భటుడు, జీతము తీసికొని పనిచేయు సేవకుడు

**కయిసాటిచుక్క** - చేతి రూపుగల నక్షత్రము (హస్త)

**కయ్యపుదిండి** - కలహము ఆహారముగా గలవాడు (నారదుడు - కలహాశనుడు)

**కయ్యాలకచ్చ** - కలహము స్వభావముగా గలవాడు (జగడాలమారి)

**కయ్యాలమెకము** - కయ్యములు కలిగించెడు మృగము (నక్క - ఆల మెకము)

**కర** - ఒడ్డు, అంచు, అల, వాడియైనది, తీక్ష్ణమైనది, నలుపు, మచ్చ, నల్లనిది

**కరంకము** - జలముచే నింపబడునది (కమండలువు)

**కరక** - వాయువుచేత వెదజల్లబడునది (వడగల్లు)

**కరకంటకము** - చేతికి ముల్లువంటిది (చేతి వ్రేలిగోరు)

**కరకంఠుడు** - నల్లనైన కంఠము కలవాడు (శివుడు)

**కరకంఠుతలమానికము** - శివుని తలపై మాణిక్యము వలె నుండువాడు (చంద్రుడు)

**కరకంఠుతలయేరు** - శివుని శిరమున గల నది (ఆకాశగంగ)

**కరకంఠురాణి** - శివుని భార్య (గౌరి, పార్వతి)

**కరకాంభస్సు** - వడగల్లు వలె చల్లని నీరు కలది (టెంకాయ)

**కరకావృష్టి** - రాతినేలపై వర్షము కురియుట (ప్రయోజన శూన్యము)

**కరగ్రహణము** - చేతిని పట్టుకొనుట (పాణి గ్రహణము) కప్పము పుచ్చుకొనుట

**కరచ్ఛదము** - చేతుల వంటి వెడల్పైన ఆకులు కలది (టేకుచెట్టు)

**కరజము** - చేతి వ్రేళ్ళ యందు మొలచునది (గోరు)

**కరటము** - మదము చిమ్మునది (ఏనుగు చెక్కిలి), కా యని అరుచునది (కాకి)

**కరటి** - పెద్ద గండస్థలము గలది (ఏనుగు)

**కరటుడు** - నాస్తికుడు నింద్య జీవి

**కరణికుడు** - ఊరి లెక్కలు వ్రాయువాడు (గణకుడు)

**కరణుడు** - నాల్గవ జాతి స్త్రీకిని వైశ్యునకును బుట్టినవాడు

**కరతలామలకము** - అరచేతిలోని ఉసిరికవలె అందుబాటులో నున్నది సులభగ్రాహ్యమైనది

**కరతాళము** - చేతులతో వాయించుతాళము

**కరతోయ** - పార్వతీ పరిణయ సందర్భమున జలధారపోయు నప్పుడు శివుని కరమునుండి పుట్టినది (సదానీర)

**కరణత్రాణము** - నేత్రాది ఇంద్రియములను కాపాడునది (శిరస్సు)

**కరదివియ** - చేతితో పట్టుకొనెడు దివిటీ

**కరపత్త్రవంతము** - రంపము వలె నుండెడు ఆకుమట్ట కలది (తాటిచెట్టు - తాళద్రుమము)

**కరపర్ణము** - చేతి వంటి ఆకు కలది (బెండ)

**కరపాలము** - చేతిని పాలించునది (ముప్పది అంగుళములకు మించిన కత్తి - కరవాలము)

**కరపీడనము** - ఇందు వరుడు వధువు యొక్క కరమును గ్రహించును (పెండ్లి)

**కరబదరము** - చేతిలోని రేగువండు వలె అందుబాటులో నున్నదనుట

**కరభదోహనము** - సర్వలక్షణ సంపన్నయగు గోవును విడిచి గాడిదపాలు పితుకుట

**కరభము** - కరమున బ్రకాశించునది మణికట్టు నుండి చిటికెన వ్రేలి మొదటి వరకు గల చేతి వెలుపలి భాగము

**కరభవల్లభము** - ఏనుగు గున్నలకు ఇష్ట మైనది (వెలగ)

**కరభాదని** - కరభములచే తినబడునది (రేగడిదూల - తీటకసింద)

**కరభువు** - చేతి (వ్రేలి) యందు మొలచునది (గోరు)

**కరమరి** - కారాగారమునందు మ్రగ్గువాడు (బంధితుడు)

**కరమర్దము** - తాకుటచే చేతికి దురద కలిగించునది (కలివెచెట్టు)

**కరరుహము** - చేతియందు మొలచునది (గోరు)

**కరవాలము** - చేతియందు వాలము వలె నుండునది (కత్తి)

**కరవాలిక** - రక్షణకై పట్టుకొన్న చిన్న చేతి కఱ్ఱ (కరపాలిక)

**కరవీరము** - కాంతిచే కన్నెచే నొప్పునది (గన్నేరు)

**కరశాఖ** - చేతికి కొమ్మవలె నమరి యుండునది (వ్రేలు)

**కరశీకరము** - ఏనుగు తొండము నుండి చిమ్మబడు మదజలము

**కరశూకము** - చేతికి ముల్లువంటిది (గోరు నఖము)

**కరాపువు** - కారముగల పువ్వు (లవంగము)

**కరారోటము** - చేతియందు బ్రకాశించునది (ఉంగరము)

**కరాళికము** - చాచిన చేతులవంటి కొమ్మలు గలది (చెట్టు), భయంకరమైనది (కత్తి)

**కరి** - కరము (తొండము) గలది (ఏనుగు) నలుపు, నల్లదనము, నల్లనిది

**కరిచేడియ** - నల్లని స్త్రీ - (కాళి)

**కరిజకాయ** - కజ్జికాయ అను భక్ష్యము

**కరిజేజే** - నల్లని దేవుడు (కృష్ణుడు, రాముడు)

**కరిజేజేయన్న** - నల్లని దేవుడగు విష్ణుని యన్న (ఇంద్రుడు)

**కరిదారకము** - ఏనుగును జంపునది (సింహము)

**కరిపక్కము** - కృష్ణపక్షము

**కరిమాచలము** - ఏనుగును గీపెట్టుచున్నది (సింహము)

**కరిమానికము** - ఇంద్రనీలము

**కరిముఖుడు** - ఏనుగు మొగము గల స్వామి (గణపతి)

**కరిమెడదొర** - నల్లనైన కంఠము గలవాడు (శివుడు)

**కరిమేనిదొర** - నల్లని శరీరచ్ఛాయగల ప్రభువు (నల్లనయ్య - విష్ణువు)

**కరివలువప్రోడ** - నల్లని బట్టతాల్చిన నేర్పు కాడు (బలరాముడు)

**కరివేము** - కరివేపాకు చెట్టు

**కరివేల్పు** - నల్లని దేవుడు (యముడు, రాముడు, విష్ణువు)

**కరివేల్పుకొడుకు** - వెన్నుని కుమారుడు (మన్మథుడు)

**కరివేల్పుడాకన్ను** - వెన్ను నెడమ కన్నైనవాడు (చంద్రుడు)

**కరివేల్పు నిల్లాలు** - నల్లని మేని ఛాయ గలవాని పడంతి (వెన్నునిరాణి - లక్ష్మి)

**కరివేల్పురిక్క** - విష్ణు దేవతాకమైన నక్షత్రము (శ్రవణము)

**కరివేల్పు హజ్జ** - విష్ణు దేవుని పాదము

**కరీరము** - మొలచునప్పుడు మట్టిని నెట్టుకొని వచ్చునది (మొలక)

**కరీషంకష** - పేడను ఎండించునది (పెనుగాలి)

**కరుమపుసాకిరి** - కరుమము యొక్క సాకిరి (కర్మసాక్షి - సూర్యుడు)

**కరువలి కడుపరి** - గాలిని తినునది (గాలితిండి - పాము)

**కరువలి కొడుకు** - వాయుదేవుని యొక్క కొడుకు (ఆంజనేయుడు, భీముడు - గాడ్పుచూలి)

**కరువలి చుట్టము** - కరువలి చుట్టముగా కలవాడు (అగ్ని - గాలినెచ్చెలి)

**కరువలి పట్టి** - కరువలి కొడుకు

**కరువలి బలుతొలి జేజే** - గాలి రూపు తాల్చిన రక్కసుడు (తృణావర్తుడు)

**కరువలిమేతరి, కరువలి మేపరి** - గాలిని భక్షించునది (పాము - పడగదారి, బుసపురుగు)

**కరువలి యెర** - గాలి ఆహారముగా గలది (పాము - గాలి తిండి)

**కరేటువు** - నీటిలో ధ్వనించుచుండునది, వృక్షాగ్రముల యందుండి పలుకునది (పెద్ద కొక్కెర)

**కరేణువు** - తొండముతో తలపై దుమ్ము చల్లుకొనునది (ఆడేనుగు - కరిణి)

**కరోటి** - వాయువు నడ్డగించునది (తలపుఱ్ఱె)

**కర్కటకము** - పుట్టునపుడు తల్లిని జంపునది (పీత)

**కర్కరాంధుకము** - మిక్కిలి చీకటిగల పాడునూయి (అంధకూపము)

**కర్కరాటుకము** - పరుషముగా అరచునది (పెద్దకొక్కెర)

**కర్కరి** - జలధారను జార్చునది (కొమ్ము చెంబు), పెనము నుండి అపూపాదులను బయటికి దీయుటకుపకరించునది (అట్లపుల్ల)

**కర్కరేటువు** - కర్క అని అరచునది పెద్దకొక్కెర - కరేటువు

**కర్కారువు** - పండిన పిమ్మట తెల్లదనమును పొందునది (బూడిద గుమ్మడి)

**కర్ణజలూక** - జలగవలె నుండి చెవిలో దూరునది (జెఱ్ఱి)

**కర్ణదర్పణము** - చెవి నద్దమువలె మెరయునది (తాటంకము)

**కర్ణధారుడు** - ఓడ నడపెడు తెడ్డును తాల్చినవాడు (నావికుడు)

**కర్ణదుందుభి** - చెవిలో భేరి వలె శబ్దము పుట్టించునది (జెఱ్ఱి)

**కర్ణపూరకము** - చెవిని కాంతులచే నింపునది

**కర్ణమూలము** - చెవియొక్క మూలము (కర్ణజాహము - గూబ)

**కర్ణవిషము** - కర్ణమునకు విషము వంటిది (కొండెము, దురుపదేశము)

**కర్ణవేష్టము** - దీనిచే చెవి చుట్టబడును (చెవిపోగు)

**కర్ణాకర్ణిక** - రహస్యము ఒక చెవి నుండి మరియొక చెవికి వినబడుచు బట్టబయలగుట

**కర్ణేజపుడు** - జపము చేసెడు వానివలె చెవి యొద్ద అస్పష్టముగా గుసగుసలాడు వాడు (కొండెగాడు)

**కర్ణోత్తంసము** - చెవి యందు ధరింపబడు ఆభరణము (చెవి నగ)

**కర్తరి** - భరణి 4 వ పాదము కృత్తిక 4పాదములు రోహిణి మొదటి పాదము ఈ ఆరు పాదములలో సూర్యుడుండు కాలము (భరణిలో 3,4 పాదములలో సూర్యుడు సంచరించు నప్పుడు డొల్లకర్తరి, కృత్తిక 4 పాదములలో సూర్యుడు సంచరించునప్పుడు అగ్ని కత్తెర)

**కర్పటము** - పారవేయ తగిన చేతిగుడ్డ, మలిన వస్త్రము

**కర్బురము** - లోహములయందు శ్రేష్ఠ మగుటచే దర్పించునది (బంగారము)

**కర్మంది** - కర్మందుడను ఋషి రచించిన సూత్రములను అధ్యయనము చేయువాడు (సన్యాసి)

**కర్మ కీలకుడు** - పనిలో స్తంభము వలె గట్టిగా నిలుచువాడు (చాకలి)

**కర్మచండాలుడు** - కార్యముల చేత చండాలుడైనవాడు (విహిత కర్మములను చేయనివాడు, నీచకర్మలాచరించువాడు)

**కర్మధారయము** - విశేషణమునకు విశేష్యముతో కలుగు సమాసము

**కర్మసచివుడు** - చిల్లర పనుల యందు నియుక్తు డగువాడు

**కర్మసాక్షి** - జీవులు చేసెడు పుణ్యాపాప కర్మలకు సాక్షియైనవాడు (సూర్యుడు, యముడు)

**కఱ్ఱకుట్లు** - శూలమునకు గ్రుచ్చి కాల్చినవి (కరకుట్లు)

**కఱ్ఱినెచ్చెలి** - అర్జునునకు హితుడైనవాడు (శ్రీకృష్ణుడు)

**కఱ్ఱినేస్తి, కఱ్ఱిసంగాతి** - అర్జునునకు మిత్రుడు (శ్రీకృష్ణుడు)

**కర్షకుడు** - భూమిని దున్నువాడు (వ్యవసాయ దారుడు)

**కలకంకము** - బ్రహ్మయంతటి వానిని కూడ విడువక చేరునది (కళంకము)

**కలంబుటము** - జలముపై తేలునది (వెన్న నవనీతము)

**కలకంఠము** - చెవుల కింపైన కంఠ ధ్వని గలది (హంస, కోయిల)

**కలకంఠి** - అవ్యక్త మధురమైన ధ్వని కలది (స్త్రీ, కోయిల)

**కలక్వాణము** - మధురమైన ధ్వని కలది (తుమ్మెద)

**కలఘోషము** - అవ్యక్త మధుర ధ్వని కలది (కోయిల)

**కలజడముడికలాడు** - జటాజూటము తాల్చినవాడు (శివుడు)

**కలధౌతము** - కలుషము పోగొట్టబడినది (బంగారము, వెండి)

**కలనాదము** - అవ్యక్త మధుర ధ్వని కలది (రాజహంస)

**కలని తపసి** - కలహమును గోరునట్టి ముని (నారదుడు)

**కలని తపసి తల్లి** - నారదుని తల్లి (సరస్వతి)

**కలసుదిండి తబిసి** - కలహ భోజనుడు (నారదుడు)

**కలపతాలువు** - వ్యవసాయమునకై నాగేలును

బట్టువాడు (వ్యవసాయు దారుడు, బలరాముడు)

**కలపదారి** - నాగలి ఆయుధముగా గలవాడు (బలరాముడు)

**కలపనగంప** - అబద్ధ ప్రచారము కలది (పుక్కిటి పురాణము), గంపల కొలది లేని మాటలు కల్పించువాడు

**కలభము** - ఉదకమును బొందునది (ఏనుగు గున్న)

**కలయంపి** - కస్తూరి మొదలగునవి కలిపి చిలుకరించెడు నీరు, పేడనీరు

**కలరవము** - అవ్యక్త మధుర ధ్వని, అవ్యక్త మధురమైన ధ్వని గలది (పావురము)

**కలరు** - కలిమి గలవారు (ధనికులు - కలవారు)

**కలవింకము** - ఒయ్యారముగా ఎగురునది సుఖముగా పలుకునది (పిచ్చుక)

**కలశ జన్ముడు** - కలశమందు బుట్టినవాడు (అగస్త్యుడు, ద్రోణుడు)

**కలశము** - ఉదకమును దీసికొనునది (పాత్ర నీటిచే నింపుగా మ్రోయునది )

**కలశాబ్ధి** - అమృత మధనకాలమున తరికుండగా నుపయోగింపబడినది (సముద్రము)

**కలశోదధి** - అమృత మధనమున తరికుండగా చేసికొనబడినది (సముద్రము - కలశపాథోరాశి)

**కలహంస** - బూడిద రంగు రెక్కలు గల హంస

**కలహకంటి** - కలహమునందు కన్నుగల స్త్రీ

**కలహప్రియ** - కలహమునందు కన్నుగల యాడుది

**కలహకంఠి** - కలహము ప్రియమైన పక్షి (గోరువంక శారిక)

**కలహాంతరిత** - ఎదుట ప్రియునితో కలహించి వియోగము వచ్చిన పిమ్మట పరితాపము నొందు నాయిక

**కలహాశనుడు** - పోరుదిండి నారదుడు

**కలాంకురము** - అవ్యక్త మధుర ధ్వని కలది (బెగ్గురుపక్షి)

**కలాదుడు** - దేవతలకు కళలను ఆహారముగా ఇచ్చువాడు (చంద్రుడు)

**కలాపి** - కలాపము కలది (నెమలి)

**కలాపుడు** - నేర్పుకలవాడు (చంద్రుడు)

**కలావికము** - లెస్సగా కూయునది (కోడి)

**కలాహకము** - మనోహరముగా మ్రోయునది (బాకా)

**కలింజము** - గాలిని నిరోధించునది (బాకా వ్రేలాడగట్టిన తడిక) చాప

**కలికారుడు** - కలహము కల్గించువాడు (నారదుడు)

**కలికి తలిరుబోడి** - చిగురువలె మెత్తని మేను గలది (చిగురుబోడి)

**కలిద్రుమము** - నలమహారాజు నావహించుటకు ముందు కలి నివసించిన చెట్టు (తాండ్రచెట్టు)

**కలిపడగ** - కలిమి కలవారు ఉత్సవాదులందు తమ యిండ్లపై ఎత్తు జెండా (కల్వడగ)

**కలిమికొండ** - సిరిగుబ్బలి (శ్రీశైలము)

**కలిమితొయ్యలి** - సంపదలకు అధిష్ఠాన దేవత (కలిమికలికి - లక్ష్మీదేవి)

**కలిమివెలది కోడలు** - లక్ష్మీదేవికి కోడలు (సరస్వతి)

**కలుముల గరిత** - కలిమి తొయ్యలి

**కలుముల గరిత బిడ్డ** - లచ్చి కొడుకు (మన్మథుడు)

**కలుముల జవరాలు** - సంపదలకు అధిష్ఠాన దేవతయగు స్త్రీ (లక్ష్మి)

**కలుములపైదలికోడలు** - లక్ష్మీదేవి యొక్క కోడలు (సరస్వతి)

**కలువకంటి** - కలువరేకుల వంటి కన్నులు గల యాడుది

**కలువగొంగ** - కలువ పూవునకు విరోధి (సూర్యుడు)

**కలువనేస్తి** - కలువ మిత్రము (చంద్రుడు)

**కలువ(ల) దొర, కలువ(ల) రాయుడు, కలువ(ల) రేడు** - కలువలకు రాజు (చంద్రుడు)

**కలువ విందు**- కలువలకు చుట్టము (చంద్రుడు - కలువచెలి)

**కలువ(ల) సూడు** - కలువలకు విరోధి (కలువదాయ - సూర్యుడు)

**కల్పతరువు** - కోర్కెలు తీర్చెడు దేవతా వృక్షము

**కల్పము** - ఉత్పత్తి నాశనములను కల్పించునది

**కల్పవృక్షము** - కోర్కెల దీర్చు దేవతరువు

**కల్మాషకంఠుడు** - నల్లని కంఠము గలవాడు

**కల్లోలము** - నీటిని చలింప జేయునది (పెద్దయల)

**కల్లోలిని** - అలలు గలది (నది)

**కల్వల దొరదారి** - చంద్రుని తలపై దాల్చిన వాడు (శివుడు)

**కల్వలరేని తోడు** - కలువరాయని తోబుట్టువు (లక్ష్మి)

**కళంకము** - కలంకము

**కళత్రము** - వీర్యసేకమునకు తగినది (భార్య - కలత్రము)

**కళాదుడు** - దేవతలకు తన కళలను ఆహారముగా నిచ్చువాడు (చంద్రుడు), నగచేయుట కిచ్చిన బంగారములో కొంతకాజేయు వాడు (కలాదుడు కంసాలి)

**కళానిధి** - షోడశ కళలకు సాధనమైనవాడు (కలానిధి - చంద్రుడు)

**కళాశాల** - కళలను బోధించు గృహము

**కవపుల్గుదాయ** - జక్కవలకు శత్రువైన వాడు ((చంద్రుడు - జక్కవలగొంగ) చక్రవాక మిథునము చీకటి పడినది మొదలుకొని తెల్లవారు వరకు కన్నులు కనబడక పోవుటచే గొప్పవియోగ బాధ ననుభవించుచుండును )

**కవాటము** - గాలిని అడ్డగించునది (కపాటము తలుపు)

**కవుచుముచ్చు, కవుచుమేపరి** - మాంసము దినువాడు (కవుచుమేతరి - రాక్షసుడు)

**కవేరకన్య**-కవేరుడను రాజర్షి కూతురు (కావేరి నది)

**కవేరజ** - కవేరుడను ముని యొక్క పుత్రిక యగునది (కవేరకన్య - కావేరి)

**కవోష్ణము** - కొంచెము వేడి గలది (కదుష్ణము గోరువెచ్చన)

**కవ్యము** - పితృ దేవతల కీయదగిన యన్నము

**కవ్యవాహనుడు** - కవ్యమును గొని పోవువాడు (అగ్ని)

**కవ్వడి** - ఇరుగేలను బాణప్రయోగ నైపుణ్యము కలవాడు (అర్జునుడు - సవ్యసాచి)

**కవ్వపుగట్టు, కవ్వపుమల** - క్షీరసాగర మథనమున కవ్వము చేసికొనబడిన కొండ (కవ్వపు గొండ - మంథాద్రి - తరిగొండ)

**కవ్వపు మలతరిత్రాడు** - మందర పర్వతమునకు గవ్వపు త్రాడైనవాడు (వాసుకి)

**కవ్వపుమల దాల్పు** - మందర పర్వతమును మూపు పై ధరించినవాడు (తరిగట్టు మోపరి - కూర్మరూప విష్ణువు)

**కషాయము** - కంఠమును ఒరయునది

**కహ్లారము** - నీట బ్రకాశించునది (సౌగంధికము)

**కహ్వము** - నీటియందు పలుకునది (వక్కుకొంగ - బకము)

**కాంచనగిరి** - మేరు పర్వతము (బంగారుకొండ - హేమాద్రి)

**కాంచని** - బంగారు వర్ణము గలది (పసుపు)

**కాండపృష్ఠుడు** - ఆయుధములచే బ్రదుకువాడు (శస్త్రజీవి), పెంచుకొన్న కుమారుడు (దత్తపుత్రుడు)

**కాండరుహా** - కనుపున బుట్టినది (కటుక రోహిణి చెట్టు)

**కాండవారిణి** - వగతుర బాణములను వారించునది (దుర్గ)

**కాండీరుడు** విల్లమ్ములను చేతబట్టినవాడు (ధానుష్కుడు)

**కాంతారము** - ఎవ్వరి చేతను దరింప శక్యము కానిది (అడవి)

**కాంతిదము** - కాంతి నిచ్చునది (నేయి - ఘృతము)

**కాందిశీకుడు** - శత్రు బయముచే దిక్కులు తెలియక పారినవాడు

**కాంభోజి** - సాయంకాలము 6 నుండి 9 గం॥ వరకు పాడదగిన స్త్రీ రాగము

**కాంస్యకారుడు** - కంచు పాత్రలు చేయువాడు (కంచరి)

**కాకచించ** - కొంత భాగమున నలుపు రంగు కలది (గురి వెంద)

**కాకతాళీయము** - కాకి తాటి చెట్టుపై వ్రాలుటయు తాటిపండు పడుటయు ఒకే కాలమున జరుగునట్టి విధము (ఆకస్మిక సంభవము)

**కాకతుండఫల** - కాకి ముక్కువంటి పండ్లు కలది (కాకిదొండ)

**కాకత్రోటి బింబోదాహరణము** - వికృతాకారునకు అనమాన సౌందర్యవతిని గూర్చుట కాకి ముక్కునకు దొండపండు గట్టుట వంటిది (అనమానరూపవస్తు నమ్మేళనమునందు వాడబడునది)

**కాకదంతగవేషణము, కాకదంతపరీక్ష** - కాకికి దంతములెన్ని అవి ఎట్టివి అను అవివేక ప్రశ్నములతో గూడిన వ్యర్థ పరీక్ష

**కాకపుష్టము** - కాకులచే పోషింపబడునది (కోయిల)

**కాకయు** - కా యని యరచునది (కాకి - గుమికాడు)

**కాకరుత భీరువు** - పగలు కాకి కూత విని భీతిల్లి భర్తను కౌగిలించుకొను రమణి రాత్రులందు విటుని కొరకు మొసళ్ళ కాహారము వేయుచు నగుదా నది యావలి ఒడ్డు జేరిన రీతి (కాకి కూతకు భయపడు నాడుది)

**కాకలయు** - కొంచెము చెడ్డ ధ్వని కలది (మాలకాకి)

**కాకలి** - సూక్ష్మమగు అవ్యక్త మధుర నాదము

**కాకలీరవము** - సన్నమైన అవ్యక్త మధుర ధ్వని కలది (కోయిల)

**కాక వంధ్య** - కాకి వలెనే ఇరువురు బిడ్డలను మాత్రమే కని గొడ్రాలయిన స్త్రీ

**కాకవెలుగు** - వెచ్చని కాంతి గలవాడు (సూర్యుడు)

**కాకాక్షి** - రెండు వైపులలో అవసరమును బట్టి ఏ ప్రక్కకైనను నొరగి చూడగల కాకిచూపు

**కాకాధికరణము** - దేవదత్తుని యిల్లు ఏది అని యడుగగా కాకి వ్రాలిన యిల్లే అని సమాధానమిచ్చుట

**కాకిదొండ** - కాకి ముక్కు వంటి పండ్లు గలదొండ (కాకాంగి)

**కాకిపెంపుడు** - కాకిచే పెంచబడునది (కోయిల)

**కాకుదము** - కాకువను ధ్వని విశేషము నిచ్చునది (దౌడ)

**కాకేందువు** - కాకికి ప్రియమైనది (కాకి తుమ్మికి)

**కాకేష్టము** - కాకులకు ఇష్టమైన పండ్లు కలది (వేపచెట్టు)

**కాకోదరము** - కుటిల గమనము గల ఉదరము కలది, వంకరగా ఉదరముతో నడచునది, కాకిపొట్ట వంటి పొట్ట గలది (పాము)

**కాకోలము** - చపలములై తిరుగునవి (పాము, పంది, కాకి) కొలదిగా గలిసి యంతటను వ్యాపించునది కాకి వలె నల్లని యాకారము గలది (విషము)

**కాకోలూకిక** - కాకికిని గ్రుడ్లగూబకును గల పరస్పర సహజ వైరానుబంధము

**కాకోలూకనిశాక్రమము** - కాకికి పగలుగా నుండు కాలము గూబకు రాత్రిగా నుండుననుట

**కాక్వాక్షిప్తము** - కాకు స్వరముచే వ్యంగ్య మూహింప బడుట (ఒకానొక కావ్యవిశేషము - ధ్వని)

**కాగము** - కా యని అరచునది (కాకి - వాయసము)

**కాచండి** - దృఢమై మూతి సన్నగా నున్నపాత్ర

**కాచుమేపరి** - మాంసము తినువాడు (రాక్షసుడు పొలదిండి)

**కాటము** - ఇందు నీ రుండును (నూయి)

**కాటిపాపలు** - కాటికాపరులై జీవించుచు గారడి విద్యవంటి తమాషా విద్యలను ప్రదర్శించు మహాకాళి భక్తులు

**కాట్రేడు** - శ్మశానమునకు ప్రభువు (శివుడు - కాటిరేడు)

**కాతరము** - జలముపై కొంచెముగా దిరుగునది (ఒకజాతిచేప)

**కాతరుడు** - భీరువగుటచే కార్యమున కొంచెము తరించువాడు (పిరికివాడు)

**కాత్యాయని** - మోక్షమార్గము లెన్నియని విచారించు కత్యముని గోత్రమున పుట్టినది (పార్వతి), సగము వయసు చెల్లి కాషాయ వస్త్రములు గట్టిన వితంతువు, యాజ్ఞవల్క్యుని చిన్న భార్య

**కాదంబము** - తనజాతి సంఘముతో గూడియుం డునది (హంస)

**కాదంబరి** - కడిమి చెట్టు తొఱ్ఱలో బుట్టునది (కడిమికల్లు)

**కాదంబిని** - ఇది కలిగినపుడు కదంబ వృక్షములు పుష్పించును (మేఘమాల)

**కాద్రవేయులు** - కశ్యపునకు గద్రువ యందు బుట్టిన సంతానము (నాగులు)

**కాననౌకసము** - అడవి నివాస స్థానముగా గలది (కోతి)

**కానరానడుగుల మేటి** - కనపడని యడుగులు గలవానిలో గొప్పది (పాము - కరువలిమేపరి)

**కానరాని కాళ్ళయది** - అగపడని పాదములు కలది (పాము - గూఢపాత్తు)

**కానినేయుడు** - కన్యకు బుట్టిన వాడు (కర్ణుడు, వ్యాసుడు)

**కానీనుడు** - కన్యకు బుట్టినవాడు (కర్ణుడు, వ్యాసుడు)

**కాపికుడు** - కోతివలె నున్నవాడు

**కాపిశాయనము** - బండిగురివెంద పూల నుండి తీయబడినది (కల్లు)

**కాపురుషుడు** - కుత్సిత పురుషుడు

**కాపోతము** - పావురముల గుంపు

**కామగ** - ఇచ్ఛవచ్చునట్లు తిరుగునది (జారిణి)

**కామచారి** - తన ఇచ్ఛ వచ్చినట్లు తిరుగు వాడు (కాముకుడు, గరుడుడు)

**కామజానము** - కామమును పుట్టించునది (కోకిల)

**కామజిత్తు** - ఇంద్రియ నిగ్రహముచే మన్మథుని జయించినవాడు (శివుడు, కుమారస్వామి)

**కామతాలము** - కామ వికారమును కల్గించునది (కోయిల)

**కామద** - కోరికల నిచ్చునది (కామధేనువు - కామదుహము)

**కామదుఘ** - ఇష్టార్థములను పితుకునది (కామద - సురభి)

**కామదేవుడు** - కామమును బుట్టించెడు దేవుడు (మన్మథుడు)

**కామధేనువు** - కోరిన వస్తువుల నిచ్చెడి దేవతల యావు

**కామపాలుడు** - భక్తుల కోర్కులను దీర్చువాడు, కాముని (మన్మథుని) బాలించువాడు (బల రాముడు, విష్ణువు)

**కామరూపి** - తన యిచ్ఛవచ్చిన రూపమును బొందు వాడు (విద్యాధరుడు, రాక్షసుడు)

**కామవరపుజీడి** - అంటుకొనినచో వదలనిది

**కామవల్లభ** - కాముడు భర్తగా గలది(రతిదేవి)

**కామసువు** - కోర్కెలనీనునది, మన్మథుని అవతారమైన ప్రద్యుమ్నుని (కన్నది = రుక్మిణి) కన్నవాడు (కృష్ణుడు)

**కామవల్లభుడు** - కాముునకు ఇష్టుడగు వాడు (చంద్రుడు)

**కామాంకుశము** - మన్మథున కంకుశమైనది (గోరు, మగగురి)

**కామాంధము** - కామోద్రేకమున గ్రుడ్డియైనది (కోయిల)

**కామాయువు** - కోరికొన్నంత ఆయువు కలవాడు (గరుడుడు)

**కామారి** - మన్మథుని శత్రువు (శివుడు)

**కాముక** - సంభోగముగాక ఇతరములగు ధనాదులు

**కాముకి** - సంభోగేచ్ఛగల యాడునది

**కాముడు** - స్త్రీని గోరునట్లు చేయువాడు (మన్మ థుడు)

**కామేశ్వరుడు** - కోరికలు తీర్చెడి దేవుడు (శివుడు)

**కాయకంటి** - పాపాచరణముచే కంటి యందు కాయకాచిన వాడు (కుబేరుడు)

**కాయకన్నేటి** - కాయకాచిన కన్నులుగల గొప్పవాడు (కుబేరుడు)

**కాయచికిత్స** - శరీరమునకు కల్గు జ్వరాదులకు చేయు ఆయుర్వేద చికిత్స

**కాయజలము** - శరీరమునుండి వెలువడు నీరు (మూత్రము)

**కాయజుడు** - శరీరమున బుట్టువాడు (మన్మథుడు)

**కాయము** - అన్నాదులచే వృద్ధి పొందునది (దేహము)

**కారండవము** - పంజరమును పొందియుం డునది (కన్నెలేడిపిట్ట)

**కారకదీపకము** - ఒకే కర్త పెక్కు క్రియలతో అన్వయించినట్లు వర్ణింపబడుట (ఉదా -

పాంథుడు పోవును మరల వచ్చును నిట్టూర్పు పుచ్చును - ఒక అర్థాలంకారము)

**కారణకారణము** - సృష్టి కారణమునకు కారణ మైనది (పరబ్రహ్మము)

**కారణమాల** - ఉత్తరోత్తరములకు క్రమముగా పూర్వపూర్వములు కారణములయినట్లుగాని, పూర్వ పూర్వములకు ఉత్తరోత్తరములు కారణ ములయినట్లుగా గాని చెప్పబడినది (ఉదా నీతిచేత సంపద, సంపదచేత త్యాగము, త్యాగ ముచేత యశము కలుగును)

**కారవము** - కా యను ధ్వని కలది (కాకి)

**కారణ శరీరము** - సూక్ష్మ శరీరమునకు మూలమై మరియొక దేహము నిచ్చుటకు హేతువగునది (కారణ శరీరము గూడ తొలగిన గాని ముక్తి కలుగదు - వేదాంతము)

**కారాగారము** - చెరపెట్టుటకై యేర్పరుప బడిన గృహము (కారాగృహము - చెరసాల)

**కారాగుప్తుడు** - చెరసాల యందు బంధింప బడినవాడు (బంది)

**కారుకొమ్ముల మెకము** - దట్టమైన కొమ్ములు గల మెకము (దుప్పి - సాంద్రశృంగ మృగము)

**కార్ణము** - చెవికి సంబంధించినది (చెవి గులిమి)

**కార్తవీర్యుడు** - కృతవీర్యుని కుమారుడు (కార్తవీర్యార్జునుడు)

**కార్తస్వరము** - కృతస్వరమను గనియందు బుట్టునది (బంగారము)

**కార్తాంతికుడు** - జ్యోతిష శాస్త్రము ననుసరించి ఆగతానాగతములను దెల్పు వాడు (దైవజ్ఞుడు)

**కార్తికము** - కృత్తికా నక్షత్రయుక్త పూర్ణిమ గల మాసము (కార్తికికము)

**కార్తికేయుడు** - షట్కృత్తికల కుమారుడు (కుమార స్వామి)

**కార్పటికుడు** - చింపి కావి గుడ్డలు కట్టుకొనువాడు (కోమటి - వైశ్యుడు)

**కార్ముకము** - కర్మకారునిచే జేయబడినది (ధనుస్సు)

**కార్ష్ణము** - కృష్ణ మృగమునకు సంబంధించినది (కృష్ణాజినము)

**కాలకంటకము** - నల్లని రోమరాజి కలది (భరత పక్షి)

**కాలకంఠము** - కంఠమున నలుపు గలది, నల్లని కంఠము కలది (నెమలి, కాటుకపిట్ట)

**కాలకంఠుడు** - హాలాహలమును మ్రింగుటచే నల్లనైన కంఠము గలవాడు (శివుడు)

**కాలకము** - తానావరించిన స్థలమును నల్లగాజేయునది (పుట్టుమచ్చ), కంటి యందలి నల్లగ్రుడ్డు

**కాలకాలుడు** - అంతకాంతకుడు (పరమేశ్వరుడు)

**కాలకూటము** - నీల వర్ణమునకు స్థానమైనది, కాలుని సయితము పీడించునది (విషము)

**కాలకృత్తు** - కాలము తెలుపువాడు (సూర్యుడు)

**కాలకేయులు** - కలకయందు మారీచునకు గలిగిన దానవ సంతతి

**కాలజ్ఞపత్త్రి** - కాలము నెరిగిన పక్షి (కోడి)

**కాలజ్ఞము, కాలజ్ఞాని** - కాలమును గుర్తించునది (కోడి)

**కాలజ్ఞుడు** - కాలమును దెలిసినవాడు (జ్యోతిష్కుడు)

**కాలనేమిజపము** - రామకార్యార్థియై పోవు చున్న హనుమంతుని కాలనేమి ముని రూపమున మోసగించిన విధముగా ఒకరిని మోసగించుటకు చేయు కృత్రిమ నటనము

**కాలపృష్ఠము** - నల్లని పృష్ఠము కలది (కొండ ముచ్చు)

**కాలశేయము** - కలశమందు మథింపబడిన పిమ్మట దయారగునది (మజ్జిగ)

**కాలసూత్రము** - ఇనుప తంతులు గల నరకము కాలుని యొక్క పాశము వంటిది (కాలపాశము)

**కాలస్కంధము** - నల్లని మొదలు కలది (తుమికి చెట్టు, చీకటిమ్రాను)

**కాలహారుడు** - కాలుని = మృత్యువును జయించినవాడు (శివుడు)

**కాలాండజము** - నల్లని పిట్ట (కోయిల)

**కాలిపుట్టువు** - పరబ్రహ్మ పాదమున బుట్టిన వాడు (శూద్రుడు - పాదజుడు)

**కాలీకము** - చేపలను పట్టుటకు నీటియందు బాణమువలె కదలక ఉండునది (కొంగ)

**కాలుడు** - ఆయుర్దాయమును, ధర్మాధర్మములను గణుతించువాడు (యముడు)

**కాళరాత్రి** - ప్రళయ కాలపురాత్రి

**కాళింగము** - కళింగ దేశ సంబంధమైనది

**కాళింది** - కళింద పర్వతమున పుట్టినది (యమునానది), శ్రీకృష్ణుని అష్టమహిషులలో నొకతె

**కాళిందీభేదనుడు** - నాగలిచే యమునా నదిని చీల్చిన వాడు (బలరాముడు - హలాయుధుడు)

**కాళి** -చండముండాసురులపై దర్పించుటచే నల్లనైన చండిక ముఖము నందుండి ఖడ్గహస్తయై పుట్టినదేవి

**కావిగోచిదారి** - కావి వర్ణము గల గోచిని ధరించువాడు (సన్న్యాసి)

**కావితాలుపు** - కాషాయ వర్ణము గల వస్త్రమును ధరించువాడు (సన్న్యాసి)

**కావేరి** - కవేరుడను రాజర్షి కూతురు (కవేరపుత్రి - ఒకనది)

**కావ్యము** - కవి యొక్క కర్మము (గ్రంధము)

**కావ్య లింగము** - సమర్థింప వలసిన యర్థమునకు సమర్థనమును జెప్పుట (ఉదా:- మదనుడు నాచే జయింపబడెను నా చిత్తమున శివుడున్నాడు- ఒకానొక అర్థాలంకారము)

**కావ్యార్థాపత్తి** - కైముత్యముచేత అర్థసంసిద్ధి (కిముత శబ్దభావము కైముత్యము = కిముత యనగా మిక్కిలి - ఒక ఉత్కృష్ట వస్తువే సాధింపబడగా తక్కువ వస్తువు సాధింపబడుట యేమంత గొప్ప కాదనుట ఉదా - ఓ ప్రేయసీ! నీ ముఖముచే నా చంద్రుడే జయింవ బడుచుండగా పద్మముల మాట వేరుగ జెప్ప నేల)

**కావ్యుడు** - కవి యొక్క పుత్రుడు (శుక్రుడు)

**కాశ్మీర జన్మము** - కాశ్మీర దేశమున పుట్టునది (కాశ్మీరజ - కుంకుమపువ్వు)

**కాశ్మీరము** - కాశ్మీర దేశ సంబంధమైనది

**కాశ్మీర్యము** - కాశ్మీర దేశమున కలిగినది (కుంకుమ పువ్వు)

**కాశ్యపము** - కాశ్యము (మద్యము) త్రాగుటకు పూర్వము తినునది (ఇది తిని కల్లుత్రావుదురు - మాంసము)

**కాశ్యపి** - ఇరువది యొక్క మారులు క్షత్రియులను వధించిన పరశురామునిచే కశ్యపునకు దానముగా నీయబడినది (భూమి)

**కాశ్యపేయుడు** - కాశ్యపి (కశ్యపుని భార్య) యొక్క

సంతానము (సూర్యుడు, అనూరుడు, గరుడుడు, నాగులు, వేల్పు, రాక్షసుడు)

**కాష్ఠ కీటము** - కొయ్య తొలచి గుల్లచేయు పురుగు (కొయ్యపురుగు)

**కాష్ఠతక్షకుడు** - కొయ్యను చెక్కువాడు (వడ్రంగి - వర్ధకి)

**కాష్ఠమరి** - పీనుగును కాల్చుటకు మరమువలె కట్టెలతో పేర్చినది (చితి)

**కాష్ఠము** - అగ్ని దీనిచే వెలుగొందును (కఱ్ఱ, కొయ్య)

**కాష్ఠమౌనము** - రాట (రాడు - గుంజ) వలె సంజ్ఞలు కూడలేని మౌనము

**కాష్ఠికుడు** - కఱ్ఱల మోపరి

**కాసఘ్నము, కాసఘ్ని** - దగ్గును హరించునది (వాకుడుచెట్టు)

**కాసము** - కుత్సితముగా ధ్వని చేయునది, దీనిచే వ్యక్తి పీడింపబడును (దగ్గు)

**కాసరము** - నీటిలో విహరించునది గొప్ప శరీరము కలదగుటచే మెల్లగా బోవునది (నడచునది) (దున్న)

**కాసారము** - కొంచెము జలము కలది, జలము దీనిని పొందును, జలమిందు బ్రవేశించును గావున మోయునది (సరస్సు - కోనేరు)

**కాసుకు గాకపోవు** - దమ్మిడీ విలువైన చేయక (దండుగయగు) పాడగు (రూకకు గాకపోవు)

**కాసెవాడు** - రాతిపని చేయువాడు (కాస్యవాడు)

**కాహలము** - కొంటెగా నేలను గీకునది (పిల్లి, కోడి)

**కాహలి** - సుఖమునిచ్చునది (బాకా) (బాకా - కాళె)

**కాహళికుడు** - కాహళి ఊదువాడు (కాళకాడు)

**కింకరుడు** - స్వామికి సంబంధించిన యే పనియైన జేయువాడు (బంటు)

**కింకిణి** - కొంచెముగా మ్రోయునది (చిరుగంట, గజ్జె)

**కింకిరాతము** - దానిమ్మ గింజలు, చిగుళ్ళు మున్నగు ఎరుపు రంగు గల ద్రవ్యములను గూర్చి తిరుగునది (చిలుక, కోయిల)

**కింక్షణుడు** - ఒక క్షణము పోయిన నేమని యోచించువాడు (సోమరి)

**కించులకము** - ఇంచుకంత కదలునది (ఎఱ్ఱ, వానపాము, కించిలికము)

**కింజల్కము** - ఇంచుకంత జడయై యుండునది (కేసరము - అకరువు)

**కింపచుడు** - కొంచెము వండుకొనెడివాడు (లోభి)

**కింపురుషుడు** - అశ్వ ముఖమును నరశరీరమును గల దేవయోని విశేషము, కుత్సిత పురుషుడు

**కింవదంతి** - జను లాడుకొను సత్యాసత్య రూప మగుమాట

**కింశుకము** - చిలుకముక్కువంటి పువ్వులు గలది (మోదుగ)

**కికిదివి, కికీదివి** - కికియను శబ్దము చేయుచు ప్రకాశించునది (పాలపిట్ట, కికొదివి)

**కిటి** - ఇష్టము వచ్చినట్లు చరించునది. (పంది)

**కితవుడు** - జూదమాడదలచిన వానిని నీవద్ద యెంత కలదని అడుగువాడు (జూదరి)

**కిత్తికంటివలతి** - అగ్నిరూపమైన మూడవ కన్నుగల ప్రభువు (శివుడు - చిచ్చరకంటి)

**కిన్నరకంఠి** - కిన్నరుని స్వరము వంటి కంఠ ధ్వని కలది (స్త్రీ)

**కిన్నరుడు** - కొంచెము నరాకారము గలవాడు

**కిన్నరేశుడు**- కిన్నరులకు ప్రభువు(కుబేరుడు)

**కిరణమాలి** - కిరణములు మాలలుగా గలవాడు (సూర్యుడు)

**కిరణము** - ప్రపంచమంతటను వెదజల్ల బడునది (వెలుగు)

**కిరాతుడు** - మ్లేచ్ఛ జాతులలో నెమలి పింఛము మొదలయినవి ధరించువాడు (చండాలుడు)

**కిరీటి** - కిరీటము కలది (కోడి - తామ్రచూడము), కిరీటము కలవాడు (అర్జునుడు)

**కిలికించితము** - కోపము, భయము, ఆనందము కన్నీరులతో గూడిన స్త్రీల శృంగార చేష్టా విశేషము

**కిల్బిషము** - నరకమున ద్రోయునది, విషయ భోగములందు ప్రవర్తింప జేయునది (పాపము)

**కిశోరుడు** - ఎల్లప్పుడును యౌవనావస్థ కలిగి యుండువాడు (సూర్యుడు)

**కిసలము, కిసలయము** - కొంచెముగా కదలు (ఊగు) నది (చిగురాకు - పల్లవము)

**కిష్కుపర్వము** - జేనెడు, మూరెడు దూరమున కొక్క కనుపు కలది (చెరకుగడ, వెదురుచెట్టు)

**కీకటారణ్యము** - కీకట దేశమునందలి యరణ్యము (దట్టమైన అడవి - కీకారణ్యము)

**కీకసాస్యము** - ఎముక వంటి ముక్కు కలది (పక్షి)

**కీచకము** - గాలి తాకున కీ యని మ్రోగునది (బొంగువెదురు)

**కీటజము** - పట్టుపురుగు నుండి వచ్చినది (పట్టు, కౌశేయము)

**కీటభృంగము** - తుమ్మెదచే పట్టుకొనబడిన పురుగు భయముచే నా తుమ్మెదనే నిరంతరము ధ్యానించుచుండుటచే తుమ్మెదగా మారుట (భ్రమరకీట న్యాయము)

**కీటమణి** - మణివలె ప్రకాశించు పురుగు (మిడుగురుపురుగు)

**కీరము** - కీ యను శబ్దమును చేయునది (చిలుక)

**కీర్తి** - కొనియాడబడునది (యశము)

**కీలాలజము** - నెత్తురు వలన తయారగునది (మాంసము)

**కీలాలపుడు** - నెత్తురు త్రాగువాడు (రాక్షసుడు)

**కీలాలము** - అగ్ని జ్వాలలను అర్పునది (జలము), ప్రతి బంధముచే వారింపబడునది (నెత్తురు, పశువు)

**కీశపర్ణి** - కోతి వెండ్రుకల వంటి ఆకులు కలది (ఉత్తరేను చెట్టు)

**కీశము** - వాయుపుత్త్రుడగు హనుమంతుడు ప్రభువుగా గలది (కోతి - మర్కటము)

**కీశుడు** - కాలమునకు ప్రకాశమునకు ప్రభువైనవాడు (సూర్యుడు)

**కుంచఫల** - ముడుచుకొన్నట్లుండెడు గుండ్రని ఫలము కలది (గుమ్మడి)

**కుంజరము** - (కుంజము = ఏనుగు కుంభ స్థలము) కుంభ స్థలమునకు దిగువను గుంతలు కలది, మేలైన చెక్కిలి పై భాగము గలది, మేలైన దంతములు కలది (ఏనుగు)

**కుంజరారి** - గజాసురుని సంహరించిన వాడు (శివుడు)

**కుంజరాశనము** - ఏనుగుల కాహారమైనది (రావిచెట్టు)

**కుంటిగడపరి** - కుంటి వాడగు రథసారథి (అనూరుడు), అనూరుడు సారథిగా గలవాడు (సూర్యుడు)

**కుంటిగాము** - కుంటి గ్రహము (శనిగ్రహము)

**కుండకీటుడు** - చెడి పోయిన బ్రాహ్మణ స్త్రీ కుమారుడు, దాసిని గామించినవాడు

**కుండకుడు** - భర్త జీవించి యుండగా రంకుమగని వల్ల కలిగినవాడు

**కుండమార్పు** - ఒకటి యిచ్చి మరియొకటి పుచ్చుకొనుట (వినిమయము) తన కుటుంబపు పిల్లనిచ్చి వారి పిల్లను తన యింటి కోడలిగా జేసికొనుట (కుండమార్పు పెండ్లి)

**కుండము** - అగ్ని యిందు కాపాడబడును (హోమకుండము), దేవతలచే సిద్ధపరుపబడిన జలాశయము (తీర్థకుండము)

**కుండలి** - కుండలాకార శరీరము కలది (సర్పము)

**కుండవీనులజోదు** - కడవల వంటి చెవులు గల యోధుడు (కుంభకర్ణుడు)

**కుండుడు** - భర్త జీవించి యుండగా రంకుమగని వలన బుట్టినవాడు

**కుందారము** - భూమిని ద్రవ్వునది (పంది)

**కుందుడు** - భూమిని కాశ్యపునకు దానముగా నిచ్చినవాడు (విష్ణువు)

**కుందేటి తాల్పు** - కుందేటిని తాల్చినవాడు (చంద్రుడు)

**కుంభకర్ణుడు** - ఏనుగు యొక్క కుంభస్థల ప్రమాణములగు చెవులు గలవాడు (రావణుని తమ్ముడు)

**కుంభకారుడు** - కడవలను జేయువాడు (కుమ్మరి)

**కుంభజుడు** - కుంభసంభవుడు (అగస్త్యుడు)

**కుంభపాదుడు** - కుండవంటి కాలు గలవాడు (బోదకాలివాడు)

**కుంభసంభవుడు** - కుంభమున బుట్టినవాడు (వసిష్ఠుడు, ద్రోణుడు, అగస్త్యుడు)

**కుంభీనసము** - కుండ వంటి నాసిక కలది (పాము)

**కుంభీరము** - నీటియందు ఏనుగులనైనను పట్టగలది (మొసలి)

**కుంభీరుడు** - ద్రవ్య భాండమును పట్టుకొని పోవువాడు (కుంభీలు - దొంగ)

**కుకరుడు** - ఈచవోయిన చేతులు కలవాడు (కుణి)

**కుకవి** - పద, వాక్య, అర్థ గతదోషములతో కావ్య గౌరవమును జెరచునట్టి కవిత్వము చెప్పువాడు

**కుకీలము** - భూమికి చీలవంటిది (కొండ)

**కుకురము** - 'కు' అని మొరుగునది (కుక్క)

**కుకూటి** - భూమికి శిఖరమువలె నుండునది (బూరుగుచెట్టు)

**కుక్కమూతి పిందె** - చెట్టు కావు పూర్తియగు సమయమున పుట్టెడు వంకపిందె

**కుక్కుటధ్వజుడు** - కోడి రూపమున చిహ్నితమైన జెండా కలవాడు (కుమారస్వామి)

**కుక్కుటము** - కు, కు అను శబ్దమును వక్రముగా బలుకునది (కోడి)

**కుక్కుభము** - కుక్కు అను శబ్దము చేయునది (కోడి - గంప పులుగు)

**కుక్కురము** - కు అని యరచునది (కుకురము కుక్క)

**కుక్షింభరి** - తన కడుపును మాత్రమే నింపుకొనువాడు (లోభి)

**కుచము** - కాముకుని గోటిచే గిల్లబడునది (చన్ను)

**కుచఫలము** - కుచముల వంటి ఫలములు కలది (దానిమ్మచెట్టు)

**కుచేలము** - భూమికి వస్త్రము వంటిది (సముద్రము)

**కుచేలుడు** - చినిగిన లేక మాసిన వస్త్రము కలవాడు (పేదవాడు, కృష్ణుని సహపాఠి)

**కుచ్చుల మెకము** - కుచ్చుల తోక (గల) మెకము (చమరీమృగము - జల్లి మెకము)

**కుజంభలుడు** - నినాస భూమిని వంచించువాడు, కన్నపు దొంగ (శివుడు)

**కుజప్రియము** - కుజ గ్రహమున కిష్టమైనది (పగడము)

**కుజుడు** - శ్రీ మహావిష్ణువు వలన భూదేవికి బుట్టినవాడు. (అంగారకుడు)

**కుటజము** - కొండపై మొలచునది (కొండమల్లె - గిరిమల్లిక)

**కుటజుడు** - కుండ యందు బుట్టినవాడు (అగస్త్యుడు, ద్రోణుడు)

**కుటవుడు** - నియమాదులచే శరీరమును తపింపజేయువాడు (ముని)

**కుటరము** - దీనిచేత కవ్వము తిరుగును (తరిగంబము - చల్లచేయురాడు - కురరము)

**కుటహారిక** - నీటి కుండలు తీసికొని పోవునది (పనికత్తె)

**కుటీచరము** - జలమున కుటిలముగా చరించునది (నీటిపంది)

**కుటీచకుడు** - గుడిసెలో నుండుటచేతనే తృప్తి నొందువాడు (యతి)

**కుట్టమితము** - నఖదంతక్షతాదులచే కోప భావ మభినయించినను హృదయమున నమితానందమును బొందెడి స్త్రీల శృంగార చేష్టావిశేషము (కుట్టిమితము)

**కుట్టిని** - విటుని కుటుంబమును అర్థహరణముచే పాడుచేయునది, లంజెను విటునికి కూర్చునది (కుట్టని - కుంటనకత్తె)

**కుడ్యము** - పడునపుడు మ్రోయునది (గోడ)

**కుణి** - ఈచబోయిన చేతులు కలవాడు (కుకరుడు), కుచ్చితుడని పలుక బడువాడు (కూణి)

**కుతనువు** - వికృతమైన రూపము కలవాడు (కురూపి, కుబేరుడు)

**కుతపము** - ఎండచే భూమిని దపింప జేసెడి రెండు గడియల మధ్యాహ్నకాలము, దినము యొక్క భాగములో ఎనిమిదవ భాగము

**కుతవుడు** - భూమిని దపింప జేయువాడు (సూర్యుడు, అగ్ని)

**కుతలము** - కుత్సితమైన తలము కలది (మిట్టపల్లములతో నుండు భూమి), అధో లోకములలో నొకటి

**కుత్తుకగందువాడు** - కంఠమున నలుపు గలవాడు (శివుడు)

**కుత్తుక బంటి** - కంఠము పర్యంతము

**కుదరము** - ముఖముచే భూమిని జీల్చునది (అడవి పంది), భూమిని తనడెక్కలచే జీల్చునది (గుఱ్ఱము)

**కుద్రంకము, కుద్రంగము** - అల్పమైన గృహ చిహ్నము కలది (పాలము నడుమగల మంచె)

**కుద్దారము, కుద్దాలము** - భూమిని (విదారించు) చీల్చునది (గుద్దలి), వ్రేళ్ళచేత భూమిని వ్రక్కలించునది (కోవిదారము - ఎఱ్ఱకాంచనపు చెట్టు)

**కుధరము** - భూమిని ధరించునది (కొండ - కుధ్రము)

**కుబేరుడు** - కుత్సితమైన బేరము (శరీరము) కలవాడు (ఉత్తరదిక్పతి)

**కుమార పండితుడు** - బాలుడైన పండితుడు

**కుమారసువు** - కుమార స్వామిని కన్నది (పార్వతి, గంగ)

**కుమారి** - యవ్వన మంకురింపక పోవుటచే మన్మథుని నిరాకరించునది (కన్య)

**కుమారుడు** - యౌవన ప్రభావ మంకురింపని వాడు, (బాలుడు) ఎల్లప్పుడును బాలుడుగా నుండువాడు, కుత్సితులను సంహరించువాడు, మన్మథుని వలె నందరుడైనవాడు (కుమారస్వామి)

**కుముఖము** - కుత్సితమైన ముఖము కలది (పంది - సూకరము)

**కుముదము** - భూమిని సంతోషింప జేయునది (తెల్ల కలువ) తెల్ల కలువ వంటి వర్ణము గలది (నిర్ఋతి దిక్కు నందలి యేనుగు)

**కుముద బాంధవుడు** - కలువలకు జుట్టమైనవాడు (చంద్రుడు)

**కుముదాకరము** - కుముదములకు ఆకారమైనది (కలువ కొలను)

**కుముదాభిఖ్యము** - తెల్ల కలువ యొక్క శోభవంటి శోభ కలది (వెండి)

**కుముదిని** - చూ కుముదాకరము (కుముద్వంతము)

**కుముదుడు** - భూమిని సంతసింపజేయు వాడు (విష్ణువు)

**కుముద్వతి** - కుముదములు కలది (సరస్సు, కలువకాడ)

**కుమ్మరసారె చుక్క** - కుమ్మరసారె వలె గుండ్రముగా నుండు చుక్క (చేటరిక్క - విశాఖా నక్షత్రము)

**కురంకరము, కురంకురము** - నీటి కొరకు శబ్దము చేయునది (బెగ్గురుపక్షి)

**కురంగనాభము** - కురంగము యొక్క నాభి నుండి పుట్టినది (కస్తూరి)

**కురంగాక్షి** - లేడి కన్నుల వంటి చక్కని కన్నులు గల స్త్రీ

**కురరము** - ధ్వని చేయునది (పెన్నెడ పులుగు)

**కురవకము** - మకరందము లేని దగుటచే తుమ్మెదలు మూగనిది (ఎఱ్ఱగోరంట, ఎఱ్ఱ చేమంతి)

**కురుక్షేత్రము** - కురుడను రాజుచే దున్నింపబడిన శమంత పంచకము (కౌరవ పాండవ రణభూమి)

**కురువకము** - చూ కురవకము

**కురువిందము** - కురు దేశమున విరివిగా దొరకునది (పద్మరాగమణి)

**కురూప్యము** - తెల్లని దగుటచే వెండివంటిది (తగరము)

**కుర్కుటము** - కుర్ అను శబ్దము చేయుచు వక్రముగా మసలునది (కోడి)

**కుర్కురము** - కుర్ అనుచు మొరుగునది (కుక్క)

**కులకము** - ఏక క్రియాన్వయము గల ఐదు లేక అంతకుమించిన పద్యముల సముదాయము

**కులట** - విట కులము ననుసరించి పోవునది (రంకుటాలు)

**కులటుడు** - పుట్టిన కులమునుండి (పెంచుకొన్న) వేరొక కులములోనికి పోయినవాడు (దత్తపుత్రుడు)

**కులదీపకుడు** - వంశమునకు వన్నె తెచ్చువాడు

**కులపతి** - ఆశ్రమము నందుంచుకొని పదివేల శిష్యులచే అధ్యయనము చేయించు బ్రహ్మర్షి

**కులపాలిక** - మంచి నడవడిక కల్గి కులమును కాపాడుకొను స్త్రీ, తల్లిదండ్రులచే యథావిధిగా పెండ్లి చేయబడిన స్త్రీ

**కులవిప్రుడు** - వంశ క్రమముగా వచ్చుచున్న పురోహితుడు

**కులవ్రతము** - వంశమున పరంపరగా సంక్రమించుచున్న వ్రతము (అనంత వ్రతము, కేదారేశ్వర వ్రతము)

**కులసత్రము** - తరముల వారీగా విడువక వేయి సంవత్సరములు చేయవలసిన యాగము

**కుల సౌరభము** - మంచి పరిమళము కలది (మరువము)

**కులాంగన** - ఉత్తమ వంశమున జన్మించినది, (కులీన - కులస్త్రీ)

**కులాంగారకుడు** - కులమునకు కొరవి వంటివాడు

**కులాచక్ర కీటోదాహరణము** - కుమ్మరి వాని చక్రమున నున్న పురుగు చక్రముతో బాటు వేగముగా తిరుగునట్లు దేహి సంసార చక్రమున జనన మరణాది భ్రమణ వేగమునకు గురి యగుననుట

**కులాయము** - పక్షి కులమునకు నివాస యోగ్య మైనది (పక్షిగూడు)

**కులాల కీటము** - కుమ్మరి పురుగు పలుమార్లు మంటిలో దొరలినను మట్టి అంటని విధము

**కులాలుడు** - మట్టి కొరకు భూమిని త్రవ్వు వాడు (కుమ్మరి)

**కులిశధరుడు** - వజ్రాయుధమును ధరించువాడు (ఇంద్రుడు - వజ్రి)

**కులిశము** - భూమిని స్వల్పముగా జేయునది, పర్వతముల రెక్కలను భేదించి స్వల్పముగా జేసినది (వజ్రాయుధము - పవి)

**కులీనుడు** - మంచి కులమున బుట్టినవాడు

**కువలయము** - భూమియందు చుట్టుకొని యుండునది, భూమికి కంకణము వలె అలంకార ప్రాయమైనది (కలువ, నల్లకలువ)

**కువలయమిత్రుడు**- భూమండలమునకు మిత్రుడు (రాజు), కలువలకు స్నేహితుడు (చంద్రుడు)

**కువలయా పీడము** - కృష్ణుడు సంహరించిన కంసుని యేనుగు, భూవలయమునకు అలంకారము

**కువలయేశుడు** - భూమికి ప్రభువు (రాజు), కలువలకు రాజు (చంద్రుడు) వెల్లడించెడు కుత్సిక వాక్యములు పలుకువాడు

**కువలేశయుడు** - నీటిపై బరుండువాడు (విష్ణువు)

**కువాదుడు** - ఇతరుల దోషములను వెల్లడించెడు కుత్సిత వాక్యములను భాషించెడువాడు

**కువిందుడు** - నేయునపుడు మగ్గపు గోతిలో ఉండువాడు (సాలెవాడు - తంతువాడు)

**కువేణి** - చేపలిందు కుత్సితముగా దిరుగును (చేపలబుట్ట)

**కువేలము** - వారిజము (జలజము)లలో వన్నె తెచ్చునది (కలువ)

**కుశకాశావలంబనము** - ప్రవాహమున కొట్టుకొని పోవుచున్నవాడు చేతికి దొరకిన దర్భగాని గడ్డిపోచగాని వట్టుకొని ప్రాణ రక్షణ చేసికొనదలచుననుట

**కుశలము** - సుజనులందు గూడుకొని యుండునది (మంగళము)

**కుశలుడు** - బుద్ధి సూక్ష్మతలో కుశాగ్రమును పోలికగా పేర్కొనదగినవాడు (వివేకి)

**కుశాక్షము** - దర్భకొన వంటి చురుకైన కన్నుగలది (కోతి)

**కుశికుడు** - మెల్లకంటివాడు (కేకరుడు)

**కుశీదము** - కుత్సితమైన (వ్యాపారము) వృత్తి (వడ్డీవ్యాపారము)

**కుశుడు** - వాల్మీకి యొక్క మంత్రింపబడిన కుశోదకముచే సంస్కరింపబడినవాడు

**కుశేశయము** - నీటి యందుండునది (తామర, సారసపక్షి)

**కుష్ఠము** - దేహమును బగులునట్లు చేయునది (కుష్ఠరోగము)

**కుష్మాండము** - విత్తులం దించుకంత వేడిమి కలది (గుమ్మడి - కర్కారువు)

**కుసుంభరాగము** - బయటికి గొప్పగా గనబడి మనస్సున ఇంచుకంతయు లేని యనురాగము

**కుసుమ ధన్వుడు** - పుష్పములు బాణములుగా గల ధనుస్సు కలవాడు (మన్మధుడు - పూవిలుకాడు)

**కుసుమబాణుడు, కుసుమశరుడు, కుసుమాయుధుడు, కుసుమాస్త్రుడు, కుసుమేషుడు(వు)** - పుష్పములు బాణములుగా గలవాడు (మన్మధుడు - కుసుమసాయకుడు)

**కుహనా సన్న్యాసి** - బూటకపు సన్న్యాసి

**కుహరము** - భూమిని హరించునది (రంధ్రము)

**కుహువు** - చంద్రకళ లేని అమావాస్య

**కుహూకంఠము** - కుహూ అను ధ్వని కంఠమున గలది (కోయిల కుహూ ముఖము)

**కూకటిప్రాయము** - లేబ్రాయము

**కూకటివేరు** - తరు ప్రధానమైన వేరు (తల్లివేరు - కుంకటివేరు)

**కూకుదుడు** - వంశప్రతిష్ఠకు నెలవైన కన్యను దానము చేయువాడు, కన్య నలంకరించి వరునకు దానమిచ్చువాడు

**కూటపాలకుడు** - కూటమును (మట్టి ముద్దను) నలుసులు లేకుండునట్లును, జిగురు వచ్చునట్లును కాపాడువాడు (కుమ్మరి)

**కూటమానము** - తప్పుడు తూకము

**కూట ముత్యము** - కృత్రిమమైన ముత్యము

**కూటయుద్ధము** - యుద్ధ ధర్మములను పాటింపక చేయు యుద్ధము (అధర్మ యుద్ధము)

**కూటసాక్షి** - తప్పుడు సాక్ష్యము చెప్పువాడు

**కూటస్థము** - మార్పులు లేక ఎల్లకాలము ఒక్క రీతిగనే యుండునది (పరబ్రహ్మము)

**కూణి** - ఈచ వోయిన చేతులు కలవాడు (కుణి కుకరుడు)

**కూణితేక్షణము** - ముడుచుకొన్న నేత్రములు కలది (డేగ)

**కూతకైదువు** - ధ్వని చేయు ఆయుధము (శంఖము), (శత్రుసేనను చికాకు పరచు మ్రోత గలది గాన ఆయుధము)

**కూనమ్మ** - కూనవలె నడువ లేక చతికిలబడు నాడుది (కుంటిది - ఈడ్పుగాళ్ళది)

**కూనలమ్మ** - కొలిచిన వారికి కూనల నిచ్చు గ్రామదేవత

**కూనలమ్మ చీర** - కూనలమ్మకు ప్రియమైన చీర (గళ్ళచీర)

**కూపకము** - పతాకము గట్టుట చేత ఇంచుకంత శబ్దము కలది (ఓడమీద టెక్కము గట్టెడి కొయ్య)

**కూపకచ్ఛపము** - నూతిలోపల తిరుగుచు ప్రపంచమింతే యనుకొను తాబేలు

**కూపకూర్మము** - నూతిలో నివసించెడు తాబేలు (కూపకచ్ఛపము)

**కూప మండూకము** - నూతిలోని కప్ప (నూతిని ప్రపంచ మనుకొనునది)

**కూపము** - కొద్దిపాటి నీరు కలది, కుత్సితములైన యుదకములు గలది (నూయి - గుంట)

**కూయంత్రఘటీకోదాహరణము** - బావి యందలి యంత్ర ఘటములు నీటితో పైకి వచ్చుచుండు టయు జల శూన్యములై కొన్ని లోనికి పోవు చుండుటయు జరుగు చుండునట్లు జీవులు సుఖదుఃఖాద్యవస్థా భేదములు క్రమాను సారముగ పొందుచుండుట

**కూపారము, కూపావారము** - నేలను జలముచే నిండించునది (సముద్రము)

**కూమము** - శోభ నిచ్చునదగుటచే భూమికి అలంకారమైనది (కొలను)

**కూర్చము** - కనుబొమల వెండ్రుకలను కుటిలముగా జేయునది (భ్రూమధ్యము)

**కూర్చశీర్షము** - గడ్డము వంటి శిరస్సు కలది (కొబ్బెర)

**కూర్మము** - కుత్సితమగు (ఊర్ములు) గమన వేగముగలది (తాబేలు), కంటిరెప్పలందుండు వాయువు (కూర్మవాయువు)

**కూలంకష** - ఒడ్డును ఒరయునది (ఏరు)

**కూలము** - నదిని కప్పి యుండునది (ఒడ్డు)

**కృకణము** - కృ అను ధ్వని చేయునది (కొక్కెర)

**కృకరము** - కృ అను శబ్దము చేయునది (కక్కెరపక్షి)

**కృకము** - శబ్దమును చేయునది (కంఠము)

**కృకలాసము** - మెడను త్రిప్పునది (తొండ సరటము)

**కృకవాకువు** - తలయెత్తి కూయునది (కోడి, నెమలి, తొండ)

**కృతకాద్రి** - క్రీడార్థమేర్పరుచుకొన్న పర్వతము (చేతగట్టు)

**కృతక్షణుడు** - సమయము లభించినవాడు

**కృతఘ్నుడు** - చేసిన మేలు మరచువాడు

**కృతజ్ఞుడు** - చేసిన మేలు గుర్తుంచు కొనువాడు

**కృతముఖుడు** - అభ్యసింపబడిన చతురు పాయములు కలవాడు (పండితుడు)

**కృతవిద్యుడు** - విద్యనభ్యసించిన వాడు (పండి తుడు)

**కృతసాపత్నిక** - చేయబడిన (సాపత్న్యము = సవతి తనము కలది) (పెద్దభార్య)

**కృతాంతుడు** - చేయబడిన వినాశనము కలవాడు (యముడు)

**కృతార్థుడు** - నెరవేరిన పనులు గలవాడు

**కృతాలయము** - నివాస మేర్పరుచుకొనునది (కప్ప - మండూకము)

**కృతాస్త్రుడు** - అస్త్ర ప్రయోగోప సంహారములను దెలిసినవాడు, విలువిద్యయందు నేర్పు కలవాడు

**కృతికరుడు** - ఇరువది చేతులు కలవాడు (రావ ణుడు)

**కృతిపతి** - కృతిని స్వీకరించినవాడు

**కృత్తివాసుడు** - గజ చర్మమును వస్త్రముగా ధరించినవాడు (శివుడు)

**కృదంతము** - కృత్ప్రత్యయము కడపట గల పదము ఉదా అలుక

**కృపణుడు** - కుటుంబమును బాధించి యైనను బ్రతుక నేర్చినవాడు (లోభి)

**కృపాణము** - దయను పోగొట్టునది (ఖడ్గము)

**కృపీటయోని** - ఉదకమున కుత్పత్తి స్థానమైనది (అగ్ని)

**కృమిఫలము** - క్రిములతో నిండిన ఫలములు కలది (మేడిచెట్టు)

**కృమీలకము** - పురుగులను పుట్టించునది, (వన ముద్గము - అడవిపెసర)

**కృశాంగి** - చిక్కిన శరీరము కల స్త్రీ

**కృశానువు** - తన్నంటిన దానిని కృశింపజేయువాడు (అగ్ని)

**కృశానురేతసుడు, కృశానురేతుడు** - అగ్నియందు రేతస్సు వైచినవాడు వహ్నిరూపమైన వీర్యము కలవాడు (శివుడు)

**కృషకము** - దున్నునది (ఎద్దు - వృషభము, నాగటికఱ్ఱు - కృషికము)

**కృషీవలుడు** - భూమిని దున్ని బ్రతుకువాడు (కృషికుడు - కర్షకుడు)

**కృష్టపచ్యము** - దున్నిన భూమియందు పండింప బడునది

**కృష్ణకాయము** - నల్లని శరీరము గలది (దున్నపోతు)

**కృష్ణ కోహలుడు** - పాపవర్తనుడను భావమును కలిగించువాడు

**కృష్ణ చుంచుకము** - నల్లని ముక్కు కలది (సెనగ)

**కృష్ణతారము** - నల్లని కనుగ్రుడ్లు గలది (ఇఱ్ఱి)

**కృష్ణద్వైపాయనుడు** - కృష్ణద్వీపమున నివసించువాడు (వ్యాసుడు)

**కృష్ణ ముఖము** - నల్లని ముఖము గలది (కొండముచ్చు)

**కృష్ణ శకుని** - నల్లని పిట్ట (కాకి)

**కృష్ణ శృంగము** - నల్లని కొమ్ములు గలది (దున్నపోతు)

**కృష్ణసఖుడు** - శ్రీకృష్ణుని చెలికాడు (అర్జునుడు)

**కృష్ణాచలము** - కృష్ణునకు ప్రియమైన కొండ (రైవతకాద్రి)

**కృష్ణాజినము** - కృష్ణసారము యొక్క - అజినము, దుప్పి చర్మము)

**కృష్ణావాసము** - కృష్ణునకు నెలవైనది (రావిచెట్టు)

**కృష్ణుడు** - కృష్ణవర్ణము కలవాడు, భక్తుల హృదయముల నాకర్షించు వాడు (దేవకీ వసుదేవుల సుతుడు)

**కెంజాయ** - తొగరు రంగు

**కెంజిగురు** - ఎఱ్ఱని చిగురు

**కెంజిగురుల విల్తుడు** - ఎఱ్ఱని చిగుళ్ళు విల్లుగా గలవాడు (మన్మధుడు)

**కెందామర** - ఎఱ్ఱతామర

**కెంపుకంటి** - ఎఱ్ఱని కన్నులు గల(పిట్ట)ది (కోయిల)

**కెంపుకన్నుల పులుగు** - కెంపువలె ప్రకాశించెడు కన్నులు గలపిట్ట (కోయిల)

**కెంపుగాము** - కెంపువలె ప్రకాశించెడు గ్రహము (అంగారకుడు)

**కెంపుసవతు** - ఎఱ్ఱని నక్షత్రము (కరువలి రిక్క - స్వాతీనక్షత్రము)

**కేంద్రము** - వృత్త క్షేత్రము యొక్క నడిమిభాగము

**కేక** - శిరము ఎత్తి పలుకబడునది (నెమలి కూత)

**కేకరుడు** - కనుగ్రుడ్డును పైకి త్రిప్పు స్వభావము కలవాడు (మెల్లకంటివాడు)

**కేకి** - కేకారవము చేయునది (నెమలి మయూరము)

**కేదారుడు, కేదారేశుడు** - శిరమున భార్య గలవాడు (శివుడు)

**కేనిపాతకము** - నీటిలో వేయబడునది (ఓడత్రెడ్డు)

**కేయూరము** - భుజ శిరస్సున ఉండునది (బాహుపురి, భుజకీర్తి)

**కేలికిలుడు** - హాస్యము చేయువాడు (కేళికీలుడు - విదూషకుడు)

**కేలికుంచిక, కేలికూచిక** - ఎగతాళి అను పెట్టెకు తాళపు చెవి వంటిది (భార్య చెల్లెలు - మరదలు)

**కేలు మెకము** - తొండము గల జంతువు (ఏనుగు)

**కేశచ్ఛిత్తు, కేశచ్ఛిదుడు** - వెంట్రుకలను గొరుగువాడు (మంగలి)

**కేశమార్జకము, కేశమార్జనము** - కేశముల చిక్కును తీయునది (దువ్వెన)

**కేశము** - శిరమున ఉండునది (తలవెంట్రుక - శిరోజము)

**కేశరంజనము, కేశరాజము** - వెంట్రుకలను ప్రకాశింపజేయునది (గుంటగలగర చెట్టు)

**కేశవుడు**-కేశియను రాక్షసుని వధించినవాడు, మంచి కురులు గలవాడు

**కేశాకేశి** - జుట్టు జుట్టు పట్టుకొని చేయు పోరాటము

**కేశిని** - మంచి వెంట్రుకలు గలయాడుది

**కేశుడు** - జలమునకు ప్రభువు (వరుణుడు)

**కేసరి** - జూలు కలది (సింహము)

**కైకయుడు** - కేకయ దేశపురాజు (కైకయొక్క తండ్రి)

**కైటభజిత్తు** - కైటభాసురుని జయించిన వాడు (విష్ణువు)

**కైటభారి** - కైటభునకు విరోధి (విష్ణువు)

**కైపదము** - పూరింపుమని కవికిచ్చిన పదము (సమస్య - కయిపదము)

**కైరవము** - హంసకు ఇష్టమైనది (తెల్లగలువ)

**కైలాసము** - నిర్మలమైన స్ఫటిక శిలవలె ఉండునది (వెండికొండ)

**కైవర్తుడు** - నీటిలో ఉండువాడు (జాలరి)

**కైవలము** - ఆకాశమున విహరించునది (విహంగము - పక్షి)

**కైవల్యము** - ఆత్మ శరీర భేదములను (స్థూల, సూక్ష్మ కారణ శరీరము) విడిచి అద్వితీయమై (కారణమై) యుండుట

**కైవారము** - వృత్తము మొదలగు వాని చుట్టుకొలత (పరిధి)

**కైశికి** - సుకుమారమగు నర్థము కలరచన గల్గినది (అర్థమే ప్రధానముగా నుండునవి వృత్తులు - ఒకానొక కావ్యవృత్తి)

**కైసోటిచుక్క**- చేతివలె నుండు నక్షత్రము (హస్త)

**కొంకనక్క, కొంకునక్క**- పిరికి నక్క - కొంకినక్క

**కొంగు బంగారము** - కొంగునకు కట్టిన బంగారము వలె అందుబాటులో నున్నది

**కొంచగుబ్బలి** - క్రౌంచ పర్వతము (కొంచగట్టు)

**కొంచదీవి** - క్రౌంచద్వీపము

**కొంచమలగొట్టిన జాణడు** - క్రౌంచ పర్వతమును గొట్టిన నేర్పరి (కుమారస్వామి)

**కొంచమొగ్గరము** - క్రౌంచ వ్యూహము (యుద్ధమున పన్నెడు -వ్యూహ విశేషము)

**కొంచసోరము** - సప్త స్వరములలో నాల్గవది (మధ్యమ స్వరము)

**కొండచిలువ** - కొండల యందుండు ఒక పెద్దపాము (గోనసము)

**కొండచూలి** - పర్వత రాజగు హిమవంతుని కొమార్తె (పార్వతి)

**కొండత్రిమ్మరి** - కొండలయందు సంచరించునది (కోతి)

**కొండపగతుడు** - పర్వతముల రెక్కలను వజ్రాయుధమున భేదించుటచే శత్రువైనవాడు (దేవేంద్రుడు)

**కొండమల్లయ్య** - కొంచమలగొట్టిన జోదు తండ్రి (శ్రీశైల మల్లికార్జునుడు - శివుడు)

**కొండము(ము)చ్చు, కొండముసువ** - కొండయందు ముచ్చు = దొంగ వంటిది (నల్లని మొగము గల కోతి - అసితాననము)

**కొండయల్లుడు** - అద్రి రాజగు హిమవంతు నకు అల్లుడైనవాడు (శివుడు)

**కొండరాయడు, కొండరేడు** - పర్వతము లకు ప్రభువు (హిమవంతుడు)

**కొండలరాయడు** - ఏడుకొండలకు పైన వెలసిన ప్రభువు (కొండకాసులవాడు - వేంకటేశ్వరుడు), పర్వతములకు ప్రభువు (హిమవంతుడు)

**కొండసూడు** - పర్వతములకు శత్రువు (దేవేంద్రుడు)

**కొండెపుదపసి** - కొండెములు చెప్పెడు ముని (నారదుడు)

**కొక్కుతేజిరౌతు** - మూషక వాహనము నెక్కి స్వారి చేయువాడు (విఘ్నేశ్వరుడు)

**కొక్కురౌతు** - పందికొక్కుపై స్వారి చేయువాడు (వినాయకుడు)

**కొమ్మటెంకి మెకము** - చెట్టుకొమ్మ నివాసముగా గల మృగము (కోతి - కొమ్మ మెకము)

**కొమ్మత్రిమ్మరి** - కొమ్మలందు తిరుగునది (వానరము)

**కొమ్ముటేనుగు** - కొమ్ములు గల యేనుగు (మగయేనుగు)

**కోకనదము** - చక్రవాకములచే కూయించునది (ఎఱ్ఱతామర - చెందమ్మి)

**కోకము** - ప్రియురాలి వియోగముచే చీకటిలో మొరపెట్టునది (జక్కవ)

**కోకవైరి** - చక్రవాకముల శత్రువు (చంద్రుడు)

**కోకవైరి** - చక్రవాకములకు శత్రువు (జక్కవగొంగ - చంద్రుడు)

**కోకిలాక్షము** - కోయిల కంటి వలె ఎఱ్ఱని పూవు కలది (ములుగొలిమిడి చెట్టు)

**కోకిలావాసము** - కోయిలకు నెలవైనది (మామిడి చెట్టు)

**కోణపుడు** - దక్షిణ పశ్చిమముల విదిక్కును బాలించువాడు (నైరృతుడు)

**కోనత్రిమ్మరి** - వనములో తిరుగునది (కోతి)

**కోదండము** - దీనిచేత వేటాడుదురు (ధనుస్సు)

**కోనమనికిపట్టు** - అడవి నివాసమైనది (కోతి కోనతెంకి)

**కోనరేడు** - మూలరేడు (నైరృతుడు)

**కోపన** - కోప స్వభావము గల యాడుది

**కోపులు** - మేకల చన్నులకు (వాని కూనలు పాలు త్రాగకుండ) కట్టు గుడ్డలు

**కోయష్టికము** - తానున్న స్థానముతో పూర్తిగా సంగతమైయుండునది (గ్రుడ్డి కొంగ - చీకు కొక్కెర)

**కోరకావడి** - వెల్లకిల చేయబడిన విల్లువలె నుండు కావడి బద్ద

**కోరింద పూసలు** - అడవి జాతివారు తాల్చెడు గాజు పూసలు

**కోలెమ్ము** - బెత్తము వలె పొడవుగల ఎముక (వెన్నెముక - కశేరుక)

**కోవిదుడు** - ఇది యది యను నియమము లేక సర్వము తెలిసికొన్నవాడు (విద్వాంసుడు)

**కోష్ఠాగారికుడు** - సామగ్రుల కొట్టుపై అధికారి

**కోష్ణము** - ఇంచుక వేడి గలది (నులివెచ్చనిది - గోరువెచ్చనిది)

**కౌంతికుడు** - బల్లెము చేపట్టినవాడు (ఈటెకాడు)

**కౌక్కుటికుడు** - వంచనతో గూడిన వర్తనము గలవాడు (వంచకుడు - కపటి)

**కౌక్షేయకము** - (కుక్షి = ఒర) కుక్షియందు బద్ధమైనది, పొట్టవద్ద ఉంచు కొనబడునది (కత్తి)

**కౌచుముచ్చు** - చూ॥ కవుచు ముచ్చు

**కౌటికుడు** - వలతో తిరుగువాడు (బోయవాడు)

**కౌణపదంతుడు** - రాక్షసుని దంతముల వంటి దంతములు కలవాడు (భీష్ముడు)

**కౌణపుడు** - శవమును తినువాడు (రాక్షసుడు), కోణమును (నైరృతి దిశను) పాలించువాడు (కోణపుడు - నైరృతుడు)

**కౌద్దాలికుడు** - భూమిని గునపముచే త్రవ్వి జీవించువాడు

**కౌమారము** - బాల్యమునకు బిమ్మటి వయోవస్థా విశేషము, కుమార స్వామికి సంబంధించినది

**కౌమారికేయుడు** - కన్యకకు బుట్టినవాడు (కానీనుడు)

**కౌముది** - కలువలకు ఆనందము కల్గించునది (వెన్నెల)

**కౌమోదకి, కౌమోది** - భూమిని సంతసింపజేయునది (విష్ణునిగద)

**కౌలటినేయుడు** - భిక్షుకియగు పతివ్రత కొడుకు

**కౌలటేయుడు** - భిక్షుకియగు పతివ్రత కొడుకు, రంకుటాలి కొడుకు

**కౌలటేరుడు** - రంకుటాలి కొడుకు

**కౌలేయుడు** - ఉత్తమ కులమున పుట్టినవాడు

**కౌశిక ఫలము** - కోశమందున్న ఫలము కలది (కొబ్బెరచెట్టు)

**కౌశేయము** - పట్టుకాయ నుండి కలిగినది (పట్టు), పట్టుకాయల నుండి తీసిన నూలుచే నేసినది (పట్టచీర-కౌషేయము)

**కౌసలేయుడు** - కౌసల్య యొక్క కొడుకు (శ్రీరాముడు)

**కౌస్తుభము** - భూమిని వ్యాపించియున్న దగుటచే సముద్రము కుస్తుభము అందుబుట్టినది (విష్ణు వక్షః స్థలమందలి మణి)

**క్రకచ పత్రము** - రంపము వంటి ఆకులు కలది (మొగలి - క్రకచచ్ఛదము)

**క్రకచపాదము** - రంపముల వంటి కాళ్ళు గలది (తొండ)

**క్రకచము** - క్ర యను ధ్వని జేయునది (రంపము)

**క్రకణము** - క్రక్రక్ర అని ధ్వని చేయునది (కొక్కెర - క్రకోరము)

**క్రకరము** - క్రకచము, క్రకణము (రంపము, కొక్కెర)

**క్రతుద్రుక్కు, క్రతుద్రుహుడు** - యజ్ఞమును ధ్వంసము చేయువాడు (రాక్షసుడు - క్రతుద్రుట్టు)

**క్రతుధ్వంసి** - దక్షయజ్ఞమును ధ్వంసము చేసినవాడు (శివుడు), క్రతువును ధ్వంసము చేయువాడు (రాక్షసుడు)

**క్రతుభుక్కు, క్రతుభుజుడు** - యజ్ఞహవిరాది కమును భుజించువాడు (దేవత - వేల్పు)

**క్రతురాట్టు** - యాగములలో మేటి (క్రతురాజము - అశ్వమేధము, రాజసూయము)

**క్రముకము** - దీనిని ఫలార్థ లెక్కుదురు (పోకచెట్టు)

**క్రమేలకము** - పాద విక్షేపములచేత బోవునది (ఒంటె)

**క్రయపత్త్రము, క్రయవేద్యము** - వెలయిచ్చి తీసికొన్నట్లుగా తెలియజేయు ఋజు పత్త్రము (దస్తావేజు)

**క్రవ్యము** - చంపి తీయవలసిన దగుటచే దీనికి జంకుదురు (మాంసము)

**క్రవ్యాత్తు** - మాంసమును తినువాడు (రాక్షసుడు), మాంసమును తిను జంతువు (పులి మొ॥)

**క్రవ్యాదుడు** - మాంసము తినువాడు (క్రవ్యాది - రాక్షసుడు)

**క్రవ్యాశి** - క్రవ్యాదుడు (రాక్షసుడు, నిర్యతి)

**క్రాలుగంటి** - బెదరు కన్నులు గలది (క్రాల్గంటి - తరళేక్షణ)

**క్రాల్గన్ను** - కాకి చూపు గల కన్ను, విలాసపుచూపు (క్రాలుగన్ను - తరళేక్షణము)

**క్రీడా గృహము** - విలాసార్థమైన గృహము (కేళీమందిరము)

**క్రీడిచెలితేరు** - అర్జునుని చెలికాడగు కృష్ణుని వాహనమైనవాడు (గరుడుడు)

**క్రీతకుడు, క్రీతుడు** - వెలయిచ్చి కొడుకుగా కొనబడినవాడు

**క్రుంకుగట్టు** - సూర్యుడు అస్తమించు పర్వతము (క్రుంకుమెట్ట - అస్త్రాద్రి)

**క్రుంకుగడలి** - పడమటి సముద్రము

**క్రుంకుపుడమి తాల్పు** - సూర్యుడు అస్తమించెడు పర్వతము (అస్త్రాద్రి)

**క్రుంకు(మల)మెట్ట** - సూర్యుడు అస్తమించు కొండ (పశ్చిమ పర్వతము - కుంకుడు గట్టు)

**క్రూరదృక్కు** - క్రూరమైన చూపుకలవాడు (శని, అంగారకుడు - క్రూరలోచనుడు)

**క్రేంకారము** - పక్షుల కూత, రథనేమిధ్వని

**క్రొంజిగురు విల్కాడు** - లేజిగురు విల్లు గలవాడు (మన్మథుడు)

**క్రొంజిలుగు జల్వ** - క్రొత్తది యగు సన్నని బట్ట.

**క్రొంబూవిలుకాడు** - పుష్పములు బాణములుగా గల విల్లు గలవాడు (మన్మథుడు)

**క్రొన్ననబోడి** - క్రొత్త చిగురు వలె సున్నితమైన అడుది, అప్పుడే వికసించిన పూవువంటి మెత్తని శరీరము కలది (సుమాంగి)

**క్రొన్నన విలుకాని తండ్రి** - పుష్పబాణుని తండ్రి (విష్ణువు)

**క్రొన్నెలతాలుపు, క్రొన్నెలదారి** - బాలచంద్రుని జటాజూటమున దాల్చినవాడు (నెలదారి - శివుడు)

**క్రొన్నెలదారి సింగిణి** - శివుడు తాల్చిన విల్లు (మేరు పర్వతము)

**క్రొన్నెలలు** - కపాలోరు కటోపరి ప్రదేశముల యందలి చందురుని వంకల వంటి గోటి నొక్కులు (చందురు వంకలు)

**క్రోడపాదము** - రొమ్మున ఇముడ్చుకొను పాదములు కలది (తాబేలు)

**క్రోశధ్వని** - క్రోసుమేర వినబడు శబ్దము గలది (ఢంకా)

**క్రోష్టువు** - బిగ్గరగా అరచునది (నక్క - జంబుకము)

**క్రౌంచదారణుడు** - క్రౌంచ పర్వతమును బ్రద్దలు కొట్టినవాడు (కుమారస్వామి)

**క్రౌంచాదనము** - క్రౌంచ పక్షుల కాహారమైనది (తామరతూడు)

**క్రౌంచారాతి** - క్రౌంచుడను రక్కసుని సంహరించినవాడు (క్రౌంచసూదనుడు కుమారస్వామి)

**క్లిష్టము** - క్లేశమున తెలియదగిన యర్థముగల పదము (ఒకానొక పద దోషము - ఉదా - వవనాశనేంద్ర ధరవుకుటాలంకారమణి జనకుడనగ

**క్వథనాంకము** - (క్వథనము = కాచుట) ద్రవము ఏ తాపక్రమము వద్ద మరుగుట మొదలిడునో ఆ తావక్రమము ఆ ద్రవము యొక్క క్వథనాంకము

**క్షంత** - మన్నించువాడు (క్షమిత)

**క్షణద** - ప్రజలకు తీరికను ఉత్సాహమును కల్గించునది (రాత్రి)

**క్షణదము** - ప్రజల యక్కరను తీర్చునది (జలము - నీరు)

**క్షణదాకరుడు** - రాత్రి కలుగజేయువాడు (చంద్రుడు - నిశాకరుడు)

**క్షణదాచరుడు** - రాత్రులు తిరుగువాడు (రేద్రిమ్మరి - రాక్షసుడు)

**క్షణద్యుతి** - అల్పకాలమే ప్రకాశము కలది (మెరపు)

**క్షణప్రభ** - క్షణకాలము మాత్రమే ప్రకాశము కలది (మెరపు)

**క్షణభంగురము** - క్షణమాత్రములో నశించునది (క్షణికము)

**క్షణరామి** - అనుక్షణము (క్షణక్షణము) రమించునది (పావురము)

**క్షణించు, క్షణియించు** - విందునకై పిలుచు (ఆహ్వానించు)

**క్షతజము** - గాయము నుండి ఉద్భవించునది (చీము, రక్తము)

**క్షతవ్రతుడు** - పట్టిన వ్రతమును పూర్తి చేయక విడిచినవాడు

**క్షతహారము** - గాయమును మాన్పునది (అగరువు)

**క్షత్త** - క్షత్రియ స్త్రీ యందు శూద్రునకు బుట్టినవాడు (సంకరజాతి వాడు)

**క్షత్త్ర బంధువు** - నీచ క్షత్త్రియుడు (రాజపుత్త్రుడు)

**క్షత్త్రియాణి** - క్షత్త్రియ జాతి స్త్రీ (రాచది - క్షత్త్రియ)

**క్షప** - వ్యాపారాదులను ఉడిగించునది (రాత్రి)

**క్షపణకుడు** - విషయ రాగమును బోగొట్టుకొన్నవాడు (క్షపణుడు - బౌద్ధ సన్న్యాసి)

**క్షపాంత్యము** - రాత్రియొక్క అంత్య భాగము (ప్రాతఃకాలము - వేకువ)

**క్షపాకరుడు** - రాత్రిని కలుగజేయువాడు (క్షపా నాథుడు - చంద్రుడు)

**క్షపానాథుడు** - రేరేడు (నిసివెలుగు - చంద్రుడు)

**క్షపాపతి** - రాత్రికి ప్రభువు (రేరేడు)

**క్షమి** - మన్నించు స్వభావము గలవాడు

**క్షయ్యము** - క్షయింపచేయ సాధ్యమైనది,

**క్షితి ధరము** - భూమిని ధరించునది (కొండ)

**క్షితిపతి** - భూమికి ప్రభువు (రాజు)

**క్షితివర్ధనము** - పాతిపెట్టుటవలన భూమిని ఉబుకునట్లు చేయునది (శవము)

**క్షితివ్యదానము** - నేలలో ఉండునది (సారంగము)

**క్షిపకుడు** - బాణములను విసరువాడు (విలుకాడు), బరిసెలను విసరువాడు (శూరుడు)

**క్షీరకంఠుడు** - పాలు త్రాగెడు శిశువు (పసిబిడ్డ - నిసుగు)

**క్షీరగ్రాహి** - పాలతో కలిసిన నీటిని విడిచి పాలను మాత్రమే గ్రహించు శక్తి కలది (హంస), ఆవుపాలలో వేయగా పాలను నల్లనివిగా జేయు ఇంద్రనీలమణి

**క్షీరాశము** - పాలు త్రాగునది (హంస)

**క్షీరాబ్ధి** - పాలసముద్రము (క్షీరసాగరము)

**క్షీరాబ్ధితనయ** - పాల్కడలి కూతురు (లక్ష్మి)

**క్షుతాభిజనము** - గాటుచే తుమ్ములు పుట్టించునది (నల్లావ)

**క్షుద్రకులిశము** - అల్పజాతికి చెందిన వజ్రము (సీచ వజ్రము - వైక్రాంతమణి)

**క్షుద్రప్రబంధములు** - ఉదాహరణము, చక్రవాళము, భోగావళి, తారావళి, బిరుదావళి అను అయిదు విధములు

**క్షుద్రవర్వణ** - కందురీగ (గండోలి)

**క్షుద్రిక** - చిన్న జోరీగ (పశుమక్షిక)

**క్షురప్రము** - అర్ధచంద్రాకృతి గల బాణము, మంగలి కత్తివలె గోయునది (కొడవలి)

**క్షురమర్ధి** - కత్తిని పదను పెట్టువాడు (మంగలి - నాపితుడు)

**క్షురముండి** - కత్తితో గొరుగువాడు (మంగలి)

**క్షేత్రజుడు** - భర్త యనుమతిపై భార్యకు మరియొకని వలన (దేవరుడు లోనగువారి వలన) బుట్టిన కొడుకు

**క్షేత్రజ్ఞుడు** - క్షేత్రమును దెలిసినవాడు (జీవుడు)

**క్షేత్రపాలుడు** - పుణ్యక్షేత్రమును రక్షించు వాడు (భైరవుడు), పొలము కాచువాడు (పొలము కాపరి)

**క్షేత్రాజీవుడు** - పొలమును దున్ని జీవించువాడు (రైతు - సేద్యకాడు)

**క్షేత్రియము** - పొలమునందు పుట్టు తృణాదికము శరీరములో పుట్టునది (రోగాది)

**క్షేత్రేక్షువు** - పొలమున చెరకు వలె నుండునది (జొన్న)

**క్షైత్రము** - క్షేత్రమునకు సంబంధించినది (క్షేత్ర సంబంధి)

**క్షైరేయము** - పాలతో జేయబడునది (పాయసము మొ॥)

**క్షోణి** - శబ్దము చేయునది (భూమి)

**క్షోణీసురుడు** - భువిపై వేల్పు వంటివాడు (బ్రాహ్మణుడు)

**క్షోదకము** - నలగ గొట్టునది (గుండ్రాయి, రోకలి మొ॥)

**క్షోదితము** - పొడిచేయబడినది (పొడుము)

**క్షౌద్రజము** - తేనె నుండి పుట్టినది (మైనము)

**క్షౌద్రము** - జుంటీగలచే కూర్చబడినది (తేనె), క్షుద్రునకు సంబంధించినది (అల్పత్వము)

**క్ష్ణుతము** - పదను పెట్టబడినది (కత్తి మొ॥)

**క్ష్మా** - భారమును వహించుట యందు క్షమ కలది (భూమి)

**క్ష్మాజము** - భూమియందు బుట్టునది (చెట్టు)

**క్ష్మాజాని** - భూమిజాయగా గలవాడు (రాజు)

**క్ష్మాజుడు** - భూదేవి కొడుకు (భూపుత్త్రుడు అంగారకుడు, నరకుడు)

**క్ష్మాదారుడు** - క్ష్మాజాని (క్ష్మాపతి)

**క్ష్మాధరము** - భూమిని ధరించునది (పర్వతము)

**క్ష్మాభుక్కు క్ష్మాభుజుడు** - భూమి ననుభవించువాడు (రాజు)

**క్ష్మాభృత్తు** - భూమిని భరించువాడు (రాజు), భూమిని భరించునది (పర్వతము)

**క్ష్వేళము** - మోహమును పొందించునది (విషము)

**ఖంజఖేటము** - కుంటివాని వలెనె కుంటుచు నడచునది (ఖంజరీటము - కాటుకపిట్ట)

**ఖంజము** - ఒక కాలు కుంటియైనది

**ఖంజరీటకము** - ఖంజుని వలె కాలు ఎత్తి యెత్తి వేయుచు నడచునది (ఖంజనము - కాటుకపిట్ట)

**ఖండకథ** - మహాకథలోని యవాంతర కథ (ఉపాఖ్యానము)

**ఖండకావ్యము** - మహాకావ్య లక్షణములలో కొన్నియే కలిగినది

**ఖండ పరశువు, ఖండపర్శువు** - ఖండించెడు గండ్రగొడ్డలి కలవాడు (శివుడు, పరశురాముడు)

**ఖండిక** - పన్ను లేకుండ గుత్తకిచ్చిన నేల (ఖండ్రిక)

**ఖండిత** - ప్రియునియందు పరస్త్రీ సంగమ చిహ్నములను జూచి యీర్ష్యపడు నాయిక

**ఖండేందు భూషణుడు** - అర్ధచంద్రు డలంకారముగా గలవాడు (శివుడు)

**ఖగపతి** - పక్షులకు ప్రభువు (గరుడుడు - ఖగరాజు)

**ఖగము** - ఆకాశమున సంచరించునది (పక్షి, బాణము, గ్రహము)

**ఖగుడు** - ఆకసమున సంచరించువాడు (సూర్యుడు, వేల్పు)

**ఖగేంద్రుడు, ఖగేశ్వరుడు** - పక్షుల నాయకుడు (గరుడుడు)

**ఖచరము** - ఆకాశమున సంచరించునది. (పక్షి, మేఘము)

**ఖచరుడు** - ఆకాశమున సంచరించువాడు (సూర్యుడు, చంద్రుడు, గంధర్వుడు)

**ఖజపము** - చిలుకగా వచ్చిన వెన్ననుండి కలిగినది (నేయి - ఘృతము)

**ఖజ్యోతి** - ఆకాశమున జ్యోతి వలె ప్రకాశించునది (మిడుగురు పురుగు - ఖద్యోతము)

**ఖట్వ** - పండుకొన దలచిన వారిచే కాంక్షింపబడునది (మంచము)

**ఖట్వాంగధరుడు** - ఖట్వాంగమను నాయుధమును ధరించువాడు (శివుడు)

**ఖట్వాంగము** - మంచపుకోడు, శివుని ఆయుధములలో నొకటి

**ఖట్వాంగి** - ఖట్వాంగధరుడు (శివుడు - ఖట్వంగి)

**ఖడ్గధేనువు** - కత్తికి పిల్ల వంటిది (చిన్నకత్తి)

**ఖడ్గపత్రము** - కత్తుల వంటి యాకులు గలది (నరకము నందుండు చెట్టు)

**ఖడ్గపుత్రిక** - ఖడ్గమునకు బిడ్డ వంటిది (చురకత్తి)

**ఖడ్గబంధము** - కత్తి ఆకారము వచ్చునట్లుగా అల్లబడిన బంధకవితా విశేషము (చరణాంత్య వర్ణ మొక్కటి, చరణయుగా ద్యమ్ముజేసి సరసులు ముమ్మా రిరు గడల మధ్య మొకటిగ బరుజుల గదియింప ఖడ్గ బంధం బొనరున్)

**ఖతమాలము** - ఆకసమున చీకటిమ్రాను వలె విస్తరించి యుండునది (మబ్బు, పొగ)

**ఖతిలకుడు** - ఆకాశమునకు బొట్టు వంటివాడు (సూర్యుడు)

**ఖదిరసారము** - చంద్రచెట్టు యొక్క జిగురు (కవిరి)

**ఖద్యోతనుడు** - ఆకసమును వెలుగొందు నట్లు చేయువాడు (సూర్యుడు)

**ఖద్యోతము** - ఆకసమున ప్రకాశించునది (ఖద్యోతకీటము - మిడుగురు పురుగు)

**ఖద్యోతుడు** - ఆకసమున ప్రకాశించువాడు (సూర్యుడు)

**ఖనకము** - భూమిని త్రవ్వునది (ఎలుక), భూమిని త్రవ్వుటకు పనికి వచ్చు సాధనము (గునపము)

**ఖనకుడు** - భూమిని త్రవ్వువాడు (ఉప్పరి)

**ఖనిత్రము** - భూమిని త్రవ్వు సాధనము (గునపము)

**ఖపరాగము** - ఆకసమున పరాగమువలె నుండునది (చీకటి)

**ఖపురము** - ఇంద్రియమును ఆవరించునది (పోకచెట్టు)

**ఖపుష్పము** - ఆకాశ కుసుమము వలె ఎక్కడను లేనిదనుట

**ఖభము** - అకాశమున బ్రకాశించునది (గ్రహము)

**ఖరకరుడు** - తీక్ష్ణమైన కిరణములు కలవాడు (సూర్యుడు)

**ఖరకోణము** - ఎక్కువగా ధ్వని చేయునది (తీతువు పిట్ట)

**ఖరణసుడు** - వాడియైన ముక్కు గలవాడు (గద్దముక్కువాడు)

**ఖరదళ** - గరుకైన ఆకులు గలది (మేడిచెట్టు)

**ఖరదూషణ** - మిక్కిలి దోషము కలది (పిచ్చి యెత్తించు ఉమ్మెత్త చెట్టు)

**ఖరనాళము** - గరుకైన కాడ కలది (తామరతీగ)

**ఖరపుష్ప** - తీక్ష్ణమైన పుష్పములు గలది (వాయింట చెట్టు)

**ఖరప్రియము** - కఠిన వస్తువులు తినుటయందు ఇష్టము కలది (పావురము)

**ఖరమంజరి** - వాడియైన ఎన్నులు కలది (ఉత్తరేనుచెట్టు)

**ఖరారునామా** - అంగీకార పత్రము

**ఖరాశ్వ** - గాడిద మక్కువతో తినునది (ఓమము చెట్టు)

**ఖరీవిషాణము** - గాడిద కొమ్మువలె ఎక్కడను లభింపనిదనుట

**ఖర్జూరకము** - కుట్టి బాధించునది (తేలు)

**ఖర్వాపేక్షిత ఫలము** - పొట్టివాడు అందని మ్రాని పండు నాశించిన విధము

**ఖర్వుడు** - అవయవ దార్ఢ్యముచే ధరించువాడు (పొట్టివాడు)

**ఖలకము** - నడుమ శూన్యము కలది (కుండ)

**ఖలినము** - ముఖ వివరమునందు లీనమై యుండు నది (గుఱ్ఱపుకళ్ళెము)

**ఖలిని** - కళ్ళెముల సమూహము

**ఖలీనము** - ఖలినము

**ఖల్వాటబిల్వీయము** - బట్టతలవాడు ఎండ బాధ సహింపజాలక మారేడు చెట్టు క్రిందకు బోగా మారేడు కాయపడి వాని తల బొప్పి కట్టినట్లు

**ఖల్వాటుడు** - తలపై వెంట్రుకలూడి పోయినవాడు (ఇంద్రలుప్తరోగి - బట్టతలవాడు)

**ఖసూచి** - ప్రశ్నకు సమాధానము తోచక ఆకసము వంక చూచువాడు (మందమతి)

**ఖస్కసరసము** - గసగసాల చెట్టు యొక్క బంక (నల్లమందు)

**ఖాతకము** - రక్షణార్థము కోటచుట్టు త్రవ్వబడిన జలాధారము (అగడ్త)

**ఖానోదకము** - త్రాగదగిన నీరు కలది (కొబ్బెరకాయ)

**ఖురాకము** - గిట్టలు గలది (పశువు)

**ఖేగమనము** - ఆకసమున జరించునది (కాలకంఠ పక్షి)

**ఖేచరము** - ఆకసమున సంచరించునది (పక్షి - ఖచరము)

**ఖేచరుడు** - అకాశమున దిరుగువాడు (సూర్యుడు, వేల్పు)

**ఖేటితాసుడు** - బిగ్గరగా స్తుతించి మేల్కొల్పు వాడు (వైతాళికుడు - బోధకుడు)

**ఖేవిహారుడు** - ఆకసమున విహరించువాడు (ఖేచరుడు)

**ఖోల్మకము** - ఆకాశమున (మండుచున్న) కొరవి వలె ఉండునది (అంగారక గ్రహము)

**గంగ** - గమన శీలము కలది

**గంగజాతర** - వర్షము కొరకు చేయు గంగపూజ

**గంగమయిల** - నలుపు పసుపు కలిసిన రంగు కలది. మిక్కిలి నల్లనిది(గంగమైల)

**గంగమయిలావు** - పసుపు నలుపు కలిసిన రంగు గల ఆవు (గంగమైలావు)

**గంగాధరుడు** - నీరు మోయువాడు (సముద్రుడు), గంగను శిరమున ధరించినవాడు (శివుడు)

**గంగాపుత్రుడు** - గంగ కొడుకు (భీష్ముడు, కుమారస్వామి) గంగా తీరమున సంకల్పము చెప్పించి స్నానాదులు చేయించువాడు బ్రాహ్మణుడు - పండా నదిపై పడవ నడిపి జీవించువాడు (ఒక సంకీర్ణ జాతివాడు)

**గంజనగాలు** - పిల్లలు ఇందు ఒంటికాలితో దుముకుదురు (ఖంజపాదక్రీడ - కుంటియాట)

**గంటెభాగవతులు** - గరిటెలో ఆముదపు నూనె వేసి ఒత్తు వెలిగించి చేతపట్టుకొని తనవంతు సంభాషణ చెప్పుచు నటించు కళాకారులు

**గండకత్తెర** - వాడియైన కత్తెర

**గండకము** - ప్రశస్తమైన గండస్థలము కలది (ఖడ్గమృగము)

**గండ్రగొడ్డలి తాలువు** - గండ్రగొడ్డలిని ధరించినవాడు (పరశురాముడు)

**గండపెండెరము, గండ పెండేరము** - కవులకు, రాజులకు బిరుదు సూచకముగా కాలికి తొడుగు స్వర్ణకంకణము (గండ పెండారము)

**గండశైలము** - గుట్టవంటి రాయి (బండ)

**గండాంగము** - గుట్ట వలె నుండెడి శరీరము కలది (ఖడ్గమృగము)

**గండారవు బొమ్మ** - దృష్టి దోషము తగులకుండుటకై ఉంచెడి బొమ్మ (దిష్టిబొమ్మ)

**గండూపదము** - గ్రంధులు కాళ్ళుగా గలది (వానపాము - ఎఱ్ఱి)

**గండోలి** - గండ స్థలముపై మునరునది (కణుదురీగ)

**గండోలిగాడు** - తోలు బొమ్మలాటయందు వికృత వేషభాషలచే నవ్వించువాడు (గందొడివాడు)

**గందపుకుడక** - బొట్టు నిమిత్తము చందనము ఉంచుకొను పాత్ర

**గంధకాష్ఠము** - సుగంధముతో గూడిన కట్టెగలది (మంచి గంధపుచెట్టు)

**గంధగజము** - మదముచే బరిమళించెడు ఏనుగు (మదపుటేనుగు)

**గంధధూళి** - పరిమళించెడు రేణువులు కలది (కస్తూరి)

**గంధనకులము** - ఒకవిధమైన వాసనగల్గిన మూషక విశేషము (చుంచు - కంపెలుక)

**గంధకము** - నిప్పు సంపర్కముతో పొగవాసన గలది అగ్ని పర్వతోద్రేకము వలన ఉత్పన్నమైనది (ఇది విద్యున్నిరోధకము సులభముగా పొడియగు పసుపు పచ్చని ద్రవ్యము)

**గంధ పాషాణము** - గంధముతో గూడిన ఖనిజము (ఇది సంయుక్త దశలో సల్ఫేట్లుగా లభించును - శుద్ధికాని గంధకము)

**గంధపుష్ప** - గుబాళించెడు పూలు గలది (నీలి చెట్టు)

**గంధఫలి** - గంధమే ప్రధానముగా గల ఫలములు కలది (ప్రేంకణపుచెట్టు), గంధ వే ప్రయోజనముగా గలది (సంపంగి మొగ్గ)

**గంధమాదనము** - మేరు పర్వతమునకు తూర్పున

నున్న పర్వతము నుగంధములచే పరవశింపజేయునది (గంధమాదన మందలి యడవి)

**గంధమాదని** - గంధమాత్రముచే వైకము కల్గించునది (కల్లు)

**గంధమార్జారము, గంధమార్జాలము** - స్వభావ సిద్ధముగ పరిమళించెడు మార్జాల విశేషము (గంధబిడాలిక - పునుగుపిల్లి)

**గంధమూషిక** - ఒక విధమైన వాసన గల ఎలుక (చుంచు)

**గంధమైథునము** - గోవు యొక్క యోనిమూచూచి కలియునది (ఎద్దు)

**గంధమోహిని** - పరిమళముచే పరవశింపజేయునది (సంపెంగమొగ్గ)

**గంధర్వ నగరము** - ఆకాశమున మేఘ బృందము చిత్రవిచిత్రాకారములతో నగరము వలె కనబడుట (మిధ్యా నగరము-ఇది కనబడుట అశుభప్రదము)

**గంధర్వులు** - గానము ధర్మముగా గలవారు

**గంధవహ** - గంధమును వహించునది (ముక్కు)

**గంధవహాయనము** - గంధవహునకు (గాలికి) మార్గమైనది (కిటికీ)

**గంధవాహము** - గంధమును వహించునది (గాలి)

**గంధవాహుడు** - గంధమును వహించువాడు (వాయువు)

**గంధ శుండిని** - గంధ యుక్తమైన (శుండము) ముట్టె కలది (గంధాఖువు - చుంచు)

**గంధశేఖరము** - పరిమళించు వానిలో మేటియైనది (కస్తురి)

**గంధేభము** - గంధ యుక్తమైన గజము (మదపు టేనుగు)

**గంధోతువు** - పరిమళించెడు పిల్లి (గంధ మార్జాలము - పునుగుపిల్లి)

**గంధోలి** - కుట్టి బాధించునది (కణుదురీగ)

**గంభారి** - జలమును భరించునది (గుమ్మడు చెట్టు)

**గంభీరవేది** - అంకుశమున బొడిచినను లక్ష్యపెట్టనిది (మదపు టేనుగు)

**గగన కుసుమము** - ఆకాశమునందు బుష్పము వలె దుర్లభమైనది

**గగన చరము** - ఆకాశమున తిరుగునది (పక్షి)

**గగన పుష్పము** - గగన కుసుమము

**గగన రత్నము** - ఆకాశమున రత్నము వంటివాడు (సూర్యుడు - ద్యుమణి)

**గగురపాటు** - హర్ష భయాదులచే వెంట్రుకలు నిక్కపొడుచుట (గగ్గురుపాటు - గగుర్పాటు)

**గజగామిని** - ఏనుగు నడక వంటి నడక గల యాడుది (స్త్రీ - మందగామిని)

**గజదంతుడు** - ఏనుగు దంతము కలవాడు (విఘ్నేశ్వరుడు)

**గజనిమీలనము** - (సింహభీతిచే) చూచియు చూడనట్లు కన్నులు మూసికొని ఉపేక్షించు ఏనుగు కంటిమోడ్పు

**గజభుక్తకపిత్థము** - ఏనుగు తిన్న వెలగపండులోని గుంజువలె ధనమెట్లు పోవునో తెలియదనుటలో వాడుక (కరిమ్రింగిన వెలగపండు)

**గజమాచలము** - ఏనుగు యొక్క మాంద్యమును వదలించునది (సింహము)

**గజముఖుడు** - ఏనుగు ముఖము కలవాడు (విఘ్నేశ్వరుడు)

**గజముచ్చు** - దొపుడు కాడు (గజదొంగ - ఎడత్రోవకాపరి)

**గజమోటనము** - ఏనుగును మర్దించునది (సింహము)

**గజయాన** - గజగమనము వంటి గమనము గల యాడుది (గజగామిని)

**గజరిపువు** - ఏనుగునకు శత్రువు (సింహము), గజాసురుని శత్రువు (శివుడు)

**గజస్నానము** - ఏనుగు స్నానము చేసి తిరిగి చెత్త తనపై చల్లుకొనును గాన స్నానము వ్యర్థమనుట

**గజా జీవుడు** - ఏనుగులను పోషించి బ్రతుకువాడు (మావటీడు)

**గజాననుడు** - గజముఖుడు ఏనుగు మొగము సామి

**గజారి** - గజరిపువు

**గజారోహుడు** - ఏనుగు నెక్కువాడు (మావటీడు)

**గజాహ్వము, గజాహ్వయము** - గజము యొక్క నామము కల పురము (హస్తినాపురము)

**గట్టివ, గట్టివా** - గట్టి వాక్కు కలది (గట్టివాయి - గయ్యాళి)

**గట్టి వాదనము, గట్టివాయిదనము** - గయ్యాళి తనము (ధూర్తత్వము)

**గట్టుతాలువు** - మందర పర్వతమును మూపుపై దాల్చినవాడు (విష్ణువు)

**గట్టుదాయ** - పర్వతముల రెక్కలను భేదించుటచే శత్రువైనవాడు (ఇంద్రుడు)

**గట్టుదారి** - పర్వతమును మూపుపై దాల్చినవాడు (గట్టుతాలుపు - విష్ణువు)

**గట్టుబ్రిమ్మరి** - కొండలపై దిరుగునది (కోతి - వానరము)

**గట్టుపకాసి** - పర్వత గంభీరుడు (ధీరుడు - కట్టుపకాసి)

**గట్టుపట్టి** - పర్వతరాజు సంతతి (పార్వతి, మైనాకుడు)

**గట్టురాచూలి** - పర్వత రాజగు హిమవంతుని కొమార్తె (పార్వతి)

**గట్టురాజల్లుడు** - హిమవంతునికి అల్లుడు (శివుడు)

**గట్టుల యెకిమీడు** - పర్వతములకు ప్రభువు (హిమవంతుడు - గట్టులరాయుడు)

**గట్టుల యెకిమీనిపట్టి** - పర్వతరాజగు హిమవంతుని కూతురు (పార్వతి)

**గట్టుల యెకిమీని పట్టిపట్టి** - హిమవంతుని కొమార్తెయగు పార్వతి యొక్క బిడ్డ (కుమారస్వామి)

**గట్టులరేడు** - గట్టుల యెకిమీడు (హిమవంతుడు)

**గట్టువాలు** -పరుల యింట గంధపుష్పాదులు నమకూర్చుచు పాతివ్రత్యమును కాపాడు కొనుచు జీవించునట్టి ఆడుది (గట్టివాలు - సైరంధ్రి)

**గట్టువిలుకాడు, గట్టువిలుతుడు** - మేరు పర్వత మును విల్లుగా పట్టినవాడు (శివుడు)

**గట్టువిల్దారి** - పర్వతమును విల్లుగా ధరించినవాడు (శివుడు)

**గట్ల గొంగ** - కొండల రెక్కలను విరిచినవాడు (ఇంద్రుడు - గట్లసూడు)

**గట్ల యెకిమీడు** - గట్టుల యెకిమీడు (గట్లరాయుడు)

**గట్ల యేలిక మనుమడు** - హిమవంతుని కూతు కొడుకు (కుమారస్వామి)

**గట్లరేనిబిడ్డ** - హిమవంతుని కూతురు (పార్వతి)

**గట్లసూడు** - గట్ల గొంగ (ఇంద్రుడు)

**గడనకత్తె** - ధనము సంపాదించుటకు తప్పుదారులు పట్టునది (రోచెల్వ - లంజె, వెలయాలు)

**గడనపడతి** - ధనము సంపాదించు పడతుక (పడుపుజాన - వెలయాలు)

**గడియకుడకలు** - గడియలను తెల్పు పాత్రములు (ఇసుక గళాసు - రెండు కుడకలను కలుపు సన్నని నాళము గల పైకుడకలో ఇసుక వేయగా క్రింది గాజు కొప్పెర (కుడక) నిండుటకు 2 గడియలు పట్టుచో మరల తలక్రిందుల చేసి నిండిన పిమ్మట 4 గడియలు లెక్కపెట్టుట నీటి గడియారము కూడ వాడుకలో ఉండెడిది)

**గడులుడు** - రొమ్మున (వీపున) పెద్ద కంతి గలవాడు (మరుగుజ్జువాడు)

**గడ్డరికా ప్రవాహము** - మందలో నొక గొఱ్ఱె ప్రవాహమున పడుట తటస్థించినచో అనుసరించుచున్న తక్కినవి సైతము నదియందే పడునట్టి విధము (గ్రుడ్డిగా అనుసరించుటలో వాడుక)

**గణనాథుడు, గణపతి** - ప్రమథ గణముల కధిపతియైనవాడు (వినాయకుడు)

**గణపర్వతము** - ప్రమథ గణములు వసించు కొండ (కైలాసము)

**గణపూర్వుడు** - గణమునందు ముఖ్యుడు గణశ్రేష్ఠుడు

**గణము** - ప్రమథుల సమూహము, ఛందస్సు లోని మగణము మొదలగునవి, వ్యాకరణ శాస్త్రములో నొక సూత్రము క్రింద వచ్చు పదజాలము, 27 రథములు 27 ఏనుగులు 81 గుఱ్ఱములు 135 కాల్బలము గల సేనా విభాగము (3 గుల్మములసేన)

**గణభర్త** - ప్రమథ గణనాయకుడు (శివుడు, వినాయకుడు)

**గణరూపి** - పెక్కు రూపములు కలది (జిల్లేడుచెట్టు)

**గణసిద్ధాంతము** - కూటమిలోనున్న వేర్వేరు పరమాణువులు విడిపోక యౌగికములతో గాని ఇతరమూల ద్రవ్యములతో గాని సంయోగించుట (గణమనగా యౌగికము లతో అనువర్తించు పరమాణు సముదాయము) రాసాయనికులు గణములను ఆవిష్కరించుట గణ సిద్ధాంతము

**గణాధిపుడు** - గణమునకు నాయకుడైన వాడు (3 గుల్మములు నడిపించువాడు, గుంపుపెద్ద), ప్రమథ గణముల కధిపతియైనవాడు (విఘ్నేశ్వరుడు)

**గణిక** - విటుల సమూహము గలది, ధనికులను లక్ష్యపెట్టునది (వేశ్య)

**గణేశ భూషణము** - గణపతికి అలంకార మైనది (సిందూరము - చెందిరము)

**గణేశుడు** - గణపతి

**గణోత్సాహము** - గుంపులుగా తిరుగుట యందు ఉత్సాహము కలది (ఖడ్గమృగము)

**గతజలసేతు బంధనము** - నీరు పోయిన పిమ్మట గట్టువేయుటవలె వ్యర్థమైన దాని విధము

**గతసన్నకము** - మదము ఉడిగిపోయిన ఏనుగు

**గతార్తవ** - ఉడిగిన ఋతు ధర్మము కలది (ముట్టుడిగిన ఆడుది)

**గదాధరుడు** - కౌమోదకమను గదను ధరించినవాడు (విష్ణువు)

**గద్యకావ్యము** - ఛందోబద్ధముకాని పదజాలము గల కావ్యము. (దశకుమార చరిత్ర మొ॥)

**గబ్బుచెంకమెకము, గబ్బుచెంపమెకము** - మద గంధముగల చెక్కులతో గూడిన మృగము (ఏనుగు)

**గబ్బునూనె** - మంటినూనె, కంపు కొట్టు చమురు (కిరసనాయిలు)

**గభస్తిహస్తుడు** - కిరణములు చేతులుగా గలవాడు (సూర్యుడు)

**గరదము** - మ్రింగిన వానిని జంపునది (విషము)

**గరదుడు** - అన్నాదులలో విషము పెట్టువాడు (ఆతతాయి)

**గరళము** - ప్రాణమును మ్రింగునది (విషము)

**గరుడ ధ్వజుడు** - గరుత్మంతుడు ధ్వజమున కలవాడు (విష్ణువు)

**గరుడ వాహనుడు** - గరుత్మంతుడు వాహనముగా గలవాడు (విష్ణువు)

**గరుడ స్తంభము** - గరుడ చిహ్నితమైన స్తంభము (ధ్వజస్తంభము)

**గరుడాగ్రజుడు** - గరుడునియన్న (అసూరుడు)

**గరుడిరౌతు** - గరుడవాహనుడు (విష్ణువు)

**గరుడుడు** - రెక్కల సాయమున ఎగురువాడు (గరుత్మంతుడు)

**గరుత్మంతము** - రెక్కలు గలది (పక్షి)

**గరుత్మంతుడు**-రెక్కలు గలవాడు (గరుడుడు)

**గర్తస్థమృతసర్పము** - కలుగులో చచ్చిపడియున్న త్రాచును చూచి మృత సర్పమని తెలిసియు సమీపింపజాలక భయపడునట్టి తీరు

**గర్తాటకము, గర్తాటము** - కలుగులో తిరుగునది (ఎలుక, పందికొక్కు)

**గర్దభము** - కర్కశముగా అరచునది (గాడిద)

**గర్భకవిత్వము** - చూ॥ గర్భితము

**గర్భకోశము** - గర్భమున కోశము (సంచి) వలె నుండునది

**గర్భదము** - చూలు నిలుపునది (పుత్రజీవము అనుచెట్టు)

**గర్భదరిద్రుడు** - పుట్టిన నాటినుండి తిండికి లేనివాడు

**గర్భదాసుడు** - పుట్టుకనుండి సేవకుడైనవాడు

**గర్భపాతని** - గర్భ (స్రావము) హాని కలిగించునది (గర్భఘాతిని - పొత్తిదుంప)

**గర్భశత్రువు** - పుట్టుక తోడనే శత్రువైనవాడు

**గర్భస్రావము** - నాల్గు మాసముల లోపల గర్భము జారిపోవుట (గర్భచ్యుతి - గర్భపాతము)

**గర్భాంకము** - అంకమధ్యమున వచ్చు అంకము (నాటక ప్రకరణము)

**గర్భాధానము** - గర్భోత్పత్తికై కావించు సంస్కారము

**గర్భాశయము** - గర్భమున జుట్టుకొని యుండెడు సంచి

**గర్భితము** - 1 వాక్యము నడుమ నొక వాక్యము కలిగి యుండుట (వాక్య దోషము) ఉదా - ఖలులౌ వెడమతుల తోడి సంగతి కడుహితమిది నీ కొనర్పగా వలదనగన్ ఇందు కడుహితమిది యను వాక్యాంతరము గర్భితమై యున్నది 2 పైకి తెలియకుండ లోపల ఉన్నది (గర్భమునందు గలది), సరసిజవృత్తము - ఇది పంచ విధ వృత్తము 1 శ్రీలోలా చంద్రాలయ చేలాశ్రిత సురచయ తనుజిత సజల ఘనా, 2 వ్యాల గ్రావావాల దయాళూ హతదితి సురపతి హరిసమగమనా, 3 బాలార్కాభా శైలా దపాలా ప్రతత భువన చయ భరణ నరసఖా, 4 జాలోద్వేలా ఖేలన శైలీ సతతము గొలుతుము సరవి మనుపుమీ 2నవాక్షర పాద సమవృత్తము

(గర్భితము) శ్రీలోలా చేలా, వ్యాల యాళూ, బాలా సాలా, జాలో శైలీ, (తొమ్మిదేసి అక్షరములొకపాదము) 3 కందము (గర్భితము) శ్రీలోలా చంద్రాలయ, చేలాశ్రి ఘనా, వ్యాల లద, యాళూ సమగమనా 4 కందము (గర్భిత ద్వితీయకందము) బాలార్కాభా శైలద, పాలా నరసఖా, జాలోద్వేలాఖేలన, శైలీ మనుపుమీ 5 మణిగణనికరము (గర్భితము) శ్రిత సురచయ ఘనా, హతదితి సమగమనా ప్రతత నరసఖా, సతతము మనుపుమీ సరసిజ వృత్తములో కందద్వయ, మణిగణ నికరము నవాక్షర పాద సమవృత్తములు గలవు (గర్భకవిత్వము) (ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసము - చూ పూండ్ల రామకృష్ణయ్య గారి పీఠిక)

**గర్వాటుడు** - గర్వముతో కాపలా కాయువాడు (ద్వారపాలకుడు)

**గళంతి(క)** - నీటిని స్రవింపజేయునది (జారీచెంబు, ధారాపాత్రము)

**గళకంబళము** - పశువులకు మెడక్రింద వ్రేలాడు కంబళివంటి తోలు (గంగడోలు)

**గళశుండిక** - గళమున చిన్న తొండము వలె ఉండునది (కొండనాలుక)

**గళస్తని** - మెడక్రింద చన్నుల వలె వ్రేలాడు మాంస పిండములు కలది ,ఆడుమేక)

**గవయము** - రంకె వేయుచు గోవునునుసరించునది (అడవియెద్దు - వన వృషభము)

**గవాంపతి** - గోవులకు పతి (గొల్ల, ఎద్దు), కిరణములకు పతి (సూర్యుడు)

**గవాక్షము** - కిరణ ప్రసారము కలది (వాతాయనము - కిటికీ)

**గవాక్షి** - ఎద్దు కన్నులవంటి పువ్వులు కలది (బుడమ - పిన్నపాపర)

**గవేధువు** - ఆవులకు ఆహారముగా పెట్టబడునది, నీళ్ళలో వృద్ధి పొందునది (అడవి గోధుమలు)

**గవ్యూతము, గవ్యూతి** - రెండు క్రోసుల కొలది (24 అంగుళములొక హస్తము ఎనిమిదివేల హస్తములొక క్రోశము)

**గహనము** - ప్రవేశింపరానిది దుష్టమృగము లచే గలపబడినది (అడవి, గుహ)

**గాంగాయని** - గంగ కొడుకు (కుమారస్వామి, భీష్ముడు)

**గాంగేయము** - గంగయందు అగ్ని హోత్రునిచే విడువబడి సువర్ణరూపమును బొందిన శివ(వీర్యము) తేజము (బంగారము)

**గాంగేయుడు** - గంగకు శంతనుని వలన బుట్టినవాడు (భీష్ముడు), ఈశ్వర వీర్యమును ధరించిన గంగ కుమారుడు (కుమారస్వామి)

**గాండీవము** - కణుపులు గలది (అర్జునుని విల్లు - గాండివము)

**గాండీవి** - గాండీవమను విల్లు కలవాడు (గాండివి - అర్జునుడు)

**గాంధర్వము** - వధూవరు లిష్టపడి రహస్యమున జేసికొను వివాహము (అష్టవిధ వివాహములలో నిది ఒకటి)

**గాంధారము** - గాంధార దేశపు జనులచే బాడబడునది, స్వరాంతరము యొక్క శ్రుతిని బుచ్చుకొనునది, వాక్కులను ధరించునది (స్వరవిశేషము)

**గాంధేరేయుడు** - గాంధారి కొడుకు (దుర్యోధనుడు, దుశ్శాసనుడు మొ॥)

**గాంధికుడు** - గంధ ద్రవ్యములను అమ్మి జీవించువాడు

**గాడుపుకొడుకు** - వాయుదేవుని కుమారుడు (భీముడు, ఆంజనేయుడు - గాడ్పుకొడుకు)

**గాడుపుచూలి** - వాయుదేవుని పుత్త్రుడు (గాడుపు కొడుకు - గాడ్పుచూలి)

**గాడుపు చెలికొడుకు** - అగ్ని దేవుని కుమారుడు (కుమారస్వామి - గాడ్పు చెలికొడుకు)

**గాడుపుటరదపుదొర** - గాలి తేరుగా గల (గాడ్పుటరదపుదొర - మన్మథుడు)

**గాడుపు తండ్రి** - గాడుపు యొక్క తండ్రి (ఆకాశము - ఆకాశాద్వాయు, వాయోరగ్నిః , గాడ్పుతండ్రి)

**గాడుపుతూపు** - వాయవ్యాస్త్రము (గాడ్పుతూపు)

**గాడుపుదిండి** - వాయువును భక్షించునది (గాడ్పుదిండి - సర్పము)

**గాడుపునెచ్చెలి** - వాయుదేవుని స్నేహితుడు (గాడ్పునెచ్చెలి - అగ్ని)

**గాడుపుపట్టి, గాడుపుబిడ్డడు** - గాడుపుచూలి (భీముడు, హనుమంతుడు)

**గాడుపుమేతరి** - గాడుపు దిండి (పాము)

**గాడుపు సంగడీడు** - వాయు సఖుడు (గాడుపు నెచ్చెలి, అగ్ని)

**గాత్రము** - నశించు స్వభావము కలది (శరీరము)

**గాధిజుడు** - గాధి యొక్క కుమారుడు (విశ్వామిత్రుడు)

**గాధేయుడు** - గాధి కొడుకు (విశ్వామిత్రుడు)

**గాములదొర** - భూతములకు ప్రభువు (శివుడు - భూతేశుడు)

**గాములరేడు** - గ్రహములకు రాజు (సూర్యుడు - గాములమేటి)

**గాములరేని పట్టి** - గాములమేటి కొడుకు (శని)

**గాయత్రి** - తన్ను (కీర్తించువారిని) జపించు వారిని రక్షించునది

**గారుత్మతము** - గరుత్మంతుని వలన బుట్టినది (గరుడపచ్చ)

**గార్హపత్యము** - ఎల్లవేళల మండుచు గృహపతిచే నిత్యము సేవింపబడునట్టిది

**గాలివకణంపు మేపుడు** - గాలి యాహారముగా గలది (పాము)

**గాలికొడుకు** - వాయుదేవుని పుత్రుడు (ఆంజనేయుడు, భీముడు)

**గాలిగంగలు** - పిశాచరూపము తాల్చిన క్షుద్రస్త్రీ దేవతలు గ్రామదేవతలు

**గాలిగుడి** - సూర్యచంద్రుల చుట్టును ఏర్పడు వలయము (వరదగుడి)

**గాలిచూలి, గాలిచూలు** - గాలి వలన బుట్టిన బిడ్డడు (అగ్ని, భీముడు, ఆంజనేయుడు - గాడ్పుచూలు)

**గాలి తండ్రి** - గాడుపు తండ్రి

**గాలిదిండి** - గాలిఆహారముగా గలది (పాము)

**గాలిపట్టి** - గాడ్పుచూలు (భీముడు, ఆంజనేయుడు)

**గాలిమెకము** - గాలికి వాహనమైన మృగము (లేడి)

**గాలిమేతరి,గాలిమేపరి**-గాలి దిండి (పాము)

**గాలిసూడు** - గాలి శత్రువుగా గలది, గాలిచే చెల్లాచెదరు చేయబడినది (మబ్బు - వాతారి)

**గిజ్జిగాడు** - బంగారు వన్నె పిట్ట (గిజిగాడు)

**గిత్త తత్తడి రేడు** - ఎద్దు వాహనముగా గల ప్రభువు (శివుడు)

**గిబ్బడాల్దొర, గిబ్బతత్తడి దొర, గిబ్బబాబా జోదు** - ఎద్దు వాహనముగా గల యోధుడు (శివుడు)

**గిబ్బరౌతు** - ఎద్దునెక్కి తిరుగువాడు (శివుడు)

**గిబ్బలరేడు** - గిబ్బలకు ప్రభువు (నందీశ్వరుడు)

**గిబ్బవయాళిజోదు** - ఎద్దుపై వాహ్యాళి కేగెడు యోధుడు (శివుడు)

**గిరికంటకము** - కొండలకు శత్రువు వంటిది (భిదురము - వజ్రాయుధము)

**గిరిజ** - పర్వత రాజగు హిమవంతునికి బుట్టినది (పార్వతి)

**గిరిజము** - కొండయందు బుట్టునది (అభ్రకము, శిలాజిత్తు)

**గిరిధన్వుడు** - మేరు పర్వతమును ధనుస్సుగా గొన్నవాడు (శివుడు)

**గిరిధరుడు** - గట్టుదారి (విష్ణువు - గట్టుతాల్పు)

**గిరిపుష్పకము** - కొండయందు పూవువలె నుండునది (శిలాజిత్తు)

**గిరిప్రియ** - ఆడు సవరపు మెకము

**గిరిప్రియము** - కొండయందు ప్రియము కలది (చమరీమృగము)

**గిరిప్రియుడు** - కైలాస పర్వతమునం దిష్టము కలవాడు (శివుడు)

**గిరిభిత్తు** - పర్వతముల రెక్కలను భేదించినది (వజ్రాయుధము - పవి) పర్వతముల రెక్కలను భేదించినవాడు (ఇంద్రుడు)

**గిరిశయుడు, గిరిశుడు** - కైలాసమున శయనించు ప్రభువు (శివుడు)

**గిరిస్తని** - పర్వతములు స్తనములుగా గలది (భూదేవి)

**గిరిస్రవ** - కొండ నుండి స్రవించునది (సెలయేరు)

**గిరిశుడు** - కొండపైఁబరుండువాడు-శివుడు

**గిరీశుడు** - పర్వతములకు ప్రభువు (గిరిరాజు - హిమవంతుడు), కైలాసమునకు ప్రభువు (శంకరుడు), వాక్కులకు అధిపతి (బృహస్పతి)

**గిలగిలము** - (గిలము = కుంభీరమను చిన్నజాతి మొసలి) గిలములను మ్రింగునది (పెను మొసలి)

**గిల్లచూపు** - ఒకవైపునకు ఒరగిన చూపు (మెల్ల)

**గీరథుడు** - రథము వలె వడి గల వాక్కుగల వాడు (బృహస్పతి - గీష్పతి)

**గీర్దేవి** - వాక్కుల కధిష్ఠాన దేవత (సరస్వతి - వాగ్దేవి)

**గీర్వాణులు** - శాపరూపమగు వాక్కు బాణముగా గలవారు వేద శాస్త్రరూపమైన వాక్కును జెప్పువారు (దేవతలు)

**గీర్పతి** - వాక్కులకు ప్రభువు (బృహస్పతి)

**గీర్బాణులు, గీర్వాణులు** - శాపరూపమగు వాక్కు బాణముగా గలవారు, వేద శాస్త్ర రూపమైన వాక్కును పలుకువారు (దేవతలు)

**గీష్పతి** - గీర్పతి

**గుండు బులుగుల వేటకాడు** - (గుండ్రని పిట్టలకు) జక్కవలకు పగవాడు (చంద్రుడు)

**గుచ్ఛపత్త్రము** - గుత్తి వలె నుండు ఆకు గలది (తాడిచెట్టు)

**గుచ్ఛఫల** - గుత్తులుగా నుండెడు ఫలములు కలది (అరటి, ద్రాక్ష మొ॥)

**గుచ్ఛఫలము** - గుత్తులుగా ఫలించునది (కుంకుడు, ఇందుగు - గుత్సఫలము)

**గుచ్ఛము** - ముప్పది రెండు పేటలు గల హారము

**గుచ్ఛార్ధము** - 16 పేటలు గల హారము

**గుజ్జువేలుపు** - పొట్టిదేవుడు (విఘ్నేశ్వరుడు)

**గుడపుష్పము** - తియ్యని పువ్వు కలది (ఇప్పపూవు - మధూకము)

**గుడ ఫలము** - బెల్లమువలె తియ్యనై యుండు పండు కలది (గొనుగు)

**గుడాకేశము** - జెముడు వలె గుబురుగా పెరిగిన జుట్టు (జటాజూటము)

**గుడాకేశుడు** - జెముడు కాడల వంటి కేశమ్ము కలవాడు నిద్రకు లొంగని వాడు (శివుడు, అర్జునుడు)

**గుడుసుకైదువు** - గుండ్రని యాయుధము (సుదర్శన చక్రము)

**గుడుసు కైదువ జోదు** - చక్రాయుధుడు (విష్ణువు)

**గుడుసుకొండ** - చక్రము వలె గుండ్రనై యుండు కొండ (చక్రవాళము - చుట్టుకొండ)

**గుడుసువాలు** - గుడుసుకైదువ (చుట్టు కైదువు)

**గుడుసువాల్నెరజోదు** - చక్రము ఆయుధముగా గల యోధుడు (గుడుసు వాల్దాల్పు - విష్ణువు)

**గుడూచి** - ఆరోగ్యమును కలిగించు రూపముగా కాపాడునది (తిప్పతీగ)

**గుణాలయము** - బట్టలతో ఏర్పరచిన గుడారము - గుణలయని

**గుణీభూత వ్యంగ్యము** - వ్యంగ్యము అప్రధానముగా గలది (వ్యంగ్యము ప్రధానముగా గలది - ఉత్తమ కావ్యము, వ్యంగ్యము స్ఫుటముగా లేనిది అధమకావ్యము దీనికి కావ్యాభాస మనియు వాడుక గలదు, వ్యంగ్యము అప్రధానముగా గలది మధ్యమ కావ్యము)

**గుత్సకము** - దుర్వాసనను పోగొట్టునది (పూలగుత్తి)

**గుదకీల(క)ము** - గుదస్థానమున మేకువంటిది (మూలవ్యాధి)

**గుదాంకురము** - గుదమున మొలకలు పుట్టునది (మూలవ్యాధి)

**గుదియ తాలుపు** - దండమును ధరించినవాడు (దండధరుడు - యముడు)

**గుదెతాల్పు** - గుదియ తాలుపు

**గుదోద్భవము** - గుదాంకురము

**గుప్తగతి** - రహస్యమైన సంచారము కలవాడు (వేగులవాడు - చారుడు)

**గుప్తచరుడు** - గుప్తగతి (గుప్తచారి - వేగులవాడు)

**గుబిలికాడు** - సకిలనాల పులుగు (గుబ్బిలి కాడు)

**గుబ్బలకొనురాలు, గుబ్బలాడి** - పెద్ద చన్నులు గల యాడుది (గుబ్బెత - జవ్వని)

**గుబ్బలి** - మేలైన పాలిండ్లు కలది (జవ్వని), శిఖరములు కలది (కొండ)

**గుబ్బలిదొర** - పర్వతరాజు (హిమవంతుడు)

**గుబ్బలి పట్టి** - పర్వతరాజగు హిమవంతుని కూతురు (పార్వతి)

**గుబ్బలిరాకన్నియ** - పర్వత రాజగు హిమవంతుని పుత్రిక (పార్వతి - అగజ)

**గుబ్బలిరేడు** - గుబ్బలిదొర (గుబ్బలి యెకిమీడు)

**గుబ్బలి విలుకాడు, గుబ్బలి విల్తుడు** - మేరు పర్వతమును విల్లుగా ధరించినవాడు (శివుడు - గుబ్బలి విల్దారి)

**గుదుఘ్నము** - కడుపుబ్బరమును పోగొట్టునది (తెల్లావ)

**గురుపత్త్ర** - తొందరగా ఉడుకని ఆకులు కలది (చింతచెట్టు)

**గురుదైవతము** - బృహస్పతి దేవతగా గలది (పుష్యనక్షత్రము)

**గురురత్నము** - బృహస్పతి కిష్టమైన మణి (పుష్యరాగమణి)

**గురువు** - అంధకారమనెడి యజ్ఞానమును పోగొట్టువాడు (ఉపాధ్యాయుడు), రెండు మాత్రలు గల వర్ణము (ఛందస్సు)

**గుజ్ఞపుజుక్క** - గుజ్జము వలె నుండు నక్షత్రము (అశ్విని)

**గుర్గురించు మెకము** - గుర్గురుమని యరచునది (అడవిపంది)

**గుర్విణి** - బరువైన గర్భము కలది (గర్భిణి)

**గుల్మము** - మూడు సేనా ముఖములు = 9 రథములు, 9 ఏనుగులు, 27 గుఱ్ఱములు, 45 కాల్బంట్లుగల సేన

**గుల్మమూలము** - గుబురైన వేళ్ళు కలది (అల్లము)

**గుహాశయము** - గుహయందు శయనించునది (సింహము, పరమాత్మ)

**గుహుడు** - తన సైన్యమును కాపాడు కొనువాడు (కుమారస్వామి)

**గుహ్యకుడు** - కుబేరుని నిధులను కాపాడువాడు (యక్షుడు)

**గుహ్యకేశ్వరుడు** - గుహ్యకులను దేవజాతి వారి ప్రభువు (కుబేరుడు)

**గుహ్యదీపకము** - తాను కనుపింపకుండ ప్రకాశము నిచ్చునది (మిడుగురు పురుగు)

**గుహ్యపుష్పము** -దాగిన (కనబడని) పువ్వు గలది (రావి - అశ్వత్థము)

**గూడుకట్టు** - సూర్యచంద్రుల చుట్టను వలయముగా నేర్పడు (పరివేషము)

**గూడుకానుపు** - గూటియందు పుట్టుక కలది (పక్షి - నీడోద్భవము)

**గూఢచారుడు** - గూఢ పురుషుడు (వేగు)

**గూఢనీడము** - ఒరులకు గానరాని గూడు కలది (కాటుకపిట్ట)

**గూఢ పాత్తు, గూఢ పాదము** - రహస్యమైన పాదములు గలది (పాము)

**గూఢ పురుషుడు** - రహస్యముగా వార్తలను దెలిసికొనువాడు (వేగులవాడు)

**గూఢ పుష్పకము** - ఆకులచే దాపబడిన పువ్వులు కలది (పొగడ - వకుళము)

**గూఢమైథునము** - రహస్యపు రతి గలది (కాకి - వరటము)

**గూఢ రత్నము** - ఇసుకలో దాచిన రత్నాదులను కనుగొన వలసినదిగా బాలికలొకరితో నొకరు పందెము వేసి ఆడుకొను ఒక ఆట

**గూఢవర్చస్కము** - గుప్తమైన మలము గలది (కప్ప - మండూకము)

**గూఢసాక్షి** - లంచము తీసికొన్న సాక్షి (కృతకసాక్షి), నిజము నెరింగిన సాక్షి (గుట్టు సాకిరి)

**గూఢాంఘ్రి** - కానరాని కాళ్లు కలది (గూఢ పాత్తు)

**గృధువు** - కోరుకొనువాడు, కామించువాడు

**గృధ్రరాజు** - గ్రద్దల ప్రభువు (జటాయువు)

**గృహకచ్ఛపము** - ఇంటి యందు తాబేలు వలె నుండునది (సన్నెకల్లు)

**గృహకన్య** - ఆడుబడుచు వలె ఇంటి మేలు కోరునది (కలబంద చెట్టు)

**గృహకర్త** - ఇంటి యందు గూడుకట్టు కొనునది (బూడిదరంగు పిచ్చుక)

**గృహకారి** - మట్టితో ఇల్లు కట్టుకొనునది (కణుదురీగ)

**గృహగోధిక** - ఇంట నుడుము వలెనుండునది (బల్లి)

**గృహనాశనము** - ఇంటికి కీడు కలుగజేయునది (పావురాయి)

**గృహనీడము** - ఇంటిలో గూడు కట్టునది (పిచ్చుక)

**గృహబలి** - గృహమున కాకి మొదలగు వాని నుద్దేశించి యుంచు అన్నాదికము

**గృహామణి** - ఇంటమణి వలె ప్రకాశించునది (దీపము)

**గృహామాచిక** - పట్టిన ఇంటిని వదలక శరించునది (గబ్బిలము)

**గృహామృగము** - ఇంటియందు దిరుగు పెంపుడు జంతువు (కుక్క మొ॥)

**గృహామేధి** - భార్యతో జేరి యుండువాడు (గృహస్థు)

**గృహామేధిని** - గృహస్థుని భార్య (గేస్తురాలు)

**గృహాశయ** - గృహమందు వలె నీడగల తావులందు పెరుగునది (తమలపాకు తీగ - నాగవల్లి)

**గృహి** - భార్య గలవాడు (గృహస్థుడు - గృహస్థు)

**గృహ్యము**-తీసికొనదగినది, ఇంటనుండునది

**గెలివికాడు** - సంతోషము పట్టలేక గోల చేయువాడు (రవణుడు)

**గెలుపుపేరువజీరు, గెలుపు బాసయొడ యడు** - విజయుడను పేరుగల యోధుడు (గెలుపు పేరుగలాడు - అర్జునుడు)

**గేందుకము** - గగనమందు చంద్రుని వలె నుండునది రివ్వున ఎగురుచు చంద్రునివలె వెలయునది (బంతి - గేండుకము)

**గేడెకాళ్ళవాడు** - పుల్లవలె పొడవుగా నుండు కాళ్ళు గలవాడు (కొంగకాళ్ళవాడు)

**గేహేక్ష్వేడి** - ఇంటి యందు మాత్రమే బీరములు పలుకుచు గర్జించువాడు (పిరికివాడు)

**గేహేదాహి** - ఎంతటి శూరుల నైన దహించి వేయుదునని ఇంట డంబములు పల్కువాడు

**గేహేనర్ది** - ఇంటనే ధ్వని చేయువాడు (పిరికివాడు)

**గేహేమేహి** - ఇంటనే మూత్రము విడుచువాడు (సోమరి)

**గేహేశూరుడు** - ఇంటి వద్ద డంబము లాడువాడు (పిరికివాడు)

**గైరము** - కొండకు సంబంధించినది, కొండ యందలిది

**గైరికము** - కొండయందు బుట్టునది (జేగురు, బంగారు)

**గైరికుడు** - కొండలయందు తిరుగువాడు, కొండజాతివాడు

**గైరేయము** - కొండలో పుట్టినది (గిరిజము)

**గొప్పడుగు మెకము** - పెద్ద పాదాలు గల జంతువు (ఏనుగు)

**గొప్పబొజ్జ మెకము** - పెద్ద కడుపు గల మృగము (ఏనుగు)

**గొప్పమెయిప్రోడ**-స్థూల శరీరముగల వేలుపు (పెద్దకడుపు వేలుపు - వినాయకుడు)

**గొప్పయజ్జ మెకము** - గొప్పడుగు మెకము (ఏనుగు)

**గొరియగొంగ** - గొఱ్ఱెలకు శత్రువు (అడవికుక్క, తోడేలు)

**గొరియలసూడు** - గొరియగొంగ

**గొఱ్ఱెదాటు** - గొఱ్ఱెవలె గ్రుడ్డిగా అనుసరించుట

**గోకర్ణము** - ఆవు చెవి యాకారము గల పాత్ర, కణుజు మృగము, దక్షిణ దేశమునందలి ఒక శివక్షేత్రము

**గోకులము** - గొల్లలుండు పల్లె (వ్రేపల్లె - గొల్లపల్లె), ఆవుల మంద

**గోగృష్టి** - ఒక దూడను మాత్రమే కన్నయావు (సకృత్ప్రసూతయగు గోవు)

**గోచారము** - మేషాది రాసులందు సూర్యాది గ్రహ సంచారము

**గోచిబాపడు** - గోచికట్టెడి బ్రాహ్మణుడు (బ్రహ్మచారి)

**గోణముదారి** - గోచి ధరించిన వాడు (కౌపీనధారి)

**గోత్రకీల** - కొండలు మేకులుగా గలది (భూమి)

**గోత్రభిత్తు** - పర్వతముల రెక్కలను భేదించినవాడు (ఇంద్రుడు - గోత్రభిదుడు)

**గోత్రము** - భూమిని రక్షించునది (పర్వతము)

**గోత్రువు** - గోవులను గాచువాడు (గొల్ల)

**గోదరుడు** - చర్మమునకై పశువులను కోయువాడు (చర్మకారుడు)

**గోదారణము** - భూమిని దున్నునది (నాగలి)

**గోదుహుడు** - ఆవుపాలు పితుకువాడు (గోధుక్కు)

**గోధ, గోధము** - విలుకాని చేతికి తొడిగి కొనుటకై ఉడుము తోలుతో చేయబడిన తొడుగు

**గోధా స్కంధము** - ఉడుము వంటి ప్రూను కలది (వెలి చంద్రచెట్టు)

**గోధుక్కు** - ఆవులను పాలు పితుకువాడు (గొల్లవాడు)

**గోధేనువు** - పాలిచ్చు సవత్సయగు గోవు

**గోధ్రము** - భూమిని ధరించునది (కొండ)

**గోనసము, గోనాసము** - గోవు ముక్కు వంటి ముక్కు కలది (కొండ చిలువ)

**గోపతి** - పశువులకు, కిరణములకు, స్వర్గమునకు ప్రభువు (ఆబోతు, సూర్యుడు, ఇంద్రుడు)

**గోపాలధాని** - గోపాలురుండు పల్లె (గొల్లపల్లె)

**గోపాలుడు** - గోవులను కాచువాడు (గొల్ల)

**గోపీరము** - కిరణములకు పీరమైనది (వేగుజాము)

**గోపీతము** - గోరోచనము వలె పచ్చనిది (ఒకజాతి కాటుకపిట్ట)

**గోపుడు** - గోపాలుడు

**గోపుచ్ఛము** - ఆవుతోక, నలువది పేటల సరము

**గోప్రచారము** - పసులు మేయుచోటు (పచ్చిక బీడు)

**గోబిగడ్డ** - ఒకానొక ఆకుకూర (కాబేజి)

**గోబి పువ్వు** - ఆకుల నడుమ పెద్ద పువ్వువలె పెరుగు ఒక జాతి కూర (కాలీఫ్లవరు)

**గోమయచ్ఛత్రము** - పేడ వేసిన చోట గొడుగు వలె పుట్టునది (కుక్కగొడుగు)

**గోమాయువు** - గోవులను మోసగించునది (నక్క)

**గోమారి** - గొవుల నెత్తురును పీల్చి బాధించునది (పిడుజు)

**గోమి** - వికృతములైన కూతలు కలది (నక్క)

**గో ముఖము** - గోవు యొక్క ముఖము వంటి ముఖము కలది (మొసలి, ఒక విధమైన కన్నము)

**గోముఖవ్యాఘ్రము** - పైకి గోవు వలె కనిపించుచు లోపల పెద్దపులి వలె ఘాతుక కృత్యములు చేయువాడు

**గోమేధికము** - పసుపురంగు గల ఒకానొక రత్నము

**గోమేధము** - గోవును చంపి చేయు ఒకానొక యజ్ఞము

**గోరంకువు** - వదరుచు లేడి వలె గంతులు వేయునది (గోరువంక)

**గోరక్షకుడు** - గోవులను కాపాడువాడు

**గోరుగల్లు** - గోళ్ళుతీయుటకై పనికివచ్చు పనిముట్టు (గోరుగొండి)

**గోరుచుట్టు** - గోటి చుట్టును లేచెడి కురుపు

**గోరో(చ)నము** - ఆవుల కడుపులలో నుండి తీసెడి ఒకానొక వస్తువు

**గోలకుడు** - భర్త మరణించిన పిదప మరియొకని వలన బుట్టినవాడు

**గోలాంగూలము** - గోవు తోకవంటి తోక కలది (కొండముచ్చు)

**గోలాసము** - నేలను ప్రకాశింపజేయునది (కుక్కగొడుగు)

**గోలిహము** - గోవులచే నాకబడునది (మొక్కపు చెట్టు - గోలీఢము)

**గోవర్ధనము** - గోవులను వృద్ధినొందించునది, ఒక కొండ

**గోవందని, గోవందిని** - గుణాధిక్యముచే భూమిపై పొగడబడుచున్నది (ప్రియాళు వృక్షము)

**గోవర్ధనగిరి** - గోవుల వృద్ధికి సాధనమైనది (బృందావనమందలి ఒక కొండ)

**గోవిందుడు** - గోవును గాని, భూమిని గాని, వేదమును గాని పాలించెడు ప్రభువు (శ్రీ మహావిష్ణువు)

**గోశృంగము** - నేలకు కొమ్ము వంటిది (తుమ్మచెట్టు)

**గోష్ఠక్ష్వేడి** - తన సమర్థతను గురించి గోష్ఠమునందు కొండంతలు చేసి పల్కువాడు (కోతలరాయడు - గోష్ఠశూరుడు)

**గోష్ఠపటువు** - తన గొప్ప తనమును గురించి గోష్ఠము నందింతింతలుగా చెప్పుకొనువాడు (గోష్ఠగల్భుడు -

**గోష్పదము** - గోపాద పరిమాణముగల చోటు

**గోస్తనము** - నలువది పేటలు గల హారము

**గోహితము** - గోవులకు మేలు చేయునది (మారేడు)

**గోళకుడు** - భర్త చనిపోయిన పిమ్మట మరియొక పురుషుని వలన కలిగిన కొడుకు (గోళుడు)

**గౌంజికుడు** - (బంగారము) తూనిక వేయుటకై గురిగింజ తీయు స్వభావము కలవాడు (కమసాలి - స్వర్ణకారుడు)

**గౌడికము** - బెల్లముతో చేయబడినది (ఒక విధమైన మద్యము, అప్పాలు మొ॥)

**గౌరి** - గౌరవర్ణము కలది (పార్వతి), సమర్తాడనికన్య

**గౌరిజము** - గౌరి రజస్సు వలన కలిగినది (అభ్రకము)

**గౌరుకాకి** - (గౌరు = బాకా) గౌరువలె బిగ్గరగా అరచునది (బొంతకాకి)

**గౌళి** - ఒకానొక స్త్రీ రాగము

**గ్రంథిచ్ఛేదకుడు** - మూటల ముడులు విప్పి దొంగిలించువాడు

**గ్రంథిహరుడు** - జటిల సమస్యను విడదీసి చక్కబెట్టువాడు (మంత్రి)

**గ్రహగ్రస్తము** - దయ్యము పట్టినది

**గ్రహణము** - రాహుకేతువులు సూర్య చంద్రులను పట్టుకొనుట

**గ్రహణీహరము** - అతిసార (ప్రవాహికా) రోగమును పోగొట్టునది (లవంగము)

**గ్రహనాయకుడు** - గ్రహములకు నాయకుడు (సూర్యుడు, శని)

**గ్రహపతి** - గ్రహములకు ప్రభువు (సూర్యుడు)

**గ్రాంథికము** - గ్రంథము నందలిది (భాష మొ॥)

**గ్రామకంఠము** - గ్రామములోని వారెల్లరకు సమాన అధికారములు గల భూమి

**గ్రామణి** - ఒక సముదాయమును నడుపువాడు (గ్రామాధికారి, ఊరిపెద్ద)

**గ్రామనెత్తము** - ప్రభుత్వము వారు గ్రామస్థులకు ఇండ్లు కట్టుకొనుటకు ఉచితముగా ఇచ్చిన స్థలము

**గ్రామసింహము** - గ్రామమున సింహము వలెదిరుగునది (గ్రామ మృగము - కుక్క)

**గ్రామహాసకుడు** - ఊరి వారి నందరిని వానితో నవ్వించువాడు

**గ్రామాధానము** - క్రూర మృగముల బారి నుండి రక్షించునది (మృగయ - వేట)

**గ్రామ్యము** - లక్షణ విరుద్ధమగు భాష

**గ్రామ్యాశ్వము** - ఊరియందు మోటైన గుఱ్ఱము వంటిది (గాడిద)

**గ్రావరోహకము** - రాతి మీద గూడ మొలచునది (పెన్నేరు)

**గ్రాహకుడు**- పాములను పట్టుకొనువాడు (పాములవాడు)

**గ్రాహము** - ప్రాణులను పట్టి విడువనిది (మొసలి)

**గ్రాహిఫలము** - మలబంధముచేయు ఫలము కలది (వెలగ - కపిత్థము)

**గ్రీష్మము** - జలమును త్రాగివేయునది

**గ్రుడ్డుకానుపు** - గ్రుడ్లను పెట్టునది ( పక్షి, పాము మొ॥

**గ్రైవేయకము** - మెడకు బెట్టుకొను హారాదికము (కంటె మొ॥)

**గ్రైష్మము** - గ్రీష్మర్తు సంబంధమైనది

**గ్రైష్మి** - గ్రీష్మర్తువు నందు పుట్టునది (విరజాజి, నవమల్లిక)

**గ్లాస్నువు** - రోగముచే కృశించినవాడు

**ఘంటాతాడుడు** - వేళ తెలుపు గంటలు కొట్టువాడు

**ఘంటాపథము** - గంటలతో గూడిన యేనుగులకు మార్గము, పది బారలు వెడల్పు గలిగి కాలవరిమితి తెల్పు రాజమార్గము (సంసరణము - రాచబాట)

**ఘంటారావము** - గంటల వలె మ్రోగెడు కాయలుగలది (గిలిగిచ్చచెట్టు - గిలక చెట్టు )

**ఘంటికము** - గంటల వంటి పూలు పూయునది (ఉమ్మెత్తచెట్టు)

**ఘటచక్రము** - కుమ్మరి కుండలు చేయు సారె

**ఘటజుడు** - కలశము (ఘటము) నుండి పుట్టినవాడు ద్రోణుడు అగస్త్యుడు- కుంభ సంభవుడు)

**ఘటికము** - కుండవలె ఉండునది పిరుదు

**ఘటీయంత్రము** - గడియలు తెలుపు యంత్రము (గడియారము) జలగ్రాహియగు ఏతము

**ఘటోత్కచుడు** - కుంభము వలె గుబురైన జుట్టు కలవాడు

**ఘటోదకము** - కుండలొ వలె లోన నీళ్ళున్నది (కొబ్బెర బొండము)

**ఘటోధ్ని** - కుండవంటి పొదుగు కలది (అవు, బఱ్ఱె)

**ఘటీకుటి** - సుంకము వసూలు చేయు చోటు

**ఘట్టకుటీ ప్రభాతక్రమము** - బండివాడు ఘాటిపాకను జూచి సుంక మెగ వేయుటకై రాత్రి భాగమున ప్రయాణము చేసి ఎటు పోయినను ఏదియో యొక ఘాటి వద్ద సుంకము ఈయవలసి యుండుటచే తొలుత వచ్చిన ఘాటిపాక సమీపమునకే తెల్లవారు సరికి జేరుట

**ఘనచ్ఛదము** - దట్టమైన ఆకులు చిగుళ్ళు కలది ( మునగచెట్టు)

**ఘనతాళము** - మబ్బులకై ఆకనము వంకచూచునది (వానకోయిల)

**ఘనతోలము** - మబ్బును కోరి పైకి రప్పించుకొనునది (చాతకపక్షి)

**ఘనత్వక్కు** - దళసరి బెరడు (వట్ట) కలది (మునగచెట్టు)

**ఘనపాషండము** - మబ్బును జూచి ఉరుమును విని పొంగిపోవునది (నెమలి - మయూరము)

**ఘనఫలము** - వస్తువు యొక్క పొడుగు, వెడల్పులను (ఎత్తు, లోతు, మందములలో ఒకదానితో గుణింపగా వచ్చిన లబ్ధము

**ఘనమూలము** - ఒక సంఖ్యను అదే సంఖ్యతో

గుణింపగా వచ్చిన లబ్ధమును మరల అదే సంఖ్యతో గుణింపగా వచ్చు లబ్ధమునకు మూలము

**ఘనరసము** - మబ్బునుండి వచ్చినరసము (నీరు) చిక్కని రసము కలది (ఘనసారము, జిగురు) ఎక్కువ రసము కలది (చాగచెట్టు)

**ఘనవర్త్మ** - మేఘములు చరించు మార్గము (ఆకాశము)

**ఘనవాసము** - మిక్కిలి పరిమళము కలది (గుమ్మడిచెట్టు)

**ఘనసారము** - మబ్బు యొక్క సారము (జలము) ఘనము వంటి సారము కలది (కర్పూరము)

**ఘనస్కంధము** - పెద్దమ్రాను కలది (కొండ మామిడిచెట్టు )

**ఘనాకరము** - మేఘములకు నెలవైనది (వర్షా కాలము)

**ఘనాగమము** - మబ్బులు తరచుగా వచ్చుచుండు కాలము( వానకారు)

**ఘనాత్యయము** - మబ్బులు తొలగి పోవుకాలము (శరత్కాలము)

**ఘనామయము** - అతిగా తిన్నచో ఎక్కువ జబ్బు చేయునట్టిది ( ఖర్జూరము)

**ఘనాశ్రయము** - మబ్బులకు నెలవైనది (ఆకాశము)

**ఘనోపలము** - మేఘములు వర్షించురాయి వంటిది (వడగల్లు)

**ఘర్మచర్చిక** - ఉక్కచే శరీరమున కల్గెడు పూత వంటిది (చెమటకాయ)

**ఘర్మదీధితి** - వేడి కిరణములు గలవాడు (సూర్యుడు)

**ఘస్మరుడు** - భక్షించు స్వభావము కలవాడు (తిండిపోతు)

**ఘస్రము** - చీకటిని తొలగించునది

**ఘాంటికుడు** - ఘంటలు మ్రోగించుచు రాజును మేల్కొల్పువాడు (వైతాళికుడు)

**ఘాతము** - గుణింపగా వచ్చిన లబ్ధము

**ఘుణప్రియ** - కాష్ఠకీటముల కిష్టమైనది (దంతిచెట్టు)

**ఘుణవల్లభ** - నుసిపురుగులకు ప్రియమైనది (అతరసచెట్టు)

**ఘుణాక్షరము** - కాష్ఠకీటములు (నుసి పురుగులు) తొలువగా యథాదృచ్ఛికముగా ఏర్పడిన వర్ణాకారము.

**ఘూకము**- ఘూయని అరచునది(గుడ్లగూబ)

**ఘూకారి** - గుడ్లగూబకు శత్రువైనది (కాకి)

**ఘూర్ణితుడు** - గిరగిర తిరిగిపడినవాడు నిద్రచే అటునటు తూగువాడు

**ఘృతకుమారి** - నేతివంటి (జిడ్డైన) సొనకలది (కలబందచెట్టు)

**ఘృతకేశుడు** - ప్రకాశించెడు కేశముల వలె నున్న జ్వాలలు కల(వాడు)ది (అగ్ని)

**ఘృతకోశాతకి** - నీరు ఎక్కువగా గలది (నేతిబీర)

**ఘృతాచి** - జలముల నుండి పుట్టినది (ఒకానొక అప్సరస)

**ఘృతేలి** - నేతికి పట్టునది (ఎఱ్ఱచీమ), నూనెకై ఆశపడునది (గబ్బిలము -తైలపాయి)

**ఘృతోదము** - నేతివలె జిడ్డుగలిగి రుచ్యమైన నీరుగలది (నేతి సముద్రము కుశద్వీపమునందలిది)

**ఘోటకము** - భూమియందు పొరలునది గుఱ్ఱము

**ఘోటము** - భూమి యందు పొర్లాడునది (గుఱ్ఱము)

**ఘోటక బ్రహ్మచర్యము** - గుఱ్ఱములు బ్రహ్మచర్య నియమమును పాటింపవనుట

(ఆడుగుఱ్ఱముతో మగగుఱ్ఱమును కలువనీయరు కలిసినచో తీవ్ర జ్వరాదులకు లోనగును అనుకూలింపక బ్రహ్మచర్యమును పాటించు వారియందు వాడబడునది

**ఘోటకముఖుడు** - గుఱ్ఱపు ముఖము గలవాడు (కిన్నరుడు)

**ఘోణ** - పొడవైన ముట్టెకలది(పంది, ఏనుగు)

**ఘోరఘుష్యము** - చెవులు చిల్లులు పడునట్లు కఠోరముగా మ్రోగునది (కంచు)

**ఘోరఘోరతరుడు** - మిక్కిలి భయము గొల్పువాడు (శివుడు)

**ఘోరదర్శనము** - భయంకరమైన దర్శనము కలది (గుడ్లగూబ)

**ఘోరరాసనము, ఘోరరాసి, ఘోర వాశనము** - ఘోర మగు ధ్వని కలది (నక్క - ఘోరవాశి)

**ఘోలము** - చిలుక బడినది (మజ్జిగ - ఘులము)

**ఘోషకము** - ఎండినపుడు (తెల్లపూలుగల ఆవడచెట్టు)

**ఘోషము**-దీనియందు గోవులు ఘోషించును (గొల్లపల్లె)

**ఘోషయిత్నువు** - ప్రశంసాపూర్వకముగా చాటెడు వాడు (బట్టువాడు)

**ఘోషవతి** - మధురనాదము కలది (వీణె)

**ఘ్రాణజము** - ముక్కున ఉదయించునది (ముక్కువలన తెలియబడునది - వాసన)

**ఘ్రాణదుఃఖద** - ముక్కునకు బాధ కల్గించునది (తుమ్ము)

**ఘ్రాతవ్యము** - వాసన చూడతగినది (ఘ్రేయము)

**చంకదుడ్డుశరణార్థి** - చంకలో దుడ్డు పెట్టుకొని శరణు కోరువాడు (ధూర్తుడు)

**చంకతాళి** - చంకదిగని బిడ్డ, చంకను తగిలించు కొనుమూట.

**చంచరీకము** - పుష్పముల యందు జరించు చుండునది (తుమ్మెద - చంచరి)

**చంచుభృత్తు, చంచుమంతము** - ముక్కు కలది (పక్షి)

**చంచుసూచి** - సూది వంటి ముక్కు కలది (కారండవపక్షి - కన్నెలేడిపిట్ట)

**చండ** - కోప స్వభావము గల స్త్రీ, తీవ్రరసము కలది

**చండకరుడు** - తీవ్రమైన కిరణములు కలవాడు (సూర్యుడు)

**చండాంశువు** - వేడి కిరణములు కలవాడు (చండకరుడు - సూర్యుడు)

**చండిక** - పార్వతి శరీరము నుండి పుట్టిన దేవి, చండుడను దనుజుని హత మార్చినది

**చండీకుసుమము** - దుర్గకిష్టమైన పూలు కలది (ఎఱ్ఱగన్నేరు చెట్టు)

**చందకుడు** - చల్లని కిరణములచే ఆహ్లాద పర్చువాడు (చంద్రుడు)

**చందన పుష్పము** - చందనము వలె పరిమళించు పూవు కలది (లవంగము - శ్రీసంజ్ఞము)

**చందనము** - ఆహ్లాద పెట్టునది (మంచి గంధము)

**చందమామగుటకలు** - అమృతమూర్తి యగు చందమామను చూచి గుటకలు మ్రింగుట (అందని మ్రాని పండ్లకు అఱ్ఱులు చాచుట వంటిది)

**చందమామ పులుగు** - వెన్నెల పులుగు (చకోరపక్షి)

**చందమామ యల్లుడు** - చందమామకు అల్లుడైనవాడు (మన్మధుడు)

**చందిరుడు** - సంతోషింప జేయువాడు (చంద్రుడు)

**చందురువంకలు** - చందురుని వంకల వంటి వంకలు (చందురుకూనలు - గోటినొక్కులు)

**చంద్రకము** - చంద్రుని వలె వెలయునది నీటియందు చమురు పడుట వలన నేర్పడు చంద్రాకారమగు మండలము (నెమలిపురికన్ను, గోరు)

**చంద్రకాంతము** - చంద్రకిరణములు సోకుటచే స్రవించునది (చలువరాయి)

**చంద్రచూడుడు** - చంద్రశేఖరుడు (శివుడు)

**చంద్రజుడు** - చంద్రుని కొడుకు (బుధుడు)

**చంద్రనామము** - చంద్రుని పేర పిలువ బడునది (కర్పూరము)

**చంద్రబాల** - చంద్రనామము కల కప్పురమునకు బిడ్డవంటిది (ఏలకి)

**చంద్రభూతి** - చంద్రుని వంటి కాంతి కలది (చంద్ర బీజము - వెండి)

**చంద్రమణి** - చంద్రకాంత మనెడి మణి (చలువరాయి)

**చంద్రమసుడు, చంద్రముడు** - చంద్రమనగా కర్పూరము - కర్పూరముతో పోల్పబడువాడు (చంద్రుడు)

**చంద్రలోహము** - చంద్రునివంటి కాంతి కలలోహము (వెండి - చంద్రపుష్పము)

**చంద్రవ్రతము** - చంద్రలోక ప్రాప్తికై ఆచరించు వ్రతము (చాంద్రాయణము)

**చంద్రశేఖరుడు** - చంద్రుడు సిగపూవుగా గలవాడు (శివుడు - చంద్రమౌళి - జాబిలితాలుపు)

**చంద్రసంజ్ఞము** - చంద్రునియొక్క పేళ్ళు తనకు పేళ్ళుగా గలది (కర్పూరము - సితాభ్రము)

**చంద్రసంభవుడు** - చంద్రుని కొడుకు (బుధుడు - చాంద్రమసాయనుడు - చంద్రపుత్రుడు)

**చంద్రహాసము** - ప్రకాశమున చంద్రుని సైతముగేలిసేయ జాలినది (పెద్దకత్తి), చంద్రుని వెన్నెల వలె ప్రకాశించునది (వెండి)

**చంద్రాతపము** - వెన్నెల బారి నుండి కాపాడునది (మేలుకట్టు)

**చంద్రికాద్రావము** - వెన్నెలచే కరగునది (చలువరాయి)

**చంద్రికాపాయి** - వెన్నెలను ద్రావునది (చకోరపక్షి)

**చంద్రిలుడు** - చంద్రుడు సిగపూవుగా గలవాడు (శివుడు)

**చంద్రుడు** - మనస్సును సంతోషింపజేయు వాడు

**చంద్రునకు నూలుపోగు** - చంద్రునకు నూలుపోగు ఇచ్చి నమస్కరింతురు - గొప్ప వారికి తృణమో - పణమో సమర్పించు కొనుట

**చంద్రోపలము** - చంద్రున కిష్టమైన రాయి (వెన్నెలరాయి)

**చంపువు** - గద్యపద్యములతో కూడిన కావ్యము (ప్రబంధము)

**చకారపుగుడులు, చకారగుళ్ళు** - చకారము నకు గుడి ఇచ్చుట అనగా (ఛి, ఛీలు) ప్రయోగించుట (ఛివాట్లు - తిట్లు)

**చకితము** - నాయికకు ప్రియుని యెదుట కలిగెడు సంభ్రమము, కలతపడినది, వెరచినది

**చకోరము, చకోరము** - చంద్ర కిరణములను గ్రోలి తృప్తిపడునది (నెలతావడము - వెన్నెల పులుగు)

**చక్కిలము** - పిండితో మెలిపెట్టి చక్రము వలె జేసెడి భక్ష్యవిశేషము

**చక్కుపడగ** - చక్కు = ఆరును, పడగ = పాచికలాటయందు ఒంటి చుక్కయును = ఆరునొకటి (సప్తసంఖ్య)

**చక్కెరతిండి** - చక్కెర తిండిగా గలది (చిలుక)

**చక్కెరతిండి పులుగు** - చక్కెర తిండిగా గల పక్షి (శుకము - చిల్క)

**చక్కెరవిలుకాడు** - చెరకు విలుకాడు (ఇక్షుధన్వుడు - మన్మథుడు)

**చక్కెరవింటిజోదు** - చెరకు వింటిని ధరించిన మొనగాడు (మన్మథుడు)

**చక్రకము** -ఒకదానిపై నొకటి యాధారపడుట అను ఒకానొక తర్కదోషము

**చక్రగజము** - దురదను బోగొట్టునది (తంటెపుచెట్టు - చక్రమర్దవృక్షము)

**చక్రచరము** - గుంపుగా తిరుగునది (పశు పక్ష్యాది)

**చక్రజీవకుడు** - సారె త్రిప్పి జీవించువాడు (కుమ్మరి)

**చక్రతైలము** - చక్రమర్ద బీజతైలము (తంటెపునూనె)

**చక్రదంష్ట్రము** - చక్రము వంటి కోర కలది (పంది)

**చక్రధరుడు** - సుదర్శన చక్రమును ధరించిన వాడు (విష్ణువు), రాష్ట్రమును ధరించిన వాడు (చక్రవర్తి)

**చక్రపక్షము** - చక్రాకారములయిన రెక్కలు గలది (హంస - చక్రాంగము)

**చక్రపర్ణము** - చక్రములను బోలిన పర్ణములు కలది (కోలపొన్నచెట్టు)

**చక్రపాణి** - చక్రము పాణియందు గలవాడు (విష్ణుమూర్తి - చుట్టు కైదువుతాల్పు)

**చక్రపాదము** - తిరిగెడు చక్రములే పాదము (లైనది) లుగా గలది (రథము, బండి), చక్రముల వంటి పాదములు కలది (ఏనుగు)

**చక్రబంధము** - పదిచుట్లు ఆరు దళములు ఉండునట్లు చక్రమువేసి శార్దూల విక్రీడిత వృత్త పాదములను ఆ దళములలో నింపవలెను

**చక్రబంధువు** - చక్రవాకములకు జుట్టమైన వాడు (సూర్యుడు)

**చక్రభేదిని** - చక్రవాకములకు వియోగము కలిగించునది (రాత్రి)

**చక్రభ్రమణోదాహరణము** - ఒకసారి త్రిప్పి వదలిన కుమ్మరి వాని చక్రము దండము లేకున్నను దిరుగునట్లు దేహధారణ కర్మ క్షీణింపక పోవుటచే జనన మరణ రూప సంసార చక్రమున పరిభ్రమింపక తప్పదనుట

**చక్రమండలి** - చక్రము వంటి చుట్ట కలది (కొండ చిలువ - గోనసము)

**చక్రమర్దనము** - దద్రురోగమును బోగొట్టునది (తంటెపుచెట్టు)

**చక్రముఖము** - చక్రాకారమగు ముట్టె కలది (పంది)

**చక్రరదము** - చక్రము వంటి కోర కలది (చక్రదంష్ట్రము - పంది)

**చక్రవాకము** - గుండ్రని దగుటచే చక్రమను పదముతో వ్యవహరింపబడుచున్నది (జక్కవపిట్ట)

**చక్రవాళము** - భూ మండలమును చక్రము వలె చుట్టుకొని యున్నట్లున్న పర్వతము (లోకాలోక పర్వతము - చుట్టుగొండ), సంబోధన విభక్తులతో గూడిన పద్యము పిదప గద్యము నుండి విడిచిన పదమును తిరిగి అన్యవాక్యాదిని చెప్పు నట్టిది చక్రవాళము (క్షుద్రప్రబంధము లోనికి వచ్చునది)

**చక్రవృద్ధి** - దఫాలు వారిగా వడ్డీ అసలుతో కలిసి మొత్తమై వృద్ధి పొందుచుండునది (చక్రవడ్డీ)

**చక్రవ్యూహము** - మండలాకారముగ సేనను నియమించిన మొగ్గరము

**చక్రాంగము** - చక్రాకారములైన యంగములు కలది (జక్కవ, చక్రాంగి = ఆడుజక్కవ, ఆడుహంస)

**చక్రి** - చక్రము కలవాడు (విష్ణువు)

**చక్రీవంతము** - చక్రము వలె సదా సంచరించు చుండునది (గాడిద)

**చక్రోపజీవి** - గానుగచే జీవించువాడు (గాండ్లవాడు - తైలికుడు), సారె త్రిప్పుటచె జీవించువాడు (కుమ్మరి)

**చక్షుశ్శ్రవము** - కన్నులతో వినునది (పాము)

**చటకము** - గింజలను పొడిచ్చి తినునది (పిచ్చుక)

**చట్టుపురుగు** - భూమిలోని రాళ్ళక్రింద నుండు పురుగు

**చతురంగము** - నాలుగు అంగములు గల సేన (రథములు, ఏనుగులు, గుఱ్ఱములు, బంట్లు)

**చతురంగుళము** - నాలుగు అంగుళముల ప్రమాణము కలది, నాలుగు అంగుళములు గలిగిన ఆకులు గల కణుపులున్నది (రేలచెట్టు - ఆరగ్వధము)

**చతురంతయానము** - నాలుగు కాళ్ళు (కోళ్ళు) గల ప్రయాణ సాధనము (పల్లకీ)

**చతురశ్రము** - నాలుగు కోణములు (మూలలు) గలది (చదరము)

**చతురుపాయములు** - సామ, దాన, భేద, దండము అను నాల్గు ఉపాయములు

**చతురూషణము** - పిప్పలివేరు, పిప్పలి, శొంఠి, మిరియాలు అను నాల్గు కారపు ద్రవ్యముల సముదాయము

**చతుర్గతి** - నాల్గు విధములైన గమనము గలది (తాబేలు - నడచుట, ప్రాకుట, దొర్లుట, ఈదుట)

**చతుర్జాతకము** - ఏలకులు, దాల్చినచెక్క, జాపత్రి, నాగకేసరములను సజాతీయ సమూహము (చాతుర్జాతకము)

**చతుర్థభాక్కు** - ఆపత్కాలమున పంట యందు (ఆరవవంతుకు బదులుగా) నాల్గవవంతు పన్నుగా దీసికొనువాడు (రాజు)

**చతుర్దంతము** - నాలుగు దంతములు కలది (చౌదంతి - ఐరావతము)

**చతుర్దశ చాటువులు** - పదునాల్గు విధములగు పద్య కవిత్వములు (1 పద్యము - ముక్తము, 3 పద్యములు - లోక్యము, 4 పద్యములు - వారధిమాల, 5 పద్యములు - పంచరత్నములు, 8 పద్యములు - వారణమాల, 9 పద్యములు - నవరత్నములు, 10 పద్యములు - అవతారమాల, 11 పద్యములు - రుద్రమాల, 12 పద్యములు - భాస్కరమాల, 14 పద్యములు - మనుమాల, 16 పద్యములు - శశికళ, 18 పద్యములు - పురాణమాల, 24 పద్యములు - గాయత్రీమాల, 27 పద్యములు - నక్షత్రమాల, తారావళి)

**చతుర్దోలము** - నలుగురు మోయదగిన ఊయెల వంటి సాధనము (పల్లకీ)

**చతుర్భుజుడు** - నాలుగు చేతులు కలవాడు (విష్ణువు)

**చతుర్ముఖుడు** - నాల్గు ముఖములు గలవాడు (బ్రహ్మ)

**చతుర్యుగము** - కృత, త్రేతా, ద్వాపర, కలియుగముల సముదాయము

**చతుర్లవణములు** - సైంధవ సౌవర్చ బిడ సముద్రలవణముల సముదాయము

**చతుర్వర్గము** - ధర్మార్థ కామమోక్షము లను

పురుషార్థముల సముదాయము (చతుర్భద్రము - చతుర్విధ పురుషార్థములు)

**చతుర్వింశతి గుణములు** - రూపరస గంధే త్యాదులైన ఇరువది నాల్గు తర్క సంబంధ గుణములు, శ్లేష ప్రసాద సమత్వ మాధుర్యాదులైన ఇరువది నాల్గు కావ్య గుణములు

**చతుర్వేదుడు** - నాల్గ వేదముల చేతను తెలుపబడువాడు, నాలుగు వేదములు అధ్యయనము చేసినవాడు

**చతుర్హాయణి** - నాలుగేండ్ల వయసు గలది (బాలిక, దూడ మొ॥)

**చతుష్కము** - నాలుగు స్తంభములున్నది (మంటపము - చవికె)

**చతుష్కర్ణము** - నాలుగు చెవులతో విన్నది (రహస్యము)

**చతుష్పథము** - నాలుగు వీధులు కలియు చోటు (కూడలి - చౌరస్తా -శృంగాటకము)

**చతుష్పదము** - నాలుగు కాళ్ళుగల జంతువు (చతుష్పాత్తు)

**చతుష్పాటీ** - నాల్గు దిక్కులను ఒరయునది (ఏరు, నది)

**చతుష్పాణి** - నాలుగు చేతులు కలవాడు (చతుర్భుజుడు)

**చతుస్సనుడు** - చతుర్విధ పురుషార్థముల నొసగువాడు (శ్రీమహావిష్ణువు)

**చతుస్సమము** - చందనము, అగరు, కస్తూరి, కుంకుమ అను నాల్గు అనులేపన ద్రవ్యములు

**చత్వారము** - నలువదేండ్లకు వచ్చు దృష్టి మాంద్యము

**చదరంగము** - కరి తురగ రథ పదాతులతో గూడిన యాట (చతురంగము)

**చదలకాపులు** - స్వర్గమున నివసించెడు వేల్పులు (జేజేలు)

**చదలుకెంపు** - ఆకాశమునకు కెంపువంటి వాడు (సూర్యుడు)

**చదలుచూలి** - ఆకాశమునకు పుత్తుని వంటివాడు (వాయువు - చదలుకుఱ్ఱడు)

**చదలుతేజి** - స్వర్గమందుండెడి గుఱ్ఱము (ఉచ్చై శ్శ్రవము)

**చదలు తొడుకు** - స్వర్గమందున్న ఆవు (వేల్పుగిడ్డి - కామధేనువు)

**చదలుమానికము** - మింట మాణిక్యము వలె ప్రకాశించువాడు (సూర్యుడు మింటిమానికము, ద్యుమణి)

**చదలుమ్రాను** - స్వర్గము నందలి చెట్టు (కల్పవృక్షము - ఈగిమ్రాను)

**చదలువాక** - చదలేరు (మిన్నేరు - ఆకాశగంగ - వియద్గంగ)

**చదలువాకపట్టి** - చదలేటి యొక్క పట్టి (భీష్ముడు)

**చదలేరు** - ఆకాశమునందలి నది (మిన్నువాక - మందాకిని)

**చదువుతొయ్యలి** - చదువునకు అధిదేవత యగు సరస్వతి (చదువులమ్మ - వాణి)

**చదువుల దేవర** - చదువుల వేల్పు

**చదువులపులుగు** - చదువు నేర్చుపక్షి (చదువులపిట్ట చిలుక)

**చదువుల ముదుకడు** - తొలుత వేదములు నేర్చిన వృద్ధుడు (బ్రహ్మ)

**చదువులమ్మ** - చదువులు నేర్పునట్టి తల్లి చదువులు నేర్పిన యమ్మ (పంతులమ్మ, సరస్వతి)

**చదువులవేల్పు** - వేదములు ముఖము నుండి యావిర్భవించిన దేవుడు (బ్రహ్మ)

**చప్పరించు మెకము** - చప్పరించు చున్నట్లు తినెడు జంతువు (పంది - చప్పరింత)

**చమకము** - అభిషేక మంత్రమగు నమకమునకు శాంతి పారము

**చమరపుచ్ఛము** - చమరమృగము తోకవంటి తోక గలది (ఉడుత - చిత్రోడము)

**చమువు** - 729 రథములు 729 గజములు 2187 గుఱ్ఱములు 3645 కాల్బంట్లు గల సైన్యము (2 వాహినులొకపృతన 3 పృతనలు చమువు మోదుగు కఱ్ఱ మున్నగు వానితో చేసిన యజ్ఞపాత్ర (చమసము)

**చరణగ్రంథి** - పాదమునకు ముడివలె నుండునది (చీలమండ)

**చరణాయుధము** - చరణము లాయుధముగా గలది (కోడి - అజ్జవాలు)

**చరమాద్రి** - అస్తగిరి (క్రుంకుమల)

**చరాచరము** - చర స్థిర రూపమైనది (స్థావర జంగమాత్మకమైనది - జగత్తు)

**చరుచేలి** - మబ్బు వన్నె వస్త్రము కలవాడు (శివుడు - చర్మాంబరుడు)

**చరువు** - అగ్నియందు వేల్వదగిన యన్నము (హవ్యము), హవిరన్నమును వండెడి పాత్ర (చరుస్థాలి)

**చర్మకారుడు** - తోలు పనిచేయువాడు (చర్మకారకుడు - మాదిగ)

**చర్మకీలము** - గుద చర్మమున మేకువలె నుండు మూలవ్యాధి

**చర్మచటక, చర్మచటి** - తోలు రెక్కలు గలది (గబ్బిలము)

**చర్మతరంగము** - శరీర చర్మమునందు కలిగిన ముడుత (వళి)

**చర్మద్రుమము** - తోలువంటి దట్టమైన పట్టగల చెట్టు

**చర్మపత్త్ర** - తోలువంటి రెక్కలు గలది (అజినపత్త్ర - గబ్బిలము)

**చర్మప్రభేదిక, చర్మప్రభేదిని** - చర్మమునను భేదించునది(చెప్పులుకుట్టుసూది - ఆరె)

**చర్మారుడు** - తన పనికి తోలు నుపయోగించువాడు (ఆసాదివాడు - చర్మకారుడు)

**చర్వణ** - ప్రాణుల చర్మమును భక్షించునది (నల్లయీగ)

**చలచంచువు** - చలించునట్టి ముక్కు గలది (చకోరపక్షి)

**చలదళము** - నిరంతరము కదలు చుండెడి ఆకులు గలది (రావిచెట్టు)

**చలమరి** - పట్టుదల కలవాడు

**చలాచలము** - చరము స్థిరము అయిన రూపము కలది (కాకి)

**చలికాపు** - వర్షర్తువున చలికి బుట్టునది, చలి పుట్టించు నీటిలో నివసించునది (కప్ప)

**చలికొండ** - మంచుకొండ (చలిగట్టు)

**చలికొండ కూతురు** - హిమవంతుని కొమార్తె (పార్వతి)

**చలికొండ కొడుకు** - హిమవంతుని కొడుకు (మైనాకుడు)

**చలిగట్టు** - చల్లని పర్వతము (వడకు గుబ్బలి మంచుకొండ)

**చలిదాయ** - చలికి పగవాడు (సూర్యుడు)

**చలిసట్టు** - శీతమునకు ఉనికిపట్టైనది (చలిచుక్క - గాలి)

**చలిసట్టుపట్టి** - వాయుదేవుని కొడుకు (హనుమంతుడు, భీముడు)

**చలిబోనము** - గ్రామదేవతకు నైవేద్యము పెట్టు చల్దిబోనము (చద్ది - చలుపారము)

**చలిపండ్లు** - పులిసిన దంతములు

**చలిమల పట్టి** - హిమవంతుని పట్టి (పార్వతి, మైనాకుడు)

**చలిమిరిమల** - మంచుకొండ (శీతాచలము)

**చలివంద్రి, చలివిందల, చలివెందర** బాటసారులకు చల్లని నీళ్ళు పోయుటకై ఏర్పరిచినది (చలివేంద్ర)

**చలివెలుగు** - చల్లని వెలుగు కలవాడు (చంద్రుడు - శీతమయూఖుడు)

**చలివేందల, చలివేంద్ర** - చలివెందర (చలిపందిరి - పానీయశాల)

**చలువగట్టు** - మంచుకొండ (చలికొండ)

**చలువగుజ్జము** - చాకలి చలువజేసిన బట్టల మోపును మోయునది (రేవుజక్కి - గాడిద)

**చలువజోతి** - చల్లని వెలుగు కలవాడు (చంద్రుడు)

**చలువడాల్దొర** - చల్లని కిరణములు గల ప్రభువు (చంద్రుడు - శీతమయూఖుడు)

**చలువలబచ్చు** - చలువల బొక్కసమునకధికారి (చంద్రుడు)

**చలువలరేడు** - చల్లని ప్రభువు (చంద్రుడు)

**చల్లరాడు** - కవ్వము తగిలించి పెరుగు చిలుకుటకుపయోగించు స్తంభము (తరికంబము)

**చవుకళి** - నాల్గు ముత్తెము లమర్చిన చెవిపోగుల జత (చౌకళి)

**చవుకారము** - బట్టలుదుకుట కుపయోగించు క్షారము (క్షారమృత్తిక - సబ్బు)

**చవుగంటి** - నాలుగు కన్నులు గలవాడు (అగ్ని - ద్వీశీర్షుడు), (శరభమృగము - మీగండ్లమెకము)

**చవుదంతి** - నాలుగు దంతములు కలది (ఐరావతము)

**చవుదంతి యెకిమీడు, చవుదంతి రౌతు** - ఐరావతమును ఎక్కెడు వేల్పు (ఇంద్రుడు)

**చవుపుటము** - నాల్గు కాళ్ళు పైకెత్తి దాటెడి దాటు (చౌపుటము)

**చవువంచతూపులజోదు, చవువంచతూపుల నెరదంట** - (చవువంచ = నాల్గునొకటి) అయిదు బాణములు గల (దిట్ట) గట్టిబంటు (మన్మధుడు)

**చవురవంచమోముల సాహెబు** - అయిదు ముఖములు గల సామి (శివుడు)

**చవుసాల** - నడుమ బయలును నాల్గు ప్రక్కల కట్టడములును గల గృహము (చుట్టుకొట్టారు - నాలుగిండ్ల బవంతి)

**చవుసీతి** - చతురశీతి (ఎనుబదినాల్గు)

**చాంగు** - రాజు యొక్క రాకను తెలియజేయు వేత్రహస్తుల హెచ్చరిక, సాష్టాంగ నమస్కారములు (చాగు)

**చాంద్రకము** - వెన్నెల వలె తెల్లగా ప్రకాశించునది (సొంటి)

**చాంద్రమసాయనుడు** - చంద్రుని కొడుకు (చాంద్రమసాయని - బుధుడు)

**చాంద్రాయణము** - చూ ఇందువ్రతము (చంద్రవ్రతము)

**చాంపేయము** - చంపానది యందు బుట్టునది (బంగారము)

**చాగరతనము** - కోర్కెలు తీర్చెడు మణి (చింతామణి)

**చాగవుమ్రాకులు** - కోర్కెలు తీర్చెడి చెట్లు (మందారము మొ॥ దేవతావృక్షములు)

**చాటుకారుడు** - ఇచ్చకములాడు స్వభావము కలవాడు (చాటులోలుడు - ఇచ్చకాలమారి)

**చాటుబోటులబావ** - అంతఃపుర స్త్రీలకు బావయైనవాడు (చంద్రుడు)

**చాతకము** - వర్షజలమునకై మేఘుని అర్థించునది (వానకోయిల)

**చాతకానందనము** - వానకోయిలలను సంతోషపెట్టునది (మేఘము)

**చాతుర్మాస్యము** - నాలుగు మాసములు ఋషీశ్వరులాచరించెడి వ్రత విశేషము (ఆషాఢ శుద్ధము మొదలు కార్తిక శుద్ధము వరకు), పాల్గున బహుళము మొదలుకొని ఆషాఢ బహుళము వరకు నాలుగు మాసములు చేసెడి ఒక యజ్ఞము

**చాపము** - చపమనెడి వెదురు బ్రద్దచే నిర్మింపబడినది (విల్లు)

**చామరపుష్పము** - చామరము వంటి పూవుకలది (మామిడి, మొగలి)

**చామరము** - చమరీ మృగము యొక్క తోకచే చేయబడినది (వింజామరము)

**చామరి** - చామరము వంటి జూలు కలది (గుఱ్ఱము)

**చామీకరము** - చామీకర మనెడి గనియందు బుట్టునది (బంగారము)

**చాముండి** - రురుండను దానవుని చర్మమును ముండమును రెండుగా జేసిన త్రికళ యొక్క ఈశ్వర శక్తి

**చాయపట్టి** - సూర్యునకు చాయ యందు బుట్టినవాడు (ఛాయాపుత్రుడు - శని)

**చాయమగడు** - చాయపెనిమిటి - చాయవెలది పెనిమిటి (చాయకుమగడు - సూర్యుడు)

**చారచక్షువు** - వేగువాడే కన్నుగా గలవాడు (రాజు)

**చారణుడు** - కీర్తిని అన్ని దిశలను వ్యాపింప జేయువాడు (నానాదేశ సంచారియగు బట్టువాడు)

**చారలమెకము** - శరీరమున చారలు గల మృగము (పెద్దపులి)

**చారునేత్రము** - అందమైన కన్నులు గలది (జింక)

**చారుఫల** - రుచికరమైన పండ్లు కలది (ద్రాక్ష)

**చార్వాకము** - ప్రత్యక్షమే ప్రమాణమను (నాస్తికులకు) సమ్మతమైన వాక్యము గలది (లోకాయతము - నాస్తికమతము)

**చాలని** - త్రిప్పునది (జల్లెడ)

**చాలుపేరింటి పూబోడి** - నాగటి చాలు = సీత (చూ॥ చాల్పేరింటి మగువ)

**చాల్పుటెర్లదొర** - పంక్తిరథుడు (దశరథుడు)

**చాల్పేరింటిమగువ** - నాగటి చాలు పేరుగల సీతాదేవి

**చాషము** - తినబడునది (పాలపిట్ట)

**చింతామణి** - కోరికల నొసగు మణి (పుడుకుగల్లు - చాగరతనము)

**చింతావేశ్మము** - రాజకార్యాలోచనకు నియమించిన గృహము

**చిందము** - శబ్దమును వ్యాపింపజేయునది (శంఖము - కంబువు)

**చింబోతుహుమాయి జోదు** - మేక వాహనమైన వాడు (భాగరధుడు - అగ్ని)

**చికినుడు** - చప్పిడి ముక్కు గలవాడు (చిదుక ముక్కువాడు)

**చికురము** - వృద్ధి బొందుచు ఖండింప బడునది (తలవెంట్రుక - కేశము), చి అని శబ్దము చేయునది (చుంచెలుక, పక్షి విశేషము)

**చిగురాకుదిండి** - చిగురుటాకు లాహారముగా గలది (కోయిల)

**చిగురుకైదువు జోదు** - చిగురాకు ఆయుధముగా గల యోధుడు (ఇగురుగైదువుజోదు - మన్మధుడు)

**చిగురుబోడి** - చిగురువంటి మేనను కలది (ఇగురుబోడి - సుకుమారి)

**చిగురువిలుకాడు, చిగురువిల్తుడు** - చిగురు విల్లుగా గలవాడు (తలిరు విలుకాడు - మన్మధుడు)

**చిచ్చరకంటి** - అగ్నిమయమైన తృతీయ నేత్రము కలవాడు (శివుడు)

**చిచ్చుబుడ్డి** - అగ్గిబుడ్డి

**చిటిబొద్దులు** - స్త్రీలు కాలి చిటికెన వ్రేళ్ళకు పెట్టుకొను ఆభరణములు

**చిట్టడుగు** - చిన్న యడుగులు కలవాడు (శిశువు)

**చిట్టుడుకు** - కొంచెము వెచ్చపడినది (కవోష్ణము)

**చిత్తజుడు** - హృదయమున బుట్టువాడు (మన్మధుడు)

**చిత్తిని** - సుకుమార శరీరము, తీరైన నడక, చిలుక పలుకులు, నృత్యగీతాదులందు నిపుణత బెదరు చూపులు మొదలగు లక్షణములు గలది (చిత్రిణి - ఒకానొక స్త్రీ జాతి)

**చిత్యము** - మరణించిన వానిని పూడ్చినచోట కట్టినది (గోరీ)

**చిత్రకంఠము** - నానా వర్ణములు గల కంఠము గలది (పావురము, నెమలి)

**చిత్రకాయము** - చిత్రమగు శరీరము కలది (చిరుతపులి)

**చిత్రకరుడు** - చిత్తరువులు వ్రాయువాడు, ఆశ్చర్యకర కృత్యములు చేయువాడు, విశ్వకర్మకు శూద్ర స్త్రీ యందు జన్మించిన సంకరుడు

**చిత్రకూటము** - చిత్రమైన శిఖరము గలది (ఒకానొక పర్వతము)

**చిత్రకృత్తు** - అద్భుత కార్యములు చేయువాడు, చిత్తరువులు వ్రాయువాడు (చిత్రకారుడు)

**చిత్రగుప్తుడు** - యముని యొద్ద జీవుని పాపముల లెక్కలను వ్రాయువాడు

**చిత్రనేత్ర** - తీర్చినట్లుండు కనులు గలది (గోరువంక - చిత్రలోచన)

**చిత్రపక్షము** - చిత్రమైన రెక్కలు గలది (తీతువుపిట్ట) నానావర్ణములు గల రెక్కలు గలది (నెమలి)

**చిత్రపర్ణి** - చిత్రములైన ఆకులు గలది (కోలపొన్న)

**చిత్రపాద** - చిత్రములైన పాదములు గలది (గోరువంక - శారిక)

**చిత్రపిచ్ఛకము** - వన్నెల పురిగలది (నెమలి)

**చిత్రపుష్పి** - రంగు రంగుల పూలు గలది (చిరుబొద్ది)

**చిత్రఫల** - రంగు రంగుల పండ్లు కలది (దోస, దొండ)

**చిత్రబర్హము** - రంగురంగుల పురి గలది (నెమలి - చిత్రపిచ్ఛకము)

**చిత్రబింబము** - మూడు రంగులుగల తొండ (ముదిరిన తొండ - ఊసరవెల్లి)

**చిత్రభానువు** - జిహ్వా రూపములైన వివిధ కాంతులు గలవాడు (అగ్ని), నానావర్ణములైన కిరణములు గలవాడు (సూర్యుడు)

**చిత్రమృగము** - పెక్కు రంగులు గల జంతువు (పులి, దుప్పి)

**చిత్రయోధి** - చిత్రముగ యుద్ధము చేయువాడు (అర్జునుడు - కవ్వడి)

**చిత్రరథుడు** - సప్తాశ్వములు గల్గియుండుటచే చిత్రమైన రథము గలవాడు (సూర్యుడు), ఒకానొక గంధర్వరాజు

**చిత్రలేఖిని** - దీనిచే చిత్రము వ్రాయబడును (తూలిక)

**చిత్రలోచన** - చిత్రమైన కన్నులు గలది (చిత్రనేత్ర - గోరువంక)

**చిత్రవాలము** - చిత్రవర్ణములు గల తోక గలది (పాలపిట్ట)

**చిత్రశిఖండి** - చిత్రమైన సిగ కలవాడు (సప్తర్షులలో ఎవరైన ఒకరు)

**చిత్ర శిఖండిజుడు** - రంగు రంగుల జటలు గల చిత్ర శిఖండి (అంగిరసుని) కొడుకు (బృహస్పతి)

**చిత్రాక్షి** - చిత్రమైన కన్నులు గలది (చిత్రలోచన)

**చిత్రాటీరుడు** - చిత్రా నక్షత్రము నను సరించువాడు (చంద్రుడు), చిత్రముగా సంచరించువాడు

**చిత్రాన్నము** - విచిత్రమైన యన్నము (పులియోగిరము మొ॥)

**చిత్రాలంకారము** - ఒక ఫలమును గోరి దానికి విరుద్ధమైన యత్నము చేయబడునేని చిత్రాలంకారమగును (ఉదా - మూడులోకముల కంటెను నమున్నతిని బొందగోరి సజ్జనులు నమ్రత వహింతురు ఇచట కోరినది ఉన్నతి, ప్రయత్నము నమ్రత)

**చిత్రావసువు** - చుక్కల (నక్షత్రముల) వంటి చిత్రములు కలది (రాత్రి)

**చిత్రాననము** - రంగు రంగుల ఆననము (చిన్నతివాసి)

**చిత్రికము** - చిత్రానక్షత్రయుక్త పూర్ణిమ గల మాసము (చైత్రమాసము)

**చిత్రోదనము** - (చిత్రాన్నము - పులిహోర - పులియోగిరము)

**చిదాత్మ** - చైతన్యమే స్వరూపముగా గలవాడు (పరమాత్మ - వ్యవహారదశయందీ పరమాత్మ కూటస్థము బ్రహ్మము, జీవుడు, ఈశ్వరుడు అను నాల్గు విధములుగా భాసించును)

**చిదాభాసుడు** - అంతఃకరణమున ప్రతిఫలించిన కూటస్థ చైతన్యము (జీవుడు)

బుద్ధియందు ప్రతిబింబించిన ఆత్మయొక్క ప్రతిబింబము

**చినుకుదారి** - జలకణములను దాల్చునది (మేఘము-చిన్కుదారి)

**చినుకుమేపుడు పుల్గు** - ఆనకమునందుండి వానచిన్కులను త్రాగెడు పక్షి॥ (వాన కోయిల - చాతకము)

**చిబుకము** - ముద్దుపెట్టుకొనబడునది (గడ్డము)

**చిమ్మచీకటి** - కొంచెపుచీకటి , అంతటను చిమ్మబడిన చీకటి (గాఢాంధకారము)

**చిమ్మటతార** - ఈలవురుగు ధ్వనివలె హెచ్చుస్థాయిని ధ్వనించునది (పిల్లన గ్రోవి)

**చిమ్మనగ్రోవి** - వసంతము మున్నగునవి చిమ్ము గొట్టము (చిమ్మనపుగ్రోవి)

**చిరంటి** - చాలకాలమునకు భర్తయింటికి బోవునది భర్తతో చిరకాలము కాపురము చేయునది (సువాసిని)

**చిరంభణము** - ఎక్కువసేపు అరచునది (పిన్నగ్రద్ద - చిల్లము)

**చిరకారి, చిరక్రియుడు** - మందకొడిగా పనిచేయువాడు (దీర్ఘసూత్రుడు)

**చిరపుష్పము** - చాలకాలము వరకు పరిమళము వీడని పూలు కలది (పొగడ)

**చిరబిల్వము** - చాలనాళ్లకుగాని బ్రద్దలుకాని (బీటలు పడని) కాయలు గలది

**చిలువటెంకి** - పాములకు స్థానమైనది (చిలువపట్టు - పుట్ట)

**చిలువతాల్పు** - పాములను ధరించినవాడు (సర్పధారి)

**చిలువతిండి** - చిలువలు తిండిగా కలది (నెమలి), చిలువలు తిండిగా కలవాడు (గరుడుడు)

**చిలువపట్టు** - చిలువటెంకి

**చిలువమల** - చిలువ రూపమైన కొండ (చిలువగట్టు - తిరుపతి)

**చిలువమేత** - పాములకు ఆహారమైనది (గాలి)

**చిలువమేపరి** - పాములను భక్షించువాడు (గరుడుడు - అహిరిపువు)

**చిలువరాయుడు** - చిలువలకు రాయుడు (చిలువరేడు - సర్పరాజు - శేషుడు)

**చిలువ** - (చిల్వ) - చిలుముతో గూడిన వాయిగలది (పాము)

**చిలువసొమ్ము** - పాములను హారములుగా ధరించిన వాడు (శివుడు)

**చిల్వకన్నియ** - నాగకన్య

**చిల్వగట్టు** - శ్రీవేంకటేశ్వరస్వామిని సేవించుటకై ఆదిశేషుడు తాల్చిన రూపము (తిరుపతికొండ)

**చివ్వపట్టు** - చివ్వకు నెలవు (రణరంగము - పోరుతావు)

**చివ్వలయోగిరపు దపసి** - కలహము తిండిగా గల ముని (నారదుడు - పోరోగిరపుదపసి)

**చివ్వల తడిక** - సన్నపాటి వెదురుబద్దలతో అల్లిన తడక (వేటలో ఉపయోగించునది)

**చివ్వలాడి(డు)** - కలహశీలురాలు (జగడాలమారి) జగడమాడు (పోట్లాడు)

**చీకటిగాము** - చీకటి వలె నల్లనైన గ్రహము (రాహువు - తమోగ్రహము)

**చీకటి గుండెదిగులు** - చీకటికి గుండె దిగులు కల్గించువాడు (సూర్యుడు - వేడివెల్గు)

**చీకటిగొంగ** - చీకటికి శత్రువు (సూర్యుడు)

**చీకటి చెట్టు** - చీకటి వలె నల్లనైన చెట్టు (తమాలవృక్షము)

**చీకటి తప్పు** - చీకటి యందు జేసెడి తప్పుపని (వ్యభిచారము)

**చీకటి దొంగ** - చీకటిని హరించువాడు (సూర్యుడు)

**చీకటి విరిచుక్క** - చీకటిని తొలగించు నట్టి వేగుజుక్క

**చీకటి వేరువిత్తు** - చీకటిని నాశనము జేయువాడు (చంద్రుడు - చలివెలుగు)

**చీకటులు త్రవ్వు** - దుశ్చరిత్రులను గాలించి తిరుగదోడు

**చీకటుల మిత్తి** - చీకటికి మృత్యువైనవాడు (చంద్రుడు)

**చీనాంబరము** - చీనాదేశమున నేసిన (పట్టు) వస్త్రము

**చీనాకము** - చీనా దేశమున విశేషముగా లభ్యమగునది (కర్పూరము)

**చీరకము** - చెదరి వంకరగా నుండు వ్రాత (అసహ్యపువ్రాత) అక్షరములొకదానితొ నొకటి కలుపుకొనుచు వ్రాసెడి చిక్కువ్రాత (గొలుసుకట్టు వ్రాత)

**చీరచిక్కు** - చూలై దేహము స్థూల మగుటచే కోక మడతలు (కుచ్చెళ్ళు) తగ్గు (గర్భవతియగు)

**చీరణము** - రాతిని (చీల్చు) చీరునది (చిన్నఉలి)

**చీరుక** - చీయని శబ్దము చేయుచుపోవునది (ఈలపురుగు)

**చుంబకము** - లోహము నాకర్షించి తాకునది (సూదంటురాయి)

**చుక్కల గమికాడు** - దక్ష పుత్రికలకు (అశ్విన్యాది నక్షత్రములకు) భర్త (చంద్రుడు)

**చుక్కతొలు వేల్పుగొంగ** - తారకుడను పేరుగల రాక్షసుని శత్రువు (కుమారస్వామి - తారకజిత్తు)

**చుక్క యెదురు** - అరిష్ట సూచకమైన శుక్రగ్రహమెదురగుట (ప్రయాణము చేయునపుడు శుక్రగ్రహమెదురుగా నున్నచో కార్యహాని)

**చుక్కలదొర, చుక్కలరేడు** - చుక్కలకు ప్రభువు (చంద్రుడు)

**చుక్కలంటు** - వస్తువుల ధరవరలు తారస్థాయిని తాకు

**చుక్కవాలు** - కత్తివలె కీడు చేయునట్టిది (చుక్కయెదురు)

**చుచుందరి** - వాసనగల యెలుక (కంపెలుక చుంచు)

**చుచుకము** - చంటి పిల్లలు పాలు కుడుచుకొనునపుడు చుచు అను ధ్వని చేయునది (చనుమొన)

**చుట్టపుమేరువు** - చుట్టాలకు ఆధారమైన వాడు (చుట్టాల సురభి)

**చుట్టలుగు** - గుండ్రని ఆయుధము (గుడుసుకైదువు - సుదర్శన చక్రము)

**చుట్టాల సురభి** - బంధువులకు కామధేనువు వంటివాడు. (బంధుపక్షపాతి)

**చుట్టుగొండ** - భూమిని చుట్టియున్న పర్వతము, చుట్టుగట్టు - చక్రవాళ పర్వతము

**చుట్టుగైదువు** - చుట్టలుగు సుదర్శనము

**చుట్టుగైదువు జోదు** - చక్రాయుధము గల యోధుడు (చుట్టువాల్దారి - విష్ణువు)

**చుట్టువాలు** - చుట్టలుగు

**చుట్టు వాలుతోడు** - సుదర్శన చక్రమునకు తోడైనది (పాంచజన్యమను శంఖము)

**చుట్టు వాల్దాలుపు** - చక్రాయుధమును ధరించువాడు (చుట్టువాల్దారి - విష్ణువు)

**చుట్టు వాల్పేరిపిట్ట** - చక్రమనెడు పేరుగల పక్షి (బండి పేరిపులుగు - చక్రవాకము)

**చూచుకము** - చుంచుకము (చుంచుకము చనుమొన)

**చూడామణి** - తలపై ధరించు రత్నము (తలమానికము - శిరోమణి)

**చూడాలము** - ఒత్తైన జట్టు కలది (తల)

**చూతకము** - దీని పండు రసము పీల్చబడును (మామిడిచెట్టు)

**చూతము** - రసమును స్రవించునది (మామిడి), మలమూత్రము లిందుండి వెడలును (మూత్రద్వారము)

**చూర్ణకుంతలములు** - కుటిలములైన వెండ్రుకలు (అలకలు)

**చూర్ణి** - తార్కికుల యుక్తుల నెల్ల పిండిపిండిగా కొట్టివేయునది (భాష్యము)

**చూర్ణిక** - పరుషాక్షరములు కఠిన సమాసములు లేని హృదయంగమ గద్యము

**చూలిక** - నేపథ్యపాత్ర సూచితము (తెరలోనున్న పాత్రచేనైన యర్థసూచన చూలిక రెండు విధములు పూర్ణచూళిక, ఖండచూళిక)

**చెంగల్వనేస్తి** - కలువలకు నెచ్చెలి (చంద్రుడు చెందొవచెలి)

**చెంగల్వదొర** - కువలయ నాధుడు (చంద్రుడు)

**చెందొవచెలి** - కువలయ మిత్రుడు (చెంగల్వనేస్తి)

**చెందొవదొర, చెందొవరాయడు** - కువలయ నాధుడు (చంద్రుడు)

**చెందొవ విందు** - కలువలకు విందు (కలువల చుట్టము)

**చెంబుతల** - చెంబు వలె నున్ననైన శిరము (బట్టతల)

**చెట్టపట్టు** - చేయిపట్టుకొను (పాణిగ్రహణము - పెండ్లాడు)

**చెట్టుద్రిమ్మరి** - చెట్లపై తిరుగునది (వనచరము - కోతి)

**చెట్టునట్టు** - చెట్టు నివాసముగా గలది (కోతి)

**చెట్టుబిడారు** - చెట్టు ఉనికిగా గలది (కోతి - చెట్టుద్రిమ్మరి)

**చెయువుల సాకిరి** - చేసిన పనులకు సాక్షి యగువాడు (చైవులసాకిరి - సూర్యుడు)

**చెరకు విలుకాడు, చెరకువిల్తుడు** - చెరకు విల్లు కలవాడు (ఇక్షుధన్వుడు - మన్మధుడు)

**చెలియలికట్ట, చెల్లెలికట్ట** - చెల్లెలి యొక్క కట్ట (సముద్రపుగట్టు నేల)

**చేగల మెకము** - తొండము గల జంతువు (ఏనుగు)

**చేచమురు భాగవతము** - చమురు ఖర్చైనను దాని భాగవత యక్షగాన ప్రదర్శనము

**చేటకుడు** - పనుల కంపబడువాడు (సేవకుడు)

**చేటకొల్లారు** - మూడువైపుల చేరిక కట్టడములుగల భవనము (త్రిశాల)

**చేటగోళ్ళ బోటి** - చేటల వంటి గోళ్ళు గల స్త్రీ (శూర్పణఖ)

**చేట చెవుల మెకము** - చేటల వంటి చెవులు గల జంతువు (ఏనుగు)

**చేటచెవుల వేల్పు** - చేటల వంటి చెవులు గల దేవుడు (వినాయకుడు)

**చేట పెయ్య** - దూడ చచ్చిన ఆవు పాలిచ్చుటకై చచ్చిన దూడ చర్మములో గడ్డికుక్కి కుట్టిచేసిన దూడ

**చేటరిక్క** - చేటయాకారముగ నుండు విశాఖా నక్షత్రము

**చేటరిక్కనెల** - వైశాఖమాసము

**చేటవీనుల దణి** - చేటల వంటి చెవులు గల ప్రభువు (వినాయకుడు)

**చేతకి** - బుద్ధి వికాసము కలిగించునది (కరకకాయ)

**చేతనుడు** - చైతన్యము కలవాడు (జీవుడు), చైతన్యము నొసగువాడు (పరమేశ్వరుడు)

**చేతోంశువు** - చైతన్యమునకు వెలుగైనవాడు (జీవుడు)

**చేతోభవుడు** - చిత్తమున పుట్టువు కలవాడు (మన్మధుడు)

**చేదివియ** - చేతియందలి దివ్వె (చేదివ్వె - దివ్వటి)

**చేర్లకోల** - తోలు త్రాళ్ళు (చేర్లు) కట్టిన కోల (చేరు(ల)కోల - కొరడా)

**చైతన్యాభాసము** - జని మృత్యు లక్షణమైన చైతన్యము (చైతన్యము ఆద్యంతములు లేనిది ప్రాణములతో కూడిన ఈ చైతన్యాభానకు జీవుడని పేరు)

**చైత్యము** - పాషాణాదులతో నిర్మింపబడినది (బౌద్ధస్తూపము,రచ్చచెట్టు),గ్రామాదులకు ఎల్లగా కట్టబడిన రాతికట్టడము

**చైత్రరథము** - చిత్రరథుడను గంధర్వరాజుచే నిర్మింపబడిన యుద్యానవనము

**చైత్రసఖుడు** - వసంతునకు చెలికాడు (మన్మథుడు)

**చైత్రికము** - చిత్రా నక్షత్రముతో కూడిన పూర్ణిమ కలది (చైత్రమాసము)

**చైలధావుకుడు** - బట్టలుతుకు వాడు (చాకలి)

**చైవుల సాకిరి** - చెయువుల సాకిరి (కర్మసాక్షి - సూర్యుడు)

**చొక్కాకు** - పండి రాలిన ఆకు (చొరుగు - చొరువాకు)

**చొక్కునీరు** - మత్తు కలిగించు నీరు (కల్లు, సారాయి - వెఱ్ఱినీళ్ళు)

**చొక్కు పొడి** - పడినంతనే వివశత్వము కల్గించు పొడి (చొక్కుమందు - మత్తుమందు)

**చోరబుడుత** - చోరమీను యొక్క బుడుత, చోరమీనుల వంటి కన్నులు గల బాలిక

**చౌకటులు, చౌకట్లు**- నాలుగు ముత్యములు మున్నగువానితో కట్టినవి (చౌకట్టులు)

**చౌకట్టు పోగులు** - చౌకట్టులనెడి పోగులు (కర్ణాభరణములు)

**చౌకాలిపీట** - నాల్గు కాళ్ళ ఎత్తుపీట (చవుకాలి పీట)

**చౌగంటి** - నాల్గు కన్నులు గలవాడు (అగ్నిదేవుడు), నాల్గు కన్నులు గలది (శరభ మృగము - మీగండ్ల మెకము)

**చౌడము** - పుట్టు వెండ్రుకలు తీయుట అను సంస్కార విశేషము (చౌలము) చోడ దేశమునకు సంబంధించినది

**చౌదంతి** - నాలుగు దంతములు కలది (ఐరావతము - వెల్లయేనుగు)

**చౌపదము** - నాల్గు దారులు కలియుచోటు (చవుపదము - కూడలి)

**చౌపుటము** - నాల్గు కాళ్ళు ఎత్తి దాటెడి దాటు (లంఘనము - చవుపుటము)

**చౌలము** - ఉపనయనమునకు పూర్వము చేయదగిన చూడా కర్మమను సంస్కారము, పుట్టు వెండ్రుకలు తీయు సంస్కారము (చౌడము)

**చౌవంచ తూపులజోదు** -అయిదు బాణములు గల గట్టి బంటు (మన్మథుడు)

**చౌవంచ మోముల సాహెబు** - (చౌవంచ = అరపది) అయిదు ముఖములు గల దేవుడు (శివుడు)

**చౌపప్పి భేద చిత్ర సీసము** -బహు విధ చిత్రకంకణ బంధ ద్విగుణిత సీస చరణ చతుష్టయ గర్భిత ద్విపద, కందద్వయ సమవృత్త కందాటవెలది గర్భితాంత్య తేటగీతి యుక్త మొదలగు అరువది నాల్గు గర్భితములు గలది సీ॥ సారాగ్ర్య సారస సమనేత్రయుగళ నారదరుచికాంతి నరఘన పనిత సారాగధీర విశద వీన తురగ భైరవభవ జైత్రభర శుభకరణ

సారాతిహార విసరచారణ హరిసా

రసహిత చంద్రశరజ జయనుత

వారాశి నారద వర పూజిత పద గౌ
రవకటి ఖడ్గ గరళ గళ సఖ

గీ॥ హరి నగనిలయ గిరిధర యసుర దశన
మణిమయమకుట సురమణి మధువిశరణ
కరివరదకు వరరుచిర తరివసన న
రహరి లసితదర నిగమ విహరణ హరి

ఉదా - ద్విపద - సారాగ్ర్య యుగళ, నారద పనిత, సారాగధీర తురగ, భైరవ కరణ, సారాతి చారణహరి, సారస జయనుత, వార్మా పూజితపద, గౌర గళసఖ (రకారప్రాసము) చూ॥ గణపవరపు వేంకట కవి శ్రీ ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసము సాహిత్య అకాడమీ ప్రతి)

**చ్యవన ప్రాశము** - అశ్వినీ దేవతలచే చ్యవన మహర్షికి ఉపదేశింపబడిన సుప్రసిద్ధ ఆయుర్వేదౌషధ నిర్మాణము

**చ్యుత సంస్కారము** - వ్యాకరణ లక్షణమునకు సరిపడని పదములను కావ్యములో ప్రయోగించుట (ఉదా - శ్రీ కమల కాంత పదసేవా కర్మరుడనగ ఇందు ఆకారాంత కమలా శబ్దము హ్రస్వాంతముగా ప్రయోగింపబడినది పదగత దోషములలో నొకటి)

**ఛందఃపర్ణము** - ఛందస్సు (వేదవిహితమైన కర్మము) లనెడు ఆకులచే గప్పబడినది (సంసార వృక్షము)

**ఛగలాంఘ్రి, ఛగలాంత్రి** - మేకయడుగు వంటి అడుగు కలది (తోడేలు), మేకప్రేగులను బోలి యుండెడు ఈనెలు కలది (బొద్దిచెట్టు)

**ఛత్రగాహి, ఛత్రధారి** - గొడుగు పట్టుకొను రాజసేవకుడు (ఛత్రధారుడు)

**చత్రపతి** - స్వతంత్ర రాజ్యాధిపత్యమునకు చిహ్నమైన ఛత్రము గల ప్రభువు (చక్రవర్తి)

**ఛత్రము** - పురుషుని (ఎండబారిపడకుండ) కప్పునది గొడుగు

**ఛత్రి** - గొడుగు కలవాడు (మంగలి)

**ఛత్రిక** - గొడుగు యొక్క ఆకారము కలది (ఛత్రాకము - పుట్టగొడుగు)

**ఛదపత్రము** - కప్పుటకు తగిన ఆకులు గలది (బుజపత్తిరి)

**ఛర్దాపనిక** - డోకు కలిగించునది (చేదుబీర)

**ఛర్దిఘ్నము** - డోకులు కట్టించునది (చిట్టేలకి)

**ఛాందసుడు** - వేదాధ్యయనము చేసినవాడు (శ్రోత్రియుడు), లోకజ్ఞానము లేనివాడు

**ఛాగభోజి** - మేకలను తినునది (తోడేలు)

**ఛాగముఖుడు** - ఆరవ ముఖముగా మేక ముఖమువంటి ముఖము గలవాడు (కుమారస్వామి)

**ఛాగరథుడు** - గొఱ్ఱె వాహనముగా గలవాడు (అగ్నిదేవుడు - మేషవాహనుడు)

**ఛాత్రగండుడు** - శిష్యులలో కణితి వంటివాడు (మందబుద్ధి యగు శిష్యుడు)

**ఛాత్రుడు** - గురుని దోషములను మరుగుపరుచు స్వభావము కలవాడు (శిష్యుడు)

**ఛాయాంకుడు** - సూర్యుని ప్రతిబింబమే చిహ్నముగా గలవాడు (చంద్రుడు)

**ఛాయాగ్రహణ యంత్రము** - వస్తువు యొక్క ప్రతిబింబము (వెలుతురును) పట్టు సాధనము (కెమేరా)

**ఛాయాపుత్త్రుడు**- ఛాయా సూర్యుల కొడుకు

**ఛాయామృగధరుడు** - భూమియొక్క నీడ అను లేడిని తాల్చినవాడు (చంద్రుడు)

**ఛాయాయంత్రము** - నీడయొక్క నిడివినిబట్టి కాలమును కొలిచి తెలిసికొనుట కుపయోగించు సాధనము (ఛాయాఘటి)

**ఛుచ్ఛుందరము, ఛుచ్ఛువు** - ఛు ఛు అని ధ్వని చేయునది (ఛుచ్ఛుందరి - చుంచెలుక)

**ఛేకానుప్రాసము** - రెండేసి హల్లుల జంటలు అవ్యవధానముగ ఆవృత్తమగుట (ఒకానొక శబ్దాలంకారము)

**ఛేకాపహ్నుతి** - పరులు శంకించినప్పుడు నిజము దాచి నేర్పుతో మాయమాటలు చెప్పుట (ఛేకుడనగా నేర్పుగలవాడు)

**ఛేకోక్తి** - లోకోక్తి నర్థాంతర గర్భితమగునట్లుగా గూర్చి చెప్పినచో ఛేకోక్తియనబడును

**ఛేమండుడు** - తల్లిదండ్రులు బంధువర్గములేని అనాధబాలుడు

**ఛేలకము** - మాంసము కొరకు నరుకబడునది (మేకపోతు)

**జంగమకుటి** - నడయాడు గుడిసె వంటిది (గొడుగు - ఛత్రము)

**జంగులము** - శీఘ్రముగా వ్యాపించునది (విషము - జంగూలము)

**జంటముక్కాలి** - జంటలుగా నున్న మూడు (ఆరు) కాళ్ళు గలది (తుమ్మెద - జమిలిముక్కాలి)

**జంట మొగంబులసామి, జంట మోములదంట, జంటమోముల వేల్పు** - రెండు ముఖములు గల దేవుడు (అగ్ని)

**జంజపూకుడు** - అధికముగా జపము చేయు స్వభావము కలవాడు

**జంతుపాదపము** - లోన తుమ్మెదలుండు చెట్టు

**జంతువు** - తిరిగి తిరిగి జనించు స్వభావము కలది (జీవి)

**జంతుఫలము** - పురుగులుండు పండ్లు కలది (మేడిచెట్టు)

**జంపతులు** - జాయాపతులు (భార్యాభర్తలు - దంపతులు)

**జంబాలిని** - బురద గలది (ఏరు)

**జంబుకము** - మాంసమును భక్షించునది (నక్క)

**జంబూద్వీపము** - గొప్ప నేరేడు వృక్షము గలిగి మేరువునకు దక్షిణమున నున్న యొక ద్వీపము

**జంబూలమాలిక** - పెండ్లి వారి పరిహాస వచనము

**జంభ భేది** - జంభాసురుని సంహరించిన వాడు (ఇంద్రుడు)

**జంభీరము, జంభలము** - నోటికి (అరుచిని పోగొట్టి) రుచి కల్గించునది (నిమ్మపండు)

**జంభారాతి, జంభారి** - జంభాసురునకు శత్రువైన వాడు (ఇంద్రుడు)

**జక్కవకవవిప్పు** - చక్రవాక మిధునమును విడదీయువాడు (చంద్రుడు)

**జక్కవగొంగ** - చక్రవాకములకు శత్రువు (చంద్రుడు)

**జక్కవచెలి** - చక్రవాకముల ఎడబాటును తొలగించి చెలికాడైనవాడు (సూర్యుడు - జక్కవ సంగాతి)

**జక్కవపగవాడు** - చక్రవాక మిధునమును వేరుచేయువాడు (చంద్రుడు)

**జక్కవయంటు** - చక్రవాకముల వియోగమును బోగొట్టి మిధునమును గూర్చువాడు (సూర్యుడు)

**జక్కవరాయడు, జక్కవరేడు** - చక్రవాకములకు ప్రభువు (సూర్యుడు)

**జక్కవలసూడు** - చక్రవాకములకు విరోధియైనవాడు (చంద్రుడు)

**జక్కిదాయ** - గుజ్జమునకు శత్రువు (మహిషము)

**జక్కిని** - ముత్తైదువుగా మరణించిన స్త్రీ

**జక్కిమోర** - జక్కి యొక్క మోర వంటి మోర కలవాడు (అశ్వముఖుడు - కిన్నరుడు)

**జక్కిమోరవేల్పు** - కిన్నరుడు

**జక్కులగమికాడు** - యక్షుల ప్రభువు (కుబేరుడు)

**జక్కులదొర** - యక్షప్రభువు (కుబెరుడు)

**జక్కులరేడు** - యక్ష ప్రభువు (కుబేరుడు)

**జక్కులరేని చెలికాడు** - కుబేరుని మిత్రుడు (శివుడు)

**జగచ్చక్షువు** - ప్రపంచమునకు నేత్రము వంటివాడు (సూర్యుడు)

**జగత్ప్రాణుడు** - జగమునకు ప్రాణము వంటివాడు (సూర్యుడు)

**జగద్వ్యాపి** - ప్రపంచమును వ్యాపించి యుండు వాడు (దేవుడు)

**జగన్నాథుడు** - జగమునకు బ్రభువు (శ్రీవిష్ణువు)

**జగముకన్ను** - ప్రపంచమునకు నేత్రము వంటివాడు (సూర్యుడు)

**జగము చుట్టము** - జగమునకు చుట్టము వంటివాడు (సూర్యుడు)

**జగము విందు** - జగమునకు చుట్టము వంటివాడు (లోకబాంధవుడు - సూర్యుడు)

**జఘనము** - నడచునపుడు కదలియాడునది, పురుషునిచే పీడింపబడునది = స్త్రీల మొల యందు భాగము

**జఘన్యజుడు** - తనకంటె వెనుకపుట్టినవాడు పరబ్రహ్మ యొక్క జఘనము నుండి పుట్టినవాడు

**జటాచీరుడు** - జడలు వస్త్రములుగా గలవాడు (శివుడు)

**జటాధరుడు** - జడలను ధరించువాడు (శివుడు, ముని)

**జటాధారి** - జడలను ధరించువాడు (శివుడు, ముని)

**జటాలము** - ఊడలు గలది (వట వృక్షము)

**జటి** - జడలు గలది (జువ్విచెట్టు), జడలు గలవాడు (సన్న్యాసి)

**జటీరుడు** - జడలు వస్త్రములుగా గలవాడు (శివుడు)

**జడదారి** - జడలను ధరించువాడు (ముని, శివుడు)

**జడదారి కన్పాప** - అత్రి మహర్షియొక్క నేత్రమున బుట్టిన బిడ్డడు (చంద్రుడు)

**జడదారి చెవిబుగ్గ** - జడదారి చెవి యందలి బుగ్గ (జాహ్నవి - గంగానది)

**జడదారి యింటికోడి** - గౌతముని ఇంట కోడియైనవాడు (ఇంద్రుడు)

**జడదాలువు వేల్పు** - జడలు దాల్చిన దేవుడు (శివుడు)

**జడముడి జంగము** - జడలు దాల్చిన దేవుడు (శివుడు)

**జడముడి తాల్పు** - గుండ్రని జటా జూటము తాల్చిన భిక్షుకుడు (శివుడు)

**జడల మెకము** - జూలు కల మృగము (సింహము)

**జడసిక దేవర** - జడలు దాల్చిన దేవుడు (శివుడు)

**జడుడు** - ఇష్టానిష్ట సుఖ దుఃఖాదుల నెరుంగక పరవశుడై (స్తబ్ధుడయి) యుండువాడు

**జడులము** - రోమములు జడీభూతములై యుండుచోటు (పుట్టుమచ్చ)

**జతూక** - తోలువంటి రెక్కలు కలది (చీకురువాయి)

**జనత్ర** - జనులను ఎండబాధ నుండి కాపాడునది (గొడుగు)

**జనని** - కొడుకులను గనునది (తల్లి)

**జన పదము** - జనులు నివసించు ప్రదేశము

**జనయిత్రి** - కొడుకులను గనునది (తల్లి)

**జనాంతకుడు** - జనులకు అంతము కలుగ జేయువాడు (యముడు)

**జనార్దనుడు** - సముద్ర మధ్యమున నున్న జనులనెడు రాక్షసులను పీడించినవాడు, ప్రళయకాలమున సర్వజనులను బాధించువాడు = శ్రీ విష్ణువు, జనులను రక్షించువాడు

**జనాశనుడు** - జనులను తినువాడు (రక్కసుడు)

**జనుషాంధుడు** - పుట్టినప్పటి నుండియు గ్రుడ్డియైన వాడు

**జన్నపు గాపరి** - విశ్వామిత్రుని యాగమును కాపాడినవాడు (శ్రీరాముడు)

**జన్నపు గొంగ** - దక్షుని యజ్ఞమును జెరిచిన వాడు (శివుడు)

**జన్నపుజుక్క**-యజ్ఞ యోగ్యమైన నక్షత్రము (మఘా నక్షత్రము)

**జన్నపుదిండి** - యాగమందలి హవిస్సును దినువాడు (వేలుపు)

**జన్నపుబగవాడు** - దక్షుని యజ్ఞమును జెరిచిన వాడు (శివుడు)

**జన్నపురిక్క** - జన్నపుజుక్క

**జన్నపు రిక్కనెల** - మాఘమాసము

**జన్నపు విందు** - యాగమందలి హవిస్సును దినువాడు (వేలుపు)

**జన్నపు వేటకాడు** - దక్షుని యజ్ఞమును జెరిచిన వాడు (శివుడు)

**జన్మకీలుడు** - తిరిగి జన్మము లేకుండ జేయువాడు (విష్ణువు)

**జమిలి తల్లుల బిడ్డ** -గంగా పార్వతు లను నిరువురు తల్లులకు బుత్రుడయిన వాడు (వినాయకుడు)

**జమిలిముక్కాలినారి** - జమిలి ముక్కాలి విలుకాడు (మన్మధుడు)

**జమిలి ముక్కాలి** - జంటలుగా నున్న మూడు కాళ్ళు గలది (తుమ్మెద - షట్పదము)

**జమిలి ముక్కాలి విలుకాడు** - తుమ్మెద నారిగా గల ధనుస్సు గలవాడు (జమిలి ముక్కాలినారి మన్మధుడు)

**జమిలి ముత్తల** - ఆరు మోములసామి (షణ్ముఖుడు - కుమారస్వామి)

**జమున గొంగ** - యమునా నదికి శత్రువయిన వాడు (బలరాముడు)

**జమున తోబుట్టువు** - యమునా నదికి సోదరుడు (యముడు)

**జమున సైదోడు** - యమునకు సోదరుడు (యముడు - యమునాభ్రాత)

**జమునయ్య** - యముని తండ్రి (సూర్యుడు - జముతండ్రి)

**జమునెక్కిరింత** - యముని వాహనము (దున్న)

**జముపగర** - యముని శత్రువు (శివుడు - కాలాంతకుడు)

**జముపట్టి** - యముని అంశ వలన బుట్టినవాడు (ధర్మరాజు)

**జయంతుడు** - జయము కలిగించువాడు

**జయవారము** - వ్యతిరేక లక్షణచే అమంగళకరమగు వారము (మంగళవారము)

**జయస్తంభము** - విజయ జ్ఞాపకార్థమై నాటబడు స్తంభము

**జరద్గవము** - పోయిన కన్నులు గల ముసలి యెద్దు

**జరాభీరువు** - ముదునలుల యెడ భీతి నొందువాడు (మన్మధుడు)

**జరాయుజము** - మావియందు బుట్టునది (జంతువు, జీవి)

**జరాసంధుడు** - జరయను రాక్షసిచే రెండు శరీర భాగములు సంధింపబడిన వాడు (ఒక రాక్షసరాజు)

**జలంధరుడు** - మన్మథుని భస్మము చేయగా మిగిలిన శివుని ఫాలనేత్రానలము సముద్రమున బడి ఉదయించినవాడు

**జలకంకము** - నీటియందు కంటకము వలె పట్టి బాధించునది (మొసలి)

**జలకాంతారుడు** - జలము దుర్గముగా గలవాడు (వరుణుడు)

**జలకుంతలము** - నీటికి కురుల వంటిది (నాచు)

**జలక్రీడ** - నద్యాదుల యందు వినోదార్థమై పరస్పరము గావించుకొను చల్లులాట

**జలచరము** - నీటియందు సంచరించునది (చేప, మొసలి మొ॥)

**జలజము** - నీటియందు పుట్టునది (పద్మము, ముత్యము, మొ॥)

**జలజాసనుడు** - తామరపూవు ఆసనముగా గలవాడు (బ్రహ్మ)

**జలజీవి** - జలమందలి మత్స్యాదులను బట్టి జీవించువాడు (జాలరి - కైవర్తుడు)

**జలజుడు** - నీట పుట్టినవాడు (చంద్రుడు)

**జలతస్కరుడు** - జలమును ఆవిరి రూపముగా తనవేడియైన కిరణములచే హరించువాడు (సూర్యుడు)

**జలదము** - జలమునిచ్చునది (మేఘము)

**జలదస్యుడు** - జలమును ఆవిరి రూపముగా తన వేడియైన కిరణములచే హరించువాడు (సూర్యుడు)

**జలదాగమము** - మబ్బులు వచ్చుకాలము (వానకారు)

**జలధరము** - జలమును ధరించునది (మేఘము)

**జలధి** - జలములు దీనిచే ధరింపబడును (సముద్రము)

**జలధిగ** - సముద్రమును జేరునది (నది)

**జలధిజ** - సంద్రమున పుట్టినది (లక్ష్మి, అచ్చర, కామధేనువు

**జలధిజము** - సంద్రమున పుట్టినది (కల్పతరువు, కౌస్తుభమణి, ఐరావతము)

**జలధిజుడు** - సంద్రమున పుట్టినవాడు (చంద్రుడు)

**జలధిరశన** - సముద్రము మొలనూలుగా గలది (భూమి)

**జలనిధి** - జలములకు ముఖ్యస్థానము (సముద్రము)

**జలనీలి** - నీటిని నీలవర్ణముగా చూపట్టునట్లు చేయునది (నాచు)

**జలపతి** - నీటికి అధిష్ఠాన దేవత (వరుణుడు, సముద్రుడు)

**జలపిత్తము** - పిత్తధాతువు వలె నీటిని ఇంకింప చేయునది (నిప్పు)

**జలపుష్పము** - నీట పుట్టిన పూవు (తామర)

**జలప్రదానము** - పితరుల కొరకు చేయు జలతర్పణము

**జలప్రాయము** - నీరు అధికముగా గల నేల (జవుకునేల)

**జలప్లవము** - నీటియందు తేలి యుండునది (నీటిపిల్లి)

**జలబిల్వము** - నీట మారేడుకాయ వలె నుండునది (తాబేలు, ఎండ్రి)

**జలభృత్తు** - జలమును ధరించునది (మబ్బు - జలభువు)

**జలముక్కు, జలముచము** - జలము విడుచునది (మేఘము)

**జలమోదము** - నీట తడిసినపుడు పరిమళముచే మోదింపజేయునది (వట్టివేరు)

**జలరంకము** - నీటియందు లోభివలె చేపలకై ఎదురుచూచునది (కొంగ)

**జలరంజము** - నీట ఆనందించునది (కొంగ)

**జలరసము** - జలమునందుండు రసము (పాకాదుల కువయుక్తములగు నారు రసములలో నొకటియగు నుప్పు

**జలరాశి** - జలసమూహము - సముద్రము

**జలరండము** - చూ జలరుండము

**జలరుంకము** - నీట ఇఱ్ఱివలె నుండునది (కూకురు గుండెపిట్ట - దాత్యూహము)

**జలరుండము** - జల సమూహము (సముద్రము)

**జలరూపము** - నీట రంగు కలది (మొసలి)

**జలలత** - నీటికి తీగవంటిది (తరంగరేఖ)

**జలవల్కలము** - నీటిపై వస్త్రమువలె నుండునది (నాచు)

**జలవాహము** - నీటిని వహించునది (మబ్బు, కర్పురము)

**జలవృశ్చికము** - నీట వృశ్చికము వలె నుండునది (రొయ్య)

**జలశయనుడు** - సముద్ర జలమున పరుండువాడు (విష్ణువు)

**జలశాయి** - సముద్ర జలముల పరుండువాడు (విష్ణువు)

**జలశూకము** - నీటికి నూగు వంటిది (నాచు)

**జలసర్పిణి** - నీట ప్రాకునది (జలగ)

**జలసూకరము** - నీటియందు పందివలె నుండునది (మొసలి, నీటిపంది)

**జలసూచి** - జలమున సూది వంటిది (జలగ)

**జలహాసము** - నీటికి నవ్వు వంటిది (నురుగు)

**జలాంచలము** - నీటికి చెంగు వంటిది (నాచు)

**జలాంటకము** - నీటిలో వీరునివలె విహరించునది (మొసలి)

**జలాంబిక** - నీటికి తల్లివంటిది (బావి)

**జలాటని** - నీట తిరుగునది (జలగ)

**జలాయుక** - నీరు ఆయువుగా గలది (జలగ జలాసుక)

**జలాలుక** - నీటిలో తిరుగునది (జలగ-జలిక)

**జలాలువు** - నీట ఆలుగడ్డవలె ఉండునది (తామరదుంప - జలాలుకము)

**జలావర్తము** - ఇందు నీరు గుండ్రముగా తిరుగును (నీటిసుడి)

**జలాశయము** - జలములకు స్థానమైనది (మడుగు, కొలను, మొ॥)

**జలాసుక** - నీరు ప్రాణముగా గలది (జలగ)

**జలిక** - జలము ఉత్పత్తి స్థానమైనది (జలగ)

**జలూక** - నీరు వాస స్థానముగా గలది (జలగ - జలౌకసము)

**జలేంధనము** - నీళ్ళే కట్టెలుగా గలది (బడబాగ్ని)

**జలేచరము** - నీట తిరుగునది (చేప, హంస)

**జలేజము** - నీట పుట్టునది (తామర)

**జలేజాతము** - నీట పుట్టునది (తామర)

**జలేశయము** - నీట నుండునది (చేప మొదలగునవి)

**జలోరగ** - నీటిలో పాముమవలె నుండునది (జలగ)

**జలౌక, జలౌకసము** - జలము నివాసముగా గలది (జలగ, చేప, మొ॥)

**జల్పాకుడు** - నిరుపయోగములైన పెక్కు మాటలు పలుకువాడు (వదరుబోతు)

**జల్లితోక మెకము** - విరిసిన వెండ్రుకలు తోకయందు గల జంతువు (చమరీ మృగము)

**జహానకము** - సర్వమును తొలగించునది (ప్రళయము)

**జహ్నుకన్య** - జహ్ను మహర్షి కూతురు (గంగ)

**జహ్నుతనయ** - జహ్ను మహర్షి చెవినుండి పుట్టినది (గంగ)

**జాంబూనదము** - మేరు పర్వత సమీపమున నున్న నేరేడు పండ్ల రసముచే పారిన నదియందు పుట్టినది (బంగారము)

**జాఠరుడు** - కడుపున బుట్టినవాడు (కొడుకు)

**జారర్యము** - జరరమున పుట్టినది (రోగము, మొ॥)

**జాతి కర్మము** - పుట్టిన వానికి చేయు నొక కర్మ విశేషము, పుట్టినప్పటి రూపు కలది (దిగంబరము)

**జాతరూపము** - ప్రశస్తమైన రూపము కలది (బంగారము)

**జాతవేదుడు** - ఇతని వలన వేదములు పుట్టినవి, పుట్టిన దేహము నందెల్ల నుండువాడు, హిరణ్యము వీనివలన బుట్టినది, పుట్టిన శుభాశుభముల నెరుంగువాడు (అగ్నిదేవుడు)

**జాతాపత్య** - అప్పుడే పుట్టిన బిడ్డ కలది (బాలెంతరాలు)

**జాతీయము** - ఒక జాతికి సంబంధించినది

**జానపదము** - జనులు నివసించెడు గ్రామాదికము

**జానుఫలకము** - మోకాలికి పలక వంటిది (మోకాలిచిప్ప)

**జాపకము** - పరిమళముచే తన్ను తలపింప జేయునది (కాలేయకమను సుగంధ ద్రవ్యము)

**జాబిలి** - చెవుల పిల్లి చిహ్నము కలవాడు (చంద్రుడు)

**జాబిలి గుబ్బలి** - చంద్రగిరి

**జాబిలి తాలుపరి** - చంద్రుని శిరమున ధరించినవాడు (శివుడు)

**జాబిలి తాలుపు** - చంద్రుని శిరమున దాల్చినవాడు (శివుడు)

**జాబిలిదిండి** - చంద్రుని మ్రింగువాడు (రాహువు)

**జాబిల్లి మేపరి** - చంద్రుని మ్రింగువాడు (రాహువు - తలగాము)

**జాబిల్లి** - చెవుల పిల్లి చిన్నెగా కలవాడు (శశలాంఛనుడు - చంద్రుడు)

**జాబిల్లి యల్లుడు** - చంద్రునకు మేనల్లుడైనవాడు (మన్మథుడు)

**జామదగ్న్యుడు** - జమదగ్ని ముని కొడుకు (పరశురాముడు)

**జామాత** - పెండ్లామును వివాహార్థము గౌరవించువాడు (కూతు మగడు - అల్లుడు)

**జాయ** - ఈమె యందు భర్త పుత్రరూపమున జనించును (భార్య)

**జాయాజీవి, జాయానుజీవి** - భార్య సంపాదనచే జీవించువాడు

**జారణి** - అన్నమును జీర్ణింపజేయునది (జీలకఱ్ఱ)

**జాలంచల విడిది** - హంసల పంక్తికి నెలవైనది (దేవగంగ, మానస సరోవరము)

**జాలంధరము** - గడ్డమును రొమ్మునకు అదిమిపట్టి వేసెడు ఒకానొక యోగాసనము

**జాలకారకము, జాలకీటము** - వల పన్నునది (సాలెపురుగు)

**జాలపాదము** - వలవంటి పాదము కలది (బాతు, హంస)

**జాలము** - జలమునందు వేయబడునది (వల)

**జాల్ముడు** - లెస్సగా ఆలోచింపక పనిచేయు వాడు (అసమీక్ష్యకారి)

**జాహ్నవి** - జహ్ను మహర్షి చెవి నుండి పుట్టినది (గంగ)

**జాళువా గుబ్బలి** - బంగారు కొండ (మేరువు)

**జాళువా గుబ్బలి విలుకాడు** - మేరు పర్వతము విల్లుగా కలవాడు (శివుడు)

**జాళువా వింటివాడు** - బంగారు (బంగారుకొండ) విల్లుగా కలవాడు (శివుడు)

**జింక గుఱ్ఱము వలంతి** - జింక వాహనముగా గల ప్రభువు (వాయువు)

**జింకతల చుక్క** - జింకతల వంటి చుక్క (మృగశిర - జాబిలి చుక్క)

**జింకతల చుక్కనెల** - మార్గశీర్ష మాసము

**జింకతాల్పరి** - జింకను ధరించినవాడు (శివుడు, చంద్రుడు)

**జింక పొక్కిలి** - కస్తురి పిల్లియొక్క బొడ్డున నుండునది (కస్తూరి)

**జింకమావుదేవర** - జింక వాహనము గల దేవుడు (వాయువు)

**జింకరవుతు** - జింకనెక్కి తిరుగువాడు (వాయువు - జింకరౌతు)

**జింకవార్వపు జోదు** - జింక వాహనముగా గల యోధుడు (వాయువు)

**జిఘాంసువు** - చంపు కోరిక గలవాడు (శత్రువు)

**జిజీవిషువు** - జీవింపవలెనని కోరిక (గలది) గలవాడు

**జిజ్ఞాసువు** - తెలిసికొనవలెనను కోరిక గలవాడు

**జిడ్డు కడలి బొట్టియ** - పాల కడలి కూతురు (లక్ష్మి)

**జిడ్డు నీర్వామి** - పాల సముద్రము

**జితేంద్రియుడు** - జయింపబడిన యింద్రియములు గలవాడు

**జినుడు** - వైరాగ్యముచే సంసారమును జయించినవాడు (బుద్ధుడు)

**జిష్ణువు** - జయించు శీలము కలవాడు (ఇంద్రుడు)

**జిహ్మగము** - వంకరగాను మెల్లగాను బోవునది (సర్పము)

**జిహ్మమేహనము** - మెల్లగా మూత్రము విడుచునది (కప్ప)

**జిహ్వాపము** - నాలుకచే పానము చేయునది (కుక్క, పిల్లి, పులి)

**జిహ్వామూలీయము** - జిహ్వ ఉత్పత్తి స్థానముగా గలది (కవర్ణమునకు ముందుంచెడు విసర్గము)

**జిహ్వారదము** - నాలుక దంతముగా గలది (పిట్ట)

**జీమూతము** - దీనియందు దుదకము బంధింపబడును (మేఘము)

**జీమూతవాహనుడు** - మబ్బు వాహనముగా గలవాడు (ఇంద్రుడు)

**జీరణము** - అన్నమును జీర్ణము చేయునది (జీలకఱ్ఱ - జీరకము)

**జీర్ణ వజ్రము** - ప్రాతపడిన వజ్రమువలె నుండునది (వైక్రాంతమణి)

**జీవంజీవము** - సహచరముతో గూడి జీవించునది (వెన్నెల పులుగు)

**జీవచ్ఛవము** - బ్రతికి యుండియు చనిపోయిన వానితో సమానమైనవాడు

**జీవద** - జీవశక్తి నొసంగునది (పాలకూర - జీవంతిక)

**జీవదుడు** - జీవము నిచ్చువాడు (వైద్యుడు)

**జీవన్ముక్తుడు** - జీవించియే సంసార సంబంధములను త్రెంచి బ్రహ్మ జ్ఞాన పరుడై ముక్తి నొందినవాడు

**జీవన్మృతుడు** - బ్రతికి యుండియు చనిపోయిన వానితో సమానమైనవాడు

**జీవితేశుడు** - జీవితమునకు ప్రభువు (భర్త, యముడు)

**జుట్టునట్టువ** - సిగ గలిగి నృత్యము చేయునట్టి పులుగు (నెమలి)

**జుట్టు నట్టువతేజి జోదు**-నెమలి వాహనముగా గల యోధుడు (కుమారస్వామి)

**జుట్టు పులుగు** - శిరమున జుట్టుగల పక్షి (నెమలి, కోడి)

**జేజేగట్టు** - దేవతల విహార పర్వతము (మేరువు - వేల్పుమల)

**జేజేగిడ్డి** - దేవతల యావు (కామధేనువు)

**జేజేగొంగ** - వేల్పుల శత్రువు (రాక్షసుడు - సురద్విషుడు)

**జేజేదొర** - దేవతలకు రాజు (ఇంద్రుడు)

**జేజే నిరాబారి** - దేవలోకపు ముని (నారదుడు)

**జేజే నెలవు** - వేల్పుల వాసస్థానము (జేజేలపాలెము - స్వర్గము)

**జేజే పట్టు** - దేవతలకు నెలవైనది (స్వర్గము)

**జేజే పెద్ద** - వేల్పులలో పెద్దవాడు (బ్రహ్మ - వేల్పు పెద్ద)

**జేజే బువ్వ** - దేవతలకు ఆహారమైనది (అమృతము, చంద్రుడు)

**జేజే రేనియరదము** - దేవేంద్రునకు వాహనమైనది (మబ్బు)

**జేజేల మానికము** - దేవతల కోరికలను దీర్చెడు రత్నము (చింతామణి)

**జేజేల పాలెము** - దేవతల నివాస స్థానము (స్వర్గము, జేజేల వీడు)

**జేజేల వీడు** - వేల్పుల నగరము (వినుప్రోలు - అమరావతి)

**జైత్రరథము** - జయమును కలిగించు రథము

**జైనము** - జినునిచే స్థాపింపబడిన మతము

**జైవాతృకుడు** - లోకమును జీవింపజేయు వాడు (చంద్రుడు, కృషీవలుడు)

**జైవేయుడు** - బృహస్పతి యొక్క కుమారుడు (కచుడు)

**జోషిత** - సేవల చేత ప్రీతి కల్గించునది (ఆడుది)

**జ్ఞాన దగ్ధదేహుడు** - జ్ఞానము చేతనే దహింపబడిన శరీరము కలవాడు

**జ్ఞానేంద్రియము** - విషయ జ్ఞాన సాధనమైన ఇంద్రియము

**జ్యోతిరంతస్థుడు** - సూర్యమండలమున సూర్యజ్యోతియై ప్రకాశించువాడు (పరమేశ్వరుడు)

**జ్యోతిరింగణము, జ్యోతిరింగము** - జ్యోతి వలె మిలమిల లాడుచు పోవునది (మిణుగురు బుర్వు)

**జ్యోతిర్బీజము** - వెలుగునకు విత్తనము వంటిది (మిణుగురు పురుగు)

**జ్యోతిశ్చక్రము** - సూర్య చంద్రాది గ్రహములతో కూడిన నక్షత్ర మండలము, సూర్యాది గ్రహముల గతిని దెలిపెడి రాశి చక్రము

**జ్యోతిష్టోమము** - స్తోత్రరూపములైన సామలు గానము చేయబడు ఒక యజ్ఞము (స్వర్గకాముడు చేయదగిన యజ్ఞము)

**జ్యోత్స్న** - కాంతి కలది (వెన్నెల)

**జ్యోత్స్నాప్రియము** - తనకాహారమైన వెన్నెలయందు మక్కువ చూపునది (వెన్నెల పులుగు)

**జ్యోత్స్నావృక్షము** - కాంతులకు చెట్టు వంటిది (దీప పాదపము - దీపస్తంభము)

**జ్వలనుడు** - మండెడి స్వభావము కలవాడు (అగ్నిదేవుడు)

**జ్వాలాజిహ్వుడు** - జ్వాలలు నాలుకలుగా కలవాడు (అగ్నిదేవుడు)

**జ్వాలావక్త్రుడు** - మొగమున (ఫాలమున) నిప్పులు గ్రక్కెడు కన్ను కలవాడు (శివుడు - చిచ్చరకంటి)

**ఝంఝకము** - ఝం ఝం అని గొప్పగా ధ్వనించునది (ఇంద్రుని శంఖము)

**ఝంపాకము** - గెంతెడు స్వభావము కలది (కోతి)

**ఝంపారువు** - గెంతెడు లక్షణము కలది (కోతి)

**ఝంపాళి** - నీట దుమికి చేపలను బట్టి తినునది (మీనవల్లంకి పిట్ట)

**ఝర్ఝరి** - ఝర్ఝర ధ్వని చేసెడు డక్కి కలవాడు (శివుడు)

**ఝర్ఝరికము** - పాపు లెక్కువగుటచే భయము గొల్పునది (కలియుగము)

**ఝర్ఝరీకము** - జీర్ణించి పోవునది (శరీరము, చిత్రపటము)

**ఝలవతి** - ప్రవాహము కలది (నది, ఏరు)

**ఝల్లకంఠము** - డమరు మ్రోగు నట్లుండెడు కంఠ ధ్వని కలది (పావురము)

**ఝల్లీషకము** - మండలా కారముగ చేయు నృత్యము (హల్లీసకము)

**ఝషకేతుడు** - మొసలి ధ్వజముగా గలవాడు (మన్మథుడు)

**ఝషధ్వజుడు** - చేప లేక మొసలి ధ్వజ చిహ్నముగా గలవాడు (మన్మథుడు - మీనాంకుడు మకరాంకుడు)

**ఝషాంకుడు** - మొసలి ధ్వజముగా గలవాడు (మన్మథుడు - మకరాంకుడు)

**ఝషోదరి** - చేప కడుపున పుట్టినది (మత్స్య గంధి)

**ఝిల్లిక** - పెద్దడోలు వాద్యము వంటి కూత గలది (ఈలపురుగు)

**ఝిల్లీకంఠము** - ఈల పురుగు ధ్వని వంటి కంఠధ్వని కలది (పావురము)

**టట్టని** - టట్ట అని శబ్దము చేయునది (బల్లి)

**టారుడు** - అంతటను విలాసముగా సంచరించువాడు (విటుడు)

**టింగణాస్వామి** - మరుగుజ్జు దొర (గణపతి)

**టిట్టిభము** - టీటీయని కూయు పిట్ట (తీతువు, లకుముకి పిట్ట)

**టెక్కెపుగ్రామము** - టెక్కెము పేరుగల గ్రహము (కేతు గ్రహము)

**డబిత్థము** - కొయ్యతో జేయబడిన లేడి

**డమరువు** - డమయను శబ్దమును బలుకునది (డమరుకము)

**డిండిమము** - డిం డిం అని ధ్వని చేయునది (రాయడిగిడిగిళ్ళు)

**డిండీరము** - డిండియను శబ్దమును బుట్టించునది (సముద్రపు నురుగు)

**డింభకుడు** - తల్లిని సమీపించి యుండువాడు (బాలకుడు)

**డిత్థము** - కఱ్ఱతో జేసిన ఏనుగు బొమ్మ

**డిమము** - పలువురు నాయకులు కలది (దశ రూపకములలో నొకటి)

**డుంఠి** - భక్తులచే అన్వేషింప బడువాడు, భక్తుల నుద్ధరించుటకు తానుగా అన్వేషించువాడు (కాశిగణపతి - ఢుంఢి)

**డుండులము** - డుండుమ్మని ధ్వని చేయునది (చిన్నగుడ్ల గూబ)

**డెందమ్ముచూలి** - మనమున బుట్టినవాడు (మన్మధుడు)

**డోలి** - పైకెత్తి మోయబడునది (ఊయలవంటి పల్లకి)

**తండ్రి తండ్రి** - తండ్రికి తండ్రియైన వాడు (తాత, బ్రహ్మదేవుడు)

**తంతిపాలుడు** - గోవులను పాలించువాడు (గొల్లవాడు)

**తంతునాగము** - నీటదారము వలె నుండెడు ఒక జాతిపాము (నెగడు)

**తంతునాభము** - దారము నాభియందు కలది (సాలెపురుగు)

**తంతుపర్వము** - యజ్ఞోపవీతమును మార్చు కొను పండుగు, రక్షాబంధనము కట్టుకొను (రాఖీ) పండుగ (శ్రావణ పౌర్ణమి)

**తంతువాయము** - తన నాభియందలి నూలుచే గూడు అల్లుకొనునది (సాలెపురుగు)

**తంతువాయుడు** - నూలుచే బట్టలు నేయువాడు (సాలెవాడు)

**తందనాల జడదారి** - సారెసారెకు తన శబ్దముతో రాగాలాపన జేసెడు దేవర్షి (నారదుడు)

**తరగు రౌతు** - మేక వాహనముగా గల ప్రభువు (అగ్ని)

**తటాకపరీవాహ(జల)ము** - చెరువు నీరు తూము గుండా కొలదిగా నైనను విడువనిచో గట్టుతెగి జలమంతయు పోవుననుట (ప్రమాదములు గూడ కలుగవచ్చుననుట)

**తటాకము** - జలముచే గొట్టబడునది (చెరువు)

**తటిత్వంతము** - మెరపులు గలది (మేఘము)

**తటిని** - తటములు గలది (ఏరు)

**తడక ద్రోపరి** - తలుపులు బ్రద్దలు గొట్టి లోనికి బ్రవేశించుదొంగ

**తడవుల నిడుపడు** - చిరకాలముగా దీర్ఘదేహము కలవాడు (పురాతన సర్పము - ఆదిశేషువు)

**తడుపు దాలుపు** - తడి అంగవస్త్రమును కట్టువాడు (బ్రహ్మచారి)

**తతపత్త్రి** - విశాలమైన ఆకులు గలది (అరటి)

**తత్తడి మోరపైదలి** - అశ్వముఖము గల కిన్నర స్త్రీ (అశ్వముఖి)

**తత్త్వజ్ఞుడు** - పరమాత్మ స్వరూపమును తెలిసిన జ్ఞాని

**తత్సమము** - సంస్కృత ప్రాకృత సమమై తెనుగు విభక్తి ప్రత్యయము గల పదము

**తత్పురుషము** - ఉత్తర పదార్థ ప్రధానమగు సమాసము

**తథాగతుడు** - పునరావృత్తిలేని సద్గతి పొందినవాడు (బుద్ధుడు)

**తద్గుణాలంకారము** - స్వగుణమును విడిచి యన్య గుణమును పొందినట్లు వర్ణించుట (ఓ కాంతా నీ పెదవియొక్క కాంతిచే ముక్కు ముత్యము పద్మరాగమణి యగుచున్నది)

**తద్దినము** - మృతి పొందిన నాటి దినము (ఆబ్దికము)

**తద్భవము** - సంస్కృత ప్రాకృత పదముల నుండి జనించినది (వికృతి పదము)

**తనీయము** - ఒకదానికంటె అల్పమైనది (అల్పతరము)

**తనుత్రాణము** - దేహమును దెబ్బల నుండి కాయునది (కవచము)

**తనుభస్త్ర** - శరీరమునకు కొలిమి తిత్తి వంటిది (నాసిక)

**తనుమధ్య** - సన్నని నడుము గల స్త్రీ (కృశోదరి)

**తనురుహము** - తనూరుహము

**తనువారము** - శరీరమును దెబ్బల తాకిడి నుండి వారించునది (కవచము - బొందలము)

**తనూజ** - శరీరము నుండి పుట్టినది (కూతురు, తనయ)

**తనూజము** - తనువు నుండి మొలచునది (రోమము, రెక్క)

**తనూజాతుడు, తనూజుడు** - శరీరము నుండి జనించువాడు (కుమారుడు, తనయుడు)

**తనూభవుడు, తనూద్భవుడు** - తనువు నుండి జనించువాడు (కొడుకు)

**తనూనపాత్తు** - దేహమును పడకుండ నిలుపునది (అగ్ని, చిత్రమూలము)

**తనూరుహము** - మేన జనించునది (రోమము, రెక్క)

**తన్వి** -కృశించిన దేహము గల యాడుది-స్త్రీ

**తపనాంశువు** - వేడి కిరణములు కలవాడు (సూర్యుడు)

**తపనాత్మజ** - సూర్యుని కొమార్తె (యమున)

**తపనాత్మజుడు** - సూర్య తనయుడు (యముడు, శని, సుగ్రీవుడు, కర్ణుడు)

**తపనుడు** - తపింపజేయువాడు (సూర్యుడు)

**తపసి కన్నాప** - అత్రి మహర్షి కంటినుండి పుట్టిన బిడ్డ (చంద్రుడు)

**తపోధనుడు, తపోనిధి** - తపస్సు ధనముగా గలవాడు (ఋషి)

**తపోలోకము** - జనలోకమునకు మీది లోకము

**తప్తతైలాంబువు** - కాగిన నూనెలో జలబిందువులు పడిన భగ్గున మండుననుట

**తమస్వతి** - తమస్సు (చీకటి) కలది (రాత్రి - తమస్విని)

**తమః ప్రకాశ నిదర్శనము** - చీకటియున్న చోట వెలుగును, వెలుగు ఉన్నచోట చీకటియు ఉండవనుట

**తమోగువు** - చీకటి వలె నల్లని కాంతి కలవాడు (రాహువు)

**తమోజ్యోతి** - చీకటి యందు వెలుగు వంటిది (మిణుగురు)

**తమోదీప నిదర్శనము** - వెలుగులేని చోట నొక వస్తువును జూచుటకు దీప మవసరమని తలచి చీకటిని దీపము సహాయముతో చూడ యత్నించుట (వ్యతిరేక వస్తువులను రెంటిని ఒకమారు చూచుట సంభవము కాదనుట)

**తమోభిదము** - చీకటిని భేదించునది (మిణుగురు పురుగు)

**తమోమణి** - చీకటియందు మణివలె ప్రకాశించునది (మిణుగురు పురుగు)

**తమోరి** - తమస్సునకు విరోధి యగువాడు (సూర్యుడు, చంద్రుడు, అగ్ని)

**తమోపహుడు** - చీకటిని బోగొట్టువాడు (సూర్యుడు)

**తమ్మికంటి** - పద్మముల వంటి కన్నులు కలది (స్త్రీ), పద్మముల వంటి కన్నులు గలవాడు (విష్ణువు)

**తమ్మి గద్దియ దళవాయి** - చూ కమలాసనుడు (తమ్మిగద్దియసామి)

**తమ్మిగద్దియ బోటి** - తామరపూవు పీఠముగా గలది (లక్ష్మి)

**తమ్మిలి చక్కిలిగింత** - కమలములకు గిలిగింత కల్గించువాడు (సూర్యుడు)

**తమ్మి చుట్టము** - పద్మములకు బంధువు (సూర్యుడు)

**తమ్మిచూలి** - విష్ణువు యొక్క నాభి కమలమున బుట్టినవాడు (బ్రహ్మ)

**తమ్మిచెలి** - చూ తమ్మి చుట్టము

**తమ్మి చెలిపట్టి** - తమ్మిదొరపట్టి (యముడు, శని, సుగ్రీవుడు)

**తమ్మిదాయ** - పద్మములకు విరోధి (చంద్రుడు)

**తమ్మి దాల్పు** - తామర బొడ్డునందు గలవాడు (విష్ణువు)

**తమ్మిదొర** - పద్మములకు ప్రభువు (సూర్యుడు)

**తమ్మిదోదుమ్మిజోదు** - తామర బాణముగా గల యోధుడు (మన్మథుడు)

**తమ్మి పగతుడు** - తామరలకు విరోధి (చంద్రుడు)

**తమ్మి పొక్కిలివాడు** - నాభియందు తమ్మికల వాడు (హరి)

**తమ్మి యనుగు** - తమ్మి చెలి (సూర్యుడు)

**తమ్మిసూడు** - తమ్మి పగతుడు (చంద్రుడు)

**తమ్ముల పగతుడు** - తామరలకు శత్రువు (చంద్రుడు)

**తమ్ముల విందు** - తామరలకు చుట్టము (సూర్యుడు)

**తరంగిణి** - అలలు కలది (నది)

**తరక్షువు** - మీది కురికి చంపునది (సివంగి)

**తరణి** - అంధకారమును తరింప సాయపడువాడు (సూర్యుడు), నద్యాదులను దాటింప సమర్థమైనది (నావ)

**తరళ లోచన, తరళేక్షణ** - చలించెడు కన్నులు గల ఆడుది

**తరిగట్టు తాలుపు** - మందర పర్వతమును కవ్వముగా మూపున దాల్చినవాడు (కూర్మ రూపుడగు విష్ణువు)

**తరిగట్టు త్రాడు** - మందర పర్వతమనెడు కవ్వమునకు త్రాడైనవాడు (ఆదిశేషుడు)

**తరిగట్టు దారి** - చూ తరిగట్టు తాలుపు

**తరిగొండ** - క్షీర సాగర మథనమున కవ్వమైన కొండ (మందరము)

**తరుచరము** - చెట్లపై దిరుగునది (కోతి)

**తరుచు గన్నుల వేల్పు** - అధికముగా కన్నులు గల ప్రభువు (ఇంద్రుడు)

**తరుణి** - కన్యావస్థను దాటిన ముప్పది యేండ్లకు మించని స్త్రీ (యౌవనవతి)

**తరునఖము** - చెట్లకు గోరువలె నుండునది (ముల్లు)

**తరుజము** - చెట్లపై మొలచి వానిని చంపునది (బదనిక)

**తరుభుక్కు** - చెట్లపై మొలచి చెట్ల సారమును హరించునది (బదనిక)

**తరురుహా** - చెట్లపై మొలచునది (బదనిక - తరురోహిణి)

**తరుల మెకము, తరుల మోరమెకము** - ముడుతలతో గూడిన ముఖముగల మృగము (వలీముఖము - కోతి)

**తర్జని** - దీనిచే భయపెట్టబడుదురు (జుట్టనవ్రేలు)

**తర్పణము** - దీనిచే పితృదేవతలు సంతృప్తి గావింపబడుదురు (ఉదకదానము)

**తలపుచూలి** - చూ చిత్తజుడు

**తలపుమానికము** - కోరిక లిచ్చెడి మణి (చింతామణి)

**తలంబ్రాలు** - పెండ్లియందు వధూవరులు దోసిళ్లతో తలలపై బోయు బియ్యము

**తలయేరు** - శివుని తలపై నుండు నది (గంగ)

**తలపు రతనము** - తలపు మానికము

**తలిరంపకాడు** - చిగురం ఆయుధముగా గలవీరుడు (మన్మధుడు)

**తలిరుకటారికాడు, తలిరుగ్గైదువు జోదు** - చిగురు ఆయుధముగా గలవాడు (మన్మధుడు)

**తలిరు విలుకాడు, తలిరు విలుతుడు** - చిగురును విల్లుగా దాల్చినవాఁడు (మన్మధుడు)

**తలిరుబోణి** - ఇగురువలె సుకుమారమైన మేను గలది (స్త్రీ)

**తలిరుబోడి** - తలిరుబోణి

**తలిరుదిండి** - చిగుళ్లను దినునది (కోయిల)

**తలిరుమేతరి** - చిగుళ్లను దినునది (కోయిల)

**తలోదరి** - సూక్ష్మమైన ఉదరము గలది (ఆడుది, తన్వి)

**తల్లి తల్లి** - తన తల్లికి తల్లియైనది (అమ్మమ్మ మాతామహి), తన తల్లియగు గంగకు విష్ణు పాదోద్భవ యగుటచే తల్లియైనది (లక్ష్మి), తన తల్లియగు లక్ష్మికి క్షీరాబ్ధి భవమగుటచే తల్లియైనది (గంగ)

**తాటకేయుడు** - తాటకియను రక్కసి కొడుకు (మారీచుడు)

**తాటదమ్ముడు** - జీవనము కొరకు కాషాయాంబరాదులు దాల్చిన వాడు (సన్న్యాసి)

**తాటిడాల్దొర** - తాటిచెట్టు జెండాగా గలవాడు (బలరాముడు, భీష్ముడు)

**తాటి టెక్కెమువాడు, తాటిపడగవాడు, తాటి సిడమువాడు** - తాటిచెట్టు జెండాగా గలవాడు (బలరాముడు, భీష్ముడు - తాలధ్వజుడు)

**తాటిరిక్కనెల** - తాటిచెట్టు ఆకృతిగల జ్యేష్ఠా నక్షత్రముతో బున్నమి కలియునెల (జ్యేష్ఠమాసము)

**తాండవ ప్రియుడు** - తాండవమునందిష్టము గలవాడు (శివుడు)

**తాండవము** - తండువను మునిచే జెప్పబడిన పురుష నృత్యవిధానము (దీనిచే భూమి తాడింప(కొట్ట)బడును)

**తాత తల్లి** - తాతయగు బ్రహ్మకు తల్లి (లక్ష్మి)

**తాత పసటివెల్లి** - బ్రహ్మ యొక్క కమండలువు జలధార (గంగ)

**తాపనుడు** - తపనుడు

**తాపసతరువు** - తాపసుల కుపయోగించు ఫలములు గలది (గారచెట్టు)

**తాపసుడు** - తపము సల్పువాడు (ముని)

**తామరకంటి** - పద్మముల వంటి కన్నులు కలది (స్త్రీ)

**తామరకెంపు** - తామరవంటి కెంపు (పద్మరాగ మణి)

**తామరచెలి** - పద్మములకు మిత్రుడైనవాడు (సూర్యుడు)

**తామర చూలి** - విష్ణువు యొక్క నాభి కమలమున బుట్టినవాడు (బ్రహ్మ)

**తామరతూపరి** - పద్మము బాణముగా గలవాడు (మన్మథుడు)

**తామర పొక్కిలివాడు** - కమలనాభుడు

**తామరల దేవర** - తామరలకు ప్రభువు (సూర్యుడు)

**తామరల విందు** - పద్మబంధువు (సూర్యుడు)

**తామిస్రము** - దట్టమైన చీకటితో నిండినది (ఒక నరకము)

**తామ్ర కుట్టకుడు, తామ్ర కుట్టుడు** - రాగివని చేయువాడు (తామ్రకారుడు - శౌల్బి(ల్వి)కుడు)

**తామ్రకృమి** - ఎఱ్ఱని పురుగు (ఆరుద్రపురుగు)

**తామ్రగర్భము** - రాగి నుండి పుట్టినది (మైలు తుత్తము)

**తామ్రత్రపుజము** - రాగి తగరముల కలయికచే నేర్పడునది (కంచు)

**తామ్ర చూడము** - తామ్ర (ఎరుపు) రంగు మాంస విశేషము శిరముపై అలంకారముగా గలది (కోడి)

**తామ్రపర్ణి** - పడమర దిక్కు నందలి ఆడేనుగు

**తామ్ర బీజము** - ఎఱ్ఱని విత్తనములు కలది (ఉలవచెట్టు)

**తామ్ర శిఖము, తామ్ర శిఖ** - ఎఱ్ఱని శిఖ గలది (కోడి)

**తామ్రాక్షము, తామ్రాక్షి** - తామ్రము (రాగి) వలె ఎఱ్ఱని కన్నులు కలది (కోయిల)

**తామ్రార్ధము** - సగ భాగము రాగి కలది (కంచు)

**తామ్రాశ్మము** - ఎఱ్ఱని శిల (కెంపు)

**తార** - దీనిచే నీట నావికులు దాటుదురు (చుక్క)

**తారక** - అంధకారమును దాటించునది (కంటి నల్లగ్రుడ్డు)

**తారకజిత్తు** - తారకాసురుని జంపినవాడు (కుమారస్వామి)

**తారకవైరి** - తారకాసురుని సంహరించిన వాడు

**తారకానాథుడు** - అశ్విన్యాది 27 నక్షత్రములకు భర్త (చంద్రుడు)

**తారకుడు** - సంసారసాగరము నుండి తరింప జేయువాడు (భగవంతుడు)

**తారకేశ్వరుడు** - తారకానాథుడు (చంద్రుడు)

**తారపుష్పము** - వెండి వంటి తెల్లని పూలు కలది (మొల్ల)

**తారాధిపతి** - తార యొక్క మగడు (వాలి, సుగ్రీవుడు, గురుడు)

**తారాధిపుడు, తారానాథుడు** - తారాధిపతి

**తారాపథము** - నక్షత్రమార్గము (ఆకాశము ఉడువీధి)

**తారాపతి** - అశ్విన్యాది 27 నక్షత్రములకు ప్రభువు (చంద్రుడు), తారకు మగడు (తారానాథుడు)

**తారాభము** - వెండి వంటి కాంతి కలది (పాదరసము)

**తారాభూష** - తారలు నగలుగా గలది

**తారాసుతుడు** - తార కొడుకు (బుధుడు)

**తారేయుడు** - బృహస్పతి భార్యయగు తారకు

చంద్రుని వలన బుట్టినవాడు (అంగదుడు, బుధుడు)

**తార్క్ష్యుడు** - తృక్షుడను ముని కొడుకు (గరుత్మంతుడు)

**తార్క్ష్యధ్వజుడు** -గరుడుడు ధ్వజ చిహ్నముగా గలవాడు (విష్ణువు)

**తాలవ్యములు** - దౌడల నుండి పుట్టునవి (ఇ,ఈ, చ,ఛ,జ,ఝ, ఞ, య, శ)

**తాలాంకుడు** - తాడిచెట్టు జెండాగా గలవాడు (బలరాముడు, భీష్ముడు - తాటిసిడముజోదు)

**తాళకేతనుడు, తాళధ్వజుడు** - తాటిచెట్టు జెండాపై గుర్తుగా గలవాడు (బలరాముడు, భీష్ముడు - తాలకేతనుడు)

**తాళవృంతకము** - తాటి తొడిమ వంటి తొడిమ కలది (విసనకఱ్ఱ)

**తాలు జిహ్వము** - తాలువు (దౌడ) జిహ్వగా గలది (మొసలి)

**తావిగట్టు, తావిగుబ్బలి, తావిమల** - చందన పరిమళము గల కొండ (మలయ పర్వతము)

**తావి చెంగల్వ** - సువాసన లీను ఎఱ్ఱగలువ (కహ్లారము - సౌగంధికము)

**తావితాల్పరి** - గంధమును వహించువాడు (వాయువు)

**తావి మోవరి** - గంధమును గొనిపోవువాడు (వాయువు)

**తావి విలుకాడు, తావి విల్తుడు** - పరిమళించెడు పుష్పములు ధనుస్సుగా గలవాడు (మన్మథుడు - పుష్పధన్వుడు)

**తావులకొండ, తావుల గట్టు** - చందన పరిమళము లీను కొండ (మలయాద్రి)

**తిగకంటి** - నొసటి కంటితో గలిసి మూడు కన్నులు గలవాడు (శివుడు)

**తిగకాళ్లదేవర** - మూడు కాళ్లు గల దేవుడు (అగ్ని)

**తిగప్రోలుదాయ, తిగప్రోలు వేటకాడు** - మయ నిర్మితములైన ఇనుము, వెండి, బంగారు పురముల నొక్కచో జేర్చి పాశుపతాస్త్రముచే నాశనమొనర్చినవాడు (శివుడు)

**తిగ్మకరుడు** - తీక్ష్ణ కిరణములు కలవాడు (సూర్యుడు, భాస్కరుడు)

**తిగ్మమన్యువు** - తీక్ష్ణమగు కోపము కలవాడు (రుద్రుడు)

**తిగ్మాంశువు** - వేడి కిరణములు కలవాడు (సూర్యుడు - భానుడు)

**తిత్తిరి** - 'తి-తి' యని కూయునది (తీతువుపిట్ట)

**తిథిప్రణీ** - తన కళల హెచ్చు తగ్గుల ద్వారా తిథులను నడపించువాడు (చంద్రుడు - నెల)

**తిప్పద్రిమ్మరి** - వనేచరము (కోతి)

**తిమింగిలము** - తిమిని (నూరు యోజనముల పొడవుగల చేపను) మ్రింగు పెద్ద చేప

**తిమింగిలగిలము** - తిమింగిలమును మ్రింగెడు కడు పెద్ద జలచరము

**తిమికోశము** - తిమింగలాదులకు నిధి వంటిది (సముద్రము)

**తిమిరము** - కాముక చిత్తుల నార్ద్ర పరచునది (చీకటి)

**తిమిరారి** - చీకటికి విరోధి (సూర్యుడు)

**తియ్యవిలుకాడు, తియ్య విలుతుడు** - తియ్యనైన చెరకు విల్లుగా గలవాడు (మన్మథుడు)

**తిరునీరు** - శైవులు నొసట ధరించు గోమయపిండ భస్మము (విభూతి)

**తిరుమంతరము** - ఓం నమో నారాయణాయ యను శ్రేష్ఠమగు మంత్రము

**తిరువారాధనము** - వైష్ణవార్చన పరిభాష (దేవతార్చన)

**తిలకము** - నువ్వు గింజంత పరిమాణము గలది (పుట్టుమచ్చ, బొట్టు)

**తిలంతుదుడు** - చూ తిలపేడుడు

**తిలకాలకము** - నువ్వుల వలె నల్లని రంగు కలది (పుట్టుమచ్చ)

**తిలకారకుడు, తిల ఘాతుకుడు, తిలపీడుడు** - నువ్వులను పీడించి నూనె తీయువాడు (తెలికవాడు)

**తిల యంత్రము** - నువ్వుల నుండి నూనె తీయు యంత్రము (గానుగ)

**తిలోత్తమ** - సుందోపసుందుల వధార్థము మయునిచే లోకము లందలి యొప్పులందెల్ల తిల ప్రమాణము నాహరించి చేయబడిన వనిత

**తీక్ష్ణ కంటకము** - వాడి ముండ్లు గలది (తుమ్మ, ఉమ్మెత్త, గార)

**తీక్ష్ణ కందము** - గాటైన దుంప కలది (ఉల్లి)

**తీక్ష్ణగంధము** - గాటుగా నుండు గంధము గలది (వస, తెల్లావ)

**తీక్ష్ణతండుల** - గాటగు విత్తులు కలది (పిప్పలి చెట్టు)

**తీక్ష్ణతుండము** - వాడి ముక్కు కలది (దోమ)

**తీక్ష్ణతైలము** - గాటైన నూనె (జెముడు పాలు, కల్లు)

**తీక్ష్ణ దంష్ట్రము** - వాడి కోఱలు కలది (చిరుతపులి)

**తీక్ష్ణ నఖము** - వాడి గోర్లు కలది (పులి)

**తీక్ష్ణ పుష్ప** - రంపపు పండ్లవలె నుండు పుష్పములు కలది (మొగలి)

**తీక్ష్ణ మూలము** - వాడియగు మూలము కలది (నల్లజీలకఱ్ఱ, మునగచెట్టు)

**తీక్ష్ణలోహము**- మిక్కిలి కఠినమగు లోహము (ఉక్కు)

**తీక్ష్ణ శూకము** - వాడి ముల్లు కలది (తేలు)

**తీక్ష్ణాంశువు** - వేడి వెలుగులు కలవాడు (సూర్యుడు, ఇనుడు)

**తీక్ష్ణాయసము** - గట్టిదగు ఇనుము (ఉక్కు)

**తీగబోడి** - తీగవలె మనోజ్ఞురాలగు స్త్రీ

**తీగవిలుకాడు, తీగవిలుతుడు** - తీగ విల్లుగా గలవాడు (మన్మథుడు - మారుడు)

**తీర్థకాకము** - తీర్థము నొద్ద ధనాశచే కాకి వలె తిరుగువాడు (తీర్థకాకుడు - తీర్థ ధ్వాంక్షుడు)

**తీర్థవిధి** - పుణ్య తీర్థములందు వేదోక్తముగా జేయు పితృకర్మాదికము

**తీపంచమోముల దిట్ట** - నాలుగు మోముల స్వామి (బ్రహ్మ, చతురాస్యుడు)

**తుంటనాల్క పులుగు** - చక్కెర తినెడు నాలుకగల పిట్ట (చిలుక)

**తుంట విలుకాడు, తుంట విలుతుడు** - చెరకు తుంట విల్లుగ దాల్చువాడు (మన్మథుడు, మదనుడు)

**తుమ్మెదకంటు** - తుమ్మెదలకు శత్రువైనది (సంపెంగ పువ్వు)

**తురంగద్విషము, తురంగారి** - గుఱ్ఱమును ద్వేషించునది (దున్న), గుఱ్ఱమునకు శత్రువు

**తురంగము** - త్వరగా బోవునది (గుఱ్ఱము, చిత్తము)

**తురంగ ముఖుడు** - గుఱ్ఱపు ముఖము వంటి ముఖము గలవాడు (కిన్నరుడు)

**తురంగ రిపువు** - గుఱ్ఱమునకు ఇష్టము కానిది (గన్నేరు చెట్టు)

**తురంగ వదనుడు** - తురంగ ముఖుడు (అశ్వముఖుడు)

**తురాషాహుడు** - త్వరగా శత్రువుల నణచువాడు, శత్రు వేగమును తాళువాడు (ఇంద్రుడు)

**తులాధరుడు** - త్రాసు పట్టువాడు (వర్తకుడు, వణిజుడు)

**తులా పురుషము** - తెలికపిండి, పచ్చి వస్తువులు, మజ్జిగ, జలము, పిండి వీని నొక్కొక దినము భుజించుచు పిమ్మట మూడు దినములు ఉపవసించు నియమము

**తులా భారము** - తన యెత్తు బంగారము తూచికొని పంచిపెట్టు విధానము

**తులువ** - తూలనాడు నట్టి వాయి (నోరు) కలవాడు (తుంటరి)

**తుల్యభాగ** - తుల్య భాగుడను దానవ శ్రేష్ఠునిచే శాపవిముక్తి నందినది

**తుషార కిరణుడు** - మంచు వలె తెల్లని కిరణములు కలవాడు (చంద్రుడు)

**తుషారము** - తప్తులను సంతోష పెట్టునది (మంచు)

**తుషార గిరి, తుషారాద్రి** - మంచుకొండ (హిమవత్పర్వతము)

**తుహినకరుడు** - మంచు వలె చల్లని కిరణములు కలవాడు (చంద్రుడు)

**తుహినము** - పద్మములను పీడించునది (మంచు, వెన్నెల)

**తుహిన శైలము**-మంచుగల కొండ(హిమాద్రి)

**తూడు దిండి** - తామర తూండ్లను తినునది (హంస)

**తూడు విలుకాడు, తూడు విలుతుడు** - తామరతూడు వింటి నారిగా గలవాడు (మన్మధుడు - స్మరుడు)

**తూణీరము** - బాణములచే నింపబడునది (అమ్ములపొది)

**తూపురిక్క** - బాణాకృతి గల నక్షత్రము (శ్రవణా నక్షత్రము)

**తూపురిక్కనెల** - పున్నమి యందు (తూపురిక్క) శ్రవణా నక్షత్రము వచ్చు నెల (శ్రావణ మాసము)

**తూబరుడు** - యౌవనమున గడ్డము, మీసము రానివాడు (కొజ్జా)

**తూరుపుదణి, తూరుపురేడు** - తూర్పు దిశకు ప్రభువు (ఇంద్రుడు)

**తూరుపు వారబట్టు** - పొల్లుపోవుటకై ధాన్యమును గాలికెగురబోయు, తూరు పెత్తు - దులుపు

**తృణగ్రాహి** - తృణమును గ్రహించునది (ఇంద్రనీల మణి)

**తృణద్రుమము, తృణరాజము** - గడ్డి జాతిలోని వృక్షము (తాడి మొ॥)

**తృణ ధ్వజము** - ధ్వజాకారముగా నుండెడి తృణము (వెదురు)

**తృణాంజనము** - తృణమందు బల్లి వలె నుండునది (తొండ)

**తృణావర్తము** - తృణాదికమును గుండ్రముగా ద్రిప్పునట్టి గాలి (సుడిగాలి)

**తెమ్మెరకూన** - వాయు కుమారుడు (ఆంజనేయుడు, భీముడు)

**తెమ్మెర చెలి** - వాయువునకు స్నేహితుడు (అగ్ని)

**తెరువు గాపరి** - దారిని కాచియుండునది (పులి - వ్యాఘ్రము)

**తెరగంటి** - రెప్పపాటు లేనిది (చేప - అనిమిషము) తెరపైన కన్నులు కలది (అచ్చర), రెప్పలు లేకుండుటచే మూయబడని కన్నులు గలవాడు (అనిమిషుడు - వేల్పు)

**తెరగంటి తపసి** - దేవలోకపు ముని (నారదుడు - దేవర్షి)

**తెరగంటి త్రోవ** - దేవతలు సంచరించెడు మార్గము (ఆకాశము)

**తెరగంటి పెద్ద** - వేల్పులలో పెద్ద (సురజ్యేష్ఠుడు - బ్రహ్మ)

**తెరగంటి బోటి** - దేవతా స్త్రీ (వేల్పుటింతి - అచ్చర)

**తెరగంటి బోనము** - దేవతల యాహారము (అమృతము)

**తెరగంటిమల** - వేల్పుల విహార పర్వతము (బంగరుకొండ)

**తెరగంటి మ్రాను** - వేల్పుల వృక్షము (కల్పవృక్షము)

**తెరగంటి యెకిమీడు, తెరగంటి రేడు** - దేవతలకు ప్రభువు (దేవేంద్రుడు - వేగంటి)

**తెరనోటి మెకము, తెరవాయి మెకము** - విశాలమైన నోరుగల మృగము (తెరనోరి మెకము - సింహము)

**తెలిగట్టు** - తెల్లని పర్వతము (కైలాసము)

**తెలిగట్టు మనికి పట్టు** - వెండి కొండ నివాసముగా గలవాడు (శివుడు)

**తెలిగాము** - తెల్లనైన గ్రహము (శుక్రుడు)

**తెలిగిబ్బ** - తెల్లని యెద్దు (నందీశుడు)

**తెలిగౌరు** - తెల్లని యేనుగు (ఐరావతము)

**తెలితేజి** - తెల్లని గుఱ్ఱము (ఉచ్చైశ్శ్రవము)

**తెలిదమ్మికంటి** - తెల్లదామరలవంటి కన్నులు కలవాడు (విష్ణువు)

**తెలిదీవి దొర, తెలిదీవి మన్నీడు** - శ్వేత ద్వీపమునకు ప్రభువు (విష్ణువు)

**తెలిపక్కము** - తెల్లని రాత్రుల కాలము (శుక్లపక్షము)

**తెలిపిట్ట, తెలి పులుగు** - తెల్లని పక్షి (హంస)

**తెలిమల** - తెల్లనైన పర్వతము (వెండి కొండ రజతాద్రి)

**తెలిమావు** - తెల్లని ఉచ్చైశ్శ్రవమను గుఱ్ఱము (తెలితేజి)

**తెలిమొదవు** - తెల్ల మొదవు (కామధేనువు)

**తెలి మోము పక్కి** - తెల్లని ముఖము గల పక్షి (గరుడ పక్షి)

**తెల్ల జక్కి** - తెలిమావు (నిక్కువీనుల మావు ఉచ్చైశ్శ్రవము)

**తేనెతిండి** - తేనె యాహారముగా గలది (మధుపము - తుమ్మెద)

**తేనెరాయుడు** - మధువనము గల దొర (వసంతుడు)

**తైజసుడు** - సూక్ష్మ శరీరముతో తాదాత్మ్యము ననుభవించు వ్యష్టి యభిమాని యగు ప్రాజ్ఞుడు.

**తైత్తిరము** - తిత్తిరి పక్షుల గుంపు

**తైత్తిరీయము** - యాజ్ఞవల్క్యావమనమగు యజుర్వేద విద్యను వైశంపాయనుని శిష్యులచే తిత్తిరి పక్షుల రూపమున గ్రహింపబడినది

**తైల చౌరిక** - తైలమును నీటివలె త్రాగునది (బొద్దిక)

**తైలపాయిక** - తైలమును త్రాగునది (గబ్బిలము - తైలప)

**తైలాంబుక** - తైల చౌరిక

**తొండపు దేవర** - తొండము గల స్వామి (గణపతి)

**తొండ రూపురిక్క** - తొండ యొక్క రూపము గల నక్షత్రము (పుష్యమి)

**తొగకంటి** - కలువల వంటి కన్నులు గల స్త్రీ (కలువకంటి)

**తొగ చెలిరాయి** - చంద్రునకు ప్రియమైన రాయి (చలువరాయి - చంద్రకాంత శిల)

**తొగ చుట్టము** - కలువల చుట్టము (చంద్రుడు)

**తొగదాయ** - కలువలకు పగవాడు (సూర్యుడు)

**తొగ నంటుకాడు** - కలువల చెలికాడు (చంద్రుడు)

**తొగనెచ్చెలి** - కలువలకు నేస్తము (తొగచెలి - చంద్రుడు)

**తొగరాజు** - కలువల దొర (చంద్రుడు - తొగదొర)

**తొగరు మోము పులుగు** - ఎఱ్ఱని ముక్కు గలది (చిలుక)

**తొగవిందు** - తొగ చుట్టము (కుముద బంధువు - చంద్రుడు)

**తొగసూడు** - తొగదాయం (కువలయారి - సూర్యుడు)

**తొగసూడురా** - సూర్యకాంతపురాయి

**తొగల నంగడికాడు** - కలువల చెలికాడు (తొగనంటుకాడు - చంద్రుడు)

**తొడ పుట్టువు** - విష్ణువు యొక్క తొడ నుండి పుట్టినవాడు (ఊరుజుడు - కోమటి)

**తొడుకు తత్తడిజోదు** - ఎద్దు వాహనముగా గలదిట్ట (శివుడు)

**తొడుకుసామి** - ఎద్దు వాహనముగా గల ప్రభువు (శివుడు)

**తొడుకు సాహిణిమామ** - వృషభ వాహనుడగు శివుని మామ (హిమవంతుడు)

**తొఱ్ఱపిట్ట** - ప్రాను తొలుచు పిట్ట (వడ్రంగి పిట్ట - దార్వాఘాటము)

**తొలకరి** - చైత్ర వైశాఖములందు గురియు వాన (తొలుకారు)

**తొలకరికల్లుపులుగు** - వర్షర్తువు పట్ల విరోధించునది (హంస)

**తొలకరి దొర** - వర్షాధిపతి (ఇంద్రుడు - బిడౌజుడు)

**తొలకరి సూడు** - వర్షర్తువు నందు శత్రుభావము వహించునది (హంస)

**తొలికడరాయడు** - తూర్పు దిక్కున కధిపతి (ఇంద్రుడు - పూర్వదిక్పతి)

**తొలిగట్టు** - సూర్యుడుదయించు కొండ (ఉదయాద్రి - పొడుపుగొండ)

**తొలి చదువులు** - మొదటి చదువులు (పూర్వ విద్యలు - వేదములు)

**తొలి జేజే** - తొలుత దేవ పదమందుండిన వాడు (రాక్షసుడు)

**తొలిదీవి** - మొదటి ద్వీపము (జంబూ ద్వీపము)

**తొలిదెసరేడు** - తూర్పు దిక్కున కధిపతి (పూర్వ దిక్పతి - ఇంద్రుడు)

**తొలిదేవర** - మొదటి వేల్పు (బ్రహ్మ)

**తొలి నీటిరిక్క** - పూర్వాషాఢ నక్షత్రము

**తొలి పన్నగము** - ఆదిశేషుడు

**తొలి పలుకు గొనలు** - వేదములందలి తుది పల్కులు, వేదముల యొక్క తుది భాగము (ఉపనిషత్తులు-వేదాంతములు)

**తొలిమల** - తొలిగట్టు (పూర్వాద్రి)

**తొలుకబ్బము** - ఆదికావ్యము (రామాయణము)

**తొలుకారు** - తొలకరి (వానకారు)

**తొలుకుడుపు** - శిశువులకు తొలిసారిగా బెట్టు అన్నము (అన్నప్రాశనము)

**తొలు గొరు** - తూర్పు దిక్కునందలి ఏనుగు

**తొలు జంగమయ్య** - మొట్టమొదటి జంగమదేవర (శివుడు)

**తొలు పక్కము** - మొదటి పక్షము (శుక్ల పక్షము - శుద్ధ పక్షము)

**తొలురిక్క** - మొదటి నక్షత్రము (గుఱ్ఱపుజుక్క - అశ్వినీ నక్షత్రము)

**తొలురిక్కనెల** - ఆశ్వయుజ మాసము

**తొలు వేల్పు** - మొదటి దేవుడు (రాక్షసుడు), దేవులలో మొదటివాడు (బ్రహ్మ)

**తొలువేల్పు పగతురు** - పూర్వదేవులగు రాక్షసులకు శత్రువులు (దేవతలు)

**తొలు వేల్పుటయ్యగారు** - రాక్షసులకు గురువైనవాడు (శుక్రాచార్యుడు)

**తొవరాయుడు** - కలువలకు రాజు (చంద్రుడు, నెలరాజు)

**తొవవిందు, తొవసామి** - కలువలకు చుట్టము (చంద్రుడు, నెలరాజు)

**తొవసూడు** - కలువలకు విరోధి (సూర్యుడు)

**తోయజభవము, తోయజాతము** - చూ అంబుజము

**తోయజాక్షి** - తామరల వంటి కన్నులు గలది (ఆడుది)

**తోయదము** - ఉదకమునిచ్చునది (మబ్బు)

**తోయధి**-ఉదకములు దీనిచే ధరింపబడును (సముద్రము)

**తోయనిధి** - నీటికి గని వంటిది(సముద్రము)

**తోయయంత్రము** - నీటిని తోడు యంత్రము (జలయంత్రము)

**తోయరుహము** - చూ అంబురుహము

**తోయరాట్టు** - నీటికి ప్రభువు (సముద్రుడు, వరుణుడు)

**తోయరాశి** - నీటికుప్ప (జలధి)

**తోలుదాలుపు** - చర్మమును దాల్చువాడు (శివుడు - చర్మాంబరధారి)

**తోయసూచకము**-జలముండుటను సూచించునది (కప్ప)

**తౌర్యము** - మృదంగాదివాద్యధ్వని

**త్యాజ్యము** - దోషయుక్తమగుటచే వర్జింపదగిన కాలము

**త్రయి** - ఋక్సామ యజుర్వేదముల సమూహము

**త్రయీతనువు, త్రయీ మయుడు** - ఋక్-సామ-యజుర్వేద రూపమైన శరీరము కలవాడు (సూర్యుడు)

**త్రాడుదాలుపు** - పాశము దాల్చిన వాడు (వరుణుడు)

**త్రికటుకములు** - శొంఠి, పిప్పలి, మిరియాలు అను మూడు కారపు దినుసులు

**త్రికము** - తొడలు రెండును వీపుఎముకయు నీ మూటియొక్క కూటమి (వెన్నెముక దిగువ నున్నచోటు - ముడ్డిపూస) ఆ, ఈ, ఏ,లు త్రిక మనబడును (వ్యాకరణము)

**త్రికూటము** - ఇనుము, వెండి, బంగారముల శిఖరములు గల కొండ

**త్రిగంధములు** - ఏలకులు, జాపత్రి, దాల్చిన చెక్క అను మూడు గంధపు దినుసులు

**త్రిదండి** - మనో-వాక్-కర్మము లను మూడు దండములు కలవాడు, ముక్కోలను దాల్చినవాడు (సన్న్యాసి)

**త్రిదశ గోపము** - ఇంద్రుడు రక్షకుడుగా గలది (ఆరుద్రపురుగు)

**త్రిదశాధ్యక్షుడు** - వేల్పుల నేత (బ్రహ్మ, ఇంద్రుడు)

**త్రిదశాలయము** - దేవతల నివాస స్థలము (స్వర్గము)

**త్రిదశులు** - ఉత్పత్తి, స్థితి, నాశనములనెడు మూ

దవస్థలు గల వారు; ముప్పది యేండ్ల వయస్సు గలవారు (దేవతలు)

**త్రిదివము** - బ్రహ్మ-విష్ణు-మహేశ్వరు లను దేవతలు నివసించునది; మూడవ లోకము (స్వర్గము)

**త్రిదివుడు** - మూడవదగు స్వర్గలోకవాసి (వేలుపు)

**త్రిదివోద్భవ** - స్వర్గమున బుట్టినది (గంగ - మిన్నేరు)

**త్రిదివౌకసుడు** - స్వర్గమునకు ప్రభువు (వేల్పు, ఇంద్రుడు)

**త్రిదోషములు** - అతి వ్యాప్తి, అవ్యాప్తి, అసంభవమను దోషములు

**త్రిధాముడు** - భూర్భువస్సువము లను మూడు స్థానములు కలవాడు (అగ్ని, విష్ణువు, శివుడు, యముడు)

**త్రినయనుడు** - మూడు నేత్రములు కలవాడు (శివుడు - ముక్కంటి)

**త్రినేత్ర చూడామణి** - శివుని శిరమున మణివలె వెలుగువాడు (చంద్రుడు)

**త్రినేత్రుడు** - చూ త్రినయనుడు - ఫాలాక్షుడు

**త్రిపదుడు, త్రిపాత్తు** - మూడడుగులచే ముల్లోకముల నాక్రమించినవాడు = వామనుడు (విష్ణువు) త్రివిక్రముడు

**త్రిపత్ర** - మూడు దళములు కలిసి యుండునది (మారేడు, మోదుగు)

**త్రిపథగ, త్రిపథ గామిని** - స్వర్గ-మర్త్య-పాతాళములందు ప్రవహించు నది (గంగ)

**త్రిపదము** - మూడు కాళ్లు గల ఆననము (ముక్కాలిపీట - త్రిపదిక)

**త్రిపుండ్రము** - నొసట దాల్చు విభూతి లోనగువాని మూడు రేఖలు

**త్రిపురాంతకుడు, త్రిపురారి** - మయనిర్మిత త్రిపురములను దగ్ధము జేసిన వాడు (శివుడు)

**త్రిప్రాసము** - నాల్గు పాదములందును రెండవ మూడవ నాల్గవ యక్షరములు సమానముగ నుండుట

**త్రిమూర్తి** - బ్రహ్మ-విష్ణు-మహేశ్వరుల యొక్క శరీరాంశలు గలవాడు (దత్తాత్రేయుడు)

**త్రియామ** - మూడు జాములు కలది (రాత్రి)

**త్రిరాత్ర** - మూడు రాత్రులు బహిష్కరింప దగినది (ముట్టుది-బహిష్ఠ)

**త్రిలింగము** - శ్రీశైల-ద్రాక్షారామ-కాళేశ్వరములను శివలింగ స్థానముల మధ్య దేశము

**త్రిలోకేశుడు** - ముల్లోకములకు ప్రభువు (శివుడు)

**త్రిలోచనుడు** - చూ మూడుకన్నులు గలవాడు (శివుడు)

**త్రివిక్రముడు** - చూ త్రిపదుడు.

**త్రివిష్టపము** - మూడవలోకము (స్వర్గము)

**త్రివేణీ సంగమము** - గంగా-యమునా-సరస్వతీ నదులు మూడు కలియుచోటు

**త్రిశంకువు** - జనకునకు బాధ కల్గించుట - గురుధేనువును వధించుట - అప్రోక్షిత మాంస భక్షణ మను మూడు హృదయ శంకువులు గల్గుటచేత త్రిశంకుడని యందురు

**త్రిశిరుడు** - మూడు తలలు కలవాడు (కుబేరుడు, ఒక రక్కసుడు)

**త్రిశూల ధారి, త్రిశూలి** - మూడు మొనల బల్లెమును దాల్చువాడు (శివుడు)

**త్రిషవణ స్నాయి** - దినమునకు మూడు మార్లు స్నానము చేయువాడు

**త్రిసూత్రము** - మూడు నూత్రములు కలది

(జందెము, వైడూర్యమణి విశేషము)

**త్రిసీత్యము** - మూడు చాళ్ళు దున్నిన నేల (త్రిగుణాకృతము)

**త్రిస్రోతస్సు** - ముల్లోకములందు ప్రవహించునది (గంగ)

**త్రైమాతురుడు** - కౌసల్య-కైకేయి-సుమిత్ర అను ముగ్గురు తల్లులు గలవాడు (లక్ష్మణుడు)

**త్రివిష్టపేయుడు** - స్వర్గమున నివసించువాడు (వేల్పు)

**త్ర్యంబకసఖుడు** - ఈశ్వరుని చెలికాడు (కుబేరుడు)

**త్ర్యంబకుడు, త్ర్యక్షుడు** - మూడు కన్నులు కలవాడు (ముల్లోకములకు తండ్రి), ఈశ్వరుడు

**త్ర్యక్షము** - మూడు కన్నులు కలది (టెంకాయ)

**త్వక్‌క్షీర** - వెదురు వలన బుట్టిన పాలు కలది (తవాక్షీరి)

**త్వష్ట** - కొయ్యలను జెక్కువాడు (వడ్రంగి)

**త్వాష్ట్రము** - త్వష్టకు (వడ్రంగికి) సంబంధించినది (మొద్దు)

**త్విషాంపతి** - కాంతులకు ప్రభువు (సూర్యుడు - త్విట్పతి)

**త్విషామీశుడు** - కాంతులకు ప్రభువు (సూర్యుడు - త్విట్పతి)

**త్సరుకుడు** - ఖడ్గయుద్ధ నిపుణుడు

**దంటమోముల దేవర, దంటమోముల వేల్పు** - రెండు ముఖములు గల ప్రభువు (అగ్ని)

**దండకారణ్యము** - ఇక్ష్వాకు వంశస్థుడగు దండునిచే పాలింపబడి కుపితుడగు దేవేంద్రుని మృద్వర్షమునకు గురియై అడవిగా మారినది

**దండధరుడు, దండపాణి** - కాలదండమును ధరించువాడు (యముడు)

**దండపాంశులుడు** - వాకిలి కావలి వాడు (దండపాంసులుడు, ద్వారపాలుడు)

**దండవాలధి** - దండము వంటి తోక కలది (ఏనుగు)

**దండహస్తుడు** - దండము హస్తమున కలవాడు (యముడు, సన్న్యాసి, ద్వారపాలకుడు, బ్రహ్మచారి)

**దండాదండి** - పరస్పరము కఱ్ఱలతో కొట్టుకొనెడి పోరు (ద్వంద్వ యుద్ధము)

**దంతకర్షణము** - దంతములను పులుపెక్కించి పాడుచేయునది (నిమ్మ)

**దంతచ్ఛదము, దంతవస్త్రము** - దంతములను వస్త్రమువలె గప్పియుండునది (పెదవి)

**దంత పుష్పము** - దంతముల వలె తెల్లని పూలు కలది (మొల్ల)

**దంత బీజము** - పండ్లవంటి గింజలు కలది (దానిమ్మ)

**దంతశఠము** - పండ్లను పుల్లుపెక్కించి చెరుచునది (నిమ్మ, వెలగ, చింత, నారింజ)

**దంత హర్షకము** - దంతములను పులియించునది (నిమ్మ)

**దంతాయుధము** - కోరలే ఆయుధములుగా గలది (పంది)

**దంతావళము** - మేలగు దంతములు కలది (పెద్ద యేనుగు)

**దంతి** - చూ దంతావళము (హస్తి)

**దంత్యము** - దంతమున బుట్టిన వర్ణము - త, థ, ద, ధ, మొ॥

**దందశూకము** - కుత్సితమైన దంశనము (కరచుట) కలది (సర్పము)

**దందశూకుడు** - నీచముగా గరచువాడు (రాక్షసుడు)

**దంపతులు** - జాయాపతులు (భార్యాభర్తలు)

**దంభము** - గొప్పకై యజ్ఞయాగాది క్రతువులు. ధర్మకార్యములు చేయుట

**దంభోళి** - విరోధుల వంచించునది వజ్రాయుధము

**దంశకము** - కరచునట్టి ఒక జాతి యీగ

**దంశభీరుడు** - జోరీగల కాటునకు వెరచునది (దున్న)

**దంష్ట్రాస్త్రము, దంష్ట్రాయుధము, దంష్ట్రి** - కోరలు ఆయుధముగా గలది (పాము, అడవి పంది)

**దక్కినంపు రాయడు** - దక్షిణ దిశ కధిపతి (యముడు)

**దక్షప్రజాపతి** - దక్ష కన్యలగు అశ్విన్యాదుల భర్త (చంద్రుడు), సతీదేవి భర్త (శివుడు), ఆదిత్యాదుల భర్త (కశ్యపుడు)

**దక్షాధ్వర ధ్వంసి, దక్షాధ్వర హారుడు** - దక్ష యజ్ఞమును ధ్వంసము చేసినవాడు, శివుడు - వీరభద్రుడు

**దక్షాయ్యము** - హింస చేయునది (గ్రద్ధ)

**దక్షిణ** - యాగాదులందు ఋత్విక్కుల కిచ్చెడు ధనాదికము

**దక్షిణ దిక్పతి** - దక్షిణ దిక్కునకు ప్రభువు (యముడు)

**దక్షిణస్థుడు** - కుడివైపున నుండువాడు (రథము నడపు సారధి)

**దక్షిణాయనము** - సూర్యుడు ఉత్తరము నుండి దక్షిణమునకు నడచుకాలము పుష్యమాస మందలి మకర సంక్రాంతి మొదలు ఆషాఢ మాసమందలి కర్కటక సంక్రాంతి వరకుగల కాలము

**దక్షిణా వర్తము** - కుడివైపుగా దిరిగిన వంక గలది (శంఖము)

**దక్షిణుడు** - అనేక నాయికలందు సమముగా ప్రవర్తించునాయకుడు

**దచ్చికాళ్ళ మెకము** - ఎనిమిది కాళ్లుకల మృగము (అష్టపాత్తు)

**దడి బియ్యము** - తొలి రజస్వల కాలమున పడుచుకై జరుపు ఒకవేడుక

**దత్త పుత్ర శోకము** - దత్తు తీసికొనిన పుత్రుని మరణమునకై శోకించుట

**దత్తాత్రేయుడు** - అత్రికి అనసూయకు విష్ణుని యంశచే కల్గినవాడు

**దత్తుడు** - సంతతిలేని దంపతులచే (శాస్త్రసమ్మతిని) తమ తనయునిగా బెంపబడు పుత్త్రుడు

**దధిజము** - మధించిన పెరుగు నుండి పుట్టినది (వెన్న)

**దధిపూపము** - పెరుగు కలిపిన బియ్యపు పిండి వంటకము (అప్పము)

**దనుజ ద్విషుడు, దనుజారి, దనుజవైరి** - రక్కసులకు శత్రువు (వేల్పు), విష్ణువు - దనుజ విరోధి

**దనుజుడు** - కశ్యపునకు దనువు అను భార్యవలన కల్గినవాడు (రాక్షసుడు)

**దమము** - బహిరింద్రియ నిగ్రహము (శాంతము), బ్రహ్మచర్యాది క్లేశము నోర్చుట

**దమయంతి** - తనయందముచే నితరులను దమించు (అణచు)నది (నలుని భార్య)

**దయాళువు** - దయచే రక్షించు స్వభావము గలవాడు

**దర్దరీకము, దర్దురము** - శబ్దముచే చెవులను వ్రక్కలించునది (కప్ప, మబ్బు)

**దర్పకుడు** - గర్వింపజేయువాడు, దుర్గతిని బొందువాడు (మన్మధుడు)

**దర్పణము** - దీనిచేత మంచి వేషాభిమానము గలిగి గర్వింతురు (అద్దము)

**దర్భముద్రిక** - దర్భముడిగల యుంగరము

**దర్వీకరము** - తెడ్లను బోలు పడగ కలది (సర్పము)

**దర్వీశుండము** - తెడ్డువంటి ముక్కు గలది (తెల్లకొక్కెర)

**దర్శనము** - అమావాస్యనాడు చేయదగినది (ఒక యిష్టి)

**దశకంఠుడు, దశగ్రీవుడు** - పది కంఠములు కలవాడు (రావణుడు)

**దశనము** - వనితల యధరము కొరుకునది (పల్లు)

**దశబలుడు** - బుద్ధి-క్షాంతి-వీర్య-ధ్యాన - జ్ఞాన - కృప - శీల - బల - దాన - ఉపేక్ష లను పది బలములు కలవాడు (బుద్ధుడు)

**దశబాహువు** - పదిచేతులు కలది (దుర్గ)

**దశముఖుడు** - చూ దశ కంఠుడు

**దశరథుడు** - పది దిక్కులయందు రథగమనము గలవాడు (రాముని తండ్రి)

**దశరూప భృత్తు** - పది యవతారములు దాల్చినవాడు (విష్ణువు)

**దశాశ్వుడు** - తన రథమునకు పది గుఱ్ఱములు కలవాడు (చంద్రుడు)

**దశాహము** - మరణి౦చిన పదవరోజున చేయబడు శ్రాద్ధ కర్మ

**దసరా** - ఆశ్వయుజ శు॥పాడ్యమి మొదలు దశమి వరకును గల దశ రాత్రములు

**దహన కేతనము** - అగ్ని దేవుని జెండా (పొగ ధూమము)

**దహనప్రియ** - అగ్ని దేవుని భార్య (స్వాహాదేవి)

**దహనరిపువు, దహనారాతి** - అగ్ని దేవుని శత్రువు (జలము - ఉదకము)

**దహనుడు** - సమస్తమును దహించువాడు (అగ్ని అనలము)

**దాండక్రీడ** - దండ ప్రహరణమున సాగు క్రీడ (హాకీ)

**దాంతుడు** - బ్రహ్మచర్యాది తపఃక్లేశము నోర్చువాడు (బాహ్యేంద్రియ నిగ్రహశీలి

**దాక్షాయణి** - దక్షుని కొమార్తె (సతీదేవి - గౌరి) భూమి, అశ్విన్యాది నక్షత్రములు

**దాట్లమారి** - రాత్రి చీకటితప్పుకై పెరటి గోడలు దాటువాడు, దాటునది (జారుడు, జారిణి)

**దాడిమప్రియము** - దానిమ్మ పండుపై ప్రేమ కలది (చిలుక)

**దాధికము** - దధియందు మిశ్రితమైన భక్ష్యము

**దానవారి** - రాక్షసుల వైరి (వేలుపు, హరి)

**దానవులు, దానవేయులు** - కశ్యపునకు దనువు నందు పుట్టిన సంతతి (రాక్షసులు - దైతేయులు)

**దానశౌండుడు**-దానమునం దాసక్తి కలవాడు (దాత)

**దామోదరుడు** - తులసిమాలిక యుదరమున గలవాడు (విష్ణువు)

**దాయాదుడు** - దాయ భాగము ననుభవించువాడు (జ్ఞాతి)

**దార** - భర్తను సోదరుల నుండి విడదీయునది (భార్య)

**దారుజము** - కఱ్ఱ నుండి పుట్టినది (మద్దెల)

**దారువు** - చీల్ప బడునది (కట్టె)

**దార్ష్టాంతికము** - దృష్టాంతములతో గూడినది (ఉదాహరణము)

**దాశరథి**- దశరథుని పుత్త్రుడు (శ్రీరాముడు)

**దాసుడు** - దాస్యము చేయువాడు (సేవకుడు), బ్రాహ్మణునకు వివాహిత శూద్ర స్త్రీకి బుట్టి సంస్కరింపబడినవాడు.

**దిగంబరుడు** - దిక్కులు వస్త్రములుగా గలవాడు (శివుడు)

**దిధిషువు, దినకరుడు** - డు, దినమణి, దినరత్నము దినమును కలిగించువాడు (సూర్యుడు)

**దినప్రణి** - చూ దినకరుడు

**దివము** - దేవతలు క్రీడించు లోకము (స్వర్గము, నాకము)

**దివస్పతి** - స్వర్గమునకు ప్రభువు (ఇంద్రుడు)

**దివాంధము** -పగటి కాలమున గ్రుడ్డిది (గుడ్లగూబ)

**దివాకీర్తి** - రాత్రి క్షుర కర్మము నిషిద్ధ మగుటచే వగలు పిలువబడు వాడు (మంగలి), పుణ్యకాలమున పగలు పిలువ దగనివాడు (చండాలుడు)

**దివాచరము, దివాటనము** - పగలు సంచరించునది (కోయిల, కాకి)

**దివాభీతము, దివాభీతి** - పగలు భయపడునది (గ్రుడ్లగూబ, దివాంధము)

**దివాభీతుడు** - పగలు భయపడువాడు (దొంగ, చోరుడు)

**దివాస్వాపము** - పగలు నిద్రించునది (గ్రుడ్లగూబ)

**దివిజాధిపుడు** - దేవతలకు ప్రభువు (ఇంద్రుడు)

**దివిజుడు** - స్వర్గమున జనించినవాడు (వేలుపు)

**దివిషదుడు** - స్వర్గమున నివసించువాడు (వేల్పు, విష్ణువు)

**దివోకసము** - ఆకాశము నివాసముగా గలది (పిట్ట)

**దివోకసుడు** - స్వర్గము నివాసముగా గలవాడు (వేల్పు)

**దివౌకసము** - దివోకసము

**దివౌకసుడు** - దివోకసుడు

**దివ్యరత్నము** - దేవలోక రత్నము (చింతామణి)

**దివ్యస్నానము** - ఎండలో కురిసెడు వానయందు శరీరమును తడుపుకొనుట

**దివ్యాంశువు** - ప్రకాశించు కిరణములు కలవాడు (సూర్యుడు)

**దిష్టాంతము** - జీవితము యొక్క నాశము (చావు - మృతి)

**దిసమొల వేల్పు** - చూ దిగంబరుడు

**దీక్షితాయని** - దీక్షితుని భార్య (సోమిదమ్మ)

**దీక్షితుడు** - సోమయాగమున దీక్షవహించిన వాడు,వివాహోపనయనాది కర్మములందు దీక్ష కలవాడు

**దీధితిమంతుడు** - వెలుగు గలవాడు (సూర్యుడు)

**దీపకాలంకారము** - ప్రస్తుతాప్రస్తుతములకు ధర్మ సామ్యమును జెప్పునది

**దీపధ్వజము** - దీపమునకు జెండా వంటిది (దీపపుమసి)

**దీపపాదపము** - చెట్టు వలె నుండు దీప స్తంభము (జ్యోత్స్నివృక్షము)

**దీపావళి** - దీపముల వరుస (దీప శృంఖల - ఆశ్వయుజ మాసము నందలి అమావాస్య పండుగ)

**దీప్త పింగళము** - బంగారు వలె పచ్చని చారలు కలది (సింహము)

**దీప్తలోచనము** - ప్రకాశించెడి కన్నులు కలది (పిల్లి - మార్జాలము)

**దీర్ఘకంఠము** - నిడుపాటి మెడ కలది (ఒంటె, కొంగ)

**దీర్ఘకేశము** - పొడవైన వెంట్రుకలు కలది (ఎలుగుబంటి)

**దీర్ఘగ్రీవము** - చూ దీర్ఘకంఠ

**దీర్ఘజంఘము** - నిడుపాటి పిక్కలు కలది (బెగ్గురుపక్షి, కొంగ)

**దీర్ఘజిహ్వము** - నిడుపాటి నాలుకలు కలది (పాము, సర్పము, నాగము)

**దీర్ఘతుండ** - పొడవైన మొగము కలది (చుంచు)

**దీర్ఘదర్శి, దీర్ఘదృష్టి** - ప్రత్యక్షముగా కనరాని సంగతులను బుద్ధిచే గ్రహించువాడు (విద్వాంసుడు), నిడుపాటి దూరపు వస్త్వాదుల జూచునది (గ్రద్ద)

**దీర్ఘదేహి** - పొడవైన దేహము కలది (పందికొక్కు)

**దీర్ఘనాదము** - నిడుపాటి ధ్వని యొసగునది (కుక్క, కోడి, శంఖము)

**దీర్ఘనిద్ర** - శాశ్వతమైన నిద్ర (మృతి, మరణము)

**దీర్ఘపత్రము** - పొడవగు ఆకులు కలది (కొబ్బెర, అరటి, తెల్ల గల్జేరు మొ॥)

**దీర్ఘపాత్తు, దీర్ఘపాదము** - పొడవగు పాదములు కలది (కొంగ, ఒంటె, మొ॥)

**దీర్ఘపాదపము** - మిక్కిలి పొడవైన చెట్టు (పోక, తాటి, కొబ్బెర, మొ॥)

**దీర్ఘపుచ్ఛము** - పొడవగు తోక గలది (చమరీ మృగము, కొండముచ్చు)

**దీర్ఘముఖి** - పొడవైన మొగము గలది (చుంచు)

**దీర్ఘసురతము** - ఎక్కువ కాలము రతి గలది (కుక్క)

**దీర్ఘరదము** - పొడవగు కోరలు కలది (అడవి పంది, మొ॥)

**దీర్ఘరసనము** - పొడవైన నాలుకలు కలది (పాము, నాగము)

**దీర్ఘరోమము** - పొడవగు వెంట్రుకలు కలది (ఎలుగుగొడ్డు, చమర మృగము)

**దీర్ఘవక్త్రము** - నిడుద మొగము కలది (ఏనుగు - కరి)

**దీర్ఘవచ్ఛిక** - చాల కాలము నీట తడియుచు నుండునది (మొసలి)

**దీర్ఘవాలము** - పొడవైన తోక కలది (సవరపు మెకము)

**దీర్ఘవాలి** - ఆడుసవరపు మెకము (చమరి)

**దీర్ఘశాఖ** - పొడవగు కొమ్మలు కలది (మద్దిచెట్టు)

**దీర్ఘశ్రవసము** - పొడవు చెవులు కలది (కుందేలు, గాడిద)

**దీర్ఘస్కందము** - పొడవైన మ్రాను కలది (తాడిచెట్టు, పోకచెట్టు, కొబ్బెర చెట్టు)

**దీర్ఘాధ్వగము** - కడుదూరము నడచునది (ఒంటె, ఉష్ట్రము)

**దీర్ఘాయువు** - పెక్కేండ్లు బ్రతుకునది (కాకి, బూరుగుచెట్టు), పెక్కేండ్లు బ్రతుకువాడు (మార్కండేయుడు, మొ॥)

**దీర్ఘాస్యము** - పొడవైన మోము కలది (ఏనుగు - గజము)

**దీవి పుట్టువు** - గంగా ద్వీపమున బుట్టిన వాడు (వ్యాసుడు)

**దీవిరాయడు** - దీవికి ప్రభువు (రావణుడు - లంకాపతి)

**దుంత బాబా వజీరు, దుంతరౌతు** - దున్నపోతు వాహనముగా గలవాడు (యముడు)

**దుంతవయాళికాడు** - దున్నపోతు పైనెక్కి విహరించువాడు (యముడు)

**దుందుభి** - దుందుమ్మని మ్రోగునది (భేరి)

**దుక్కికైదువు** - దుక్కి దున్నెడు సాధనము (నాగలి)

**దుక్కికైదువు దాలువు** - నాగలిని ఆయుధముగా గ్రహించినవాడు (బలరాముడు)

**దుక్కివాలు** - దుక్కి దున్నెడు అయుధము (నాగలి)

**దుక్కి వాల్దాల్పు** - నాగలిని ఆయుధముగా ధరించినవాడు (బలరాముడు)

**దుమోలము** - కట్టుటకు, ధరించుటకు రెండు తీరులుగ తగినది (పట్టు వస్త్రము)

**దుగమొగ ములవుల్గు** - రెండు తలల పక్షి (గండభేరుండము)

**దుగ మొగముల వేల్పు, దుగమోములయ్య** - రెండు ముఖములు గల దేవర (అగ్ని - దుగమోరపాదుసా)

**దుర్గకన్నయ్య** - దుర్గకు తండ్రి (హిమవంతుడు)

**దుద్దుపెట్టు** - అప్పటికి తగు విధముగ సర్దిచెప్పు

**దునేదారి** - కత్తి చేత దాల్చు వాడు (వీరుడు, శూరుడు)

**దుబాసి** - రెండవ భాషలోనికి మార్పగలవాడు (అనువాదకుడు)

**దురితము** - దుర్గతిని పొందజేయునది (పాపము)

**దురోదరము** - దీనికై గిరికందరముల యుదర సీమల నాశ్రయింతురు (జూదము)

**దుర్గ** - దుఃఖము చేత నెరుగదగినది, వనాది దుర్గము నివాసముగా గలది (పార్వతి)

**దుర్గపాలుడు** - దుర్గమును కాపాడువాడు (కోటకాపరి), ఆపదలందు కాపాడువాడు

**దుర్గమము** - కంటకాదులచే దుస్సాధమైన గమనము కలది (అడవి)

**దుర్గము** - ప్రయాసముచే బొందదగినది (కోట)

**దుర్గహ** - పట్ట సాధ్యముకాని ముండ్లు కలది (ఉత్తరేను చెట్టు)

**దుర్దినము** - సూర్యరశ్మిని మేఘములు గప్పిన రోజు

**దుర్యోధనుడు** - సుఖముగా పోరాడ వీలుపడని వాడు (కౌరవాగ్రజుడు)

**దుర్వర్ణము** - బంగారము కంటె హీనమైన వర్ణము గలది (వెండి - రజతము)

**దుర్విపాకము** - చెడు ఫలము కలది (దురదృష్టము)

**దుర్మదుడు** - చెడ్డ మనసు కలవాడు (శత్రువు)

**దువ్వగావించు జాణ** - దుమ్ముని కలిగించు నేర్పరి (వాయుదేవుడు)

**దుష్కరప్రాసము** - సులభముగా లభింపని అక్షరము ప్రాసస్థానమున జెప్పుట

**దుష్కృత్తు** - చెడ్డపని చేయువాడు (దుష్టుడు)

**దుహిత** - ధనాదులను పిండి తలిదండ్రులను విత్తహీనుల నొనర్చునది (కొమార్తె)

**దూత్యము** - దూత యొనర్చు చర్య (రాయబారము)

**దూరదర్శి** - కడుదూర మాలోచించువాడు (ఋషి, పండితుడు)

**దూరదృక్కు** - కడుదూరము చూడగలది (గ్రద్ద, ఎలుగుబంటి)

**దృక్కర్ణము** - కనులే చెవులుగా గలది (పాము)

**దృక్శ్రుతి** - కన్నులు చెవులుగా గలది (పాము - కనువినికి)

**దృగాయుధుడు** - నొసటి కంటి చూపే ఆయుధముగా గలవాడు (శివుడు - ఫాలాక్షుడు)

**దృఢ దంశకము** - గట్టిగా కరచునది (మొసలి)

**దృఢ నీరము** - కాలక్రమమున గట్టి పడెడు నీరు కలది (కొబ్బెరకాయ)

**దృఢపత్రము** - గట్టి యాకులు కలది (వెదురుచెట్టు)

**దృఢ ఫల** - గట్టికాయలు కలది (కొబ్బెరచెట్టు - నారికేళము)

**దృఢరోమ** - గట్టి వెంట్రుకలు కలది (అడవి పంది - సూకరము)

**దృఢ వల్కల(ము)** - గట్టి పట్ట కలది (పోకచెట్టు, చిరుబొద్ది చెట్టు)

**దృష్టి బంధువు** - చూపునకు చుట్టము వంటిది (మిణుగురుపురుగు)

**దేవకుల్య** - వేల్పులకు కాలువ వంటిది (గంగానది - భాగీరథి)

**దేవకుసుమము** - వేల్పుల కింపగు పూవు గలది (లవంగపు చెట్టు)

**దేవఖాతము** - దేవతలచే త్రవ్వబడినది (కోనేరు)

**దేవగణిక** - దేవలోకపు వేశ్య (అప్సరస)

**దేవ చికిత్సకులు** - దేవలోకపు వైద్యులు (అశ్వినీ దేవతలు - వేల్పువెజ్జులు)

**దేవచ్ఛందము** - దేవతలను సైతమానందపరుచునది (100 లేక 108 పేటల ముత్యాలహారము)

**దేవతరువు** - దేవలోకపు వృక్షము (కల్పవృక్షము)

**దేవధాని** - దేవతలు వసించు పట్టణము (అమరావతి)

**దేవదత్తము** - అగ్నిచే నర్జునునకు ఖాండవ వన దహన కాలమునం దీయబడిన శంఖము

**దేవదేవుడు** - దేవతలకు దేవుడైనవాడు (విష్ణువు)

**దేవధూపము** - దేవతల కీయబడు ధూపము (గుగ్గిలము)

**దేవపర్ణము** - దెవతల పూజింపదగిన ఆకులు= మాచిపత్రి

**దేవమణి** - దేవతలరత్నము=కౌస్తుభము

దేవతలలో శ్రేష్ఠుడు = శివుడు,గుఱ్ఱము మెడసుడి

**దేవమాతృకము** - వర్షాధారమున పండెడు భూమి

**దేవముని** - దేవలోకపుముని=నారదుడు-దేవర్షి

**దేవయజ్ఞము** - గృహస్థులాచరింవవలసిన హోమరూపయజ్ఞము

**దేవయానము** - దేవతలు ప్రయాణము చేయు సాధనము(విమానము), అర్చిరాది మార్గము

**దేవయాని** - శుక్రాచార్యుని కూతురు

**దేవయాగము** - 43,20,000 సంవత్సరముల కాలముగల కృతయుగము

**దేవరాతుడు** - దేవునిచే రక్షింపబడినవాడు (పరీక్షితుడు)

**దేవరుడు** - మగని తోబుట్టువు = బావ లేక మరది

**దేవలుడు** - దేవరను పూజించువాడు = అర్చకుడు, పూజారి

**దేవాజీవి** - బత్తెమునకైదేవరను పూజించు వాడు = పూజరి

**దేవానాంప్రియము**- యజ్ఞాదులందు దేవతలకు ప్రియమైనది - మేక

**దేవానాంప్రియుడు** - బ్రహ్మజ్ఞానము లేనివాడగుటచే యాగములచేత దేవతలకు ప్రియమొనర్పదలచువాడు (మూర్ఖుడు)

**దేవవక్త్రము** - దేవతలకు ముఖమైనవాడు = అగ్ని

**దేవవాహనుడు** - దేవతలకు హవిస్సును గొనిపోవువాడు - అగ్ని

**దేవాయతనము** - దేవుడుండు చోటు = దేవాలయము

**దేవాయుధము-** దేవతలకు ఆయుధమైనది = శాపము

**దేహదము** - దేహమును శుద్ధి చేయునది = పాదరసము

**దేహళి** - ప్రవేశముచే దేహమును గ్రహించునది = కడప

**దేహళీ(దత్త)దీపము** - ఇంటి గడప పై నుంచబడినదీపము ఇరు ప్రక్కలకు నుపయోగించుననుట (ఒకే పదము పూర్వా పరములతో నన్వయించు విధము)

**ధైత్యగురుడు** - రక్కసులకు గురువు = శుక్రాచార్యుడు

**దైత్యారి** - రాక్షసులకు వైరి=విష్ణువు, దేవత

**దైత్యుడు** - కశ్యపునకు దితి యందు జనించిన సంతతి=రాక్షసుడు

**దైవజ్ఞ** - శుభాశుభముల నెరుగునది = సోదికత్తె

**దైవజ్ఞుడు** - శుభాశుభముల దెల్పువాడు = జ్యోతిష్కుడు

**దొరసాని** - ప్రభువు యొక్క భార్య (రాణి)

**దోరణపు సాటిరిక్క** - ద్వారా కారముగా నుండు నక్షత్రము (అనూరాధ)

**దోషగ్రాహము** - దోషమును గ్రహించునది (ఇందుగుచెట్టు)

**దోషజ్ఞుడు** - దోషము గ్రహించినవాడు (పండితుడు, వైద్యుడు)

**దోషాకరుడు** - రాత్రిని కలిగించువాడు, గురుపత్ని పట్ల దోష మొనర్చినవాడు (చంద్రుడు)

**దోషాచరుడు** - రాత్రి తిరుగువాడు (చంద్రుడు, దొంగ, రాక్షసుడు)

**దోషాతిలకము** - రాత్రికి బొట్టు వంటిది (దీపము)

**దోహజము** - పితుకుట వలన కలుగునది (పాలు - క్షీరము)

**దోహదవతి** - వేవిళ్ల కల యాడుది

**దౌత్యము** - దూత యొక్క కార్యము (రాయబారము)

**దౌష్యంతి** - దుష్యంతుని కుమారుడు (భరతుడు)

**దౌహిత్రాయణుడు** - దౌహిత్రుని కుమారుడు (మునిమనుమడు)

**దౌహిత్రి** - కొమార్తె యొక్క కూతురు (మనుమరాలు)

**ద్యుగము, ద్యుచరము** - ఆకసమున సంచరించునది (గ్రహము, పక్షి, విమానము)

**ద్యుతి కరుడు** - కాంతి నిచ్చువాడు (ధ్రువుడు)

**ద్యుధుని, ద్యుసరిత్తు** - ఆకాశమందలి నది (గంగ, మందాకిని)

**ద్యుపతి** - ఆకాశపతి (సూర్యుడు), స్వర్గమునకు అధిపతి (ఇంద్రుడు)

**ద్యుమణి** - ఆకాశమున మణి వంటివాడు (సూర్యుడు)

**ద్యుమ్నము** - స్వర్గమున సైతము కోరబడునది (ధనము, బలము)

**ద్యునత్తు(డు), ద్యునదుడు** - ఆకసమున (దివియందు) నుండువాడు (వేల్పు, సూర్యాది గ్రహము)

**ద్యోతటిని** - ఆకాశమందలి నది (మందాకిని)

**ద్యోషదుడు** - స్వర్గమున వెలయువాడు (వేల్పు)

**ద్రవిణము** - ద్రవించు లక్షణము కలది (ధనము)

**ద్రవ్యము** - పొందదగినది (ధనము, విత్తము)

**ద్రాక్షారామము** - దక్షుని యారామ భూమి (ఒక శివక్షేత్రము)

**ద్రావకము** - యంత్ర సహాయమున రస-గంధ-పాషాణాదుల వలన తయారగు ద్రవ విశేషము

**ద్రావిడ ప్రాణాయామము** - ద్రావిడులు చేతులతో తలను జుట్టి ముక్కు పట్టుకొని చేయు ప్రాణాయామము వలె అధిక శ్రమల కోర్చుటలో వాడుక

**ద్రుఘణము** - చెట్లను నరకు సాధనము (గండ్ర గొడ్డలి)

**ధ్రువదము** - కొయ్యతో జేసినది (పాదుక, బొందకొయ్య)

**ద్రుమ సఖము** - చెట్టునకు గోరువంటిది (ముల్లు)

**ద్రుమశయము** - చెట్టుపై నిద్రించునది (కోతి)

**ద్రుమామయము** - చెట్టునకు వ్యాధి వంటిది (లక్క)

**ద్రుమారి** - చెట్లకు శత్రువు (ఏనుగు)

**ద్రుమాశ్రయము** - చెట్టు నాశ్రయించునది (కోతి, కొండంగి)

**ద్రుహిణుడు** - దైత్యులకు ద్రోహమొనర్చు వాడు (బ్రహ్మ)

**ద్రుహి** - తండ్రి యొక్క ద్రవ్యమునకై ద్రోహము సల్పునది (కూతురు)

**ద్రోణదుఘ** - తూమెడు పాలు పితికెడి యావు

**ద్రోణముఖము** - సుమారు 100 గ్రామాల నడుమ గల పెద్ద గ్రామము

**ద్రౌపది** - ద్రుపదరాజ కొమార్తె (పాండవ పత్ని)

**ద్వాదశాక్షుడు** - 12 కన్నులు గలవాడు (కుమారస్వామి)

**ద్వాదశాత్ముడు** - 12రూపములు గలవాడు (సూర్యుడు)

**ద్వాదశాదిత్యులు** - పన్నిద్దరు ఆదిత్యులు (సూర్యుని చైత్రమాసమున ధాతయను నామమున, వైశాఖమున అర్యముడు జ్యేష్ఠమున మిత్రుడు ఆషాఢమున వరుణుడు, శ్రావణమున ఇంద్రుడు, భాద్రపదమున వివస్వంతుడు, ఆశ్వయుజమున త్వష్ట, కార్తికమున విష్ణువు, మార్గశిరమున తర్యముడు. పుష్యమున భగుడు. మాఘమున పూషుడు, ఫాల్గునమున క్రతువు నామమున బరగును

**ద్వాదశాధ్యాయి** - 12 అధ్యాయములు కలది (జైమిని కృత పూర్వమీమాంస)

**ద్వాదశాయువు** - పండ్రెండేండ్ల వయః పరిమాణము కలది (కుక్క)

**ద్వాపరము** - 8 64,000ల యేండ్ల పరిమితి గల మూడవ యుగము

**ద్వారపాలకుడు** - ద్వారముగాచువాడు (కావలి - పణిహారి)

**ద్వార బలిభుక్కు** - ద్వారము నొద్ద బలిగా నుంచిన వరి వెన్నుల దినునది (పిచ్చుక, కాకి)

**ద్వికమత్తు** - రెండు మూపురములు గలది (ఒంటె - క్రమేలకము)

**ద్వికము** - రెండు 'క' కారములు గలది (కాకి, కోకము = జక్కవ)

**ద్విగువు** - రెండు గోవులు కలవాడు, తత్పురుష సమాస భేదము

**ద్విజము** - రెండు పుట్టుకలు కలది (పక్షి, పాము, కోడి, ద్విజన్మము)

**ద్విజన్ముడు** - రెండు జన్మములు కలవాడు (బ్రాహ్మణుడు, క్షత్రియుడు, వైశ్యుడు ద్విజన్ముడు)

**ద్విజప్రియ** - ద్విజుల కిష్టమైనది (సొమలత)

**ద్విజరాజము** - చంద్రుని వలె చల్లనై, తెల్లనైనది (కప్పురము)

**ద్విజరాజు** - పక్షులకు రాజు (గరుడుడు), బ్రాహ్మణులకు ప్రభువు (చంద్రుడు, శేషుడు)

**ద్విజాయని** - ద్విజులకు చిహ్నమైనది (జందెము, యజ్ఞోపవీతము)

**ద్విజుడు** - చూ ద్విజన్ముడు

**ద్విజిహ్వము** - రెండు నాలుకలు కలది (సర్పము)

**ద్విజిహ్వుడు** - రెండు నాలుకలు (మాటలు) కలవాడు (కొండెకాడు)

**ద్విదేహుడు** - రెండు దేహములు కలవాడు (గజాననుడు, నృసింహస్వామి)

**ద్విదైవతము** - ఇద్దరు దేవతలు కలది (విశాఖా నక్షత్రము)

**ద్విధాగతి** - నీటను-నేలను చరించునది (మొసలి, ఎండ్రి)

**ద్విపక్షము** - రెండు రెక్కలు కలది (పిట్ట), రెండు పక్షములు కలది (మాసము)

**ద్విపటి** - రెండు పటములు చేరినది (దుప్పటి)

**ద్విపద** - రెండు పాదములు కల బుక్కు, రెండు పాదములు కల పద్యభేదము (పల్నాటి చరిత్ర ద్విపదకావ్యము)

**ద్విపదరాశి** - మిధునము, తుల, కుంభము, కన్య, ధనుస్సులోని మొదటి సగము

**ద్విపదుడు** - రెండు పాదములు కలవాడు (మనుజుడు)

**ద్విపము** - తొండము-నోరు అను రెంటిచే పానము చేయునది (ఏనుగు)

**ద్విపాత్తు** - రెండు పాదములు గల ప్రాణి (మనుష్యుడు, పక్షి)

**ద్విపాద్యము** - ఉచితమైన దాని కంటె రెట్టింపుగా పడిన శిక్ష (ద్విగుణ దండము - రెట్టింపు శిక్ష)

**ద్విపాయి** - చూ ద్విపము

**ద్విపాస్యుడు** - ఏన్గు మొగము కలవాడు (గణపతి)

**ద్విప్రాసము** - నాల్గు పాదములందును ప్రాసస్థానమున జంటగా రెండక్షరములను ప్రయోగించుట

**ద్విభాషి** - రెండు భాషలు తెలిసినవాడు, అన్యభాషకు తర్జుమా చేయువాడు (దుబాసి)

**ద్విమాతృకుడు** - ఇద్దరు తల్లులు గలవాడు (వినాయకుడు = గంగాపార్వతులు), బృహద్రథుని భార్యలిరువురికి రెండు శరీరములుగా కలిగి జరయను రక్కసిచే కలుపబడినవాడు (జరాసంధుడు)

**ద్విమాత్రము** - రెండు మాత్రల కాలములో నుచ్చరింపదగినది (దీర్ఘాచ్చు)

**ద్విముఖ** - రెండు వైపుల మొగము గలది (జలగ - రక్తపాయి)

**ద్విముఖి** - ఒకప్రక్క దూడయొక్క ముఖమును మరియొక ప్రక్క తన ముఖమును గలది (ఉభయతో ముఖి - ఈనుచున్న యావు), రెండు తలలు గల పాము

**ద్విరదము** - రెండు దంతములు గలది (ఏనుగు)

**ద్విరదాంతకము** - ఏనుగుదాయ (సింహము)

**ద్విరసనము** - రెండుగా చీలిన నాలుకలు కలది (పాము)

**ద్విరుక్తి** - ఒకే పదమును రెండు మారులు చెప్పుట (పునరుక్తి)

**ద్విరేఫము** - భ్రమరమను తన పేరు నందు రెండు రేఫములు కలది రేఫాకృతి గల రెండు రెక్కలు గలది (తుమ్మెద)

**ద్విరేఫారి** - తుమ్మెదకు శత్రువైనది (సంపెగ - గంధఫలి)

**ద్విశఫము** - రెండుగా చీలిన డెక్కలు గలది (ఆవు, మేక)

**ద్విశీర్షుడు** - రెండు తలలు గలవాడు (అగ్ని)

**ద్విషంతపుడు** - శత్రువులను తపింపజేయు వాడు (పరంతపుడు)

**ద్విసహస్రాక్షుడు** - రెండు వేలకన్నులు గలవాడు(ఆదిశేషుడు-వేయిపడగలవాడు)

**ద్విసీత్యము** - రెండు చాళ్ళు దున్నిననేల (ద్విగుణాకృతము)

**ద్విహృదయ** - గర్భాశయము నందలి శిశు హృదయముతో రెండు హృదయము లగునది (గర్భిణి - ఆపన్నసత్వ)

**ద్విహల్యము** - రెండు చాళ్ళు దున్నినది (ద్విసీత్యము)

**ద్వీపము** - రెండు వైపుల నీరు కలది (దీవి)

**ద్వైగుణికుడు** - నూటికి నూరు వంతున వడ్డీపుచ్చుకొనువాడు

**ద్వైతము** - జీవాత్మ పరమాత్మలకు భేదము జెప్పెడు మతము (మధ్వాచార్యుని మతము), పాండవులు విడిది చేసిన వనము

**ద్వైపాయనుడు** - ద్వీపము నివాసముగా గలవాడు (వ్యాసుడు)

**ద్వైమాతురుడు** - ఇద్దరు తల్లులు గలవాడు (గణపతి, జరాసంధుడు - ద్వైమాతృకుడు)

**ద్వైసమికము** - రెండు సంవత్సరముల వయస్సు కలది (ద్విహాయనము - ద్వైవర్షిక)

**ద్వ్యర్థి** - రెండర్థములు గలది (హరిశ్చంద్ర నలోపాఖ్యానము మొదలగు కావ్యములు)

**ద్వ్యాముష్యాయణుడు** - రెండు వంశముల వారికి కొడుకుగా వర్తించువాడు (తండ్రి, పెంపుడు తండ్రి)

**ధనంజయుడు** - రాజసూయమున రాజులను జయించి ధనము నార్జించినవాడు (అర్జునుడు)

**ధనదుడు** - ధనమునిచ్చువాడు (కుబేరుడు, దాత)

**ధనపతి, ధనాధిపుడు** - ధనాగారమున కధిపతి (కుబేరుడు - పైడిరేడు)

**ధనుర్ధరుడు, ధనుష్మంతుడు** - ధనుస్సు కలవాడు (విలుకాడు - ధన్వి)

**ధనుర్మాసము** - సూర్యుడు ధనూరాశి యందుండు మాసము

**ధనుష్కరుడు** - చేత విల్లు కలవాడు, వింటిని చేయువాడు

**ధనుష్పాణి** - విల్లు చేతబట్టిన వాడు

**ధమనుడు** - కొలిమి తిత్తి నూదువాడు

**ధమ్మిల్లము** - శిరమున జుట్టబడిన కొప్పు

**ధర(ణి)** - సమస్తమును ధరించునది (భూమి)

**ధరణిజ** - భూపుత్రి (సీత)

**ధరణిజాని** - భూమి భార్యగా గలవాడు (రాజు)

**ధరణిజుడు** - భూమి యొక్క కుమారుడు (కుజుడు, నరకుడు)

**ధరణిధరము** - భూమిని దాల్చునది (పర్వతము)

**ధరణిధరుడు** - భూమిని దాల్చువాడు (విష్ణువు, ఆదిశేషుడు, రాజు)

**ధరణీశ్వరుడు** - భూమికి ప్రభువు (రాజు, విష్ణువు, శివుడు)

**ధరణి పూరము** - భూమి నలముకొన్న వెల్లువ వంటిది (సముద్రము)

**ధరణీ ప్లవము** - భూమి తెప్పగానైనది (సంద్రము)

**ధరణి భృత్తు** - భూమిని దాల్చునది (కొండ), దాల్చువాడు = రాజు, విష్ణువు, ఆదిశేషుడు

**ధరణీ రుహము** - నేల నుండి మొలచునది (చెట్టు - భూరుహము)

**ధరణీ సుత** - భూమి పుత్రిక (సీత - పుడమి చూలు)

**ధరణీ సుతుడు** - భూమి పుత్త్రుడు (అంగారకుడు, నరకాసురుడు)

**ధరాధరము** - చూ ధరణీధరము

**ధరాభుక్కు** - భూమి ననుభవించువాడు (రాజు)

**ధరాభృత్తు** - భూమిని దాల్చునది (కొండ)

**ధరామరుడు** - భూమియందు వేల్పు (బ్రాహ్మణుడు)

**ధరిత్రి** - విశ్వమును దాల్చునది (భూమి)

**ధర్మకేతువు** - ధర్మము జెండాగా గలవాడు (బుద్ధుడు)

**ధర్మచారిణి** - ధార్మిక కార్యములందు భర్తతో నడచునది (భార్య)

**ధర్మజుడు** - యమ ధర్మరాజునకు జనించిన వాడు (పాండవాగ్రజుడు)

**ధర్మధ్వజుడు** - బయటికి మాత్రమే ధర్మము ప్రకటించువాడు (కపట ధార్మికుడు)

**ధర్మనందనుడు** - చూ ధర్మజుడు (యుధిష్ఠిరుడు)

**ధర్మపత్ని, ధర్మభాగిని** - అగ్నిసాక్షిగా వివాహమైన స్త్రీ (భార్య, పత్ని)

**ధర్మము** - లోకములు దీనిచే ధరింపబడును వేద, స్మృతి సదాచారములతో గూడి ఆత్మకు ప్రియమైనది (సత్సంకల్పేచ్ఛ)

**ధర్మరాజు** - ధర్మమునకు రాజు (యమధర్మరాజు, పాండుపుత్రుడు, బుద్ధుడు)

**ధర్మవైతంసికుడు** - లోకమును మోసము చేయుటకై ధర్మమాచరించువాడు (కపటాత్ముడు)

**ధర్మ సంహిత** - మన్వాది ధర్మశాస్త్రము (స్మృతి)

**ధర్మాసనము**-న్యాయాధికారి కూర్చుండుటకు తగిన ప్రత్యేక పీఠము (అధ్యక్ష పీఠము)

**ధర్షణి** - దిట్ట తనము కలది (రంకుటాలు - ధర్షిణి)

**ధవళ పక్షము** - తెల్లని రెక్కలు గలది (హంస), తెలి పక్కము (శుక్లపక్షము)

**ధవళాంగి** - తెల్లని శరీర చ్ఛాయ కలది (సరస్వతి)

**ధవిత్రము** - ఇఱ్ఱితోలుతో చేసిన విసనకఱ్ఱ

**ధవుడు** - స్త్రీని కంపింప జేయువాడు (భర్త - పతి)

**ధాత** - సమస్తమును ధరించినవాడు (బ్రహ్మ)

**ధాతుఘ్నము** - ధాతువులను నాశన మొనర్చునది (పులికడుగు)

**ధాతుహ, ధాతువైరి** - ధాతువులను నాశనము చేయునది (గంధకము)

**ధాత్రి** - సర్వమును ధరించునది (భూమి, తల్లి)

**ధానుష్కుడు** - ధనుస్సు కలవాడు (విలుకాడు - ధన్వి)

**ధాన్యవీరము** - ధాన్యము లన్నిటిలో బలమైనవి (మినుములు - మాషము)

**ధామకేశి, ధామనిధి** - కాంతులే కేశములుగా గలవాడు, కాంతికి నిధియైనవాడు (సూర్యుడు - భానుడు - భాస్కరుడు)

**ధారాటము** - అతివేగమైన పరుగు గలది (గుఱ్ఱము - హయము)

**ధారాదత్తము** - మంత్రోదక పూర్వకముగా దాన మీయబడినది

**ధారాధరము** - నీటిధారను దాల్చునది (మేఘము), ధారను (కత్తివాదర) ధరించునది (ఖడ్గము)

**ధారావాహి** - ఎడతెగక ప్రవహించునది

**ధారుణీధ్రము** - భూమిని దాల్చునది (కొండ - నగము)

**ధార్తరాష్ట్రము** - నల్లని ముక్కు-కాళ్ళు గల తెల్లని పక్షి (హంస)

**ధార్తరాష్ట్రుడు** - ధృతరాష్ట్రుని కొడుకు (సుయోధనాదులు)

**ధార్మికుడు** - ధర్మాచరణ శీలము కలవాడు

**ధావకుడు** - బట్టలను శుద్ధి చేయువాడు (చాకలి రజకుడు)

**ధిషణాధిపుడు** - బుద్ధిచే మిన్నయగువాడు (బృహస్పతి)

ధిష్ణ్యుడు - రక్కసులను సంతోషపెట్టువాడు (శుక్రాచార్యుడు)

**ధిషణుడు, ధీమంతుడు** - లెస్సయగు బుద్ధి గలవాడు (బృహస్పతి, పండితుడు)

**ధీయమానము** - ధరింప బడుచున్నది

**ధీర** - వ్యంగ్యముగా కోపమును వెల్లడించు స్త్రీ (ఒకనాయిక)

**ధీరలలితుడు** - నిశ్చింత-కళాభిమానము - భోగవాంఛ కలవాడు (ఒక నాయకుడు)

**ధీరశాంతుడు** - ధీరుడును శాంతుడునగు నాయకుడు

**ధీరాధీర** - వ్యంగ్యా వ్యంగ్యముగా కోప ప్రకటన గావించు శృంగార నాయిక

**ధీరోదాత్తుడు, ధీరోద్ధతుడు** - బలము - సుఖదుఃఖ సమత్వము-దయ-నిగర్వ లక్షణుడు

**ధురీణము** - ఒక నాయకుడు బరువు మోయునది (గుఱ్ఱము, ఎద్దు, మొ॥)

**ధుని** - వాయువుచే కదలునది (ఏరు)

ధురంధరము, ధుర్యము - భారము వహించునది (ఎద్దు, మొ॥)

**ధూమకేతు(వు), ధూమధ్వజుడు** - పొగ చిహ్నముగా గలవాడు (అగ్ని, వహ్ని)

**ధూమగ్రహము** - పొగవలె నల్లని కాంతి కలది (రాహువు)

**ధూమయోని** - పొగ యోని (కారణము)గా గలవాడు (మేఘుడు)

**ధూమిక** - పొగవంటి పదార్థము కలది (మంచు)

**ధూమోత్థము** - ధూమ జన్యమగు మబ్బు నుండి పుట్టినది (నవాసారము)

**ధూమ్రకము** - పొగ వన్నె కలది (లొట్టియ - ధూమ్రశూకము)

**ధూమ్రలోచనము** - పొగవన్నె కన్నులు గలది (గువ్వ)

**ధూమ్ర వర్ణకము** - పొగ ఛాయ గలది (నక్క)

**ధూమ్రశూకము** - ధూమ్రకము

**ధూర్జటి** - బరువైన జటలు కలవాడు (శివుడు - హరుడు)

**ధూరకము** - మోసముతో జంపునది (నక్క జంబుకము)

**ధూర్వహము** - బరువులు మోయునది (ఎద్దు, మొ॥)

**ధూళి జంఘము** - బూడిదరంగు పిక్కలు కలది (కాకి - వాయసము)

**ధూళి ధ్వజుడు** - పరాగము చిహ్నముగా గలవాడు (వాయువు - పవనము)

**ధూసరము** - బూడిద రంగు కలది (పావురము, పిచ్చుక, గాడిద, ఒంటె)

**ధేనుకారి** - ధేనుకాసురుని జంపినవాడు (బలరాముడు)

**ధేనువు** - దూడకు పాలుకుడుపు నది (ఆవు)

**ధైవతము** - నాభ్యాదుల నుండి జనించునది (ఒక స్వరము)

**ధౌత శిలము** - తెలుపు చేసినట్లున్న రాయి కలది (స్ఫటికము)

**ధౌరేయము** - బరువు మోసెడు జంతువు (ఎద్దు, ఒంటె, గాడిద, మొ॥)

**ధ్మాకారుడు** - గొట్టము నూదుచు ధ్మా-ధ్మాయను ధ్వని కల్గించువాడు (కమ్మరి)

**ధ్వజ ద్రుమము** - ధ్వజాకృతి గల చెట్టు (తాడిచెట్టు)

**ధ్వనమోది** - ఝుమ్మను ధ్వనిచే మోద మొసగునది (తుమ్మెద - భంభరము)

**ధ్వని గ్రహణి** - శబ్దమును గ్రహించునది (చెవి)

**ధ్వాంక్షము** - మాంసమును కోరునది (కాకి, కొక్కెర)

**ధ్వాంక్ష పుష్టము** - కాకిచే పోషింపబడునది (కోకిల)

**ధ్వాంక్షారాతి** - కాకికి శత్రువు (గ్రుడ్లగూబ - కాకారి, ధ్వాంక్షారి)

**ధ్వాంతమణి** - చీకటి యందు మణి వంటిది (మిణుగురు)

**ధ్వాంతము** - దారి కానరాక ఇందు మొరపెట్టుదురు (చీకటి)

**ధ్వాంతారాతి, ధ్వాంతారి** - చీకటికి విరోధి (సూర్యుడు, అగ్ని, చంద్రుడు)

**ధ్వాంతమణి** - రాత్రు లందు మణి వలె మెరయునది (మిణుగురు పురుగు)

**ధ్వాంతోన్మేషము** - చీకటిలో మెరయునది (మిణుగురు)

**నంగనాచి** - సమయము వచ్చినపుడు సాహసపు పనులు చేయుచు బయటికి ఏమియు తెలియని దానివలె నటించు స్త్రీ (నేర్పుకత్తె)

**నంజుడు దిండి, నంజుడు మేపరి** - మాంసమును దినువాడు (రాక్షసుడు - దైత్యుడు)

**నందకము** - దేవతలను సంతోషపెట్టునది (విష్ణుని ఖడ్గము)

**నంద నందని** - నందుని ఆనందింప జేసినది (యోగమాయ)

**నందనందనుడు** - నందుని ఆనందపరువ పెంపుడు బిడ్డయైనవాడు (కృష్ణుడు)

**నందనము** - ఆనందము కల్గించునది (ఇంద్రుని యుద్యానవనము)

**నందని** - తలిదండ్రులను ఆనందపరచునది (కొమార్తె)

**నందనుడు** - తల్లిదండ్రుల కానందమిచ్చువాడు (కుమారుడు - సుతుడు - తనయుడు)

**నందిని** - స్నాన, పానాదులచే నానంద మిచ్చునది (గంగ)

**నందివాహనుడు, నందీశుడు** - నంది (ఎద్దు) వాహనముగా గలవాడు (ఈశుడు - శివుడు)

**నంద్యావర్తము** - తూర్పు దక్షిణోత్తరము లందు వాకిళ్ళు గల రాజ గృహము, నందివర్ధనపు చెట్టు (నందావర్తము)

**నకూబారుడు** - మగని తోబుట్టినవాడు

**నకులేష్ట** - ముంగికి ప్రీతియైనది (సర్పాక్షి, రాస్నచెట్టు)

**నక్తంచరము** - రాత్రులందు తిరుగునది (గ్రుడ్లగూబ)

**నక్తం చరుడు, నక్తం చారి** - రాత్రివేళ సంచరించువాడు (రక్కసుడు, దొంగ)

**నక్రము** - భూమిపై పాద విక్షేపము చేయనిది (మొసలి)

**నక్షత్రనాథుడు** - నక్షత్రములకు పతి - చుక్కలరేడు (చంద్రుడు)

**నక్షత్రనేమి** - చుక్కల చక్రమునకు పట్టా వంటివాడు (చంద్రుడు)

**నక్షత్ర పారకుడు** - జ్యోతిష శాస్త్రము చక్కగా చెప్పగలవాడు (దైవజ్ఞుడు)

**నక్షత్రమాల** - 27 ముత్యములు గ్రుచ్చిన హారము, 27 పద్యములు గల చిన్న కావ్యము, నక్షత్రముల వరుస

**నక్షత్రము** - నాశము పొందనిది (చుక్క)

**నక్షత్ర సూచకుడు** - జ్యోతిష్యము చక్కగా తెలియనివాడు (నక్షత్రసూచి)

**నఖ దారణము** - గోళ్లు తీయు సాధనము (గోరుగల్లు)

**నఖరము** - స్పర్శజ్ఞానము లేనిది (గోరు)

**నఖరంజని** - గోళ్లను శోభింపజేయునది (గోరంటచెట్టు)

**నఖరాయుధము** - గోరు ఆయుధముగా గలది (కోడి, పిల్లి, సింహము)

**నఖ కుట్టకుడు** - గోళ్ళు ఛేదించువాడు (మంగలి)

**నఖ శిఖపర్యంతము** - కాలిగోరు మొదలుకొని తల వెండ్రుకల వరకు (నిలువెల్ల)

**నఖాశి** - గోళ్లు తినునది (గ్రుడ్లగూబ)

**నగజాత, నగజ** - హిమవత్పర్వత రాజు కూతురు (పార్వతి)

**నగధరుడు** - గోవర్ధన పర్వతమును చిటికెన వ్రేలితో నెత్తినవాడు (శ్రీకృష్ణుడు)

**నగభిత్తు, నగభేది** - కొండలను భేదించునది (వజ్రాయుధము)

**నగభిదుడు** - కొండలను భేదించువాడు (ఇంద్రుడు)

**నగభువు** - కొండలందు బుట్టునది (జేగురురాయి)

**నగభూషణము** - కొండకు నగవంటిది (అరిదళము)

**నగము** - గమనము లేనిది (కొండ - పర్వతము)

**నగరంధ్రకరుడు** - తన బాణఘాతముచే క్రౌంచ పర్వతమునకు రంధ్రము గావించినవాడు (కుమారస్వామి - క్రౌంచదారణుడు)

**నగరకాకము** - కాకివలె నగరమంతయు చుట్టి వచ్చుచుండువాడు

**నగరము** - కొండలవలె నుండు పెద్ద పెద్ద భవనములు కలది (పట్టణము)

**నగవైరి** - పర్వతములకు శత్రువు (ఇంద్రుడు)

**నగాటము** - చెట్లపై దిరుగునది (కోతి, నెమలి), పర్వతములపై దిరుగునది (ఏనుగు)

**నగాధిపుడు** - పర్వతములకు ప్రభువు (హిమవంతుడు)

**నగౌకసము** - పర్వతము నివాస స్థానముగా గలది (పక్షి, సింహము)

**నగ్నిక** - దిసమొలగా నుండునది (సమర్తాడని పడుచు)

**నగ్నుడు**-దిసమొల గలవాడు(సిగ్గులేనివాడు)

**నచకము** - రాత్రి మూడవ జామున వచ్చుకళ

**నచికేతుడు** - విశ్వజిద్యాగము చేసిన తండ్రిచే యముని కీయబడి మూడు వరాలు పొంది శిష్యుడై వచ్చిన వాజశ్రవుని కొడుకు (చూ ఋగ్వేద పదవ మండలము లేక కఠోపనిషత్తు)

**నటేశుడు, నటరాజు** - నటనకు రాజు (శివుడు - నటేశ్వరుడు)

**నట్టువ పులుగు** - నాట్యము చేయు పక్షి (నెమలి - మయూరము)

**నడబావి** - నడవ వీలగునట్లు మెట్లు కట్టిన బావి (దిగుడు బావి)

**నదము** - పశ్చిమముగా బారెడు నది, విశేషముగా ధ్వనించునది (సముద్రము)

**నదిజుడు, నదీసుతుడు** - గంగా కుమారుడు (భీష్ముడు - గాంగేయుడు)

**నదీశుడు** - నదులకు ప్రభువు (సముద్రుడు, వరుణుడు)

**నదీమాతృకము** - నదీ జలముచే పండెడు భూములు గల దేశము

**ననంద** - ఎంతగా సేవించినను సంతసము లేనిది (వదినె)

**ననవింటిజోదు, ననవింటిదంట** - పూలే విల్లుగా గల వీరుడు (మన్మథుడు - మారుడు)

**ననవింటిదొర, నన వింటి మానసీయుడు** - పూల విల్లుగల సామి (మన్మథుడు - మదనుడు, నన విలుకాడు)

**నన విలుతుడు** - పుష్ప ధనుస్సు దాల్చువాడు (మన్మథుడు - ప్రద్యుమ్నుడు)

**ననుపుకాడు** - విటులకు విటకత్తెలను కూర్చువాడు (తార్పుడుకాడు)

**నపుంసకుడు** - పుంస్త్వము (మగతనము) లేనివాడు (పేడి - కొజ్జా)

**నప్త** - పితృ దేవతల కధో లోకముగాకుండ చేయువాడు (మనుమడు, మునిమనుమడు)

**నభఃకేతనుడు** - ఆకాశమునకు జెండాయైనవాడు (సూర్యుడు - ఆదిత్యుడు)

**నభఃపాంథుడు** - ఆకసమున చరించు బాటసారి (సూర్యుడు - కర్మసాక్షి)

**నభఃప్రాణము** - ఆకాశమునకు ఊర్పువంటి వాడు (గాలి - వాయువు)

**నభశ్చక్షువు** - ఆకసమునకు కన్నువంటి వాడు (సూర్యుడు)

**నభశ్చరము** - ఆకాశమున దిరుగునది (మేఘము, పక్షి, విమానము)

**నభస్వతుడు** - ఆకాశమున నుండువాడు (వాయువు)

**నభోంబుపము** - నభము నుండి పడు వర్ష బిందువులనే త్రాగునది (వానకోయిల)

**నభోగజము** - ఆకసమునం దేనుగు రూపు గలది (మేఘము - మబ్బు)

**నభోగము** - ఆకనమున దిరుగునది (పిట్ట, గ్రహము)

**నభోదుహము** - ఆకాశము నుండి జలమును విడుచునది (మబ్బు)

**నభోమణి** - ఆకాశమునకు మణి వంటివాడు (సూర్యుడు - ద్యుమణి)

**నభోరజస్సు** - మింటియందు దుమ్మువలె వ్యాపించునది (మంచు, చీకటి)

**నమకము** - ఉభయతో నమస్కార పూర్వకమగు రుద్రాభిషేక మంత్రము

**నముచి సూదనుడు** - నముచియను రక్కసుని జయించువాడు (ఇంద్రుడు)

**నరకజిత్తు** - నరకుడను రాక్షసుని జయించినవాడు (కృష్ణుడు)

**నరకాంతకుడు** - చూ నరకజిత్తు

**నరద్విషుడు** - నరులను ద్వేషించువాడు (రాక్షసుడు)

**నరభుజుడు** - నరులను భక్షించువాడు (రాక్షసుడు)

**నరమేధము** - నరుని యాగ పశువుగా జేసి చంపునట్టి యాగ విశేషము

**నరయానము** - నరులచే మోయబడు వాహనము (పల్లకి)

**నరవాహనుడు** - మనుజుడే వాహనముగా గలవాడు (కుబేరుడు)

**నరాంతకుడు** - మనుజులను చంపువాడు (రాక్షసుడు)

**నరాధిపుడు** - నరుల నేలువాడు (రాజు)

**నరేంద్రుడు, నరేశ్వరుడు** - నరులకు ప్రభువు (రాజు - భూపతి)

**నర్తకి** - నృత్య మొనర్చునది (నాట్యకత్తె)

**నర్తకము, నర్తప్రియము** - నాట్యమం దిష్టము కలది (నెమలి, ఏనుగు)

**నర్తన ప్రియుడు** - నాట్యము నందు ప్రీతి గలవాడు (శివుడు)

**నర్మసఖుడు, నర్మసచివుడు** - పరిహాసము లాడుచు చెప్పదగిన సంగతి, నర్మముగా దెల్పువాడు (విదూషకుడు)

**నలినేశయుడు** - ప్రలయమున నీటిపై శయనించువాడు (విష్ణువు)

**నలుమోముప్రోడ, నలుమోము పాదుసా** - నాల్గు మొగముల ప్రభువు (బ్రహ్మ)

**నలువ** - నాల్గు మోములు గలవాడు (బ్రహ్మ - చతుర్ముఖుడు)

**నలువజక్కి, నలువతేజి** - బ్రహ్మ యొక్క వాహనము (హంస)

**నలువ చూలి, నలువ పట్టి** - బ్రహ్మ మానస పుత్త్రుడు (నారదుడు)

**నలువరాణి** - బ్రహ్మ దేవుని భార్య (సరస్వతి - భారతి)

**నల్లదేవర** - నల్లని వర్ణము గల దేవుడు (కృష్ణుడు - నల్లనయ్య)

**నల్లద్రావుడు** - రక్తమును త్రాగువాడు (రాక్షసుడు)

**నల్లనయ్య** - నల్లని సామి (శ్రీకృష్ణుడు - నల్లదేవర)

**నల్లనైదువ** - నల్లని పుణ్యస్త్రీ (పార్వతి)

**నల్లమేక తప్పు** - మేషాండము లోకించుటకు కారణమైన నిలువెల్ల కన్నుల వాని తప్పు వంటి తప్పు (వ్యభిచారము)

**నల్ల వలువ తాల్పు** - నల్లని బట్ట ధరించినవాడు (బలరాముడు)

**నవనీతము** - నవీనమ్మైన పెరుగు నుండి తీయబడినది (వెన్న)

**నవోఢ** - నూతనముగా పెండ్లియాడిన యువతి (పెండ్లికూతురు)

**ననగూటి** - కామోద్రేకము కలది (జారిణి)

**నాగటివాలు జోదు** - నాగలిచే పోరెడు వీరుడు (బలరాముడు)

**నాపకుత్తుక దంట** - విషము కంఠమందు గల దిట్ట (శివుడు)

**నాకబలి** - పెండ్లిలో అయిదవ నాటి సంస్కార విశేషము (నాగపూజ)

**నాకము** - దుఃఖము లేని లోకము (స్వర్గము)

**నాకసదుడు** - స్వర్గ వాసము గలవాడు (వేల్పు)

**నాకిని** - నాగిని

**నాకుజాతుడు** - పుట్టయందు పుట్టినవాడు (వాల్మీకి)

**నాకువు** - జంతువులు వంగి ప్రవేశించుతావు (పుట్ట)

**నాకేశుడు** - స్వర్గమునకు ప్రభువు (ఇంద్రుడు)

**నాకౌకసుడు** - నాకము (స్వర్గము) నివాసముగా గలవాడు (వేల్పు)

**నాగ జిహ్వక** - పాము నాలుక వలె నుండునది (మణిశిల)

**నాగచూడుడు** - పాములు శిరో భూషణములుగ గలవాడు (శివుడు)

**నాగనాశము** - నాగాంతకము

**నాగపాశి** - సర్పాకృతి గల త్రాడు ఆయుధముగా గలవాడు (వరుణుడు)

**నాగప్పసాని** - నాపసాని

**నాగబలుడు** - పదివేల యేన్గుల బలము కలవాడు (భీముడు)

**నాగభూషణుడు** - పాములే అలంకారముగా గలవాడు (శివుడు)

**నాగము** - పర్వతమందు పుట్టినది (ఏనుగు), మెత్తనగుటచే కదలునది (సీసము) పాదములచే నడువనిది (పాము)

**నాగలోకము** - నాగులు నివసించు లోకము (పాతాళము)

**నాగవల్లి** - పెండ్లిలో నాల్గవ నాటి తంతు, నాగ లోకమునుండి తేబడిన తీగ (తమలపాకుతీగె - తాంబూలవల్లి)

**నాగవల్లినిష్ఠురము** - అంత్య నిష్ఠురము

**నాగవారకుడు** - నాగులను బట్టువాడు (గరుత్మంతుడు, పాములు పట్టువాడు)

**నాగాంతకము** - పాములను చంపునది (నెమలి), ఏనుగును జంపునది (సింహము)

**నాగాంతకుడు** - పాములను దినువాడు (గరుత్మంతుడు)

**నాగారాతి, నాగారి** - పాములకు వైరి (నెమలి, గరుడుడు), ఏనుగులకు శత్రువు (సింహము)

**నాగాశనుడు** - సర్పములను జంపి తిను వాడు (గరుత్మంతుడు)

**నాగిని** - లోకాంతరమును పొంది దేవతాత్వమును బడసిన ముత్తైదువ (నాకిని)

**నాడింధముడు** - అగ్నిజ్వాల కొరకు కొలిమి నూదువాడు (అగసాలె)

**నాడీ జంఘుడు** - కాడవంటి పిక్కలు గలవాడు (రాజధర్ముడను కొంగ)

**నాడీదేహుడు** - నాడులు మాత్రమే మిగిలిన మేనుగలవాడు (భృంగి)

**నానుడి** - ఇతరులనోట నానెడు నుడి (సామెత, కింవదంతి)

**నాపసాని** - పెండ్లియందు నాగవల్లి నడిపెడు ముత్తైదువ (నాగప్పసాని - నాగపసాని)

**నాపితుడు** - బ్రాహ్మణునకు శూద్రస్త్రీకి బుట్టియు నంస్కరింవ బడనివాడు, అంతటను వ్యాపింపనివాడు (మంగలి - క్షురకుడు)

**నాభిజన్ముడు, నాభిజుడు** - విష్ణుని నాభి కమలమున బుట్టినవాడు (బ్రహ్మ - నాభిభువు)

**నామానుశాసనము** - పదములను వాని యర్థ మును విధించునది (నిఘంటువు)

**నారకము** - నరులు దీనియందు మొరపెట్టుదురు (నరకము)

**నారదుడు** - జ్ఞానమును కలిగించువాడు, పితృదేవతలకు నారము నిచ్చువాడు, నరుల పాపముల ఖండించువాడు (బ్రహ్మ మానస పుత్రుడు)

**నారదము** - నర సమూహమును గూర్చి పోవునది (బాణము)

**నారసింహుడు** - నర - సింహ రూపములతో జన్మించినవాడు (విష్ణువు)

**నారాచము** - నరసమూహమును అచమించునది (బాణము, నీటి యేనుగు)

**నారాయణుడు** - నీరము స్థానముగా గలవాడు, ఒక మన్వంతరమున నరుడను ఋషికి పుత్రుడైనవాడు, నరరూపములను గ్రహించినవాడు (విష్ణువు)

**నారి** - నరుని వశమొనర్చుకొనునది (స్త్రీ)

**నారికేళము** - రంధ్రముల ద్వారమున నుదకమును బీల్చునది (కొబ్బెర)

**నాస్తికుడు** - ఇహలోకము తప్ప పరలోకము లేదనువాడు, భగవంతుడు లే డనెడి వాడు

**నింగిచూలి** - ఆకాశము యొక్క బిడ్డడు (వాయువు)

**నింగిసిగ** - ఆకాశము నిండిన సిగ గలవాడు (శివుడు)

**నిందాస్తుతి** - పైకి నిందవలె కనబడు స్తోత్రము, వ్యాజస్తుతియను అలంకారము

**నింబతరువు** - ఆరోగ్యమును బొందించునది (వేపచెట్టు - పారిజాత వృక్షము)

**నికషాత్మజుడు** - నికషయను రాక్షస స్త్రీకి బుట్టిన వాడు (నిర్‌ఋతి)

**నికృతప్రజ్ఞుడు** - దోషయుక్తమైన బుద్ధిగలవాడు (వంచకుడు)

**నికేతనము** - నివాస యోగ్యమైనది (గృహము)

**నిక్కల** - చూచునది యనుభవము లోనికి దెచ్చునట్టి కల (నిశ్చయ స్వప్నము)

**నిక్కువీనుల జక్కి** - ఉచ్చైశ్శ్రవము (నిక్కిన చెవులు గల గుఱ్ఱము)

**నిగమ గోచరుడు** - వేదములందు గోచరించువాడు (పరమాత్ముడు)

**నిగమము** - నియతముగా పొందబడునది (వేదము)

**నిటలాక్షుడు** - నుదుట కన్ను గలవాడు (శివుడు, ఈశ్వరుడు)

**నిదాఘ కరుడు** - వేడి కిరణములు కలవాడు (సూర్యుడు)

**నిదాఘము** - మిక్కిలి దాహము కల్గించునది (గ్రీష్మర్తువు)

**నిదానము** - తొందరపడక ఆలోచించుట, దీనిచేత కార్యము పుట్టింపబడును (వైశేషికులు సమవాయి కారణముగను బౌద్ధులు ఉపాదాన కారణముగను వైద్యులు కారణ కారణముగను వ్యవహరింతురు) (ఆదికారణము మూలకారణము)

**నిధనము** - ధన బంధమునుండి నివృత్తి కల్గించునది (చావు, మృతి)

**నిధినాథుడు, నిధిపతి, నిధీశుడు** - నవ నిధుల కధిపతి (కుబేరుడు)

**నిపానము** - పశువులు నియతముగా పానము చేయు సాధనము (కుడితి గోలెము)

**నిమ్నగ** - పల్లము వెంబడి పారునది (నది)

**నిరంజన** - అంజనము (కాటుక) లేనిది, దోషము లేనిది (పున్నమి)

**నిరంజనుడు** - దోష రహితుడు (పరమాత్మ)

**నిరక్షరకుక్షి** - పొట్ట చింపినను అక్షరము లేనివాడు (చదువురానివాడు)

**నిరర్థకము** - పాదపూరణమునకై యుపయుక్తమైన పదము (ఉదా - తలపగ వెలయుచు లలి నుజ్జ్వలమగు తలపగన్, లలిన్ అనువదములు కేవలపాదపూరణార్థమైనందున నిరర్థకము (ఒకానొక పదదోషము)

**నిరయము** - ఇందు దుష్కర్మములకు విముక్తి కల్గును (నరకము)

**నిరుక్తి** - యౌగికార్థముగల పదములకు అవయవార్థము వలన మరియొక అర్థమును గల్పించి చెప్పు అర్థాలంకారము ఉదా - ఓ చంద్రుడా మావంటి వారినిట్లు వేధించుచుండుటచే నీకు దోషాకరుడను పేరు సార్థకమే

**నిరాకారుడు** - ఆకారము లేనివాడు (భగవంతుడు - హంసుడు)

**నిరాలంబనము** - ఆధారము లేనిది (ఆకాశము, స్వతంత్రము)

**నిరుపాఖ్యము** - వాక్కులచే వర్ణింప గానిది (పరబ్రహ్మము)

**నిర్గంధపుష్పి** - వాసనలేని పూలు గలది (బూరుగు చెట్టు)

**నిర్గుణుడు** - సుఖ దుఃఖాది గుణములు లేనివాడు (పరమాత్మ)

**నిర్జరులు** - అమృత పానముచే ముసలితనము లేనివారు (వేల్పులు)

**నిర్జిహ్వము** - బయటికి వచ్చు నాలుక కలది (కప్ప)

**నిర్ధూమ ధామము** - పొగరాజని యిల్లు (వంట వార్పులేని కొంప)

**నిర్నిమేషము** - రెప్పపాటు లేనిది (చేప - మత్స్యము)

**నిర్నిమేషుడు** - రెప్పపాటు లేనివాడు (వేల్పు)

**నిర్ణేజకుడు** - శుద్ధి చేయువాడు (చాకలి - రజకుడు)

**నిర్ముక్తుడు** - సంసార సంబంధమును విడిచిన వాడు (సన్న్యాసి)

**నిర్వాణము** - దుఃఖాదులు లేనిది (మోక్షము - ముక్తి)

**నివాతము** - బాణముచే భేదింపరానిది (కవచము, గాలి లేనిది)

**నివాపము** - పితృదేవతలను గూర్చి చేయ బడునది (జలాది దానము)

**నివీతము** - నియతముగా గప్పబడునది, కంఠమున హారము వలె వ్రేలాడు యజ్ఞోపవీతము

**నిశ** - వ్యాపారము శమింపజేయునది (రాత్రి)

**నిశాంతము** - నిశ యొక్క అంత్యభాగము (వేకువ - ప్రభాతము, మిగుల శాంతము గలది = ఇల్లు)

**నిశాకరము** - రాత్రిని కలుగజేయునది

**నిశాకరుడు** - రాత్రిని కలుగజేయువాడు (చంద్రుడు)

**నిశాకేతుడు** - రాత్రికి జెండా వంటివాడు (చంద్రుడు)

**నిశాచరము** - రాత్రులందు తిరుగునది (నక్క, గూబ, పాము)

**నిశాచరి** - రాత్రులందు తిరుగునది (రాక్షసి, ఆడునక్క, రంకుటాలు)

**నిశాచరుడు** - రాత్రులందు తిరుగువాడు (దొంగ, రాక్షసుడు)

**నిశాదర్శి** - రాత్రివేళ చూడగల్గునది (గ్రుడ్లగూబ)

**నిశాధీశుడు, నిశాపతి** - రాత్రులకు అధిపతి (చంద్రుడు)

**నిశాటకము** - రాత్రి వలె నల్లగా నుండునది (గుగ్గిలము)

**నిశాటము, నిశాటనము** - రాత్రులందు సంచరించునది (గ్రుడ్లగూబ)

**నిశాటనుడు, నిశాటుడు** - రాత్రి తిరుగువాడు (దొంగ, రాక్షసుడు)

**నిశాదర్శి** - రాత్రులందు లెస్సగా జూచునది (గుడ్లగూబ)

**నిశాపతి** - చూ నిశాధీశుడు

**నిశానాథము** - చంద్రుని వలె ఆహ్లాదము కల్గించునది (కప్పురము)

**నిశాపుష్పము** - రాత్రులందు వికసించు పూవు (కలువ, మంచు)

**నిశామృగము** - రాత్రులందు సంచరించు జంతువు (నక్క - జంబుకము)

**నిశ్చలాంగము** - చలింపని దేహము కలది (కొంగ)

**నిశాదుడు** - జంతు హింసచే పాపము నొందువాడు (వేటగాడు - కిరాతుడు)

**నిశి వెలుగు** - రాత్రులందు కాంతి గలవాడు (చంద్రుడు)

**నిషంగము** - బాణము లిందు కూర్పబడును (అమ్ములపొది)

**నిషంగి** - నిషంగము కలవాడు (విలుకాడు)

**నిషద్వరము** - వరాహాదులు పొర్లునది (బురద)

**నిషాదము** - సంగీత మందలి సప్త స్వరములలో కడపటిది (నిషధము)

**నిషాదుడు** - జంతుహింసచే వీనియందు బాప ముండును (కిరాతుడు)

**నిషేకము** - శుక్రమును గర్భమున విడుచుట, రజస్వలకు పూర్వము కార్యము జరిగించుట

**నిష్కించనుడు** - కొద్ది సంపదయైనను లేనివాడు (దరిద్రుడు - అకించనుడు)

**నిష్క్రయణము** - ఒక వస్తువునిచ్చి మరియొక వస్తువును తీసికొనుట (వినిమయము)

**నిష్పాద్యము** - నెరవేర్పదగినది

**నిష్ప్రవాణి** - చలువ చేయని వస్త్రము (క్రొత్తది)

**నిస్త్రింశము** - 30 అంగుళముల కంటె ఎక్కువ గల సాధన చేయు పరికరము (ఖడ్గము)

**నిస్సంగుడు** - బంధములు విడిచి ఋషి వలె దిరుగువాడు (ముముక్షువు)

**నీటికుప్ప** - జలరాశి (సముద్రము - అంబుధి)

**నీటి కెంపు** - సముద్ర మధనమున బుట్టిన రత్నము (కౌస్తుభము)

**నీటి తాత** - నీటికి తండ్రియగు అగ్ని పుట్టుకకు హేతువైనది (వాయువు)

**నీటి తాలుపు** - నీటిని దాల్చునది (గాలి)

**నీటిదారి, నీటివోవరి** - నీటిని దాల్చునది (మేఘము - మబ్బు)

**నీటి యిక్క** - నీరు జన్మ స్థానముగా కలది (కౌస్తుభమణి)

**నీటి యెకిమీడు, నీటి రాయడు** - నీటికి ప్రభువు (సముద్రుడు, వరుణుడు)

**నీటిరిక్క** - జలము అధిదేవతగా గలది (పూర్వాషాఢ)

**నీటిరేనిరిక్క** - వరుణుడు అధిదేవతగా గలది (శతభిషము)

**నీడజము, నీడోద్భవము** - గూటియందు బుట్టినది (పక్షి)

**నీరజభవుడు** - పద్మము నుండి జన్మించినవాడు (బ్రహ్మ - విధాత)

**నీరజము, నీరజాతము, నీరరుహము** - నీట బుట్టినది - తామరపువ్వు, ముత్తెము, వట్టివేరు

**నీరాటము** - నీట దిరుగునది (మొసలి, చేప, మొ॥)

**నీరుచిచ్చు, నీరుపాప** - నీటి యందలి అగ్ని (బడబాగ్ని)

**నీలకంఠము** - నల్లని మెడ కలది (నెమలి, కాటుకపిట్ట, భరతపక్షి)

**నీలకంఠాక్షము** - శివ ప్రీతికరమైన పూస (రుద్రాక్షము)

**నీలకంఠుడు, నీలగ్రీవుడు** - విష పానముచే నల్లనైన కంఠము కలవాడు (శివుడు)

**నీలధ్వజము** - నల్లని జెండా వలె నుండునది (తాడిచెట్టు)

**నీలలోహిత** - నలుపు-ఎరుపులు కలిసిన వన్నె కల్గినది (పార్వతి), నేల నేరేడు చెట్టు

**నీల లోహితుడు** - కంఠమున నలుపు-కేశము లందెరువు వన్నె గలవాడు (శివుడు - మహాదేవుడు)

**నీలవసనుడు** - నల్లని బట్టలు కలవాడు (శని, బలరాముడు)

**నీలశీర్షము** - నల్లని మొగము కలది (కొండముచ్చు)

**నీలాంబరము** - నల్లని బట్టకలవాడు (బలరాముడు, శని)

**నీలాంబుజము, నీలాబ్జము** - నీటియంగు బుట్టినది (నల్లగలువ)

**నీలాక్షము** - నల్లని కన్నులు కలది (బాతు, హంస)

**నీవరి, నీవారము** - విత్తనములు లేక పండెడు దూసరులు మున్నగు తృణ ధాన్యము (నివ్వరి)

**నీశారము** - గాలి-మంచు మొ॥ వానిని వారించునది (దుప్పటి)

**నీహారము** - అగ్నిచే మిగుల హరింప బడునది (మంచు)

**నుడికారము** - మాటల యందలి సరసత్వము చమత్కారము

**నుడి పడతుక** - పలుకు రూపమైన పొలతి (సరస్వతి - వాగ్దేవత)

**నుడుగుపడతిమామ** - సరస్వతికి మామ (విష్ణువు)

**నుడుగురేడు** - వాక్కులకు ప్రభువు (బృహస్పతి)

**నుడుగువాలు** - వాక్కులు ఆయుధములుగా గలవాడు (పల్కుటల్లుమేటి - వేల్పు)

**నుడువులనసబోడి, నుడువుల పడతుక** - నుడి పడతుక (సరస్వతి - నలువరాణి)

**నునుగాడ్పుదిండి, నునుగాలి మేత** - మృదువైన వాయువును భక్షించునది (పాము)

**నునుగాలిమేత పాన్పు** - శేషాహిపాన్పుగా గలవాడు (విష్ణువు)

**నులికొమ్ముల మెకము** - మెలికలు తిరిగిన కొమ్ములు గల మృగము (మగజింక)

**నుసి పురుగు** - మ్రాను దొలిచి పొడిరాల్చెడు పురుగు (ఘుణము)

**నూర్మొనల పట్టెము** - నూరంచుల కత్తి (వజ్రాయుధము - శతారము)

**నూరంచుల కైదువు** - నూరంచులు గల ఆయుధము (వజ్రాయుధము)

**నూరంచులవాలు** - నూరు మొనలు గల కత్తి (వజ్రాయుధము - పవి)

**నూరంచుల వాల్జోదు** - నూరంచుల కత్తి పట్టెడు యోధుడు (ఇంద్రుడు)

**నూలిపున్నమ** - ద్విజులు జందెము వేసికొను శ్రావణ పూర్ణిమ (నూలు పున్నమ)

**నృకేసరి** - సింహ ముఖము, నర శరీరము దాల్చినవాడు (నరసింహుడు)

**నృత్తప్రియము** - నాట్యమున ప్రీతి గలది (నెమలి - మయూరము)

**నృత్తప్రియుడు** - నాట్యమునందిష్టము గలవాడు (శివుడు)

**నృధర్మడు** - నరధర్మము గలవాడు (కుబేరుడు)

**నృపతి, నృపుడు** - నరులకు ప్రభువు (రాజు)

**నృపాలుడు** - ప్రజలను పాలించువాడు (ప్రభువు - రాజు)

**నృపాహ్వయము** - నృపుని కూడ ఆహ్వానించునది (పెద్ద నీరుల్లి)

**నృవాహనుడు** - నరుడు వాహనముగా కలవాడు (కుబేరుడు)

**నృశంసుడు** - నరులను బీడించువాడు (దుర్మార్గుడు)

**నెత్తమ్మి కొలనికావు** - తామర చెరువునందు నివసించువాడు (వాయువు)

**నెత్తమ్మి విరివిందు** - తామరలను వికసింప జేయునట్టి చుట్టము (సూర్యుడు)

**నెత్తురుద్రావుడు** - రక్తమును ద్రావువాడు (రాక్షసుడు), రక్తమును ద్రావునది (జలగ, నల్లి)

**నెమ్మిరేడు, నెమ్మిరౌతు** - నెమలి నెక్కువాడు (కుమారస్వామి)

**నెలకూన, నెలచూలి, నెలపట్టి** - చంద్రుని కుమారుడు (బుధుడు)

**నెలచట్టు** - చంద్రకిరణములకు కరగు శిల (చంద్రకాంతమణి)

**నెలచెలియలు** - చంద్రుని చెల్లెలు (లక్ష్మిదేవి)

**నెలజోడు** - చంద్రునకు తోడైన వాడు (సూర్యుడు)

**నెలదాలి** - చంద్రుని శిరమున దాల్చినవాడు (శివుడు)

**నెలత్రావడము** - వెన్నెలను ద్రావునది (చకోరపక్షి)

**నెలదిండి** - చంద్రుని కబళించు వాడు (రాహువు)

**నెలపులుగు, నెలమేపరి** - వెన్నెలను గ్రోలు పిట్ట (చకోరపక్షి)

**నెలయల్లుడు** - చంద్రుని మేనల్లుడు (మన్మధుడు)

**నేజకుడు** - బట్టలు శుద్ధిచేయువాడు (చాకలి)

**నేత్ర రంజనము** - కన్నులకింపు కల్గించునది (కాటుక)

**నేయార్థము** - తనలో దానొక యర్ధమును సంకేతముగా గూర్చుకొని చెప్పినది (ఉదా॰- పలు తేనె తిండిగమినగు నల సాగర కర్ణయాన యలకలన) తుమ్మెదకు తేనె తిండియనియు, సాగరమను మదము చెవులయందు బుట్టును గాన సాగర కర్ణమని ఏనుగునకు పేరు పెట్టుకొని చెప్పెను గాన సుబోధకము గాదు (ఒకానొక పదదోషము)

**నేలతాల్పు** భూమిని ధరించునది (పర్వ తము), భూమిని ధరించువాడు (ఆదిశేషుడు)

**నైకచరము** - ఒంటరిగా తిరుగునది (మేక)

**నైకమాయుడు** - ఎక్కువ మోసములు చేయువాడు

**నైగమము** - నిగమమునకు సంబంధించినది

**నైచికి** - మంచి పరువము, మంచి లక్షణములు, రూపము గలిగి సమృద్ధిగా బాలిచ్చెడు నావు (ధేనుశ్రేష్ఠము - నీచికి)

**నైమిత్తకము** - అప్పుడప్పుడాచరింప వలసిన విధాయక కర్మము

**నైర్ఋతుడు** - దక్షిణ పశ్చిమముల నడిమి దిక్కును పాలించువాడు నిర్ఋతుని సంతతి (రాక్షసుడు)

**నైవేద్యము** - భగవంతునికి నివేదింపబడినది

**నైషధుడు** - నిషధ దేశపురాజు (నలుడు)

**నొసటి చూపువేల్పు** - నుదుట కన్నుగల దేవుడు (శివుడు)

**న్యగ్రోధము** - మార్గము (ఉడలచేత) నడ్డముగా గప్పునది, అడ్డముగా వ్యాపించునది (మఱ్ఱిచెట్టు)

**న్యాసధారి** - ఇల్లడసొమ్ము దాచిపెట్టువాడు

**న్యూనాంగుడు** - హీనమైన అంగములు కలవాడు (వికలాంగుడు)

**న్యూనోపమ** - హీనమైన యుపమ గలది (ఉదా - హైమవసనుడైన హరిమేఘుడన) - ఒకానొక వాక్యదోషము

**నృస్థిమాలి** - నరుల పుఱ్ఱెలు మాలగా గలవాడు (శివుడు)

**పంకక్రీడము** - బురదలో (క్రీడించు) దొర్లునది (పంది)

**పంకగ్రాహము** - బురద యందుండి పట్టుకొనునది (మొసలి - నీటికోతి)

**పంకజము, పంకజాతము** - బురదయందు బుట్టినది (తామర - అసలు బుట్టువు)

**పంకము** - విస్తారమును బొందునది (అడుసు - బురద)

**పంకరుహము, పంకరుట్టు** - (చూ) పంకేరుహము

**పంకవాసము** - బురదయందు నివసించునది (పీత - ఎండ్రకాయ)

**పంకిలము** - బురదగలది

**పంకేజము, పంకేరుహము** - బురద యందు మొలచునది

**పంకేశయము** - బురద నీటియందు పండుకొనునది (జలగ)

**పంక్తి కంఠుడు, పంక్తి కంధరుడు** - వరుసగానున్న (పది) కంఠములు గలవాడు (దశకంఠుడు రావణుడు)

**పంక్తిగ్రీవుడు** - పంక్తి కంఠుడు

**పంక్తి చరము** - గుంపులో కలిసి పోవునది (క్రౌంచపక్షి)

**పంక్తి రథుడు** - దశరథుడు

**పంగనామము** - ఫాలమున పంగవలె పెట్టుకొనిన తిరుమణి

**పంగనామములు పెట్టు** - పెద్దలకు, గురువులకు, తప్పులు దిద్దు, ఆశలు కల్పించి మోసగించు

**పంగిడి యెత్తు** - ఏనుగును బట్టుటకై త్రవ్వి పుల్లలు

ఆకులు పరచి మరుగుపరిచిన గర్తము (పంగిడి), పంగిడిలో పడవేసెడు నెత్తు (గోయివంటి పన్నాగము)

**పంచక రహితము** - తిథి, వార, నక్షత్ర, లగ్నముల సంఖ్యను కలిపి తొమ్మిదిచే భాగింపగ మిగిలినది పంచకము మృత్యు, అగ్ని, రాజ, చోర, రోగ పంచకములకు 1, 2, 4, 6, 8 లను విడిచిపెట్టెడు ముహూర్తము

**పంచకషాయము** - వస, చేదుపొట్ల, ప్రియంగు, మాంసరోమిణి, నింబ వీనిని కషాయముగా జేయుట

**పంచకోల కషాయము** - శొంఠి, చవ్యము, పిప్పలి, పిప్పలి మూలము, చిత్ర మూలము - (వీనినొకటిగా జేసిన పంచకోలము పంచకోల కషాయము వాతము, సన్నిపాతము, శూలరోగములను బోగొట్టును)

**పంచకోశములు** - మానవ శరీరములో నుండు, అన్నమయం, ప్రాణమయం, మనోమయం, విజ్ఞానమయం, ఆనందమయములను నైదుపొరలు

**పంచగవ్యము** - గోవునకు సంబంధించిన పేడ, మూత్రము (పంచితము) పాలు, పెరుగు, నేయి అయిదింటి సమూహము

**పంచగుప్తము, పంచగూఢము** - తన యవయవముల నైదింటిని దాచుకొను సామర్థ్యము కలది (తాబేలు - 4 కాళ్లు + తల = 5 అవయవములు)

**పంచజనుడు** - పంచభూతముల వలన బుట్టువాడు (మనుష్యుడు)

**పంచతిక్తములు** - వేప, తిప్పతీగ, చేదుపొట్ల, అడ్డసరము, వాకుడు 5 తిక్తగుణములు కలవి

**పంచత్వము** - పంచభూత సమ్మిళితమగు శరీరము పంచభూతములతో కలిసి పోవుట (చావు - పంచభావము)

**పంచదశి** - 15 ప్రకరణములు గలది (వేదాంత పంచదశి) వృద్ధి, క్షయాది కళలు గలది (పూర్ణిమ, అమవస)

**పంచదార తిండితేజరౌతు** - పంచదారతిండి (శుకము), శుకవాహనుడు (మన్మథుడు)

**పంచనఖము** - అయిదు గోళ్లు గలది (ఏనుగు, పులి, తాబేలు)

**పంచనఖి** - అయిదు గోళ్లు గలది (పంచ నఖరము = ఉడుము)

**పంచనదము** - ధూతపాప, ధర్మనది, కిరణానది, గంగానది, యమునా నదులు కలిసిన పుణ్యతీర్థము

**పంచబాణుడు** - అరవిందము, అశోకము, చూతము, నవమల్లిక, నీలోత్పలము అనునైదు బాణములు కలవాడు (మన్మథుడు)

**పంచభద్రము** - ఐదు స్థలముల యందు మంచి సుళ్లు గల గుఱ్ఱము

**పంచవక్త్రము** - పంచముఖ రుద్రాక్ష

**పంచ వక్త్రుడు** - ఈశానము. తత్పురుషము, వామదేవము, సద్యోజాతము, అఘోరము అను 5 ముఖములు కలవాడు (శివుడు)

**పంచవల్కలములు** - మఱ్ఱి, అత్తి, రావి, జువ్వి, ప్రబ్బలి అను వీటి పట్టల సముదాయము (పంచ వల్కల కషాయము అతిసార, అత్యుష్ణ, తీవ్రజ్వరములను బోగొట్టును)

**పంచశరుడు** - ఉన్మాదన, తాపన, శోషణ, స్తంభన, సమ్మోహనములను నైదు బాణములు గలవాడు (మన్మధుడు - చూ పంచబాణుడు)

**పంచశాఖము** - శాఖల వంటి అయిదు వ్రేళ్ళు కలది (చెయ్యి)

**పంచాంగము** - తిథి వార నక్షత్ర యోగ కరణములను నైదవయవములు గల సాంవత్సరిక గ్రంధము,ఐదవయవములు (నాల్గు పాదములు, తల) గలది (తాబేలు)

**పంచాణపువాడు** - వడ్రంగి, కమ్మరి, కంచరి, కంసాలి, కాసె అను అయిదు శిల్ప జాతులలోని వాడు (శిలి, - పంచాణంపువాడు)

**పంచాననము** - విస్తీర్ణమైన ముఖము కలది (సింహము)

**పంచాననుడు** - అయిదు మోములు వేల్పు (శివుడు)

**పంచామృతము** - పాలు పెరుగు వెన్న తేనె జలము కలిపిన అభిషేక ద్రవ్యము

**పంచాయతి** - న్యాయము తీర్చెడి అయిదుగురు మధ్యవర్తుల సంఘము

**పంచాలము** - పంచాలుల నివాసమగు జనపదము

**పంచాస్యము** - చూ పంచాననము

**పంచాస్యుడు** - చూ పంచవక్త్రుడు

**పంచమంగళము** - స్తన శిరఃకుంభ చూళికా వక్షోమధ్యము లైదింటియందు మంగళప్రదమైన సుళ్ళు గల ఏనుగు

**పంచమము** - నాభి, ఉరస్సు, హృదయము, కంఠము, శిరస్సనెడి 5 స్థానములయందు బుట్టునది, కోయిలల చేత విస్తరింవ జేయబడునది (సప్త స్వరములలో నొకటి) అయిదవది

**పంచ మహాపాతకములు** - స్వర్ణస్తేయము, సురాపానము, బ్రహ్మహత్య, గురుపత్నీ గమనము, మహాపాతక సహవాసము - నరకమును పొందజేయునవి

**పంచమి** - పక్షమునందలి అయిదవ తిథి, ఐదుగురు భర్తలు గలది (ద్రౌపది)

**పంచముఖము** - విశాలమైన (విస్తరించిన) ముఖము గలది (సింహము - తెరనోటి మెకము)

**పంచముఖుడు** - అయిదు మోముల వేల్పు (శివుడు)

**పంచముడు** - ఐదవ జాతివాడు

**పంచ ముద్రలు** - భూచరి - నాసాగ్రమున లక్ష్యముంచునది, ఖేచరి - భ్రూమధ్య మున దృష్టి నిల్పుట, మధ్యమ - నాసాగ్ర భ్రూమధ్యముల మధ్య ధ్యానముంచుట శాంభవి - బొటన వ్రేళ్ళచే చెవులను అనామికలచే ముక్కును మధ్య వ్రేళ్ళచే నేత్రములను మూసి అంతర్నాదములను వినుచు జిత్కళలను దర్శించుట, షణ్ముఖి - బొటన వ్రేళ్ళచేత కర్ణరంధ్రములను మూసికొని శబ్దములను వినుట

**పంచలక్షణము** - సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరము, వంశాను చరితము ననునైదు లక్షణములు గలది (పురాణము)

**పంజుసేవ** - దివిటీతో చేయు నాట్యము

**పంట పైరులదొర** - సస్యములు పండుట కాధారుడైన సామి (చంద్రుడు)

**పంట పొలతి** - పంటలిచ్చు స్త్రీ (భూదేవి - పంటచెలి)

**పంటవలతి** - పంటలిచ్చు స్త్రీ (భూదేవి - పంట వలంతి)

**పంటవలతి యల్లుడు** - భూదేవి యల్లుడు (శ్రీరామచంద్రుడు)

**పంటసాల** - పంట సామగ్రి యుంచెడు కొట్టు (గాదె - ఉగ్రాణము)

**పండితంమన్యుడు** - తన్ను పండితునిగా దలచుకొనువాడు

**పండిత పుత్త్రుడు** - పండితుని కుమారుడు (శుంఠ)

**పండితుడు** - శాస్త్రమందు మంచి బుద్ధి కలవాడు (విద్వాంసుడు)

**పక్కిడాలు (రేడు) వేల్పు** - గరుడ ధ్వజుడు

**పక్కియొడలివాడు** - పక్షి శరీరము వంటి శరీరము కలవాడు (కిన్నరుడు)

**పక్కిరాజుక్కిదొర** - గరుడుడు వాహనముగా గల ప్రభువు (విష్ణువు)

**పక్కిరాయడు** - పక్షులకు ప్రభువు (గరుడుడు)

**పక్కిసామి** - పక్కిరాయడు

**పక్కెరాలు** - అంతిపురపు కావలి కత్తె

**పక్వవారి** - పరిపాకము పొందిన జలము (తరవాణి - పుల్లనీళ్ళు)

**పక్షచరము** - తన గుంపు విడిచి యొంటిగా జరించెడు మదపుటేనుగు

**పక్షచరుడు** - శుక్లపక్షమందు సంచారము చేయువాడు (చంద్రుడు), (శుక్ల పక్షమందభివృద్ధి నొందుచును, కృష్ణపక్ష మందు క్షీణించుచు సంచరించువాడు)

**పక్షజన్ముడు** - శుక్ల పక్షమందు జన్మము గలవాడు (చంద్రుడు - పదార్వాళ్ళదొర)

**పక్షము** - తర్క విషయ సాధ్యము, ప్రొయ్యి యొక్క ముఖభాగము, నెలయందు పదునైదు దినములు

**పక్షబిందువు** - రెక్కలపై మచ్చలు కలది (రాపులుగు)

**పక్షాంతము** - పక్షము యొక్క అంత్య దివసము (పూర్ణిమ, అమావాస్య)

**పక్షిణి** - రెండు పగళ్ళతో గూడిన రాత్రి

**పక్షిరాజు** - పక్కిరాయడు (పులుగు బొల్లడు - గరుడుడు)

**పక్షి సింహుడు** - పక్షులలో శ్రేష్ఠుడు (గరుడుడు - అహిభుక్కు)

**పగటిగ్రుడ్డి, పగటి చీకటి** - దివాంధము

**పగటి చీకు** - పగలు కన్నులు కనబడనిది (కనకాక్షి)

**పగటిజోతి, పగటి వెలుగు** - పగటి భాగమున దీపము వలె బ్రకాశించువాడు (దినమణి - సూర్యుడు)

**పగటి వేలుపు, పగటివేల్పు** - పగలు ప్రకాశించు దేవుడు (దివాకరుడు - సూర్యుడు)

**పగడపంటి దొర** - (పగడ - ఒకటి) - ఒంటి కొమ్ము దేవర (ఏకదంతుడు - గణపతి)

**పగడపు జుక్క, పగడపురిక్క** - పగడము వంటి చుక్క (ఆర్ద్రానక్షత్రము)

**పగలింటిదొర, పగలింటిరేడు** - పగలనెడు గృహమునకు యజమానుడు (సూర్యుడు)

**పగలు కానని పుల్గు** - పగటిపూట కన్ను లగ పడని పక్షి (గ్రుడ్లగూబ - దివాంధము)

**పచ్చకన్నుల పిట్ట** - పచ్చని కన్నులు గల పిట్ట (గ్రుడ్లగూబ, పైడికంటి)

**పచ్చకన్నుల మెకము** - పసుపు రంగు కన్నులు గల మృగము (సింహము - హర్యక్షము)

**పచ్చకన్నుల వేల్పుసూడు** - పచ్చని కన్నులు గల రాక్షసుడు (పింగళాక్షుడు)

**పచ్చకప్పురము** - చల్లదనము, పరిమళము గల యొక దినుసు కర్పూరము

**పచ్చకోకతాల్పు** - పచ్చని బట్ట ధరించినవాడు (పీతాంబరుడు - విష్ణువు)

**పచ్చగుఱ్ఱాల వజీరు** - సూర్యుడు (హర్యశ్వుడు)

**పచ్చతత్తడుల వజీరు** - పచ్చని ఏడు గుఱ్ఱాల రథమునెక్కు రౌతు (సూర్యుడు)

**పచ్చతల పిచ్చుక** - పైడి వన్నె తలగల పిచ్చుక (బంగారు పిచ్చుక)

**పచ్చని వింటిజోదు** - పచ్చని విల్లుగల యోధుడు (మన్మధుడు)

**పచ్చబొట్టు** - పసరుతో ముఖమున (చేతుల పైన) పొడిపించుకొను బొట్టు (పచ్చ)

**పచ్చరెక్కల పిట్ట** - పసుపురంగు రెక్కలు గల పిట్ట (చిలుక)

**పచ్చవలువదారి** - పచ్చకోకతాల్పు (పసుపు చేలముదొర - విష్ణువు)

**పచ్చవారువపు జోదు, పచ్చవారువపు వజీరు** - పచ్చని ఏడు గుఱ్ఱాల రథమునెక్కు యోధుడు (సూర్యుడు), పచ్చని వాహనముగా గల యోధుడు (మన్మధుడు)

**పచ్చవింటిదొర, పచ్చవిలుకాడు, పచ్చ విలుతుడు** - పచ్చని విల్లుగల దొర (మన్మధుడు)

**పచ్చవిలుతుని తండ్రి, పచ్చవిల్తునయ్య** - మన్మధుని తండ్రి (విష్ణువు)

**పచ్చవిలుతుని తేజి** - మన్మధుని వాహనము (చిలుక)

**పచ్చికడాల్మేని సామి** - పచ్చిక రంగు శరీరముగల ప్రభువు (విష్ణువు)

**పటకారుడు** - బట్టలు నేయువాడు (తంతు వాయుడు - సాలెవాడు)

**పటచ్చరము** - శిథిలమైన వస్త్రము (ప్రాత గుడ్డ)

**పటహము** - చర్మవాద్య విశేషము (తప్పెట), యుద్ధ మందలి వాద్య ధ్వని (ఆడంబరము)

**పట్టకము** - మూడు పలకలు గల గాజు దిమ్మె

**పట్టపు దేవి** - రాజు యొక్క మొదటి భార్య (పట్టపురాణి)

**పట్టము** - రాజులకు రాజ్యాభిషేకము చేయునపుడు నుదుట గట్టెడు పట్టె, భూముల తాలూకు పట్టా

**పట్టాభిషేకము** - రాజులకు పట్టము కట్టునపుడు చేయు సంస్కార విశేషము

**పట్టెవర్ధనాలు** - వైష్ణవులు పట్టెవలె నొసట తాల్చెడు నిలువు బొట్లు

**పట్టుగొమ్మ** - పట్టుకొనుటకు ఆధారమైన కొమ్మ

**పట్టెవర్ధనము** - పట్టెవలె నిలువుగా తీర్చి దిద్దిన నొసటి బొట్టు (నిలువు నామము)

**పడగదారి** - పడగను ధరించునది (త్రాచు పాము)

**పడగదాలుపురేడు** - పాములకు రేడు (ఆదిశేషుడు)

**పడగ పానుపు దొర** - శేష శయ్యపై పవళించు ప్రభువు (పాపపాన్పుదంట - విష్ణువు)

**పడమటి దొర** - పశ్చిమ దిక్కు ప్రభువు (వరుణుడు)

**పడమటిమల** - క్రుంకు గట్టు (అస్తాద్రి)

**పడమటి యెకిమీడు** - పడమటి దొర వరుణుడు

**పడుపు గొమ్మ** - వ్యభిచార వృత్తిచే ధనము సంపాదించెడు యువతి (పడుపుగోమలి - వేశ్య)

**పణవము** - పంబ అను చర్మ వాద్య విశేషము (దీనిని వాయించుచు స్తోత్రము చేయుదురు)

**పణ్యాజీవుడు** - దుకాణములో సరుకులమ్ము కొని జీవించువాడు (వర్తకుడు - వణిక్కు)

**పతంగము** - ఎగురుచు బోవునది (పతగము - పక్షి), అగ్నియందు బడునది (శలభము - మిడుత),వేగమున బోవునది (బాణము)

**పతంగుడు** - ఎగురుచు బోవువాడు (సూర్యుడు)

**పతత్త్రము** - పడు దానిని రక్షించునది (రెక్క - గరుత్తు)

**పతత్త్రి** - రెక్కలు గలది (పక్షి - గరుత్మంతము)

**పతద్గ్రహము, పతద్గ్రాహము** - పడుచుండెడు తాంబూల రసాదులను గ్రహించునది (తమ్మపడిగము)

**పతయాళువు** - పడెడు శీలము కలవాడు (పాతకుడు)

**పతాక** - టెక్కెము, టెక్కెపు కంబము, ప్రధాన కథకు అంగమై దానికి పుష్టినిచ్చుచు బహుదూరము వ్యాపించియుండు యుపకథ ఉదా - రామాయణమున సుగ్రీవుని కథ,

**పతాకము** - బొటనవ్రేలిని చూపుడు వ్రేలి మొదట గూర్చి మిగిలిన వ్రేళ్ళన్ని చాచిపట్టినది (ఒకానొక అభినయ హస్తము)

**పతాకి** - ధ్వజము కలవాడు (ధ్వజి)

**పతాకిని** - ధ్వజిని (సేన - చమువు)

**పతివ్రత** - పతిని సేవించుటే వ్రతముగా గలది (సాధ్వి)

**పత్కంకణము** - కాలికి తొడిగికొను కంకణము (కాలికడియము)

**పత్తి** - ఒక రథము, ఒక ఏనుగు, మూడు గుఱ్ఱములు ఏవురు కాల్బలము గల సేన

**పత్తిరేకు** - లోహపు సామానులకు చిల్లు వద్ద అదికించు సజాతీయమైన పాడిరేకు (పత్తికట్టు)

**పత్ని** - పతితో గూడ యజ్ఞ యోగము గలది (సహధర్మిణి - భార్య)

**పత్త్రద్రుమము** - ఎండి పడునట్టి శాఖలు గలది (తాడిచెట్టు)

**పత్త్రపరశువు** - పత్రాకారముగ నున్న ఆయుధము (ఆకురాయి - చీరణము)

**పత్త్రపాశ్య** - వత్రము వలె నొనటి యందు కట్టబడునది, నుదుట కట్టెడు ముత్యపు బాసికము (లలాటిక - పాపటబొట్టు)

**పత్త్రభంగము** - స్త్రీల కుచకపోలాదులందు వ్రాయబడిన మకరికా పత్రము (పత్రలేఖ)

**పత్త్రరథము** - రెక్కలే రథముగా గలది (పక్షి పలుగు)

**పత్త్రరేఖ** - స్త్రీల చెక్కిలి మొదలగు వాని యందు వ్రాయబడిన మకరికా పత్రము (పత్రలేఖ)

**పత్త్రవాహము** - జాబు మోసికొని పోవునది (పక్షి)

**పత్త్రవాహుడు** - జాబు (కమ్మ) తీసికొని పోవువాడు

**పత్త్రి** - పత్రములు (రెక్కలు) గలది (పక్షి, డేగ, మొ॥), ఈకెలు చుట్టబడినది (బాణము)

**పత్త్రశిర** - ఆకుల నరములు (సిరలు)

**పత్త్రోర్ణము** - తడిపిన పట్టుచీర, ఆకుల యందు నూగు గలది (దుండిగపు చెట్టు)

**పథికాశ్రయము** - మార్గస్థుల కాశ్రయమైనది (సత్రము)

**పదగండీరము** - బోదకాలు రోగము (శ్లీపదము)

**పదచ్ఛేదము** - పదములు విభజించుట

**పదాజి, పదాతి** - పాదములతో నడచుచు యుద్ధము చేసెడు కాల్బలము

**పదావది** - కాళ్ళతో తన్నుకొనుచు చేయు పోరాటము

**పదార్వాళ్ళదొర** - పదారు కళలు గల ప్రభువు (చంద్రుడు - కళానిధి)

**పదితేరుల దొర** - దశరథుడు

**పదినూరులంచులవాలు** - వేయి అంచులు గల ఆయుధము (సుదర్శన చక్రము)

**పదినూరు చేతుల దొర** - వేయి (కిరణములు) కరములు గల దేవుడు (సూర్యుడు)

**పదియుర్లజోదు** - పది కంఠములు గల యోధుడు (రావణుడు)

**పదివేసముల దిట్ట, పదివేసముల సామి** - పది యవతారముల నెత్తిన వేల్పు (విష్ణువు - దశరూపభృత్తు)

**పద్మగర్భి, పద్మగర్భుడు**-పద్మము నాభియందు గలవాడు (విష్ణువు - పద్మనాభుడు)

**పద్మజుడు** - వెన్నుని బొడ్డు తామరయందు బుట్టినవాడు (బ్రహ్మ - పద్మభవుడు)

**పద్మనాభుడు** - తామర నాభియందు గలవాడు (విష్ణువు - తమ్మిదాల్పు)

**పద్మబంధువు, పద్మబాంధవుడు** - తామరల చుట్టము (సూర్యుడు)

**పద్మము** - దీనిని లక్ష్మి పొందును (తామర)

**పద్మరాగము** - పద్మము యొక్క రక్తిమ వంటి రక్తిమ కలది (తామరకెంపు)

**పద్మవ్యూహము** - పద్మాకారముగా సైన్యము ను ఆయత్త పరిచిన మొగ్గరము

**పద్మాకరము** - కమలాకరము (కొలను)

**పద్మాక్షుడు** - తామరల వంటి కన్నులు గలవాడు (విష్ణువు)

**పద్మాలయ** - పద్మము స్థానముగా గలది (లక్ష్మి)

**పద్మి** - ముఖము నందు బొట్లు గల ఏనుగు

**పద్మిని** - తామరలు కలది (తామర కొలను), నువ్వు పువ్వువంటి నాసిక, చంపక పుష్పము వంటి శరీరచ్ఛాయ, హంస నడకల వంటి నడకలు, మితభోజనము, అభిమానము, అధికమగు లజ్జాదులు గల్గిన యుత్తమ జాతి స్త్రీ

**పద్మినీ వల్లభుడు** - తామరలకు భర్త (పద్మినీ కాంతుడు - సూర్యుడు)

**పనటి చూలి, పనటి పుట్టువు** - కుండయందు బుట్టినవాడు (అగస్త్యుడు, ద్రోణుడు)

**పనస** - ఏబది పదముల సమూహము (వేద విభాగము)

**పనిచెరుపులదొర, పని చెరుపుల వేల్పు** - పనులకు ఆటంకములు కలిగించెడు ప్రభువు (విఘ్నేశ్వరుడు)

**పనుల సాకిరి**- జీవులు చేయు పుణ్య పాపములకు సాక్షి యగువాడు (సూర్యుడు - జగచ్చక్షువు)

**పన్నగము** - పాదములచే బోవనిది, పడిన దానివలె బోవునది (పాము - ఉరగము)

**పన్నగారి** - సర్పములకు శత్రువు (గరుడుడు, నెమలి)

**పన్నగాశనుడు** - పాములను దినువాడు (పాపమేపుడు - గరుడుడు)

**పయస్య** - పాల వికారమైనది (నేయి, పెరుగు, మజ్జిగ, మొ॥)

**పయస్వలము** - ఎక్కువ పాలిచ్చునది (ఆవు, మేక, మొ॥)

**పయిడికంటి** - బంగారపు కంటె (మెడనగ), బంగారు ఆకారమైన కన్నులు కలది (శకునపక్షి)

**పయిడి చూలాలు** - బంగారము గర్భమందు గలది (వసుగర్భ - భూమి)

**పయిడి దొర** - బంగారు గనికి ప్రభువైన వాడు (కుబేరుడు - పైడిరేడు)

**పయిడి నెలత** - సంపదలకు అధిష్ఠాన దేవతయగు లక్ష్మి

**పయిడిరేడు** - పయిడి దొర (నిధీశుడు - కుబేరుడు)

**పయిరుల యెకిమీడు** - పైరుల కధిపతి (ఓషధీశుడు - చంద్రుడు)

**పయోఘనము** - మంచురాయి (వడగల్లు - కరక)

**పయోజము** - నీట పుట్టినది (పద్మము)

**పయోదము** - నీటి నొసగునది (మేఘము)

**పయోధరము** - పాలను ధరించునది (స్తనము), జలమును ధరించునది (మేఘము, టెంకాయ)

**పయోధి** - ఉదకములను ధరించునది (పయోనిధి సముద్రము)

**పయోధిజము** - సముద్రపు నీట బుట్టునది (సముద్రపు నురుగు)

**పయోనిధి** - జలనిధి

**పయోరాశి** - ఉదకములకు ప్రోగు అయినది (నీటికుప్ప)

**పరంతపుడు** - శత్రువులను మిగుల తపింపజేయువాడు (శూరుడు)

**పరంపదము** - మిక్కిలి ఉత్కృష్టమైన స్థానము (విష్ణులోకము)

**పరంపరావాహనము** - పెక్కురు మోయ దగిన అందలము (తేరుమోకు)

**పరంపరుడు** - తన సంతతిలోనివాడు (ముమ్మనుమడు)

**పరకాయ ప్రవేశము** - తన శరీరము నుండి వేరొక నిర్జీవ శరీరమున జీవుని ప్రవేశ పెట్టుట

**పరకీయ** - నాయికా విశేషము, ఇతరునిది (స్వీయ, పరకీయ, సామాన్య యని నాయికలు మూడు తెరగులు)

**పరజాతుడు** - పరులచేత పెంచబడి వారికి పుట్టిన బిడ్డవలె మెలగువాడు (పెంపుడు బాటు, నమ్మినబంటు)

**పరటిపుట్టువు** - చూ పనటి పుట్టువు

**పరదేశి** - ఇతర దేశమునుండి వచ్చిన వాడు (అతిథి)

**పరపతి** - అప్పు పొంద దగిన (నమ్మకము) విశ్వాసము (పల్కుబడి)

**పరపత్తెము** - ఇతరుని యొద్ద చేబదులుగా ద్రవ్యము పుచ్చుకొనుట (అప్పునైన పలుకుబడి)

**పరపిండాదుడు** - పరులు పెట్టిన యన్నము తిని జీవించువాడు (పరాన్నుడు)

**పరపుష్టము** - ఇతర జాతిదగు కాకిచే రెక్కలు వచ్చు వరకు పోషింపబడునది (కోయిల పరభృతము, పరపుష్ట - ఆడుకోయిల)

**పరపూర్వ** - పూర్వము పెండ్లియాడిన మొదటి భర్త కల యాడుది

**పరప్రేష్యుడు** - తనకు బదులుగా పంపదగిన వాడు (సేవకుడు, బంటు)

**పరభృతము** - పరపుష్టము (సాకుడు పులుగు - కోకిల)

**పరభృత్తు** - తన సంతానమే యనుకొని రెక్కలు వచ్చు వరకు ఇతర జాతి దగు కోయిలను పెంచునది (కాకి)

**పరమ పదము** - మిక్కిలి ఉత్తమమైన స్థానము (వైకుంఠము)

**పరమహంస** - ఉత్తమ స్థానము నొందిన సన్న్యాసి (సిద్ధుడు)

**పరమాణువు** - సూక్ష్మాతి సూక్ష్మమైన రేణువు (నలక)

**పరమాత్మ** - మిక్కిలి చిన్నదియగు అణువు (అణువులో అంశము), పరబ్రహ్మము (స్వరాట్టు)

**పరమాన్నము** - బెల్లము వేసి పాలచేత బక్వము చేయబడిన శ్రేష్ఠమైన యన్నము (పాయసము)

**పరమేశ్వరుడు** - శ్రేష్ఠుడైన ప్రభువు (శివుడు, విష్ణువు)

**పరమేష్ఠి** - ఉత్కృష్ట స్థానమందుండెడు వాడు (బ్రహ్మ)

**పరవశుడు** - ఇతరులకు లోబడినవాడు, (అస్వతంత్రుడు) మైమరచినవాడు

**పరశురాముడు** - గండ్రగొడ్డలి ఆయుధము గా గల రాముడు (జమదగ్ని కొడుకు)

**పరశువు** - పరులను హింసించునది (గండ్ర గొడ్డలి)

**పరశ్వధము** - పరులను నాశమొనర్చునది (పరశువు)

**పరశ్శతము** - నూటి కంటె నెక్కువ సంఖ్య గలది (శతాధికము)

**పరస్మైపదము** - ధాతు బోధితమగు ఫలము పరునకు చెందునది పరస్మైపద ప్రత్యయములగు తిప్, తస్ వహి, మహిఙ్‌లు చేరు ధాతువులు

**పరాంజము** - తైలము తీయు యంత్రము (నూనెగానుగ)

**పరాంతిక** - ప్రవర్తక వృత్తము వంటి వైతాళికుల వృత్త విశేషము

**పరాగము** - వాయు వశమున బోవునది (పుప్పొడి), గాలికెగిరి పోవునది (దుమ్ము, నలుగుపిండి)

**పరాఙ్ముఖుడు** - ఆవలి దిక్కు ముఖము గలవాడు (విముఖుడు, పరాచీనుడు)

**పరాచితుడు** - ఇతరులచే పెంపబడువాడు (బానిస)

**పరాచీనుడు** - పెడముగము పెట్టిన వాడు (పరాఙ్ముఖుడు)

**పరాజితుడు** - జయింపబడినవాడు

**పరాత్పరుడు** - శ్రేష్ఠుల కందరికి శ్రేష్ఠుడు (భగవంతుడు)

**పరామృతుడు** - మృత్యువును జయించిన వాడు (మృత్యుంజయుడు)

**పరాయణుడు** - ఒకదాని యందు మిగుల ఆసక్తి గలవాడు (ధర్మపరాయణుడు మొ॥)

**పరార్థవాది** - ధనము తీసికొని పరుల ప్రయోజనమునకై వాదించువాడు (న్యాయవాది)

**పరికథ** - కల్పిత గాథ

**పరికరము** - పడికట్టు సామగ్రి, సాధనము, విశేషణములు అభిప్రాయ గర్భితములై చెప్పబడెనేని పరికరాలంకారము (చంద్రుని శిరమున దాల్చిన శివుడు మా తాపముల బోగొట్టుగాక)

**పరికరాంకురము** - సాభిప్రాయ విశేష్యము గల యర్థాలంకారము (ఉదా చతుర్భుజుడు చతుర్విధ పురుషార్థము లిచ్చు)

**పరిఖ** - నీళ్ళు పారుటకు అనువుగా కట్టబడినది (ఖేయము)

**పరిగృహ్యా** - పెండ్లి యాడబడినది (ఊఢ)

**పరిచారకుడు** - పరిచర్యలు చేయువాడు (దాసుడు)

**పరిచారిక** - ఊడిగపు కత్తె

**పరిణామము** - ఉపమానము ఉపమేయ ముగా మారి ఫలసిద్ధి పొందినట్లుగా వర్ణింప బడునది (ఒక అర్థాలంకారము) (ఉదా - లతాంగి వికసించిన నేత్ర పద్మములతో నాయకుని జూచెను)

**పరిషత్తు** - వేద వేదాంగములను బరించి ధర్మజ్ఞులైన ఐదుగురితో కూడినది, వేదమును బరించి శాస్త్ర నిర్ణయమున సమర్థులైన అహితాగ్నులగు వారలు ముగ్గురు కలది (సభ)

**పరిషేచనము** - పుడిసిట నీళ్ళు పట్టి భోజన పాత్రము చుట్టును సమంత్రకముగ విడుచుట

**పరిష్వంగము** - అంతట గూడుట (కౌగిలి)

**పరిసంఖ్య** - ఒక వస్తువు నొక చోట విధించి మరియొక చోట నిషేధించుట (ఒక అర్థాలంకారము ఉదా - స్నేహక్షయంబు దీవములందే కాని మిత్రుల హృదయంబులందు లేదు) - స్నేహ క్షయము = చమురు తగ్గుట, మైత్రి తగ్గి పోవుట)

**పరిస్కందుడు** - స్వామి కార్యమునకై అంతట తిరుగువాడు (బంటు - పరజాతుడు)

**పరిస్ఫురితము** - లెస్సగా జ్ఞప్తికి వచ్చినది

**పరిహార్యము** - విడువదగినది (వర్జ్యము)

**పరుషము(లు)** - విన నింపుగాని కఠినాక్షరములు గల పదము తోడిది (పదగతదోషము), పరుషార్థంబులు గలది (అర్థగత దోషము), కఠినోచ్చారణము కల క, చ, ట, త, ప యను వర్ణములు (శ్వాసములు)

**పరుసవేది** - తాకించుటచే లోహమును బంగారముగా చేయుగల రసవిశేషము (స్పర్శవేధి)

**పరేతరాట్టు** - మృతి చెందిన వారికి ప్రభువు (యమధర్మరాజు)

**పరేష్టుక** - పెక్కీత లీనిన యావు (బహుసూత)

**పరోక్షము** - ఇంద్రియ గోచరము కానిది

**పరోష్ణి** - చలినోర్వజాలనిది గనుక కేవలముష్ణమే గలది (గబ్బిలము - తైల పాయిక)

**పరిణాయము** - సారెల యొక్క సవ్యాపసవ్య ప్రసారణము (సారెలు నడుపుట)

**పరిత్యాగము** - పూర్తిగా విడుచుట (పరివర్జనము)

**పరిదానము** - వస్తువులు మార్పు (వినిమయము)

**పరిధి** - సూర్యచంద్రుల చుట్టు మండలాకారముగ ఏర్పడు గుడి (పరిధి), యజ్ఞార్హమైన మేడిచెట్టునకు సంబంధించిన పుల్ల

**పరిపోషకుడు** - చక్కగ పోషించువాడు (సంరక్షకుడు)

**పరిభాష** - వ్యాకరణాది విషయములను సంక్షేపముగా వ్రాయుట కేర్పరుచుకొన్న సంకేత విశేషము

**పరివట్టము** - విష్ణు ప్రసాదముగా స్వీకరించి తలకు జుట్టుకొను పట్టు వస్త్రముతో జేయబడిన గుండ్రని విసనకఱ్ఱ (అలవట్టము)

**పరివతి** - నానా విషయములందు ప్రవర్తించునది (మనస్సు)

**పరివాదిని** - ఏడుతీగలు గల వీణ

**పరివిత్తి, పరివిత్తుడు** - తనకంటె ముందుగా తమ్మునికి పెండ్లి చేసినవాడు

**పరివృత్త్యలంకారము** - న్యూనాధికవముల వినిమయము 1 కొలది వస్తువునిచ్చి గొప్ప వస్తువును బుచ్చుకొనుట (రాజు తానొక్కబాణమును విడిచి శత్రురాజుల సంపదలను గ్రహించె (గజతురగాది సంపత్తికి బాణమిచ్చెననుట) 2 గొప్ప వస్తువునిచ్చి కొద్ది వస్తువును బుచ్చు కొనుట (ఉదా - ప్రతాపరుద్రునిచే జయింపబడిన శత్రురాజులు అరణ్య వాసులగు బోయలకు తమ ఆభరణము లిచ్చి వల్కలములను బుచ్చుకొందురు) 3 సమాన వస్తువునిచ్చి అంతే విలువ గల వస్తువును పొందుట

**పరివేత్త** - అన్నకంటె ముందు పెండ్లాడిన తమ్ముడు

**పరివేదిని** - పరివేత్త యొక్క భార్య

**పరివేశము, పరివేషము** - సూర్యచంద్రుల చుట్టు నేర్పడు గాలిగుడి

**పరివ్రాజకుడు, పరివ్రాట్టు** - సమస్తమును త్యజించి పోవువాడు (సన్న్యాసి)

**పర్ణకారుడు** - తమలపాకులమ్ము వాడు

**పర్ణశాల** - ఆకుటిల్లు (ఉటజము)

**పర్ణాదుడు** - ఆకులను తినువాడు

**పర్యంకము** - దీనియం దుపభోగాదులచేత నరుడు కానబడును (మంచము - పల్యంకము)

**పర్యయము** - క్రమము తప్పుట

**పర్యాయము** - క్రమము, ఒక వస్తువునకు క్రమముగా ననేకాశ్రయములు చెప్పబడుట (ఏకానేకాశ్రయ రూప పర్యాయము) ఒక వస్తువునే పర్యాయమున అనేక వస్తువు లాశ్రయించి నట్లు వర్ణింపబడుట అనేకైకాశ్రయ రూప పర్యాయమని రెండు తెరగులగు అర్థాలంకారము ఉదా - 1 తమ్మి విడిచి సుధాకరు దవిలె గామినీ ముఖప్రభ, 2 తొల్లి ఎచట జనియించె బ్రవాహ మచట నిప్పు డిసుక తిన్నియ

**పర్యాయోక్తము** - ఒక వస్తువును సుబోధక మగునట్లు చెప్పక ప్రకారాంతరముచేత వ్యంగ్యార్థము సొగసున, స్ఫుటముగ బోధపడునట్లు వర్ణించుట (ఒక అర్థాలంకారము)

**పర్వతము** - సంధులు కలది (కొండ - అద్రి)

**పర్వసంధి** - అమావాస్య ప్రతిపత్తులకు గాని పూర్ణిమా ప్రతిపత్తులకు గాని నడుమ నుండు కాలము

**పర్శుక** - ప్రక్క యెముక (పార్శ్వాస్థి)

**పలగండుడు** - సున్నము పూయువాడు (లేపకుడు, సూనరి)

**పలలప్రియము** - మాంసమునం దిష్టము కలది (మాలకాకి - బొంతకాకి)

**పలలాశి** - మాంసమును భక్షించువాడు (రాక్షసుడు - పలలుడు)

**పలాండువు** - శ్లేష్మమును బూరించునది (ఎఱ్ఱుల్లి - నీరుల్లి)

**పలాలము** - గింజలు రాలిపోయిన కాడ (మోడు)

**పలాశి** - ఆకులు గలది (చెట్టు), పలలాశి (రాక్షసుడు)

**పలాశుడు** - మాంసమును భక్షించువాడు (రాక్షసుడు - పొలసు దిండి)

**పలిక్నీ** - నరసిన వెండ్రుకలు కల యాడుది (వృద్ధ)

**పలుకుటల్లుల మేటులు** - (శాపరూప) వ క్కులు బాణముగా గల దిట్టరులు (శాపాయుధులు - వేల్పులు)

**పలుకు దత్తడి, పలుకు దేజి** - విద్యలు నేర్చిన వాహనము (చిలుక - శుకము)

**పలుకు దొయ్యలి** - పలుకుల దేవత సరస్వతి

**పలుకు బోటి** - పలుకు జెలి (పలుకుటింతి)

**పలుకుల చాన, పలుకుల జవరాలు** - పలుకుల వెలది (సరస్వతి)

**పలుకుల పులుగు** - మాటలు నేర్చిన పక్షి (చిలుక)

**పలుగుపిట్ట** - క్రూరమైన పక్షి (గ్రుడ్లగూబ)

**పలుగు రాతిప్రతిమ** - పటికపు రాతి బొమ్మ

**పలుగొమ్ముల మెకము** - దంతములు కొమ్ములుగా గల జంతువు (ఏనుగు - దంతి)

**పల్యంకము** - పర్యంకము (మంచము)

**పల్యాణము** - ఏనుగు మీది అంబారి

**పల్లవాదము** - చిగుళ్ళు తినునది (లేడి)

**పల్లవాస్త్రుడు** - చిగురు విల్తుడు (మన్మథుడు)

**పల్వలము** - మహిషాదులు దీనియందు చలించును

**(పచ్చికపడియ** - అల్పసరస్సు)

**పల్వలావాసము** - నీచ గుంటలలో ఉండునది (తాబేలు)

**పల్వాలుదొర** వలువాలు=కోరలు ఆయుధముగాగలది=సర్పము, సర్పము లకు ప్రభువు (వాసుకి)

**పవనతనయుడు** - వాయుదేవుని కుమారుడు (హనుమంతుడు, భీముడు)

**పవనము** - పరిశుద్ధము చేయునది (గాలి - మారుతము)

**పవనాశనము** - గాలిమేతరి (గాలితిండి - పాము)

**పవనాశనాశము** - సర్వములాహారముగా గలది (నెమలి,గరుడపక్షి)

**పవనుడు** - సంచరించువాడు వాయువు

**పవమానుడు** - పవిత్రముగా జేయువాడు (వాయుదేవుడు)

**పశుపతి** - ప్రమథగణములకును జంతువు లకును ప్రభువు, (శివుడు - శూలి)

**పశుమక్షిక** - క్షుద్రిక

**పశ్చాత్తాపము** - తప్పుచేసి వెనుక నొచ్చుకొనుట (అనుతాపము)

**పశ్చాద్గామి** - అనుసరించువాడు (వెంబడించువాడు)

**పశ్యతోహరుడు** - చూచుచుండగనే నేర్పుగా దొంగిలించువాడు (అగసాలివాడు)

**పశ్యత్ఫాలుడు** - చూడగల ఫాలము గలవాడు (శివుడు)

**పసరురెక్కలపిట్ట** - పచ్చరెక్కలపక్షి (చిలుక)

**పసిడికంటి** - పయిడికంటి

**పసిడి కొండ** - బంగరుకొండ (మేరువు)

**పసిడిపుట్టము** - పచ్చనిబట్ట (పీతాంబరము)

**పసిడిపుట్టము దాల్పు** - పీతాంబరుడు (విష్ణువు - పచ్చవలువదాల్పు)

**పసిడిరేడు** - పయిడిరేడు (నిధీశుడు కుబేరుడు)

**పసిడిరేనికొడుకు** - నలకూబరుడు

**పసిదిండి** - పులి

**పసిదిండిపోతు** - పశువులదినునది (పులి)

**పసిగాపు** - గోవులను కాచువాడు (గొల్లడు)

**పసులచుక్క** - కుందేటిరిక్క (పసరముచుక్క - శుక్రనక్షత్రము)

**పసులబడి** - బీడుమేపినందులకు చెల్లింప దగిన పన్ను

**పాంక్తము** - పంచావయవములు కలది, దాన, కరంభ, పరివాప, పురోడాన్య, పయస్య అనునైదుద్రవ్యములు కల యజ్ఞము

**పాంక్తషట్కము** - (1) పృధివి,అంతరిక్షము, ద్యులోకము దిక్కులు అవాన్తరదిక్కులు - లోకపాంక్తము (2)అగ్ని, వాయువు, ఆదిత్యుడు, చంద్రుడు,నక్షత్రములు-దేవత పాంక్తము (3)జలము,ఓషధులు వనస్పతులు, ఆకాశము,విరాట్టు- భూత పాంక్తము (ఈమూడును అధిభౌతికపాంక్తములు) (4)ప్రాణాది వాయువంచకము - వాయుపాంక్తము , (5) చక్షురాదీంద్రియ పంచకము - ఇంద్రియ పాంక్తము, (6) చర్మమాంస, అస్థిమజ్జ, స్నాయువులు - దాతు పాంక్తము (3ను ఆధ్యాత్మిక పాంక్తములు)

**పాంక్తుడు** - హస్తద్వయ,పాదద్వయ శిరస్సులచే పంచత్వ సంఖ్య కలవాడు

**పాంక్తేయుడు** - పంక్తియందు భుజింప దగినవాడు

**పాంచజన్యము** - పంచజనుడను దనుజుని శరీరము నుండి పుట్టిన శంఖము (విష్ణుని శంఖము- వలమురి)

**పాక్షికుడు** - పిట్టలను వేటాడి జీవించువాడు (శాకునికుడు)

**పాటచ్చరుడు** - పీడించుచు జరించువాడు, చినిగిన కోక నయితము తీసికొనువాడు (దొంగ - తస్కరుడు)

**పాటలీపుత్రము** - పుత్రకుడు తన భార్యయగు పాటలితో కలిసి వచ్చి గంగానదీ తీరమున మయుని చేతికఱ్ఱతో నేల మీద పట్టణముగీయగా ఏర్పడిన పట్టణము

**పాఠశాలిని** - చెప్పినట్లు పలుకునది (గోరింకపిట్ట - పారమంజరి)

**పాఠీనము** - వేయి కోరల చేప (సహస్ర దంష్ట్రము)

**పాణవికుడు** - ఉడుక వాయించువాడు

**పాణింధమము** - చేతులతో ఒత్తి ఊద బడునది (కొలిమితిత్తి - చర్మప్రవేశిక), చేతులతో చప్పట్లు చరచుచు పోవదగినది (చీకటిదారి), చేతులతో వాయింపదగినది (ఒకానొక వాద్యము)

**పాణిగృహీత** - పెండ్లికాక ముందుంచుకొన్న యువతి

**పాణిగృహీతి** - అగ్నిసాక్షిగా వివాహము చేసికొన్న పెండ్లాము (భార్య)

**పాణిఘుడు** - చేతులతొ తాళము వేయువాడు (పాణివాదుడు)

**పాతంగి** - పతంగుని కుమారుడు (శని)

**పాతర** - ధాన్యమును దాచుకొనుటకు త్రవ్వబడిన పల్లము

**పాతాళప్రశ్న** - అంతు తెలియని చిక్కు ప్రశ్న

**పాతాళము** - పాపము వలన బడు క్రింది లోకము

**పాత్ర** - పానసాధనమైనది, నాటకమున వేషము వైచిన వ్యక్తి

**పాత్రే సమ్మితుడు** - వేళకు భోజనపాత్ర వద్ద సిద్ధపడువాడు (పాత్రేసమితుడు)

**పాథేయము** - మార్గమందు తినదగిన యాహారము (దారిబత్తెము - సంబలము)

**పాథోజము** - అంభోజము (పద్మము, శంఖము)

**పాథోధి** - అంబుధి (అబ్ధి - మున్నీరు)

**పాథోనిధి** - అంబునిధి

**పాదకటకము** - పాదమున ధరించు కంకణము (అందె)

**పాదగ్రహణము** - వినయముతో పాదములు పట్టుకొనుట (అభివాదనము - ఏటికోళ్ళు)

**పాదజుడు** - పాదమునుండి పుట్టినవాడు (శూద్రుడు)

**పాదపము** - వేళ్ళతో నీరు త్రాగునది (చెట్టు)

**పాదబంధనము** - పాదములందు బంధనము కలది (పశువు)

**పాదలేపనము** - ఆకాశ గమన శక్తి నిచ్చెడు కాలికి బూసికొను పసరు

**పాద వల్మీకము** - పాదమున పుట్టవలె ఉబ్బి యుండునది (బోదకాలు - పుట్టకాలు)

**పాదహారకము** - పాదములచే ధరింపబడు నూపురాదికము

**పాదాంగదము** - పాదకటకము

**పాదాతికుడు** - కాలిచే నడుచువాడు (కాలిబంటు)

**పాదివేట** - పెంపుడు పూరేడు పిట్టలను గాని కౌజు పిట్టలను గాని పైకి విడిచి పిట్టలను పట్టెడు వేట (పారివేట)

**పాదుకృత్తు** - చెప్పులను కుట్టువాడు (చర్మకారుడు - పాదూకృత్తు)

**పాద్యము** - పాదములు కడుగుటకై సమర్పింపబడిన జలము

**పానగోష్ఠిక** - మద్యపానము చేసెడి చోటు (మదిరా గృహము)

**పానీయము** - పానము చేయందగినది, రక్షింపదగినది

**పాపఘ్నము** - పాపమును బొగొట్టునది (నువ్వులు - తిలలు)

**పాప జందెములమేటి, పాప జన్నిగట్టు** - సర్పమును యజ్ఞోపవీతముగా ధరించిన దిట్ట (వినాయకుడు)

**పాపతూపు** - పాపరమ్ము (నాగాస్త్రము)

**పావ తొడవుల వేల్పు** - సర్పములు భూషణములుగా గల దేవుడు (పాపసరుల దాల్పు - శివుడు)

**పాపనాశని** - పాపమును నశింపజేయునది (జమ్మిచెట్టు)

**పాపపాన్పుదంట** - ఆదిశేషుడు శయ్యగా గల దిట్ట (శ్రీ విష్ణువు)

**పాపములికి** - పాపరమ్ము

**పాపమేపరి** - పాపములను తినువాడు (గరుడుడు) తినునది (నెమలి)

**పాపమేపరి పచ్చ** - గరుడ పచ్చ

పాపమేపుడు - పాములను తినునది (నెమలి - అహిభుక్కు)

**పాపమేపుడు పుల్గు** - పాములను తిను పక్షి (నెమలి)

**పాపరమ్ము** - సర్పరూపము గల యస్త్రము (నాగాస్త్రము)

**పాపరాయిక్క** - పాములుండు లోకము (నాగలోకము)

**పాపరేడు** - పాములకు ప్రభువు (వాసుకి)

**పాపశమని** - పాపమును శమింప జేయునది (జమ్మిచెట్టు)

**పాపసరులదాల్పు** - పాప తొడవుల వేల్పు (శివుడు)

**పాముఘ్నము** - గజ్జిని దొలగించునది (పామారి - గంధకము)

**పామ** - అంగ సౌందర్యమును బానము చేయునది (గజ్జి, వ్రణము)

**పామారి** - పామఘ్నము (పామాఘ్నము - గంధకము)

**పాముమేత** - పాముల కాహారమైనది (గాలి - వాయువు), పాములాహారముగా గలవాడు (పాము మేతరి)

**పాముల బిడారు** - పాములకు నెలవైనది (చిలువటెంకి - పుట్ట)

**పాములమేతరి** - పాములను దినువాడు (పాముల మ్రింగుడు - గరుడుడు)

**పాయసము** - చూ. పరమాన్నము

**పారంగతుడు** - ఆవలి తీరమును బొందిన వాడు (పారగుడు)

**పారంపరీణము** - వంశాచారముగా వచ్చినది (పరంపరాగతము)

**పారజాయికుడు** - ఇతరుని భార్యతో శారీరక సంబంధము కలవాడు (జారుడు)

**పారత్రికము** - పారలౌకికము

**పారదము** - రోగము యొక్క తుదనిచ్చునది (పాదరసము)

**పారదారికుడు** - పారజాయికుడు (పరదారరతుడు - వ్యభిచారి)

**పారదేశికుడు** - ఇతర దేశమునకు చెందినవాడు

**పారమార్థికము** - మిగుల నుత్కృష్టమైన ప్రయోజనమును కోరెడు బుద్ధి (ధార్మికము)

**పార లౌకికము** - పరలోక సంబంధమైనది (పారత్రికము)

**పారవాతియమ్ము** - పారయొక్క వాదరవంటి వాదర గల అలుగు (పారమ్ము)

**పారశ్వధుడు** - గండ్ర గొడ్డలి ఆయుధముగా గలవాడు (పరశురాముడు - పారశ్వధికుడు)

**పారసీకము** - పారసీక దేశమున బుట్టిన గుఱ్ఱము (పారశీకము)

**పారస్త్రైణేయుడు** - పరకాంత యందు బుట్టిన కుమారుడు

**పారాయణము** - గ్రంథము యొక్క పారమును బొందుట

**పారావారము** - అపారమైన తీరము గలది (సముద్రము)

**పారాశరి** - పరాశరుని పుత్రుడు (వ్యాసుడు), వ్యాసునిచే రచింపబడిన బ్రహ్మ సూత్రముల నధ్యయనము చేయు సన్న్యాసి

**పారికాంక్షి** - పరమును కాంక్షించువాడు (ముని)

**పారితోషికము** - ఆనందము కారణముగా గలది (కానుక)

**పారిమాండల్యవన్మధ్య** - పరమాణు పరిమాణముగల నడుము గలది

**పారిముఖకుడు** - ముఖము దగ్గర ఉండువాడు

**పారిషదుడు** - ప్రమథ గణములోనివాడు (ప్రమథుడు - శివభటుడు) రాజసభ యందలి ధర్మజ్ఞులైన తీర్పరుల లోని వాడు (రాజసభ తగవరి)

**పారిహారికుడు** - పూలమాలలు బంతులుగా గ్రుచ్చి అమ్మెడువాడు

**పారుపత్తెకాడు** - ప్రభుత్వమునకు ప్రజలనుండి రావలసిన పన్నులను వసూలు చేసెడి అధికారి (సుంకరి - ప్రభుత్వోద్యోగి)

**పార్జన్యము** - వర్షాధిదేవతయగు ఇంద్రునకు (వర్జన్యునకు) నబంధించినది. వర్ణ సంబంధమైనది

**పార్థసారథి** - అర్జునుని రథమునకు సారథియైన వాడు (శ్రీకృష్ణుడు)

**పార్థివము** - పృథివీ సంబంధమైనది

**పార్థివుడు** - పృథివికి ప్రభువు (రాజు)

**పార్థుడు** - కుంతి (ధ)పృథ యొక్క పుత్రుడు (అర్జునుడు), పర్వములయందు జేయదగిన పిండప్రదానాదికము

**పార్వతి** - హిమవంతుని కొమార్తె (ఈశ్వరి)

**పార్వతీ నందనుడు** - పార్వతి యొక్క కుమారుడు (వినాయకుడు, కుమారస్వామి)

**పార్ష్ణిగ్రాహుడు** - దండెత్తి పోవు రాజునకు వెనుక నుండు శత్రువు

**పార్ష్ణితము** - ముందట నుండి రక్షించెడు సేన

**పాలకడలి** - క్షీరాబ్ధి (పాలసముద్రము - పాలేరు)

**పాలకీ బొంగురిక్క** - పాలకీ బొంగు వలె నుండు నక్షత్రము (పాలకీ బొంగుచుక్క - మఘ)

**పాలబువ్వ** - పర్వాన్నము

**పాలమున్నీటి యల్లుడు** - లక్ష్మిని బెండ్లియాడుటచే సముద్రునకు అల్లుడైన విష్ణువు

**పాలమున్నీటి రాకన్నె** - క్షీర సముద్రుని కొమార్తె (లక్ష్మి - పాలమున్నీటి కూతురు)

**పాలమున్నీరు** - పాల్కడలి (క్షీరాబ్ధి)

**పాలవెల్లి** - పాలవాగు (పాలమున్నీరు - క్షీరాబ్ధి)

**పాల్కడలి కానుపు** - పాలసముద్రమున బుట్టినది (తెల్ల మొదవు - కామధేనువు, ఐరావతము - మున్నీటి గౌరు, ఉచ్ఛైశ్శ్రవము - వెలిజక్కి)

**పాల్కడలి పట్టి** - క్షీరసముద్రుని కుమారుడు (చంద్రుడు - అబ్ధిజుడు)

**పావకుడు** - పవిత్రము చేయువాడు (అగ్ని), మంచి నడవడిక కలవాడు (యోగ్య వర్తనుడు)

**పావనధ్వని** - పవిత్రమైన నాదము కలది (కంబువు - శంఖము)

**పావనము** - పవిత్రమైనది, పవిత్రము చెయునది (జలము, ప్రాయశ్చిత్తము)

**పావని** - పవనుని పుత్రుడు (ఆంజనేయుడు, భీముడు) పవిత్రురాలు

**పాశకము** - జూదరులను కట్టియుంచునది (పాచిక)

**పాశధరుడు, పాశి** - పాశములచే విరోధులను గట్టువాడు, పాశము ఆయుధముగా గలవాడు (వరుణుడు - నీటిరేడు, యముడు - దండధరుడు)

**పాశుపతము** - శివుడు అధిదైవతముగా గల అస్త్రము

**పాశుపాల్యము** - గోమహిషాదికముపై నాధారపడెడు వృత్తి

**పాశ్చాత్యుడు** - పశ్చిమ దేశమున బుట్టినవాడు (ఆంగ్లేయుడు)

**పాషండుడు** - సంసార బంధ హేతు భూతములైన యసచ్ఛాస్త్రములను బలుకువాడు (వృష్ణి సర్వలింగి - వేదబాహ్యుడు)

**పింగచక్షువు** - గోరోచనపు రంగు కన్నులు కలది (మొసలి)

**పింగజటుడు** - గోరోచనపు వన్నె జటలు గలవాడు (శివుడు)

**పింగదృష్టి** - పచ్చని కన్నులు గలది (సింహము)

**పింగళ** - దక్షిణ దిశయందలి ఆడేనుగు (పింగళవర్ణము కలది), గోరోజనము వంటి రంగు గలది. (కోతి, ముంగిస)

**పింగాక్షము** - పచ్చని కన్నులు గలది (పిల్లి)

**పింజరము** - ఎరుపు మించిన పసుపు వర్ణము కలది (బంగారము)

**పిండపాతికుడు** - బిచ్చ మెత్తుకొను వాడు (బిచ్చగాడు)

**పిండపాదము** - గుండ్రని పాదము కలది (చక్రపాదము - ఏనుగు)

**పికప్రియము** - కోయిలల కిష్టమైనది (మామిడిచెట్టు)

**పికబంధువు** - కోకిలకు బంధువు వలె నాశ్రయమిచ్చునది (పికప్రియము - మామిడిచెట్టు)

**పికము** - చాటున నుండి కూయునది (కోయిల - తలిరుదిండి)

**పికవర్ధనము** - కోకిలలను రెక్కలు వచ్చు వరకు బెంచునది (కాకి - ఏకదృష్టి)

**పికానందము** - పికములకు సంతోషకర మైన కాలము (వసంతకాలము)

**పిక్కు మెకము** - మోసగించు మృగము (నక్క - సృగాలము)

**పిచండము** - త..యందలి జఠరాగ్నిచే పదార్థములను . చనము చేయునది (కడుపు)

**పిచండిలుడు** - పెద్ద బొజ్జ కలవాడు (తుందిలుడు)

**పిచ్చిక కుంటు, పిచ్చికుంటు** - కాళ్ళు లే. వాడు (అనూరుడు - పిచ్చుకకుంటు)

**పిడుగుకైదువు** - వజ్రాయుధము (వవి), వజ్రాయుధము కలవాడు (వజ్రి)

**పిత** - రక్షించువాడు (తండ్రి)

**పితరుల చుక్క** - పితృదేవతాకమగు నక్షత్రము (మఘ)

**పితరుల దణి, పితరుల దొర** - పితృదేవతలకు ప్రభువు (పితృపతి - యముడు)

**పితరులు** - మృతి చెందిన పితృ వర్గము (పితాళ్ళు)

**పితామహి** - తండ్రి తల్లి (నాయనమ్మ)

**పితామహుడు** - తండ్రి తండ్రి (తాత - పితృపిత), తండ్రుల (బ్రహ్మ)

**పితృపతి** - పితరుల దొర (యముడు - పరేతరాట్టు)

**పితృప్రసువు** - ప్రొద్దు పొడుచుటకు పూర్వము అయిదు గడియలును ప్రొద్దుగ్రుంకిన పిమ్మట మూడు గడియల వరకును గల కాలము (సంధ్యాకాలము) తండ్రితల్లి

**పితృయజ్ఞము** - పితరుల నుద్దేశించి విడుచు తిలోదక దానము (పితృతర్పణము)

**పితృవనము** - పితృదేవతల వనము (శ్మశానము - ఒలుకులమిట్ట)

**పితృవ్యుడు** - తండ్రి తోడబుట్టినవాడు

**పితృష్వస** - తండ్రి తోడబుట్టినది (మేనత్త)

**పిత్తఘ్నము** - పైత్త్యమును బోగొట్టునది (నేయి - ఘృతము)

**పినాకపాణి** - పినాకమను ధనుస్సును దాల్చినవాడు (శివుడు - పినాకి)

**పినాకము** - త్రిపుర దహన కాలమున శరజ్వాలలచేత స్వర్గమును కప్పినది (శివుని విల్లు - అజగవము)

**పినాకి** - పినాకమనెడి విల్లు గలవాడు (శివుడు - శ్రీకంఠుడు)

**పిపాసువు** - నీరుత్రాగ నిచ్ఛ కలవాడు (పిపాసితుడు)

**పిపీలికాక్రమము** - చీమలు ఫలనిమిత్తము చెట్టు మొదటినుండి క్రమముగా ప్రాకిపోయి ఫలమునకు రంధ్రము చేసి లోని రసము ననుభవించిన విధము

**పిపీలికామార్గములు** - చీమ లేర్పరుచుకొన్నదారుల వలె చెదరి పోవునవి, నిలువనివి (క్షణికములు, అస్థిరములు)

**పిప్పలాశనము** - రావి యాకులను దినునది (ఏనుగు)

**పిరికి మెకము** - మిక్కిలి భయము గల జంతువు (లేడి)

**పిల్లనగ్రోవి** - ఊదుటకు వీలుగా బెజ్జములు వేయబడిన వెదురు గొట్టము (పిల్లన గ్రోవి - మురళి)

**పిల్లకాకి** - లోకానుభవము లేనివాడు

**పిల్లనగ్రోవి** - ఊదుటకు వీలుగా బెజ్జములు వేసిన వెదురు గొట్టము (వేణువు - మురళి - పిల్లగ్రోవి)

**పిల్లి కన్రతనము** - పిల్లి కన్ను వలె ప్రకాశించు మణి (వైడూర్యము)

**పిల్లిశీలము** - కృత్రిమ స్వభావము

**పిళ్ళారి జియ్య** - విఘ్నేశ్వరుని తండ్రి (శివుడు)

**పిష్టపశువు** - యజ్ఞమునందు పిండితో జేయబడిన పశువు

**పీతతుండము** - పసుపు పచ్చని తుండము కలది (కారండవపక్షి - కన్నె లేడిపిట్ట)

**పీతద్రువు** - పచ్చని కొమ్మలు కలది (మ్రానిపసుపు చెట్టు)

**పీతపాద** - పసుపు వన్నె పాదములు కలది (మైనగోర)

**పీతమణి** - పచ్చని మణి (పుష్పరాగమణి - పచ్చ)

**పీతముండము** - పచ్చతల పిచ్చుక (బంగారు పిచ్చుక)

**పీతరక్తము** - పీతమణి

**పీతలోహము** - పసుపు వన్నె లోహము (ఇత్తడి)

**పీతాంబరుడు** - పచ్చని బట్ట ధరించిన (గల) వాడు (పచ్చవలువదారి - విష్ణువు)

**పీతాశ్మము** - పితమణి (పచ్చరాయి)

**పీథుడు** - కిరణములచే నీటిని గ్రోలు వాడు (సూర్యుడు - పీతుడు)

**పీనస్కంధము** - బలిసిన (స్థూలమైన) మూపు గలది (అడవిపంది)

**పీనుగు దిండి** - శవములను తినునది (పిశాచము, నక్క)

**పీనోధ్ని** - పెద్ద పొదుగు గలయావు (పీవరస్తని)

**పీయూషము** - పానము చేయుబడునది (అమృతము - సుధ)

**పీయూషవర్షుడు** - అమృతమును వర్షించువాడు (చంద్రుడు)

**పీలికాడు** - ఓడ చుక్కాను త్రిప్పువాడు (సరంగు - కర్ణధారుడు)

**పీవరస్తని** - పెద్ద పొదుగు (స్తనము) గలయావు (పీనోధ్ని)

**పుంఖానుపుంఖము** - ఒకదాని వెనుక నొకటి (పరంపరగా)

**పుంగవుడు** - (సమాసమున నుత్తర పదమైనచో) శ్రేష్ఠుడు

**పుంజుదారి పెద్ద** - పుంజుదారి యన్న (గణపతి - పిళ్ళారి)

**పుంజుదారి, పుంజుదాలువు** - కోడిపుంజు ధ్వజమునందు (చిహ్నముగా) గలవాడు (కుమారస్వామి - రెల్లుచూలు)

**పుండరీకము** - తెల్ల తామర వంటి కాంతి కలది, ప్రకాశించునట్టిది (ఆగ్నేయ దిశయందలి ఏనుగు), శుభకర్మముల యందు మంగళ

ప్రదమైనది (తెల్లతామర), శుభకర్మమును జేయునది (తెల్లగొడుగు), పద్మముల వంటి నేత్రములు గల కొంగ

**పుండరీకాక్షుడు** - తెల్ల తామరల వంటి నేత్రములు గలవాడు, హృదయ కమలమును వ్యాపించి యుండువాడు (విష్ణువు)

**పుంశ్చలి** - పురుషుని చలింపజేయునది, తన మగని విడిచి కదలునది (జారిణి - వ్యభిచారిణి)

**పుంశ్చలీయుడు** - రంకులాడికి బుట్టినవాడు (కొలటేయుడు)

**పుంసవనము** - గర్భవతియగు స్త్రీకి పురుషుడు పుట్టవలె ననెడి సంకల్పముతో జేసెడి సంస్కార విశేషము

**పుట్టకావరి, పుట్టకావు** - పాదలయందు నివసించునది (పాము - ఎలుగుగొడ్డు)

**పుట్టకూటి మెకము** - పుట్టమట్టిని తిను జంతువు (ఎలుగుగొడ్డు - భల్లూకము)

**పుట్టకూడు** - చీమగ్రుడ్లు మున్నగు వానితో గలిసిన పుట్టమట్టి

**పుట్టకూడు దిండి** - పుట్టమట్టి తినుజంతువు (ఎలుగుగొడ్డు)

**పుట్టకొక్కు** - పుట్టయందు తెల్లగా మొగ్గవలె మొలచునది (పుట్టగొడుగు-భూస్ఫోటము)

**పుట్ట గొడుగు** - పుట్టయందు తెల్లగా గొడుగు వలె మొలచునది (అహిచ్ఛత్రము - శిలీంధ్రము)

**పుట్టచూలు** - పుట్టయందు బుట్టినవాడు (వాల్మీకి - కవిజ్యేష్ఠుడు)

**పుట్టదిట్ట** - పాదలయందు ధైర్యముగా నివసించునది (పాము, ఎలుగుగొడ్డు)

**పుట్టపుట్టువు** - పుట్టచూలు (వాల్మీకి - బొరియచూలి)

**పుట్టపురుగు, పుట్టపెద్ద, పుట్టమనెడు గబ్బి** - పుట్ట యందు నివసించెడు గొప్ప దిట్టరి (పుట్టకాపు - పాము)

**పుట్టిమున్గు** - తెప్ప నీటి మున్గు (పుట్టి = తెప్ప)

**పుట్టుక చల్వజోతి** - పుట్టుక నుండియు చల్లనైన వెలుగు గలవాడు (చంద్రుడు - చలివెలుగు)

**పుట్టుగట్టు** - సూర్యుడుదయించు దిక్కు నందలి కొండ(ఉదయాద్రి-పొడుపుకొండ)

**పుట్టుగొడ్డు** - పుట్టుక మొదలు గొడ్డుతనము కలది (గొడ్రాలు - వంధ్య)

**పుట్టుగ్రుడ్డి, పుట్టుచీకు** - పుట్టుక నుండియు కన్నులు కనబడని వాడు (జనుషాంధుడు)

**పుట్టుచెయువు** - పుట్టిన బిడ్డకు చేయు సంస్కార విశేషము

**పుట్టుపాప** - రోగముచే తెల్లబడిన శరీరము గలవాడు

**పుట్టుమొండి** - పుట్టిన నాటినుండియు మొండి యైనవాడు (అనూరువు - పిచ్చుకకుంటు)

**పుట్టువడుగు** - పుట్టుక మొదలు బ్రహ్మచారి యైనవాడు (అజన్మ బ్రహ్మచారి వామనమూర్తి)

**పుడమికాపరి** - భూమికి రక్షకుడైనవాడు (రాజు)

**పుడమి జేజే** - భూసురుడు (బాపడు)

**పుడమితాల్పు** - భూమిని ధరించువాడు (రాజు, శేషుడు)

**పుడమి తేరెక్కువాడు** - భూమిని రథముగా జేసి కొన్నవాడు (శివుడు)

**పుడమిదొర** - పుడమికి ప్రభువైనవాడు (రాజు)

**పుడమినంటు** - భూమికి చెలికాడు (విష్ణువు)

**పుడమిపట్టి** - నేలపట్టి (అంగారకుడు)

**పుడమిపుట్టు, పుడమిబొట్టె** - భూపుత్రి (సీత)

**పుడమి ముద్దియకోక** - భూదేవికి జీరయైనది (సముద్రము)

**పుడమిమొలనూలు** - భూ దేవికి మొల త్రాడైనది (సముద్రము)

**పుడమి రా** - భూమికి ప్రభువు (విష్ణువు, రాజు)

**పుడమివేల్పు** - భూదేవుడు (బాపడు)

**పుడుకుగల్లు** - ఈవి గలరాయి (చాగర తనము - చింతామణి)

**పుడుకు దొడుకు** - ఈవుల మొదవు (వెలిగిడ్డి - కామధేనువు)

**పుడుకుమ్రాను** - ఇచ్చుచెట్టు (ఈవిమ్రాను - కల్పతరువు)

**పుణ్యజనేశ్వరుడు**-పుణ్యజనులగు యక్షులకు ప్రభువు (కుబేరుడు - రాక్షసరాజు)

**పుణ్యభూమి** - వింధ్య పర్వతమునకును హిమవత్పర్వతమునకును నడుమ గల భూమి

**పుణ్యశ్లోకుడు** - పవిత్రమైన చరిత్ర కలవాడు (బాహుక రూపము దాల్చిన నలుడు మొ॥)

**పుణ్యస్త్రీ** - భర్త గల యాడుది

**పుణ్యాహవాచనము** - దైవాది కర్మ ప్రారంభమున విఘ్నేశ్వర పూజకు పిమ్మట పుణ్యాహమను శబ్దమును మూడుమార్లు చెప్పెడు శుభకర్మము

**పుత్తడి గుబ్బలి** - బంగరు కొండ (మేరువు - పుత్తడి మల)

**పుత్తడి దువ్వలువ తాల్పు** - వచ్చని బట్టను ధరించినవాడు (విష్ణువు)

**పుత్తడి మలవిల్కాడు** - మేరు పర్వతమును విల్లుగా పట్టినవాడు (శివుడు)

**పుత్రకామేష్టి** - పుత్రులను గోరి చేయునట్టి యాగ విశేషము

**పుత్ర కృతకుడు** - పుత్రుడుగా (కల్పితుడు) స్వీకరింపబడినవాడు (పెంపుడు కొడుకు - దత్తుడు)

**పుత్రజీవి** - గర్భోత్పత్తిని గలుగ జేయు విత్తులు గల చెట్టు (గర్భదము)

**పుత్రుడు** - పున్నామ నరకము నుండి రక్షించువాడు (కొడుకు)

**పుత్రేషణ** - పుత్రుడు కలుగవలెననెడి కోరిక

**పుత్రోత్సవము** - కొడుకు కలిగిన వెంటనే చేయు బహుమానాదికము

**పునరాధేయము** - రెండవ పర్యాయము ఆధానము చేయబడిన అగ్నికి నమర్పింపబడు హవిర్విశేషము

**పునరుక్తి** - మరల చెప్పబడినది (ఒకవాక్య దోషము)

**పునర్నవము** - మరల కొత్తగా మొలచునది (గోరు)

**పునర్భవ** - మరల బుట్టునది (చంద్రకళ)

**పునర్భవము** - ఛిన్నమైనను తిరిగి తిరిగి పుట్టునది (గోరు)

**పునర్భువు** - మారుమనువుది (దిధిషువు)

**పునశ్చరణము** - మంత్రమును తిరిగి తిరిగి పఠించుట

**పునస్సంధానము** - నిలిచిపోయిన అగ్ని (విచ్ఛిన్నాగ్ని) ని తిరిగి హోమ గుండమున నుంచుట, భార్యాభర్తలను కలుపుట (గర్భాధానము)

**పునాసలు** - సూర్యుడు పునర్వసు నక్షత్రమున నుండగా చల్లిన సజ్జలు లోనగు ధాన్యము

**పునుకతాల్పు** - కపాలి (పునుకదారి - శివుడు)

**పురందరుడు, పురందుడు -** పురువను రాక్షసుని వధించిన వాడు (ఇంద్రుడు). శత్రుపురముల ద్రక్కలించిన వాడు (ఇంద్రుడు)

**పురంధ్రి -** గృహమును ధరించునది (గృహిణి)

**పురశ్చరణము -** హోమమున దేవత యొక్క పేరు పెక్కుమార్లుచ్చరించుట

**పురస్కార్య -** పూజింపదగినది, సత్కరింప దగినది

**పురహారుడు -** చూ॥ తిగప్రోలి వేటకాడు

**పురాకృతము -** పూర్వ జన్మమున తనచే జేయబడినది (శుభాశుభ రూపమైన కర్మవిశేషము)

**పురాణ దంపతులు -** పురాతనులగు భార్యా భర్తలు (ఆదిదంపతులు - పార్వతీ పరమేశ్వరులు)

**పురాణ పురుషుడు -** పురాతన పురుషుడు (ఆదిపురుషుడు - విష్ణువు)

**పురాణము -** పంచ లక్షణములు గల పూర్వచరిత్రము (ప్రళయము, సృష్టి, వంశము, మనువర్ణనము, ఈశాను చరితము - పంచలక్షణములు)

**పురాణ వైరాగ్యము -** పురాణము వినినంత సేపు మాత్రమే శ్రోత విరాగియై యుండుననుట

**పురారాతి -** తిగప్రోలు దాయ (శివుడు - త్రిపురారి)

**పురారి -** త్రిపురారి (పురవైరి - శివుడు)

**పురినెమ్మి -** పురి (పింఛము) గల నెమలి (మగనెమలి - బర్హి)

**పురిపిట్ట, పురి పులుగు -** పురి వెలయు నట్టి పులుగు (నెమలి - కేకి)

**పురీషము -** దీనిచే నుదరము నిండింప బడును (మలము)

**పురుషాదుడు -** మనుష్యులను దినువాడు (మానిసిదిండి - రాక్షసుడు)

**పురుషాయితము -** రతి కాలమున స్త్రీ పురుషుని వలె నాచరించుట (ఉపరతి)

**పురుషార్థము -** పురుషుడు సాధింప వలసిన ప్రయోజనము, ధర్మార్థ కామ మోక్షములలో నొకటి

**పురుషుడు -** పురము = శరీరము శరీరము నందుండు వాడు (పరమాత్మ)

**పురుషోత్తముడు -** పురుషులలో ఉత్తముడు (శివుడు, విష్ణువు)

**పురుహూతుడు -** పురువనెడు రాక్షసుని సంహరించినవాడు, యజ్ఞముల యందు మిక్కిలి పిలువబడువాడు (ఇంద్రుడు - శక్రుడు)

**పురోగామి, పురోగుడు -** ముందు నడచు వాడు (అగ్రతస్సరుడు)

**పురోడాశము -** పిండితో జేసిన హోమ ద్రవ్యము

**పురోనువాక్య మంత్రము -** అప్పటికి పుట్టి యున్న శత్రువులను సంహరించునది (పురోనువాక్యమంత్రములందు పూర్వార్థమున దేవతా వాచక పద ముండును యాజ్యానువాక్య లందు ఉత్తరార్థమున దేవతా వాచక పదముండును)

**పురోభాగి -** ముందు దోషమును స్వభావముననే గ్రహించువాడు (దోషైకదృక్కు - దోషగ్రాహి)

**పురోహితుడు -** పురము యొక్క క్షేమమును కోరువాడు, శాంతిక పౌష్టికాది కర్మములయందు ముందుగా నుండువాడు (పురోధసుడు - పురోధ)

**పులిగోరు -** పతకమునకు మారుగా పులి గోటిని కూర్చిన హారము

**పులి జూదము -** పులులు మేకలుగా పావులను వాడుచు ఆడెడు ఒక ఆట

**పులినవతి** - ఇసుక తిన్నెలు కలది (నది)

**పులినోటి కండ** - నశించుటకు సిద్ధముగా నున్నది

**పులుగు తత్తడిరౌతు** - గరుడ వాహనము నెక్కెడి వీరుడు (గరుడ వాహనుడు - విష్ణువు)

**పులుగుదొర** - పులుగురేడు (గరుడుడు)

**పులుగురాతూపు** - గారుడాస్త్రము (గరుడుని పేరిటి తూపు)

**పులుగురాయడు, పులుగు బొల్లడు** - పులుగుల ప్రభువు (గరుడుడు)

**పులుగురాయి** - గరుడ పచ్చ (గారుత్మతము)

**పులుగు హుమాయి వజీరు** - గరుడుడు వాహనముగా గల యోధుడు (పులుగు హుమాయిజోదు - విష్ణువు)

**పులుగడిగిన ముత్యము** - వానన లేకుండ కడుగబడిన ముత్యము

**పులుచూలి** - రెల్లు గడ్డి యందు బుట్టినవాడు (శరవణ భవుడు - కుమారస్వామి)

**పులుచూలి తాత** - శరవణభవుని తాత (హిమవంతుడు)

**పులుదిండి రాయి** - కసవు నాకర్షించు మణి (ఇంద్రనీలమణి)

**పులోమజ** - పులోముడను ముని వలన బుట్టినది (శచీదేవి)

**పులోమజిత్తు** - పులోముని గెలిచినవాడు (ఇంద్రుడు)

**పుల్కసుడు** - పెద్దలను (తాకుటచేత) స్పర్శచేత జెరుచువాడు (చండాలుడు)

**పువుబోడి, పువ్వారుబోడి** - పువ్వువలె మిక్కిలి మనోజ్ఞురాలగు ఆడుది (పూబోడి)

**పువ్విలుకాడు, పువ్విలుతుడు** - పుష్పములు బాణములుగా గల విల్లు కలవాడు (మన్మధుడు - పుష్పధన్వుడు)

**పువ్వుల ముడుపు** - గర్భిణికి చేయించెడు పుష్పధారణము (సీమంతోన్నయనము)

**పుష్కరము** - పోషణ చేయునది (ఉదకము), బడలిన వానిని పోషించునది (తామర పద్మము), నదులకు పండ్రెండు సంవత్సరముల కొక పర్యాయము వచ్చు పుష్కరమను తీర్థము

**పుష్కరిణి** - కమలములు కలది (కమలాకరము) నూరు ధనున్నుల పరిమాణముతో నలు చదరముగా త్రవ్విన కోనేరు (కోనేరు)

**పుష్పంధయము** - పువ్వులోని మధువును గ్రోలునది (తుమ్మెద)

**పుష్పకము** - పుష్పము వలె నుండునది (కుబేరుని విమానము)

**పుష్పకేతుడు** - పుష్పములు చిహ్నాములుగా గలవాడు (మన్మధుడు)

**పుష్పజము** - పువ్వులలోని తేనె

**పుష్పదంతము** - పుష్పముల వలె ప్రకాశించు నట్టి దంతములు కలది (వాయవ్య దిశ యందలి ఏనుగు)

**పుష్పధన్వుడు** - పువ్విలుకాడు(కుసుమాస్త్రుడు మన్మధుడు)

**పుష్పఫలము** - పుష్పము వల్లనైన ఫలము గలది (వెలగచెట్టు)

**పుష్పబాణుడు** - పుష్పములు బాణములుగా కలవాడు (మన్మధుడు - పూవిల్తుడు)

**పుష్పరసము** - పూవుల యొక్క రసము (పూదేనె)

**పుష్పలావిక** - పుష్పములను మాలలుగా గ్రుచ్చి యమ్మెడు స్త్రీ

**పుష్పలిహము** - పుష్పములందలి రసమును గ్రోలునది (తుమ్మెద)

**పుష్పవంతులు** - పుష్పము వలె వికాసము గలవారు (సూర్యచంద్రులు)

**పుష్పవతి** - ఋతు సంబంధమైన రజస్సు గలది (ముట్టుది - బహిష్ఠ)

**పుష్పశరుడు** - పుష్పములు బాణములుగా గలవాడు (మన్మథుడు)

**పుష్పహీన** - ముట్లుడిగిన యాడుది

**పుష్పాయుధుడు** - పూవు ఆయుధముగా గలవాడు (మన్మథుడు, శ్రీకృష్ణుని కొడుకు)

**పూటకాపు** - ఒకడు చేయవలసిన పనిని తానుచేసెదనని (పూచీపడినవాడు, పూనుకొనినవాడు)

**పుటవెట్టు** - పని బాధ్యతను మరియొకనిపై నుంచు

**పూజెకుండలు** - బచ్చన పనిచేసిన పెండ్లి కుండలు (ఐరేని కుండలు)

**పూతాత్ముడు** - పరిశుద్ధ మనస్కుడు

**పూతిగంధి** - దుర్గంధము గలది

**పూపవెన్నెలరేడు** - బాలచంద్రుడు

**పూర్ణాహుతి** - యజ్ఞావసానమున అగ్ని గుండమున పరిమళ ద్రవ్యములతో చేయుయాగము

**పూర్ణిమ** - పూర్ణ చంద్రుడు గల దినము, శుక్ల పక్షమున పదునైదవ తిథి

**పూర్వజ** - తన కంటె పూర్వమున బుట్టినది (అక్క)

**పూర్వజుడు** - తనకంటె పూర్వమున బుట్టినవాడు (అన్న), మొదట బుట్టినవాడు (జ్యేష్ఠుడు)

**పూర్వదేవుడు** - పూర్వకాలమున దేవ పదమునందున్నవాడు (రాక్షసుడు)

**పూర్వపక్షము** - మాసములో మొదటి పదునైదు రోజులు సిద్ధాంతము కానిది (వాదము)

**పూర్వపర్వతము** - తూర్పు దిక్కున గల పర్వతము (పొడుపుగొండ - తూర్పుకొండ)

**పూర్వరంగము** - నాటక ప్రారంభము (నాంది)

**పూర్వాహ్ణము** - సూర్యోదయము మొదలు మధ్యాహ్నము వరకు గల కాలము (దిన పూర్వభాగము)

**పూలముడుపు** - చూ॥ పువ్వుల ముడుపు

**పూవిలుకాడు** - పుష్పధన్వుడు (పూవింటి వాడు - మన్మథుడు)

**పృతన** - 243 రథములు 243 ఏనుగులు, 729 గుఱ్ఱములు, 1215 కాలిబంట్లు గల సేనా సమూహము (3 వాహినుల సేన)

**పృతనాషాట్టు** - శత్రుసేన యొక్క బలమును సహింపగలవాడు (దేవేంద్రుడు)

**పృదగ్జనుడు** - సజ్జనులతో చేరనివాడు (మూర్ఖుడు)

**పృథగ్విధము** - వేఱు విధము గలది (వివిధము)

**పృథివి** - ప్రసిద్ధమగునది, పృథు చక్రవర్తిచే లెస్సగా జేయబడినది, విశాలమైనది (పృథ్వి - భూమి)

**పృథివీపతి** - భూమికి భర్త (రాజు)

**పృథుకంఠము** - పెద్ద తల గలది (కుమ్మరి పురుగు)

**పృథుకుడు** - మిక్కిలి మొఱపెట్టువాడు (బాలకుడు)

**పృథు రోమము** - ముఖమందు దీర్ఘములైన రోమములు కలది (చేప, బొద్దింక, రొయ్య)

**పృథుశిర** - పెద్ద తలగలది (జలగ)

**పృథు స్కంధము** - పెద్దమూపు కలది (అడవి పంది)

**పృథూదరము** - పెద్ద పొట్ట గలది (తోడేలు)

**పృదాకువు** - కుత్సితముగా శబ్దము చేయునది (పాము, పులి)

**పృషతము** - ఒడలిపై చుక్కలు కలది (దుప్పి)

**పృషత్కము** - రక్తముచే శత్రువును తడుపునది (బాణము)

**పృషదశ్వుడు** - జలబిందువులకు వాహనమైనవాడు (వాయువు), పృషత్తు (లేడి) వాహనముగా గలవాడు (జింకరవుతు)

**పృషదాజ్యము** - పెరుగుతో కలుప బడిననేయి (హవిస్సు)

**పృష్టము** - అడుగబడినది

**పృష్ఠవంశము** - వీపు ఎముక (వెన్నెముక)

**పృష్ఠ శృంగము** - వెనుకకు దిరిగిన కొమ్ములు గలది (అడవిమేక)

**పృష్ఠ శృంగి** - వెనుకకు మళ్ళిన కొమ్ములు గలది (దున్నపోతు)

**పెంటి గూర్పరి** - వెలయాండ్రను విటులతో కలుపువాడు (తార్పుడుకాడు), నాయికను నాయకునితో కలుపువాడు (దూతుడు)

**పెండరము, పెండారము** - శూరులు బిరుదుగా కాలికి ధరించెడు బంగారు కడియము (పెండెరము - గండ పెండారము)

**పెండెకట్లు** - పట్టెలుగా దీర్చిన నొసటి విభూతి రేఖలు

**పెంబిరువడి** - ఎక్కువగా తిరుగ గలవాడు (గరుడుడు)

**పెంపుడుగున్న** - పెంపబడు పక్షి (కోయిల - సాకుడుపులుగు)

**పెక్కణము** - అభినయముతో గూడిన నృత్యము (ప్రెక్కణము), జెట్టీలు పోరు తావు (మల్లరంగము)

**పెట్టమారి** - ఆడుకోడి వలె నుండు పుంజు (పెట్టపోలి - అజ్జవాలు)

**పెట్టుజెట్టు** - ఇచ్చుచెట్టు (కల్పతరువు)

**పెట్టుమందు** - తనకు లోబడుటకై పెట్టెడుమందు (వశ్యౌషధము)

**పెట్టుమ్రాను** - ఈవులమాను (కల్పతరువు)

**పెట్లగ్రోవి** - అదురు వేటు గొట్టము (తుపాకి)

**పెట్లమారి** - దెబ్బలు తిను స్వభావము (కలది - కలవాడు)

**పెడతల** - తల వెనుకటి బాగము

**పెడసరకట్టె** - విరసపు మాటలు పల్కువాడు (మొండివాడు)

**పెతరుల దణి, పెతరుల రేడు, పెతరుల సామి** - పితృదేవతలకు ప్రభువు (యముడు - పితృపతి)

**పెతరుల పుడమి** - పితృ దేవతలుండు భూమి (వల్లకాడు - పితృవనము)

**పెద్దకడుపు వేల్పు** - పెద్ద కడుపు గలవాడు (వినాయకుడు - పెద్ద కడుపువాడు)

**పెద్దజల్లిమెకము** - పెద్ద కుచ్చు తోక గల మృగము (చమరీమృగము - పెద్ద సవరపు మెకము)

**పెద్దతల** - పెద్దగా నుండి పనులు నడిపించువాడు (ముఖ్యుడు)

**పెద్ద నిదుర** - శాశ్వతమైన నిద్ర (మరణము - దీర్ఘనిద్ర)

**పెద్ద నెల** - జ్యేష్ఠ మాసము (తాటిరిక్కనెల)

**పెద్దపిట్ట, పెద్దపులుగు** - గ్రుడ్లగూబ

**పెద్దమెయి ప్రోడ** - పెద్ద బొజ్జ గలవాడు (వినాయకుడు)

**పెద్దమ్మ** - లక్ష్మికి అక్క (జ్యేష్ఠాదేవి - దరిద్రదేవత), పెద్ద తల్లి (పార్వతి)

**పెద్ద రోగము** - దేహము దినెడు జబ్బు (కుష్ఠ రోగము)

**పెద్ద వారము** - శుభకరమైన వారము (బుధవారము - సౌమ్యవారము)

**పెద్ద విన్నపము** - బిగ్గరగా జేసికొన్న మనవి

**పెద్ద వేలుపు** - దేవతలలో పెద్దవాడు (బ్రహ్మ - తాత)

**పెనుకాక రాజోడు** - అధికముగా తాపమును కల్గించు (సూర్యునకు) జోడగువాడు (చంద్రుడు - విరహిణులకు తాపము కల్గించువాడు)

**పెనుకూళ్ళమారి** - ప్రతిచోట కుడుచువాడు

**పెనుబాము** - పెద్ద పాము (కొండచిల్వ)

**పెనుమసనము** - పెద్ద వల్లకాడు గల పట్టణము (కాశి - ఆనందకాననము)

**పెనుమినుకులు** - పూర్వుల ప్రమాణ వాక్కులు (ప్రాబలుకులు - వేదములు)

**పెరవణి** - కుండమీది నాట్యము (పేరణి)

**పెరుమాళ్ళడుగు బుగ్గ** - విష్ణు పాదోద్భవ యగు ఆకాశగంగ)

**పేచకము** - కాకులను హింసించునది (గ్రుడ్లగూబ - వాయసారాతి)

**పేటకము** - వస్తువులతో కూడుకొని యుండునది (పెట్టె - పేటము)

**పేరుటుంగరము** -పేరు చెక్కిన యుంగరము

**పేశి** - దీనియందు గర్భమవయవ యుక్తమగును (గ్రుడ్డు)

**పేశీకోశము** - మాంస ఖండముల యొక్క సమూహము (గ్రుడ్డు - అండము)

**పేషణి** - చూర్ణము చేయునది (పచ్చళ్ళు నూరెడు రాయి - పేషాకము)

**పైకూటమి** - పురుషాయితము (ఉపరతి - పయికూటమి)

**పైఠరము** - పిఠరము = కుండ కుండ యందు వండబడిన పిండి వంట (ఉఖ్యము)

**పైరాణి** - వెండి మొదలగు వానితో ములాము చేసిన నూలిపోగు (జలతారు - సరిగ)

**పైడికంటి** - కనకాక్షియను పక్షి విశేషము (పయిడికంటి)

**పైడికొండ** - బంగరు కొండ (మేరువు)

**పైడి చూలాలు** - బంగారము నీను నది (భూమి - వసుగర్భ)

**పైడిదొర** - ధనాధిపుడు (కుబేరుడు)

**పైడినెలత** - ధనాధి దేవత (లక్ష్మి)

**పైడి ముడుపు** - పెండ్లికి పూర్వము, బంగారము మున్నగు వానినిచ్చి పుచ్చుకొను ఒకానొక సంస్కారము (నిశ్చితార్థము)

**పైడిపుట్టము దాల్పు** - పసిడి పుట్టము దాల్పు (విష్ణువు)

**పైడిరేడు** - పైడి దొర (పయిడిరేడు)

**పైతృకము** - పితృ సంబంధమైనది (పితృశ్రాద్ధము)

**పైతృష్వసేయుడు, పైతృష్వస్రీయుడు** - మేనత్త కొడుకు (బావ)

**పైరులదొర, పైరుల యెకిమీడు** - పైరుల కధిపతి (చంద్రుడు)

**పైరులుసురు** - పైరులకు ప్రాణమైనది (మబ్బు - మొగులు)

**పైశాచము** - నిద్రించియు, వైమరచియు, సంరక్షించుకొన బరాకుపడియున్న గానిని సంభోగేచ్ఛచే రహస్యముగా జేసికొను వివాహము (అష్ట విధ వివాహములలో నొకటి, పైశాచిక మందరకును నింద్యము)

**పొంగటి నెల** - పొంగలి పండుగ వచ్చునెల (మార్గశీర్షము - జింకతల చుక్కనెల)

**పొంగట్టు** - బంగరు కొండ (మేరువు)

**పొంగలి** - పాలు బెల్లము చేర్చి పొంగించిన యన్నము (పాయసము, పులగము)

**పొంతకత్తె** - నాయికా నాయకులను కలుపునది (దూతిక)

**పొందమ్మిమొగ్గ** - బంగరు తామర మొగ్గ

**పొందామరల పంట** - బంగారు కమలములు పండునది (దేవగంగ)

**పొంబేరవేల్పు** - హిరణ్య గర్భుడు (పైడికడుపు వాడు బ్రహ్మ)

**పొక్కిలి చూలి** - పొక్కిలి పాపడు (బ్రహ్మ)

**పొక్కిలి తమ్మివాడు** - నాభియందు కమలము గలవాడు (విష్ణువు)

**పొక్కిలి పాపడు** - విష్ణుని నాభియందు బుట్టినవాడు (బ్రహ్మ)

**పొగకన్ను** - పొగతో గూడిన అగ్ని జనించెడు శివుని మూడవ నేత్రము (చిచ్చరకన్ను - చిచ్చుకన్ను)

**పొట్టకరుకు** - ఎన్ను పొట్ట పట్టెడు తరుణము

**పొట్ట పట్టెడు** - గంట్టముల మీద గంత జారకుండుటకై గట్టెడు వారు (టంగువారు)

**పొట్టి వడుగు** - పొట్టి బ్రహ్మచారి (వామనుడు, విఘ్నేశ్వరుడు)

**పొట్లపూరిక్కనెల** - పుష్య నక్షత్రముతో గూడిన పున్నమిగల నెల (పౌషము - పుష్యమాసము)

**పొడల గింటెము దాల్పు** - మచ్చలు గల చర్మమును వస్త్రముగా గట్టినవాడు (శివుడు)

**పొడల మెకము** - మచ్చలు గల మృగము (పొడమేనుమెకము - దుప్పి)

**పొడుగు మడుగు** - మిక్కిలి పొడవగు మడుగు (మందాకిని - ఆకాశగంగ)

**పొడుపుగొండ, పొడుపుగట్టు** - సూర్యుడుదయించెడు దిక్కున గల యట్టికొండ (ఉదయాద్రి - తూర్పుకొండ)

**పొడుపు గుబ్బలి, పొడుపుమల** - ప్రొద్దు పొడుచు నట్టికొండ (పొడుపుదిబ్బ - తూర్పుకొండ)

**పొడుపు వ్రేలు** - ఇదియని చూపునట్టి వ్రేలు (చూపుడు వ్రేలు - తర్జని)

**పొదరిండ్ల చుక్క** - పొదరిల్లు వలె నుండు నక్షత్రము (పునర్వసు)

**పొలదిండి, పొలసుదిండి** - మాంసమును దినువాడు (రాక్షసుడు - క్రవ్యాదుడు)

**పొలసుమేతరి, పొలసుమేపరి** - మాంస భక్షణము చేయువాడు (రక్కసుడు)

**పోకముడి** - స్త్రీల కటి వసన గ్రంధి (నీవీబంధము)

**పోకలాడి** - విలాసపు పోకడలు గలది (వగలాడి)

**పోగండుడు** - వికారమైన దేహము కలవాడు

**పోచిళ్ళు** - శకునము చూచుటకై ఇరుగు పొరుగిండ్లపై అక్షతలు నీళ్లు చల్లుట

**పోట** - స్త్రీ పురుష లక్షణములు గలది, (మగరొమ్ములు మీసము గలది - మాచకమ్మ - మాసకమ్మ)

**పోటుగంబము** - ఊతగా నిలుప బడిన స్తంభము

**పోటుముట్టు** - యుద్ధమున పగతుని దాకునది (ఆయుధము)

**పోతవణిజుడు** - ఓడ బేరగాడు

**పోతవహుడు, పోతవాహుడు** - ఓడనడపు వాడు (సరంగు - తండేలు)

**పోతు గుఱ్ఱము గలాడు** - దున్నపోతు వాహనముగా గలవాడు (యముడు - పోతురౌతు)

**పోతు తత్తడి రౌతు** - మహిష వాహనము నెక్కువాడు (యముడు)

**పోతురౌతు** - దున్నపోతు నెక్కి స్వారి చేయువాడు (యముడు - దుంతరౌతు)

**పోత్రాయుధము** - నాగేటి కొన వంటి ముట్టె ఆయుధముగా గలది (పంది)

**పోత్రి** - పెద్దమోరకలది (పంది)

**పోరుదిండి** - కలహ భోజనుడు (నారదుడు)

**పోరోగిరవు దంట** - పోరుదిండి (కలహా శనుడు)

**పోరోగిరవు దిండి** - కలహ మాహారముగా గలవాడు (నారదుడు - పోరోగిరవు నిరాబారి)

**పౌత్రి** - కొడుకు కూతురు (మనుమరాలు)

**పౌత్రికేయుడు** - దత్తు తీసికొన్న కూతు కొడుకు

**పౌత్రుడు** - కొడుకు కొడుకు (మనుమడు)

**పౌనర్భవుడు** - మారుమనువు దాని కొడుకు

**పౌర్ణమాసి** - చంద్రుడు పూర్ణముగా నుండెడు తిథి (పూర్ణిమ - పున్నమ)

**పౌర్వాపర్యము** - ముందు వెనుకలకు గల సంబంధము.

**పౌలస్త్యుడు** - పులస్త్యుని వంశమున జన్మించిన వాడు (కుబేరుడు, రావణుడు)

**పౌలోమి** - విస్తారమైన రోమములు గల పులోముని కొమార్తె (శచీదేవి - ఇంద్రాణి)

**పౌషము** - పుష్యమీ నక్షత్రముతో గూడిన పున్నమ గల మాసము (పుష్యమాసము)

**ప్రకంపనుడు** - మిగుల కంపింపజేయువాడు (వాయువు)

**ప్రకరణము** - గ్రంథ భాగము (పరిచ్ఛేదము), ఇతివృత్తము కల్పితమైనదిగను, శృంగార రసప్రధానముగను ధీరశాంతుడు నాయకుడుగను కులస్త్రీ గాని వేశ్యగాని లేక యిరువురును నాయికలుగా నుండు నాటక భేదము (మాలతీ మాధవము, మృచ్ఛకటికము మొ॥)

**ప్రకరి** - పతాక వలె దూరము వ్యాపింపక కొంత వరకే వచ్చి నిలిచి పోవు కథ

**ప్రకాశకుడు** - గ్రంథాదులను ముద్రించి వెలుగులోనికి తెచ్చువాడు

**ప్రకీర్ణకము** - రాజ సమీపమందు విసరబడునది (వింజామరము)

**ప్రకృతి** - ప్రత్యయము చేరకముందున్న పద స్వరూపము

**ప్రగత జానుకుడు** - నడుమ నెడము గల మోకాళ్ళు గలవాడు (దొడ్డికాళ్ళవాడు)

**ప్రగల్భ** - పదునెనిమిదేండ్లకు మించిన వయసు గలిగి సంపూర్ణ యౌవనముచే నొప్పునది

**ప్రగల్భుడు** - ఎప్పటికప్పుడు (అప్పటప్పటికి) క్రొత్త యూహలు దోచు మంచిబుద్ధి గలవాడు (ప్రతిభగలవాడు)

**ప్రఘాణము** - కడప మొదలైనవి దీనిచేత బగుల గొట్టబడును (ప్రఘణము - తలవాకిటిగది)

**ప్రచలాయితుడు** - ఊగెడు వానివలె నుండువాడు (కునికి పాట్లుపడువాడు - ఘూర్ణితుడు)

**ప్రచేతసము** - మంచి హృదయము

**ప్రచేతసుడు, ప్రచేతుడు** - మంచి (గొప్ప) మనస్సు గలవాడు (వరుణుడు)

**ప్రచ్ఛన్నుడు** - మారు వేషము కలవాడు

**ప్రజనము** - ఆవు మొదలగు నట్టివి చూలగు నట్టి తరుణము

**ప్రజాపతి** - ప్రజలకు ప్రభువు (బ్రహ్మ)

**ప్రజావతి** - మరది మొదలైన జనము కలది (అన్నభార్య, తోడబుట్టిన వాని పెండ్లాము)

**ప్రజ్ఞువు** - ప్రగత జానుకుడు (దొడ్డికాళ్ళవాడు)

**ప్రణయ కోపము** - ప్రేమము యొక్క కుటిల ప్రచారము వలన అకారణముగ నాయికా నాయకులకు కలిగెడు కోపము (పొలయలుక)

**ప్రణవము** - మిక్కిలి స్తోత్రము చేయబడునది (ఓంకారము)

**ప్రణిపత్తి** - గోత్ర నామములు చెప్పి పాద ములు ముట్టి మ్రొక్కుట (ప్రణిపాతము)

**ప్రతలము** - విస్తృతమైన తలము కలది (చాచిన వ్రేళ్ళుగల అరచేయి)

**ప్రతికృష్టుడు** - ఆచారాది హీనత్వము చేత నిందింపబడినవాడు

**ప్రతిగృహీతుడు** - దానమును గ్రహించిన వాడు

**ప్రతిగ్రహము** - ఉమిసిన తాంబూల రసాదులను గ్రహించునది (తమ్మపడిగము - ప్రతిగ్రాహము)

**ప్రతిగ్రాహము** - ప్రతిగ్రహము (పతద్గ్రహము - తమ్మపడిగము)

**ప్రతిజ్ఞ** - ఏదేని యొక పనిని దప్పక చేసెదనని నిశ్చయముగా బల్కుట

**ప్రతిజ్ఞాంతరము** - ప్రతిజ్ఞను బలపరుచుటకు (అపజయమున) నూతన ప్రతిజ్ఞను గొని వచ్చుట (తర్కసంబంధి)

**ప్రతిదానము** - ఒక వస్తువునిచ్చి వేరొక వస్తువును బుచ్చుకొనుట (వినిమయము వస్తువులమార్పు), దాపనిచ్చిన దానిని మరల నిచ్చుట

**ప్రతినిధి** - ప్రతిగా బెట్టబడునది (విష్ణ్వాది మూర్తులకు సదృశముగా శిలాదులతో జేసిన ప్రతిమ), ఒకరికి బదులుగా నుండువాడు

**ప్రతిపక్షుడు** - ఎదుటి పక్షము వాడు (శత్రువు - రిపువు, ప్రతివాది - ప్రతిపక్షి)

**ప్రతిపత్తు** - చంద్రోదయమును గాని క్షయ మును గాని ప్రతిపాదించునది (పాడ్యమి - పక్షమునకు మొదటి తిథి)

**ప్రతిపదము** - సమానమైన అర్థమునిచ్చు పదాంతరము (పర్యాయపదము)

**ప్రతిభ** - అప్పటప్పటికి ప్రకాశించెడు బుద్ధి విశేషము

**ప్రతిభువు** - ఒకనికి బదులుగా చేయువాడు (పూటకాపు)

**ప్రతిముఖము** - దృశ్యాదృశ్యమైన బీజ ప్రకాశనము కలది (ప్రతి ముఖసంధియను నాటక సంధి)

**ప్రతిరోధి** - దారి పోవువారల నడ్డగించువాడు (దొంగ - పాటచ్చరుడు)

**ప్రతిలోమము** - అవరోహణ క్రమము కలది

**ప్రతివాది** - వాది యొక్క ప్రతిపక్షి

**ప్రతిస్పర్థి** - స్పర్థ వహించువాడు (పోటీపడు వాడు)

**ప్రతిహారకుడు** - గారడి విద్యయందు నేర్పుకలవాడు (ఇంద్రజాలికుడు)

**ప్రతిహారి, ప్రతిహారుడు** - వాకిట గావలి యుండువాడు (ద్వారపాలకుడు - దౌవారికుడు)

**ప్రతీచి** - సూర్యుడస్తమించు దిక్కు (పడమర - అపరదిశ)

**ప్రతీచీనము** - పడమటి దిక్కున బుట్టినది

**ప్రతీపదర్శిని** - ప్రతికూలముగా నాలోచిం చునది (స్త్రీ, పగగొన్నయాడుది)

**ప్రతీపము** - ఉపమానమును ఉపమే యముగ జెప్పుట, ఉపమానమును ఉపమేయముగ గ్రహించి ఉపమేయ మును దిరస్కరించుట ఉపమేయ ప్రాశస్త్యమును బట్టి ఉపమానమును నిరసించుట, ఉపమానము వలన గలిగెడు ప్రయోజనము ఉపమేయము వల్లనే కలుగుట చేత ఉపమానముతో అవసరము లేదనుట, ఉపమేయము నకు ఉపమానము సాటి కాదనుట అను అయిదు విధములు గల అలంకార విశేషము

**ప్రతోళి** - దీనియందు జనులు గర్వింతురు (రచ్చ)

**ప్రత్యంత పర్వతము** - పెద్దకొండ యొద్ద నుండెడు చిన్న కొండ

**ప్రత్యక్షము** - అక్షమునకు అభిముఖమైనది (కనబడినది)

**ప్రత్యనీకుడు** - వ్యతిరేకము కావలెనని కోరువాడు (శత్రువు - విరోధి)

**ప్రత్యయము** - నామవాచకముల తుదనుండు సుప్తిఙాది

**ప్రత్యర్థి** - ప్రతికూలముగా గోరువాడు (ప్రతివాది, విరోధి)

**ప్రత్యాబ్దికము** - ప్రతి సంవత్సరము జేసెడు శ్రాద్ధము (తద్దినము)

**ప్రత్యాలీఢము** - విలుకాడు ఎడమకాలు ముందరికి చాచి నిలుచుట

**ప్రత్యాహారము** - విషయముల వలన ఇంద్రియములను మరలించుట వర్ణాదుల సంక్షిప్త కథనము (అచ్, హల్ ఇత్యాదులు)

**ప్రత్త్యుత్థానము** - పెద్దలు వచ్చినపుడు లేచి నిలువబడుట (ప్రత్యుద్గమము)

**ప్రత్యుద్గతుడు** - ఎదురుకొని లేచినవాడు (అభ్యుత్థితుడు)

**ప్రత్యూషము, ప్రత్యూషము** - సూర్యకిరణము లచే దహింప మొదలు పెట్టునది (ప్రాతః కాలము - వేకువ)

**ప్రదక్షిణము** - దేవతలనుద్దేశించి కుడివైపుగా ముమ్మారు తిరుగుట

**ప్రదేశిని** - దీనిచేత నిర్దేశింపబడుదురు (తర్జని - చూపుడువ్రేలు)

**ప్రదోషము** - రాత్రి యొక్క ఆరంభ కాలము, కార్యారంభమునకు దోషయుక్తమైన వేళగా జెప్పబడునది (మునిమాపు)

**ప్రద్యుమ్నుడు** - ఎక్కువ బలము కలవాడు (మన్మథుడు - మీనకేతనుడు)

**ప్రద్యోతనుడు** - మిక్కిలి ప్రకాశించువాడు (సూర్యుడు)

**ప్రద్రవము, ప్రద్రావము** - యుద్ధము నుండి పారిపోవుట (ఓడుట)

**ప్రధానులు** - ప్రకృష్టముగా భరించువారు (ఉత్కృష్టులు, హీనులుగాక మధ్యమాధికారములందు వ్యవస్థితులైన దళవాయి వంటివారు

**ప్రధావనము** - వడి గల పరుగు (దౌడు)

**ప్రధ్వంసాభావము** - నష్టమగుటచే లేకుం డుట (ఘటము బ్రద్దలైనచో ప్రధ్వంసాభావమగును)

**ప్రధ్వంసాభావ హేతువు** ఒకానొక హేత్వలంకారము (కామకథోన్మాదము

గతించినది యౌవన జ్వరము తొలగినది, దురాశ జారిపోయినది సన్న్యాసాశ్రమము నందు మనసు కలిగినది ఇందు ఉన్మాదాదులు ప్రధ్వంసాభావము సన్న్యాసాశ్రమ స్వీకార హేతువుగ జెప్పబడినది)

**ప్రనాదిక** - మేఘగర్జననుసరించి కేకారవము చేయునది (నెమలి)

**ప్రపితామహి** - ముత్తాత భార్య

**ప్రపితామహుడు** - తాత తండ్రి (ముత్తాత)

**ప్రూర్వగుడు** - అందరికంటె ముందున్న వాడు (పరమేశ్వరుడు)

**ప్రపౌత్రి** - మనుమని కూతురు (ముమ్మనుమరాలు- ఇనుమనుమరాలు)

**ప్రపౌత్రుడు** - పౌత్రుని కుమారుడు (ముమ్మనుమడు)

**ప్రప్రపితామహుడు** - ముత్తాత తండ్రి (తండ్రియొక్క ముత్తాత)

**ప్రభంజనుడు** - తరు శాఖాదులను విరుగ గొట్టువాడు (వాయువు - ప్రకంపనుడు)

**ప్రభవుడు** - సకల భూతముల పుట్టుకకు కారణమైనవాడు

**ప్రభాకరుడు** - కాంతిని కలుగజేయువాడు (సూర్యుడు, అగ్ని)

**ప్రభాతము** - ప్రకాశింప మొదలు పెట్టునది (ఉషఃకాలము - వేకువ)

**ప్రభాత మేఘము** - ప్రాతఃకాలమేఘ మెంత యాడంబరముగా నున్నను వర్షింపక తేలిపోవుననుట

**ప్రమ** - యధార్థ జ్ఞానము (ప్రమితి)

**ప్రమత్తుడు** - ప్రమాద పడినవాడు

**ప్రమథాధిపతి** - ప్రమథ గణములకు ప్రభువు (ఈశ్వరుడు)

**ప్రమథులు** - శత్రువులను ఎక్కువగా మథించువారు (శివగణములు)

ప్రమద - యౌవన మదముగల యాడుది

**ప్రమదావనము** ప్రమదలు విహరించుటకు యోగ్యమైన తోట (ప్రమదవనము)

**ప్రమనుడు** - సంతోషము నొందిన మనస్సు గలవాడు

**ప్రమాతామహి** - మాతామహుని తండ్రి యొక్క భార్య

**ప్రమాతామహుడు** - మాతామహుని తండ్రి (తల్లితాత)

**ప్రమితము** - నిర్ధారణ చేయబడినది

**ప్రయాగ భయుడు** - తన పదవి నాక్రమించునేమోయని యాగములు చేయువారి యెడ భయపడువాడు (ఇంద్రుడు)

**ప్రయుతము** - పదిలక్షలు కలది

**ప్రరోచన** - సూత్రధారుడు ప్రస్తుతార్థ ప్రశంసచే సామాజికుల (శ్రోతల) నున్ముఖులను గావించుట

**ప్రలంబఘ్నుడు** - ప్రలంబాసురుని బరిమార్చినవాడు (బలరాముడు)

**ప్రలంబము** - మెడలో మిక్కిలిగా వ్రేలాడునది (ముత్యాలహారము)

**ప్రలయము** - జగత్తు దీనియందు పూర్తిగా లయమగును (కల్పాంతము - సంవర్తము)

**ప్రలాపము** - అర్ధ శూన్యమైన పలుకు (పలవరము)

**ప్రవయుడు** - ఎక్కువ వయస్సు కలవాడు (వృద్ధుడు)

**ప్రవర్తకము** - ప్రవృత్తకము

**ప్రవల్హిక** - దీనియం దభిమతార్థము గూఢముగా నుంచబడును (గూఢార్థముగల కావ్యము)

**ప్రవాదము** - కారణము లేకయే కలిగి దేశమంతటను వ్యాపించెడు వార్త

**ప్రవృత్తకము** - ప్రస్తావనలో బ్రవృత్తమైన ఋతు సమాన గుణవర్ణనచే సూచింపబడిన పాత్రము ప్రవేశించుట (ప్రస్తావనాంగము ఆముఖాంగము)

**ప్రవ్యాధము** - శక్తి శాలియగు విలుకానిచే విడువబడిన బాణము పోవునంత దూరము

**ప్రవ్రజితుడు** - పరివ్రాజకుడు (సన్న్యాసి)

**ప్రశాంతుడు** - మిక్కిలి శాంతి నొందినవాడు

**ప్రశిష్యుడు** - శిష్యుని శిష్యుడు

**ప్రష్ఠౌహి** - తొలి చూలి పడ్డ

**ప్రసవంతి** - నొప్పులు పడుచున్న స్త్రీ

**ప్రసవ బంధనము** - వండులేక పువ్వులను బంధించునది (తొడిమ - వృంతము)

**ప్రసాదము** - భగవంతునికి నైవేద్యము పెట్టిన యన్నాదికము

**ప్రసాధని** - శిరోజములను జిక్కులేకుండు నట్లు లెస్సగా జేయునది (దువ్వెన - కంకతిక)

**ప్రసూతి వైరాగ్యము** - ప్రసవ వేదన భరింప జాలక అప్పటికి విరక్తి పొందిన స్త్రీలు సంతతి కలిగిన తదుపరి మరచు విధము

**ప్రసూనేషువు** - పుష్పములు బాణములుగా గలవాడు (మన్మథుడు)

**ప్రస్తరము** - భూమిని కప్పునది (రాయి)

**ప్రస్తారము** - ఛందశ్శాస్త్రము నందలి గురు లఘువుల గుణకారము

**ప్రస్తావన** - నాటకములో మొదట సూత్రధారుల సంభాషణ (రెండవ సూత్రధారుడు రంగస్థలంబును రంజింపజేయుట మొదలుగా వస్త్వాదులలో నొకదానిని సూచించు నంతవరకు గలయది ఆముఖము - స్థాపన)

**ప్రస్తావము** - కార్యము చేయుటకు ముందు చేయు ప్రసంగమున దానిని కొనియాడుట (ఆరంభ ప్రసంగము)

**ప్రస్థానము** - పరరాజులను గెలుచుటకై రాజు చేయు దండయాత్ర

**ప్రహర్షణము** - ఎక్కువగా సంతోషించుట (ప్రయత్నములేకయే హర్ష ప్రదమైన యర్థము సిద్ధించినట్లు వర్ణించుట కోరినదాని కంటె అధికముగా కార్యసిద్ధి జరిగినట్లు చెప్పుట ఫలసిద్ధికై యత్నము చేయుచుండగనే ఫలము లభించెనని వర్ణించుట అను మూడు విధములు గల యర్థాలంకారము

**ప్రహసనము** - హాస్యరస భరితమైన యేకాంక నాటకము

**ప్రహసితము** - శిరఃకంపముతో గూడిన నవ్వు

**ప్రహస్తము** - చాచిన వ్రేళ్ళతో గూడిన అరచేయి (ప్రతలము)

**ప్రహేళిక** - అభిప్రాయమును సూచింపజేయునది (ప్రవల్హిక), ప్రహేళికా పద్ధతులు తెలిసిన వారితో

వినోదములయందు గుప్త సంభాషణముల యందు, ఇతరులను మోహపెట్టుట యందు, చమత్కారముగా మాటాడుట యందు నుపయోగము (వివర - పదముల సంధిచే అస్పష్టమైన అర్థము గలది సమాహత ప్రహేళిక మరియొక అర్థము నందు రూఢమైన శబ్దము చేత వంచన ఉండునది వంచిత దూరాన్వయము గల పదప్రయోగము వలన వెూహమును కల్గించునది వ్యుత్క్రాంత, దేనియందు పదపంక్తి తెలిసికొనుటకు క్లిష్టమైన పదములు కలదియో అది ప్రముషిత వర్ణముల గణనలేక సంఖ్యావాచక శబ్దముల ప్రయోగము వినువారల బుద్ధి వ్యామోహ కారణమగునో అది సంఖ్యాత, దేనియందు వాక్యార్థము మొదట భాసించునో యది ప్రకల్పిత నామవాచకమున నానార్థ కల్పన భాసించునది నామాంతరిత ప్రకృతా ప్రకృతార్థ రెండింటికిని సమన్వయించు సాధారణ ధర్మములను ప్రతిపాదించు వాక్కుతో కప్పివేయబడిన వేరొక అర్థము గలది నిభృత, ప్రయోగింపబడిన శబ్దముల సమన్వయముచే సాధితమైనది, సమాన శబ్ద ఏది ప్రత్యక్షముగా బోధింపబడిన అర్థము కలదైనను శ్రోతలు అర్థము తెలియకుందురో అది సమ్మూఢ, పరుష, సమానరూప, పరిహారిక, ప్రచ్ఛన్న, ఉభయచ్ఛన్న సంకీర్ణము లను 16 ప్రహేళికలు - దుష్ట ప్రహేళికలు గూడ గలవు

**ప్రాకర్షికుడు** - ఇతరుని భార్యవలన బోషింపబడినవాడు (ప్రాకషికుడు)

**ప్రాకామ్యము** - నిర్విఘ్నముగా మనోరథ సంచారము చేయగలుగు శక్తి (అష్టైశ్వర్యములలో నొకటి - పరీష్టి)

**ప్రాకృతము** - ప్రాకృతులనగా గ్రామ్యజనులు వారిచే వ్యవహరింపబడునది సంస్కృతము ప్రకృతి దాని నుండి పుట్టినది (సంస్కృతమునకు ప్రాకృతమే ప్రకృతియని కొందరు చెప్పుదురు)

**ప్రాకృతుడు** - విశేషజ్ఞాన మబ్బక పుట్టినప్పటి వలె నుండువాడు (పామరుడు)

**ప్రాగబ్బము** - పురాతన మైన కావ్యము (వేదము - ప్రాబలుకులు)

**ప్రాగభావము** - పూర్వమున లేకుండుట

**ప్రాగభావ హేతువు** - హేత్వలంకారము (విద్యల యొక్క అభ్యాసము చేయకపోవుట చేతను, బుద్ధిమంతుల యొక్క సహవాసము చేయకపోవుట చేతను, ఇంద్రియముల యొక్క నిగ్రహము లేకపోవుట చేతను మానవులకు వ్యసనము (క్లేశము) కల్గుచున్నది ఇచట అభ్యాసాది ప్రాగభావమే వ్యసన హేతువు

**ప్రాగల్భ్యము** - స్త్రీల యొక్క అప్రయత్నమైన శృంగార చేష్ట (ప్రౌఢిమ)

**ప్రాఘుణికుడు** - ఆదరముచే గ్రహింపబడు వాడు (అతిథి)

**ప్రాచి** - ప్రథమమున సూర్యుడుదయించు దిక్కు (ప్రాగ్దిశ - తూర్పు)

**ప్రాచీన బర్హి** - తూర్పుదిక్కునకు ప్రభువు (ఇంద్రుడు - ప్రాచీపతి)

**ప్రాచీనము** - తూర్పు దిక్కు నందు గలిగినది పూర్వకాలమున గలిగినది

**ప్రాచీనావీతము** - ప్రాచీనమైన దక్షిణ భుజమున నున్న జందెము (అపసవ్యము చేసికొన్న జందెము)

**ప్రాచ్యము** - తూర్పు దిక్కు నందలిది

**ప్రాజంగము** - తొలి జంగమయ్య (శివుడు)

**ప్రాజకుడు** - రథమునడపువాడు, బండితోలు వాడు (చోదకుడు)

**ప్రాజదుపుల పెట్టె** - వేదత్రయం రూపుడు (త్రయీతనువు - సూర్యుడు)

**ప్రాజాపత్యము** - వరునిచే నేను అన్యాశ్రమ స్థుడనుగాక గృహస్థాశ్రమ ధర్మమున నుండి ధర్మ మాచరించెదనని చెప్పించి కన్యాదానము చేయుట (అష్ట విధ వివాహములలో నొకటి)

**ప్రాజాపత్యకృత్యము** - మూడు దినములు ప్రాతఃకాలమున భుజించి మూడు దినము లయాచితముగ లభించిన దానిని తిని మూడు దినములు ఏమియు తినక ఉపవాసముండుట

**ప్రాజేజే** - మొదట దేవతయై యుండి అకృత్యములచే రాక్షసు డనిపించు కొన్నవాడు (పూర్వదేవుడు - రక్కసుడు)

**ప్రాజ్ఞ** - మంచి బుద్ధి గల స్త్రీ (బుద్ధిమంతురాలు - ప్రాజ్ఞురాలు)

**ప్రాజ్ఞుడు** - మంచి ప్రజ్ఞ గలవాడు (బుద్ధిమంతుడు), కారణ శరీరముతో తాదాత్మ్యము ననుభవించుచు నేను అనుకొను జీవుడు

**ప్రాడ్వివాకుడు** - వ్యవహారముల నడిగి విచారించి పల్కువాడు (న్యాయాధ్యక్షుడు - తగవరి)

**ప్రాణగొడ్డము** - ప్రాణోపద్రవ కరము

**ప్రాణనాథుడు** - తన ప్రాణమునకు ప్రభువు (యముడు - పితృపతి, మగడు)

**ప్రాణవాయువు** - వాయువులోని శరీర రక్షకమగు భాగము

**ప్రాణాచారము** - ఆహారాదికమును తినక చావునకై వేచి యుండుట (ప్రాయోపవేశము)

**ప్రాణాయామము** - ముక్కు పుటముల యందు సంచరించెడు ఉచ్ఛ్వాస నిశ్వాస రూపమగు వాయువును నియంత్రించుట (ప్రాణసంయమము)

**ప్రాణిద్యూతము** - ప్రాణుల నొడ్డి జూదమాడుట (కోడిపందెము)

**ప్రాతిపదికము** - ధాతుభిన్నమును ప్రత్యయ భిన్నమును ప్రత్యయాంత భిన్నమును నగు అర్ధ వచ్ఛబ్దరూపము

**ప్రాతిభాసికము** - లేనిది ఉన్నట్లుగా కనబడునది (భ్రాంతి)

**ప్రాతిహారకుడు** - కనుకట్టు విద్యచే దృష్టిని గప్పువాడు (ఐంద్రజాలికుడు)

**ప్రాదియతి** - ప్ర, పరా, అప మొదలగునవి ప్రాదులు ఈ ప్రాదుల కచ్చు పరమై యేర్పడిన సంధియందు ఉభయయతి అచ్చునకు హల్లునకు యతి చెల్లుట

**ప్రాథమ కల్పికుడు** - క్రొత్తగా చదువ మొదలు పెట్టిన శిష్యుడు

**ప్రదేశము** - చూపుడు వ్రేలిని బొట్టన వ్రేలిని చాచి పట్టిన కొలత (లుడితెడు - జుత్తిలి)

**ప్రాప్తవ్యవహారుడు** - వ్యవహారములు స్వయముగ చక్కబెట్టుకొనదగిన వయసు కలవాడు

**ప్రాబలుకు కడ** - వేదముల సారమైనది, కడయైనది (ఉపనిషత్తు, వేదాంతము)

**ప్రాబలుకుమ్రుచ్చు** - వేదములను దొంగిలించినవాడు (సోమకాసురుడు)

**ప్రాబలుకుల టెంకి** - వేదముల కునికి పట్టై నోవాడు (సూర్యుడు - మినుకుల బరణి)

**ప్రాబలకులదణి** - వేదముల ప్రభువు (బ్రహ్మ - నల్వ)

**ప్రాఖాతికము** - ప్రాతఃకాలమునకు సంబంధించినది

**ప్రామాణికుడు** - ప్రమాణముగా నెన్నదగిన వాడు

**ప్రామినుకులు** - పురాతన ప్రామాణిక వాక్యములు (వేదములు)

**ప్రాయశ్చిత్తము** - పాప పరిహారార్ధము చేసెడు కర్మము

**ప్రాయోపవేశము** - ఆహారాదికమును విడిచి మరణమునకై వేచియుండుట

**ప్రారబ్ధము** - సుఖదుఃఖాది భోగముల ననుభవించుటకై శరీరము కలిగించెడు కర్మశేషము

**ప్రార్ణము** - ప్రధానమైన యప్పు

**ప్రాలంబము** - మెడనుండి రొమ్ము వరకుండు హారము

**ప్రాలంబిక** - మెడనుండి రొమ్ము వరకు వ్రేలెడు బంగారు కాసుల హారము (కాసులపేరు)

**ప్రాలేయము** - శరత్కాలాంతమున వచ్చునది (మంచు - తుహినము)

**ప్రావాళికుడు** - పగడములు అమ్మెడు వాడు (పగడాల వర్తకుడు)

**ప్రావృషిజము** - వర్షాకాలమున బుట్టినది (కప్ప)

**ప్రాసము** - పద్య ప్రథమ పాదము నందలి ద్వితీయాక్షరము

**ప్రాసయతి** - ప్రాసాక్షరము ననుసరించి యతి చెప్పుట విశ్రమ స్థానమందలి యక్షరమునకు బిమ్మటి యక్షరము యతిస్థానమగును ఈ ప్రాసయతి గీత సీసములలో జెప్పవచ్చును, లయగ్రాహి మున్నగు కొన్ని పద్యములలో ప్రాసయతి కూర్పవలయును

**ప్రాసాదము** - దీనియందు ప్రసన్నులై నివసింతురు

**ప్రాహ్ణము** - ఉదయము మొదలు 10 గడియల వరకు గల కాలము

**ప్రియంవద** - ప్రియమును బల్కునది (ప్రియవాదిని)

**ప్రియంవదుడు** - ప్రియముగా పల్కువాడు (ప్రియవాది)

**ప్రియుడు** - మిక్కిలిగా బ్రేమించువాడు (మగడు)

**ప్రీణనము** - తృప్తి నొందించుట, సంతసింపజేయుట

**ప్రేతపురము** - యముని సదనము (నరకము)

**ప్రేతరాజు** - ప్రేతముల ప్రభువు

**ప్రేత వనము** - పితృవనము (ఒలికివిట్ట శ్మశానము)

**ప్రేరణి** - చూ పేరణి

**ప్రేషకుడు** - పనులు పురమాయించి పంపెడు వాడు

**ప్రేష్యుడు** - పనులకై పంపదగిన వాడు (సేవకుడు - ప్రైష్యుడు)

**ప్రైషణికుడు** - ఉత్తరువులను తలదాల్చి పనిచేయువాడు (దాసుడు)

**ప్రొద్దుగల్లు** - సూర్యకాంతమణి

**ప్రొద్దుకూన** - సూర్యుని కుమారుడు (యముడు, శని)

**ప్రొద్దుచూలి** - ప్రొద్దుకూన (ప్రొద్దుపట్టి - యముడు, శని, సుగ్రీవుడు)

**ప్రొద్దు జంట** - నెలజంట (చంద్రుడు - నిశివెలుగు)

**ప్రొద్దుజోడు కోడె** - సూర్యునికి జంటయైనవాడు (చంద్రుడు - మరుమామ)

**ప్రొద్దు తిరుగుడు** - సూర్యుని గమనము బట్టి తిరుగు చెట్టు (సూర్యానువర్తిని)

**ప్రొద్దునెల కందోయి** - సూర్య చంద్రులు నేత్రములుగా గలవాడు (విష్ణుదేవుడు)

**ప్రొద్దుపట్టు** - గ్రహణము కలుగు

**ప్రొద్దురిక్కనెల** - ఉత్తర ఫల్గునీ నక్షత్రముతో గూడిన నెల (ఫాల్గున మాసము)

**ప్రోక్షణము** - నీళ్ళు చిలుకరించుట, యాగ పశువును వధించుట (శసనము)

**ప్రోచిళ్ళు** - పోచిళ్ళు

**ప్రోయాలు** - ఇంటియందుండు ఆలు (ఇల్లాలు)

**ప్రోషిత భర్తృక** - ప్రియుడు దేశాంతరము నందుండినపుడు క్లేశపడు నాయిక

**ప్రోష్ఠపదము** - ప్రోష్ఠపద = పూర్వాభాద్ర ప్రోష్ఠపదా నక్షత్రముతో గూడి (ప్రోష్ఠ పదము) పున్నమి గలది

**ప్రౌఢ** - పదునెనిమిదేండ్లకు పైబడి సంపూర్ణ యౌవనము గల స్త్రీ (ఉరియ - జవ్వని)

**ప్రౌఢోక్తి** - విశేష హేతువు లేకున్నను నదే హేతువని చెప్పెడు నలంకారము, ప్రగల్భవచనము

**ప్రౌష్ఠపదము** - ప్రౌష్ఠపద = పూర్వాభాద్రా నక్షత్రము (అష్టాపదము) పూర్వాభాద్రా నక్షత్రముతో కూడిన పౌర్ణమాస్యకల మాసము (భాద్రపదమాసము - ప్రోష్ఠపదము)

**ప్లవంగగతి** - కోతులు స్థిరబుద్ధి లేక ఒక చెట్టు కొమ్మ నుండి మరియొక కొమ్మ మీదికి దూకుచుండెడు విధము

**ప్లవంగము** - దాటుచు బోవునది (కోతి, కప్ప)

**ప్లవంగుడు** - దాటుచు బోవువాడు (అనూరుడు, గరుడుడు)

**ప్లుతము** - మూడు మాత్రల కాలములో నుచ్చరింపదగిన స్వరము, త్వరితగతి గల అశ్వధారా విశేషము

**ప్లుతయతి** - ప్లుత స్వరము (దూరాహ్వాన, సంశయాదులందు) వినబడునట్టి చోట హల్లునకు ప్లుత స్వరమునకు యతి కూర్చుట ఉదా అకటా! యేమని దూఱుదాన మిమునాథా!

**ఫణాటోపము** - పాము పడగను విప్పిచేయు సంభ్రమము

**ఫణి** - పడగ కలది (పాము)

**ఫణి తల్పకుడు** - శేషుడు శయ్యగా గలవాడు (వెన్నుడు)

**ఫణిఫేనము** - పాము నోటి నురగవంటిది (అహిఫేనము- నల్లమందు)

**ఫలద** - ధాన్యాదినొసగునది (భూమి)

**ఫలదము** - పండ్లనొసగునది (చెట్టు)

**ఫలాదనము** - పండ్లు తిని జీవించునది (చిలుక)

**ఫలి** - ఫలములు (మామిడి పండ్లు) కలది (మామిడిచెట్టు), పండ్లు గల వృక్షము (ఫలినము)

**ఫల్గునము** - ఫల్గునీ నక్షత్రముతో గూడిన పున్నమిగల నెల (ఫాల్గున మాసము)

**ఫల్గునుడు** - ఫల్గునీ నక్షత్రమున బుట్టిన వాడు (అర్జునుడు)

**ఫాలనేత్రుడు** - ఫాలము నందు నేత్రము కలవాడు (శివుడు)

**ఫాలాక్షుడు** - ఫాలనేత్రుడు (ఉగ్రాక్షుడు - శివుడు)

**ఫుల్లము** - వికసించినది

**ఫేనవాహి** - ఫేనమును వహించునది (వసనము - వస్త్రము)

**ఫేనిలము** - నురుగు కలది(కుంకుడు కాయ)

**ఫేరండము, ఫేరము, ఫేరువు** - ఫేయని కూయునది (నక్క - జంబుకము, వరడు)

**బంగరవుగట్టు** - బంగరముతో ఏర్పడిన గట్టు (బంగారుకొండ - మేరుపర్వతము)

**బంగరు గట్టు వింటివాడు** - బంగరు గట్టు విల్లుగా గలవాడు (శివుడు)

**బంగారు కడుపువాడు** - బంగారు వంటి కడుపుగలవాడు (బ్రహ్మ - హిరణ్య గర్భుడు)

**బంగారు కాళ్ళయ్య** - శుభప్రదమైన పాద న్యాసము కలవాడు

**బంటుమెకము** - బంటువలె తిరుగు జంతువు (అడవిపంది)

**బండతల** - జారుడుబండవంటి తల (బట్టతల)

**బండారుడు** - బట్టెలను కాచువాడు

**బండి కన్ను** - బండికి కన్నువంటిది (బండిచక్రము)

**బండి తొలువేల్పు** - శకటాకృతి ధరించిన రాక్షసుడు (శకటాసురుడు)

**బండిరిక్క** - బండి వంటి చుక్క (రోహిణీ నక్షత్రము)

**బండి రూపురక్కసుడు** - బండి రూపుగొన్న రక్కసుడు (బండి తొలువేల్పు - శకటాసురుడు)

**బంధకవిత్వము** - ఖడ్గము, చక్రము, లోనగువాని యాకృతులుగ కవిత్వ మల్లెడు పద్ధతి

**బంధకి** - ఉదాసీనుడగు పురుషుని సైతము స్వవశమున బాధించునది (జారిణి)

**బంధనాలయము** -నేరస్థులను బంధించుట కేర్పాటు చేసిన కట్టడము (చెరసాల)

**బంధనికుడు** - చెరపట్టెడు స్వభావము కలవాడు (బందెలపోతు)

**బంధుజీవము** - చుట్టము వలె గాపాడునది (మంకెన చెట్టు)

**బంధులుడు** - కులవృద్ధికై బందుగులను జేరదీయువాడు (రంకుటాలి కొడుకు)

**బంధువు** - రక్తసంబంధముచే బంధించు వాడు (బాంధకినేయుడు - రంకుటాలి కొడుకు) స్నేహాదులచే హృదయమును బంధించువాడు (చుట్టము, జ్ఞాతి, మిత్రుడు)

**బంబోతు** - బలిసిన యెద్దు వంటివాడు, (బలిష్ఠుడు) బలిసిన యెద్దు (పెంబోతు)

**బంభరము** - బం అను శబ్దమును భరించునది (తుమ్మెద - భ్రమరము)

**బకము** - కుటిల గతికలది (కొంగ - కహ్వాము)

**బకధ్యానము** - ఏటియొడ్డున చేపలకై వేచియుండి చేసెడి కొంగ యొక్క ధ్యానము (పరులను మోసగించుటకు చేయు కృత్రిమ నటనము- కొంగజపము)

**బకవృత్తి** - ధ్యాన నిష్ఠ నటించుచు కనబడిన చేపలను గుటుక్కున మ్రింగు కొంగ మనలిక వంటి మనలిక గలవాడు (బకచరుడు - మోసగాడు)

**బకవైరి** - బకాసురుని సంహరించినవాడు (భీముడు)

**బటువడిదము, బటువుకత్తి** - గుండ్రని కత్తివంటిది (సుదర్శన చక్రము)

**బటువుకైదువు** - గుండ్రని ఆయుధము (బటువువాలు - సుదర్శనచక్రము)

**బటువుకైదువుజోదు** - గుండ్రని యాయుధము గల యోధుడు (విష్ణువు)

**బటువు గుబ్బలి** - గుండ్రని పర్వతము (చక్రవాళము)

**బటువు గువ్వ** - గుండ్రని పక్షి (చక్రవాకము - జక్కవ)

**బటువుమల** - బటువు గుబ్బలి (చక్రవాళ పర్వతము)

**బటువు వాలు తాల్పు** - బటువు వాలును ధరించినవాడు (చక్రధారి)

**బడబాగ్ని** - సముద్రమందలి అగ్ని బడబ = గోడిగ (ఆడుగుఱ్ఱము) ఆడు గుఱ్ఱము ముఖమున నుండునది

**బడిశము** - చేపలను పట్టు గాలము (మత్స్య వేధనము)

**బధిరకర్ణోపదేశము** - చెవిటివాని చెవి వద్ద రహస్యోపదేశము చేయుట

**బధిరుడు** - బాధింపబడిన శ్రవణ సామర్థ్యము కలవాడు (చెవిటివాడు - ఏడుడు)

**బద్ధముష్టి** - బిగవట్టిన పిడికిలి కలవాడు (పిసినిగొట్టు)

**బద్ధవైరము** - హృదయమున నాటియున్న పగ

**బన్నసరము** - నానా మణులు గ్రుచ్చిన హారము (బన్నసరి)

**బభ్రువాహనుడు** - పచ్చని గుఱ్ఱముల పాలించువాడు (విజయ విలాసము)

**బమిపుర్వు** - పద్మముల చుట్టు తిరుగునట్టి పురుగు (తుమ్మెద - మధుపము)

**బయకాడు** - భోగస్త్రీల వెనుకనుండెడి అంగుకాడు

**బయకారము** - యౌవనమునందు బయల్పడు శృంగారచేష్టావిశేషము

**బయ్యంకలు** - గర్భిణి అయినట్లుగా (వాంత్యాది వికారములు) సూచించునవి (వేవిళ్ళు - బయకలు, బయికలు)

**బరిగిరౌతు** - పల్లము కట్టని (జీనువేయని) గుఱ్ఱము పై నెక్కువాడు

**బరిగోల** - ఏనుగును అదలించుటకై యుపయోగించెడిది (ఈటె)

**బర్కరము** - తృణాదికమును మేయు కోడెప్రాయపు పశువు

**బర్పటము** - బాగుగా వ్యాపించునది (బొబ్బరపైరు)

**బర్హము** - నృత్యముచేత వృద్ధిబొందునది (నెమలి పురి)

**బర్హి** - పింఛము కలది (నెమలి - బర్హిణము)

**బర్హిపుష్పము** - నెమలి పింఛము వంటి పువ్వులు గలది (గ్రంధిపర్ణి - మాచిపత్రి)

**బర్హిర్ముఖుడు** - అగ్ని ముఖముగా గలవాడు (వేల్పు - దేవత)

**బర్హిశ్శుష్మ** - దర్భలు బలముగా గలది (అగ్ని)

**బర్హిష్కము** - దర్భచేత చేయబడినది

**బర్హిష్కేశుడు** - జ్వాలలే కేశములుగా గలవాడు, దర్భలు వెంట్రుకలుగా గలవాడు (అగ్ని సతనాల్కల జేజే)

**బలదేవుడు** - బలముచే ప్రకాశించువాడు, బలముగల దేవుడు (వాయువు, బలరాముడు)

**బలద్విట్టు** - బలారాతి (ఇంద్రుడు)

**బలప్రసువు** - బలరాముని గన్నతల్లి (రోహిణి - వసుదేవుని భార్య)

**బలభద్రుడు** - బలముచే శ్రేష్ఠుడైనవాడు (బలరాముడు - వాలి)

**బలభిత్తు** - బలాసురుని సంహరించినవాడు (ఇంద్రుడు)

**బలరాముడు** - బలముచే జనులను రమించువాడు (బలభద్రుడు - శ్రీకృష్ణుని అన్న)

**బలసూదనుడు** - బలుడను రక్కసుని జంపినవాడు (ఇంద్రుడు)

**బలాధ్యక్షుడు** - బలమునకు అధిపతి (సేనాధిపతి)

**బలారాతి** - బలాసురుని శత్రువు (ఇంద్రుడు - వాసవుడు)

**బలాహకము** - విష్ణుదేవుని గుఱ్ఱములలో నొకటి (వలాహకము) ఒకానొక ప్రళయ మేఘము

**బలిధ్వంసి** - బలి చక్రవర్తి యొక్క ప్రాభవమును ధ్వంసము చేసినవాడు (విష్ణువు)

**బలినందనుడు** - బలియొక్క పుత్రుడు (బాణాసురుడు)

**బలిపీఠము** - బలి కొరకైన వేదిక (వధ్యశిల - దిష్టదిబ్బెము)

**బలిపుష్టము** - బలిగా నీబడిన పిండముచే పోషింపబడునది (కాకి)

**బలిబంధనుడు** - బలి చక్రవర్తిని బంధించిన వాడు (విష్ణువు)

**బలిభుక్కు** - బల్యన్నమును తినునది (కాకి)

**బలిముఖము** - వలీముఖము (కోతి బలీముఖము)

**బలిసద్మము** - బలియొక్క నివాసగృహము

**బలిష్ఠము** - మిక్కిలి బలముగలది

**బలికము** - కప్పునది (చూరు)

**బలీవర్ధము** - కంఠమున వళులు గలది (ఎద్దు)

**బలునంజ మెకము** - పెద్దపాదము గల మృగము (ఏనుగు - బలువంజమెకము)

**బలు పొడతోలు దాల్పు** - మచ్చలు గల చర్మమును కట్టిన దొడ్డసామి (శివుడు)

**బలువంజమెకము** - బలు హజ్జమెకము (ఏనుగు - స్థూల పాదము)

**బలుహజ్జ మెకము** - స్థూలమగు పాదము గల మృగము (ఏనుగు)

**బల్చారల మెకము** - గొప్పచారలు గల జంతువు (మువ్వన్నె మెకము - చిత్రకాయము - పులి)

**బల్తల మెకము** - పెద్దతల గల మృగము (ఏనుగు - కుంభి)

**బవినీడు** - జాతరయందు సుద్దులు చెప్పుచు (బవినీనృత్యము) బవినియాడువాడు

**బష్కయణి** - ఆఱు నెలలు పైబడిన దూడగలది (తరిపియావు) బహుకాలము ముందీనినది

**బహిర్లాపి** - ఉత్తరము వేరుమాటల యందణగి యుండునట్లు అడుగునట్టి విషమ సమస్య

**బహిష్కృతుడు** - సమాజము నుండి వెలివేయబడినవాడు

**బహుకరి** - అన్నిటిని తుడిచివేయునది (చీపురు)

**బహుకరుడు** - సహస్రకరుడు (సూర్యుడు)

**బహుగంధద** - మిక్కుటమగు పరిమళము నొసగునది (కస్తూరి)

**బహుత్వచము** - ఎక్కువ మందమైన పట్టకలది (భూర్జపత్ర వృక్షము)

**బహుధారము** - పెక్కు వాదరలు కలది (భిదురము - వజ్రాయుధము)

**బహునాదము** - పెద్ద ధ్వని కలది (శంఖము - కంబువు)

**బహుపాత్తు, బహుపాదము** - చాల ఊడలు కలది (మఱ్ఱిచెట్టు - న్యగ్రోధము)

**బహుప్రజము** - ఎక్కువ (సంతు) పిల్లలు కలది (పంది)

**బహుమంజరి** - పెక్కు ఎన్నులు కలది (తులసి)

**బహుమార్గగ** - పలుదారుల బోవునది (జారిణి, గంగ)

**బహురూపము** - రంగురంగుల రూపము కలది (ఊసరవెల్లి)

**బహురూపుడు** - అనేకావతారము లెత్తిన వాడు (విష్ణువు)

**బహురోమ** - ఎక్కువ రోమములు కలది (మేక)

**బహురోమము** -ఎక్కువ బొచ్చుకలది (గొఱ్ఱె)

**బహుళము** - సంధి నిత్యముగా వచ్చుట, రాకుండుట, సంధివచ్చి యొక రూపము రాక మరియొక రూపము గలుగుట, విదిలో జెప్పిన స్థలమున గాక యితర స్థలమునవచ్చుట (వ్యాకరణము) కృష్ణపక్షము (బహుళపక్షము)

**బహువచనము** - ఒకటి కంటె నధికముగా దెల్పునది

**బహువ్రీహి** - అన్యపదార్థ ప్రధానము బహువ్రీహి సమాన పూర్వోత్తరపదములు రెండును విగ్రహవాక్యమున నేక విభక్తి కలిగియుండునది - సమానాధికరణము, భిన్న విభక్తికములగునది- వ్యధికరణము)

**బహుశ్రుతుడు** - అనేక శాస్త్రములు అధ్యయనము చేసినవాడు

**బహుసువు** - పెక్కు బిడ్డలుగన్న యాడుది. ఎక్కువ పిల్లలనీనునది (పంది)

**బాంధకినేయుడు** - బంధకి (రంకులాడి) యొక్క కొడుకు (బంధులుడు)

**బాకినోటి మెకము** - విశాలమైన నోరుగల మృగము(సింహము-బాకినోరు మెకము)

**బాగులాడి** - ఒప్పులాడి (అందగత్తె)

**బాటసారి** - త్రోవ నడచువాడు (పాంధుడు - తెరువరి)

**బాడబము** - బడబా సమూహము, ఆడు గుఱ్ఱము ముఖమునందుండునది (బడబానలము)

**బాడబుడు** - బడబాగ్నివలె దృప్తిలేని వాడు (బ్రాహ్మణుడు - బాపడు)

**బాడవేయులు** - బడబ రూపముననున్న సంజ్ఞాదేవికి (సూర్యునివలన) కలిగినవారు (నాసత్యుడు, దస్రుడు - అశ్వినులు)

**బాణజిత్తు** - బాణాసురుని జయించినవాడు (కృష్ణుడు)

**బాణధి** - బాణములను ధరించునది (అమ్ములపొది)

**బాణాశ్రయము** - బాణముల కాశ్రయమైనది (అమ్ములపొది, విల్లు)

**బాణాసనము** - బాణముల కాసనమైనది (విల్లు)

**బాదరాయణ సంబంధము** - మీయింట రేగుచెట్టుండుట చేతను మాబండి చక్రము రేగు కఱ్ఱదగుటచేతను మన యిరువురికి

సంబంధము కలదనుట (బాదర సంబంధము కల్పించుకొన్న సంబంధము)

**బాదరాయణుడు** - బదరీ వనము నివాసముగా గలవాడు (వ్యాసుడు)

**బానసీడు** - వంట చేయువాడు (వంటవాడు - పాచకుడు)

**బాబారౌతు** - గుజ్జము వాహనముగా గలవాడు (కుబేరుడు)

**బారపోయు** - చేయి చాగునంత కొలది నూలువడకు

**బారమేనుల ప్రోడ** - ద్వాదశాత్ముడు (సూర్యుడు)

**బారసాల** - పండ్రెండవ దినమున బిడ్డకు పేరుపెట్టుకొనుట (నామకరణము)

**బార్హద్రథుడు** - బృహద్రథుని కుమారుడు (జరాసంధుడు)

**బార్హస్పత్యము** - బృహస్పతికి సంబంధించినది

**బాల** - పదునారేండ్లకు లోబడిన కన్య

**బాలకుడు** - పదునారేండ్ల వయస్సు ధాటని పిల్లవాడు (మాణవకుడు)

**బాలతంత్రము** - మంత్రసాని తనము (కుమార భృత్యము)

**బాలరాజము** - చిన్నదయ్యు ప్రకాశించు పిల్లి కన్నతనము (వైడూర్యము)

**బాలసాత్మ్యము** - శిశువులకు సుఖము నిచ్చునది (పాలు)

**బాలిశుడు** - తనకు జేసిన గౌరవమును ఎఱుచుకొనువాడు (మూర్ఖుడు)

**బాలేష్టము** - దీనిపండ్లు పిల్లలకు ఎక్కువ ఇష్టమైనవి (రేగుచెట్టు)

**బాల్యము** - బాలభావము

**బాసవాలు** - పలుకే ఆయుధమైనవాడు (వేల్పు, ఋషి)

**బాసవాల్దంటులు, బాసవాల్దిట్టలు** - బాసయే వాలుగా గల ప్రోడలు (మునులు)

**బాసవాల్దొర** - వాక్కు ఆయుధముగా గల దేవతలకు ప్రభువు (ఇంద్రుడు)

**బాసవాల్ముద్దియ** - వేల్పుగొమ్మ

**బాసికము** - వివాహమందు వధూవరులకు నొసట గట్టెడి (బంగారు బిళ్ళ) ఆభరణ విశేషము (లలామకము)

**బాహాబాహి** - ఒకరినొకరు చేతులతో కొట్టుకొనుచు చేయు పోరాటము (బాహూబాహవి)

**బాహుజుడు** - విరాట్పురుషుని బాహువుల నుండి పుట్టినవాడు (క్షత్రియుడు)

**బాహుద** - తనయందు స్నానము చేయగా లిఖిత ఋషికి బాహువుల నిచ్చినది (సైతవాహిని - బాహుదానది)

**బాహుదంతేయుడు** - చతుర్దంతియగు ఐరావతము వాహనమైనవాడు (ఇంద్రుడు)

**బాహుదము** - భుజమునకు శోభనిచ్చునది (బాహుపురి - భుజకీర్తి)

**బాహులేయుడు** - షట్కృత్తికల కుమారుడు (కుమారస్వామి)

**బాహ్లికము** - బాహ్లిక దేశపు గుజ్జము, (బాహ్లీకము - బాహ్లిజము) బాహ్లిక దేశమున విరివిగా దొరకునది (ఇంగువ - బాల్హాయనము)

**బింగురాజు** - కాకివలె నల్లగా నుండి వెక్కిరించెడు పక్షి (వెక్కిరింత పక్షి)

**బిందుఫలము** - జలబిందువు, ఫలాకృతిని దాల్చినది (ముక్తాఫలము - ముత్తెము)

**బిందువాసరము** - స్త్రీ గర్భవతి యైన దినము

**బింబవిమతోష్ఠి** - దొండపండునకు విరోధియగు మోవికలది

**బింబాధర, బింబోడు** - దొండపండు వంటి మోవి కల ఆడుది (చక్కనిది)

**బింబోష్ఠి** - దొండపండు వంటి పెదవి కల్గిన యాడుది

**బికిరాలమారి** - భిక్ష మెత్తుకొను స్వభావము కలవాడు

**బిడారము** - దండు గుమికూడి విడియు చోటు (శిబిరము - బస)

**బిడారు** - అక్కడక్కడ మకాము చేయుచు పోవునది (వర్తకుల గుంపు, లంబాడీ తండా)

**బిడాలము** - మూషికములను ఛేదించునది (పిల్లి)

**బిడౌజుడు** - శత్రువులను భేదించు పరాక్రమము కలవాడు (ఇంద్రుడు)

**బిత్తరి** - శృంగార చేష్టలు కలయాడుది (కులుకులాడి)

**బిత్తరిజింక తాల్పు** - చక్కని లేడిని ధరించినవాడు (శశాంకుడు - చంద్రుడు)

**బిత్తలి** - దిసమొలది, (దిగంబరి) దిసమొల వాడు (దిగంబరుడు)

**బిబ్బిలికాయ** - ఆడుదాని కాలి మూడవ వ్రేలి యాభరణము (వరుసగా అయిదు వ్రేళ్ళకు పెట్టుకొను ఆభరణములు వీరమద్దె, మట్టె, బిబ్బిలికాయ, పిల్లాడి, చిటిబొద్దులు)

**బిబ్బోకము** - నాయికకు గర్వాతిశయముచే ఇష్టవస్తువులందు సైతము కలిగెడు అనాదరము (ఒకానొక విలాస చేష్ట)

**బిబ్బోకిని** - బిబ్బోకమును ప్రకటించు స్త్రీ (విలాసవతి)

**బిలకారి** - బొరియ చేయునది

**బిలవాసి** - కన్నములో ఉండునది (పాము)

**బిలశయము, బిలేశయము** - రంధ్రమున నిద్రించునది (పాము, ఎలుక, మొ॥)

**బిల్లవాలు** - గుండ్రని ఆయుధము (సుదర్శనము - చక్రాయుధము)

**బిల్లిక** - సూర్య చంద్రుల బింబము

**బిసకంఠి** - తామరతూడు వంటి పొడవగు మెడ కలది (బకము)

**బిసతంతువు** - తామరతూడు నందలి సన్నని పోగు

**బిసరుహము** - తామర తీగకు బుట్టినది (పద్మము - బిసప్రసూనము)

**బీజకృత్తు** - వీర్యవృద్ధి కలిగించునది

**బీజకోశము** - బీజమునకు కోశము వలెనుండునది (తామరదిమ్మ, కాయ)

**బీజపూరము** - గింజలచేత పూరింప బడియుండునది (మాదీఫలము - బీజకము)

**బీజరత్నము** - దీని విత్తులు రత్నముల వలె నుండును (దానిమ్మ)

**బీజవాపము** - విత్తనములు చల్లుట

**బీజ్యుడు** - మంచి కులమునందు జన్మించినవాడు (కులీనుడు)

**బీభత్సము** - రోత కల్గించునది

**బుజము పుట్టువు** - బ్రహ్మదేవుని భుజమున పుట్టినవాడు (క్షత్రియుడు)

**బుడుతనెలతాలువు** - బాలచంద్రుని తలపై దాల్చినవాడు

**బుద్ధిమెకము** - తెలివిగల జంతువు (నక్క)

**బుద్ధుడు** - సర్వము క్షణభంగురమను యోగ్య బుద్ధికలవాడు

**బుధరత్నము** - బుధునికిష్టమగు గరుడపచ్చ

**బుధుడు** - అన్నిటి నెరిగినవాడు (విద్వాంసుడు), తారాచంద్రుల కుమారుడు (చంద్రసుతుడు)

**బువ్వము** - బంధువులందరు ఒకే వంక్తిలో గూర్చుండి వేడుకగా భుజించు పెండ్లివిందు (బువ్వము బంతి)

**బువ్వకుడుపు** - పసిపిల్లలకు తొలిసారి అన్నము తినిపించు వేడుక (అన్నప్రాశనము)

**బూచిగాడు** - వికృతమైన ఆకారము గల కుక్క

**బూచులదొర, బూచులరాయుడు, బూచులరేడు, బూచుల యెకిమీడు** - పిశాచములను పాలించువాడు (బూచులకు దొర - శివుడు)

**బూమెకత్తె, బూమెలాడి** - మాయమాటలాడు ఆడుది (వంచకురాలు)

**బూమెలాడు** - మారువేషమున మసలు వాడు, టక్కరివాడు

**బృందారకుడు** - మంచి సమూహము కలవాడు (వేల్పు), అందరలో మేటిగా వెలయువాడు (శ్రేష్ఠుడు)

**బృందావనము** - కృష్ణుడు నివసించెడు తులసితోట

**బృంహితము** - ఏనుగు యొక్క ఘీంకారము

**బృంహితుడు** - వృద్ధి పొందినవాడు

**బృహత్కుక్షి** - పెద్ద కడుపు కలవాడు (బాన కడుపువాడు - తుందిలుడు)

**బృహదారణ్యకము** - శుక్లయజుర్వేదాంతర్గత శతపథ బ్రాహ్మణమునం దంతిమ భాగమునందలి ఆరు అధ్యాయములు బృహదారణ్యకోపనిషత్తు రెండధ్యాయములు మధుకాండము 3 4 అధ్యాయములు మునికాండము, చివరి రెండధ్యాయములు ఖిలకాండము ఓం పూర్ణమదః శాన్తి మంత్రము

**బృహద్ధలము**-పెద్ద నాగలి(మహాలాంగలము)

**బృహద్భానువు** - అధికములైన కిరణములు కలవాడు (అగ్ని)

**బృహద్వ్యాధి** - శరీరమును తెగదినెడు కుష్ఠరోగము (పెద్దరోగము)

**బృహస్పతి** - వాక్కునకు ప్రభువైనవాడు (గీష్పతి)

**బృహస్పతివారము** - గురువారము (బేస్తవారము - లక్ష్మివారము)

**బెండుమానిసి** - బెండువంటి మానిసి (దుర్బలుడు)

**బెట్టిదురాలు, బెడిదురాలు** - బెడిదము కలయాడుది (కఠినురాలు)

**బేల** - పదునారు సంవత్సరముల వయస్సు కల పడుచు (అమాయిక)

**బేసరి** - స్త్రీలు ముక్కునకు పెట్టుకొను నగ (ముంగర, అడ్డబాస)

**బేసికంటి** - విషమ సంఖ్యగల కన్నులు గలవాడు (శివుడు - అసమాక్షుడు)

**బేసికంటి దొరవిల్లు** - తిగకంటి దేవరకు విల్లైనది (మేరు పర్వతము)

**బేసికంటిమామ** - బేసికంటి వేల్పునకు మామయైనవాడు (హిమవంతుడు)

**బేసికంటి వేల్పు** - విషమ సంఖ్యగల (3) కన్నులు గల దేవుడు (శివుడు - ముక్కంటి)

**బేసికైదువుజోదు** - విషమ సంఖ్యగల (5) యాయుధములు గల వీరుడు (మన్మథుడు - పంచబాణుడు)

**బేస్తవారము** - బృహస్పతి వారము (గురువారము)

**బేహారి, బేహారి** - వాణిజ్యము చేయువాడు (వర్తకుడు - వణిజుడు)

**బొండకొయ్య** - తప్పుచేసిన వారి పాదములకు తగిలించెడి కొయ్య సంకెల (బొండమాను)

**బొందడీడు** - కవచమును తొడిగినవాడు (కత్తళీడు), కంచుకము (చొక్కా) తొడిగి కొన్నవాడు.

**బొక్కలాడు** - పుట్టల యందలి కన్నములలో నివసించువాడు (కన్నగాడు - పాము)

**బొచ్చుమెకము** - శరీరమంతయు బొచ్చుగా పెరిగిన వెండ్రుకలుగల మృగము (భల్లూకము - ఎలుగుబంటి)

**బొజ్జదేవర, బొజ్జవేల్పు** - కడుబొజ్జగల సామి (వినాయకుడు)

**బొట్టెకోల** - తామర మొగ్గవంటి మొనగల బాణము

**బొడ్డనబావి** - నడుమ పిల్లనూయిగల కోనేరు

**బొబ్బమెకము** - బొబ్బవేయు మెకము (సింహము)

**బొమముడిపాటు** - కోపముచే కనుబొమలు ముడిపడు

**బొమ్మగుడ్డు** - బొమ్మకు గుడ్డువంటిది (భువనగోళము - బ్రహ్మాండము)

**బొమ్మరాకాసి** - బాపన దయ్యము బ్రహ్మరాక్షసుడు - బొమ్మరక్కసి

**బొమ్మరిల్లు** - బాలికలాడుకొనుటకై బొమ్మల నుంచుకొనెడి చిన్న యిల్లు

**బొమ్మలాట** - తెరవెనుక పాత్రానుకూలముగా ఆడుచూ బొమ్మలచే నాడించెడు నాటక విశేషము

**బొమ్మవెట్టు** - చేసిన పనికి వంకలు పెట్టు (బొమ్మలు కట్టు)

**బొరియకానుపు, బొరియ చూలి** - పుట్ట నుండి పుట్టినవాడు (పుట్టబుట్టువు - వాల్మీకి)

**బొల్లడు** - తెల్ల బొల్లి గుఱ్ఱము

**బొల్లిగ్రద్ద, బొల్లినెమ్మెగము పిట్ట, బొల్లిమోర పుల్గు** - తెల్లని గద్ద (బొల్లిపుల్గు) గరుత్మంతుడు

**బొల్లిమోర మెకము, బొల్లి మొకము మెకము** - బొల్లి మొకము గల మెకము (ఎలుగుబంటి)

**బోధకరుడు** - ప్రాతఃకాలమున రాజులను నిద్రనుండి మేల్కొలుపువాడు (వైతాళికుడు), బోధచేయువాడు

**బోధిద్రుమము** - బుద్ధునకు జ్ఞానమును కలుగజేసిన వృక్షము (రావిచెట్టు)

**బోనకాడు** - అన్నము చేసి పెట్టువాడు (వంటవాడు - పాచకుడు)

**బోనపుట్టిక** - అన్నము భక్ష్యములు మున్నగునవి యుంచుకొను గంప

**బోరప్రాకుడు** - బోరచే ప్రాకుచు పోవునది (పాము)

**బౌద్ధమతము** - బుద్ధుడు స్థాపించిన మతము

**బౌద్ధము** - బుద్ధునిచే చెప్పబడిన శాస్త్రము (బుద్ధుడుపదేశించినవిగా భావింపబడు బౌద్ధమతాంశములకు పీఠకము లాధారమగుచున్నవి 1 సుత్తపీఠకము, 2 వినయ పీఠకము అభిధమ్మ పీఠకములు - త్రిపీఠకములు సుత్త పీఠకము 5 (భాగములు) నికాయములు దీఘనికాయము, మజ్ఝినికాయము, సంయుత్త నికాయము, అంగుత్తర, బుద్ధకనికాయము, వినయపీఠకము, 3 భాగములు 1 సుత్తవిభంగము (పారాజికము, పాచిత్తీయమని మరల రెండు భాగములైనవి, 2 ఖండకము - మహావగ్గము, చుల్లవగ్గము నని రెండయ్యెను 3 పరివారము = 5

అభిదమ్మపీరకము ఏడు భాగములైనది 1 ధమ్మసంగణి, 2 విభంగము, 3 కథావత్తు, 4 పుగ్గల పణ్ణత్తి, 5 ధాతు, 6 యమకము, 7 పట్ఠాణము

**బ్రద్ధలవారు** - వేత్రధరులైన రాజసేవకులు (బంట్రౌతులు, గృహశాఖవారు)

**బ్రధ్నుడు** - తన తేజస్సుచే నితర తేజస్సులను కట్టివేయువాడు (శివుడు, సూర్యుడు)

**బ్రహ్మ** - సృష్టికార్యము ద్వారా ప్రజలను వృద్ధి పొందించువాడు (చతుర్ముఖుడు)

**బ్రహ్మకల్పము** - మధుకైటభుల మెదడు నుండి మేదిని యేర్పడి సృష్టి చేయబడిన కాలము (సృష్టియందొక కాలము)

**బ్రహ్మకాయ** - వట వట వదరెడు వాడు

**బ్రహ్మకుండము** - బ్రహ్మచే నిర్మింపబడిన సరస్సు

**బ్రహ్మచర్యము** - బ్రహ్మజ్ఞానము కొరకైన వర్తనము

**బ్రహ్మచారి** - బ్రహ్మచర్య వ్రతము నందుండు వాడు

**బ్రహ్మజారుడు** - బ్రాహ్మణ స్త్రీ యొక్క రంకు మగడు

**బ్రహ్మజుడు** - పరబ్రహ్మము నుండి జనించినవాడు (చతుర్ముఖుడు)

**బ్రహ్మజ్ఞానము** - తత్త్వమస్యాది మహావాక్యోప జన్యమై ప్రతిఫలించిన వృత్తి యం దారూఢమైన జ్ఞానము

**బ్రహ్మతీర్థము** - శివునిచే ఖండింపబడిన బ్రహ్మయొక్క పంచమ ముఖము పడిన ప్రదేశము

**బ్రహ్మనిర్వాణము** - పరబ్రహ్మము నందు లయించి పొందెడు విశ్రాంతి (మోక్షము)

**బ్రహ్మనిష్ఠుడు** - పరబ్రహ్మమున నిష్ఠగలవాడు (బ్రహ్మభూతుడు)

**బ్రహ్మపుత్ర(ము)** - అమోఘాశాంతనవులకు బ్రహ్మ తేజమున శిశువుగా జన్మించి పర్వతముల మధ్య జలరూపమున వృద్ధి పొందిన నది (బ్రహ్మపుత్రానది - పరశురాముని మాతృహత్యాపాతకమును పోగొట్టిన నది)

**బ్రహ్మపుత్రుడు** - బ్రహ్మయొక్క మానసమున బుట్టినవాడు (నారదుడు)

**బ్రహ్మ బంధువు** - కర్మహీనుడగు బ్రాహ్మణుడు (బ్రాహ్మణ బ్రువుడు)

**బ్రహ్మబిందువు** - వేదాధ్యయనమున రాలిన నోటి తుంపర

**బ్రహ్మబ్రువాణుడు** - తాను బ్రాహ్మణుడనని చెప్పుకొనువాడు

**బ్రహ్మభూతుడు** - బ్రహ్మత్వము నొందినవాడు

**బ్రహ్మమీమాంస** - తత్త్వ శాస్త్రమునందలి బ్రహ్మ పదార్థ విచారము (వేదాంత విచారము)

**బ్రహ్మముడి** - పాణిగ్రహణ కాలమందు నూతన వధూవరుల వస్త్రాంచలములను కలిపి పురోహితుడు వేయుముడి

**బ్రహ్మమేఖలము** - బ్రహ్మచారులు మౌంజిగా నుపయోగించెడు ఒక దినుసు కసవు (ముంజెగడ్డి)

**బ్రహ్మయజ్ఞము** - పితృతర్పణమునకు ముందు చేయు నొకక్రియ, వేదమును వల్లించుట

**బ్రహ్మరంధ్రము** - బ్రహ్మ ప్రాపకమగు రంధ్రము (నడినెత్తి - మాడపట్టు)

**బ్రహ్మరథము** - బ్రాహ్మణులు సిద్ధిపొందిన సన్న్యాసులను మోసికొనిపోవు శవ వాహనము

**బ్రహ్మరాత** - తెలిసికొనుటకు సాధ్యము కాని (నొసటి. - చిందరవందర) వ్రాత

**బ్రహ్మలిపి** - తలపుఱ్ఱెపై బ్రహ్మచే వ్రాయ బడిన

వ్రాత తెలిసికొనుటకు సాధ్యము కాని వ్రాత (బ్రహ్మరాత)

**బ్రహ్మవర్చసము** - వేదాధ్యయనాదికము వలన కల్గిన తేజస్సు

**బ్రహ్మశిరము** - అగస్త్యియను ముని అగ్ని వేశున కెరింగించిన యస్త్రము ద్రోణుడు అర్జునునకు నేర్పిన అస్త్రము

**బ్రహ్మసాయుజ్యము** - పరబ్రహ్మము నందు లీనమగుట

**బ్రహ్మసువు** - బ్రహ్మనైనను చలింప జేయు వాడు (మన్మధుడు)

**బ్రహ్మసూత్రము** - బ్రాహ్మణులు ధరించెడు యజ్ఞసూత్రము (జందెము)

**బ్రహ్మ సూత్రములు** - బ్రహ్మమును తెలుపుటకు సూత్రరూపముగా రచింప బడిన ఒక వేదాంత గ్రంధము (నాల్గు అధ్యాయములు కలది 555 సూత్రములు గల ఈ గ్రంధమునకు శ్రీశంకరులు శారీరక మీమాంస, రామానుజులు శ్రీ భాష్యమును, వల్లభాచార్యులు అణుభాష్యమును వెలువరించిరి అద్వైత సిద్ధాంతము శంకరులదికాగా కేవలాద్వైతము వల్లభులిది)

**బ్రహ్మస్తేయము** - మోసము చేసి బ్రహ్మ విద్యను సంపాదించుట

**బ్రహ్మహత్య** - బ్రాహ్మణుని చంపుట, దాని వలన కలిగిన దోషము

**బ్రహ్మంజలి** - బ్రహ్మము = వేదము, వేద పారమందు మ్రొక్కుటకై మోడ్చిన యంజలి (వేదము కొరకు జేసిన యంజలి)

**బ్రహ్మండము** - భువనగోళము

**బ్రహ్మత్మభువు** - బ్రహ్మదేహము నుండి పుట్టినది (గుఱ్ఱము)

**బ్రహ్మవర్తము**-హస్తినాపురమునకు వాయవ్య భాగమున నుండెడు దేశ విశేషము

**బ్రహ్మసనము** - పరబ్రహ్మధ్యానము కొరకైన యాసనము

**బ్రాహ్మణకుడు** - అయోగ్యుడగు బ్రాహ్మణుడు (బ్రాహ్మణమాత్రుడు)

**బ్రాహ్మణములు** - మంత్ర వ్యాఖ్యాన రూపమగు వేద భాగములు

**బ్రాహ్మణబ్రువుడు** - జాతి మాత్రుడగు బ్రాహ్మణుడు

**బ్రాహ్మణి** - బ్రాహ్మణుని భార్య, బ్రాహ్మణ స్త్రీ

**బ్రాహ్మణుడు** - బ్రహ్మ కులమున బుట్టిన వాడు

**బ్రాహ్మము** - సదాచారము గల వరునకు నూతన వస్త్రాదులచే నలంకరించిన కన్యను సమంత్రకముగా నొసగిచేయు వివాహము

**బ్రాహ్మముహూర్తము** - సూర్యోదయమునకు ముందుకాలము

**బ్రాహ్మి** - బ్రహ్మ యొక్క భార్య (సరస్వతి - బ్రహ్మణి)

**భంకారి** - భమ్మను ధ్వని చేయునది (అడవి యీగ - భంగారి)

**భంగాసము** - అలలలో వృద్ధి జెందునది (ఒక దినుసు చేప)

**భంజళి, భంజళిక** - పాము వలె మెలికలు తిరుగుచు పోయెడి అశ్వగతి విశేషము

**భంభము** - భమ్మను ధ్వనిచే నొప్పునది (అడవి యీగ - జోరీగ)

**భంభరాలిక** - భం భమ్మను ధ్వని చేయు కీటకము (దోమ)

**భక్తకారుడు** - అన్నము వండువాడు (వంటవాడు)

**భక్తదాసుడు**- అన్నమునకు పనిచేయువాడు

**భక్తవత్సలుడు** - భక్తులయందు వాత్సల్యము (ప్రేమ) గలవాడు (భగవంతుడు)

**భక్తియోగము** - జీవాత్మను పరమాత్మ యందైక్యము చేయు భక్తి రూపమైన మోక్షోపాయము

**భక్ష్యకారుడు** - తినుబండములు చేసి అమ్ముకొని జీవించువాడు (భక్ష్యం కారుడు)

**భగందరము** - మర్మస్థానమందలి వ్రణము

**భగణము** - నక్షత్రముల సమూహము (మొదట) గురువు రెండు లఘువులు గలది (ఛందశ్శాస్త్ర సాంకేతిక గణము)

**భగము** - పురుషులచే నాశ్రయింపబడునది (యోని), మాహాత్మ్యము, ధైర్యము, కీర్తి, సంపద, జ్ఞానము, వైరాగ్యము అను ఆరింటి సమూహము

**భగవంతుడు** - సంపూర్ణమైన మాహాత్మ్యము, ధైర్యము, కీర్తి, సంపద, జ్ఞానము వైరాగ్యము అను ఆఱును కలవాడు (బుద్ధుడు), ఐశ్వర్యాదికము గలవాడగుటచే బూజ్యుడైనవాడు (శివుడు, విష్ణువు)

**భగవద్గీత** - అర్జునునకు శ్రీకృష్ణుని రూపుగల భగవంతుడు పదునెనిమిది యధ్యాయములలో శ్రీకృష్ణుని రూపుగల భగవంతు డుపదేశించిన వేదాంతసారము గల గ్రంథము

**భగిని** - తోడబుట్టినది (సోదరి), అదృష్టవంతురాలగు స్త్రీ

**భగినిక** - కడపటి చెల్లెలు

**భగినీయుడు** - తోడబుట్టిన దానికొడుకు (మేనల్లుడు భాగినేయుడు)

**భగీరథ ప్రయత్నము** - భగీరథుని యొక్క యత్నము వంటి ప్రయత్నము (విడువని పూనిక)

**భగుడు** - జనులచే సేవింవబడువాడు (పుష్యమాసమున భగుడనబడు ఆదిత్యుని పరివారము స్ఫూర్జుడు, అరిష్టనేమి, ఊర్ణుడు, ఆయువు, కర్కోటకుడు, పూర్వజిత్తి - పన్నిద్దరు సూర్యులలో నొకడు)

**భగోలము** - నక్షత్ర గోళము

**భగ్నసంధికము**-శిధిలములైన అంగములకు పుష్టినొసగునది (మజ్జిగ)

**భట్టారకవారము** - భట్టారకుడు = భానుడు (భానువారము - ఆదివారము)

**భట్టారకుడు** - భటులచే యుద్ధము నుండి తరించువాడు, శత్రురాజుల సైన్యమును హింసించువాడు (రాజు)

**భట్టిని** - నాట్యపరిభాషయందు రాజు భార్య, బ్రాహ్మణుని భార్య (బ్రాహ్మణి)

**భద్రకము** - మేలుకూర్చునది

**భద్రకంభము** - మంగళార్థము రాజ ద్వారములో ఉంచిన జలభరితమైన హేమ కలశము

**భద్రదారువు** - మంగళప్రదమైన చెట్టు (చక్కని చెట్టు-దేవదారువు)

**భద్రపర్ణి** - శుభప్రదమైన ఆకులు కలది ("గుమ్మడు' ' మొక్క)

**భద్రపీఠము, భద్రాసనము** - లోకహితము కొరకు అధిష్ఠింపబడిన మణిమయా సనము (రాజుగద్దె - సింహాసనము)

**భరణ్యువు** - జీతమిచ్చి పోషించువాడు (ప్రభువు)

**భరతపుత్త్రకుడు** - భరతమునికి పుత్రుని వంటి వాడు (నటుడు)

**భరతర్షభుడు** - భరతవంశస్థులలో శ్రేష్ఠుడు

**భరతవర్షము** - భరతుడు పాలించిన దేశము (అజనాభమను దేశమును పాలించిన జయంతీ ఋషభుల కుమారుడు ఇతనిని బట్టియే భరతవర్షమను పేరు వచ్చినది ఇతని సోదరులు కుశావర్తుడు ఇలావర్తుడు, బ్రహ్మావర్తుడు, బ్రహ్మావర్తుడు, ఆర్యావర్తుడు, మలయకేతువు, భద్రసేనుడు, విదర్భుడు, వీరు పాలించిన ఆయా భరతవర్షభాగములకు వీరి పేరులే నిలిచినవి

**భరతవాక్యము** - నాటకాంతమున దేశ క్షేమము కొరకై సూత్రధారుడు పలికెడు భరతుని ఆశీర్వాదరూపమైన వాక్యము (నాటకాంతశ్లోకము)

**భరతుడు** - శకుంతలా దుష్యంతుల సుతుడు (ఆకాశవాణి నీ పుత్రుడే వీనిని భరింపుమని దుష్యంతునితో పలుకుటచే భరతుడైనవాడు (కౌరవ పాండవరాజ వంశములకు కర్త 2 మరుత్తులచే పెంచుకొనుమని భరతుని కీయబడి గృహకృత్యములందు జ౯ ని మాడ్కి నంచరించుచుండుటచే జడభరతుడైన భరద్వాజుడు ఋషభుని కుమారుడు (భరత వర్షమును పాలించినవాడు మూడవ జన్మమున అంగిరసుని యింట జన్మించి జడుని వలె సంచరించుచు ముక్తి నొందినవాడు), రాముని సోదరుడు, నరయూనదిలో గ్రుంకి అవతారమును చాలించినవాడు నాట్యశాస్త్రమును రచించినముని

**భరద్వాజము** - భరద్వాజులచే సృజింప బడినది (ఏట్రింతపక్షి - వ్యాఘ్రూటము) ఒకానొక నారీతీర్థము

**భరద్వాజుడు** - జితేంద్రియుడైనవాడు (సప్త ఋషులలో నొకడు) భరతుడు పెంచుకొనుటకు మరుత్తులచే నీయబడిన బృహస్పతి కొడుకు

**భరుజము** - భ అని అరుచునది (చిరునక్క క్షుద్రజంబుకము)

**భర్గుడు** - దుష్టులను సంహరించువాడు (శివుడు)

**భర్త** - భరించువాడు (మగడు)

భర్తృదారకుడు - నాట్యపరిభాష యందు రాజ కుమారుడు

**భర్తృదారిక** - రాజకుమారి (నాటక)

**భర్తృమతి** - జీవించియున్న మగడుగలది (ముత్తైదువు - పుణ్యస్త్రీ)

**భర్త్సనము** - పరులకు వెరపుగొలుపునట్లు పలికెడు మాట (బెదరింపు, తిట్టుట)

**భర్మము** - ఆభరణ రూపమున భరింప బడునది ( బంగారము)

**భల్లాతకము , భల్లాతము** - తాకిన వానిని బల్లెము వలె వీడించునది (నల్లజీడిచెట్టు - అరుష్కరము)

**భల్లుకము, భల్లూకము** - హింసించునది (ఎలుగుబంటి)

**భవనము** - బాలురు దీని యందు పుట్టుదురు (ఇల్లు)

**భవాదృశుడు** - నీవంటి (మీవంటి) వాడు

**భవాని** - భవుని భార్య (పార్వతి)

**భవాయని** - భవుని తలపై నుండునది (గంగ)

**భవిష్ణువు** - కాగల స్వభావము కలవాడు (భవిత) కాదగినది

**భవుడు** - ఏదేది ఉన్నదోయది తానే యగువాడు ( శివుడు)

**భవ్య** - పూజించినవారి కోర్కెల నీడేర్చునది (పార్వతి)

**భవ్యము** - కోర్కెలు సిద్ధించుటకు యోగ్య మైనది (మంగళకార్యము)

**భషకము** - మొరుగునది ( కుక్క - భషము)

**భషణము** - కుక్క మొరుగు (భషితము)

**భస్త్ర** -కొలిమిని మండించుతిత్తి (కొలిమితిత్తి)

**భస్త్రకము** - ఏటిలో వేసికొని యీదెడు తోలు సంచి (తోలుతిత్తి)

**భస్త్రికుడు** - కొలిమి తిత్తి నూదువాడు

**భస్మాంగుడు** - బూడిద పూసికొన్నశరీరము కలవాడు ( శివుడు)

**భస్మాహ్వయము** - హారతి కర్పూరము (భస్మవేధకము)

**భాండారికుడు** - భాండాగారము (సామగ్రు లుంచుకొట్టు)నకు అధికారి (భాండా గారికుడు)

**భాండి** - మంగలివాని అడపము ( మంగలి పొది)

**భాగధేయము** - రాజులకు చెల్లించెడి పన్ను (కప్పము)

**భాగరి** - భాగమును తీసికొనువాడు (వాటాదారుడు)

**భాగవతుడు** - భగవంతుని యందు భక్తి కలవాడు నాటకములందు కృష్ణుడు మొదలైన వేషములు వేయువాడు

**భాగినేయి** - తోడబుట్టినదాని (అక్క లేక చెల్లెలు) కూతురు (మేనకోడలు)

**భాగినేయుడు** - తోడబుట్టినదాని (భగిని) కొడుకు (మేనల్లుడు)

**భాగీరథి** - భగీరధునిచే భూమికి తేబడినది (గంగ)

**భాజకము** - విడదీయునది

**భాజ్యము** - భాగింపదగినది ( విడదీయ దగినది)

**భాద్రపదము** - భాద్రపదా నక్షత్రముతో కూడిన పున్నమకలది (భాద్రపద మాసము)

**భాద్రమాతురుడు** - మంచి తల్లి గల కొడుకు

**భాద్రి** - భాద్రపద మాసము నందు పౌర్ణమాసి

**భానుజుడు** - సూర్యుని కొడుకు (యముడు, శని)

**భాను(వు)డు** - ప్రకాశించువాడు (సూర్యుడు)

**భానుమంతుడు** - కిరణములు కలవాడు (సూర్యుడు)

**భానేయుడు** - కిరణములు కలవాడు (సూర్యుడు)

**భామిని** - క్రీడా సమయమున ప్రణయ కోపమును ప్రదర్శించు స్త్రీ విశేషము (కోపన)

**భారతము** - భరతుని సంబంధమైనది భరత వంశీయుల చరిత్రములు తెల్పెడు ఒక మహా గ్రంథము హిమాలయ పర్వతము నుండి దక్షిణమున నున్న హిందూ మహా సముద్రము వరకు గల దేశము (హిందూ దేశము)

**భాణము** - ఏకాంకంబు విటైక పాత్ర వర్ణకల్పిత చోరద్యూతకరాది ధూర్తేతి వృత్తంబు భారతీ వృత్తికంబు (చోర విట ద్యూతకరాదుల కల్పిత చరిత్ర గల యేకాంకిక భారతీవృత్తి తరచుగ నుపయోగింప బడుచుండును ఒక విటుడు ఓయీ ఏమను చున్నావని వల్కుచు సమాధానము చెప్పుచుండును విటుడొకడే నాయకుడు ఉ॥ పంచబాణ విజయము మొ॥)

**భారతి** - ఈ లోకమునకు భరతమునిచే తేబడినది (సరస్వతి) హాస్య శాంతాద్భుత రసములు సరళాక్షరములతో మృదువుగా జెప్పెడు కావ్యవృత్తి, ఒకానొక యతి సంప్రదాయ పదము (భారతి, పురి, తీర్ధ, అరణ్య, సరస్వతి, గిరి, పర్వత వన, ఆశ్రమి, సాగర మొదలుగా గల యతి శాఖలలోనిది

**భారద్వాజము** - భరద్వాజముని సృష్టించి నది (భరద్వాజము-ఏట్రింతపక్షి)

**భారవాహము** - బరువు మోయునది (ఎద్దు, గాడిద)

**భారూపము** - ప్రకాశ స్వరూపము (బ్రహ్మము)

**భార్గవ ప్రియము** - శుక్రగ్రహమునకు ప్రియ మైనది (రవ్వ - వజ్రము)

**భార్య** - భరింపబడునది (పెండ్లాము)

**భార్యాటికము** - ప్రియురాలు చెప్పినట్లుగా జరించునది (కణుజు)

**భార్యాటికుడు** -పెండ్లాము మాట జవదాటని వాడు

**భార్యాటుడు** - తన భార్య యొక్క జారత్వము వలన లభించెడు ధనముచే జీవించు వాడు

**భాల దర్శనుడు** - నొసట కన్నుగలవాడు (శివుడు)

**భాలువు** - రోగములు పోగొట్టువాడు (సూర్యుడు)

**భాలుకము** - హింసించునది (ఎలుగుగొడ్డు, భల్లూకము

**భాలూకము** - దారిలో అడ్డగించునది (ఎలుగుబంటి, నక్క)

**భావజుడు** - సంకల్పముచే బుట్టువాడు (మన్మధుడు)

**భావుకుడు** - తోడబుట్టిన దాని మగడు (బావమరది)

**భాషాంతరము** - ఒక భాషలోని విషయము వేరొక భాషలోనికి వ్రాయుటయు చెప్పుటయు

**భాష్యము** - వ్యాఖ్యాన గ్రంధము, మాటాడ దగినది

**భాస్కరుడు** - ప్రకాశించువాడు (సూర్యుడు)

**భాస్వంతము** - ప్రకాశము కలది

**భాస్వంతుడు** -ప్రకాశించువాడు (సూర్యుడు)

**భాస్వరము** - ప్రకాశమానమైనది

**భిండిపాలము, భిందిపాలము** - ఇనుప యలుగు గల యొక యాయుధము (భింబివాలము)

**భిక్షుకుడు** - భిక్షమెత్తుకొని జీవించెడు సన్యాసి

**భిత్తిపాతనము** - గోడను దొలిచి కూల్చునది (పందికొక్కు)

**భిన్నలింగము** - మహత్తును అమహత్తు తోడను, అమహత్తును మహత్తుతోడను బోల్చుట, (ఇంతి వనజారివలెనన) ఇంతి (ఉపమేయము) చంద్రుని వలె (ఉప మానము) లింగభేదము గలదు (వాక్య దోషములలో నొకటి)

**భిషక్పాశుడు** - వైద్యము చక్కగా దెలియ కున్నను వైద్యుడనని భావించువాడు

**భిషజుడు** - రోగ చికిత్స చేయువాడు (వైద్యుడు - అగదంకారుడు)

**భీమవిక్రాంతము** - భయంకరమైన శక్తి కలది (సింహము)

**భీమశాసనుడు** - భయంకరమైన ఆజ్ఞలు చేయువాడు (యముడు)

**భీముడు** - భయమును గలుగ చేయువాడు (శివుడు- కుంతీ పుత్రులలో రెండవవాడు)

**భీష్మసువు** - భీష్ముని గన్నతల్లి (గంగ)

**భుజంగదారకము**-పాములను ఛేదించునది (ముంగిస, నెమలి)

**భుజంగ భుక్కు** - పాములను దినునది (నెమలి)

**భుజంగ భూషణుడు** - సర్పము లలం కారముగా దాల్చినవాడు (శివుడు)

**భుజంగమము** - వంకరగా ప్రాకునది (భుజంగము - పాము)

**భుజంగుడు** - వక్రగతి కలవాడు ( విటుడు)

**భుజంగేశుడు** - పాములకు రేడు (వాసుకి, శేషాహి)

**భుజగము** - కుటిలముగా ప్రాకు(నడుచు) నది (పాము)

**భుజగాశనము** - సర్పములను దినునది (నెమలి, ముంగిస, గరుడపక్షి)

**భుజశాలి** - బాహుబలము గలవాడు

**భువనము** - దీని వలన నన్నియు గలుగును ( నీరు)

**భువనేశ్వ(రి,రుడు)** - ప్రపంచమునకు అధికారి (ణి) (పార్వతి, శివుడు)

**భూకంపము** - భూమి యొక్క చలనము

**భూగృహము** - భూమ్యంతరాలయము (నేలమాలియ - సురంగము)

**భూజము** - భూమినుండి పొడమినది (వృక్షము)

**భూజాని** - భూమి భార్యగా గలవాడు (విష్ణువు, రాజు)

**భూజుడు** - భూమికొడుకు ( నరకుడు, అంగారకుడు

**భూతదయ** - సమస్త జీవుల యందలి దయ

**భూతధాత్రి** - జీవకోటిని ధరించునది (భూమి)

**భూతనాథుడు** -భూతముల ప్రభువు(శివుడు)

**భూతయజ్ఞము** - వైశ్యదేవానుష్ఠానమునకు బిమ్మట భూతతృప్తికై కావించెడు బలి దానము

**భూతవైద్యుడు** - పిశాచములను పారద్రోలు వాడు

**భూత సంప్లవము** - యుగాంతము నందలి ప్రళయము

**భూతాత్ముడు** - సమస్త జీవులకు నాత్మయైనవాడు (పరమాత్మ)

**భూతావాసము** - భూతములకు నెలవైనది (తాడిచెట్టు)

**భూతేశుడు** - పిశాచ గణముల కధిపతి (శివుడు)

**భూదారణము** - భూమిని వ్రక్కలించునది (నాగేలు)

**భూదారము** - ముట్టెతో నేలను త్రవ్వునది (పంది- సూకరము )

**భూదేవుడు** - దేవత వలె భూమియందలి ప్రజలకెప్పుడును శ్రేయము కూర్చువాడు (నేలవేల్పు - బ్రాహ్మణుడు)

**భూధరము**-నేలను ధరించునది (పర్వతము - భూధ్రము)

**భూధరుడు** - భూమి భారమును వహించు వాడు (రాజు)

**భూపతి, భూపుడు** - భూమిని పాలించువాడు ( రాజు - భూపాలుడు)

**భూభుక్కు, భూభుజుడు** - భూమి నను భవించువాడు (రాజు)

**భూభృత్తు**-భూమిని ధరించునది (పర్వతము - నేలతాల్పు) భూమిని ధరించువాడు (రాజు)

**భూమి** - ఇందు ప్రాణికోటి పుట్టును (పుడమి)

**భూమిక** - నాట్యసిద్ధవేషము, గ్రంధాదుల పీఠిక

**భూమిజ** - భూపుత్రి (సీత, నేలచూలి)

**భూమిజుడు** - విష్ణువంశమున భూమికి బుట్టినవాడు (నరకాసురుడు)

**భూమి స్పృశుడు** - పొలములను చక్క జేయుటకై నాగేటితో భూమిని తాకువాడు (కోమటి, మనుష్యుడు)

**భూరిమాయము, భూరిమాయువు** - పెక్కు మాయలుకలది (నక్క - వంచకము)

**భూరుట్టు, భూరుహము, భూమిరుహము** - భూమి యందు మొలచునది ( చెట్టు)

**భూవరుడు** - భూమికి భర్తయైనవాడు (రాజు)

**భూశయము** - బిలములలో నివసించెడి జంతువు

**భూశ్రవసము** - భూమికి చెవి వంటిది (పుట్ట)

**భృంగము** - నీలిమను భరించునది (తుమ్మెద)

**భృంగరోలము** - తుమ్మెదవలె రొద చేయునది (కందిరీగ)

**భృంగాభీష్టము** - తుమ్మెదలకు ప్రియమైనది (మామిడిచెట్టు)

**భృంగారము** - దీనిచే జలము భరింప బడును (బంగారు గిండి)

**భృంగారి** - ఆకృతిచే తుమ్మెదను పోలునది (కీచురాయి, చిమ్మట)

**భృంగి** - ఆడుతుమ్మెద, శివుని పరిచారకు లలో ఒకడు

**భృకుంసుడు** - కనుబొమ్మల అభినయము చే భావమును ప్రకటించు స్త్రీ వేషధారి (భ్రకుంసుడు - భ్రూకుంసుడు)

**భృగువాసరము** - శుక్రవారము

**భృతాధ్యాపకుడు** - వేతనము తీసికొని విద్య నేర్పువాడు

**భృతిభుక్కు , భృతిభుజుడు** - శ్రమించి (కూలి) అనుభవించువాడు (శ్రమజీవి)

**భృష్టము** - వేచబడినది (భర్జితము)

**భేకభుక్కు** - కప్పలను దినునది ( పాము)

**భేకము** - సర్పము వలన భీతి నొందునది (కప్ప - మండూకము)

**భేషజము** - వ్యాధి భయమును తొలగించు నది (ఔషధము)

**భేషజాంగము** - మందు తీసికొన్నపిమ్మట తీసికొను వస్తువు (ఔషధము యొక్క అనుపానము)

**భైషజ్యము** - దీనిచే వైద్యము చేయుదురు (మందు)

**భోక్త** - పురుష రూపమున భుజించువాడు (పరమాత్మ)

**భోగదేహము** - మరణానంతరమున జీవుడు సుఖదుఃఖాదులనుభవించుటకై తాల్చెడి సూక్ష్మ శరీరము ( లింగశరీరము)

**భోగి** - పడగ గలది (పాము, భోగము కలవాడు (రాజు)

**భోగిభుక్కు, భోగిభుజము** - పాములను దినునది (ముంగిస, నెమలి, గరుడపక్షి)

**భౌతికము** - భూత సంబంధమైనది

**భౌముడు** - భూమి పుత్రుడు (అంగారకుడు, నరకుడు)

**భౌరికుడు** - బంగారు నాణెములుండు బండారమున కధికారి

**భ్రకుంసుడు** - కనుబొమలు త్రిప్పుచు భావ ప్రకటనము గావించు స్త్రీ వేషధారి (భ్రూకుంసుడు)

**భ్రమర(క)ము**-తిరుగు చుండునది(తుమ్మెద)

**భ్రమరము** - తిరుగునది (తుమ్మెద, కుమ్మరి సారె)

**భ్రమరానందము** - తుమ్మెదలకు ఆనంద మిచ్చునది (పొగడ)

**భ్రమరి** - తిరుగునది (ఆడుతుమ్మెద) కరగునది (లక్క)

**భ్రాజిష్ణువు** -అలంకారాదుల చేత ప్రకాశించు వాడు

**భ్రాతకము** - సోదరునకు సంబంధించినది

**భ్రాతృవ్యుడు** - తోడబుట్టినవాని కుమారుడు (భ్రాత్రీయుడు)

**భ్రాత్రీయుడు** - భ్రాతృవ్యుడు (భ్రాత్రేయుడు)

**భ్రుకుటి** - కనుబొమలకుటిలత్వము (భ్రూకుటి- బొమముడి)

**భ్రూకుంసుడు** - భ్రకుంసుడు

**భ్రూణము** - మాతృగర్భమున దిరుగునది (గర్భములోని పిండము)

**భ్రూణహత్య** - తల్లిచే భరింపబడు గర్భ పిండమును (శిశువును) బోగొట్టుట (కడుపుదింపుట)

**భ్రూవు** - కదలికలు కలది (కనుబొమ్మ-భ్రుకుటి)

**మంఖుణము** - పిక్కలకు తొడిగికొను కవచము (జంఘాత్రాణము)

**మంగల (ళ) వారము** - వ్యతిరేక లక్షణచే అమంగళకరమైన అంగారక వారము (జయవారము-భౌమవారము)

**మంగళాచరణము** - గ్రంథారంభమున నిర్విఘ్న పరిసమాప్త్యర్థము కవిచే చేయబడు ప్రార్థన

**మంచకాశ్రయము** - మంచము నాశ్రయించి యుండునది (నల్లి - మత్కుణము)

**మంచుకొండరాచూలి** - పర్వత రాజగు హిమవంతుని యొక్క కూతురు (పార్వతి)

**మంచుగుబ్బలి** - మంచుకొండ

**మంచుగ్రోలువులుగు** - మంచువెలుగుల నాస్వాదించు పక్షి (చకోరపక్షి - జ్యోత్స్నా ప్రియము)

**మంచుజోడు** - మంచువెల్గుగలజోడు (చంద్రుడు)

**మంచుత్రాగుడువుల్గు**- వెన్నెలద్రావెడు పిట్ట (వెన్నెలపుల్గు-చకోరపక్షి)

**మంచుమలల్లుడు** - హిమవంతుని యల్లుడు (శివుడు)

**మంజిష్ఠారాగము** - వెలికి విశేషముగా నగపడుచు లోవలను ఎప్పటికి వదల కుండెడి గాఢానురాగము

**మంజీరము** - పాదమున మనోహరముగ మ్రోయునది (కాలియందె-నూపురము)

**మంజుఘోష** - ఇంపైన ధ్వని చేయునది (పావురము - కలరవము)

**మంజుభాషిణి** - శ్రావ్యముగా మాటాడు స్త్రీ

**మంటమారి** - మండిపడెడు స్వభావము కలవాడు (జ్వలనశీలుడు)

**మంటిదిండి** - మన్ను తిండిగాగలది (తేలు-వృశ్చికము)

**మండపము** - జనులచే అలంకరింప బడునది (కొలువు,చావడి)

**మండలము** - నలువది రోజులు, వలయా కృతిగా దీర్చిన యొకానొకవ్యూహము

**మండలాగ్రము** - గుండ్రని తుదగల చేకత్తి

**మండలీకుడు** - తన చుట్టుపట్లనున్న రాజులను వశము చేసికొన్న రాజు (సామంత రాజు)

**మండలేశ్వరుడు** - అధీశ్వర, సార్వభౌముల కంటె ఇతరుడైన రాజు

**మండూకప్లుతి** - ఒక విషయమును పూర్తిగా జెప్పక మరియొక విషయమునందుకొని అదియు పూర్తి చేయక ఇంకొక విషయము పైకి మరలుట (కప్ప దాటు)

**మండూకము** - తటాకాదుల యందుండునది (కప్ప - మండుకము)

**మంత్రదర్శి** - వేదమంత్రములను అనుభవములోనికి దెచ్చుకొన్నవాడు, వేదమంత్రములను కనిపెట్టినవాడు (మంత్రద్రష్ట)

**మంత్రసాని** - సుఖప్రసవనోపాయమును కల్పించు చికిత్సకురాలు (సావిక)

**మంత్రి** - రహస్యాలోచనము గలవాడు

**మంథజము** - కవ్వముతో చిలుకుట వలన బుట్టునది (వెన్న - నవనీతము)

**మంథ దండము** - పెరుగు చిలికెడు సాధనము (కవ్వము - మంథానము)

**మంథని** - పెరుగు తరిచెడుకుండ (తరికడవ - మంథనఘటి)

**మంథరము** - అప్పుడే చిలికి తీసిన వెన్న

**మంథరుడు** - మెల్లగా బోవువాడు (మందగామి)

**మంథశైలము, మంథాద్రి** - పాలకడలిని త్రచ్చునపుడు కవ్వపు కొయ్యగా వాడిన కొండ (మంధన పర్వతము - మందర పర్వతము)

**మందగమన** - మెల్లగా నడచునది (గేదె)

**మందగుడు** - మెల్లగా నడచువాడు (శనీశ్వరుడు)

**మందప్రోయాలు** - గొల్లపల్లెలో నుండు స్త్రీ (వ్రేత - గొల్లది)

**మందరోత్థము** - మందరపర్వతమున బుట్టినది (సిలాజిత్తు)

**మందాకిని** - మందముగా వక్రగమనముతో ప్రవహించునది (ఆకాశగంగ - సురదీర్ఘిక) మెల్లగా నడచునది (అరువదేండ్ల యాడుది)

**మందాక్షము** - దీని వలన దృగింద్రియము (కనులు) కొంచెము వాలును (సిగ్గు - వ్రీడ)

**మందుర** - దీనియందు గుఱ్ఱములు పోతరించి యుండును (గుఱ్ఱపుశాల)

**మందురకుడు** - అశ్వపాలకుడు (మందడీడు)

**మందోదరి** - పలుచని యుదరము కలది (రావణుని భార్య)

**మందోష్ణము** - కొంచెము వేడి కలది (గోరువెచ్చనిది)

**మకరందము** - దీనిచే పుష్పమలంకరింప బడును మత్తెక్కించున దగుటచే మకరమునైన లొంగదీయునది (పూదేనె)

**మకరకంఠి** -నడుమ మొసలి ముఖ మేర్పడ జేసిన పురుషుల కంఠాభరణ విశేషము

**మకరకుండలము** - మొసలి ముఖ మేర్పడ జేసిన పురుషుని కర్ణాభరణ విశేషము

**మకర కేతనుడు** - మొసలి ధ్వజచిహ్నముగా కలవాడు (మన్మధుడు - మకరకేతువు)

**మకరతోరణము** - మకరరూపమేర్పడ జేసిన తోరణము

**మకరధ్వజుడు** - మొసలి టెక్కెమువాడు (మొసలి సిడెము మేటి - మన్మధుడు)

**మకరము** - మాయ చేయునది (మొసలి)

**మకరవాహనుడు** - మొసలి వాహనముగా గలవాడు (మొసలిరౌతు - వరుణుడు)

**మకరాంకుడు** - మొసలి ధ్వజచిహ్నముగా గలవాడు (మన్మధుడు)

**మకరాలయము** - మకరములకు నిలయ మైనది (మకరాకరము - సముద్రము)

**మకరికాపత్రము** - స్త్రీలకు చెక్కిళ్ళలోనగు తావుల యందు లత్తుకతో వ్రాసెడు మకరరూపమగు రేఖ (మకరిక)

**మకుటము** - శిరమును భూషించునది (కిరీటము)

**మక్కి** - మాంసములేక నిస్సారమైనది (ఈగ - నీలంగువు)

**మక్కికి మక్కి** - అసలుకు సరియగు నకలు (మక్కి = ఈగ, ఉన్నదున్నట్లు)

**మక్షిక** - అపరిశుద్ధమగుటచే దీనియెడ కోపింతురు (ఈగ - మక్కి)

**మక్షికామలము** - తేనెటీగల యుచ్ఛిష్టము (మైనము - మధూచ్ఛిష్టము)

**మఖద్విషుడు** - యజ్ఞములను ధ్వంసము చేయువాడు (రాక్షసుడు)

**మఖవుడు** - యజ్ఞములయం దారాధింప బడువాడు (ఇంద్రుడు)

**మగధుడు** - వంశావళిని జదువువాడు (బట్టు)

**మగనాలు** - మగడు గల ఆడుది (పతివత్ని - భర్తృమతి)

**మగమానికవువాలు** - (మగమానికము = వజ్రము) వజ్రమయమైన ఆయుధము (వజ్రాయుధము)

**మఘువుడు** - మఖవుడు (ఇంద్రుడు మఘవంతుడు)

**మఘోని** - ఇంద్రుని భార్య (శచీదేవి)

**మచ్చెకంటి** - చేపల వంటి కన్నులు గల స్త్రీ (మీనాక్షి - మీననేత్ర)

**మడికాసుగట్టు, మడికాసుమల** - (మడికాసు = వెండి) వెండికొండ (కైలాసము)

**మడికాసుమల రేడు** - వెండి కొండకు ప్రభువైన వాడు (శివుడు)

**మణికర్ణిక** - శివుని దక్షిణ కర్ణ భూషణము జారిపడిన కాశీపట్టణ మందలి పుష్కరిణి (విష్ణువు శివుని గూర్చి తపస్సు జేసికొనుటకై చక్రముతో త్రవ్వినది)

**మణితము** - రతికాలమందు స్త్రీ చేయు అవ్యక్తమైన ధ్వని (మణికూజితము - రతికూజితము)

**మణిపూరము** - నాభిస్థానమందలి చక్రము

మణిప్రవాళము - మణి, ప్రవాళముల వలె రెండు భాషలు కలిసిన కవిత్వము

**మణిబీజము** - రత్నాలవంటి విత్తనములు కలది (దాడిమచెట్టు)

**మతంగజము** - మతంగుడను ఋషివలన బుట్టినది (ఏనుగు)

**మత్కుణుడు** - గడ్డము, మీసము లేనివాడు

**మత్తకాశిని** - మదము కలదానివలె నొప్పెడు ఆడుది

**మత్తవారణము** - మత్తెక్కిన ఏనుగు (మదేభము)

**మత్సరుడు** - మత్సరము కలవాడు (ఈర్ష్యాళువు)

**మత్స్యధాని** - చేపలిందుంచ బడును (చేపల బుట్ట - కువేణి, మీలబుట్ట)

**మత్స్య బంధనము** - చేపలను బంధించునది (గాలము, వల)

**మత్స్యబంధని** - చేపలిందు బంధింపబడును (చేపలబుట్ట - కువేణి)

**మత్స్యబంధుడు** - చేపలను బట్టువాడు (జాలరి - మత్స్యజీవి)

**మత్స్యము** - మాంసము హరించు నిచ్చచే ముదమొందునది (చేప)

**మత్స్యవేధని** - చేపలను బీడించునది (గాలము - బడిశము - మత్స్యవేధనము)

**మదకలము** - మత్తుచే వ్యక్తము కాని ధ్వని కలది (మదపుటేనుగు)

**మదజలము** - మదపుటేన్గు యొక్క గండ స్థలముల నుండి స్రవించునది

**మదనపత్రిక** - విరహ వేదనాదులను తెలియబరచుచు వ్రాసికొన్న జాబు

**మదన పాఠకము** - కామము రగుల్కొను నట్లు ధ్వని చేయునది (కోకిల - పరభృతము)

**మదన లేఖ** - మదన పత్రిక

**మదనుడు** - మత్తెక్కించువాడు (మన్మథుడు)

**మదాలాపి** - వసంత కాలమున ఉత్సాహముతో కూయునది (కోకిల)

**మదావళము** - మదము గలది (ఏనుగు - మత్తేభము)

**మదిర** - త్రాగినచో మదింప జేయునది (మద్యము)

**మదిరాక్షి** - మదము క్రమ్మిన కన్నులు గల యాడుది.

**మదీయము** - నా సంబంధమైనది (మామకము)

**మదోత్కటము** - మదముచే అదుపు తప్పినది (ఏనుగు)

**మద్గువు** - నీటియందు మునుకలు వేయునది (నీటికాకి, బొమ్మడాయ అనుచేప)

**మద్యము** - మదిర (కల్లు)

**మద్యగంధము** - కల్లు వాసన గొట్టు పూలు కలది (పొగడచెట్టు)

**మధుకంఠము** - తియ్యని గొంతు కలది (కోయిల)

**మధుకరము** - పూదేనెను జేయునది (తుమ్మెద)

**మధుకుడు** - శ్రావ్యముగా వదించువాడు (మాగధుడు - బట్టువాడు)

**మధుకృత్తు** - తేనె ప్రోగు చేయునది (తేనెటీగ)

**మధుగాయనము, మధుఘోషము** - చక్కగా కూయునది (కోయిల)

**మధుజము** - తేనె నుండి యేర్పడినది (మైనము - సిక్థము)

**మధుజిత్తు** - మధువను రాక్షసుని జయించిన వాడు (విష్ణువు)

**మధుపము** - మధువును (తేనెను) బానము చేయునది (తుమ్మెద - మధులిహము)

**మధుపర్కము** - పెండ్లిలో వధూవరుల కిచ్చెడు వస్త్రములు, పెరుగు, నేయి, నీరు, తేనె, పంచదార అనునైదింటి సముదాయము, పెరుగుతో కలిసిన తేనె

**మధుప్రియుడు** - మద్యమును ఇష్టపడు వాడు (బలరాముడు)

**మధుమక్షిక** - తేనెయం దాసక్తి గల యీగ (తేనెటీగ)

**మధురిపుడు, మధురిపువు** - మధువను రాక్షసునకు శత్రువు (విష్ణువు)

**మధులిహము** - మకరందము నాస్వాదించు నది (మధుపము - తుమ్మెద)

**మధువ్రతము** - పూదేనెను మాత్రము త్రాగెడు దీక్షకలది (తుమ్మెద)

**మధుసూదనుడు** - మధువనెడు రాక్షసుని వధించినవాడు (విష్ణువు)

**మధూచ్ఛిష్టము** - తేనెకు ఉచ్ఛిష్టము వంటిది (మధుశేషము - మైనము)

**మధూత్థము** - తేనె నుండి కలిగినది (మైనము - మధు శిష్టము)

**మధ్యం దినము** - మధ్యాహ్నము

**మధ్యమపదలోపి** - ఒకానొక తత్పురుష సమాసము (శాకపార్థివుడు శాక ప్రియుడగు పార్థివుడు ప్రియ శబ్దమిందు లోపించినది)

**మనఃప్రభవుడు** - మనస్సులో నుదయించు వాడు (తలపుచూలి - మన్మథుడు)

**మనసిజుడు** - మనస్సులో జనించువాడు (మన్మథుడు)

**మనీష** - అన్నిటిని దెలిసికొనునది (తెలివి)

**మనీషి** - బుద్ధికలవాడు (విద్వాంసుడు - తెల్విగలవాడు)

**మనుగుడుపు** - వివాహమయిన తోడనే అల్లుని బిలిచి యత్తవారింట బెట్టెడి విందు (అల్లెము - మరవలి)

**మనుజాతుడు** - మనువు సంతతియైన వాడు

**మనుజాశనుడు, మనుజాశి** - మనుష్యులు ఆహారముగా గలవాడు (రాక్షసుడు - మానిసిదిండి)

**మనుజుడు** - మనువు వలన బుట్టినవాడు (మనుష్యుడు)

**మనుజేంద్రుడు, మనుజేశ్వరుడు** - నరేంద్రుడు - రాజు

**మనుపీనుగు** - బ్రతికి యుండియు పీనుగువలె నిష్ప్రయోజకుడు (జీవచ్ఛవము - నడపీనుగు)

**మనువృత్తి** - అనాధలకు జీవనార్థమిచ్చెడు ద్రవ్యము (మనోవర్తి - భరణము)

**మనుష్యధర్ముడు** - మనుష్యుల యాచారము వంటి యాచారము కలవాడు (కుబేరుడు - మానిసిరౌతు)

**మనుష్యుడు** - మనువు సంతానము (మనుజుడు)

**మనోజవనుడు** - అన్ని విధముల తండ్రిని పోలినవాడు (పితృసన్నిభుడు -మనోజవుడు)

**మనోజుడు** - మనసిజుడు (మన్మధుడు)

**మనోభవుడు** - మనసిజుడు (మన్మధుడు)

**మనోరథము** - మనస్సే రధముగా గలది (కోరిక)

**మనోవర్తి** - వితంతువున కిచ్చెడు భరణము (మనువర్తి - మనోవృత్తి)

**మన్నుకానుపు, మన్నుచూలి** - భూపుత్రి (సీతాదేవి)

**మన్నుతాలుపు** - భూమిని దాల్చునది (భూధరము కొండ)

**మన్నురేడు** - భూపాలుడు (రాజు)

**మన్నెరికము** - మండలేశ్వరత్వము (దొరతనము)

**మన్మథుడు** - మనస్సును కలత పెట్టువాడు (మరుడు - మదనుడు)

**మన్మనము** - భార్యాభర్తలు సురత కాలమందు చెప్పుకొను రహస్యము

**మన్వంతరము** - డెబ్బది యొక్క దివ్య యుగముల కాలము, మనువు కాలమున జరిగిన చరిత్ర

**మబ్బుత్రోవ** - మేఘములకు మార్గమైనది (ఆకాశము - మొగులు దారి)

**మబ్బునీరానుపిట్ట** - వాన చినుకులకై ఎదురు చూచు పక్షి (వానకోయిల)

**మబ్బు (పు-పూ)వు** - మబ్బునకు పూవు వంటిది (మేఘ పుష్పము - నీరు)

**మబ్బుపూనిసువు** - జలము సంతానముగా గలది (అగ్ని)

**మబ్బుపూబుట్టువు** - నీటియందు బుట్టునది (తామరపూవు)

**మబ్బుమేవరి** - మేఘమును హరించువాడు (మబ్బుదాయ)

**మబ్బురవుతు** - మేఘము వాహనముగా గలవాడు (మబ్బు (జక్కి) రౌతు - ఇంద్రుడు)

**మబ్బురూపరి** - మేఘ రూపమును బోలు రూపము కలది (ఐరావతము - అభ్రమాతంగము)

**మబ్బుల పగతుడు, మబ్బులదాయ** - మబ్బులను చెదరగొట్టువాడు (మబ్బు విప్పు - వాయువు)

**మబ్బువిప్పు** - మేఘమును విసరి కొట్టువాడు (మబ్బుపగ - వాయువు)

**మయితాలుపు** - శరీరధారి (ప్రాణి - శరీరి)

**మయిమరువు** - ఒడలిని మరుగు పర్చునది (కవచము)

**మయి సున్నవజీరు** - శరీరములేని శూరుడు (మన్మధుడు - అనంగుడు)

**మయూరకము** - మయూర వర్ణము వంటి వర్ణము గలది (మైలుతుత్తము)

**మయూరగ్రీవకము** - నెమలి కంఠము రంగు కలది (మయిలు తుత్తము)

**మయూర చటకము** - నెమలి యాకారము గల పులుగు (కోడి - చరణాయుధము)

**మయూరము** - పాములను హింసించునది (నెమలి - కేకి)

**మయూరవ్యంసకము** - ధూర్త మైన మయూరము (పెంకి నెమలి)

**మరవలి** - మనుగుడుపు (అల్లెము)

**మరీచిక** - సూర్యకిరణముల వెలుగులో జలము వలె నుండునది (మృగతృష్ణ - ఎండమావులు)

**మరుగొంగ** - మన్మధునికి శత్రువు (శివుడు)

**మరుతేజి** - మన్మధునకు వాహనమైనది (చిలుక - శుకము)

**మరుతేరు** - మన్మధునకు రధమైనవాడు (వాయువు)

**మరుత్తు** - కుపితుడైన వీనిచే లోకము లయించును (గాలి)

**మరుత్వంతుడు** - మరుత్తులు (వేల్పులు) కలవాడు (ఇంద్రుడు)

**మరుత్సఖుడు** - వాయుదేవుని చెలికాడు (అగ్ని)

**మరునయ్య** - మన్మధుని తండ్రి (విష్ణువు)

**మరునయ్యతేజి** - విష్ణుని వాహనము (గరుడుడు)

**మరునల్లె** -మన్మధుని అల్లెత్రాడు(వింటినారి) అయినది (తుమ్మెద)

**మరునిడాలు** - మన్మధుని ధ్వజము (మొసలి, చేప)

**మరుప్రియము** - ఎడారి యిష్టమైన జంతువు (ఒంటె - ఉష్ట్రము)

**మరుమామ** -మన్మధుని యొక్క మేనమామ (చంద్రుడు)

**మరుమావు**-మన్మధుని వాహనము (చిలుక)

**మరువు** - దప్పికచే దీనియందు మరణింతురు (ఎడారి)

**మర్కటకము** - తన నాభినుండి వచ్చెడు నూలు ఆధారముగా మర్కటము వలె నెక్కునది (సాలెపురుగు)

**మర్కటము** - దాటునపుడు కొమ్మల సందున పడి చచ్చునది (కోతి)

**మర్త్యుడు** - మృతినొందువాడు, భూలోకమున బుట్టిన వాడు (మనుష్యుడు)

**మర్దలము, మర్దళము** - ధ్వనికై మర్దింప బడునది (మృదంగము - మద్దెల)

**మర్మస్పృక్కు**- మర్మమును (ఆయువు పట్టును) దాకి హింసించునది (మాటలు మొ॥)

**మలగొంగ** - పర్వతములకు శత్రువు (ఇంద్రుడు - నగవైరి)

**మలదాయ** - కొండలకు పగవాడు (ఇంద్రుడు - కొండపగతుడు)

**మలద్రిమ్మరి** - కొండలయందు సంచరించు నది (గిరిచరము - కోతి)

**మలమాసము** - వివాహాది శుభకార్యములు చేయదగని నెల (చాంద్రమాన ప్రకారము సూర్యసంక్రమణము రానిమాసము అధికమాసము)

**మలయజము** - మలయ పర్వతమున బుట్టునది (చందన వృక్షము)

**మలయమారుతము, మలయానిలము** - మలయ పర్వతము నుండి వీచిన దక్షిణపు గాలి (కమ్మగాడ్పు)

**మలిన ముఖము** - నల్లని మూతి కలది (కొండముచ్చు)

**మలిని** - ముట్టుది

**మలిమ్లుచుడు** - కుటిలముగా జరించువాడు (దొంగ, మురికిని పోగొట్టువాడు (చాకలి)

**మలివారము** - రెండవ వారము (సోమ వారము)

**మలిష్ఠ** - ముట్టగు చున్న స్త్రీ (బహిష్ఠ)

**మలీమసము** - మలముచే దూషితమైన ద్రవ్యము

**మలుపక్కము** - నెలలో రెండవ పక్షము (కరిపక్కము - కృష్ణపక్షము)

**మల్లజము** - మల్ల దేశమున పుట్టునది (మిరియము)

**మల్లికాక్షము** - తెల్లని నేత్రములు గల గుఱ్ఱము, మాసిన ముక్కు కాళ్ళు గల తెల్లహంస

**మశకము** - ధ్వనిచేయునది (దోమ)

**మశకహరి, మశహరి** - దోమలను హరించునది (దోమతెర)

**మసిధాని** - మసిబుడ్డి (మసిమణి-సిరాబుడ్డి)

**మస్కరి** - జ్ఞానము గలవాడు (సన్యాసి)

**మస్తిష్కము** - శిరస్సును బొంది యుండునది (మెదడు)

**మహంతు** - మఠమునకు గాని, దేవస్థానము లకు గాని అధిపత్యము వహించి ధర్మ కర్తృత్వము జరిపెడు సన్న్యాసి

**మహతి** - నారదుడు ధరించువీణె

**మహాంగము** - పెద్ద అవయవములు కలది (ఒంటె)

**మహాకాయము** - పెద్ద శరీరము కలది (ఏనుగు)

**మహాకాయుడు** - స్థూల దేహము గలవాడు (అతికాయుడు)

**మహాగ్రీవము** - పొడుగైన మెడ కలది (ఒంటె మహాగ్రీవి)

**మహాదశ** - ఒక గ్రహము యొక్క అధికార కాలము

**మహాదేవుడు** - దేవతలలో శ్రేష్ఠుడు (శివుడు)

**మహానది** - కటకము సమీపమున నుండు ఒకనది

**మహానసము** - అధికమైన భోజనోప కరణములు కలది (వంటయిల్లు)

**మహాపద్మము** - కుబేరుని నవ నిధులలో ఒకటి (మహాపద్మము, పద్మము, శంఖము, మకరము, కచ్ఛపము, ముకుందము, కుందము, నీలము, వరము నవనిధులు) ఒకానొక పెద్ద సంఖ్య (ఏకము, దశము, శతము, సహస్రము, దశ సహస్రము, లక్ష, దశలక్ష, కోటి, దశకోటి, శతకోటి అర్బుదము, న్యర్బుదము, ఖర్వము, మహాఖర్వము, పద్మము, మహాపద్మము, క్షోణి భూరి, మహాభూరి)

**మహాబలుడు** - చాల బలము కలవాడు (వాయుదేవుడు)

**మహాభాష్యము** - పాణినీయ వ్యాకరణ సూత్రములకు పతంజలి రచించిన విపుల వ్యాఖ్యానము గల గ్రంథము

**మహామదము** - ఎక్కువ మదము గలది (ఏనుగు)

**మహామహోపాధ్యాయుడు** - గొప్ప బోధకులలో శ్రేష్ఠుడు

**మహాయుగము** - కృతత్రేతాద్వావర కలియుగములు కలిసిన 4320000 సం॥ల కాలము

**మహారథుడు** - తనసారథిని గుఱ్ఱములను కాపాడు కొనుచు 11వేల మంది విలుకాండ్రతో పోరగల శస్త్రాస్త్ర విశారదుడు, గొప్ప రథము గలవాడు

**మహాలయము** - భాద్రపద బహుళపక్షమున పితరులకై జరిపించు శ్రాద్ధకర్మ, భాద్రపద బహుళపక్షము

**మహావాక్యము** - సాక్షాత్తు పరమార్థమును బోధించెడి తత్త్వమస్యాది రూపమైన వేదాంత వాక్యము, పరస్పర సంబద్ధమైన అర్థముగల అవాంతర వాక్యములతో గూడిన ఏక వాక్యము

**మహాశయుడు** - గొప్ప హృదయము కలవాడు (సముద్రుడు మొ॥) ఉత్తమ ఆశయములు కలవాడు (మహాత్ముడు)

**మహాసర్గము** - మహా ప్రళయము తరువాత కలుగుసృష్టి

**మహాసేనుడు** - గొప్ప సేన కలవాడు (కుమారస్వామి)

**మహిక** - కాముకులచే గౌరవింపబడునది (మంచు - మిహిక)

**మహిమ** - మహత్త్వము వలన సిద్ధించునది (అష్టసిద్ధులలో ఒకటి)

**మహిల, మహిళ** - మదించిన యూడుది (మత్తురాలగు స్త్రీ) గౌరవింపబడునది

**మహిషము** - శక్తి కలదగుట వలన ఆదరింప బడునది (ఎనుబోతు)

**మహిషవాహనుడు** - దున్నపోతు వాహనముగా గలవాడు (యముడు - పోతురౌతు)

**మహీక్షితుడు**-భూమిని పాలించువాడు (రాజు)

**మహీజము** - భూజము (చెట్టు), నేల యందు మొలచునది (అల్లము)

**మహీధరము** - భూమిని ధరించునది (మహీధ్రము - భూధరము)

**మహీభృత్తు** - భూభృత్తు (రాజు - భూభర్త)

**మహీరుహము** - భూమియందు మొలచునది (భూజము - చెట్టు)

**మహీలత** - భూమియందు లత వంటిది (వానపాము - ఎఱ్ఱ)

**మహీసుత** - భూపుత్రి (సీత - పుడమి కానుపు)

**మహీసుతుడు**-భూ పుత్త్రుడు (అంగారకుడు, నరకాసురుడు)

**మహీసురుడు** - భూమిపై దేవత వంటివాడు (పుడమివేల్పు - బ్రాహ్మణుడు)

**మహేంద్రి** - పెద్దకాయల అరటి (బొంత అరటి చెట్టు)

**మహోక్షము** - మిక్కిలి బలిసిన ఎద్దు (ఆబోతు - షండము)

**మహోత్సాహుడు** - అద్భుత కార్యారంభము గలవాడు

**మహోపధ్యాయుడు** - ఉత్తమ శ్రేణికి చెందిన గురువు

**మా** - ఎల్లలోకములకు మాతయైనది (లక్ష్మీదేవి) పూజ్యురాలు (తల్లి), అవ్యయ మైనప్పుడు నిషేధము

**మాండలికుడు** - ఒక మండలమున కధికారి

**మాంసలుడు** - బలిసిన (కండగల) వాడు (బలిష్ఠుడు)

**మాంసికుడు** - మాంసము విక్రయించి జీవించువాడు

**మాగధుడు** - మగధుడు (బట్టు), మగధ దేశమున నుండువాడు

**మాఘము** - మఘా నక్షత్రముతో గూడిన పున్నమ గల మాసము (మాఘమాసము)

**మాచకమ్మ** - మగరొమ్ములు మీనమును గలయాడుది

**మాడెము** - కొండల నడుమ నున్నభూమి (మన్నెము - మన్యము)

**మాణవకము**-ఇరువది పేటల మణిహారము

**మాణవకుడు** - మనువు యొక్క అల్పమైన అపత్యము (బాలకుడు)

**మాణవ్యము** - మాణవకుల సమూహము (బాలుర గుంపు)

**మాణిక్యము** - మణివలె మెరయునది (కెంపు)

**మాతంగము** - మతంగ మహర్షి వలన బుట్టినది (ఏనుగు - మతంగజము)

**మాతరిపురుషుడు** - తల్లి వద్ద వీరత్వము ప్రదర్శించువాడు (పిరికివాడు)

**మాతలి** - మతలుని కొడుకు, సారధి కర్మల యందు సమస్త (మతముల) ఉపాయముల నెరిగిన వాడు (ఇంద్ర సారధి)

**మాతామహి** - తల్లి తల్లి (అమ్మమ్మ)

**మాతామహుడు** - తల్లి తండ్రి (తాత)

**మాతామహులు** - తల్లి వంశము వారు

**మాతుల పుత్త్రకము** - మాతులము (ఉమ్మెత్త) నకు బుట్టినది (మాతు౹కము - ఉమ్మెత్తకాయ)

**మాతులాని, మాతులి** - మేనమామ భార్య

**మాతులుడు** - తల్లితోడ బుట్టినవాడు (మేనమామ)

**మాతులేయుడు** - మేనమామ కుమారుడు

**మాతృక** - తల్లివలె బెంచునది (దాది) ఆదికారణమగునది మూలగ్రంధము

**మాతృష్వస** - తల్లి తోడ బుట్టినది (పినతల్లి)

**మాతృష్వసేయి** - తల్లితోడ బుట్టినదాని కూతురు (పినతల్లి కూతురు - పెదతల్లి కూతురు)

**మాతృష్వసేయుడు** - తల్లి తోడ బుట్టినదాని కొడుకు (పినతల్లి కొడుకు, పెదతల్లి కొడుకు)

**మాతృష్వస్రీయ** - మాతృష్వసేయి

**మాతృష్వస్రీయుడు** - మాతృష్వసేయుడు

**మాధవకబళము** - భగవంతుని ధ్యానించు కొనుచు యాచించెడు భిక్షాన్నపుముద్ద

**మాధవి** - కుంటెన కత్తె

**మాధవుడు** - లక్ష్మీ దేవికి భర్త, శత్రువులను కంపింప జేయువాడు, మధువు వంశమున జన్మించినవాడు (విష్ణువు)

**మాధుకరము** - తుమ్మెదలు పూలయందలి పూదేనెను గ్రహించు నట్టులు భిక్షుకులు గృహస్థుల యిండ్లకు వెళ్ళి, భిక్షగ్రహించి జీవించుట (బిచ్చముగా పెట్టబడిన అన్నము)

**మాధుర్యము** - మృదువులు, సరసములు నగు పదముల వరున తప్పని కూర్పు (కావ్య గుణములలో ఒకటి)

**మాధ్యస్థము** - మధ్యస్థుడు చేయు తీర్పు

**మాధ్వీకము** - ఇప్ప పూవు నుండి తీయబడునది (ఇ౼౼కల్లు)

**మానవము** - మనువుచే వ్రాయబడినది (ధర్మశాస్త్రము), మనుష్యులకు సంబంధించినది

**మానవుడు** - మనుజుడు

**మానసౌకము**-మానస సరోవరము నెలవుగా కలది (హంస - మానసౌకసము)

**మానిని** - భర్తపై కోపించిన మగువ, ఆత్మగౌరవము గల యాడుది

**మానిసి దిండి** - మనుష్యులను తినువాడు (రాక్షసుడు - నరభోజి)

**మానిసిరేడు** - మనుష్యులకు ప్రభువు (రాజు)

**మానిసిరౌతు** - నరవాహనుడు (కుబేరుడు)

**మానుషము** - మనుష్య సంబంధమైనది (కీర్తి, మర్యాద)

**మానుషస్థుడు** - నీతి నియమములకు కట్టుబడు వాడు (మర్యాదస్థుడు)

**మానుషాదుడు, మానుషాశి**- మనుష్యులను దినువాడు (రాక్షసుడు - మానిసిదిండి)

**మానుషుడు** - మనువు సంతతివాడు (మనుష్యుడు)

**మామకుడు** - మేనమామ, (మాతులుడు) నా సంబంధమైనవాడు (నావాడు)

**మామమామ** - మామయైన సముద్రునకు మామ (విష్ణువు, సముద్రుడు)

**మాయలమెకము** - వంచక స్వభావము కల మృగము (నక్క)

**మారకము** - చంపునది

**మారకుడు** - విరహజనులను మరణింప జేయువాడు (మన్మథుడు)

**మారజిత్తు** - మన్మథుని జయించినవాడు (శివుడు), కామక్రోధాదులను నిగ్రహించినవాడు (జినుడు, బుద్ధుడు)

**మారిషుడు** - హింసను వారించువాడు (పూజ్యుడు, నాట్యోక్తియందు ఆర్యుడు (మార్షుడు)

**మారుడు** - విరహి జనులను జంపువాడు (మన్మథుడు)

**మారుతి** - వాయుదేవుని కుమారుడు (మారుత సుతుడు - హనుమంతుడు)

**మార్కండేయుడు** - మృకండునిపుత్రుడు

**మార్గణుడు** - అడుగు కొనువాడు (బిచ్చగాడు యాచకుడు) అన్వేషించు వాడు (వెదకువాడు)

**మార్గశిరము**-మృగశిరా నక్షత్రముతో గూడిన పున్నమ గల మాసము (జింకతలరిక్కనెల మార్గశీర్షమాసము)

**మార్జనము** - చేతితో గాని దర్భతో గాని నీరు చిలుకరించుట (ప్రోక్షణము)

**మార్జని** - గదులను తుడుచుటకు యోగ్య మైన గృహోపకరణము (చీపురుకట్ట - సమ్మార్జని)

**మార్జారకంఠము** - పిల్లి యొక్క కంఠము వంటి కంఠము కలది (నెమలి)

**మార్జాల దాంపత్యము** - సంభోగ సమయమున పొత్తు కలియక కయ్యములతో కాలము గడుపు మార్జాల దంపతుల భావము

**మార్జాల మార్గము** - పిల్లి తన పిల్లలను నోట గరచుకొని తాను పోవు తావులకు తీసికొని పోవునట్లు ఆచార్యుడు శిష్యులను వెంటగొని పోవుచు వృద్ధికి దెచ్చుట

**మార్జాలము** - మూషక భక్షణముచే గృహమును శుభ్రముగా నుంచునది (పిల్లి - మార్జారము)

**మార్జాల శీలము** - నిత్యము పాలు త్రాగుచున్న ఆ యింటి యజమాని కనులు పోగోరు నట్టి పిల్లి శీలము వంటి శీలము (కృతఘ్నతా భావము)

**మార్జుడు** - బట్టలుతికి శుద్ధిచేయు వాడు (చాకలి)

**మార్తండుడు, మార్తాండుడు** - మృతండు డనువాని కొడుకు, (సూర్యుడు) అజాండము రెండు చిప్పలైనప్పుడు (మృతి నొందినప్పుడు) పుట్టినవాడు, సూర్యుని సుషుమ్న యను రశ్మి అండమై అదితి గర్భము నుండి బైటపడి తేజోరూపుడైనవాడు

**మార్త్రికము** - మట్టితో చేయబడినది (పాలిక వంటిది)

**మార్దంగికుడు** - మృదంగ వాద్యము నందు నేర్పరి (మద్దెల వాయించువాడు)

**మార్ద్వీకము** - ద్రాక్ష సంబంధమైనది (ద్రాక్ష సారాయి - మాధపకము)

**మాలకరి** - దండలు గ్రుచ్చువాడు (మాలాకారుడు)

**మాలాదీపకాలంకారము** - దీపకము, ఏకావళ్యలంకారమును ఒక్కచో గలిపి చెప్పుట (మన్మథు డా కాంత హృదయము నందును, అకాంత హృదయము నీహృదయము నందును వసించెను, స్త్రీ పురుష చిత్తముల యందు జెప్పబడుటచే దీపకము, హృదయ శబ్దము గ్రహింపబడి విడిచి పెట్టబడినది కావున నేకావళి)

**మాలిని** - తరంగ మాలికలచే వెలయునది (గంగ)

**మాలిమికాడు** - ఓడనడుపు శాస్త్రము నెరిగినవాడు (నావికుడు - సరంగు)

**మావటీడు** - ఏనుగును తోలెడి వాడు (మావతుడు - అంకుశికుడు)

**మాషీణము** - మినుములు పండు పొలము (మినుపచేను - మాష్యము)

**మాసికము** - ఆబ్దికము వరకు ప్రతినెలకు జేసెడు శ్రాద్ధము, మాస సంబంధమైనది

**మాస్టీడు** - శస్త్రవిద్యలో నిపుణుడు (మాసటీడు - శూరుడు)

**మాహిషము** - గేదెకు సంబంధించినది

**మాహిషికుడు** - బఱ్ఱెలను కాచువాడు, జారిణి యొక్క ప్రియుడు

**మాహిష్యుడు** - అంతఃపురము యొక్క కావలికి తగినవాడు (కంచుకి), వైశ్య స్త్రీకిని క్షత్రియునకును కల్గినవాడు

**మాహేశ్వరి** - శివునకు సేవలు సేయునది (సప్తమాతృకలలో నొకతె)

**మాహేశ్వరుడు** - శివారాధన చేయువాడు (శైవుడు)

**మింగడ** - కాగిన పాలమీద తెట్టె (తొరక) పెరుగుమీది తెట్టె (మీగడ)

**మించు** - పురుషులు కుడికాలి రెండవ వ్రేలికి పెట్టుకొను ఆభరణము (పురుషపాద తర్జన్యాభరణము)

**మించుగంటి** - మెరయు కన్నులు కలది

**మించుబోడి** - మెరపు వలె అందమైన స్త్రీ (మించుబోణి - సుందరి)

**మింటిచూలి** - ఆకాశమున బుట్టినవాడు (వాయువు - చదలకుఱ్ఱడు)

**మింటి తెరువరి** - ఆకాశము గమన యోగ్యమగు మార్గముగా గలవాడు (సూర్యుడు), ఆకసమున చరించువాడు (వేల్పు)

**మింటిమానికము** - ఆకాశమునకు మణివంటివాడు (నభోమణి-సూర్యుడు)

**మింటిసికవేల్పు** - నింగిసిగ (శివుడు)

**మిక్కిలి కంటిదేవర, మిక్కిలి కంటివేల్పు, మిక్కిలి కంటిసామి** - ఎక్కువ కన్ను (శ్రేష్ఠమైన కన్ను) గల దేవుడు (శివుడు - ముక్కంటి)

**మిటారి** - విలాసవతి (ఆడుది)

**మిటారికాడు** - విలాసవంతుడు

**మిడుత** - ఎగిరి ఎగిరి పడునది (పతంగము - దివ్వెయార్పు పులుగు)

**మితంపచుడు** - కొద్దిగా వండుకొనుచు ధనమును కూడబెట్టువాడు (లోభి)

**మిత్తిగొంగ** - కాలాంతకుడు (శివుడు)

**మిత్తి మిత్తి** - అంతకాంతకుడు (కాలకాలుడు - శివుడు)

**మిత్త్రుడు** - సర్వభూతముల యందు స్నేహయుక్తుడు (స్నేహితుడు)

**మినుకుగొమ్మ, మినుకు జేడియ** - పలుకుల కధిష్ఠాన దేవత (వాగ్దేవి - సరస్వతి)

**మినుకుటూర్పులవాడు** - వేదములే నిశ్శ్వాసముగా గల దేవుడు (విష్ణువు)

**మినుకులదణి** - వేదములకు ప్రభువు (బ్రహ్మ)

**మినుకుల బరణి** - ఋుక్సామయజుర్వేద స్వరూపమైన శరీరము కలవాడు (త్రయీతనువు- సూర్యుడు), కాంతులకు బరిణె వంటివాడు

**మినుకులయిక్క** - కాంతులకు నిలయమైన వాడు (సూర్యుడు)

**మినుచూలు** - ఆకాశమునకు బిడ్డవంటి వాడు (వాయువు)

**మినుజుట్టు దేవర** - ఆకాశమే జుట్టుగా గల సామి (శివుడు - వ్యోమకేశుడు)

**మినుబావి** - ఆకాశ గంగ (మందాకిని)

**మినురతనము** - ఆకాశమున రత్నము వంటివాడు (సూర్యుడు - మింటి మానికము)

**మినువాకతోబుట్టువు** - గంగకు తోడ బుట్టినవాడు (శూద్రుడు)

**మినుసిక గలాడు, మినుసికవాడు** - ఆకాశము జడముడిగా గలవాడు (శివుడు మింటిసిగవేల్పు)

**మినుసిగ దయ్యము** - ఆకాశము జుట్టుగా గల దేవుడు (శివుడు)

**మినుసిగదేవర, మినుసిగవేల్పు** - ఆకాశము నిండియున్న శిఖ కల దేవుడు (శివుడు)

**మిన్నుకొలకు** - ఆకాశమునందు సరస్సు వలె నున్నది (మిన్నేరు - మిన్నుకొలను)

**మిన్నువాక దాల్పు, మిన్నేటిదాల్పు** - స్వర్గంగను జటాజూటమున ధరించిన (బంధించిన) వాడు (శివుడు)

**మిన్నేరు** - మిన్నువాక (ఆకాశగంగ - చదలేరు)

**మిసిమింతుడు** - అలసినవాడు (శ్రాంతుడు)

**మిహికాకరుడు** - చల్లని కిరణములు గలవాడు (శీతకిరణుడు - చంద్రుడు)

**మిహిరుడు** - చల్లని కిరణములతో భూమిని తడుపువాడు (చంద్రుడు - చలివెల్గు) మేఘరూపమును దాల్చి భూమిని తడుపువాడు (సూర్యుడు - వేడివెల్గు)

**మీగండ్ల మెకము** - శిరమున నేత్రములు గల మృగము(ఊర్ధ్వనయన - శరభమృగము)

**మీనకేతనుడు** - చేప టెక్కెపు గుర్తుగా గలవాడు (మీను మొసలి సిడెంబుల మేటి - మన్మథుడు)

**మీనమూతి** - చేపలను జంపునది (కొంగ - బకము)

**మీనమార్గము** - చేప గ్రుడ్లను బెట్టి వానిని తిరిగి చూడజూడ నభివృద్ధి నొందినట్లు గురువు మరల మరల వచ్చి శిష్యు లభివృద్ధికి రావలెనని కటాక్షించు చుండుట

**మీనవల్లంకి** - నీటి మీది కురికి చేపలను బట్టెడు పక్షి విశేషము

**మీనాంకుడు** - మీనకేతనుడు (మన్మథుడు)

**మీనాక్షి** - చేప కన్నుల వంటి కన్నులు గల యాడుది (స్త్రీ - మచ్చెకంటి)

**మీనామ్రీణము** - చేపలు మామిడి బద్దలు వేసి (వండిన ^ ంటకము) ఉడుకబెట్టిన పులుసు

**మీనుమొసలి సిడెంబులమేటి** - చేపయు, మొసలియు ధ్వజములుగా గల వీరుడు (మీనకేతనుడు, మకరధ్వజుడు - మన్మథుడు)

**మీలగొంగ** - చేపలకు శత్రువు (కొంగ)

**మీలమ్రుచ్చు** - మీల వల్లంకి (మీలవల్లకి)

**మీలవేటరి** - చేపలను వలవేసి వేటాడు వాడు (బెస్తవాడు)

**మీలితాలంకారము** - వరస్పరము పోలిక గలిగియుండుటచే భేద మేమాత్రము తెలియ బడకయున్నచో మీలితా లంకారము (ఉదా - ఆ వనిత యొక్క సహజారుణిమ గల చరణము లందు లత్తుక పూత కానవచ్చుట లేదు)

**ముంగమురము** - ముంజేత దాల్చెడు కటక విశేషము (ముంగమురారి - ముంగాముఠము)

**ముంజకేశుడు** - ముంజ గడ్డి వంటి కేశములు గలవాడు (విష్ణువు)

**ముంజికాడు** - ముంజ గడ్డితో పేనిన మొలత్రాడు కలవాడు (బ్రహ్మచారి)

**ముండకుడు** - వెంట్రుకలు గొరుగువాడు (మంగలి - ముండి)

**ముండితుడు** - తల బోడియైనవాడు (బోడితలవాడు) గొరుగబడిన తల గలవాడు

**ముకుందుడు** - మోక్షము నిచ్చువాడు (విష్ణువు - మురారి)

**ముకుదూలము** - ముక్కు నడిమి యెముక (ముక్కు దూలము - ముక్కు కంబము)

**ముకురము** - దీనిచేత నలంకరింప బడుదురు (మకురము - అద్దము) కుమ్మరిసారె త్రిప్పెడి కఱ్ఱ (మకురము)

**ముక్కంటి** - మూడు కన్నులు గలవాడు (శివుడు)

**ముక్కంటి చెలి** - శివునకు మిత్రుడైన వాడు (కుబేరుడు - త్ర్యంబకసఖుడు)

**ముక్కంటి తలపువ్వు** - శివుని శిరమున బువ్వువలె నుండువాడు (చంద్రుడు)

**ముక్కంటి తొలిపట్టి** - ఈశ్వరుని తొలి కుమారుడు (విఘ్నేశ్వరుడు)

**ముక్కంటిపండు** - మూడు కన్నుల వంటి రంధ్రములు గల పండు (నారికేళ ఫలము)

**ముక్కంటిపండుల మెక్కెడు దిండీడు** - నారికేళ ఫలములను దినెడు సామి (విఘ్నేశ్వరుడు)

**ముక్కంటిమల** - ఈశ్వరుని పర్వతము (వెండి కొండ - కైలాసము)

**ముక్కంటిమావు** - శివుని వాహనము (వృషభము)

**ముక్కంటి యమ్ముల పొది** - శివుని బాణములకు పొదియైనది (సముద్రము)

**ముక్కంటి సంగాతి** - శివునకు నెచ్చెలికాడు (కుబేరుడు)

**ముక్కిడి** - ముక్కులేని వాడు (విఖ్యుడు అనాసికుడు)

**ముక్కు** - మూర్కొను (అఘ్రాణించు) సాధనమైనది (నాసిక)

**ముక్కోటిక** - శివునిచే ధ్వంసము చేయబడిన త్రిపురములు

**ముక్కోటికలకంటు** - తిగప్రోలుదాయ

**ముక్కోటికగెలుపరి** - త్రిపురములను గెలిచినవాడు (శివుడు)

**ముక్కొమ్ము మెకము** - ముందు కొమ్ములు గల మృగము (మనుబోతు - మనుబిళ్ళు)

**ముక్కోణము** - మూడు కోణములు గలదిగ నేర్పరచిన కొయ్య చట్రము (త్రికోణము)

**ముక్కోల** - మూడు కోలలు కలిపి కట్టిన దండము (త్రిదండము)

**ముక్తసంగుడు** - విషయ వాంఛ (లేనివాడు) విడిచినవాడు (సన్యాసి - నిస్సంగుడు)

**ముక్తాయింపు** - వాద్యము తోడను, నృత్యము తోడను గూడిన పాట యొక్క ముగియిక (ముక్తాయము - ముగింపు)

**ముక్తి** - ఆత్మను సంసారబంధము వలన విడిపించునది (మోక్షము)

**ముక్తిక్షేత్రము** - మోక్షము నొసగు పుణ్యక్షేత్రము (వారణాసి - కాశీ)

**ముఖంపచుడు** - మొగము ముందర పొగడువాడు (యాచకుడు)

**ముఖజాహము** - ముఖ మూలము

**ముఖదూషణము** - కంపుచే నోటిని చెడగొట్టునది (నీరుల్లి - పలాండువు)

**ముఖద్వారము** - నది సముద్రములో ప్రవేశించు చోటు ముఖ్యమైన ప్రవేశ ద్వారము (సింహద్వారము)

**ముఖ భూషణము** - ముఖమునకు (నోటికి) అలంకారము వంటిది (తాంబూలము - విడెము)

**ముఖ మంటపము** - గుడి గోపురము దగ్గర నుండు మంటపము

**ముఖరము** - మ్రోగునది (శంఖము)

**ముఖలాంగలము** - ముట్టెయే నాగలిగా గలది (పంది)

**ముగ్ధ** - ఉదయించు చున్న యౌవనము గల నాయిక

**ముచ్చిచ్చు** - గార్హాపత్యము, దక్షిణాగ్ని ఆహవనీయము అనుమూడగ్నులు (త్రేతాగ్నులు)

**ముట్టెమెకము** - పెద్దముట్టెగల మృగము, (ఊట మెకము - పంది)

**ముడికాళ్ళవాడు** - ఒండొటితో తగులు మోకాళ్ళు గలవాడు (ముట్టికాళ్ళవాడు - దొడ్డికాళ్లవాడు, సంజ్ఞువు)

**ముత్తెపురిక్క నెల** - చిత్రానక్షత్రముతో గూడిన పున్నమగల నెల

**ముత్తెపుసవతు** - ముత్తెము ఆణిపూస పోలిక గలది చిత్రానక్షత్రము - ముత్తెపురిక్క

**ముత్తెసరులు** - ముత్యాల హారములు, ధాన్యవిశేషము

**ముత్తైదువ** - వృద్ధురాలైన పుణ్యస్త్రీ (వృద్ధ సువాసిని)

**ముత్రోవద్రిమ్మరి** - ముల్లోకములందు ప్రవహించునది (గంగ)

**ముదిరము** - దీనిచే పైరు పెరిగి రైతు లానందింతురు (మబ్బు)

**ముదియని వారు** - ముదిమి లేనివారు (దేవతలు)

**ముదియని వారిలో బెద్ద** - దేవతలలో బెద్దవాడు (బ్రహ్మ)

**ముద్దయ్య** - మన్మథుని వలె సుందరుడైన స్వామి (కుమారస్వామి)

**ముద్దరాలు** - తెలివిలేని ఆడుది (అమాయకురాలు), పడునారేండ్లకు మించిన యాడుది (ముద్దియ)

**ముద్దుగల కాళ్ళపురుగు** - (దుగ = రెండు) ఆరు కాళ్ళుగల పురుగు (తుమ్మెద)

**ముద్దుగల తల్లుల బిడ్డడు** - ఆర్గురు తల్లులచే

బెంవబడిన ఆరు మొగములవాడు (కుమారస్వామి)

**ముద్దుగుమ్మ** - మనోజ్ఞురాలగు నాడుది (అందకత్తె)

**ముద్దురాలు, ముద్దులాడి** - మనోజ్ఞురాలగు నాడుది (మనోజ్ఞురాలు)

**ముద్రాక్షరశాల** - గ్రంధములు ముద్రించెడి గృహము (ముద్రాశాల)

**ముద్రారాక్షసము** - అచ్చులో వచ్చిన పొరపాటు, ఒక సంస్కృత నాటకము

**ముద్రాలంకారము** - ప్రకృతార్థముల నిచ్చు పదముల చేతనే సూచ్యార్థ సూచనమును చేయుట ( ఉదా - ఆటవెలదిగీత మందంబుగా జేసె మృదు పదాళి తోడ మెచ్చుపుట్ట), ఆటవెలది = వేశ్య మృదు పదములతో పాటపాడి మెప్పించె ప్రకృతార్థము జెప్పెడు పదములతో ప్రకృతమందు నూచింవదగిన ఆటవెలది - ఆటవెలది పద్యమును మృదుపదములతో మెప్పుకలుగున ట్లందముగా రచించెను)

**మునిముంగల** - ఎట్ట ఎదుట

**మునిముచ్చు** - చూచు చుండగనే దొంగిలించువాడు (పశ్యతోహరుడు), చూచుచుండగనే దొంగిలించు ఆడుది (పశ్యతోహర), మునివలె నటించెడువాడు (దొంగముని)

**మునియేడు** - కడచిన సంవత్సరమునకు పూర్వపు సంవత్సరము (నిరుటికి తొలి సంవత్సరము - మున్నేడు)

**మునుగు చీకటుల విచ్చుమొగ్గ** - ముందుగా జీకటులందు విరియు మొగ్గ (చంద్రుడు)

**మున్నడి** - ముందంజ వేయువాడు

**మున్నీటికన్నె** - మున్నీటి చూలి

**మున్నీటి గరిత** - సముద్రుని ఇల్లాలు (గంగ - సాగరపత్ని)

**మున్నీటి చూలి** - సముద్రుని కొమార్తె (లక్ష్మి)

**మున్నీటిపట్టి** - పాల్కడలి పట్టి (చంద్రుడు)

**మున్నీటి మొలనూలుమగువ** - సముద్రము మొలనూలుగా గల మగువ (భూదేవి)

**మున్నీటిరాణి** - సముద్రుని భార్య (గంగ - సాగరపత్ని)

**మున్నీరు** - మొదటినీరు (సముద్రము)

**మున్నుడి** - తొలిపలుకు (వేదము)

**ముప్పిడి** - మూడుపిడులు గల బాకు

**ముప్పోకలాడు** - మూడు త్రోవలు త్రొక్కిన వాడు (త్రిగుణాత్మకుడు)

**ముబ్బడి** - మూడు రెట్లు కలది (త్రిగుణితము)

**ముముక్షువు** - మోక్షేచ్ఛగలవాడు, విడువగోరువాడు

**ముమ్మొనకైదువు** - మూడు మొనలుగల బల్లెము (త్రిశూలము)

**ముమ్మొనయలుగు మేటి** - ముమ్మొన వాలు గల దిట్టరి (శివుడు)

**ముమ్మొనవాలు** - మూడు మొనలు గల ఆయుధము (త్రిశూలము - త్రిశిఖము)

**ముమ్మోటు** - మిక్కిలి మోటువాడు

**ముయ్యేరు** - మూడు లోకములందును ప్రవహించిన నది (గంగ - త్రిపథగ)

**మురజఫలము** - మద్దెల వంటి ఫలములు కలది (పనస చెట్టు)

**మురజము** - చర్మవలయము వలన నైనది (మద్దెల)

**మురద్విషుడు** - మురుడను రాక్షసుని శత్రువు (విష్ణువు - మురారి)

**మురమర్దనుడు** - మురుడను రాక్షసుని మర్దించిన వాడు (విష్ణువు - మురరిపువు)

**మురరిపువు** - మురాసురునకు పగవాడు (విష్ణువు మురవైరి)

**మురళీధరుడు** - పిల్లన గ్రోవిని ధరించిన వాడు (శ్రీకృష్ణుడు)

**మురారి** - మరాసురునకు శత్రువు

**ముళ్ళయతి** - ఒకరొకరికి జగడములు పెట్టెడు ముని (నారదుడు)

**మువ్వ** - మొనలో నోళ్ళవంటి మూడు సందులు గల గజ్జె (మూడు వాతులు కలది)

**మువ్వన్నె** - మూడు రంగులు గలది (త్రివర్ణకము)

**మువ్వన్నెకాడు** - చిత్రభానువు (సూర్యుడు)

**మువ్వన్నెమెకము** - మూడురంగులు గల మృగము (చిత్రకాయము - పులి)

**మువ్వన్నెవిల్లు** - మూడు వన్నెలు గల విల్లు (ఇంద్రధనుస్సు)

**ముమ్వెలుగు** - మూడు వెలుగులు కలవాడు (సూర్యుడు), మూడు వెలుగులు (యజ్ఞ సంబంధమగునవి - గార్హపత్యము దక్షిణాగ్ని, ఆహవనీయాగ్ని, - శరీరములో అపానము గార్హపత్యము వ్యానము (అన్వాహార్యపచనము) దక్షిణాగ్ని, ప్రాణ మాహవనీయాగ్ని)

**ముషితకము** - దొంగిలింపబడిన ఆస్తి

**ముష్కము** - రేతస్సును దాచియుంచునది (వృషణము - వట్ట)

**ముష్టింధయుడు** - పిడికిటిని గుడుచువాడు (శిశువు)

**ముష్టింపచుడు** - పిడికెడు బియ్యము ఉడికించుకొనువాడు (నిరుపేద - అకించనుడు)

**ముష్టీముష్టి** - ఒకరినొకరి పిడికిళ్ళతో నొప్పించుకొనుచు చేయు ద్వంద్వ యుద్ధము (ముష్టాముష్టి)

**ముసలము** - క్రుమ్మునది, దంచునది (రోకలి - గోకిలము)

**ముసలాయుధుడు, ముసలి** - ముసలము ఆయుధముగా గలవాడు (బలరాముడు)

**ముసల్యుడు** - రోకటిచేత క్రుమ్మదగిన వాడు

**ముస్తాదము** - తుంగముస్తెలు దినునది (ముస్తెల మేపరి - పంది)

**ముహూర్తము** - శుభ కార్యములకు నిర్ణయించుకొను కాలము, అల్పకాలము, రెండు గడియల కాలము, 12 క్షణముల కాలము, (మూరుతము)

**మూకము** - గాలము వేసి పట్టుకొన బడునది (చేప)

**మూకుడు** - నిరోధింపబడిన వాగ్వ్యాపారము కలవాడు (మూగవాడు)

**మూడంకెవేయు** - కాళ్ళు చేతులు ముడుచుకొని పండుకొను

**మూడు కన్నులయ్య** - మూడు కన్నులు గల సామి (శివుడు)

**మూడు కాళ్ళముసలి** - ఊత కఱ్ఱ మూడవ కాలుగా గలవాడు (వృద్ధుడు)

**మూడు మాటలతో ముడిపెట్టు** - తక్కువగా చెప్పిముగించు

**మూర్ఖుడు** - అజ్ఞానముచే మోహామును బొందువాడు (మూఢుడు)

**మూర్ధజము** - తలమీద పుట్టునది (శిరోజము - తలవెంట్రుక)

**మూర్ధన్యములు** - ఋ, ౠ, ట, ఠ, డ, ఢ, ణ, ర, ష అను నక్షరములు శిరస్సు నుండి పుట్టును)

**మూర్ధాభిషిక్తుడు** - శిరమున నభిషేకము చేయబడినవాడు

**మూలకర్మము** - మూలికల చేతనైన స్తంభన వశీకరణాది కర్మము (కార్మణము - చిల్లంగి)

**మూలజము** - వేరున పుట్టునది (అల్లము)

**మూలమట్టము** - గోడల మూలలను సరిచూచెడు మూడు మూలల మట్టపు పలక

**మూలవిరాట్టు** - కదలకుండ స్థాపింపబడిన దేవుని విగ్రహము

**మూలవ్యాధి** - గుదమందు పిలకలుగా బుట్టెడు వ్యాధి విశేషము

**మూలశంక** - గుదమున బుట్టెడు వ్యాధి (మూలవ్యాధి - గుదకీలము)

**మూలస్థానము** - దేవళమున మూల విగ్రహముండుతావు

**మూలాధారము** - గుహ్య లింగ స్థానములకు నడుమనుండు నాడుల కాధారమైన యొక చక్రము (యోగ చక్రములో మొదటిది)

**మూషకము**- అన్నాదులను దొంగిలించునది (ఎలుక)

**మూషకవాహనుడు** - మూషకము వాహనమైన వాడు (గణపతి)

**మూషికము** - మూషకము (ఎలుక)

**మూషికారాతి** - ఎలుకలకు విరోధి (మూషకారాతి పిల్లి)

**మూసిక** - మంగళ సూత్రము నందు తాళిబొట్టునకు ఇటునటు కూర్చుకొనెడు నానుక్రోవి

**మృగతృష్ణ** - మృగములకు ఆశకల్గించునది (ఎండమావులు)

**మృగదంశకము** -మృగములను కొరుకునది (కుక్క)

**మృగధూర్తకము** - జంతువులలో వంచక మైనది (నక్క)

**మృగనాభి** - కస్తూరి మృగము యొక్క బొడ్డు పుట్టు తావైనది (కస్తూరి - జింకపొక్కిలి)

**మృగపతి** - జంతుతతికి ప్రభువైనది (సింహము)

**మృగమదము** - కస్తూరి మృగము యొక్క మదము (మెకపుటాము - కస్తూరి)

**మృగము** - వేటకాండ్రచే అన్వేషింపబడునది (ఇఱ్ఱి)

**మృగయ** -మృగముల కొరకై అన్వేషించుట (వేట)

**మృగయుడు** - వధార్థమై మృగములను దరుముచు బోవువాడు (వేటకాడు)

**మృగరిపువు** - మృగములకు శత్రువైనది (సింహము)

**మృగలాంఛనుడు** - జింక చిహ్నముగా గలవాడు (చంద్రుడు)

**మృగవాహనుడు** - లేడి వాహనముగా గలవాడు (వాయువు)

**మృగాంకుడు**-మృగలాంఛనుడు(చంద్రుడు)

**మృగాక్షి** - లేడి కన్నుల వలె చంచలములైన కన్నులు గల స్త్రీ (మృగలోచన)

**మృగాజీవుడు** - జంతువులను, పక్షులను వేటాడి జీవించువాడు (బోయవాడు)

**మృగాజీవనము, మృగాదనము** - మృగములను చంపి తినునది (సివంగి)

**మృగేక్షణ** - లేడికన్నులవంటి కన్నులుగల స్త్రీ

**మృగీవిలోకన** - ఆడుజింక వంటి కన్నులు గల (కన్యక, స్త్రీ)

**మృడాని** - మృడుని భార్య (పార్వతి)

**మృడుడు** - భక్తులను సుఖపెట్టువాడు, స్వయముగ సంతోషము కలవాడు (శివుడు - శంకరుడు)

**మృణాలము** - హంసలు మున్నైన వానిచే భక్షింప బడునది (తామరతూడు - బిసము)

**మృణాల సూత్రము** - తామరకాడలోని సన్నని పోగు (బిసతంతువు)

**మృతకము** - మృతాశౌచము (మైల)

**మృతజీవము** - ఖండించినను తిరిగి చిగురించి జీవించునది (తిలకవృక్షము)

**మృత జీవుడు** - చచ్చినను కీర్తిచే జీవించి యున్నవాడు (కీర్తిశేషుడు)

**మృతప్రాయుడు** - చచ్చిన వానితో సాటియగువాడు

**మృత మారణము** - చచ్చిన వానిని చంపుట

**మృత సంజీవని** - చచ్చిన వానిని బ్రతికించు విద్య

**మృతాశౌచము** - చచ్చిన వాని వలన సోకెడు అపవిత్రత (అశుచి - మైల)

**మృత్కరుడు** - మట్టిపని చేసి జీవించువాడు (కుమ్మరి)

**మృత్తిక** - మెదుప (కలియగలుప) బడునది (మట్టి)

**మృత్యుంజయుడు** - మృత్యువును జయించినవాడు (శివుడు - మిత్తిగొంగ)

**మృత్యుఫలి** - మరణ కాలమున మాత్రమే (గెలను) ఫలము నిచ్చునది (అరటిచెట్టు)

**మృత్యుసూతి** - తన చావు కొరకు గర్భము దాల్చునది (పీత, తేలు - పిల్లలు చీల్చుకొని వచ్చును)

**మృత్స్న** - మంచి మన్ను (మృత్స)

**మృదంగము** - మృత్తు అంగముగా గలది, కొట్టబడునది (మద్దెల)

**మృదుపుష్పము** - మిక్కిలి నున్నితమైన పూలుపూయునది (శిరీషము - దిరిసెన చెట్టు)

**మృద్వి** - సుకుమారమైన పండ్లు కలది (మృద్వీక - ద్రాక్ష)

**మృషాకము** - అశక్యమైన సంగతి

**మృషామృధము** - నేర్చుకొనుటకై చేయునట్టి యుద్ధము, నాటకాదులలో ప్రదర్శించు యుద్ధము

**మెకపుటామ** - కస్తూరి మృగము యొక్క మదము (జింకపొక్కిలి - కస్తూరి)

**మెకములతిండి** - మృగాదనము (సివంగి)

**మెకములరేడు, మెకముల సామి** - మృగము లకు రాజు (సింహము - మృగనాథుడు)

**మెట్టవాలు పిట్ట** - పాదము అయుధముగా గల పులుగు (కోడి - చరణాయుధము)

**మెట్టినయిల్లు** - పెండ్లియై తాను అడుగు మోపిన యిల్లు (మెట్టినిల్లు - అత్తవారి యిల్లు)

**మెడవాలు** - బట్టల మోపుచే ఒరగెడు మెడకలవాడు (మడేలు - చాకలి)

**మెయి** - తోడకు బదులుగా వచ్చు ప్రత్యయము, ఒడలు (మేను)

**మెరుగుబోడి** - మెరుగు వంటి మేను కలది (చక్కని ఆడుది)

**మే** - ఒడలు, రీతి, వైపు

**మేక తిండి** - మేకలు తిండిగా కలది (వృకము - తోడేలు)

**మేకపోతుగాంభీర్యము** - లోన పిరికి తనమును

బయటకు గాంభీర్యమును ప్రదర్శించుట యందు వాడబడు జాతీయము

**మేకపోతుల కొట్లాట** - అజాయుద్ధము

**మేకవన్నె పులి** - బయటికి సాధువుగా కన్పించుచు హృదయము నందు క్రౌర్యము కల్గియుండుట

**మేఖలకన్యక** - మేఖల పర్వతమున బుట్టినది (నర్మదానది)

**మేఘజ్యోతి** - మేఘముల మధ్యనుండు వెలుగు (మెరుపు, విద్యుత్తు)

**మేఘద్వారము** - మేఘములకు ద్వారము వంటిది (ఆకాశము)

**మేఘనాదము** - మేఘముల నుండి వెలువడు ధ్వని (పిడుగు)

**మేఘనాదానులాసి** - మేఘనాదాను గుణముగ నృత్యము చేయునది (నెమలి మేఘనాదానులాసకము)

**మేఘపుష్పము** - మేఘము నందు పుష్పము వలె నుండునది (జలము)

**మేఘవాహనుడు** - మబ్బులు వాహనముగా గలవాడు (ఇంద్రుడు)

**మేఘాగమము** - ఘనాగమము (వానకారు)

**మేడికాయ బోనము** - ఇంపుగా కన్పించు అసంతృప్తికరమగు విందు భోజనము

**మేతాలుపు** - మేను ధరించినవాడు (శరీరి - మెయితాలుపు)

**మేధావంతుడు** - ధారణా శక్తిగల ప్రజ్ఞాశాలి

**మేదిని** - మధుకైటభుల మెదడు తానేర్పడుటకు కారణముగా గలది (భూమి)

**మేనకాత్మజ** - హిమవంతుని భార్యయగు మేనక కూతురు (పార్వతి), విశ్వామిత్రుని వలన అప్సరః స్త్రీ యగు మేనకకు బుట్టినది (శకుంతల)

**మేనరికము** - తోడబుట్టిన దానియొక్కయు, తల్లితోడ బుట్టిన వాని యొక్కయు బాంధవ్యము

**మేరుధన్వుడు** - మేరు పర్వతమును ధనుస్సుగా చేసికొన్నవాడు (శివుడు)

**మేరుపాదజము** - మేరు పర్వతము క్రింది భాగమున పుట్టునది (వెండి)

**మేలుకాడు** - మేలు చేయువాడు (అరిష్టతాతి క్షేమంకరుడు)

**మేలుబంతి** -విద్యార్థులు చూచి వ్రాయుటకు మీద వ్రాసిన అక్షరముల పంక్తి (ఒజ్జబంతి)

**మేహనము** - వీర్యముచే భగమును తడుపునది (శిశ్నము)

**మేహము** - మూత్రమును వృద్ధిచేయు రోగము (ప్రమేహరోగము)

**మై** - దేహము, తడవ, ప్రక్క, కొన్ని యెడల తృతీయా విభక్తియందు వచ్చెడి ప్రత్యయము (మయి)

**మైతాలుపు** - మేను ధరించినది (మయితాలుపు - శరీరి)

**మైత్రావరుణి** - మిత్రావరుణులకు సంతానమైన వాడు (అగస్త్యుడు)

**మైనాకుడు** - మేనకా హిమవంతుల కుమారుడు

**మొండెపుగ్రాము** - తలలేని దేహము గల గ్రహము (కేతుగ్రహము)

**మొండెపు రక్కసుడు** - తలయు కాళ్ళులేని పెద్దపొట్ట చేతులు గల రక్కసుడు (కబంధుడు)

**మొక్కపోవు** -మొన వంగినదగు (భంగపడు)

**మొగడ** - ముడుచుకొని యుండునది (మొగ్గ - ముకుళము కోరకము)

**మొగపిరికి** - అలికిడి యైనచో తల (మొగము) చిప్పలో దాచుకొనునది (తాబేలు)

**మొగము తెల్పుమెకము** - తెల్లని ముఖము గల జంతువు (ఎలుగుబంటి)

**మొగసరి** - గుఱ్ఱపు ముఖమున కట్టెడి ఒక అలంకారము (మోముట్టు-మొగముట్టు)

**మొగులుదారి** - మేఘ ద్వారము (మొగిలు త్రోవ - ఆకాశము)

**మొగులువిరి** - మొగులునకు విరియగునది (మేఘపుష్పము - నీరు)

**మొదటి పల్కులు** - తొలు పలుకులు (వేదములు)

**మొదటి వేల్పు** - దేవతలలో పెద్దవాడు (సురజ్యేష్ఠుడు - బ్రహ్మ)

**మొనవాలు** - మొనగలవాలు (బల్లెము - శూలము)

**మొసలి టెక్కెముజోదు** - మకరధ్వజుడు (మన్మథుడు)

**మోక్షపురి** - మోక్షదాయకమగు పట్టణము (కాంచీపురము) ఈ పట్టణమున చనిపోయిన వారికి మోక్షము సిద్ధించును (కాశి)

**మోక్షము** - జీవుని బాశముల నుండి తొలగించునది, ఋణ విమోచనము

**మోటువామెకము** - మోటైన ముట్టెగల అడవి జంతువు (మోటుమెకము - అడవి పంది)

**మోట్టాయితము** - ప్రియుని యెడ స్త్రీకి గల్గు శృంగార చేష్టావిశేషము

**మోదక ప్రియుడు** - ఉండ్రములను ప్రీతితో అరగించువాడు (గణపతి)

**మోహనము** - చిత్త విభ్రమమును కల్గించు మన్మథుని బాణము (సమ్మోహన శక్తి గల బాణము), మోహమును గల్గించునది

**మౌంజీధరుడు** - ముంజదర్భల మొలనూలు ధరించిన వాడు (బ్రహ్మచారి)

**మౌక్తికము** - ముత్యపుచిప్ప వలన విడువబడినది (ముత్తెము)

**మౌద్గీనము** - పెసలు పండు పొలము

**మౌనము** - ముని యొక్క భావము (మాటాడకుండుట)

**మౌని** - మౌనము వహించువాడు (ఋషి)

**మౌరజికుడు** - మద్దెల వాయించువాడు (మార్దంగికుడు)

**మౌర్వి** - చాగ నారతో అల్లబడునది (అల్లెత్రాడు - వింటినారి)

**మౌష్టక్రీడ** - పిడికిళ్ళు బిగించి గుద్దుకొను ఆట (బాక్సింగ్)

**మౌహూర్తికుడు** - ముహూర్తములు పెట్టు వాడు

**మ్రాగన్ను** - సోలిక కన్ను

**మ్రానిపోటు పులుగు** - ముక్కుతో చెట్లను దొలచు పిట్ట (వడ్రంగిపిట్ట - దార్వా ఘాటము)

**మ్రానుద్రిమ్మరి** - చెట్లపై సంచరించునది (కోతి)

**మ్రానుమనికి** - చెట్లు ఉనికిగా గలది (కోతి మ్రానుటిక్క)

**మ్రుచ్చిలిపోటు** - నిద్రపోవుచుండగా మీదబడి చేయు యుద్ధము

**మ్రుచ్చుపొద్దు** - దొంగలు తిరుగాడు ప్రొద్దు (నడురేయి - అర్ధరాత్రము)

**మ్లేచ్ఛకందము** - అనార్యుల కిష్టమైన గడ్డ (వెల్లుల్లి - లశునము)

**మ్లేచ్ఛముఖము, మ్లేచ్ఛాస్యము** - మ్లేచ్ఛుల మొగము వలె ఎఱ్ఱనైన లోహము (రాగి - తామ్రము)

**యంత** - ఏనుగును అదుపులో పెట్టువాడు

(మావటీడు) రథగమనమును నియమించు వాడు (సారథి)

**యక్షకర్దమము** - కర్పూరము, అగురు, కస్తూరి, చందనము, కుంకుమ పూవు తక్కోలము అనువాని చూర్ణముతో జేసిన సుగంధ ద్రవ్య విశేషము

**యక్షగానము** - పురాణ గాథాప్రధానమై, కీర్తనలు, పద్యములు గల ప్రయోగార్హమగు ఒక కావ్యము (భామా కలాపము, రామదాసు చరిత్ర)

**యక్షధూపము** - యక్షుల కిష్టమైన ధూపము

**యక్ష ప్రశ్నలు** - అంతు చిక్కని జిడ్డు ప్రశ్నలు

**యక్షరాట్టు** - యక్షు లను దేవజాతి వారికి ప్రభువు (కుబేరుడు)

**యక్షవాసము** - యక్షుడు నివసించు చెట్టు (వటవృక్షము - మఱ్ఱిచెట్టు)

**యక్ష్మ** - రోగరాజమగుటచే పూజింపబడునది (ఆరుతెవులు - క్షయరోగము)

**యక్ష్మఘ్ని** - క్షయరోగమును హరించునది

**యజమానుడు** - యజ్ఞము చేయుచున్న వాడు (యాగకర్త)

**యజ్ఞభోక్త**-యాగమునందలి హవిరాదికము ననుభవించువాడు (వేల్పు)

**యజ్వ** - యజ్ఞము చేసినవాడు

**యతేంద్రియుడు** - ఇంద్రియములను వశపరచుకొన్నవాడు

**యథాజాతుడు** - పుట్టిన నాటివలె తెలివి లేక యుండువాడు (అవివేకి)

**యథాయథలు** - తారుమారు, చెల్లాచెదరు

**యథార్థవర్ణుడు** - ఉన్న దున్నట్లుగా వివరించువాడు (వేగులవాడు)

**యథార్హవర్ణుడు** - తగు విధముగ పలుకువాడు (చారుడు)

**యథాశక్తి** - శక్తి నతిక్రమింపక (శక్తి కొలది)

**యథాసంఖ్యము** - క్రమ సంఖ్య గల వానిని వరుసగా క్రమసంఖ్య వానితో నన్వయ మేర్పడునట్లు చెప్పుట (ఉదా - పుత్రులను, మిత్రులను, శత్రులను పోషింపుము,భూషింపుము, దండింపుము ఇందు పుత్రులను పోషింపుము, మిత్రులను భూషింపుము, శత్రులను దండింపుమని అన్వయము - ఒకానొక అర్థాలంకారము)

**యథేష్టము** - ఇష్టము వచ్చినట్లుగా (ఇష్టాను సారము - యథేచ్ఛము)

**యదృచ్ఛాభిజ్ఞుడు** - మాటల సందర్భముననే కార్యముల నిజరూపమును తెలిసికొన్న సాక్షి, తనంతట తానే వచ్చిన సాక్షి - డబ్బాటు సాకిరి)

**యద్భవిష్యుడు** - ఏది యెట్లైనను కానిమ్మని యుపేక్షించువాడు

**యమకము** - ప్రయోగించిన పదమునే అర్థ భేదముతో మరల మరల బ్రయోగించుట (ఒకానొక శబ్దాలంకారము ఉదా- ఆ సైనిక నికాయంబులో గాయంబు గానివాడు లేడు )

**యమకింకరుడు** - యమదూత (మృత్యు దూత)

**యమధారము** - రెండువైపుల పదను గల కత్తి

**యమరథము** - యముని రథము (దున్నపోతు)

**యమరాజు, యమరాట్టు** - ప్రజల నియమించు మృత్యువు మొదలగు యములకును నియామకుడు (యమధర్మరాజు - శమనుడు)

**యమలుడు** - కవలలో ఒకడు

**యమి** - సంయమము కలవాడు (యతి)

**యమునాభిదుడు** - యమునను చీల్చిన వాడు (బలరాముడు - హలాయుధుడు)

**యమునాభ్రాత** - యమున (నది)కు సోదరుడు (యముడు)

**యయావరము** - అశ్వమేధమునకు నర్హమైన అశ్వము, ఇల్లిల్లు తిరిగి బిచ్చ మెత్తుట (ఆయవారము)

**యయువు** - విడివడి ప్రతిదేశము వెళ్ళునది (యాగాశ్వము)

**యవిష్ఠుడు** - అందరకంటె చిన్నవాడు (చిన్నతమ్ముడు)

**యవీయసుడు** - మొదటి వానికంటె చిన్నవాడు (తమ్ముడు - చిన్నవాడు, యవీయసి। చెల్లెలు)

**యశస్కాముడు** - కీర్తిని గోరువాడు

**యష్టిక** - నూరు పేటల హారము

**యాచిష్ణువు** - అడుగుకొనెడు శీలము కలవాడు (భిక్షుకుడు)

**యాజకుడు** - యాగము చేయించువాడు (పురోహితుడు, ఋత్విక్కు)

**యాజుషము** - యజుర్వేద సంబంధమైనది

**యాజ్ఞికుడు** - యజ్ఞము చేయించువాడు (యాజయిత - ఋత్విక్కు)

**యాతుధానుడు** - యాతు వనెడి నామము కలిగినవాడు (రాక్షసుడు)

**యాతువు** - వెళ్ళువాడు

**యాదఃపతి, యాదసాంపతి**-జలజంతువుల కెల్ల ప్రభువైనవాడు (సముద్రుడు)

**యాదస్సు** - విచ్చల విడిగా తిరుగు క్రూర జలజంతువు

**యాదృచ్ఛికము**-ఆకస్మికముగ సంభవించినది

**యాదోనాథుడు** - జలజంతువులకు ప్రభువైన వాడు (సముద్రుడు)

**యానకము** - పోవుటకు (ప్రయాణ) సాధనమైనది (బండి)

**యానకుడు** - బండ్లు (యానకములు) చేయువాడు (వడ్రంగి)

**యానపాత్రము**- ప్రయాణ సాధనమైనది(నావ)

**యామఘోషము** - ప్రతి జామునకు కూయునది (కోడి)

**యామికుడు** - ప్రతి యామమునకు పారా తిరుగువాడు (తలారి - ఆరక్షుడు)

**యామునము** - యమున (నది) కు సంబంధించినది

**యాయజూకుడు** - పలుమారు యజ్ఞములు చేయువాడు

**యాయావరుడు** - గ్రామ గ్రామము తిరిగెడు భిక్షుకు డగుముని

**యాశోదేయుడు** - యశోద కొడుకు (కన్నయ్య - కృష్ణుడు)

**యాష్టికుడు** - బడితె ఆయుధముగా గలవాడు

**యుగంధరము** - బండియొక్క కాడిని ధరించునది (బండినొగ - కూబరము)

**యుగపత్త్రకము** - జంటగా కలిసిన ఆకులు కలది, నొగవలె కలిసిన ఆకులు కలది (ఎఱ్ఱకాంచనము)

**యుగాంతము** - కృత, త్రేతా, ద్వావర, కలియుగముల చివరి భాగము (ప్రళయ కాలము)

**యుగ్యము** - కాడికి కూర్పదగినది (ఎద్దు)

**యుధిష్ఠిరుడు** - యుద్ధము నందు నిలద్రొక్కు కొనువాడు (ధర్మరాజు)

**యువతి** - ఈడు వచ్చిన యాడుది (పడుచుది)

**యువరాజు** - పట్టాభిషేకమునకు యోగ్యుడైన రాజపుత్రుడు

**యూపము** - యాగ పశువును కట్టుటకై నాటిన పై పట్టలేని కొయ్య (యూపదారువు)

**యోక్త్రము** - పశువుల మెడకు తగిలించెడి త్రాడు (పలుపు - ఆబంధము)

**యోగపట్టము** - యోగులు జందెముగా ధరించు వస్త్రపు పట్టె

**యోగపూర్వికాభిధ** - అవయవార్థము కలిగి సంకేతితార్థమును స్ఫురింప జేసెడు శబ్దశక్తి (ఉ - రత్నగర్భ = తనలో రత్నములు గలది = భూమి)

**యోగవాగములు** - అంతరిక్షమార్గమున బోయెడు యోగసిద్ధులు తొడిగికొనెడు పావుకోళ్ళు

**యోజనగంధ** - నాల్గు క్రోసుల (ఆమడ) దూరము పరిమళించునది (కస్తూరి)

**యోని** - శిశ్నముతో కూడుకొనునది (భగము - ఆడుగురి)

**యోనిసంకరము** - అశాస్త్రీయమగు భిన్నజాతుల వారి పెండ్లి (వర్ణాంతర వివాహము)

**యోష** - పురుషునితో కలియునది (స్త్రీ)

**యోషాప్రియ** - స్త్రీల కిష్టమైనది (పసుపు)

**యోషిత్తు** - పురుషుని సేవించునది (యోష - అతివ)

**యౌగపద్యము** - ఏకకాలమున జరుగుట (యుగపద్భావము)

**యౌగికము** - యోగము వలన కలిగినది, వ్యుత్పత్తిచే సిద్ధమైన అర్థము

**యౌతకము** - పెండ్లి కాలమున వధువున కిచ్చిన ద్రవ్యము (సారె - అరణము)

**యౌథికుడు** - సంఘము లోనివాడు (సంఘవాసి)

**యౌవతేయుడు** - చిన్నపడుచు యొక్క కొడుకు

**యౌష్మాకము** - మీ సంబంధమైనది (యౌష్మికము)

**రంకువు** - తెల్ల వెండ్రుకలును మృదువైన చర్మమును గల జింక

**రంగజము** - తగరము నుండి పుట్టినది.

**రంగవల్లి** - పిండి మొదలైన వానితో రంగులు కలిపి వేయు రేఖ (ముగ్గు)

**రంగాజీవుడు** - చిత్తరువులు వ్రాయువాడు రంగస్థలమున నాట్యము చేయువాడు (చిత్రకారుడు, నటుడు)

**రంజకుడు** - రంగులు వేయువాడు, రంజించువాడు

**రంజన కిరణములు** - రంజన్ (రమ్జన్) శాస్త్రజ్ఞునిచే పరిశోధింప బడిన కిరణములు (ఎక్స్ కిరణములు - ఎక్స్‌రేస్)

**రంపెలాడి** - దారుణ కృత్యము లొనర్చు స్త్రీ

**రక్కసుల గొంగ** - రాక్షసులకు శత్రువు (దైత్యారి - విష్ణువు)

**రక్తగ్రీవము** - ఎఱ్ఱని కంఠము కలది (పావురము)

**రక్తతుండము** - ఎఱ్ఱని ముక్కు కలది (చిలుక)

**రక్తదృక్కు** - ఎఱ్ఱని కన్నులు గలది (పావురము)

**రక్తప** - నెత్తురు పీల్చునది (నల్లి, జలగ)

**రక్తపాయి** - రక్తమును త్రాగునది (నల్లి మత్కుణము)

**రక్తపాదము** - ఎఱ్ఱని పాదములు కలది (చిలుక)

**రక్తపాయిని** - నెత్తురు త్రావునది (జలగ)

**రక్తపుచ్ఛిక** - ఎఱ్ఱని తోక గలది (నలికండ్లపాము - నలికీచు)

**రక్తపుడు** - రక్తమును ద్రాగువాడు (రాక్షసుడు)

**రక్త ఫల** - ఎఱ్ఱని పండ్లు గలది (దొండ)

**రక్త బీజము** - ఎఱ్ఱని గింజలు కలది (దానిమ్మ)

**రక్త బీజుడు** - దేవి సంహరించిన శుంభ నిశుంభుల సేనాధిపతి (ఒక దనుజుడు)

**రక్తభవము** - రక్తము వలన ఏర్పడినది (మాంసము)

**రక్తము** - ఎఱ్ఱని వన్నె గలది (నెత్తురు)

**రక్తమూర్ధము** - ఎఱ్ఱని తలగలది(బెగ్గురుపక్షి)

**రక్తలోచనము** - ఎఱ్ఱని నేత్రములు గలది (పావురము - రక్తనేత్రము)

**రక్తవర్ణము** - ఎఱ్ఱని వన్నె కలది (ఆరుద్ర పురుగు)

**రక్తాంగుడు** - ఎఱ్ఱని యవయవములు కలవాడు (అంగారకుడు)

**రక్తాక్షము** - ఎఱ్ఱని కన్నులు గలది (బెగ్గురుపక్షి)

**రక్తోత్పలము** - ఎఱ్ఱ గలువ (రక్త కైరవము - రక్తకహ్లారము)

**రక్షకుడు** - కాపాడు వాడు (త్రాత)

**రక్షరేకు** - రక్షణార్థము మంత్ర బీజాక్షరములు వ్రాసిన రేకు

**రక్ష్యము** - కాపాడదగినది (రక్షితవ్యము - త్రాతవ్యము)

**రజతాద్రి** - వెండి కొండ (కైలాసము)

**రజనీకరుడు** - రాత్రిని కలిగించువాడు (చంద్రుడు)

**రజనీచరుడు** - రాత్రులందు తిరుగువాడు (దొంగ, రాక్షసుడు)

**రజనీ వల్లభుడు** - రాత్రులకు ప్రభువు (చంద్రుడు - రజనీకాంతుడు)

**రజస్సు** - జీవులను రాగయుక్తులనుగా జేయు గుణము (రజోగుణము) ముట్టు నెత్తురు

**రజోహరుడు** - వస్త్రముల మురికిని బోగొట్టువాడు (చాకలి)

**రజ్జులాడి** - తన్ను తాను పొగడుకొను స్త్రీ

**రజ్జులాడు** - తన్ను తాను పొగడుకొనువాడు, డంబములాడువాడు

**రతికూజితము** - రతి సమయమున స్త్రీ చేయు అవ్యక్త మధుర ధ్వ ' 'మణితము)

**రతనవుగని** - రత్నములకు గనియైనది (సముద్రము - రత్నాకరము)

**రతిపతి** - రతిదేవి భర్త (మన్మధుడు)

**రత్నగర్భ** - రత్నములు గర్భమునందు గలది (భూమి - వసుంధర)

**రత్నగర్భుడు** - రత్నములు తనలో (గర్భమున) గలవాడు (సముద్రుడు)

**రత్నసువు** - మణుల నొసగునది (భూమి)

**రత్నాకరము** - మణుల గని (సముద్రము)

**రత్నావళి** - వరుసను దప్పింపక ప్రకృతార్థములను గూర్చి చెప్పబడినది (ఓ రాజా నీవు చతురాననుడవు, పురుషోత్తముడవు, సర్వజ్ఞుడవు చతురాననుడవు, పురుషోత్తముడవు, సర్వజ్ఞుడవు అను పదములు ప్రకృతార్థముతో పాటు బ్రహ్మవిష్ణు మహేశ్వరులను అప్రకృతార్థమున క్రమముగా నిర్దేశించుట జరిగినది

**రథాంగనామము** - రథాంగమైన చక్రము పేరున కలది (రథాంగాహ్వయము - చక్రవాకపక్షి)

**రథాంగపాణి** - రథాంగమగు చక్రము పాణి యందు కలవాడు (చక్రపాణి-విష్ణువు)

**రథికుడు** - రథము నెక్కి వెళ్ళువాడు రథము నెక్కి యుద్ధము చేయువాడు (రథి)

**రథిని** - రథ సమూహము గలది (సేన)

**రదచ్ఛదము** - పండ్లను కప్పునది (వాతెర పెదవి)

**రదాయుధము** - కోరలు ఆయుధముగా గలది (పంది - దంష్ట్రి)

**రమ** - క్రీడించునది (లక్ష్మీదేవి, సంపద)

**రమణి** - క్రీడించునాడుది

**రమాప్రియము** - లక్ష్మీదేవికి ప్రియమైనది (తామరపువ్వు)

**రవి**-లోకులచే స్తుతింపబడువాడు(సూర్యుడు)

**రవిజుడు** - సూర్యుని కొడుకు (యముడు, శని, సుగ్రీవుడు, కర్ణుడు)

**రవివారము** - సూర్యునకు ఇష్టమైన వారము (ఆదివారము)

**రశన** - 16 పేటలు గల యాడుదాని మొలనూలు (రసన)

**రసఘ్నము** - పాదరసమును పాడు చేయునది (వెలిగారము)

**రసజ్ఞ** - తిక్త కషాయాది రసములను గుర్తించునది (నాలుక - జిహ్వ)

**రసజ్ఞత** -కావ్య శృంగారాది రసముల నాస్వాదించు నేర్పు (రసగ్రహణశక్తి)

**రసజ్ఞుడు** - రసగ్రహణ శక్తి గలవాడు

**రసన** - రసము నాస్వాదించునది (నాలుక)

**రసవాదము** - పాదరసమును గట్టి బంగారము తయారు చేయు విద్య

**రసాతలము** - అధోలోకములలో కడవటిది (పాతాళము)

**రసికుడు** - రసజ్ఞుడు

**రసేంద్రము** - గంధకము, అభ్రకము, ఇంగిలీకము, మణిశిల మొదలగు రసములలో శ్రేష్ఠమైనది ( పాదరసము)

**రసోత్తమము** -రసములలో ఉత్తమమైనది (పాలు)

**రసోద్భవము** - ఉదకము నుండి కల్గినది (ముత్యము)

**రసోనకము, రసోనము** - షడ్రసములలో పులు పొక్కటి కొరవడినది (వెల్లుల్లి-లశునము)

**రహస్యము** - కప్పిపుచ్చదగినది ( గోప్యము)

**రాంకవము** - రంకువు యొక్క రోమములచే నేయబడిన కంబళి,

**రాంభము** - సన్న్యాసి చేత బట్టెడు వెదురుకోల (రంభము)

**రాక** -పదునాఱు కళలతో గూడిన చంద్రుడు కలది (పూర్ణిమ) తొలిసమర్త ఆడిన పడుచు ( సమర్తాడినది)

**రాక్షసము** - కన్యను బంధించి తెచ్చి చేసికొనెడు వివాహము, రాక్షస సంబంధ మైనది

**రాగి** - ఎరుపుగలది, అనురాగము గలది

**రాఘువుడు** - రఘువంశమున బుట్టినవాడు (శ్రీరాముడు)

**రాచకురుపు** - వీపున లేచెడి ఒక పెద్ద పుండు (రాచపుండు - పుట్టకురుపు)

**రాచవీడు** - రాజుయొక్క ముఖ్యపట్టణము (రాజునివసించుపట్టణము - రాజధాని

**రాచూలి** - రాజపుత్రుడు (పుత్రిక)

**రాజకము** - రాజుల సమూహము

**రాజధాని** - రాజు నివసించు ప్రధాన పట్టణము (రాజునెలవు - రాచవీడు)

**రాజన్వంతము** - మంచిరాజుగల రాజ్యము

**రాజబీజి** - రాజవంశమువాడు (రాచవాడు)

**రాజమార్గము** - రథములు మొదలగునవి పోదగిన ప్రధానవీధి (రాజవీధి)

**రాజమాషము** - కాయధాన్యములలో శ్రేష్ఠమైనది (అలసందె-పెద్దబొబ్బర)

**రాజయోగము** - రాజులభ్యసించుటకై యేర్పరచిన అష్టాంగయోగము, జననకాలమున మనుష్యునకు గ్రహబలమువలన కల్గుస్థితి, రాజు కాదగినట్లు తెల్పెడి గ్రహముల యోగము

**రాజర్షి** -తపస్సుచేసి ఋషియైన క్షత్రియుడు

**రాజసము** - రజోగుణ సంబంధమైన (వృత్తి) వ్యాపారము (గర్వము)

**రాజసూయము**-రాజుదిగ్విజయానంతరము చేసెడి యాగము

**రాజహంస** - ఎఱ్ఱని ముక్కును ఎఱ్ఱని కాళ్ళును గలిగి తెల్లనైయుండు రాయంచ (కొంచెముదుమ్ము), వన్నె ముక్కు కాళ్ళుగల్గి మధురముగా బలుకు హంస- కాదంబము, మలినమైన ముక్కు కాళ్ళుగల హంస మల్లికాక్షము)

**రాజార్హము**- రాజునకు దగినది (కర్పూరము, అగురు)

**రాజీనామా** - ఉద్యోగమునకిచ్చెడె విడుదల పత్రము, వాది ప్రతివాదులు కుదుర్చు కొన్న ఒప్పందపత్రము

**రాజీవము** - రాజుననుసరించి జీవించునది (పద్మము)

**రాత్రించరి** - రాత్రులందు తిరుగునది (రాక్షసస్త్రీ)

**రాత్రించరుడు** - రజనీచరుడు (నిశాచరుడు - రాక్షసుడు)

**రాత్రికరుడు** - రజనీకరుడు (చంద్రుడు)

**రాత్రి జాగరము**-రాత్రివేల్కొని యుండునది (జాగిలము-కుక్క రాత్రి జామున కొకసారి మెలకువతో కూయునది (కోడి)

**రాత్రిమణి** - రాత్రులందు మణివలె ప్రకాశించువాడు (చంద్రుడు)

**రాత్రివాసస్సు**- రేయికి వలువవంటిది (చీకటి)

**రాత్రివేదము** - రాత్రియందు సమయమును (కాలమును) తెలుపునది (కోడి)

**రాధేయుడు** - రాధయను శూద్రస్త్రీచే పెంపబడినవాడు (కర్ణుడు)

**రాద్ధాంతము**- హేతు ప్రమాణాదులచే సిద్ధమైన అంతము కలది ( సిద్ధాంతము)

**రానిరాబారి** - రాజర్షి (విశ్వామిత్రుడు)

**రాబందు** - ప్రాణములు విడిచిన పిమ్మట రామునిచే అగ్ని సంస్కారము కావింప బడిన జటాయుజాతి పక్షి (రాచపుల్గు - కంకతము రామబంధుః)

**రాభస్యము**- బలాత్కారము

**రామగిరి** - చిత్రకూట పర్వతము

**రామఠము** - రామఠమను దేశమున బుట్టునది (ఇంగువ)

**రామము** - వేటగాళ్ళకు ఆనందమును కల్గించునది ( దుప్పి)

**రామాయణము** - శ్రీరామ చరిత్రమును దెల్పెడి ఆదికవి వాల్మీకి ప్రణీత కావ్యము

**రాముడు** - రమింపజేయువాడు

**రావణుడు** - గొప్పరావము చేసినవాడు, ప్రజలను మొరపెట్టించువాడు

**రాష్ట్రియుడు** - రాజు యొక్క బావమఱది (రాజశ్యాలకుడు)

**రాసభము** - బిగ్గరగా ఓండ్రపెట్టునది (గాడిద, రాసభి-గార్ధభి - ఆడుగాడిద)

**రాసము** - గోపకుల క్రీడా విశేషము, కోలాహల ధ్వని

**రాహురత్నము** - రాహుగ్రహమునకు ప్రియమైనది (గోమేధికము)

**రాహువు** - సూర్యచంద్రులను కబళించి విడుచువాడు (తలగాము - సైంహికేయుడు)

**రిక్కరక్కసుమిత్తి** - తారకాసురుని జంపిన వాడు (కుమారస్వామి - రెల్లుచూలి)

**రిత్తకాడు** - సంబంధము లేనివాడు (అన్యుడు తేరకాడు)

**రిరంసువు** - రమింప నిచ్ఛగలవాడు

**రిరక్షువు** - కాపాడ కోరిక గలవాడు

**రిశ్యము** - మాంసము కొరకు నొప్పింప బడునది (ఒకజాతి మృగము)

**రిష్టి** - దీనిచే హింసింపబడుదురు (కత్తి)

**రుక్మకారకుడు** - స్వర్ణకారుడు (కంసాలి)

**రుద్రభూమి** - ఈశ్వరుని నివాస స్థలము (శ్మశానము)

**రుద్రాక్షము** - రుద్రుని కంటి నుండి పుట్టినది

**రుద్రాణి** - రుద్రుని భార్య (పార్వతి)

**రుద్రులు** - దుష్టుల దుఃఖింపజేయువారు, దుఃఖమును బోగొట్టువారు కల్పాది యందు వేదస్వరూపమగు రుతము (శబ్దము)ను బలుకువారు, (అజుడు, ఏకపాదుడు, అహిర్బుధ్న్యుడు, త్వష్ట, రుద్రుడు, హరుడు శంభుడు, త్ర్యంబకుడు, అపరాజితుడు, ఈశానుడు, త్రిభువనుడు వీరు 11 గురును ఏకాదశరుద్రులు)

**రుధిరము** - చర్మముచే కప్పబడునది (నెత్తురు - అస్రము)

**రుధిరామయము** - రక్తము స్రవించు రోగము

**రుధిరుడు**-నెత్తురువలె ఎఱ్ఱగా నుండువాడు (కుజుడు - అంగారకుడు)

**రుద్ధము** - అరికట్టబడినది, ఆవరింపబడినది

**రూక్షగంధకము** - తీవ్రమైన గంధము గలది (గుగ్గులువు)

**రూపకము** - ఉపమేయము నందు ఉపమానము యొక్క రూపము నారోపించుట (రూపకము రెండు విధములు - అభేద, తాద్రూప్య రూపకములు అభేద రూపకము మూడు విధములు న్యూనాభేద, అధికాభేద, అనుభయాభేద రూపకములు న్యూన తాద్రూప్య, అధిక తాద్రూప్య, అనుభయా భేద తాద్రూప్య రూపకములు మూడు)

**రూపాజీవ** - రూపమే జీవనాధారముగా గలది (రోయింతి - వేశ్య)

**రూప్యము** - అందమైనది

**రూషితము** - దుమ్ముచే కప్పబడినది, మణులు పొదుగబడినది

**రెంటత్రాగుడు తిండి** - రెంట త్రాగుడు = ఏనుగు ఏనుగు ఆహారముగా గలది (సింహము)

**రెంట త్రాగుడు మెకము**-నోరు తొండములచే ద్రాగునది (ద్విపము - ఏనుగు, రెట్టిత్రాగుడు)

**రెల్లుకాసుపుతాత** - రెల్లు చూలికి తాతయైన వాడు (హిమవంతుడు)

**రెల్లుకాసువు, రెల్లుచూలి** - రెల్లు గడ్డియందు బుట్టిన బిడ్డడు (కుమారస్వామి - శరవణ భవుడు)

**రేకంటు** - రాత్రికి పగవాడు (సూర్యుడు ఇరులగొంగ, ఇరులదాయ)

**రేఖా గణితము** - క్షేత్ర గణితము

**రేచితము** - వక్రగతిలేని యశ్వధారా విశేషము (గుఱ్ఱపుదౌడు)

**రేచీకు** - రాత్రి కన్నులు కన్పడనిది, రాత్రి కన్నులు కనబడనివాడు,

**రేజోతి** - రేయి యందు జోతి (రేవెల్గు - నిశామణి (చంద్రుడు)

**రేణురూషితము** - దుమ్ముచే కప్పబడినది (గాడిద)

**రేణువాసము** - పుష్పరజముపై వ్రాలి యుండునది (తుమ్మెద - మధులిహము)

**రేదొర** - రాత్రికి ప్రభువైనవాడు (చంద్రుడు)

**రేద్రిమ్మరి, రేద్రిమ్మరీడు** - రాత్రులందు తిరుగువాడు (రాక్షసుడు - నిశాచరుడు)

**రేరాయడు, రేరేడు** - రేదొర (చంద్రుడు)

**రేవుజక్కి** - చాకిరేవున గుఱ్ఱము వంటిది (గాడిద - రాసభము)

**రేవెలుగురాయి** - వెన్నెల తాకిడికి స్రవించెడు చలువరాయి (చంద్రకాంత శిల)

**రొక్కపుదొర** - నవనిధులకు ప్రభువు (కుబేరుడు - రొక్కపు టొడయడు)

**రోగఘ్నము** - రోగమును జంపునది (మందు)

**రోగము** - (స్వాస్థ్యమును) చెరచునది (తెవులు - జబ్బు)

**రోగహారి** - రోగమును బోగొట్టువాడు (వైద్యుడు)

**రోగశాంతకుడు** - జబ్బు కుదుర్చువాడు

**రోగాంతకుడు** - రోగహారి (అగదంకారుడు - వైద్యుడు)

**రోచకము** - ఆకలి పుట్టించునది

**రోచిష్ణువు** - ప్రకాశించు స్వభావము కలవాడు

**రోపణము** - లేనిది మోపుట (ఆరోపించుట)

**రోమంథము** - ఆవుల (పశువుల) చర్విత చర్వణము (నెమరు)

**రోమము** - శరీరమున మొలచునది (వెంట్రుక)

**రోమశము** - శరీరమంతటను రోమములు కలది (పంది, గొఱ్ఱె)

**రోమశి** - నూగు గలది (ములుదోస చెట్టు)

**రోమశుడు** - ఎక్కువ వెంట్రుకలు గలవాడు

**రోలంబము** - మ్రోయునది (తుమ్మెద - భృంగము)

**రోవెల** - వేశ్యకిచ్చు శుల్కము (రోవాటు)

**రోహిణి** - బలరాముని తల్లి, తొమ్మిదేండ్ల కన్య, కొండ నాలుక (అంగిటిముల్లు)

**రోహిణీ రమణుడు** - రోహిణీ దేవి భర్త (చంద్రుడు)

**రోహితము** - అగ్నిహోత్రుని వాహనము (ఎఱ్ఱగుఱ్ఱము), ఎఱ్ఱనిది

**రోహితాశ్వుడు** - ఎఱ్ఱని గుఱ్ఱములు గలవాడు (అగ్ని), హరిశ్చంద్రుని కొడుకు (లోహితాస్యుడు)

**రౌక్మము** - బంగారముతో చేయబడినది (బంగారు వస్తువు)

**రౌప్యము** - వెండితో జేయబడినది (వెండి నాణెము)

**రౌమకము** - రుమయను గనియందు పుట్టిన ఉప్పు (శాంభరి లవణము)

**రౌరవము** - ఒకానొక నరకము

**రౌహిణము** - దినము యొక్క తొమ్మిదవ భాగము

**రౌహిణుడు, రౌహిణేయుడు** - తారయందు చంద్రునకు జనించి చంద్రుని భార్య యగు రోహిణిచే బెంపబడిన వాడు (బుధుడు), వసుదేవునకు రోహిణి యందు జన్మించినవాడు (బలరాముడు)

**ల** - ద్వితీయా బహువచన ప్రత్యయము, లఘువైన అక్షరమునకు గుర్తు (ఛందస్సు)

**లంక** - తలవాకిటి ప్రక్కగది, రావణుని నగరము, జారిణి

**లంకె బిందెలు** - పెనవేయబడి బంగారు, వెండి నాణెములతో దొరకు బిందెలు

**లండము** - మారువమూల విసర్జింపతగినది (పురీషము, మలము)

**లంపటుడు** - అధికాసక్తి కలవాడు

**లంపులమారి** -దొంగతనముగా మేయునది (పశువు)

**లంబకర్ణము** - వ్రేలాడెడు చెవులు కలది (మేక మొ॥)

**లంబిక** - వ్రేలునది (కొండనాలుక)

**లంబోదరుడు** - వ్రేలు బొజ్జ కలవాడు (వినాయకుడు)

**లక్కుమనుడు** - దశరథునకు సుమిత్ర యందు కల్గిన మొదటి కొడుకు (లక్ష్మణుడు)

**లక్ష్మి** - ఈమెచే సర్వము చూడబడును (శ్రీదేవి)

**లక్ష్యము** - లక్షణచే దెలియ దగిన యర్థము, చూడదగినది

**లఘిష్ఠము** - మిక్కిలి తేలికైనది, మిక్కిలి తక్కువైనది

**లఘుకామము** - స్వల్ప కామము కలది (మేకపోతు)

**లచ్చికొమరుడు** - లక్ష్మీదేవి యొక్క పుత్త్రుడు (మన్మథుడు)

**లచ్చికోడలు** - లక్ష్మీదేవికి గోడలైనది (సరస్వతి)

**లచ్చితండ్రి** - లక్ష్మీదేవికి తండ్రియగు సముద్రుడు

**లతాజిహ్వము, లతారసనము** - తీగె యాకారము వంటి నాలుక కలది (పాము)

**లబ్ధకాముడు** - పొందబడిన కోర్కె గలవాడు

**లబ్ధవర్ణుడు** - పొందబడిన యక్షర జ్ఞానము కలవాడు(పండితుడు-చదువుకొన్నవాడు)

**లలంతిక** - మెడయందు విలసిల్లునది (కంఠహారము)

**లలజిహ్వము** - బయటకు వ్రేలాడు నాలుక కలది (కుక్క, ఒంటె)

**లలన** - విరసన శీలముగల యాడుది, విలాసవతియైన యాడుది (విలాసిని)

**లలాటము** - ముంగురులు కదలుటకాధార మైనది (నుదురు)

**లలాటిక** - నుదుట గట్టిన ముత్యపు బొట్టు (పాపటబొట్టు)

**లలామకము** - పెండ్లిలో వధూవరుల నొసట గట్టెడు ముత్యాల సరము (బాసికము)

**లలితము** - ఒకానొక శృంగార చేష్ట, కోరబడినది, మనోహరమైనది

**లవణాంతకుడు** - లవణాసురుని అంత మొందించిన వాడు (శత్రుఘ్నుడు)

**లవణము** - వాతమును, జడత్వమును బోగొట్టునది (ఉప్పు)

**లవము** - భిన్నాంకమున హారమునకు పైన వ్రాయునది, ఖండము, కోయుట

**లవిత్రము** - దీనిచే గోయుదురు (కొడవలి లవాకము, లవాణకము)

**లాంగలము** - దున్నునపుడు భూమిలో చొచ్చుకొని పోవునది (నాగలి)

**లాగడాగుడు** - బొరియల యందు దాగియుండునది (పాము)

**లాగుడికుడు** - దుడ్డుకఱ్ఱ చేత బట్టినవాడు (లాకుడికుడు - వేత్రధరుడు)

**లాటానుప్రాసము** - ఒకే అర్థము గల పదములను తాత్పర్య భేదము గలుగు నట్లు మరల మరల జెప్పుట (ఒక శబ్దాలంకారము)

**లాలాటికుడు** - యజమానుని యొక్క యభిప్రాయము తెలిసికొనువాడు (బంటు)

**లాసకము** - నృత్యము చేయు పక్షి (నెమలి - నట్టువ పులుగు)

**లాస్యము** - అంగ విక్షేపాదులు గలిగి కౌశికీ వృత్తి ప్రధానమై యుండునది (నృత్యము)

**లింగకాయ** - శివ లింగము నుంచి కట్టుకొని మెడలో వేసికొనెడు సజ్జకాయ

**లింగదేహము** - మరణానంతరము లోకాంతరమున సుఖదుఃఖ భోగముల ననుభవించుటకు జీవుడు ధరించునట్టి దేహము (సూక్ష్మ శరీరము)

**లింగధారి** - లింగమును మెడయందు ధరించువాడు (శివ భక్తుడు)

**లింగపరామర్శము** -సాహచర్య నియమము ననుసరించి వ్యాప్తి జ్ఞానము కలవాడై వ్యాప్యము పక్షమందు గలదని ప్రకటించుట (తర్క - శాస్త్ర)

**లింగము** - అనుమానమునకు సాధనమైన హేతువు (ఇది అన్వయ వ్యతిరేకి, కేవలాన్వయి, కేవల వ్యతిరేకి యని మూడు విధములు - అన్వయ వ్యతిరేకి అన్వయ వ్యాప్తిని, వ్యతిరేక వ్యాప్తిని గల్గియుండును) (తర్క), పానపట్టము మీది శివలింగము, అర్థప్రకాశన సామర్థ్యము

**లింగ శరీరము** - లింగ దేహము

**లిపిజ్ఞుడు** - అక్షరములు వ్రాయుటను చదువుటను (లిపి) తెలిసినవాడు.

**లిప్తకము** - విషము పూసిన యలుగు

**లిబ్బిపడతి** - ధనమునకు అధిష్ఠాన దేవత (లక్ష్మి - లిబ్బిగుబ్బెత)

**లిబ్బిరాయుడు, లిబ్బుల దొర** - ధనమునకు (నిధులకు) ప్రభువు (కుబేరుడు)

**లీనము** - కరగినది, కలిసిపోయినది

**లీలాచుంచుడు** - విలాసములు చూపుట యందు నేర్పరి

**లీలావతి** - విలాసములు చూపు స్త్రీ (హొయలుకత్తె)

**లీలాశుకము** - వినోదార్థము పెంచుకొన్న చిలుక

**లుప్తోపమ** - ఉపమేయ, ఉపమాన, సమాన ధర్మ, ఉపమావాచకములలో నేదేని లోపించినది లుప్తోపమ (పూర్ణోపమ కానిది)

**లుబ్ధకుడు** - మృగములయం దాస గొను వాడు (బోయవాడు)

**లుబ్ధుడు** - ఆశించువాడు (విటుడు, బోయ వాడు, లోభి)

**లులాయము** - నీటియందు మునుగునది (కారెనుపోతు - లులాపము)

**లూనము** - నరకబడినది, కోయబడినది

**లేఖనికుడు** - ఇతరులచే జాబు వ్రాయించు వాడు, జాబులు తీసికొని పోవువాడు

**లేఖర్షభుడు** - దేవతలలో శ్రేష్ఠుడు(ఇంద్రుడు)

**లేఖుడు** - ధ్యానమునకై పటాదులపై చిత్తరువు వ్రాయబడువాడు (వేల్పు)

**లేగౌను** - సన్నని నడుము

**లేలిహానము** - మరల మరల నాలుకను చాపి నాకునది (పాము - లేలీహానము)

**లేహ్యము** - నాలుకతో నాకి భుజింపదగినది

**లోకజిత్తు** - తపస్సుచే లోకమును జయించినవాడు (బుద్ధుడు, జినుడు)

**లోకజ్ఞుడు** - లోక జ్ఞానము గలవాడు

**లోకబాంధవుడు** - ప్రపంచమునకు జుట్టమైన వాడు (లోక ప్రకాశనుడు - సూర్యుడు)

**లోక భావనుడు** - లోకక్షేమమును కోరువాడు

**లోకమాత** - ముల్లోకములకు తల్లియైనది (పార్వతి, లక్ష్మి, గంగ)

**లోకాయుతము** - స్వభావమునకు కర్తృత్వమారోపించి విధి నిషేధములు పాటింపని మిక్కిలిగా వ్యాపించిన నాస్తిక మతము (చార్వాకమతము)

**లోకాలోకము** - భూమండలమును జుట్టి యుండెడు చక్రవాళ పర్వతము

**లోకేశుడు** - జగత్తునకు ప్రభువు (బ్రహ్మ)

**లోకోక్తి** - వాడుకలో నున్న పలుకు (సామెత)

**లోమఘ్నము** - పేనుకొరుకుడు రోగము, ఇంద్ర లుప్త రోగము

**లోమము** - ఊడిపోవునది (రోమము)

**లోమశము** - ఎక్కువగా రోమములు కలది (గొఱ్ఱె)

**లోల కర్ణుడు** - చెప్పుడు మాటలు వినువాడు

**లోల జిహ్వుడు** - జిహ్వాచాపల్యము గలవాడు

**లోహకారుడు**-లోహములతో బాత్రాదులను చేయువాడు (కమ్మరి - కర్మారుడు)

**లోహద్రావి** - లోహములను ద్రవింప జేయునది (వెలిగారము - టంకణము)

**లోహపృష్ఠము** - ఇనుము వంటి గట్టి వీపు కలది (రాపులుగు)

**లోహలుడు** - అస్పష్టమైన పలుకులు గలవాడు (నత్తివాడు)

**లోహాభిసారము** - ఆయుధములు ధరించి రాజులు విజయ యాత్రకు పోవునపుడు హారతి యిచ్చుట

**లోహితము** - ఎఱ్ఱని వన్నె గలది (నెత్తురు, రక్తచందనము, కెంపు)

**లోహితాంగుడు** -ఎఱ్ఱని యవయవములు గలవాడు (అంగారకుడు)

**లోహితాక్షుడు** - ఎఱ్ఱని కన్నులు గలవాడు (విష్ణువు)

**లోహితాననము** - ఎఱ్ఱని మూతి కలది (ముంగిస - నకులము)

**లోహితాశ్వుడు** - ఎఱ్ఱని గుఱ్ఱములు గలవాడు (అగ్ని - రోహితాశ్వుడు)

**లోహితుడు** - లోహితాంగుడు (అంగారకుడు - కుజుడు)

**లౌక్యము** - లోక సంబంధమైనది

**లౌల్యము** - చంచలత్వము (లోలత్వము)

**వంకర తొండము వాడు** - వంకర తొండము గలవాడు (వినాయకుడు)

**వంచకము** - మోసగించునది (నక్క)

**వందనమాల** - ద్వార బంధమునకు గట్టబడిన తోరణము

**వందారువు** - గోత్ర నామములను దెల్పుచు బాదములకు నమస్కరించువాడు (అభివాదకుడు)

**వంది** - రాజులను స్తుతించి జీవించువాడు (బట్టు)

**వంధ్య** - ఫల శూన్యమైనది (గొడ్రాలు - వంజ)

**వంశకరుడు** - సంతతి వలన వంశమును నిలుపువాడు

**వంశజము** - వెదురు బియ్యము (వంశతండులము)

**వంశనర్తి** - గెడపై ఆడెడు వాడు (దొమ్మరి)

**వంశరోచన** - వెదురు వలన బుట్టిన జరరాగ్నిని దీపింప జేయునది (తవాక్షీరి)

**వంశవృక్షము** - కుల పురుషుల క్రమమును దెలుపు పట్టిక

**వకము** - బకము (కొంగ)

**వక్కి** - బక్క చిక్కిన(ది) వాడు (బక్క)

**వక్కు** - బక్కటిల్లు (కృశించు)

**వక్కుపులుగు** - వక్కు కొంగ

**వక్త్రము** - దీనిచే పలుక బడును (ముఖము)

**వక్త్రశోధి** - నోటి అహితవును బోగొట్టి శోధించునది (నిమ్మ, నారింజ)

**వక్రగ్రీవము** - వంకర మెడ గలది (ఒంటె క్రమేలకము)

**వక్రదంష్ట్రము** - వంకర కోరలు గలది (పంది)

**వక్రపుచ్ఛము** - వంకర తోక గలది (వక్రవాలధి - కుక్క)

**వక్రశృంగి** - వంకర కొమ్ములు గలయావు (సౌరభేయి)

**వక్రోక్తి** - శ్లేష కాకువులచే నన్యార్థ కల్పన మొనరించెడు అర్థాలంకార విశేషము

**వక్షోజము, వక్షోరుహాము** - వక్షః స్థలమున పొడమునది (స్తనము)

**వగ్రహము** - వర్షము నవరోధించునది (అనావృష్టి - అవగ్రహము)

**వచక్నువు** - సభలలో నిర్భయముగా మాటాడు వాడు

**వచనేస్థితుడు** - చెప్పిన మాటకు కట్టుబడి యుండువాడు (వచనస్థితుడు)

**వచసాంపతి**-వాక్కులకు ప్రభువు (బృహస్పతి)

**వచోహరుడు** - వార్తలను గొనిపోవు వాడు (రాయబారి)

**వజ్రకీటము** - సాలగ్రామమున నుండి తొలిచెడు కీటక విశేషము

**వజ్రతుండుడు** - వజ్ర సమానమైన (ముక్కు) తుండము గలవాడు (చిలువతిండి - గరుడుడు)

**వజ్రదంతుడు** - వజ్రము వంటి దంతము గలవాడు (గణపతి - ఏకదంతుడు)

**వజ్రాంగి** - వజ్ర మయమైన కవచము

**వజ్రాయుధుడు** - వజ్రాయుధము కలవాడు (ఇంద్రుడు - వజ్రి)

**వడకు గుబ్బలి** - వణకు పుట్టించు అంచులు (శిఖరములు) గల కొండ. (మంచుకొండ - వడకు గొండ)

**వడజక్కియెకిమీడు, వడ జక్కేలిక** - వడచక్కి =ఉత్తరదిశ, వడజక్కికి ఏలిక (కుబేరుడు)

**వడపిందెలు** - తాపము బోగొట్టెడు (ఊరవేసిన) మామిడి పిందెలు

**వడముడి**-పగతురకు సంతాపము కలిగించు గ్రంధి వంటివాడు ఉత్తరపు వైపునకు (ఎడమవైపునకు) వాలునట్లు జడముడి వేయువాడు (భీముడు)

**వడిచుట్టు** - హఠాత్తుగా వచ్చెడి ఆపద, వేగముగా చుట్టుకొను

**వడ్డిమేపరి** - వడ్డిచే జీవించువాడు (కుసీదుడు)

**వత్సతరము** -మోయుటకును దున్నుటకును వయసుగల కోడె

**వత్సరము**-ఋతువు లిందిమిడి యుండును (ఏడాది)

**వత్సాదనము** - దూడల నడ్డగించి తినునది (తోడేలు)

**వదావదుడు** - మాట నేర్పరి (వక్త)

**వధూయువు** - పెండ్లికై స్త్రీని కోరువాడు

**వనచరము** - వనమునందు సంచరించునది (కోతి)

**వనజము** - అంబుజము (తామర)

**వనజాక్షి** - తామరల వంటి కన్నులు గల యాడుది

**వనజాతము, వనదము** - అంబుదము (మేఘము)

**వనధి, వననిధి** - ఇందు నీరు నిల్చి యుండును (జలధి)

**వనభోజనము** - బంధు మిత్రాదులొక వనమున గూడి చేసెడు కార్తిక మాసపు విందు

**వనమాలి** - పుష్ప పత్రములు చేర్చి కట్టిన దండ ధరించిన వాడు (విష్ణువు)

**వనము** - జీవులచే కోరబడునది (నీరు)

**వనమూతము** - నీరు ఇందు బంధింప బడును (మబ్బు - జీమూతము)

**వనస్పతి** - పూయకయే కాచెడు చెట్టు (మఱ్ఱి, పనస), పుష్పఫలములు లేని వృక్షము (గంగరావి)

**వనాఖువు** - అడవి యందు ఎలుక వంటిది (కుందేలు)

**వనాటము** - (నీటియందు) అడవియందు చరించు జంతువు

**వనాయుజము** - వనాయు దేశమున బుట్టిన ఉత్తమ జాతి గుఱ్ఱము

**వనిత** - పురుషుని పొందునది (ఆడుది) యాచింప బడునది, సేవింపబడునది

**వనేచరము** - వనమున దిరుగునది (వనచరము - కోతి)

**వనేచరుడు** - వనమున దిరుగువాడు (ఆటవికుడు)

**వనౌకసము** - వనము నివాసముగా గలది (కోతి)

**వప్రక్రీడ** - గజాదులు దంతము లోనగు వానితో భూమిని కోరాడెడు నాట

**వయస్సు** - కడచి పోవునది

**వయస్య** - వయస్సుచే సమానమైనది (సఖి చెలికత్తె)

**వయస్యుడు** - సమానమైన వయస్సు కలవాడు (చెలికాడు - సఖుడు)

**వరణము** - పట్టణమును చుట్టియుండునది (ప్రాకారము)

**వరదుడు** - వరము నిచ్చువాడు

**వరవత్సల** - పెండ్లి కుమారుని యందభిమానము గలది (అత్త - శ్వశ్రువు)

**వరవర్ణము** - శ్రేష్ఠమైన రంగు కలది (స్వర్ణము - బంగారము)

**వరవర్ణిని** - భర్తయందనురాగము గల స్త్రీ (సాధ్వి)

**వరహా** - వరాహ ముద్రగల బంగారు నాణెము

**వరాటకుడు** - వరాటకము వలె వ్యర్థమైన వాడు (అప్రసిద్ధుడు)

**వరారోహ** - గొప్ప పిరుదులు గల యాడుది

వరుణాలయము - వరుణునకు స్థావర మైనది (సముద్రము)

**వరుణుడు** - జనులచే వరములు కోరబడు వాడు (నీటిరేడు - పడమటిదొర)

**వర్జ్యము** - విడువ దగిన దోషయుక్త కాలము

**వర్ణవతి** - శ్రేష్ఠమైన రంగు కలది (పసుపు - వర్ణదాత్రి వర్ణ విలాసిని)

**వర్ణవ్యత్యయము**-అక్షరములు తారుమారగుట

**వర్ణాగమము** - కొత్త వర్ణము వచ్చి చేరుట (వ్యాకరణము)

**వర్ణాటుడు** - చిత్రకారుడు, ఆడుదాని వలన బ్రతుకువాడు

**వర్తకము** - స్వేచ్ఛగా విహరించు (వర్తించు) నది (పూరేడు పిట్ట), స్వేచ్ఛా వృత్తికి ఆశ్రయమైనది (బేహారము - వ్యాపారము)

**వర్మము** - శరీరమును కప్పునది (వరుమ్మ్రు - కవచము)

**వర్షత్రము** - వర్షము నుండి కాపాడునది (గొడుగు - ఛత్రము)

**వర్షధరుడు** - ఇంద్రియ సేకము లేనివాడు (అంతఃపురికుడు - హెగ్గడి)

**వర్షము** - అంతటను తడుపునది (వాన)

**వర్షవరుడు** - అంతఃపురపుకావలి వాడు (వర్షధరుడు - హెగ్గడి, షండుడు)

**వర్షాఘోషము** - వర్షకాలమున పెద్దగా అరచునది (బృహద్భేకము-బోదురుకప్ప)

**వర్షాభువు** - వర్షాకాలమున బుట్టునది (కప్ప, ఆరుద్ర పురుగు, వానపాము)

**వర్షామదము** - వానకాలమున మైమరచునది (నెమలి)

**వర్షాశనము** - పండితులు మొదలైన వారికి ప్రతి సంవత్సరము నిచ్చెడి పారితోషిక ద్రవ్యము (వార్షికము - పడితరము)

**వర్షీయుడు** - మిక్కిలి యేండ్లు (మీరిన) చెల్లించిన వాడు (వృద్ధుడు - స్థవిరుడు)

**వర్షోపలము** - వాన పడినప్పుడు పడుగడ్డ (వడగల్లు - కరక)

**వలక్షగుడు** - తెల్లని కాంతులు గలవాడు (చంద్రుడు)

**వలగములు** - విరోధి మారణమునకై భూమియందు పాతిపెట్ట బడిన ఎముకలు, రోమములు పాదధూళి మొదలగునవి

**వలజ** - చక్కని చూపులు గల ఆడుది (సౌందర్యవతి)

**వలజాలోకలలామ** - సౌందర్య వతులలో శ్రేష్ఠురాలు

**వలదొర, వలరాయడు, వలరేడు** - కామమునకు ప్రభువు (మన్మథుడు - వలరాయడు)

**వలపు మోపరి** - గంధమును మోచుకొని పోవువాడు (గంధవహుడు - వాయువు)

**వలమురి** -దక్షిణముగా తిరిగిన ఆవర్తములు కలది (దక్షిణావర్త శంఖము)

**వలమురి తాలుపు** - పాంచజన్యమను దక్షిణావర్త శంఖము వ్రాతప్రతిచూ

**వలరాజుసూడు** - మన్మథునకు శత్రువైన వాడు (శివుడు)

**వలాహకము** - నీటిని వహించునది (మేఘము), శ్రీకృష్ణుని రథాశ్వములలో నొకటి (బలాహకము)

**వలిభుడు** - ముడుతలు పడిన శరీరము గలవాడు (వలినుడు)

**వలిగట్టు, వలిమల** - చల్లని కొండ (మంచుకొండ - వలిగొండ)

**వలిమలల్లుడు** - హిమవంతుని యల్లుడు (శివుడు)

**వలిరుడు** - కడకంటితో చూచువాడు (కేకరాక్షుడు - మెల్లకంటివాడు, వలీరుడు)

**వలివెల్గు** - చల్లని వెల్గు కలవాడు(చంద్రుడు)

**వలీముఖము** - ముడుతలతో గూడిన ముఖము గలది (బలీముఖము - కోతి)

**వల్మీక పాదుడు** - బోదకాలు రోగము కలవాడు (పుట్టకాలు వాడు)

**వల్మీకభవుడు** - పుట్టయందు పుట్టినవాడు (వాల్మీకి - వల్మీక సంభవుడు)

**వల్మీకము** - జంతువులు సంచరించుట కాశ్రయమైనది (పుట్ట)

**వల్లైతాలుపు** - పాశధరుడు (వరుణుడు)

**వశంవదుడు** - ఎదుటివారు లోబడునట్లు మాటాడువాడు

**వశగ** - తనకు లోబడియుండు భార్య (అనుకూలవతి)

**వశిష్ఠుడు** - మిక్కిలి ఇంద్రియ నిగ్రహము గలవాడు (వసిష్ఠుడు), వశౌనముగా నుండుట కిష్టపడువాడు

**వశీకరణము** - మందు మాకులచే లోబఱుచుకొనుట

**వశ్యురాలు** - అనుకూలవతి, విధేయురాలు

**వషట్కృతము** - అగ్నియందు వేల్వబడినది (హవిస్సు)

**వసంతఘోషి** - వసంత కాలమున కూయునది (కోయిల)

**వసంతద్రువు** - వసంత కాలమున చిగిర్చెడి చెట్టు (మామిడిచెట్టు-వసంతద్రుమము)

**వసుంధర** - రత్నాదికమును ధరించునది (భూమి - వసుమతి)

**వసుగర్భ** - బంగారము గర్భమందు (తనలో) గలది (భూమి - వసుధ)

**వసుదేవుడు** - ధనాదికముచే వెలయువాడు

**వసుభ** - రత్నము వలె బ్రకాశించునది (పొదరిండ్ల చుక్క - పునర్వసు నక్షత్రము)

**వస్త్రయోనులు** - వస్త్రోత్పత్తికి ఆధారము లైనవి (పురుగు, కాయ, మొ॥)

**వహ్ని** - హవిరాదికమును దేవతల కొరకు మోసికొనిపోవు వాడు (అగ్ని)

**వహ్నిదీపిక** - జీర్ణశక్తిని పుట్టించునది (వాము)

**వహ్నిశిఖము** - అగ్ని జ్వాల వంటి కాంతులీనునది. (కుంకుమపూవు)

**వాంశికుడు** - పిల్లన గ్రోవి నూదువాడు

**వాకతాలుపు** - గంగను ధరించినవాడు (శివుడు - గంగాధరుడు)

**వాక్పతి** - వాక్కులకు ప్రభువు (బృహస్పతి, బ్రహ్మ)

**వాకోవాక్యము** - శాస్త్ర సంబంధములగు తర్కోక్తి ప్రత్యుక్తులు

**వాక్యము** - కర్తృ, కర్మ, క్రియా సంబంధము గల పద సముదాయము

**వాక్యసంకీర్ణము** - ఒక వాక్యములోని పదములు మరొక వాక్యములో కలియుట (వాక్యగత దోషము)

**వాగీశుడు** - మిక్కిలి సరసముగ మాటలాడువాడు, వాక్పతి

**వాగురికుడు** - వలలు వన్ని వక్షులను, మృగములను పట్టెడివాడు (జాలికుడు)

**వాగ్గులికుడు** - తాంబూలపు పెట్టె పట్టుకొను సేవకుడు (అడపకాడు)

**వాగ్మి** -నేర్పుగా మాటాడువాడు (బృహస్పతి), చతురముగా మాటాడునది (చిలుక)

**వాఙ్ముఖము** - వాక్యారంభము

**వాఙ్మాలము** - సాక్షులు తాము చూచిన దానిని వాగ్రూపముగా జెప్పునది

**వాచంయముడు** - వాక్కును నియమము చేయువాడు, మితముగా మాటాడువాడు (మౌని, మితభాషి)

**వాచకము** - బడిలో చదివింపబడు భాషా పుస్తకము, చదివెడు రీతి

**వాచస్పతి** - చక్కగా మాటాడ గల్గిన కారణమున వాక్కులకు ప్రభువైన వాడు (వాక్పతి - బృహస్పతి)

**వాచాటుడు** - కొరగాని పెక్కు మాటలాడు వాడు (ప్రేలరి - వాచాలుడు)

**వాచాడంబరుడు**-డంబములు పలుకువాడు

**వాచాలుడు** - వాచాటుడు

**వాజపేయము** - అన్నవికారమైన సుర త్రాగ బడునట్టి యాగము

**వాజపేయి** - వాజపేయ యాగము చేసిన వాడు, వాజపేయము చేసిన వాని వంశమున బుట్టినవాడు

**వాజశ్రవసుడు** - ఆహారము (వాజ) దానము చేయుట ద్వారా కీర్తి పొందినవాడు, వాజశ్రవుని కొడుకు

**వాజి** - శీఘ్రముగా బోవునది (గుఱ్ఱము)

**వాజీకరణము** - పుంస్త్వము కలుగజేయు ఔషధము

**వాడవదినె** - వీథిలోని వారందరిచే వదినె యని పిలువబడునది (వేశ్య - వాటీవ ధూని)

**వాతఘ్నము** - వాతమును హరించునది (ఆముదము)

**వాతప్పు** - నోటినుండి వెలువడిన అమంగళ (అశ్లీల) వచనము

**వాతప్రమి, వాతమృగము** - గాలికెదురు పోవు ఇఱ్ఱి వంటి జంతువు

**వాతవాడి** - కటువుగా మాటాడు స్వభావము కలవాడు (అప్రియంవదుడు)

**వాతాటము** - గాలివలె బోవునది (సూర్యుని రథాశ్వము)

**వాతాయనము** - గాలి పోవు మార్గము (కిటికీ - గవాక్షము, జాలకఱ్ఱ)

**వాతాయువు** - గాలి వలె వేగముగ పోవునది (జింక)

**వాతారి** - వాతరోగమును పోగొట్టునది (ఆముదపు చెట్టు)

**వాతాశనము** - వాయువును భక్షించునది (వాతాశి - పాము)

**వాతాశ్వము** - గాలివలె వడిగా పోవునది (ఉత్తమ జాతి గుఱ్ఱము)

**వాతికాసు** - నోటికి అందించు (ముడుపు) పైకము (లంచము - అప్పనము)

**వాతిపాతిక** - శవము నోటి యందుంచు డబ్బు

**వాతిబియ్యము** - దహన సంస్కార కాలమున బంధువులు పీనుగునోట వేసెడు బియ్యము (వాతి యందుంచు బియ్యము)

**వాతెర** - వాతికి తెర వంటిది (పెదవి)

**వాదోడు** - మాట సాయము (వాతికితోడు)

**వానకోయిల** - వర్ష బిందువులను మాత్రమే త్రాగి జీవించునది (చాతకపక్షి)

**వానజాలిపులుగు** - వానకు భయపడు పక్షి (హంస)

**వాననెచ్చెలి** - వానకు నెచ్చెలి వంటిది (చాతకపక్షి - వానకోయిల)

**వానప్రస్థుడు** - వనమునందు నివసించెడి యాశ్రమము కలవాడు (సన్యాసి)

**వానరము** - నరుని వలె నుండునది (కోతి - కోనమనికి)

**వానరాయి** - వానతో పడిన రాయి (కరక - వడగల్లు)

**వానస్పత్యము** - పూచికాచెడు చెట్టు (మామిడి మొ॥) (వనస్పతి - పూయక కాచెడు చెట్టు)

**వానేయము** - జలమందు బుట్టినది (తుంగముస్తె)

**వాపితము** - గొరుగబడినది (ముండితము)

**వామదేవుడు** - వామ భాగమున ధరింపబడిన భార్య కలవాడు

**వామ** - అందమైన యాడుది

**వామదేవుడు** - వామ భాగమున ధరింప బడిన భార్య కలవాడు, శ్రేష్ఠుడైన దేవుడు, (ఉత్తమ) స్త్రీచే ప్రకాశించువాడు, దుష్టుల మద మడగించువాడు, శ్రేష్ఠులలో ప్రకాశమానుడు

**వామనము** - దక్షిణ దిశయందలి ఏనుగు, పొట్టిది

**వామనుడు** - దుష్టుల మదమడగించువాడు, పొట్టివాడు (బలి ధ్వంసి)

**వామలూరువు** - కుటిలముగా జంతువులచే ద్రవ్వ బడునది (పుట్ట - వామలూరము, వల్మీకము)

**వామలోచన** -చక్కని కన్నులు గలయాడుది

**వామాచారము** - వేదమునందు జెప్పబడిన ఆచారమునకు విరుద్ధమైన ఆచారము

**వాయకుడు** - తంతువాయుడు (సాలెవాడు )

**వాయనము** - వ్రతాదులందు స్త్రీలు ముత్తైదువులకు కానుకగా ఇచ్చెడు పిండి వంట

**వాయవ్యము** - వాయు సంబంధమైనది (వాయవీయము)

**వాయవ్యాస్త్రము** - వాయు దేవతాకమైన యస్త్రము

**వాయసము** - చరించునది (కాకి - ఆత్మ ఘోషము)

**వాయసారాతి** - కాకులకు శత్రువు (గ్రుడ్లగూబ)

**వాయుగుల్మము** - నీటి సుడి.

**వాయుదారువు** - గాలిచే తునుకలు చేయబడునది (మబ్బు)

**వాయుపథము** - గాలి వీచెడు మార్గము (ఆకాశము)

**వాయుసఖుడు** - వాయు దేవునకు స్నేహితుడు (గాలినెచ్చెలి - అగ్ని)

**వారకాంత** - కాముకులకు ఆలైనది, రాజసేవార్థము పలుమారు వచ్చునది (వారస్త్రీ - వేశ్య)

**వారణ** - సముద్రపుటొడ్డు (చెలియలి కట్ట)

**వారణబుస** - ఏనుగులచే పెకలింపబడునది (అరటి - కదళి)

**వారణము** - శత్రు బలమును అడ్డగించునది (ఏనుగు - ఒకజాతి డేగ)

**వారణవల్లభ** - ఏనుగుల కిష్టమైనది (అరటి)

**వారణాసి** - వరుణ, అసి అను నదులు హద్దుగా గల నగరము (కాశి)

**వారస్త్రీ** - విటులందరకును సాధారణమైనది (వెలయాలు - రోవెలది)

**వారాన్నిధి, వారాశి** - నీటి కుప్ప (సముద్రము)

**వారి కఫము** -సముద్రపు నురుగు (ఫేనము)

**వారిజము** - నీట బుట్టునది (అంబుజము)

**వారితస్కరుడు** -జలతస్కరుడు (సూర్యుడు)

**వారిదము** - అంబుదము

**వారిధి** - ఇందు నీరు నిలిచియుండును (సముద్రము)

**వారినామ** - ఓడలో నుంచిన సరకులకు ఓడ యజమాను డిచ్చెడు (బుజు పత్రము) రసీదు

**వారిరాశి** - వారాశి - సముద్రము

**వారివాహము** - జలధరము (మేఘము)

**వారుణము** - వరుణునకు సంబంధించినది

**వారువపు జన్నము** - వారువము (గుఱ్ఱము) వధ్య పశువుగా గల యాగము (అశ్వమేధ యాగము)

**వార్తాకము** - ఆరోగ్యమును చెరచునది (వంకాయ)

**వార్తాపత్రిక** - సమాచారములు దెలిపెడు కాగితము

**వార్తావహుడు** - కావడి మోయువాడు, సమాచారమును మోసికొని పోవువాడు (వార్తికుడు, వార్తాయనుడు - దూత)

**వార్తికము** - అర్థాదులను వివరించెడు గ్రంథము, వార్తలు తెలియజేయునది (వార్తాకపక్షి - పూరేడుపిట్ట)

**వార్తుడు** - రోగము తగ్గినవాడు (నిరామయుడు), రోగము లేని వాడు (అరోగి - కల్యుడు)

**వార్ధి** - వారిధి

**వార్ధుషి, వార్ధుషికుడు** - ధనము వృద్ధియగునట్టి వ్యాపారము చేయుచు జీవించువాడు (కుసీదుడు-వడ్డీవ్యాపారి)

**వార్వపుటగ్గి** - వార్వము మోమునుండి బయల్పడు అగ్ని (నీరు చిచ్చు - బడబాగ్ని)

**వార్షికము** - సంవత్సర కాల పరిమితి కలది, వర్షకాలమున బుట్టినది, ప్రతి సంవత్సరము ఈయబడు పారితోషికము

**వాలిడి** - తోకలేని కోతి

**వాలుగకంటి** - వాలుగ (చేప) వంటి కన్నులు గలది (మీననేత్ర)

**వాలుగడాలు** - వాలుగ (ఒకదినుసుచేప) ధ్వజముగా గలవాడు (మన్మథుడు మీనుసిడెముమేటి)

**వాల్కము** - చెట్టుపట్టతో చేయబడినది (నారచీర)

**వాల్గంటి** - దీర్ఘముగు కన్నులుగల స్త్రీ (వాలుగంటి)

**వాల్మీకి** - పుట్టయందు బుట్టినవాడు (వల్మీక భవుడు)

**వావదూకుడు** - అతిగా మాటాడు వాడు (వదరుబోతు),జంకులేక యుక్తియుక్తముగా మాటాడువాడు (వక్త)

**వాసకసజ్జిక** - చెలువు డరుదెంచుననుచు పడకటింటిని, దన్నును సింగారించుకొని వేచియుండు నాయిక

**వాసవ నీలకుంతల** - ఇంద్రనీలమణుల వంటి కురులు గల స్త్రీ.

**వాసవుడు** - (చింతామణి మొ॥) ఐశ్వర్యము కలవాడు (ఇంద్రుడు)

**వాసుకి** - వసువు(మణి) శిరమున గలవాడు

**వాసుదేవుడు** - వసుదేవుని కుమారుడు (శ్రీకృష్ణుడు - కరివేల్పు)

**వాసువు** - నాట్య పరిభాషలో బాలిక

**వాసెనకుడుము** - వాసెన మీద ఉడికిన ఇడ్డెనయును పిండివంట (మోదకము, ఆవిరికుడుము)

**వాస్తవ్యము** - వసింపదగినది, యధార్థమైనది (వాస్తవికము)

**వాస్తోష్పతి** - గృహక్షేత్రమునకు అధిష్ఠాన దేవత (ఇంద్రుడు - వాస్తుపతి)

**వాహకుడు** - నడుపువాడు (సారథి, మావంతుడు, రేవంతుడు), మోయు వాడు (పీనుగు మోపరి)

**వాహద్విషము** - గుఱ్ఱమునకు శత్రువు (దున్న ఎనుబోతు)

**వాహిని** - వాహములు కలది (సేన) ప్రవహించునది (నది) 81 రథములు 81 ఏనుగులు, 243 గుఱ్ఱములు, 405 కాలిబంట్లు గల సేన

**వాహినీపతి**-నదులకు ప్రభువు (సముద్రుడు) సేనకు నాయకుడు (సేనాని)

**వాహినేయుడు** - గాంగేయుడు (భీష్ముడు)

**వింజామర** - తెల్లని చామరము (వీచోపు)

**వింటిపసి** - వింటియందుండు పసి (కామధేనువు - పుడుకుదొడుకు)

**వికచము** - వెంట్రుకలు లేనిది

**వికటకవి** - హాస్యకరమైన కైత చెప్పువాడు

**వికర్తనుడు** - చీకటిని బోగొట్టువాడు (సూర్యుడు)

**వికలాంగుడు** - వికారమయిన యవయవములు గలవాడు

**వికలుడు** - కలవరము పొందినవాడు

**వికల్పము** - అనుమానము, అవాంతర కల్పము, మారుదల, రెండు విరోధ కార్యములు సమాన బలము కలవైనచో అందొక దానిని మాత్రమే చేయవలెనని చెప్పు అర్థాలంకారము (ఉదా - ఓరాజా! నీవు శిరస్సును గాని ధనుస్సును గాని వంచి శత్రువున కెదురుగా బొమ్ము - సంధి కొడంబడుటయో లేక విల్లు పట్టి పోరుటయో చేయుమనుట)

**వికస్వరము** - విరియునది, ఒక విశేషమును జెప్పి దానిని సామాన్యముచే సమర్థించియు తనియక మరియొక విశేషమును ఉపమ లేక అర్థాంతరన్యాస మ. 'లమున చెప్పుట (ఒకానొక అర్థాలంకారము)

**విగడియ** - గడియలో అఱువదవ భాగము (24 సెకనులు)

**విగ్రుడు** - ముక్కు లేని వాడు (విఖ్యుడు - ముక్కిడి)

**విఘ్నేశ్వరుడు** - విఘ్నములకు ప్రభువు (విఘ్నరాజు - గణేశుడు)

**విజయచ్ఛందము** - అయిదు వందల సరములు గల ముత్యముల దండ

**విజయదశమి** - ఆయుధాదులను పూజించెడి ఆశ్వయుజశుద్ధదశమి

**విజయుడు** - విశేషమైన జయము కలవాడు (అర్జునుడు)

విజ్ఞాతుడు - ప్రసిద్ధికెక్కినవాడు ( ప్రసిద్ధుడు)

**విటపము** - విరివియగునది ( కొమ్మ)

**విడంబితుడు** - మోసగింపబడినవాడు

**విడాకు** - భార్యాభర్తలలో నొకరు రెండవ వానిని విడిచిపెట్టునంశము గల పత్రిక

**వితండ** - స్వపక్షపాతముగ వాదించు మూర్ఖవాదము

**వితండవాది** - క్రమబద్ధము కాని వాదము చేయువాడు

**వితంతువు** - మంగళసూత్రము పోయినది (విధవ)

**వితర్ది** - బడలికను పోగొట్టునది ( తిన్నె, వేదిక - వితర్దిక)

**వితస్తి** - చాచిన బొటనవ్రేలియు చిటికెన వ్రేలియు నడిమి కొలత ( జానెడు) - 12 అంగుళముల కొలది

**విదురుడు** - తెలిసినవాడు (వేత్త)

**విదూషకుడు** - పరిహాసము కొరకు ఇతరులను విశేషముగను చమత్కారము గను దూషించు శృంగార నాయక సచివులలో నొకడు

**విద్యాధరుడు** - విద్యా సంపన్నుడు (గుటి కాంజనాది విద్యలు తాల్చిన జీమూత వాహనాది)

**విద్యార్థి** - చదువుకోరువాడు

**విద్రావితుడు**-యుద్ధము వలన పారిపోయిన వాడు

**విద్విషుడు** - మిక్కిలిగా ద్వేషించువాడు (పగవాడు)

**విధవ**-పోయినధవుడు కలది (ముండమోపి)

**విధాతృడు** - సర్వమును సృజించువాడు(బ్రహ్మ)

**విధి** - సర్వమును రచించునది

**విధుంతుదుడు** - చంద్రుని బాధించువాడు (రాహువు)

**విధుడు** - వేల్పులచే పానము చేయబడు వాడు (చంద్రుడు) శత్రువులను వ్యథ పెట్టువాడు

**వినాయకుడు** - స్వతంత్రుడగుట వలన తనకు నితర ప్రభువు లేనివాడు (విఘ్నేశ్వరుడు) పక్షులకు రాజు (గరుడుడు)

**వినుకలికంటి** - శబ్దములను వినుటకు తగు కన్నులు గలది (పాము)

**వినుకెంపు** - ఆకాశమున మణివలె వెలయువాడు (సూర్యుడు)

**వినుచూలి** - ఆకాశమునకు బిడ్డ (వాయుదేవుడు చదలుకుఱ్ఱడు)

**వినుజొట్టుదేవర** - వ్యోమకేశుడు (శివుడు)

**వినుప్రోలు** - ఆకాశమునందలి పట్టణము (స్వర్గము - త్రిదివము)

**వినుప్రోల్దొర** - వినుప్రోలునకు దొర (ఇంద్రుడు - నాకేశుడు)

**వినుమనుమడు** - వినుచూలి కొడుకు (భీముడు, ఆంజనేయుడు)

**వినుమానికము** - స్వర్గమునందలి మణి (చింతామణి)

**వినుమ్రాను** - స్వర్గమునందుండు వృక్షము (మింటిచెట్టు - కల్పవృక్షము)

**వినువాక** - ఆకాశమునందలి నది (మందాకిని)

**వినువాక తాలుపు** - గంగాధరుడు (శివుడు)

**వినువాకబిడ్డడు** - గాంగేయుడు (భీష్ముడు)

**వినువాక మోపరి** - వినువాకను మోయు వాడు (శివుడు)

**వినుసిగదయ్యము, వినుసిగదేవర** -ఆకాశము సిగగా గల సామి (శివుడు)

**విన్నపత్రిక** - విన్నపముతో కూడిన పత్రిక (విజ్ఞాపనపత్రిక -అర్జీ, మనవికమ్మ)

**విన్వలను** - ఆకాశము వైపునున్న పట్టణము (వినుటెంకి-స్వర్గము)

**విపంచి** - వ్యక్తములైన స్వరములను వ్యాపింపజేయునది ( వీణ)

**విపక్షము** - నిశ్చిత సాధ్యాభావవంతము (సాధ్యము నిశ్చయముగ లేనట్లు స్థిరమైనచోటు, మడువులో నిప్పు ఉండదు అను నిశ్చయములో విషయమగు వహ్న్యాభావము మడువునందున్నది గాన విపక్షమగు

**విపక్షుడు** - పక్షములేనివాడు (పగవాడు)

**విపణి** - వస్తువులు విక్రయించుతావు (అంగడి)

**విపన్నుడు** - కడగండ్ల పాలైనవాడు

**విపశ్చితుడు** - విశేషముగా పరిశీలించుచు తెలిసికొనువాడు (పండితుడు)

**విపాకము** - పాకము చెడినది

**విపాశ** - విడిచిపోయిన పాశము గలది (జంబూద్వీపములోని ఒక నది)

**విపినము** - వెరపుచే దీనియందు వడకుదురు, మొక్కలు మొలచి వ్యాపించునది (అడవి)

**విపుంసి** - పురుష లక్షణములు గల యాడుది (పోట)

**విపుల** - విశాలమైనది (భూమి)

**విప్పగండ్లపడవాలు** - ఎల్లప్పుడును దెరచియుండెడు కనులు గల దేవతల యొక్క దళవాయి (కుమారస్వామి)

**విప్పు రెప్పల రేడు**- రెప్పపాటు లేని దేవతలకు ప్రభువు (ఇంద్రుడు)

**విప్రయోగము, విప్రలంభము** - అనురాగము గల నాయికా నాయకుల యెడబాటు, మిక్కిలి వంచనము

**విప్రలబ్ధ** - నిర్ణీత (సంకేత) స్థలమునకు వత్తుననిన ప్రియుడు రామిచే విచారించెడు నాయిక

**విప్రలబ్ధుడు** - సంకేత స్థానమున నాయికను గానక వ్యాకులవడునట్టి నాయకుడు, వంచింపబడినవాడు

**విప్రశ్నిక** - శుభాశుభ విషయమై జనులచే విశేషముగా అడుగబడిన ప్రశ్నలు కలది (ఎరుకసాని - కొరవంజి, దైవజ్ఞ)

**విప్రవినోదులు** - హస్తలాఘవ విద్యచూపి బ్రాహ్మణులను యాచించు నొక తెగవారు, వినోదవృత్తిచే జీవించు బ్రాహ్మణులు

**విప్రావమన్యకుడు** - బ్రాహ్మణులను తిరస్కారబుద్ధితో జూచువాడు

**విప్రియము** - ప్రియముకానిది, అసహ్య మైనది

**విప్రుడు** - తనతోపాటు పరునిసైతము పాపము నుండి కాపాడువాడు

**విప్రుషము** - దాహమును పోగొట్టునది (నీటిబొట్టు)

**విబుధులు** - విశేషమైన బోధకలవారు (వేల్పులు)

**విభాకరుడు** - విశేష కాంతిని కల్గించువాడు (అగ్ని-వీతిహోత్రుడు, సూర్యుడు)

**విభాగపత్రిక** - అన్నదమ్ములు పంచుకొని వ్రాసికొన్న ఒడంబడిక పత్రము

**విభాజకము** - విభజించునది

**విభాజితము** - విభజింపబడినది (భాగ హారము నందు భాగింపగా నేర్పబడిన సంఖ్య)

**విభాజ్యము** - వేరు చేయదగినది (భాగింప దగిన సంఖ్య)

**విభావరి** - సూర్యకాంతిని గప్పునది, చంద్రాదులచే బ్రకాశించునది (రాత్రి)

**విభావసుడు** - కాంతియే ధనముగా గలవాడు (అగ్ని, సూర్యుడు)

**విభాష** - సూత్రమునకు వైకల్పికవృత్తి (వ్యాక), అన్యభాష

**విభూషణము** - అలంకరించుకొనుటకు యోగ్యమైనది (నగ)

**విభ్రమము** - వస్త్రభూషణాదులవెలుగు, మాటల తడబాటు, వస్త్రభూషణాదుల తారుమారుకైసేతవంటి మతిమరపుపని

**విభ్రాట్టు** - అలంకారాదులచే ప్రకాశించు వాడు (రోచిష్ణువు - భ్రాజిష్ణువు)

**విమతుడు** - భిన్నమైన అభిప్రాయము కలవాడు (శత్రువు)

**విమాతృజుడు** - (విమాత-సవతితల్లి) సవతి తల్లి కొడుకు

**విమానము** - గగన సంచారమున వక్షితో పోలికగలది (వ్యోమయానము)

**విమార్గగ** - పతివ్రతలకు విరుద్ధమైన మార్గమున పోవునది (జారిణి)

**విముఖుడు** - పెడమోము పెట్టినవాడు

**వియచ్చరుడు** - ఖేచరుడు (వేల్పు)

**వియద్గంగ** - మిన్నేరు (ఆకాశగంగ)

**వియన్మణి** - ద్యుమణి (సూర్యుడు)

**విరజస్క** - ముట్లుడిగిన స్త్రీ (విగతార్తవ)

**విరజస్తమసుడు** - రజస్తమోగుణములు లేనివాడు (సత్త్వగుణ సంపన్నుడు)

**విరసము** - రసము లేనిది, అనుచిత రసభావమును గూర్చుట (ఒక అర్థగత దోషము)

**విరహోత్కంఠిత** - విరహముచే వేదనపడెడు నాయిక

**విరాగుడు** - విషయేచ్ఛలేనివాడు (విరాగి - విరక్తుడు)

**విరిం(చి)చనుడు** - భూతములను సృజించు వాడు, హంసలచేత వహింపబడువాడు, సృష్టికర్త (బ్రహ్మ నలువ)

**విరించుడు** - విరించనుడు

**విరితేనెత్రావుడు** - పువ్వుల యందలి మకరందము ద్రాగునది (తుమ్మెద)

**విరిబోడి** - పుష్పమువలె మనోజ్ఞురాలైన యాడుది (ననబోడి)

**విరివిలుకాడు, విరి విలుతుడు** - పువ్విలు (కాడు)తుడు (మన్మథుడు)

**విరూపాక్షుడు** - సూర్య చంద్రాగ్ని రూపములగు త్రినేత్రములు కలవాడు. (ముక్కంటి - ఈశ్వరుడు)

**విరోచనుడు** - విశేషముగా ప్రకాశించువాడు (సూర్యుడు, చంద్రుడు, అగ్ని)

**విరోధము** - సహానమును విశేషముగ అడ్డుకొనునది (పగ)

**విరోధాభాసము** - పరస్పర వైరుధ్ధ్యమును అర్థాంతరముచే పరిహరించునట్లు చెప్పెడి అర్థాలంకారము (ఉదా - ఓ కాంతా నీకుచములు హార రహితము లయ్యు హారులుగా నున్నవి హారులు = మనస్సును హరించునవి)

**విలక్షుడు** - సిగ్గుపడినవాడు (లజ్జితుడు), వెరగుపడినవాడు

**విలాసము** - ప్రియదర్శనమున కటాక్ష వీక్షణాది రూపమైన స్త్రీల శృంగార చేష్టా విశేషము, జాబు మీద వ్రాసెడు చిరునామా

**విలాసిక** - ఒక అంకముగల హాస్యరస నాటిక, శృంగార రస ప్రధానమగు ఏకాంకిక

**విలువకాడు** - (వెల యిచ్చి తీసి) కొనువాడు (క్రయికుడు - జట్టిగాడు)

**విలేవాసి** - బిలమున నివసించునది (బిలేశయము - సర్పము)

**విలోడితము** - ఒక వంతునీరు మూడువంతులు పెరుగుతో చేసిన మజ్జిగ (తక్రము)

**విలోమము** - అవరోహణ క్రమము కలది (క్రమమునకు తలక్రిందైనది), రోమములు లేనిది

**విలోమజాతుడు** - తండ్రి కంటె హెచ్చు కులము గల తల్లికి బుట్టినవాడు

**వివచ్ఛము** - భీతిని, రోతను గలుగజేయు యుద్ధరంగ దృశ్యము

**వివత్స** - దూడ చనిపోయిన యావు

**వివస్వంతుడు** - కాంతిచే అన్నిటిని గప్పెడు వాడు, కాంతికలవాడు (సూర్యుడు)

**వివృతోక్తి** - మరుగు పడిన విషయమును శ్లేషతో వివరించునట్టి అర్థాలంకార భేదము

**విశ్వచ్ఛుడు** - అర్జునుడు (బీభత్సుడు)

**విశల్యకరణి** - విరిగిన ఎముకలను కలుపునది (సంధాన కరణి - ఒక ఓషధి)

**విశాఖము** - విలుకాడు రెండు కాళ్ళ నడుమ జేనె డెడము గలుగ నిలుచుట, శాఖలు లేనిది

**విశాఖుడు** - పక్షియగు నెమలి వాహనముగా గలవాడు. (విశాఖా నక్షత్రమున బుట్టిన వాడగు కుమారస్వామి)

**విశాల త్వక్కు** - వెడల్పైన త్వక్కు (చెట్టుపట్ట) కలది (ఏడాకులరటి)

**విశాలాక్షి** - విశాలములైన కన్నులు గలది (పార్వతి), విశాలములైన కన్నులుగల స్త్రీ (ఆడుది)

**విశేషకము** - విశేషింపచేయునది (నొసటి బొట్టు), ఒకే క్రియతో నన్వయించు 3 పద్యములు (గుణవతి)

**విశేషోక్తి** - కారణముండియు కార్యము కలుగనట్లు వర్ణింపబడిన యర్థాలంకారము

**విశ్రుతుడు** - ప్రసిద్ధి కెక్కినవాడు (ఖ్యాతుడు ప్రథితుడు)

**విశ్వంభర** - విశ్వమును భరించునది (భూమి - నేల)

**విశ్వభరుడు** - సమస్తమును భరించువాడు (విష్ణువు)

**విశ్వకద్రువు** - అన్నివైపులకును మసలునది (సివంగి - వేటకుక్క, ధ్వని) పలు పోకిళ్ళు పోవువాడు (దుర్జనుడు)

**విశ్వకర్మ** - దేవశిల్పి, సూర్యుడు

**విశ్వజనీనము** - సర్వజనులకు హితమైనది

**విశ్వజిత్తు** - యజమానుడు తన యావదాస్తిని దానముచేసి అదే దినములో ముగింప వలసిన యాగము (నచికేతుని తండ్రి చేసిన యాగము), విష్ణుదేవుడు

**విశ్వతోముఖము** - అంతటను వ్యాపించి యుండునది (సర్వతో ముఖము)

**విశ్వనాథుడు** - ప్రపంచమునకు భర్త (కాశీక్షేత్రమున వెలసి యున్న శివుడు)

**విశ్వభేషజము** - సమస్త దోషములను పోగొట్టునదగుటచే విశ్వమను పేరుగల యౌషధము (సొంటి-విశ్వాహ్వ, విశ్వౌషధము)

**విశ్వమిత్రుడు** - అందరకును స్నేహితుడు

**విశ్వరూపుడు** - సమస్తమైన రూపము లందున్నవాడు (విష్ణువు)

**విశ్వరేతసుడు** - విశ్వము ఈతని వీర్యము వలననైనది (కల్గినది) (బ్రహ్మ)

**విశ్వసృ(క్కు-జుడు)ట్టు** - సమస్తము సృష్టించినవాడు (జగముల బుట్టించు జాణ - బ్రహ్మ)

**విశ్వస్త** - విశ్వసింపబడినది (విధవ)

**విశ్వస్తము** - నమ్మబడినది (విస్రబ్ధము)

**విశ్వాత్మ** - సమస్తమును ఆత్మస్వరూపముగా గలవాడు (బ్రహ్మ)

**విశ్వామిత్రుడు** - ప్రపంచమునకు స్నేహితుడు (ఒకరాజర్షి-గాధేయుడు)

**విశ్వేదేవులు** - ధర్మునకు విశ్వమందు జన్మించినవారు

**విషఘ్నము** - విషమును పోగొట్టునది (దిరిసెనపు చెట్టు)

**విషణ్ణుడు** - విషాదము పొందినవాడు

**విషధరము** - విషమును ధరించునది (పాము-పన్నగము తేలు-కాలిక) నీటిని ధరించునది (మబ్బు)

**విషధరుడు** - హాలాహలమును కంఠమున ధరించినవాడు (శివుడు)

**విషధి** - ఇందు నీరు నిలిచియుండును (సముద్రము)

**విషపుచ్ఛము** - విషము తోకయందు గలది (తేలు-వలీనము, పొట్టిమ)

**విషమచ్ఛదము** - బేసియైన ఆకులు కలది (ఏడాకులనటి - సప్తపర్ణము)

**విషమనేత్రుడు**- బేసికంటి(అసమనయనుడు)

**విషమము** - సమముకానిది (బేసిది) హెచ్చుతగ్గులు కలది (విరూపము) బాణమునకు చిక్కని మృగము (అజాపయుక్కు) అననురూపఘటనా రూపవిషమ అనిష్టావాప్తిరూప విషమ, కార్యోత్పత్తి రూప విషమ అను మూడు తెరగులగు విషమాలంకారము (అర్థాలంకార విశేషము)

**విషమశరుడు** - అసమశరుడు, అయుగ శరుడు (మన్మథుడు- పంచబాణుడు)

**విషమాక్షుడు** - అసమనయనుడు (శివుడు)

**విషమాయుధుడు** - అయుగశరుడు (బేసికైదువుజోదు - మన్మథుడు)

**విషము** - తీక్ష్ణముగ వ్యాపించునది (గరళము), తడుపునది (నీరు)

**విషాస్యము** - విషము ముఖమున (తలయందు) గలది (విషారము, పాము)

**విషువత్తు** - రేయి పగలు సమమైన కాలము (విషువము)

**విష్కంభము** - జరిగినదియు, జరుగు నదియు, తెరపై ప్రదర్శింపరానివియగు కథాంశములను మధ్యమ పాత్ర ద్వారా సూచించుట (సూచ్యవస్తువు - విష్కంభ, ప్రవేశక, చూళిక, అంకాన్య, అంకావ తారములచే సూచింపదగును రూప కాంగములలోనిది)

**విష్టరశ్రవుడు** - విష్టరము (దర్భముడి) వంటి చెవులుకలవాడు. (విష్ణుడు) దర్భముడి యాకారముగల వెంట్రుకల సుడి కర్ణమున గలవాడు

**విష్ఠ** - విసర్జింపబడునది (మలము - అశుద్ధము, శమలము)

**విష్ణుచిత్తీయము** - అముక్తమాల్యద (ఒకానొక ప్రబంధము)

**విష్ణుపదము** - విష్ణువునకు స్థానమైనది (ఆకాశము, పాల సముద్రము)

**విష్ణుపది** - విష్ణు పాదమున బుట్టినది (గంగ)

**విష్ణువు** - అంతటను వ్యాపించియుండు వాడు (వెన్నుడు, సూర్యుడు)

**విష్యుడు** - విషము పెట్టి చంపదగినవాడు

**విష్వక్సేనుడు** - అంతటను వ్యాపించిన సేన కలవాడు (విష్ణువు)

**విసంధి** - లక్షణ విరుద్ధమును గ్రామ్యపు సంధియు గల వాక్యము (ఒకానొక వాక్యదోషము)

**విసదారి** - విష ధరము (పాము, మబ్బు)

**విసపుమేతరి** - పాలకడలి త్రచ్చునపుడు బుట్టిన హాలా హలమును మ్రింగినవాడు (శివుడు)

**విసముదాల్పు** - విసదారి (పాము, శివుడు)

**విసారి** - వ్యాపించునది, ప్రాకునది

**విస్మృత్వరుడు, విస్మృమరుడు** - వ్యాపించెడు శీలము కలవాడు

**విహంగమము, విహంగము** - ఆకసమున పోవునది (పక్షి - విహాయసము)

**విహంగమార్గము** - పక్షి గ్రుడ్లను బెట్టి రెక్కలచే మూసి యుంచుట వలన పిల్లలైనట్లు గురువు శిష్యులను విడువక వారిని వృద్ధిలోనికి తెచ్చు విధము

**విహర్త** - వేడుకగా దిరుగువాడు (విహారి)

**విహసితము** - మృదు ధ్వని గల నవ్వు (స్మితము = చిరునగవు, అపహసితము = ఎగతాళితో గూడినది, ప్రహసితము శిరఃకంపముతో

గూడినది, అతిహసితము = పెద్దనవ్వు అవహసితము, విహసితము, మధ్యమజాతికి చెందిన హాసము )

**విహాయసము, విహాయసనము** - దీనియందు విశేషముగా అన్నియు సంచరించును, అన్నియు దీనిని బొందును (ఆకాశము-విహాయస్సు), ఆకాశమున వివిధ గతులతో (సంచరించు) విహరించునది (పక్షి-విహంగము)

**విహారదాసి** - సాధుస్త్రీల మఠములోని సేవకురాలు

**విహ్వలుడు** - భయసంభ్రమాదులచే అవయవాదుల స్వాధీనత తప్పినవాడు,

**వీచి** - చూచునప్పుడు విస్మయమును జనింపజేయునది (అల-ఊర్మి)

**వీచిమాలి** - అలల వరుసలు కలది (ఊర్మిమాలి, కడలి-సముద్రము)

**వీటికాపేటిక** - తాంబూలము లుంచుకొను పెట్టె (పాందాను - హడపము)

**వీడుపట్టు** - దండు విడియు చోటు (స్కంధావారము, బాటసారుల గుంపు విడిసినచోటు (విడిది)

**వీతిహోత్రుడు** - హవిస్సు ఆహారముగా కలవాడు, హవిస్సును మోసికొనిపోయి దేవతలకు అందజేయువాడు (అగ్నిహోత్రుడు)

**వీను** - శబ్దమును వినునది (చెవి - శ్రోత్రము)

**వీనులకంటి** - కన్నులు వీనులుగా కలది (పాము)

**వీనులపండువు** - చెవుల కింపుగా ఉండునది

**వీరజయంతిక** - యుద్ధ రంగమున వీరులు కావించెడు నృత్యము

**వీరతాయెత్తు** - శూరులు బిరుదుగా కట్టుకొనెడు తాయెత్తు

**వీరమద్దియలు** - శత్రువీరుల పేర్లు చెక్కించి శూరులు బిరుదుగా కాలివ్రేలికి ధరించెడు ముద్రికలు (వీరమద్దెలు-వీరముద్రికలు)

**వీరముద్దియలు** - స్త్రీలు కాలి వ్రేళ్ళకు ధరించెడు మట్టెలు, చూ వీరమద్దియలు

**వీరముష్టి** - కోమట్లను యాచించుకొని జీవించువాడు, వీరభద్రుని సంబరమున భక్తితో తన నైపుణ్యము ప్రదర్శించు నొక తెగవాడు

**వీర వైష్ణవుడు** - వైష్ణవ మతము నందు మిక్కిలి పట్టుదల గల విష్ణుభక్తుడు

**వీరశైవుడు** - శైవమతమున మిక్కిలి పట్టుదల గల శివభక్తుడు

**వీరసువు** - వీరుని గన్న తల్లి (వీరమాత)

**వీరశంసనము** - హింనకు, వీరుల స్తుతి పాఠములకు స్థానము కల్పించు భయంకరమైన యుద్ధరంగము

**వీరాసనము** - రాత్రులందు కత్తి చేతబూని హెచ్చరికతో శిబిరాదులను కావలికాయుట దేని మీదను ఆనుకొనక కూర్చుండుట

**వీర్యము** - వీరుని యందు వృద్ధియగునది (రేతస్సు)

**వీర్యశుల్కము** - పరాక్రమమే కన్యాశుల్కముగా చేయుకట్టడి

వృకధూపము - వివిధములగు పరిమళ ద్రవ్యములు చేర్చి చేసిన ధూపద్రవ్యము

**వృకోదరుడు** - వృకపరిమాణమైన ఉదరము కలవాడు(తోడేటి కడుపు మేటి-భీముడు)

**వృజినము** - శిష్టులచేత వర్జింపబడునది (పాపము)

**వృత్తికారుడు** - సూత్రములకు టీకా తాత్పర్యములు చెప్పినవాడు (భాష్యకర్త-వ్యాఖ్యాత)

**వృత్త్యనుప్రాసము** - ఒకటిగాని రెండుగాని

వర్ణములకు ఆవృత్తి కలుగునట్లు చెప్పెడు శబ్దాలంకారము

**వృత్తము** - (జ్ఞానమును) ఆచ్ఛాదించునది (అజ్ఞానము), ఆవరించునది ( చీకటి)

**వృత్రహుడు** - వృత్రాసురుని వధించినవాడు (ఇంద్రుడు)

**వృత్రుడు** - వేదార్ధము ప్రకటితము కాకుండ వేదముల నాచ్ఛాదించి అజ్ఞానము నంబడవేయువాడు (ఒక రాక్షసుడు)

**వృద్ధజంబుకము** - వంచక స్వభావము గల వృద్ధుడు

**వృద్ధ శ్రవుడు** - వృద్ధుల (బృహస్పత్యాదుల) ఉపదేశములను వినువాడు (ఇంద్రుడు)

**వృద్ధ్యాజీవి, వృద్ధ్యాజీవుడు** - వడ్డీ వ్యాపారముచే జీవించువాడు (వార్ధుషికుడు)

**వృశ్చికాలి** - తేలుకుట్టినట్టు బాధ కల్గించునది (తేలు మణిచెట్టు - విషాణి)

**వృషకేతనుడు** - వృషభధ్వజుడు శివుడు (వృషధ్వజుడు - ఎద్దుటెక్కమువాడు)

**వృషణము** - రేతస్సును వర్షించునది (అండము - వట్టకాయ)

**వృషదంశకము** - ఎలుకలను తినునది(పిల్లి)

**వృషధ్వజుడు** - ఎలుక ధ్వజ చిహ్నముగా నున్నవాడు(గణపతి) ఎద్దు టెక్కెమువాడు (ఆబోతురౌతు - శివుడు)

**వృషభవాహనుడు** - వృషభము వాహనముగా గలవాడు (శివుడు - కోడెరౌతు)

**వృషభము** - ఉత్తర పదమైనపుడు శ్రేష్ఠవాచకమగునది, ఒకానొక రాశి, ఎద్దు

**వృషము** - కామితమును వర్షించునది (పుణ్యము)

**వృషలి** - రజస్వలయై యింటనున్న పెండ్లికాని పడుచు (కన్యక)

**వృషలుడు** - ధర్మమును నాశము చేయువాడు (పాపి)

**వృషశత్రువు** - వృషాసురుని సంహరించిన వాడు (విష్ణువు)

**వృషస్యంతి** - అధికవీర్యము కలవానిని ఇష్టపడునది (కామిని)

**వృషాంకుడు** - ఎద్దుజెండా గుర్తుగా గలవాడు (శివుడు) ఎలుకజెండా గుర్తుగా గలవాడు (వినాయకుడు)

**వృషాకపి** - ధర్మహాని కలుగనీయనివాడు (శివుడు, విష్ణువు)

**వృష్టి జీవనము** - వర్షముపై ఆధారపడి జీవించునది (వానకోయిల)

**వెండికొండ దునీడు, వెండికొండమన్నీడు** - కైలాస పర్వతమునకు ప్రభువు (శివుడు)

**వెండిమల** - వెండికొండ (కైలాసము)

**వెజ్జు** - రోగమునకు మందిచ్చువాడు (వైద్యుడు)

**వెట్టచెవుల తపసి** - ఉగ్రశ్రవసుడు (సూతుని కొడుకు)

**వెట్టికారు** - వెట్టకారు (జ్యేష్ఠాషాఢ మాసములు గ్రీష్మ ఋతువు)

**వెడదనోటిమెకము** - విశాలమైన నోరుగల మృగము (సింహము)

**వెడద మోముమెకము** - విశాలమైన ముఖము గలది (సింహము - పంచాస్యము)

**వెడవింటి** - వెడవిల్లు కలవాడు (పుష్పధన్వుడు - కుసుమాస్త్రుడు)

**వెడవిలుకాడు** - మన్మథుడు పువ్విల్తుడు తూడువిల్తుడు)

**వెడవిలుతుడు** - వెడవిలుకాడు

**వెదావు** - అబోతుచే వెనుకొనబడు అవు (ఎదావ్ - వెదమొదవు)

**వెనుచూపు మెకము** - వెనుక చూపు మెకము (ఎలుగుబంటి - వెలుగుబంటి)

**వెన్నతోపెట్టినవిద్య** - బాల్యమునుండి అభ్యసించిన విద్య

**వెన్నదొంగ, వెన్నముచ్చు** - రేవల్లెలో వెన్న దొంగిలించినవాడు (కృష్ణుడు)

**వెన్నుదన్ను** - తరుముకొని వచ్చు

**వెన్నునంటు** - వెన్నునిచెలికాడు (కృష్ణసఖుడు అర్జునుడు)

**వెన్నునడుగుపావ** - వెన్నుని అడుగునకు బిడ్డవంటిది (గంగ - కాలిపుట్టువు)

**వెన్నునన్న** - అదితియందు వామనునకు పూర్వమున జన్మించిన ఇంద్రుడు

**వెన్నునడుగు** - వామన రూప విష్ణువునకు రెండవ యడుగైనది (ఆకాశము - చుక్కలదారి)

**వెన్నునరదము** - విష్ణు రథము (గరుడుడు)

**వెన్నునిటెంకి** - విష్ణునివాస స్థానము (సముద్రము, వైకుంఠము)

**వెన్నునివలకన్ను** - వెన్నునికి వలకన్నైనవాడు (విష్ణుని కుడికన్నైనవాడు - సూర్యుడు)

**వెన్ను పడగ** - వెన్నునకు పడగ అయినవాడు (గరుత్మంతుడు)

**వెన్నుపాన్పు** - విష్ణునకు శయ్యగా నుండువాడు (ఆదిశేషుడు)

**వెన్నువలచూపు** - విష్ణుని దక్షిణ నేత్రము (వెన్నుని వలకన్ను - సూర్యుడు)

**వెన్నెలకుప్పలు** - పిల్లలాడుకొను వెన్నెల ప్రోవులాట (బాలక్రీడా విశేషము)

**వెన్నెలగుత్తి** - వెన్నెలకు గుత్తివంటివాడు (చంద్రుడు - వెన్నెలరేడు)

**వెన్నెలపులుగు** - వెన్నెలను ద్రావి సుఖముగా జీవించెడు పిట్ట చకోరము వెన్నెలపిట్ట

**వెన్నెలరాయుడు, వెన్నెలరేడు** - వెన్నెలకు ప్రభువు (చంద్రుడు)

**వెఱ్ఱినీళ్ళ మేలువాడు** - వెఱ్ఱినీళ్ళవలపుకాడు (బలరాముడు)

**వెఱ్ఱినీళ్ళు** - (మత్తు) పిచ్చియెత్తించునీళ్ళు (చొక్కునీరు - కల్లు)

**వెలయెలనాగ; వెలవెలది** - రొక్కమునకు వచ్చిన(వెలది) ఎలనాగ (వేశ్య - రోవెలది)

**వెలిగిడ్డి** - తెలిమొదవు ( కామధేనువు)

**వెలిగొరు** - తెల్లని యేనుగు (ఐరావతము)

**వెలితిప్ప** - వెలిగొండ (కైలాసము, దూరపుగొండ)

**వెలిమావు** - తెల్లని గుఱ్ఱము (ఉచ్చైశ్శ్రవము)

**వెలియూల పోతు రౌతు** - తెల్లనియెద్దు నెక్కువాడు (శివుడు)

**వెలుగురేడు** - కాంతులకు ప్రభువు (సూర్యుడు)

**వెల్లగొమ్ముల మెకము** - తెల్లని దంతములు గల జంతువు (ఏనుగు)

**వెల్లగొడుగు** - తెల్లని గొడుగు

**వెల్లజక్కి సామిటెంకి** - వెల్లజిక్కి చూ॥ వ్రాతప్రతి- ఇంద్రునికి వాసస్థానమైనది (స్వర్గము)

**వెల్లజాల్కలవీడు** - వెల్లివాకగల పట్టణము, అమరావతి

**వెల్లదామర** - తెల్లదామర (పుండరీకము)

**వెల్లముత్తైదువు** - తెల్లని యాకృతిగల పుణ్యస్త్రీ (సరస్వతి)

**వెల్లివాక** - తెలియేరు

**వేగంటి** - వేయి కన్నులు గలవాడు (ఇంద్రుడు)

**వేగంటికచ్చేరి** - వేగంటి యొక్క కచేరి (కొల్వు కూటము) సుధర్మము

**వేగంటి కొలువు** - ఇంద్రుని సభ (సుధర్మ)

**వేగంటి గొంగ** - వేయికన్నులు గల ఇంద్రునకు శత్రువు ( రాక్షసుడు)

**వేగంటియెక్కుడు** - వేగంటి(వాని)కి వాహనమైనది (ఐరావతము)

**వేగంటి సైదోడు** - ఇంద్రునకు తమ్ముడు (వామనుడు)

**వేగరి** - వార్తతెచ్చువాడు ( వార్తాహరుడు - వేగు(ల)వాడు)

**వేగుజుక్క, వేగురిక్క**- తెల్లవారు జామున పొడుచు నక్షత్రము (శుక్రుడు)

**వేగురుజుక్క**- వేగుజుక్క (పొడుపుచుక్క - శుక్రుడు)

**వేగురు** - వేయిమంది ( వేవురు)

**వేచుంగలపాగ** - వేయిపడగలు గల ఆదిశేషుడు

**వేచుంగల పాగగల దిట్ట** - వేయి (చుంగలు) పడగలుగల ఆదిశేషుడు అలంకారముగా గల్గినవాడు (శివుడు)

**వేడికంటి** - వేడిమిగల మూడవ కన్ను గలవాడు (శివుడు)

**వేడివెలుగు** - వేడివెల్గుకలవాడు (సూర్యుడు)

**వేడివేలుపు** - వెచ్చనిదేవుడు ( సూర్యుడు- ఉష్ణాంశువు, అగ్ని)

**వేడుకకత్తియ, వేడ్కకత్తె** - సంతోషపెట్టునది (వేశ్య)

**వేడ్కకాడు** - వినోదకరుడు (వేడుకకాడు)

**వేణుకము** - ఏనుగును బొడిచెడు బరికోల (అంకుశము)

**వేణుధ్ముడు** - వేణువు (పిల్లనగ్రోవి) నూదు వాడు (వైణవికుడు)

**వేత్రధరుడు** - బెత్తమును చేతబట్టియుండు రాజోద్యోగి (వేత్రహస్తుడు

**వేత్రవతి** - పేపపాదలెక్కువగా గల నది

**వేదండము** - (సామ)వేదమునుండి పుట్టినది (సామజము - ఏనుగు)

**వేదవతి** - కృశధ్వజుడు వేదపారాయణము చేయుచుండగా బుట్టినది

**వేదవ్యాసుడు** - వేదము విభాగము చేసిన వాడు ( వ్యాసుడు)

**వేదాంగములు** - శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము అను షడంగములు

**వేదాంతము** - వేదము యొక్క చివరి భాగము

**వేయంచులవాలు** - వేయిఅంచులు గల చక్రాయుధము ( సుదర్శనము) వేయి మొనలు గల ఆయుధము (వజ్రా యుధము)

**వేయిండ్లపూజారి** - పనిలేక తిరుగువాడు

**వేయిచేతుల దిట్ట** - వేయి చేతులు గల ప్రభువు (సూర్యుడు, కార్తవీర్యార్జునుడు)

**వేయి చేతుల రేడు** - వేయిచేతుల దిట్ట (సహస్రబాహుడు)

**వేలుపు గమికాడు** - దేవసేనకు నాయకుడైన వాడు ( వేల్పుగమికాడు-కుమారస్వామి వేల్పు పెద్ద (సురజ్యేష్ఠుడు-బ్రహ్మ)

**వేలుపుగాణ** - దేవతలలో పాటకాడు (గంధర్వుడు - దేవగాయకుడు)

**వేలుపుగిడ్డి** - దేవతల యొక్క కోర్కెలిచ్చు ఆవు (కామధేనువు - వేల్పుటావు)

**వేలుపుజడదారి** - వేల్పులయందు జడదారి (నారదుడు - కలిప్రియుడు)

**వేలుపుజెట్టు** - వేల్పుల యొక్క చెట్టు (కల్పవృక్షము- పుడుకుమ్రాను)

**వేలుపుటావు** - దేవతల యొక్క కోర్కె లీడేర్చు ఆవు (వేల్పుగిడ్డి - కామధేనువు)

**వేలుపుటెంకి** - దేవతల వాసస్థానము (స్వర్గము)

**వేలుపుటేటి సవతి** - గంగాదేవికి సవతి (పార్వతి)

**వేలుపుటేరు** - దేవలోకమునందు ప్రవహించునది (వినువాక - మిన్నేరు)

**వేలుపుటేలిక** - వేల్పుల ఏలిక (ఇంద్రుడు)

**వేలుపుటొజ్జ** - దేవతల కుపాధ్యాయుడైన వాడు (బృహస్పతి)

**వేలుపుదాయ** - దేవతలకు జ్ఞాతియైనవాడు (అసురుడు - సురవైరి)

**వేలుపుదెరువు** - దేవతలకు మార్గమైనది (ఆకాశము)

**వేలుపుబెద్ద** - వేల్పులందు పెద్ద (నలువ - బ్రహ్మ)

**వేలుపుబాస** - వేల్పుల యొక్క బాస (సంస్కృతము)

**వేలుపు బువ్వ, వేలుపు బోనము** - దేవతలకు ఆహారమైనది (అమృతము) నైవేద్యము

**వేలుపుమల** - వేలుపులుండు కొండ (మేరువు)

**వేలుపు మానికము** - వేల్పుల యొక్క మానికము (చింతామణి - పుడుకుగల్లు)

**వేలుపుమ్రాను** - దేవతల కోరికలిచ్చు చెట్టు (కల్పతరువు)

**వేలుపుమావు** - దేవతలయొక్క మావు (ఉచ్చైశ్శ్రవము)

**వేల్పుప్రోలు** - సురలోకము (స్వర్గము)

**వేల్పువెజ్జు** - దేవవైద్యుడు (ధన్వంతరి)

**వేవెలుగు** - వేయి కిరణములు గలవాడు (సూర్యుడు)

**వేశవారము** - ఘుమఘుమలచే ఇంటిని అలముకొనునది (మసాలా - వంట సంబారము)

**వేశ్మనకులము** - ఇంటిలో ముంగిస వలె తిరుగునది (చుంచు)

**వేష్టితము** - పెక్కండ్రు స్త్రీలు మండలా కారముగ దిరుగుచు చేయు నృత్యము (హల్లీనకము)

**వైకటికుడు** - రత్నములు సానపట్టువాడు

**వైకల్పికము** - వికల్పముచే గలిగినది

**వైకుంఠము** - వైకుంఠుడుండెడు లోకము

**వైకుంఠుడు** - వికుంఠయను తల్లియందు బుట్టినవాడు (విష్ణువు)

**వైకృతము** - సంస్కృత ప్రాకృతముల నుండి పుట్టిన పదము (ప్రాకృత సమము) వికారము నొందినది

**వైఖానసము** - వైష్ణవాగమములలో విఖనస మునిప్రోక్తమైన సూత్ర గ్రంధము

**వైఖానసుడు** - వానప్రస్థుడు, వైష్ణవ పూజారి

**వైజయంతికుడు** - టెక్కము పట్టుకొనువాడు (పతాకి)

**వైడూర్యము** -విడూర దేశమున బుట్టిన మణి

**వైణవికుడు** - పిల్లనగ్రోవి నూదువాడు (వాంశికుడు -వైణికుడు)

**వైణికుడు** - వీణ వాయించువాడు (వీణెకాడు - వీణావాదుడు)

**వైతంసికుడు** - మృగపక్ష్యాదులను జంపి మాంసము విక్రయించువాడు (కటికవాడు - కసాయి, ఖట్టికుడు)

**వైతనికుడు** - వేతనముచే జీవించువాడు, కూలికై పనిచేయువాడు (కూలివాడు - సంబళకాడు)

**వైతరణి** - (గో) దానాదుల మూలమున దాటదగిన నిప్పుల యేరు

**వైతాళికుడు** - రాజు నిద్రనుండి లేచుటకై మేలుకొలుపు పాడెడువాడు(ఘాంటికుడు - ఉద్బోధకుడు)

**వైదర్భి** - క్లిష్ట సంధులును, పరుష వర్ణములును, దీర్ఘసమాసములును లేని పద రచన, (ఒకానొక కావ్యరీతి) విదర్భరాజగు భీముని కొమరిత (దమయంతి)

**వైదికము** - వేదమునందు జెప్పబడినది

**వైదికుడు** - వేదము తెలిసన బ్రాహ్మణుడు

**వైదూర్యము** - విదూర దేశమున పుట్టినది (వైడూర్యము)

**వైదేహికుడు** - విదేహ రాజ్యమును బాలించినవాడు (జనకుడు, వైదేహి - జనకజ - సీత)

**వైధవేయుడు** - విధవ యొక్క కొడుకు

**వైధాత్రుడు** - విధాత (బ్రహ్మ) యొక్క కొడుకు (సనత్కుమారుడను దేవర్షి)

**వైనతేయుడు** - వినత కొడుకు (గరుత్మంతుడు, అనూరుడు)

**వైన్యుడు** - వేనుని కుమారుడు

**వైభాషికుడు** - భాషాంతరీకరణము చేయువాడు (అనువాదకుడు)

**వైభ్రాజము**-దేవోద్యానవనము (నందనవనము)

**వైమాత్రేయి** - సవతి తల్లి (విమాత) కూతురు

**వైమాత్రేయుడు** - సవతి తల్లి కొడుకు

**వైమానికుడు** - విమాన సంచారి

**వైయాకరణుడు** - వ్యాకరణ శాస్త్రమును జదివినవాడు (శాబ్దికుడు)

**వైయాఘ్రము** - పులితోలు కప్పబడినది

**వైరాగ్యము** - విషయ వాంఛలు లేకుండుట (విరాగత)

**వైరాటము** - పగబట్టిన దానివలె తిరుగునది (ఆరుద్రపురుగు)

**వైరారోహము** - చలము పెచ్చు పెరిగిన గొప్ప యుద్ధము

**వైరోచనుడు** - విరోచనుడను రాక్షసుని కొడుకు

**వైవధికుడు** - కావడి మోయువాడు (భారవాహుడు)

**వైవస్వతుడు** - వివస్వంతుని (సూర్యుని) కుమారుడు (యముడు, శని)

**వైశసుడు** - కీడు చేయువాడు

**వైశాఖము** - విశాఖా నక్షత్రయుక్త పౌర్ణమాస్యగల మాసము, రెండు కాళ్ళ నడుమ జేనెడెడము గలుగ నిలుచు విలుకాండ్ర నిలుకడ (ఆలీఢ, ప్రత్యాలీఢ, సమపద, విశాఖ, మండలాదులు విల్కాని నిలుకడలు)

**వైశికము** - భోగస్త్రీకి సంబంధించినది

**వైశేషికుడు** - ద్రవ్యము, గుణము, కర్మము, సామాన్యము, విశేషము, సమవాయము, అభావము అను సప్త పదార్థములను జెప్పునట్టి తర్క శాస్త్రమును నెరింగిన వాడు, కాణాదము నెరింగినవాడు

**వైశ్వదేవము** - విశ్వదేవతలను గూర్చి చేసెడు యాగము

**వైశ్వానరుడు** - విశ్వానరుడను ఋషి కుమారుడు, జఠరాగ్నిగా అందరిలోను ఉండువాడు (అగ్ని)

**వైషయికము** - విషయ సంబంధమైనది

**వైష్ణవము** - విష్ణు సంబంధమైనది (ఒకమతము)

**వోఢజుడు** - గర్భిణిని బెండ్లాడగా గల్గిన కొడుకు

**వ్యంగ్యము** - వ్యంజన చేత తెలియదగిన యర్థము (ధ్వని)

**వ్యంజనము** - 1 అర్ధమాత్ర కాలమున ఉచ్చరింపదగిన వర్ణము (హల్లు-క్,చ్ మొ॥

2 చుట్టును అగ్నిని త్రిప్పి చేసెడు ఒక సంస్కారము (వర్యగ్ని కరణాది పశుసంస్కారము)

3 కూర, పచ్చడి, పులుసు మొ॥

**వ్యడంబకము** - మలమును వెళ్ళగొట్టునది (ఏరండము - ఆముదపు చెట్టు)

**వ్యళీకము** - మన్మథావేశమున కాముకుడు స్త్రీపట్ల చేయు అపరాధము

**వ్యవకలనము** - వేరు చేయుట

**వ్యాకీర్ణము** - అన్వయమున భ్రమ కల్గునట్లు కూర్చెడు వాక్యము (వాక్యగత దోషము)

**వ్యాకృతము** - నామ రూపములతో (విశదమైనది) వెల్వరింపబడినది

**వ్యాఘాతము** - ఆటంకము, దెబ్బ, ఒకానొక అర్థాలంకారము

**వ్యాఘ్రము** -చంపునపుడు వాసన చూచునది (పులి)

**వ్యాఘ్రాటము** - పులివలె తిరుగునది (భరద్వాజ పక్షి)

**వ్యాజస్తుతి** - నిందచేత స్తుతిగాని, స్తుతి చేత నిందగాని తోచునట్లు చెప్పబడు అర్థాలంకారము ( ఒక వస్తువును నిందించుట వలన వేరొకనిందతోచుచో వ్యాజనింద)

**వ్యాజోక్తి** - కారణాంతరమును జెప్పి యథాకారగోపనము జేయుట (ఒకానొక అర్థాలంకారము)

**వ్యాధుడు** - మృగములను వ్యధ పెట్టువాడు (బోయ)

**వ్యానము** - శరీరమంతటను వ్యాపించి యుండునది, దీనిచే విశేషముగా బ్రతుకుదురు (పంచ వాయువులలో నొకటి)

**వ్యాపాదితము** - ద్రోహము తలపబడినది

**వ్యాయోగము** -ఇందు పెక్కండ్రు పురుషులు కూడుదురు (దశరూపకములలో ఒకటి)

వివరణ - ప్రసిద్ధ ఇతి వృత్తము గల ఏకాంకిక, ధీరోద్ధతనాయకమైనది హాస్య శృంగార శాంత రసములు లేక వీరము మున్నగు అఱు రసములు గలది స్త్రీ నిమిత్తము కాని యుద్ధము కలది

**వ్యాలము** - క్రూరమైనది (పాము, పులి)

**వ్యాళగ్రాహి** - పాములను బట్టుకొనువాడు (పాములవాడు)

**వ్యాసఘట్టము** - సంస్కృత భారతములో అతి కఠినముగా నుండు తావు

**వ్యాసపీఠము** - పురాణాదులుంచుకొని చదువుటకనువుగా నేర్పరుపబడినపీఠము

**వ్యుత్పత్తి** - శాస్త్రాదిజన్య పరిజ్ఞానము, అర్థమును బోధించు పదముల శక్తి

**వ్యుత్పన్నుడు** - శాస్త్రాదిజన్య పరిజ్ఞానము కలవాడు (పండితుడు)

**వ్యోమకేశి, వ్యోమకేశుడు** - ఆకాశమును నిండియున్న జడలు గలవాడు (శివుడు)

**వ్యోమధూమము** - ఆకాశమున పొగవలె నుండునది (మేఘము)

**వ్యోమయానము** - ఆకాశగమన సాధన మైనది (విమానము)

**వ్రాతసాకిరి** - వ్రాతమూలము నందు సంతకము చేసినవాడు, (సాక్షి) పత్త్రము వ్రాసి సంతకము (చేవ్రాలు) చేసినవాడు (వ్రాయసకాడు)

**వ్రాత్త్యుడు** - వర్ణానుగుణ సంస్కారములు జరుగనివాడు

**వ్రేకటివాడు** - ఉబికిన పొట్టగలవాడు (లంద - తుంది)

**వ్రేతలమేలువాడు** - గోపికలకు బ్రియు డైనవాడు (శ్రీకృష్ణుడు)

**వ్రేలుముడి, వ్రేల్మిడి** - చిటికిరింతకు పట్టుకాలము (త్రుటికాలము) నడిమి వ్రేలిని బొటన వ్రేలితో జేర్చి తీయునంత (బొటన, నడిమివ్రేళ్ళ మధ్య పట్టునంత విబూది, కుంకుమ మొ॥ చిటికెడని వాడుక)

**శంకరుడు** - శుభమును కలుగజేయువాడు (శివుడు)

**శంకుకర్ణము** - మొనలుదేరిన చెవులు కలది (గాడిద)

**శంఖదారి** -శంఖము తాల్చువాడు (విష్ణుడు)

**శంఖనఖము** - నఖములె వలె నుండు తక్కువ జాతి శంఖము (క్షుద్ర శంఖము - నత్తగుల్ల)

**శంఖపాణి** - శంఖమును చేత ధరించిన వాడు (విష్ణువు)

**శంబరారి** - శంబరాసురునకు శత్రువైనవాడు (మన్మధుడు)

**శంభళి** - శ్రేయంన్నును పాడు చేయునది (విటసంధానకర్త్రి - కుట్టని)

**శంభుడు** - సుఖ మీయన వలన ప్రాప్తించును (శివుడు)

**శకటము** - బరువుమోయుటకు సమర్థ మైనది ( బండి)

**శకట వ్యూహము** - యుద్ధ రంగము నందలి బండి వంటి మొగ్గరము

**శకటారి** - శకటాసుర భంజనుడు (కృష్ణుడు)

**శకటాస్యము** - బండికి ముఖమైనది (బండికాడి - నొగ)

**శకుంతము** - ఆకాశమున సంచరించు సామర్థ్యము కలది (శకుంతి - పక్షి)

**శక్తిపాణి** - శక్తి అను ఆయుధము చేత దాల్చినవాడు (కుమారస్వామి-శక్తిధరుడు)

**శక్రసారథి** - ఇంద్రుని సారధి (మాతలి)

**శక్రాణి** - ఇంద్రుని భార్య (శచీదేవి)

**శచీపతి** - శచీదేవి యొక్క మగడు (ఇంద్రుడు)

**శతకము** - నూఱు పద్యములు గల గ్రంధము, నూరు సంఖ్య గలది

**శతకోటి**- నూరంచులు గలది(వజ్రాయుధము)

**శతక్రతువు** - నూరు యాగములు చేసినవాడు (దేవేంద్రుడు)

**శతఘ్ని** - అనేకుల నేక కాలమున జంపునది (ఫిరంగి)

**శతద్రువు** - నూరుపాయలుగా బ్రవహించిన యొక నది

**శతపత్త్రము** - నూరు రేకులు గలది (తామరపువ్వు) నూరు ఈకలు గలది (నెమలి, రాచిల్క)

**శతపది** - నూరు కాళ్ళు కలది (జెఱ్ఱి, రోకలి బండ)

**శతమన్యుడు** - నూరు యజ్ఞములు చేసినవాడు (ఇంద్రుడు)

**శతరుద్రీయము** - యజుర్వేదమందలి రుద్రస్తవ రూపమైన గ్రంధభాగము (రుద్రాధ్యాయము)

**శతయష్టికము** - నూరు సరములు గల హారము (దేవచ్ఛందము)

**శతాంగము** - నూరు అవయవములు గలది (యుద్ధ రథము)

**శతారము** - నూరు అంచులు కలది (వజ్రాయుధము), నూరు కోట్లు

**శతాబ్దము** - నూరు సంవత్సరముల కాలము

**శతావధాని** - ఏకకాలమున నూరు అంశములను గమనింపగలవాడు

**శనైశ్చరుడు** - నెమ్మదిగా పోవువాడు (శని - మందుడు)

**శబరుడు** - వేటకై అడవిలో తిరుగువాడు

**శబ్దగుణము** - శబ్దము గుణముగా గలది (ఆకాశము)

**శబ్దగ్రహము** - శబ్దమును గ్రహించునది (చెవి)

**శబ్దబ్రహ్మ** - శబ్దరూపమయిన పరబ్రహ్మము

**శబ్దభేది** - ధ్వనిని బట్టి కొట్టునది (ఒక విధమైన బాణము)

**శబ్ద శాస్త్రము** - శబ్దముల లక్షణము తెలుపునది (వ్యాకరణము)

**శబ్దాధిష్ఠానము** - శబ్దమునకు అధిష్ఠాన మైనది (చెవి)

**శబ్దాలంకారము** - పదముల చేత కావ్యమునకు కలుగు శోభ (శబ్దము నాశ్రయించి యుండునది)

**శమనపురి** - యముని పట్టణము (నరకము)

**శమనస్వన** - యమునకు దోడ బుట్టినది (యమునానది)

**శమనుడు** - ప్రాణులను శమింపజేయు వాడు (యముడు)

**శయితుడు** - రేయింబవలు నిద్రించెడు స్వభావము కలవాడు (నిదురపోతు)

**శయునము, శయువు** - పడుకొని యుండునది (అజగరము-కొండచిలువ)

**శరజన్ముడు** - రెల్లునందు బుట్టినవాడు (కుమారస్వామి)

**శరజము** - అప్పుడే తీసినవెన్న కాచిన ఆవునెయ్యి (హైయంగవీనము)

**శరత్తు** - బురదను ఆర్చునది (ఒక ఋతువు)

**శరధి** - నీరు నిలిచి యుండునది (సముద్రము), బాణములుండునది (తూణీరము)

**శరభము** - సింహమును జంపెడి మృగము (మీగండ్లమెకము)

**శరభువు** - రెల్లున బుట్టినవాడు (కుమార స్వామి)

**శరవణోద్భవుడు** - శరజన్ముడు

**శరావతి** - రెల్లు విశేషముగా గలది, అధిక జలము కలది ( ఒకానొక నది)

**శరావము** - జలాదికమును కాపాడునది (మూకుడు)

**శరాసనము** - దీనినుండి బాణ ప్రయోగము చేయబడును (విల్లు -శరాసము)

**శరీరము** - రోగాదులచే శిథిలమగునది (మేను)

**శరీరి** - శరీరము కలవాడు (మైతాలువు)

**శర్మము** - అశుభమును జెరచునది (సుఖము)

**శర్వరి** - వ్యాపారమును గాని దినమును గాని పాడుచేయునది (రాత్రి - నిసి)

**శర్వాక్ష** - రుద్రాక్షము

**శర్వాణి** - శర్వుని భార్య (రుద్రాణి - పార్వతి)

**శర్వుడు** - ప్రళయమున భూతములను హింసించువాడు (శివుడు - ఈశుడు)

**శలభము** - అగ్నిని గూర్చి వేగముగా పోవునది (మిడుత)

**శల్యకాష్ఠము**- వాడిగానున్న కోల(బాణము)
**శల్య పంజరము** - ఎముకలగూడు
**శల్యసారథ్యము** - ఒక పక్షమున హితుడుగా కన్పించుచు ఎదిరి (పర) పక్షమునకు సాయము చేసిన శల్యుని వంచనను బోలువంచన(నయవంచన,హితవంచన)
**శవకామ్యము** - పీన్గులను కోరునది (నక్క, కుక్క)
**శశకము** - దాటుచు బోవునది (కుందేలు)
**శశధరుడు** - కుందేటిని ధరించినవాడు (చంద్రుడు)
**శశము** - దుముకుచు పోవునది (కుందేలు - శశకము)
**శశవిషాణము** - కుందేటి కొమ్మువలె లోకమున అసంభవము (వంధ్యాపుత్రుని వంటిది)
**శశాంకుడు** - శశము చిహ్నముగా గలవాడు (చంద్రుడు)
**శశాదనము** - కుందేళ్ళను దినునది (డేగ - శశాదము)
**శశి** - శశధరుడు (చంద్రుడు)
**శశిప్రభము** - చంద్రుని యొక్క కాంతి వంటి కాంతి గలది (ముత్తెము)
**శస్త్రకారుడు** -అయుధములను చేయువాడు
**శస్త్రాజీవుడు** - శస్త్రముచే జీవించువాడు
**శస్త్రి** - ఆయుధము ధరించినవాడు
**శాంకరి** - శంకరుని కుమారుడు (కుమారస్వామి, వినాయకుడు)
**శాంతనవుడు** - శంతనునకు గంగయందు బుట్టినవాడు (భీష్ముడు)
**శాకటము** - బండికి సంబంధించినది
**శాకపార్థివుడు** - తన పేర శకమును నెలకొల్పుకొనుటకు కుతూహలము జూపురాజు
**శాకుంతికుడు, శాకునికుడు** - పిట్టలను వేటాడువాడు (బోయవాడు)
**శాకులికుడు** - చేపలు పట్టువాడు(బెస్తవాడు)
**శాక్తము** - శక్తికి సంబంధించినది, శక్తిని పరదేవతను గా బోధించు మతము
**శాక్తేయుడు** - శక్తిని పరదైవముగా కొలుచు వాడు (శాక్తుడు)
**శాఖాచంక్రమణ (న్యాయ)ము** - కోతి ఒక కొమ్మ మీద నుండి మరియొక కొమ్మమీది కెగిరిన రీతి ఒక విషయము నుండి మరియొక విషయమును చెప్పబోవుట
**శాఖామృగము** - వృక్ష శాఖలందు సంచరించు మృగము (కోతి)
**శాఖారండుడు** - పారంపర్యముగా వచ్చుచున్న వేదశాఖను విడిచి అన్య శాఖను అధ్యయనము చేయువాడు (అన్య శాఖా పారకుడు)
**శాతకుంభము** - శతకుంభ పర్వతమున దొరకునది (బంగారము)
**శాతము** - దుఃఖమును బాపునది (సంతోషము)
**శాతోదరి** - సన్నని నడుము గల యాడుది
**శాఫరికుడు** - చేపలను బట్టువాడు (జాలరి శాకులికుడు)
**శాబ్దికుడు** - శబ్దశాస్త్రము తెలిసినవాడు
**శారద** - శ్వేత పద్మము (ఆననముగా) గలది (సరస్వతి)
**శార్‌ఙ్గము** - కొమ్ముతో చేయబడినది (కొమ్మువిల్లు)
**శార్‌ఙ్గి** - శార్ఙ్గమను విల్లుగలవాడు (విష్ణువు - బూరగొమ్ము తుపాసి)
**శార్దూలము** - హింసించునది (పులి)
**శాలూరము** - దాటుచు బోవునది (కప్ప)
**శాసనము** - దీనిచే శిక్షింపబడుదురు (ఆజ్ఞ)
**శాసన సభ** - చట్టములు చేయుటకు అధికారము గల ప్రజా ప్రతినిధుల సభ
**శింశుమారము** - శిశువులను జంపునది (మొసలి)

**శిక్ష** - వేదమునందలి ఉచ్చారణ పద్ధతిని దెల్పెడి ఒక విద్య

**శిఖండము** - శిఖగా రూపు దిద్దుకొన్నది (నెమలి పురి)

**శిఖండి** - పింఛము గలది (నెమలి, కోడి)

**శిఖరము** - శిఖవంటి కొనరాయి కలది

**శిఖాతరువు** - జ్వాలతో గూడిన చెట్టు వంటిది (దీపస్తంభము)

**శిఖాధరము** - శిఖ కలది (నెమలి - శిఖావలము)

**శిఖావంతుడు** - సిగరూపు గల కిరణములు గలవాడు (అగ్ని) జుట్టుముడి గలవాడు

**శిఖావలము** - సిగ గలది (నెమలి)

**శిఖి** - సిగలు గలది (బాణము, నెమలి, అగ్ని, కోడి)

**శిఖిధ్వజము** - అగ్నికి జెండా వంటిది (పొగ)

**శిఖివాహనుడు** - నెమలి వాహనముగా గలవాడు (కుమారస్వామి)

**శితికంఠము** - నల్లని కంఠము కలది (నెమలి - నీలకంఠము)

**శితికంఠుడు** - నల్లని కంఠము కలవాడు (శివుడు)

**శితిచ్ఛదము** - తెల్లని రెక్కలు కలది (హంస)

**శితివాససుడు** - నల్లని బట్ట దాల్చువాడు (బలరాముడు - కరివేల్పుప్రోడ)

**శిపివిష్టుడు** - బట్టతలగలవాడు (శివుడు, విష్ణువు)

**శిబిక** - సుఖమును కలిగించునది (పల్లకి, డోలీ)

**శిబిరము** - దండు విడిసిన చోటు (స్కంధావారము)

**శిరస్త్రాణము, శిరస్త్రము** - యుద్ధాదులందు తలను కాచునది (ఇనుపకుళ్ళాయి)

**శిరోజము** - శిరస్సునందు బుట్టునది (వెండ్రుక)

**శిరోధి** - శిరమును తాల్చునది (మెడ - శిరోధరము)

**శిరోరుహము** - శిరోజము (కేశము)

**శిరోనామము** - జాబుపైని వ్రాయుపేరు (చిరునామ - విలాసము)

**శిరోరుహము** - శిరోజము (కేశము)

**శిరఃఫలము** - శిరస్సువలె (కనులు, జుట్టు) నుండు ఫలము (కొబ్బరికాయ)

**శిలాక్షరము** - రాతిమీద జెక్కబడిన యక్షరము వలె నిలిచియుండునది

**శిలాజతువు** - రాతియందు బుట్టినది (శిలాజిత్తు)

**శిలావృత్తి** - పొలములందు రాలిన వెన్నుల నేరుకొని జీవించు వృత్తి

**శిలీముఖము** - వాడియైన ముఖమున కలది (బాణము)

**శివంకరుడు** - మంగళము కలిగించువాడు (శివుడు)

**శివఘర్మజుడు** - శివుని చెమట బొట్టునుండి పుట్టినవాడు (అంగారకుడు)

**శివతాతి** - మంగళము లొనర్చువాడు (శివంకరుడు)

**శివద్రుమము** - శివునికిష్టమైనది (మారేడు చెట్టు)

**శివము** - అశుభమును పోగొట్టునది, మేలు కూర్చునది (శుభము)

**శివరాత్రి** - మాఘబహుళ చతుర్దశి, శివ సంబంధమైన యుపవాస దినము

**శివవాహనము** - శివుని మోయునది (ఎద్దు)

**శివాప్రియము** - దుర్గాదేవికి ప్రియమైనది (దేవానాంప్రియము - మేక)

**శివారాతి** - నక్కకు శత్రువైనది (కుక్క)

**శివాలయము** - శివుడు నెలకొని యుండు చోటు (శివుని గుడి)

**శివాలువు** - శకునమైనపుడు మేలు చేయునది (నక్క)

**శివుడు** - సాధుల హృదయమున శయనించి యుండువాడు మంగళప్రదుడు (ఈశ్వరుడు)

**శిశిరము** - చలికారు (ఆరు ఋతువులలో నొకటి) చల్లనిది

**శిశుమారము** - శింశుమారము (మొసలి)

**శిశువు** - సం॥రములోపు వయస్సుగల బాలుడు లేక బాలిక

**శిశ్నము** - భగముతో కలియునది (మగగురి)

**శిశ్నోదరపరాయణుడు** - నాతిండి, నా పడక అని తన సుఖముల గురించి తలపోయు వాడు

**శీకరము** - శీతమును గలుగజేయునది, గాలిచే నిటునటు విసరబడిన నీటి తుంపర

**శీఘ్రచేతనము** - సులభముగా పసిగట్టునది (కుక్క)

**శీతకరుడు** - చల్లని కిరణములు కలవాడు (చంద్రుడు - శీతకిరణుడు)

**శీతంకారము** - అనాదరము సేయుట (శీతంకృతి)

**శీతకిరణుడు** - శీతకరుడు

**శీతకుడు** - చింతలేక సుఖముగ నుండు వాడు (సుఖ జీవనుడు) చురుకులేని వాడు (సోమరి)

**శీతగువు** - జాబిల్లివలె చల్లనిది (కర్పూరము)

**శీతనగము** - చల్లనికొండ (మంచుకొండ)

**శీతప్రభ** - మంచువంటి కాంతి కలది (కప్పురము - శీతాభము)

**శీతభానుడు, శీతభానువు** - చంద్రుడు (చలివెలుగు)

**శీతమయూఖము** - చల్లని కాంతికలది (కర్పూరము - శీతప్రభ)

**శీతమయూఖుడు** - చల్లని కిరణములు గలవాడు (చంద్రుడు)

**శీతమరీచి, శీతరశ్మి** - శీతమయూఖము (కర్పూరము - ఘనసారము) చల్లని కిరణములు గలవాడు (చంద్రుడు - శీతాంశువు)

**శీతాంశుడు** - శీతకరుడు (చంద్రుడు - చలి వెలుగు)

**శీతారువు, శీతాలువు** - చలిచే గడగడలాడువాడు

**శీర్షకము** - వ్యాసము మొదలైన వాని పై భాగమున నుంచదగిన మకుటము (శీర్షిక) తలకు చుట్టుకొను పాగ (తలపాగ)

**శీర్షత్రాణము** - తలను గాచునది (ఇనుపటోపి)

**శీర్షిక** - వ్రాయబడు నంశము యొక్క పైభాగము నందలి సంగ్రహ పదము

**శుండాల(ర)ము** -తొండముతో నుదకమును పీల్చునది (ఏనుగు)

**శుండిని** - ఏనుగు తొండము వంటి తొండము కలది దోమకాడ వంటి ముట్టె కలది (చుంచు)

**శుంభఘాతిని, శుంభమర్దని** - శుంభుని జంపిన దేవి (దుర్గాదేవి)

**శుకవాహుడు** - చిలుక వాహనముగా గలవాడు (మన్మథుడు)

**శుక్తి** - మెరయునది (ముత్తెపుచిప్ప)

**శుక్తిజము** - ముత్తెపు జిప్పలో బుట్టినది (ముత్యము)

**శుక్రము** - స్త్రీ సంగమముచే జారునది

**శుక్ర శిష్యుడు** - శుక్రాచార్యుని శిష్యుడు (రాక్షసుడు)

**శుక్ల పక్షము** - తెల్లని రెక్కలు గలది (కొంగ) శుద్ధ పక్షము

**శుక్ల మూలము** - తెల్లని వేరు కలది (వెల్లుల్లి లశునము)

**శుక్లవాయసము** -తెల్లని కాకివలె నుండునది (శుక్లపక్షము - కొంగ)

**శుద్ధ జంఘము** - తెల్లని పిక్కలు కలది (గాడిద - శంకుకర్ణము)

**శుద్ధాంతము** - రాజస్త్రీలుండు స్థలము (అంతఃపురము)

**శునకము** - ఇటునటు తిరుగునది (శునకము - కుక్క, ఆడుకుక్క-శుని)

**శునాసీరుడు** - వాయు సూర్యులు సహాయులుగాగలవాడు (ఇంద్రుడు)

**శుభదంతి** - చక్కని దంతములు గలది వాయవ్య దిశయందలి యాడేనుగు

**శుభసూత్రము** - మంగళసూత్రము

**శుభాంశుడు** -మేలైన కిరణములు కలవాడు (చంద్రుడు)

**శుభ్రాంశువు** - తెల్లని కిరణములు గలవాడు (చంద్రుడు - శుభ్రాంశుడు)

**శుభోదర్కము** - ముందు శుభము గలది

**శుల్బజము** - రాగినుండి కలిగినది (ఇత్తడి)

**శూకకీటము** - ముల్లుగల పురుగు (నల్ల తేలు, కణుదురు)

**శూన్యవాది** - దేవుడు లేడనెడివాడు (నాస్తికుడు, బుద్ధుడు)

**శూరంమన్యుడు** - తాను శూరుడనని తలంచువాడు

**శూర్పకర్ణము** - శూర్పశ్రుతి (ఏనుగు - చేట చెవుల మెకము)

**శూర్పణఖ** - చేటలవంటి నఖములు గలది (రావణుని చెల్లెలు - చేట గోళ్ళబోటి)

**శూర్పశ్రుతి** - చేటల వంటి చెవులు గలది (ఏనుగు - చేటచెవుల మెకము)

**శూలధరుడు** - శూలపాణి, శివుడు

**శూలపాణి** - త్రిశూలము హస్తమునందు గలవాడు (శివుడు)

**శూలాకృతము** - శూలికము

**శూలికము** - లోహపు కమ్మికి గ్రుచ్చి కాల్చినది (శూల్యము - కరుకుట్లు)

**శూలినము** - శూలమువంటి పండ్లు కలది

**శూలి** - శూలము ధరించినవాడు, శివుడు శూలరోగము గలవాడు

**శృంగబేరము** - శృంగము (కొమ్ము)లవంటి యాకారము గలది (అల్లము)

**శృంగాటకము** - నాలుగు మార్గములు కలిసినచోటు

**శృంగారయోని** - శృంగారరసమునకు కారణమైనవాడు (మన్మథుడు)

**శేఫము** - శుక్రము పడిన పిమ్మట శయనించునది (శిశ్నము - మగగురి)

శేముషి - భ్రమను వెడలించునది (తెలివి)

శేవము - శుక్రము పడిన పిమ్మట అణగునది (శిశ్నము)

**శేవలిని** - నాచు కలది (శైవలిని)

**శేవాలము** - వరున్న దానివలె అంతటను పరుచుకొనునది (నాచు)

**శేషశయనుడు** - ఆదిశేషుడు శయ్యగా గలవాడు (విష్ణువు)

**శేషశాయి** - ఆదిశేషునిపై శయనించువాడు

**శైలకన్య** - పర్వతరాజగు హిమవంతుని కొమార్తె (పార్వతి)

**శైలధన్వుడు** - గట్టువిలుకాడు (శివుడు)

**శైలధరుడు** - గోవర్ధన పర్వతమును ఎత్తినవాడు (శ్రీకృష్ణుడు)

**శైబికుడు** - శిబిక (డోలీ) మోయువాడు

**శైలాటము** - కొండలందు తిరుగునది (సింహము)

**శైవలిని** - నాచు గలది (నది)

**శోచిష్కేశుడు** - శోచిస్సు (కాంతి) కేశముగా గలవాడు (అగ్ని)

**శోణ పద్మము** - ఎఱ్ఱ దామర

**శోణ రత్నము** - ఎరువురంగు గల రత్నము (పద్మరాగము)

**శోణితము** - శోణ (ఎరుపు) వర్ణము కలది (నెత్తురు)

**శోణోపలము** - శోణ రత్నము (కెంపు)

**శోధ్యము** - శుద్ధి చేయదగినది, వెదక దగినది

**శౌక్తికేయము** - ముత్యపు జిప్పలో బుట్టినది (శుక్తిజము - ముత్యము)

**శౌచేయుడు** - బట్టలుతికి శుద్ధి చేయువాడు (రజకుడు - చాకలి)

**శౌద్ధోదని** - శుద్ధోదనుడను రాజు కొడుకు (బుద్ధుడు)

**శౌనికము** - ప్రాణిహింసకు నిలయమైనది (వేట)

**శౌరి** - శూరుని మనుమడు (కృష్ణుడు)

**శౌల్కికుడు** - పన్నులు వసూలు చేయు అధికారి (సుంకరి)

**శౌష్కలుడు** - ఎండిన మాంసము తినువాడు

**శ్మశానము** - శవములకు శయనమైనది (వల్లకాడు)

**శ్మశానవాసి** - వల్లకాటియందు వసించు వాడు (శివుడు)

**శ్మశ్రువు** - ముఖము నాశ్రయించునది (మీసము, గడ్డము)

**శ్యామ కంఠము** - నీలివన్నె మెడకలది (నీలకంఠము నెమలి)

**శ్యామకంఠుడు** - నల్లనయిన కంఠము కలవాడు (శివుడు)

**శ్యామలాంబ** - సోమాలమ్మ (చామాలమ్మ కాళికాదేవి)

**శ్యామాంగుడు** - నల్లని మేను గలవాడు (బుధుడు)

**శ్యాలకుడు** - భార్యకు దోడబుట్టినవాడు (బావమరది - కుంభీరుడు)

**శ్యాలిక** - భార్యకు దోడబుట్టినది (మరదలు)

**శ్యాలుడు** - శ్యాలకుడు

**శ్యేనము** - మిక్కిలి వేగముగా బోవునది (డేగ)

**శ్రద్ధాళువు** - వేవిళ్ళు గల యాడుది, శ్రద్ధ గల(ది)వాడు

**శ్రవణము, శ్రవము(స్సు)** - వినుటకు యోగ్యమైన సాధనము (చెవి - శ్రోత్రము)

**శ్రవిష్ఠాజుడు** - శ్రవిష్ఠాచంద్రులకు బుట్టిన వాడు (బుధుడు)

**శ్రవిష్ఠారమణుడు** - శ్రవిష్ఠయొక్క భర్త చంద్రుడు

**శ్రాద్ధ దేవుడు** - పితృకర్మలకు దేవుడు (యమ ధర్మరాజు - సమవర్తి)

**శ్రాద్ధము** - శ్రద్ధచే నీయబడునది

**శ్రావణము** - శ్రవణా నక్షత్రముతో గూడిన పున్నమ గల నెల (శ్రావణిక)

**శ్రావణి** - శ్రావణ మాసము నందలి పూర్ణిమ (శ్రావణ పౌర్ణమి)

**శ్రావటికుడు** - గొడుగుపట్టెడువాడు

**శ్రియంమన్యుడు** - తాను యోగ్యుడనని భావించువాడు (గర్వి)

**శ్రియఃపతి** - శ్రీదేవియొక్క భర్త (విష్ణువు)

**శ్రీ** - విష్ణువు నాశ్రయించునది (లక్ష్మి)

**శ్రీకంఠుడు** - హాలాహలమును మ్రింగుట వలన కంఠమున శోభ గలవాడు

**శ్రీకరుడు** - సంపదను గల్గజేయువాడు సంపత్కరుడు, శ్రీరాగము పాడెడువాడు

**శ్రీ కాంతుడు** - లక్ష్మీ దేవి మగడు (విష్ణువు)

**శ్రీకార్యము** - దేవాలయ ధర్మ కర్తృత్వము (గుడి పారుపత్తెము)

**శ్రీకాళహస్తి** - కృతయుగమున శ్రీయును త్రేతాయుగమున కాళమును ద్వాపరమున హస్తియును (సాలెపురుగు, సర్పము, ఏనుగు) ముక్తినొందిన స్థలము (ఒక శివక్షేత్రము)

**శ్రీగర్భుడు** - నాభియందు పద్మము కలవాడు (విష్ణువు)

**శ్రీజుడు** - లక్ష్మీదేవి కొడుకు (మన్మథుడు)

**శ్రీచక్రము** - త్రిపుర సుందరిని అర్చించుటకు చెక్కిన యంత్రము

**శ్రీదయితుడు** - శ్రీకాంతుడు (విష్ణువు)

**శ్రీదుడు** - ధనమునిచ్చువాడు (కుబేరుడు)

**శ్రీధరుడు** - లక్ష్మిని ధరించువాడు (విష్ణువు)

**శ్రీనివాసుడు** - లక్ష్మికి నివాసమైనవాడు (విష్ణువు)

**శ్రీపతి** - శ్రీకాంతుడు (లచ్చిమగడు-విష్ణువు)

**శ్రీపర్వతము** - శ్రీశైలము (శ్రీఘట్టము - సిరిగట్టు)

**శ్రీపుత్త్రుడు** - లక్ష్మీదేవి కొడుకు (మన్మథుడు)

**శ్రీమంతుడు** -ధనవంతుడు, అదృష్టవంతుడు

**శ్రీముఖము** - పీఠాధిపతులు గురువులు మొదలైన పూజ్యులు వ్రాసి పంపెడు పత్రిక

**శ్రీవత్సకము** - రొమ్మున తెల్లని సుడిగల గుఱ్ఱము (మేలు జాతి గుఱ్ఱము)

**శ్రీవత్సము** - శ్రీవిష్ణుని రొమ్ము నందలి పుట్టుమచ్చ

**శ్రీవత్సలాంఛనుడు, శ్రీవత్సుడు** - శ్రీవత్సమను చిహ్నము (సుడి) వక్షమున గలవాడు (విష్ణువు - శ్రీవత్సభృత్తు)

**శ్రీవాసము** - సౌభాగ్యప్రదయైన లక్ష్మికి ఆశ్రయమైనది (శ్రీరసము-దేవదారుబంక - ఒకానొక ధూపద్రవ్యము)

**శ్రీవిద్య** - ధర్మార్థకామరూపమైన త్రివర్గమును ప్రసాదించెడి విద్య త్రిపుర సుందరీ తంత్రము, మంత్రము

**శ్రీవృక్షకి** - మొగమునను రొమ్మునను శ్రీవృక్షమను సుడిగల గుఱ్ఱము

**శ్రీసూక్తము** - పదునైదు ఋక్కులు గల లక్ష్మీ ప్రశంసా స్తోత్రము

**శ్రుతకీర్తి** - శత్రుఘ్నుని భార్య, మిక్కిలి పేరు వడసినవాడు

**శ్రుతికారి** - తిత్తినూదువాడు

**శ్రేష్ఠుడు** - మేటియైనవాడు

**శ్రోత్రము** - శబ్దమును వినెడి ఇంద్రియము (చెవి)

**శ్రోత్రియుడు** - శ్రుతిని (వేదమును) జదివిన బ్రాహ్మణుడు

**శ్రౌతము** - వేదమునందు విధింపబడినది,

**శ్లేష్మణుడు** - శ్లేష్మరోగము కలవాడు (శ్లేష్మలుడు)

**శ్వపచుడు** - శ్వానమును పచనము చేసికొని తినువాడు

**శ్వసనాశనము** - శ్వసనము (గాలి) అశనముగా గలది (పాము)

**శ్వసనోత్సుకము** - వాయువునందు మక్కువ కలది (సర్పము)

**శ్వాసాలు** - పరుషములు (క,చ,ట,త,ప)

**శ్వానము** - శునకము

**శ్వాపదము**-క్రూరమైనది,క్రూరమృగము(పులి)

**శ్వాపుచ్ఛము** - కుక్కతోక,

**శ్వావిత్తు** - శ్వానమును (కుక్కను) బాధించునది (ముండ్లపంది)

**శ్వావిధము** - కుక్కలచే బాధింపబడునది (ఏదుపంది)

**శ్వేతకుంజరము** - వెల్లయేనుగు (సుర ద్విపము - ఐరావతము - శ్వేతద్విపము)

**శ్వేతగరుత్తు** - తెల్లని రెక్కలు కలది (హంస)

**శ్వేత ద్వీపము** - తెల్లదీవి (జంబూ ద్వీపము)

**శ్వేతపత్రము** - ప్రభుత్వ విధానములతో ప్రకటింపబడిన అధికారిక పత్రము

**శ్వేతము** - తెల్లని వన్నె గలది (వెండి)

**శ్వేతవాహను(హు)డు** - తెల్లని గుఱ్ఱములు వాహనముగా గలవాడు (అర్జునుడు)

**శ్వేతహయుడు** - తెల్లని గుఱ్ఱములు కలవాడు (అర్జునుడు, ఇంద్రుడు)

**శ్వేతాద్రి** - తెల్లనికొండ

**షండుడు** - మగతనము లేనివాడు (నపుంసకుడు - కొజ్జా)

**షట్కము** - ఆరింటి సముదాయము, ఆరింటితోకొనబడినది

**షట్కర్ముడు** - అధ్యయనాధ్యాపన యజన యాజన దానప్రతిగ్రహములనెడు షట్కర్మములు గల స్మార్త బ్రాహ్మణుడు, ఆకర్షణ, స్తంభన,మారణ, విద్వేషణ, మోహానోచ్చాటనాది మాయాప్రయోగకర్మ (షడ్విద్యలు) లెరింగిన తాంత్రికుడు

**షట్పదము** - ఆరుపాదములు గలది (తుమ్మెద - షట్పది - ఆడుతుమ్మెద)

**షట్పదార్థములు** - ద్రవ్య, గుణ, కర్మ, సామాన్య, విశేష సమవాయము లను 6 పదార్థములు

**షట్ప్రత్యయములు** - వృత్తసంఖ్య, ప్రస్తారము, నష్టలబ్ధి, ఉద్దిష్టము, గురు లఘుక్రియ అధ్వ విభాగము అను ఛంధః శాస్త్రము నందలి షడ్విధ ప్రత్యయములు

**షడంగములు** - శిక్ష (పాణినికర్త) వ్యాకరణము (పాణిని) నిరుక్తము (యాస్కముని) ఛందస్సు (పింగలముని) జ్యోతిషము (ఆదిత్యాదులు) కల్పము (ఆశ్వలాయన, కాత్యాయన మొ॥కర్తలు) అను వేదార్థ జ్ఞాన ప్రయోజకములగు నారింటి సముదాయము

**షడభిజ్ఞుడు** - దివ్యదృష్టి, దూరశ్రవణము, పరేంగితజ్ఞానము, పూర్వజన్మస్మృతి, ఆకాశగమనము, అప్రత్యక్ష విషయ జ్ఞానమను నీయారింటి యెరుకలు కలవాడు

**షడాననుడు** - ఆరుమొగముల సామి (కుమారస్వామి)

**షడూర్మి** - బుభుక్ష, తృష్ణ, శోకము, మోహము, జర, మరణము అను వ్యాపారములు కలవాడు ( జీవుడు)

**షడ్జము** - నాసిక, కంఠము, ఉరస్సు, జిహ్వ, తాలువు దంతములు అను నీ ఆఱుస్థలములందును బుట్టు స్వర విశేషము

**షడ్దర్శనములు** - న్యాయము, వైశేషికము, సాంఖ్యము, యోగము, మీమాంస వేదాంతము అను 6 శాస్త్రముల సముదాయము ( తత్త్వశాస్త్రములు - ఈశ్వరుని దర్శింపచేయునవి

**షడ్రసములు** - తీపి, ఉప్పు, పులుపు, కారము, చేదు ఒగరు అను ఆఱు రుచుల సము దాయము

**షణ్ముఖుడు** - ఆరు మొగములు సామి (కుమారస్వామి)

**షడ్భాగము** - పండిన ధాన్యములో రైతు (తన ఆదాయములో ఉద్యోగి) రాజునకు (ప్రభుత్వమునకు) చెల్లించు ఆరవ భాగము (శిస్తు, పన్ను)

**షష్ఠాష్టమము** - షష్ఠాష్టకము (నరివడమి - విరోధము-జ్యోతిషశాస్త్ర సంబంధమైనది)

**షష్టిపూర్తి** - అరువది సంవత్సరములు నిండిన వెనుక చేయు వేడుక

**షాడవము** - స,రి,గ,మ,ప,ద,ని అనెడు ఆరు స్వరములు వాడిన రాగము

షడ్జము, ఋషభము, గాంధారము, మధ్యమము, పంచమము, ధైవతము లోనగు ఆఱు స్వరములు కలది, 5 స్వరములు వాడినది ఔడవము, సప్తస్వరములు వాడినది సంపూర్ణము

**షాడవికుడు** - తీపి వస్తువులు చేసి విక్రయించువాడు

**షాణ్మాసికము** - ఆరవనెలయందు పెట్టెడి పితృశ్రాద్ధము, ఆరు నెలల కొక తడవ కట్టదగినది

**షోడశము** - మృతులకు పదునొకండవ దినమున చేయునది, పదునారవది

**షోడశాంఘ్రి** - పదునారు కాళ్ళుగలది (ఎండ్రకాయ - పీత)

**షోడశావర్తము** - పదునారు సుడులు కలది (వలమురి, శంఖము)

**షోడశోపచారములు** - భగవంతుని పూజలో చేయు ఆవాహనాది పదునారు తంతులు (ఆవాహనము, ఆసనము, పాద్యము, అర్ఘ్యము, ఆచమనీయము, స్నానము వస్త్రము, యజ్ఞోపవీతము, గంధము, పుష్పము, ధూపము, దీపము, నైవేద్యము, తాంబూల నమస్కార ప్రదక్షిణములు)

**సంకర్షణుడు** - శత్రువులను ఒరని నశింప జేయువాడు, ప్రళయమున అందరను సంహరించు వాడు (బలరాముడు)

**సంకలనము** - సంఖ్యలను కలుపుట

**సంకల్పజన్ముడు, సంకల్పజుడు** - సంకల్పమున బుట్టువాడు (మన్మథుడు - సంకల్పభవుడు)

**సంకల్పయోని** - మనోభవుడు (మన్మథుడు - డెందపు చూలి)

**సంకసుకుడు** -దేనిలోను నిలుకడ లేనివాడు (అస్థిరుడు)

**సంకుదారి** - వలమురి తాలుపు (విష్ణువు)

**సంకుమదము** - ఒకజాతి పిల్లి వలన గలిగెడు పరిమళద్రవ్యము (జవ్వాజి)

**సంకులవాడు** - శంఖము ఊదువాడు (శాంఖికుడు)

**సంకుసుకుడు** - సంకసుకుడు

**సంక్రందనుడు** - శత్రువును ఆక్రందనము పెట్టించువాడు (ఇంద్రుడు - బిడౌజుడు)

**సంక్రమణము** - సూర్యుడు ఒకరాశి నుండి మరియొక రాశికి చేరుట, ఒకని యాస్తి మొదలగునవి మరియొకనికి జేరుట (సంక్రమము)

**సంక్రాంతి** - సూర్యుడు మకర రాశిలో ప్రవేశించుట (మకర సంక్రమణము)

**సంక్షిప్తము** - వీరులు దీనియందు లెస్సగా గొనియాడబడుదురు (యుద్ధము)

**సంగమడుగు** - గ్రామమునకు సమీపమున నుండు మడుగు

**సంగ్రాహకము** - పట్టుకొనునది

**సంఘాత మరణము** - జనులు గుంపులు గుంపులుగా మరణించుట

**సంచకరము** - క్రయము స్థిరపరచుకొనుటకై ముందుగా నిచ్చెడు ధనము (బయానా - అచ్చుకారము)

**సంచకారము** - గృహవాహనాదికముల క్రయ విక్రయాదులందు బేరము యొక్క స్థిరత్వమునకై యిచ్చెడు సొమ్ము (సంచ కరువు - బయానా)

**సంచయనము** - శవదహనమైన మరునాడు మృతుని యెముకలు ప్రోగుచేయుట, ప్రోగు చేయుట

**సంచాలకుడు** - కార్యము నిర్వహించువాడు, సంస్థను నడపువాడు

**సంచితము** - అనారబ్ధమైన కర్మము. కూడ బెట్టబడినది

**సంజీవకరణి** - జీవింపజేసెడు ఒకానొక ఓషధి

**సంతానకము** - దేవతరువులలో ఒకటి

**సందికడియము** - సందిలి = దండచేయి - దండ కడియము

**సందేహము** - ఒక వస్తువును జూచి సామ్యమును బట్టి రెండు మూడు వస్తువులలో నేదగునోయను సందేహము కల్గుట (ఒకానొక అర్థాలంకారము), సందియము

**సంధానకరణి** విరిగిన యెముకలు మున్నగువానిని గలిపెడు ఓషధి

**సంధాయకుడు** - సంఘటన పరచువాడు (సంధాత - కూర్పరి)

**సంధిత్సువు** - సంధి చేసికొనగోరువాడు

**సంధ్య** - అహోరాత్రములచే సంధింపబడిన కాలము (సంజ)

**సంధ్యావందనము** - పూర్వ మధ్యా పరాహ్ణములను మూడు సంధ్యల యందును జేయు దైవ ప్రార్థనము

**సంపంగి పూవడ్లు** - ఒకజాతివడ్లు

(కొన్ని వడ్లజాతులు - బంగారు తీగలు, గంగా జలములు, కస్తూరినిగరాలు, కటక సరులు ఇప్పపూరాజనాలు, ఏనుగు కొమ్ములు, మల్లెశ్రీగంధులు మదన గంధులు, ఏలిక రాజనాలు, రావిపూరా జనాలు ఈశ్వరప్రియములు, కుసుమ పూరాజనాలు, కస్తూరి పట్టెలు, గంధ సరులు, నాగ మల్లెలు, తీగ మల్లెలు, కృష్ణ నీలాలు, వెలువడాలు, మన్మథబాణాలు, పునుగు రాజనాలు, సన్న సూదులు, కేసర్లు, రాయసర్లు, చంద్రవంకలు, జీని సరులు, వంగాకు బుడములు, రామబాణాలు, వెన్నముద్దలు, కామదార్లు, శ్రీరంగాలు, కాకిరెక్కలు, సీతా భోగ సరులు, ప్రయాగలు, లక్ష్మీ మనోహరాలు, భారతీసేసలు, బాహు పురులు, జవ్వాది వంకెలు, గవ్వ సరులు గంబూర రాజనాలు సంపంగి పూవడ్లు, చెన్నంగులు)

**సంపరాయికము** - ఇందు వీరులొకరితో నొకరు కదియుదురు (యుద్ధము)

**సంపాటము** - చెక్కడపు పనియందు ఒమ్మచ్చును అందు కూర్చెడు మణులను, లక్కయు జేర్చితూచెడు తూనిక

**సంపుటీకరణము** - ముడుచు కొనునట్లు చేయుట

**సంప్రయోగము** - మూలికలతో జేసెడి భూతోచ్చాటనాది క్రియ

**సంప్రసారణము** - ఇ, ఉ, ఋ, వర్ణములు య,వ,ర,ల వర్ణములకు మారుగా వచ్చుట

**సంప్రేషణము** - పండ్రెండవ నాటి శ్రాద్ధ కర్మము (ద్వాదశాహ శ్రాద్ధము)

**సంప్రోక్షణము** - పరిశుద్ధికై యుదకాదులను జిలుకరించుట, దైవాదులను ప్రతిష్ఠించుట

**సంబంధ వర్జితము** - పూర్వోత్తర వాక్యముల సంబంధము చెడుట (వాక్యగత దోషము)

**సంయమము** - హింసాదుల వలన విరమించుట, వ్రతాదుల కంగమై తొలి దినమున నడుపదగిన దీక్షాదికము, ఇంద్రియముల అదుపు

**సంరక్షకుడు** - కాపాడువాడు (త్రాత), పోషకుడు

**సంలాపము** - అన్యోన్య సంభాషణము

**సంవత్సరము** - ఋతువులు దీనియం దిమిడి యుండును

**సంవత్సరీకము** - చచ్చినవారిని గూర్చి వత్సరాంతమున జేయు శ్రాద్ధ కర్మము (ఏడుడి - సాంవత్సరికము)

**సంవర్తకి, సంవర్తకుడు** - సంవర్తకమను నాగేలు కలవాడు (బలరాముడు)

**సంవర్తము** - దీనియందు జగము లయ మగును (కల్పాంతము), కుంభవృష్టి గురియు మేఘము

**సంవసథము** - జనులు నివసించు ప్రదేశము (ఊరు)

**సంవాహకుడు, సంవాహుడు** - ఒడలు పిసుకువాడు (అంగమర్దుడు)

**సంవిదల్లుడు** - అంతఃపురము కావలి కాయువాడు

**సంవీతము** - కంఠమున హారమువలె వేసికొన్న జందెము,

**సంవేశము** - ఇంద్రియములు దీనియందు లీనమగును (నిద్ర)

**సంశప్తకుడు** - తిరిగిపోనని యొట్టు పెట్టుకొని పోరువాడు (శూరుడు)

**సంశ్రుతము** - అంగీకరింపబడినది, చక్కగా విన్నది

**సంసక్తుడు** - విషయ భోగములందాసక్తి గలవాడు

**సంస్కృతము** - వ్యాకరణాది శాస్త్రములచే సంస్కరింపబడిన దేవభాష (వేలుపు బాస)

**సంస్తంభనము** - శత్రువును కదలకుండ కట్టివేయు మంత్రశక్తి

**సంస్ఫోటము** - ఇందు వీరుల శరములు వ్రక్కలగును (యుద్ధము)

**సంహితము** - చేర్చ బడినది, సంధింప బడినది

**సకర్మకము** - కర్మముతో కూడిన క్రియను బోధించునది (ధాతువు)

**సకినంపు బక్కి, సికినంపు బులుగు** - దీని పలుకు శకునముగా భావింపబడును (శకున పక్షి పైడికంటి, కనకాక్షి)

**సకినెలమంచము** - ఎక్కినపుడు కీచుకీచుమని చవ్వడు చేసెడు మంచము (సకినలమంచము)

**సకృత్ప్రజము** - ఒకసారి మాత్రమే పిల్లను కనునది (వాయసము - కాకి)

**సకృత్ప్రసూత** - ఒక కానుపు కన్న ఆడుది

**సకృత్ఫల** - ఒక్కసారి మాత్రమే (గెలవేయు) ఫలించునది (అరటి)

**సఖ** - లక్షణాదులచే సమానమైన ఖ్యాతి కలది (చెలికత్తె - స్నేహితురాలు)

**సగరుడు** - విషముతో కూడినవాడు (ఒకానొక చక్రవర్తి)

**సగోత్రుడు** - సమాన గోత్రమునకు చెందు వాడు (పాలెవాడు, జ్ఞాతి, దాయాదుడు)

**సజగ్ధి** - పలువురు కూడి భుజించుట (బంతి కుడుపు - సగ్ధి)

**సతనాలు కలదునీడు** - ఏడు జిహ్వాలు గల మేటి (అగ్ని - సతనాల్కల మనీడు)

**సతనాల్కల జేజే** - ఏడు నాల్కలు గల దేవుడు (అగ్ని - సతనాల్కల పాదుసా)

**సతహుమాదణి** - ఏడు గుఱ్ఱాలు గల దొర (సూర్యుడు - సప్తాశ్వుడు)

**సతీర్థ్యుడు** - కూడ చదువువాడు (సతీర్థుడు - సహపాఠి)

**సత్తితాలుపు** - శక్తిధరుడు (కుమారస్వామి)

**సత్తిరా** - సత్తి = పార్వతి, రా = భర్తయైన వాడు (శివుడు)

**సత్తిరావగరు** - శివునకు శత్రువైనవాడు (మన్మధుడు)

**సత్యంకారము** - క్రయ విక్రయములను గట్టిపర్చుకొనుటకు ముందుగా ఇచ్చెడి సొమ్ము (బజానా - అచ్చంకారము)

**సత్యంకాముడు** - సత్యము పలుకవలెనను నియమము కలవాడు

**సత్యము** - సజ్జనుల యందు బుట్టునది (నిజము)

**సత్రయాగము** - 13 మొదలు వంద దినముల వరకు జేసెడి యజ్ఞము

**సత్రశాల** - ఉచితముగా భోజనము పెట్టు గృహము (ధర్మశాల)

**సత్రి** - అనవరతము దానము చేయు చుండెడి స్వభావము కలవాడు (ఈవికాడు - వదాన్యుడు)

**సత్త్వసంపన్నము** - మంచితనముతో కూడినది, సత్తువ కలది

**సదంశకము** - డెక్కలు కలది (పీత - సదంశము)

**సదంశవదనము** - పట్టకారు వంటి ముక్కు గలది (కంకపక్షి - రాపుల్గు)

**సదనము** - ఇందు జనులుందురు (ఇల్లు)

**సదస్యము** - పెండ్లి మూడవ నాటి బ్రాహ్మణుల మహదాశీర్వాదపు సభ

**సదస్యుడు** - సభ యందుండెడి ధర్మజ్ఞుడు (సభాస్తారుడు)

**సదాగతి** -సర్వకాలము లందును గమనము గలవాడు (వాయువు)

**సదాతనుడు** - ఎల్లప్పుడు ఉండువాడు (శాశ్వతుడు - విష్ణువు)

**సదాతోయ** - కరతోయ అనునది, ఎప్పుడును ప్రవహించునది (సదానీర)

**సదాఫలము** - సర్వకాలములందును ఫలించునది(బిల్వము, మారేడు, కొబ్బరి)

**సదాశివుడు** - ఎల్లపుడు మంగళము కలుగ జేయువాడు (శివుడు)

**సద్మము** - ఇందు ప్రవేశింతురు (ఇల్లు - సదనము) ప్రవహించునది (నీరు)

**సద్యస్కాలీనము** - అప్పటికప్పుడైనది, జరుగుచున్న కాలమునకు సంబంధించినది (నేటిది - వర్తమాన కాలికము)

**సద్యోజాతము** - శివుని పంచముఖములలో ఒకటి, అప్పుడే పుట్టినది (దూడ)

**సధర్మిణి** - ధర్మ కార్యములయందు దోడుగా నుండునది (సహధర్మచారిణి - సధర్మచారిణి)

**సనాతనుడు** - పురాణ పురుషుడు (భగవంతుడు)

**సనాథ** - మగడు గల యాడుది (ముత్తైదువ)

**సన్నాయ్యము** - అగ్ని హో(త్రములో వేల్చుటకై యిగురబెట్టిన యన్నము, దధిపయో రూపమైన హవిస్సు (హవిస్సు - సాన్నాయ్యము)

**సన్నాహ్యము** - యుద్ధమునకు తగిన ఏనుగు

**సన్న్యాసము** - కామ్య కర్మల విడుపు, ఒకానొక ఆశ్రమము

**సపక్షము** - అనుమానమునకు విషయము కలది (నిశ్చిత సాధ్యవంతము), రెక్కలు కలది

**సపత్నుడు** - సవత్ని (సవతి) వలె దుఃఖ హేతువైనవాడు, సమాన పతిత్వము కలవాడు (పగవాడు)

**సపిండీకరణము** - మరణించిన పండ్రెండవ దినమున జేయు సంవత్సరాంత శ్రాద్ధము

**సపిండుడు** - ఏడు తరముల లోపలి దాయాదులు

**సప్తకి** - మొలయందు కట్టబడిన ఏడు పేటలు కలది (7 పేటల మొలనూలు - సప్తతంతువు)

**సప్త గుప్తుడు** - తన రథమునకు ఏడు గుఱ్ఱములు కల్గినవాడు (సూర్యుడు)

**సప్తజిహ్వుడు** - సతనాల్కల జేజే (అగ్ని)

**సప్తతంతువు** - ఏడు ఛందస్సులచే విస్తరింప బడినది (యజ్ఞము)

**సప్తదీధితి** - సతనాల్కల జేజే

**సప్తద్వీప** - జంబూ, ప్లక్ష, శాల్కల, కుశ, క్రౌంచ, శాక, పుష్కరములను ఏడు దీవులు కలది (పృధ్వి)

**సప్తభూమికము** - ఏడు అంతస్తులు కలది (సప్త భౌమము - 7 అంతస్తుల మేడ)

**సప్తసప్తి** - ఏడు గుఱ్ఱములు గలవాడు (సూర్యుడు - సప్తాశ్వుడు)

**సప్తార్చి** - సప్త జిహ్వుడు (అగ్ని)

**సప్తాశ్వుడు** - ఏడు గుఱ్ఱాల జేజె (ఏడు గుఱ్ఱాల రౌతు - సూర్యుడు)

**సప్తాహము** - ఏడు అహోరాత్రములు దీక్షతో దేవుని భజించుట

**సప్పపుజుక్క** - సర్పాకారము గల నక్షత్రము (ఆశ్లేషా నక్షత్రము)

**సబ్రహ్మచారి** - తనతో సమానముగా వేదాధ్య యనము చేయు విద్యార్థి (సహపాఠి)

**సభాజనము** - బంధువులను, మిత్రులను ఆలింగనాదులచే సంతోష పెట్టుట, యాత్రాదులయందు బంధు మిత్రుల యనుజ్ఞవడయుట

**సభాపతి** - సభాధ్యక్షుడు (కొలువుపెద్ద)

**సభికుడు** - సభయందలి ధర్మజ్ఞుడు, జూదమాడుటకు అనువైన సభ కలవాడు

**సమంతభద్రుడు** - సంపూర్ణమైన శుభము కలవాడు (బుద్ధుడు)

**సమంత భుక్కు** - అన్నిటిని తినునది (అగ్ని - సర్వభక్షకుడు)

**సమకక్ష** - ఇరువైపులను సమముగా నుండునది (తూనిక)

**సమజ్ఞ** - అందరచే తెలియబడునది (కీర్తి)

**సమజ్య** - అందరును కూడునది (కొలువు)

**సమదర్శి** - సమస్త భూతములను సమ ముగా జూచువాడు(సమవర్తి-యముడు)

**సమధ్వము** - పదుగురితో చేసెడు ప్రయాణము

**సమధ్వుడు** - తనతోపాటు ప్రయాణము చేయుచున్నవాడు (తోడి బాటసారి)

**సమపదము** - విలుకాడు రెండు కాళ్ళు సమానముగా నుంచి నిలుచుట

**సమరథుడు** - ఒక విలుకానితో సమముగా నిల్చి పోరగల్గు వీరుడు

**సమరము** - మరణముతో గూడినది (యుద్ధము)

**సమర్థము** - అన్వయ యోగ్యమైన అర్థము గలది

**సమవర్తి** - అందరియందును సమముగా వర్తించువాడు (యముడు)

**సమవాయము** - అవయవమునకు అవయవికిని, గుణమునకు గుణికిని జాతికి, వ్యక్తికిని, విశేషములకు నిత్య ద్రవ్యములకును గల నిత్య సంబంధము

**సమవాయి కారణము** - విడదీయరాని హేతువు (దేనినుండి వేరు చేయవీలు కాని సంబంధము గల కార్యము పుట్టునో అది సమవాయి కారణము - సమవాయి అసమవాయి, నిమిత్తములని కారణములు మూడు విధములు పటమునకు తురీవేమాది (పలక, నాడె) కము నిమిత్తకారణమగును)

**సమవేతము** - విడదీయరాని విధముగా (లీనమైనది) కలిసినది కూడిన సంబంధము కలది

**సమస్య** - పూరించుటకై యిచ్చెడు పద్య పాదము ("వ్రాసెను పోతన భారతంబు వ్రాసెను పో, తన భారతంబు")

**సమాంసమీన** - ఏటేట నీనెడు ఆవు (సమీనిక)

**సమాధి** - ఒక దాని గుణములు వేరొకదాని యందారోపించుట (కావ్య గుణములలో ఒకటి),ఒక కారణముచే కార్యారంభమగు చున్నను మరొక కారణము వలన నా కార్యమునకు సౌలభ్య మేర్పడినట్లు చెప్పుట (ఒక అర్థాలంకారము), ధ్యేయ వస్తువు నందు మనస్సు లయ మగుట, శవమును పూడ్చి పైని కట్టెడు కట్టడము (గోరీ) ధాన్యాదుల సంగ్రహణము

**సమానోదర్యుడు** - ఒక తల్లి కడుపున బుట్టినవాడు (తోబుట్టువు)

**సమాప్త పునరాత్తము** - ముగించియు మరల గూర్చిన పదములు గల వాక్యము (ఒకానొక వాక్య దోషము)

**సమావర్తనము** - వేదాధ్యయనానంతరము శిష్యుడు వివాహాదుల నిమిత్తము గురుననుజ్ఞ బడయుట

**సమాసకము** - అచ్చ తెలుగు పదములతో ఏర్పడిన సమాసము

**సమాసము** - సమర్థంబులగు పదంబు లేక పదంబగుట

**సమాసాంతము** - సమస్త పదములపై అజాది విశేషావయవము

**సమాసోక్తి**- ప్రస్తుతమును వర్ణించుచుండగా నప్రస్తుతము తోచెడు నర్థాలంకారము

**సమాహ్వాయము** - ఇందు పంతము అరుపులు కలుగును (కలహము, ప్రాణి ద్యూతము)

**సమిధ** - దీనిచే అగ్ని జ్వలించును (చిదుగు, వంట చెరకు)

**సమీకము** - ఇందు ఒండొరులు కదియుదురు (యుద్ధము)

**సమీరణము** - తుల్య రూపతాపాదనము

**సమీక్ష్యకారి** - బాగుగా నాలోచించి పని చేయువాడు

**సమీకరణము** - చలించునది (గాలి - సమీరము)

**సమీరణుడు, సమీరుడు** - లెస్సగా సంచరించువాడు (వాయువు)

**సముచ్చయము** - ప్రోగుచేయుట, రెండు పదములను గాని వాక్యములను గాని కలిపెడు వ్యాకరణ సంకేతము (యు,ను మొ॥)

**సముద్దారు - సముతుక్ష** తాలూకాలోని ఒక భాగము దానికి అధికారి

**సముద్రగ** - సముద్రమును గలియునది (నది)

**సముద్రము** - అంతట సంతోషము నిచ్చునది, ఈశ్వరాజ్ఞతో కూడుకొని యుండునది, జలజంతు విశేషము లిందు చక్కగా కూడియున్నవి, చంద్రోదయము వలన వృద్ధి పొందునది (కడలి)

**సముద్రమేఖల** - సముద్రము మొల త్రాడుగా గలది (నేల)

**సముద్రయాయి** - సముద్రముపై పోవువాడు

**సమున్నద్ధుడు** - తాను గొప్ప విద్వాంసుడనని భావించువాడు (పండితమ్మన్యుడు)

**సమూరువు** - దీనితొడలు కలిసి యుండును (చమూరువు, ఇఱ్ఱి)

**సమ్మార్జని** - తుడుచుటకు యోగ్యమైన ఉపకరణము (చీపురు కట్ట - శోధని)

**సమ్మోహకము** - సొమ్మసిలచేయునది

**సరజము** - మీగడనుండి వచ్చునది (వెన్న)

**సమ్రాట్టు** - దిగ్విజయము చేసి రాజసూయ యాగము చేసినవాడు (చక్రవర్తి)

**సరటము** - కదలుచుండునది (తొండ - సరటువు)

**సరససితోపమాధర**-రసవంతమగు చక్కెరను బోలిన యధరోష్ఠము గలది (చక్కనిది)

**ససిజనాభుడు** - పద్మనాభుడు (విష్ణువు)

**సరసిజనేత్రుడు** - కమలనయనుడు (విష్ణువు)

**సరసిజభవుడు** - విష్ణువు నాభి కమలమందు బుట్టినవాడు (బ్రహ్మ)

**సరసిజము** - చెరువునందు బుట్టినది (పద్మము)

**సరసీజము, సరసీరుహము** - సరసిజము

**సరస్వంతము** - నీరు కలది (సముద్రము) రసము కలది (ఫలము)

**సరళములు** - మృదూచ్చారణగల గ,జ,డ, ద, బలు

**సరిత్పతి** - నదులకు ప్రభువు (సముద్రుడు)

**సరీసృపము** - వక్రముగా బ్రాకునది (సర్పము - దందశూకము)

**సరోజిని** - తామరలు గలది (తామర కొలను)

**సరోరుహము** - కొలను పుట్టువు (కమలము)

**సర్జరసము** - సర్జవృక్షము యొక్క బంక (సజ్జరసము - యక్ష ధూపము)

**సర్పగంధ, సర్పగంధిక** - పాము విషమును పోగొట్టునది (నాగదమని - ఈశ్వరి వేరు)

**సర్పగ్రాహకుడు** - పాములు పట్టువాడు (పాములవాడు - అహితుండికుడు)

**సర్పతృణము** - దీనికి (పాము) సర్పము తృణము వంటిది (ముంగిస)

**సర్పనకులిక** - పామునకు ముంగికి గల సహజ వైరము

**సర్పభక్షకము** - పాములను తినునది (నెమలి)

**సర్పభుక్కు** - పామును తినునది (గద్ద, నెమలి)

**సర్పరాజు** - పాపరేడు

**సర్పాశనము** - సర్ప భక్షకము

**సర్వంసహ** - అంతను సహించునది (భూమి)

**సర్వజ్ఞుడు** - సమస్తము తెలిసినవాడు (శివుడు)

**సర్వ తాపనుడు** - అందరను దపింపజేయు వాడు (మన్మధుడు)

**సర్వతోభద్రము** - నలుప్రక్కల వాకిండ్లు

గల్గియుండుటచే అంతటను శుభము గల రాజగృహము

**సర్వతోముఖము** - అన్ని వైపులకును ముఖము గలది

**సర్వతోముఖుడు** - అన్ని రంగముల యందు ప్రజ్ఞ కలవాడు

**సర్వదమనుడు** - అన్నిటిని అణచువాడు

**సర్వధురావహము, సర్వధురీణము** - అన్ని బరువులను మోయు ఎద్దు

**సర్వనామము** - అన్నింటికిని వాచకముగా వాడబడునది

**సర్వభక్షకుడు** - సమస్తమును తినువాడు (అగ్ని)

**సర్వమంగళ** - సమస్తమైన శుభములు కలది (పార్వతి)

**సర్వరసము** - నిండైన పరిమళము కలది (సర్జరసము)

**సర్వవేదుడు** - తనయావదాస్తిని విశ్వ జిద్యాగమున దక్షిణగా నిచ్చినవాడు (ఈ యాగమున సొమ్మంతయు దక్షిణల కుపయోగింపవలెను)

**సర్షపము** - (గాటుచే) దేహమంతటను వ్యాపించునది (ఆవాలు - తీక్ష్ణగంధము)

**సలిలకుంతము** - నీటికి కురుల వంటిది (నాచు)

**సలిలజము** - జలజము (తామర)

**సలిలధరము** - నీటిని దాల్చునది (మబ్బు)

**సలిలము** - ప్రవహించునది (నీరు)

**సవరపు మెకము** - జల్లితోకమెకము (చమర మృగము)

**సవిత** - నిద్రించిన వారిని బ్రేరేపించువాడు (సూర్యుడు) కన్నవాడు (తండ్రి)

**సవిత్రి** - కనునది (తల్లి)

**సవ్యసాచి** - ఎడమ చేతితో బాణము సంధింప నేర్పుగలవాడు (అర్జునుడు)

ఏ పనినైనను మిక్కిలి నేర్పుగ చేయ గలవాడు (వ్యవహార దక్షుడు)

**సహగమనము** - భర్త శవముతో భార్యయు చితిలో పడి మరణించుట

(వెంట బోవుట - సాగుమానము)

**సహచరచ్యుతము** - పొసగని (జతపడని) వాటిని పొసగునట్లు (సరిపడునట్లు) చెప్పెడి యర్థము (ఒకానొక అర్థ దోషము)

**సహజ** - తోడబుట్టినది (సోదరి)

**సహజము** - కూడబుట్టినది, ప్రకృతి సిద్ధ మైనది,

**సహస్రకరుడు** - వేయి చేతులు కలవాడు (సహస్ర కిరణుడు - సూర్యుడు)

**సహస్రదంష్ట్రము** - వేయి కోరలు గల చేప (పాఠీనము)

**సహస్రపత్రము** - వేయి రేకులు గలది (తామర పువ్వు)

**సహస్ర బాహువు** - వేయి చేతులు గలవాడు (కార్తవీర్యార్జునుడు)

**సహస్రాంశుడు** - వేయి కిరణములు కలవాడు (సూర్యుడు)

**సహస్రాక్షుడు** - వేయి కన్నులు గలవాడు (ఇంద్రుడు)

**సహస్రారము** - వేయి కోణములు గలది (వేయి రేకులు గల శరీరమందలి ఒక చక్రము)

**సహాధ్యాయి** - తోడి విద్యార్థి (సహపాఠి)

**సహోక్తి** - ఒక అర్థాలంకారము

**సాంకవము** - సంకుపిల్లి మదము (జవాజి - సంకుమదము)

**సాంఖ్యము** - పంచ భూతములు (పృథ్వివ్యప్తేజోవాయ్వాకాశములు) వాని గుణములు (శబ్దస్పర్శరూపరస గంధములు) పంచకర్మేంద్రియములు (వాక్పాణి పాద పాయూపస్థలు) పంచ బుద్ధి, అహంకారము ప్రకృతి (అవ్యక్తము-వ్యక్తము) అను ఇరువదినాల్గు తత్త్వములు పురుషుడు తత్త్వమనునది

**సాంఘాతికము** - జన్మనక్షత్రము మొదలు పదునాఱవదియగు కీడు కల్గించు నక్షత్రము, నాశము చేయునది, హానికరమైనది

**సాంతపనము** - 12 దినములు చేయదగిన పాపప్రాయశ్చిత్తవ్రత విశేషము 3-రోజులు పగటి పూటలందును 3 రోజులు రాత్రులందును 3 రోజులు అయాచిత పదార్థములను భుజించి 3 రోజులు (కటిక) కఠిన ఉపవాసముండుట, పంచగవ్యమును కుశోదకమును పుచ్చుకొని యొక రాత్రి ఉపవసించుట, మతాంతరము - సంతాపము వలన కలుగు ప్రాయశ్చిత్తాదికము

**సాంతపనకృచ్ఛ్ర** - గోమూత్రము గోమయము, గోక్షీరము, దధి, ఘృతము, కుశోదకములను క్రమక్రమముగా నొక్కొక్క దినమున భుజించి మరునాడు (7వరోజున) నిట్రుపవానము చేయుట

**సాంనాయ్యము** - లెన్స్గా వహ్నియందు వేల్వబడునది (హవిస్సు-సాన్నాయ్యము)

**సాంపరాయము** - ఆపద రాగల తరి, చూ సాంపరాయికము

**సాంపరాయికము** - ఇందు వీరులొండొరులతో తలపడుదురు (యుద్ధము)

**సాంబశివుడు** - జగత్తులకుతల్లియగు పార్వతితో గూడుకొని యుండువాడు (శివుడు)

**సాంబ్రాణి** - సంబరేను చెట్టు వలన లభించునది (ధూపద్రవ్యవిశేషము)

**సాంయాత్రికుడు** - వ్యాపారమునకై సముద్రయానము (ద్వీపాంతరయాత్ర) చేయువాడు (పోతవణిజుడు - ఓడవర్తకుడు)

**సాంయుగీనుడు** - యుద్ధమునందు ప్రావీణ్యము గలవాడు

**సాంవత్సరికము** - సంవత్సరాంతమున జరుగునది (ఆబ్దికము)

**సాంవాదికుడు** - వాదము చేయువాడు (తార్కికుడు)

**సాకుడు పులుగు** - కాకిచే బెంపబడిన పిట్ట (కోయిల - కాకపుష్టము)

**సాగర కర్ణము** - కర్ణమున సాగర (మను) మదముపుట్టునది (ఏనుగు)

**సాగరము** - సగర పుత్రులచే త్రవ్వబడినది (సముద్రము) ఏనుగు చెవినుండి కారు మదము

**సాగర మేఖల** - సముద్రము మొలనూలుగా గలది (నేల)

**సాతు** - వర్తకమునకై పోవు వారి గుంపు

**సాధారణము** - సమానమైన ఆధారము కలది (సామాన్యము)

**సాధిష్ఠము** - మిక్కిలి సాధువైనది

**సాధ్యులు** - ధర్మునకు సాధ్యయందు జన్మించిన వారు

**సాధ్వసము** - సాధువులను పీడించునది (వెరపు)

**సానుమంతము** - శిఖరము గలది, సానువు = చరియ, చరియలు గలది (పర్వతము కొండ)

**సాన్నాయ్యము** - హోమమున కర్హమైన క్షీరము లేక దధిరూవమైన హవిన్సు, (హవిన్సు సాంనాయ్యము

**సాపత్న్యుడు** - మారు తల్లి కొడుకు, మారు తండ్రి కొడుకు,

**సాపత్యుడు** - సంతానము కలవాడు

**సాప్తపదీనము** - ఏడు అడుగులచే గాని, ఏడు మాటలచే గాని ఏర్పడునది

**సామంతుడు** - ఒక దేశపుటెల్ల చేరిక నున్న రాజు

**సామజము** - సామ వేదమునుండి పుట్టినది (ఏనుగు)

**సామగుడు** - సామవేదమును జదువువాడు (సామవేద పారకుడు)

**సామము** - పాపమును పోగొట్టునది (ఒక వేదము) చతురుపాయములలో నొకటి సామము, దానము, భేదము, దండము చతురుపాయములు)

**సామర్థ్యము** - పరస్పరము అన్వయించి వాక్యార్థము నొసగ జాలు పదముల పొందిక (సామర్ధ్యంబు వ్యపేక్షా, ఏకార్థీ భావము)

**సామాజికుడు** - నభయందున్నవాడు సంఘమునందు జేరినవాడు (సభ్యుడు)

**సామిధేని** - నమిధలమంట జేయునవు డుచ్చరించు మంత్రము (బుక్కు - సామిధేన్యము - ధ్యాయ) మిక్కిలి మండించునది (సమిధ - చిదుగు)

**సామిమల** - కుమారస్వామి నివసించి యుండెడు పర్వతము

**సామీరి** - నమీరుని కొడుకు (భీముడు, ఆంజనేయుడు)

**సాముద్రికము** - సముద్రమున బుట్టినది మానవుల యదృష్టమును దెలిపెడి శాస్త్రము

**సామేను గరిత దాల్పు** - అర్ధనారీశ్వరుడు (సాంబశివుడు)

**సాయకము** - అంతమొందించునది (బాణము, కత్తి)

**సారంగము** - తన జాతి పక్షుల గుంపుతో గూడి వడిగా పోవునది (వానకోయిల), పెక్కు వన్నెలు కలది, చిత్ర వర్ణము కలది

**సారంగికుడు** - లేళ్ళను వేటాడువాడు (బోయవాడు)

**సారజము** - మీగడ నుండి పుట్టునది (సరజము = వెన్న)

**సారథి** - తేరు నడుపువాడు - సారధి

**సారమేయము** - సరమకు బుట్టినది (కుక్క)

**సారసజ్ఞాతినయన** - కమలముల వంటి కన్నులు గలది

**సారసము** - చూ సరసిజము

**సార్థవాహులు** - జంతు జాలమును గొనిపోవువారు (వర్తకులు)

**సార్వత్రికము** - అన్నిటికిని సంబంధించినది

**సార్వభౌమము** - సమస్త భూమండలము నందును నెరుగబడినది (ఉత్తర దిక్కున నుండెడి ఏనుగు)

**సార్వభౌముడు** - సమస్త భూమండలము నేలు రాజు (చక్రవర్తి)

**సార్వవేదసుడు** - యాగమున దనకున్న దంతయు దాన మిచ్చువాడు

**సాలగ్రామము** - విష్ణు చిహ్నములు గల శిలా విశేషము (గండకీ నదిలో దొరకునవి)

**సాలభంజిక** - దంత కాష్ఠాదులచే తయారు చేయబడిన బొమ్మ

**సాలారిక** - యుద్ధమున జయించి తేబడిన స్త్రీ (అంబిక)

**సాశూకము** - నూగువంటి బొచ్చు కలది (కంబళి - రల్లకము)

**సాష్టాంగము** - 8 అవయవములు (చేతులు, పాదములు, భుజాగ్రములు రొమ్ము, నొసలు)భూమికి దగులునట్లుగా జేసెడి నమస్కారము

**సాహస్రము** - వేల సమూహము, వేయి వస్తువుల సమూహము

**సాహస్రి** - పది నూర్ల సంఖ్య గలది, పెక్కు సంఖ్య గలది

**సాహితి, సాహిత్యము** - కావ్య నాటకాలంకారాదుల యర్థ జ్ఞానము

**సింగడు** - కోపించినవాడు, నరసింహస్వామి

**సింగన్న దాటులు** - పిల్లలాడుకొను ఒక ఆట (కొన్ని ఆటలు - దూచి, జాబిల్లి, బూచి కనుల కచ్చి, గుడి గుడి గుంజాలు, కుందెనగిరి, చీకటి మొటికాయ, చింతాకు చుణుచులు, పులియాటలు, తూరనడుక్కాలు, తూనిగ తానిగ, చిడుగుడు, దాగుడు మూతలు, తనుబిల్ల యాలాకి గుప్పిట గురిగింజ, కొండకోతి, చిక్కణ బిల్ల, బిల్ల బిద్యము, లక్కిబిక్కిదండ, ఒక్కసి కొక్కు, బరిగాయపోటు, గీరన గింజ, బొంగరములు; పుట చెండ్లు, చాకిమూట, గోటదొర్లుడు కాయ, గొబ్బిళ్ళు మోపిళ్ళు, వెన్నెల కుప్పలు, సింగన్న వత్తి (చూ॥ సింగిన్న వత్తి)

**సింగపు గొంగ** - సింహమునకు శత్రువు (శరభ మృగము)

**సింగపుజక్కి, సింగము నెక్కుదంట** - సింహము వాహనముగా గలది (పార్వతి)

**సింగాణి** - కొమ్మువిల్లు (శృంగ ధనువు - సింగిణి) శరాసనము (విల్లు) కుక్కకు పెట్టుకొను ముద్దుపేరు గబ్బు, చిటిగాడు, పులియడు, బూచిగాడు, అనుమంతి గాడు, రాహుత్తి, మల్లెల గుది, సివంగి, సాళ్వడు మొదలగునవి కుక్కలకు పెట్టుకొను పేళ్ళు

**సింగినాదము** - పొడ దుప్పికొమ్ముతో జేయబడిన యోగుల సుషిర వాద్య విశేషము

**సింధుకము** - సింధురము

**సింధుజ** - సముద్రమున పుట్టినది (లక్ష్మి)

**సింధుజము** - సింధు దేశమున పుట్టిన ఉప్పు (సైంధవ లవణము)

**సింధు నందనుడు** - సముద్రుని కొడుకు (చంద్రుడు - సింధుజుడు)

**సింధురము** - మదజలము స్రవించునది (ఏనుగు - సింధుకము)

**సింధు శయనుడు** - సముద్రము శయ్య యగువాడు (విష్ణువు)

**సింహ ద్వారము** - ముఖద్వారము

**సింహ నాదము** - యుద్ధాదులందు ఏనుగులు మొదలగునవి భీతిలుటకై వీరులొనర్చెడి ధ్వని

**సింహయాన** - సింహము వాహనముగా గలది (పార్వతి - సింహవాహన)

**సింహావలోకనము** - సింహము కొంత దూరము సాగి శత్రువు లెవరైనను వెంబడించుచున్నారేమో

యని వెనుకకు జూచునట్లుగ అంతవరకు జరిగిన పనిని తిరిగి పరిశీలించుట

**సింహాసనము** - సింహాకృతి గలిగి బంగారుతో జేయబడి, రాజులు కూర్చుండదగిన యున్నతమైన పీఠము

**సిక్థకము** - నిప్పువేడికి కరగునది (మైనము)

**సిక్యము** - చూరునకు కట్టబడి వ్రేలాడునది (చిక్కము, ఉట్టి)

**సిగ్గరి** - లజ్జ కలవాడు (లజ్జాళువు)

**సిగ్గిడి** - సిగ్గులేని(డి) వాడు

**సితకరుడు** - తెల్లని వెల్గులు కలవాడు (చంద్రుడు)

**సితవాజి** - శ్వేత వాహనుడు (అర్జునుడు) ఉచ్చైశ్శ్రవము ఇంద్రుని గుఱ్ఱము

**సితవారణము** -ఇంద్రగజము (ఐరావతము)

**సితసింధువు** - తెలియేరు (గంగానది)

**సితాభ్రము** - తెల్లని మేఘము వలె నుండునది (కర్పూరము)

**సితాశ్వుడు** - తెల్లని గుఱ్ఱములు కలవాడు (అర్జునుడు)

**సితికంఠుడు** - గరళపానముచే నల్లబడిన కంఠము కలవాడు(శివుడు-నీలకంఠుడు)

**సితివాసనుడు** - నల్లని వస్త్రము కలవాడు (బలరాముడు)

**సితోదరుడు** - తెల్లని కడుపువాడు (కుబే రుడు)

**సిద్ధాయము** - వెచ్చము చేయుటలో కూడ బెట్టిన పైకము

**సిద్ధపక్షము** - వాదమున హేతు ప్రమాణాదులచే నిరూపింపబడిన పక్షము (సిద్ధమైన పక్షము)

**సిద్ధాంతము** - స్థిరమైన పక్షముగా నిర్ణయింపబడినది, దీనివలన ప్రధానాంశము నిశ్చితమగును

**సిద్ధాంతి** - పంచాంగము (తిథి, వార, నక్షత్ర, యోగ, కరణములు) గుణించువాడు (పంచాంగకర్త) జ్యోతిషము తెలిసినవాడు, తుది నిర్ణయము కావించువాడు

**సిద్ధాయము** - చెల్లింపబడిన ఆదాయము (పన్ను, అప్పు, మ్రొక్కుబడి మొ॥)

రాబడి నుండి ప్రభుత్వమునకు చెల్లింప బడినది (ఆదాయపు పన్ను)

**సిద్ధుడు** - అష్టైశ్వర్యములు ఫలించినవాడు (అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వములు - సిద్ధులు), (అణిమాది విద్యలందు చతురులు)

**సినీవాలి** - చంద్రకళ కానవచ్చెడి అమావాస్య

**సిరిగట్టు** - ద్వాదశ జ్యోతిర్లింగములలో రెండవది యగు శ్రీశైలము

**సిరిచూలి** - లక్ష్మీ దేవి కుమారుడు (మన్మథుడు)

**సిరిసింగణా(ల)వత్తి** - ఒకానొక బాలక్రీడ (మరికొన్ని క్రీడలు - సింగన్న దాటులు, చిందు పరుపు, గచ్చకాయలు, కిఱ్ఱుగానుగ త్రిప్పాళ్ళు మంటి గూళ్ళు, రామన్నాట, పాడుగుళ్ళనుయ్యాల, బోర్ల వక్క బండ్లికలు గంగెద్దులాట, నాల్గు కంబాలాట, నట్టకోతితో చిగాయవదుపు, చంద్రాళ్ళు చిటికెలు కీచుబురల, కోలాటములు, పిల్ల గ్రోవులు, గుమ్మడి క్రోవి కూతలు, విండ్లమ్ములాటలు, పులి జూదములు (చూ॥ సొగటాలు)

**సీత** - నాగేటి చాలున బుట్టినది (జానకి)

**సీదరపు బెద్ద, సీద్రంపు బెద్ద** - కుబుసము గల వారిలో గొప్పవాడు (ఆదిశేషుడు)

**సీదరము** - విషధారి (పాము)

**సీమంతము** - గర్భిణులకు చేయు ఒక సంస్కారము (పూలముడుపు - సీమంతో న్నయనము)

**సీమంతిని** - సీమంతము (పాపట) కలది (స్త్రీ)

**సీరధ్వజుడు** - నాగలి జెండా గుర్తుగా కలవాడు (జనకుడు)

**సీరపాణి** - నాగలి హస్తమున గలవాడు (బలరాముడు - హలాయుధుడు)

**సీరి** - సీరము (నాగలి) కలవాడు - బలరాముడు

**సుంకరిమెట్టు** - పన్ను పుచ్చుకొనెడి చావడి (సుంకరియొక్క మెట్టు - శుల్కశాల)

**సుకృతము** - చక్కగా చేయబడినది

**సుఖదుడు** - సౌఖ్యమొసగువాడు (విష్ణువు)

**సుగంధత్రయము** - మంచి తావిగల, కురు వేరు, చందన, నాగకేసరములు

**సుగతుడు** - గొప్పగతులు కలవాడు

**సుగాత్రి** - చక్కని ఆడుది (సుగాత్ర)

**సుగ్రీవము** - మంచి మెడ కలది (శ్రీకృష్ణుని గుఱ్ఱము, శైబ్యము, పుష్యము, బలాహ కములు మిగిలిన గుఱ్ఱములు)

**సుగ్రీవుడు** - మంచి మెడ కలవాడు

**సుఘోషము** - మంచి ధ్వని కలది (సుఘోష మణి పుష్పకములు నకుల సహదేవుల శంఖములు)

**సుడికైదువు** - గుండ్రని ఆయుధము (సుదర్శన చక్రము - చుట్టుకైదువు)

**సుడిగట్టు** - గుండ్రని పర్వతము (చక్రవాళ పర్వతము)

**సుడిగొట్టు** - సుడులు కలది (చక్రవాతము - సుడిగాలి) గుండ్రముగా వీచువాడు (వాయు దేవుడు)

**సుడిగొట్టుజాణ** - సుడిగొట్టు

**సుడివాలు** - సుడికైదువు (సుడియడిదము సుదర్శన చక్రము)

**సుత్రాముడు** - బాగుగా రక్షించువాడు (ఇంద్రుడు)

**సుదతి** - చక్కని పలు వరుస గల యాడుది

**సుదర్శనము** - మంగళ ప్రదమైన దర్శనము కలది (విష్ణు చక్రము)

**సుధ** - సుఖముగా పానము చేయబడునది (అమృతము)

**సుధర్మ** - మంచి ధర్మము గలది (దేవసభ)

**సుధాంగుడు** - అమృత పూర్ణములైన యవ యవములు కలవాడు (చంద్రుడు)

**సుధాకరుడు** - అమృతమయములైన కిరణములు కలవాడు (చంద్రుడు - సుధాంశుడు)

**సుధాపాణి** - అమృతప్రాయమైన హస్తము కలవాడు (ధన్వంతరి)

**సుధి** - చక్కగా యోచించువాడు (పండి తుడు)

**సునాదము** - మంగళప్రదమైన (మ్రోత) ధ్వని కలది (శంఖము)

**సునాసీరుడు** - శ్రేష్ఠమైన సేనాగ్రభాగము గలవాడు, గొప్ప సేన కలవాడు (ఇం ద్రుడు)

**సుపర్వులు** - మంచి అంగుళ్యాది గ్రంధులు గలవారు, శుభకరములైన ఉత్సవములు కలవారు, మంచి చరితము కలవారు (దేవతలు - సుపర్వులు)

**సుపాణి, సుప్పాణి** - పరిశుద్ధమైన నీరు గల ముత్యము, పరిశుద్ధమైన ముత్యపు నీరు

**సుప్రతీకము** - మంచి యవయవములు గలది (అష్ట దిగ్గజములలో నొకటి)

**సుభగ** - మంచి నక్షత్రమున భర్తను పొందునది (భాగ్యవంతురాలు)

**సుభగుడు** - మంచి రూప గుణాదులు కలవాడు (సొబగుడు - భాగ్యవంతుడు)

**సుభిక్షము** - సులభముగా భిక్ష లభించు (దేశము)

**సుభ్రువు** - తీరైన (మంచి) కనుబొమలు కలది

**సుమనస్సులు** - మంచి మనస్సు కలవారు, లెస్సగా నెరిగినవారు (దేవతలు)

**సుమేరువు** - గొప్ప శిఖరములచే నక్షత్రాదు లను భరించునట్టిది (మేరు పర్వతము)

**సురగవి** - వేల్పుటావు (కామధేనువు)

**సురంగాహి** - కన్నములో పాము వలె దూరువాడు (సురుంగాహి - కన్నపు దొంగ)

**సుర గురువు** - దేవతా గురువు (బృహస్పతి)

**సురజ్యేష్ఠుడు** - దేవతలలో బెద్దవాడు (బ్రహ్మ)

**సురటి వీవనల పుట్టు** - విసనకఱ్ఱ వీచుటచే పుట్టువాడు (వాయు దేవుడు)

**సురదారువు** - దేవతల కిష్టమైన చెట్టు (దేవదారు చెట్టు)

**సురద్విపము** - ఇంద్రుని యేనుగు (ఐరావతము)

**సురద్విషుడు** - దేవతలను ద్వేషించువాడు (రక్కసుడు)

**సురపతి** - దేవతలకు ప్రభువు (ఇంద్రుడు)

**సురభిళము** - మంచి పరిమళము కలది

**సురలు** - లెస్సగా ప్రకాశించువారు, అగ్నిలో వేల్చిన హావిరాదికమును గ్రహించువారు, క్షీరాబ్ధినుదయించిన యమృతము కలవారు (వేల్పులు - దేవతలు)

**సురలోకము** - స్వర్గము

**సురవర్త్మము** - వేల్పుల త్రోవ (ఆకాశము)

**సురవైరి** - దేవతల శత్రువు (రాక్షసుడు)

**సురాచార్యుడు** - దేవతలకు గురువు (బృహ స్పతి)

**సురాజీవి** - కల్లు అమ్ముకొని జీవించువాడు

**సురాలయము** - దేవతల స్థానమైన మేరు పర్వతము

**సురాళము** - భూతావేశమున గలుగు మైకము

**సురియాళువు** - చురకత్తి కల్గి యుండువాడు (గోసంగి - సురయాళువు - చండాలుడు)

**సురేంద్రుడు** - వేల్పురేడు (ఇంద్రుడు)

**సురేశ్వరుడు** - సురేంద్రుడు

**సులగ్నము** - పంచక ...తమై కుదిరిన కాలము (సుముహూర్తము)

**సువర్ణము** - మంచి రంగు గలది (బంగారము అగలు, హరిచందనము) మంచి కులము కలది,

**సువాసిని** - సుఖముగా వసించునది (ముత్తైదువ), ఎక్కువ కాలము పుట్టినింటనే గడపదలచునది

**సువేలము** - మేర మీరనిది

**సువ్రత** - మంచి వ్రతము కలది, సుల భముగా పిదుక తగిన ఆవు

**సుశ్లోకుడు** - మిక్కిలి కీర్తి గలవాడు (సత్కీర్తి మంతుడు)

**సుషిరము** - బెజ్జము కలది ( పిల్లన గ్రోవి మొదలగు వాద్యము, ఊది మ్రోయించు వాద్యము బాకా, కొమ్ము మొ॥ వంశాదికం తు సుషిరం)

**సుషుమ్న** - అవ్యక్త శబ్దమును చేయు వెన్నెముక పొడుగున నుండునాడి

**సుహృత్తు** - మంచి హృదయము కలవాడు (సుహృదుడు)

**సుహృదుడు** - తన యెడల యోగ్యమైన హృదయము కలవాడు (చెలికాడు)

**సూకరము** - సూదుల వలె నిక్కపొడిచిన రోమములు కలది, ఎక్కువ పిల్లలను పెట్టునది (పంది)

**సూక్తము** - లెస్సగా చెప్పబడినది, వేదమున నొక విషయమును గూర్చి చెప్పిన కొన్ని పనసలు (కొన్ని బుుక్కులు నముదాయము శ్రీసూక్తము, మన్యు సూక్తము మొ॥)

**సూక్ష్మ దేహము** - మరణానంతరము జీవుడు ధరించు (సూక్ష్మ) శరీరము (లింగ శరీరము)

**సూచి(చీ) పుష్పము** - సూదుల వంటి అంచులు గల పువ్వు (మొగలి రేకు)

**సూచిరోమ** - ముండ్ల వంటి బిరుసైన రోమములు కలది (పంది - సూకరము)

**సూచీపత్రము** - గ్రంథముల యంశములను సూచించుపట్టి

**సూతుడు** - రథము నడపువాడు (సారథి) శూద్రునకు క్షత్రియ స్త్రీయందు గాని, క్షత్రియునకు బ్రాహ్మణ స్త్రీయందు గాని పుట్టినవాడు

**సూత్రధారుడు** - నాటకాదులను ఆడించు ముఖ్య నటుడు

**సూత్రితము** - సూత్రబద్ధము చేయ బడినది, దారమునకు గ్రుచ్చ బడినది

**సూదంటురాయి** - లోహమును ఆకర్షించునది (అయస్కాంతము)

**సూనృతము** - ప్రియమును, సత్యము నగు పలుకు

**సూపకారుడు** - సూపము (పప్పు) మొదలగు వానిని ఉడికించి సిద్ధము చేయువాడు (వంటవాడు)

**సూయానము** - శత్రు భయంకరమైన దండయాత్ర

**సూరసూతుడు** - సూర్యుని రథము నడ పువాడు (అనూరుడు)

**సూరుడు** - సదా సంచరించువాడు (సూర్యుడు)

**సూర్యకాంతము** - సూర్యుని కాంతి తగులు టచే నిప్పు పుట్టెడు రాయి (అర్క, కాంతము)

**సూర్యజుడు**-సూర్యుని కొడుకు (యముడు, శని)

**సూర్య తనయ** - సూర్యుని కొమార్తె (యమున, కాళింది)

**సూర్యేందు సంగమము** - దీనియందు సూర్య చంద్రులకు నంయోగము కలుగును (అమావాస్య)

**సూర్యోఢుడు** - ప్రొద్దుగ్రుంకువేళ వచ్చినవాడు

**సృగాలము** - మాంసమును దినునది (నక్క)

**సృణి** -ఏనుగు దీనిచే నడచును(అంకుశము)

**సృమరము** - సంచరించుచుండునది (పెద్ద చమర మృగము - సవరపుమెకము)

**సెకకంటి, సెకకన్నేటి** - చిచ్చరకంటి (శివుడు)

సెకవెలుగు, సెగకంటి జోడు, వేడి వెలుగు (సూర్యుడు)

**సెగపాపడు** - అగ్గిచూలి

**సెగరేడు** - వెచ్చని దేవుడు (అగ్ని - సెగరేని చాన - అగ్ని దేవుని భార్య - స్వాహా దేవి)

**సెలకట్టు** - అమ్ముల పొదికట్టు

**సేనాంగము** - రథగజతురగపదాతులు చతుష్టయము

**సేనాని** - సైన్యమును నడపువాడు (దళవాయి, కుమారస్వామి)

**సేనాముఖము** - సేనయొక్క అగ్రభాగము, మూడు పత్తులు కలది (3 రథములు 2 ఏన్గులు 9 గుఱ్ఱములు, 15 కాల్బంట్లు గల సేన)

**సేవధి** - శేవధి - నిధి

**సేసబ్రాలు** - తలపై పోసికొను బియ్యము, మంత్రాక్షతలు

**సైంధవము** - సముద్రమున బుట్టినది (సముద్రపు ఉప్పు), సింధుదేశమున బుట్టినది (సైంధవలవణము, గుఱ్ఱము)

**సైంధవలడ్డు** - లడ్డులోవచ్చిన ఉప్పుగల్లు వంటిది

**సైంహికేయుడు** - సింహికయొక్క కొడుకు (రాహువు

**సైరంధ్రి** వరగృహమందుండి శృంగారాదులజేయుచు శీలము కాపాడుకొను పతివ్రత

**సైరిభము** - నాగేలు వట్టు హాలికులకు అవసరమైనది (ఎద్దు)

**సైసకము** - సత్తుతో చేయబడినది (సైసకరము -

**సొగటాలు** - పగడసాలాట (అడ్డసాళ్ళు - కొన్ని ఆటలు వామన గుంటలు కుప్పిగంతులు, కుమ్మరసారెలు, బందారుబనవన్న, తిరుగుడుబల్లలు)

**సోకుటొజ్జ** - రాక్షసులకు గురువు (శుక్రాచార్యుడు)

**సోకు దయ్యము** - నమస్త పదార్థములను స్పృశించువేల్పు (వాయువు)

**సోకుమూకలగొంగ**-రాక్షస సమూహములకు శత్రువు (విష్ణువు)

**సోకులరేడు** - రాక్షసులకు ప్రభువు (సోకుమూకలదణి - కోణపుడు - నైరృతి)

**సోత్ప్రాసము** - దోషములు బయటపెట్టుచు పలుకుట (ఎత్తిపొడుపు) పరిహాసముతో కూడిన మాట (సోల్లుంఠనము)

**సోదరుడు** - తోడబుట్టినవాడు (అన్న, తమ్ముడు)

**సోపప్లవుడు** - రాహువుచేత పట్టువడువాడు (సూర్యుడు, చంద్రుడు) శత్రువుచే పీడింపబడినవాడు

**సోమజుడు** - చంద్రుని కొడుకు (బుధుడు)

**సోమపాయి** - సోమపానము చేయువాడు (సోమయాజి)

**సోమపీతి, సోమపీథి** - యజ్ఞమున సోమపానము చేయువాడు (సోమయాజి)

**సోమయాజి** - యజ్ఞము చేసినవాడు (సోమాసి)

**సోమవారము** - చంద్రుడు అధిపతియగు వారము (ఇందువారము - మలివారము)

**సోమసూత్రము** - పానపట్టము నుండి అభిషేక జలము పోవుదారి

**సోముడు** - అమృతమొసగువాడు

**సోమ్యము** - సోమరసము పోయుట కుపయోగించు పాత్రము

**సౌకరికుడు** - పందులను పెంచి అమ్మెడు వాడు

**సౌఖశాయనికుడు, సౌఖసుప్తికుడు** - రాజుల నిద్రమేల్కొల్పువాడు (బట్టు) సుఖనిద్రయా యని ప్రశ్నించువాడు

**సౌగంధికుడు** - సుగంధ వస్తువుల వ్యాపారము చేయువాడు

**సౌచికుడు** - కుట్టుపని చేయువాడు (దర్జి)

**సౌత్రాంతికుడు** - (సూత్రాంతము - తాత్పర్యము) సారాంశమడిగినవాడు (బౌద్ధుల తెగవాడు)

**సౌదా(మిని)మని** - దండవలె దీర్ఘకాలము గలది, సుదామమను పర్వతముతో గూడనొక దిక్కున నుండునది (మెరపు) మేఘము (సుదామము) నుండి పుట్టినది

**సౌదాయికము** - తల్లిదండ్రుల చేత గాని అన్నదమ్ముల చేతగాని యీబడు స్త్రీ ధనము (అరణము - సారె)

**సౌధము** - సున్నముతో కట్టబడినది (మేడ)

**సౌనంది** - సౌనందమనెడి రోకలి ఆయు ధముగా గలవాడు (బలరాముడు)

**సౌనికుడు** - మృగపక్ష్యాదులను జంపి అమ్ముకొని జీవించువాడు (కటికవాడు)

**సాప్తికము** - ముచ్చిలిపాటుగల మహా భారతమునందలి యొక పర్వము నిద్రకు సంబంధించినది

**సౌభద్రుడు**-సుభద్ర కొడుకు (అభిమన్యుడు)

**సౌమిత్రి** - సుమిత్ర కొడుకు (లక్ష్మణుడు)

**సౌమ్యము** - సోమయాగమునకు చెందినది, తిన్ననైనది, సాధువైనది

**సౌరభేయము** - ఆవు సంతు (ఎద్దు, సౌరభేయి - ఆవు)

**సౌరమానము** - సూర్యుని గమనమును బట్టి యేర్పరిచిన కాలమానము

**సౌరికుడు** - కల్లు అమ్మువాడు (గౌండ్లవాడు - కబ్బిలివాడు)

**సౌవర్ణకరణి** - లోహములను బంగారుగా జేయు ఓషధి

**సౌవస్తికుడు** - స్వస్తియాయని అడుగువాడు, మేలుకోరువాడు

**సౌవిదల్లుడు** - అంతఃపురపు కావలివాడు

**స్కందజనని** - కుమారస్వామి తల్లి (స్కందమాత - పార్వతి)

**స్కంధము** - శిరమును దాల్చునది (మెడ)

**స్కాందము** - కుమారస్వామికి సంబం ధించినది, శివునికి సంబంధించినది

**స్తంబేరమము, స్తంబేరము** - పొదలలో (స్తంబములమధ్య)రమించునది(ఏనుగు)

**స్తంభనము** - మంత్రశక్తిచే అగ్నిలోనగు వాని దాహకత్వాది శక్తుల నణగార్చుట

**స్తనంధయ** - పాలుత్రాగెడు ఆడుబిడ్డ, స్తనంధయుడు - పాలు ద్రావెడు మగబిడ్డ

**స్తబ్ధరోమము** - నిక్కపొడుచుకొన్న రోమములు కలది (పంది)

**స్తబ్ధకర్ణుడు** - గళ్ళువడిన చెవులు కలవాడు

**స్తావకుడు** - స్తోత్రము చేయువాడు (స్తవకుడు)

**స్తోకకము** - జలకణములనభిలషించునది, చిన్నగా కూయునది (వానకోయిల)

**స్త్రైణము** - స్త్రీల సమూహము, స్త్రీ సంబంధమైనది

**స్థండిలశాయి** - వ్రత దీక్షితుడై భూమి యందు శయనించువాడు (స్థాండిలుడు)

**స్థపతి** - శిల్పాది చాతుర్యముచే ప్రసిద్ధుడైన వాడు (శిల్పి, వడ్రంగి)

**స్థాండిలుడు** (స్థండిలము - దర్భాదుల చేత చతురస్రముగా సంస్కరింపబడిన నేల) స్థండిల భూమియందు శయనించెడు వ్రతి (స్థండిలుడు - స్థండిలశాయి)

**స్థాణువు** - ప్రళయ కాలమున నుండువాడు (శివుడు) వాయువుచే గొట్టబడియు కదలనిది (మొద్దు, స్తంభము)

**స్థానమృగము** - నీటిమీదను నేలమీదను సంచరించు జంతువు (మొసలి, తాబేలు)

**స్థాలి** - పదార్థములు దీనిలో ఉండును (వంటకుండ)

**స్థాలీపాకము** - స్థాలిలో ఉడికించిన వంటకము

**స్థావరము** - స్థిర స్వభావము కలది (పర్వతము, వృక్షము మొ॥)

**స్థావిరము** - ముసలితనము (వార్ధక్యము)

**స్థితిస్థాపకము** - తన పూర్వపు స్థితికే వచ్చి నిలుచు గుణము

**స్థిరవారము** - 7వ వారము (శనివారము)

**స్థిరాయువు** - పెద్దకాలము బ్రతుకునది (బూరుగుచెట్టు)

**స్థూలనాసము** - బలమైన ముట్టె కలది (పంది)

**స్థూలపాదము** - పెద్ద పాదము కలది (ఏనుగు)

**స్నవనము** - దేవతామూర్తులకు (నీళ్ళు చిలుకరించుట) స్నానము చేయించుట

**స్నాతకము** - వివాహమునకు ముందుగా బ్రహ్మచారి చేసికొను ఒక వ్రతము

**స్నాతకోత్సవము** - పట్టప్రదానోత్సవము

**స్నాపకుడు** - స్నానమునకై నీళ్ళు తెచ్చువాడు

**స్నేహాశము** - చమురు పీల్చునది (దీపము)

**స్పర్థి** - విరోధించువాడు

**స్పర్శమణి, స్పర్శవేధి** - లోహమును బంగారముగా జేయునట్టి మూలికా (రస) విశేషము (పరుసవేది)

**స్పటికాచలము** - స్ఫటికము వలె ప్రకాశించు కొండ (కైలాసము)

**స్పటికాభము** - స్పటికవు వన్నెకలది (స్ఫటికోపమము - కర్పూరము)

**స్ఫోటని** - బెజ్జము వేయునట్టి పనిముట్టు (బర్మా)

**స్మరహరుడు** - మన్మధుని సంహరించిన వాడు (శివుడు)

**స్మరుడు** - కామాతురులను రెచ్చగొట్టువాడు (మన్మధుడు)

**స్మారకము** - స్మృతి కలిగించునది

**స్మార్తులు** - స్మృత్యుక్త కర్మముల నొనర్చు వారు, శంకరాచార్య (అద్వైత) మతము నవలంబించువారు

**స్మృతి** - మనువు మొదలైనవారు చెప్పిన ధర్మశాస్త్రము

**స్మేరము** - వికసించినది, కొంచెము నవ్వినది

**స్యందిని** - నోటినుండి కారునది (చొంగ)

**స్యాలిక** - పరిహాస వాక్యములచే ఎగతాళి చేయునది (మరదలు)

**స్యాలుడు** - పరిహాస వాక్యములచే ఆట పట్టించువాడు (స్యాలకుడు - బావమరది - శ్యాలుడు)

**స్యూతము** - పేము మొ॥ వానిచే అల్ల బడినది

**స్రజము** - వాడుకొనిన పిదప విడు౯ ౘునది (పూలదండ)

**స్రవంతి** - కొండల నుండి పారునది (ఏరు)

**స్రవద్గర్భ** - ఈచుక పోయిన ఆవు (అపతోక)

**స్రష్ట** - సృష్టికార్యమును చేయువాడు (సృష్టికర్త - బ్రహ్మ)

**స్రువము** - ఆజ్యము హోమము చేయుటలో వాడెడు చంద్ర కఱ్ఱతో చేయబడిన (గరిటె)

**స్వగతము** - తనలో తాను అనుకొనుమాట

**స్వజము** - తననుండి పుట్టినది (నెత్తురు - అస్రము)

**స్వతంత్రుడు** - వ్యవహార దశ ప్రాప్తించినవాడు

**స్వధితి** - తనకేల ధరింపవీలు గలది (గొడ్డలి)

**స్వప్నక్కు** - స్వప్నకుడు (నిద్రాళువు)

**స్వభావోక్తి** - జాతి గుణాదులందలి స్వాభావిక ధర్మములను మనో రంజకముగా వర్ణించి చెప్పుట (ఒకానొక అర్థాలంకారము)

**స్వయందత్తుడు** - తల్లిదండ్రులు లేకకాని వారిచే నే కారణముననో విడువబడి కాని నేను నీకు పుత్రుడనయ్యెదనని తనంత వచ్చినవాడు (ఔరసుడు, క్షేత్రజుడు, దత్తుడు, కృత్రిముడు, గూఢోత్పన్నుడు, అపవిద్ధుడు, కానీనుడు, సహోఢజుడు, క్రీతుడు, పౌనర్భవుడు, స్వయందత్తుడు, జ్ఞాతిరేతుడు - ద్వాదశ విధ పుత్రులు)

**స్వయంపాకము** - ఒకనికి పూటకు సరిపోవు నట్లిచ్చు వంటసామగ్రి

**స్వ(యం)భువు** - తనంతట తానే పుట్టినవాడు (స్వయంజాతుడు - బ్రహ్మ విష్ణువు, శివుడు, మన్మధుడు)

**స్వయంవరము** - పెండ్లి కూతురు స్వయముగ తన మనసు వచ్చిన వరుని వరించెడి యుత్సవ విశేషము,

**స్వరితము** - ఉదాత్తానుదాత్తములకంటె భిన్నమైన వేదోచ్చారణ స్వర విశేషము

**స్వరువు** - యూపమును ఛేదించినపుడు తెగిపడిన రెండవ తున్క, శత్రువులను బాధించునది

**స్వరూపము** - తనయొక్క రూపము (స్వభావము)

**స్వర్గము** - మిక్కిలిగా సుఖమనుభవింప బడునది (దేవలోకము - దివి)

**స్వర్ణకాయుడు** - బంగారువన్నెవేనివాడు (గరుత్మంతుడు)

**స్వర్ణకారుడు** - బంగారపు పనిచేయువాడు (అగసాలెవాడు - కమసాలి)

**స్వర్ణది** - స్వర్గమున ప్రవహించునది (మందాకిని)

**స్వర్ణదీధితి** - బంగారు వికారమైన కాంతులు గలవాడు (అగ్ని)

**స్వర్ణము** - మంచి వన్నె కలది (సువర్ణము)

**స్వర్భానువు** - స్వర్గమున బ్రకాశించువాడు (రాహువు)

**స్వల్పిష్ఠము** - అన్నింటిలో చిన్నది

**స్వస** - సోదరుని ఆయాసమును శమింప జేయునది (తోబుట్టువు)

**స్వస్తికము** - తూర్పువాకిలి గల రాజ గృహము, పాము పడగమీది నల్లనిరేఖ నాలుగు దారులు కలిసెడు చోటు (చతుష్పథము - చౌరస్తా)

**స్వస్తి ముఖము** - మంగళాశీర్వాదము పలుకువాడు (బ్రాహ్మణుడు)

**స్వస్రీయుడు** - స్వసయొక్క కొడుకు (స్వస్రేయుడు- భాగినేయి - మేనకోడలు)

**స్వాధిష్ఠానము** - శరీరమందలి చక్రముల లోనిది

**స్వాధీనపతిక** - స్వాధీనుడయిన భర్త గల నాయిక (అష్టవిధ శృంగార నాయికలలో ఒకతె)

**స్వాధ్యాయము** - తనకు నిర్ణయింపబడిన వేద శాఖను అధ్యయనము చేయుట

**స్వాపకము** - నిదుర కల్గించునది

**స్వాపతేయము** - తన యజమాన్యమున నుండునది(ఆస్తి) తన యజమానులందు ఎక్కువగా నుండునది (ధనము)

**స్వాభావికము** - స్వభావముచే గలిగినది (స్వభావ సిద్ధము)

**స్వీకర్త** - పుచ్చుకొనువాడు (గ్రహీత)

**స్వీయ** - తన భర్తయందు మిక్కిలి యను రాగము గల నాయిక (వాణిని)

**స్వేదజము** - చెమట వలన బుట్టినది (నల్లి, క్రిమికీటకాదులు స్వేదజములు)

**స్వేదము** - ఒడలు చెమర్చునట్లు చేయునది (చెమట - శ్రమవారి)

**స్వైరగతుడు** - ఇష్టము వచ్చినట్లు తిరుగు వాడు

**హంకారము** - అహంకారము (గర్వము పోతరము)

**హంస** - అంచ (తెల్లగుఱ్ఱము), శరీరస్థ వాయు విశేషము, అజపా మంత్రము (మంత్రములలో ఒకటి) పరిశుద్ధమైనది, ఎగిరిపోవునది

**హంసగామిని** - అంచనెక్కి పోవునది (సరస్వతి), చూ॥ అంచయాన (స్త్రీ)

**హంసతూలికా తల్పము** - అంచగరుల పాన్పు

**హంసపాదు** - వ్రాతలో తప్పు వచ్చిన చోట నుంచు (×) గుర్తు

**హంసయాన** - హంసగామిని

**హంసరథుడు, హంసవాహనుడు** - హంస వాహనముగా గలవాడు (బ్రహ్మ)

**హంసుడు** - తమస్సును హననము చేయువాడు (సూర్యుడు)

**హట్టము** - వస్తువులతో తళతళలాడు చుండునది (అంగడి వీధి - విపణి)

**హఠయోగము** - కఠోర సాధనలచే దైవాను గ్రహము సంపాదించు విధానములు కలది (ఒక యోగ మార్గము)

**హఠాలువు** - నీటిపై (పచ్చని తెప్పవలె) తేలునది (నాచు)

**హతాశుడు** - చెడిన కోరిక గలవాడు, ఆశలేనివాడు

**హనువు** - భక్ష్యమును నమలునది (వెలిదౌడ - చెక్కిలి మీది భాగము)

**హనుమంతుడు** - ప్రశస్తమైన దౌడలు కలవాడు (ఆంజనేయుడు - హనుమ)

**హనూషుడు** - మిక్కిలిగ బాధించువాడు (యమదూత, రాక్షసుడు)

**హయగ్రీవుడు** - గుఱ్ఱము కంఠము గల విష్ణుని యవతారము (హయముఖుడు)

**హయమారణము** - గుఱ్ఱమును చంపునది (అశ్వత్థ వృక్షము - రావి)

**హయారి, హయవైరి** - గుఱ్ఱమునకు శత్రువు (దున్నపోతు, గన్నేరు - హయమారకము)

**హరబీజము** - శివుని వీర్యరూపమైనది (హరతేజము - పాదరసము)

**హరి** - చీకటిని హరించువాడు (సూర్యుడు, చంద్రుడు) గజాదులను హరించునది (సింహము) మనస్సునాకర్షించువాడు (శివుడు, విష్ణువు)

**హరిచందనము** - ఇంద్రుని సంతోష పెట్టునది (దేవ వృక్షములలో నొకటి) పసుపు వన్నె గల చందనము

**హరిణము** - (మాంసము కొరకు) హరింప బడునది (జింక)

**హరిణాంకుడు** - జింక చిన్నెగా కలవాడు (ఏణ తిలకుడు - చంద్రుడు)

**హరిణాక్షి** - లేడి కన్నుల యాడుది

**హరితాళము** - పసుపు రంగు నిలిచి యుండునది (అరిదళము-హరిదళము)

**హరిదశ్వుడు** - పచ్చని కాంతి గల ఏడు గుఱ్ఱములు గలవాడు (సూర్యుడు)

**హరిదాసు** - భగవంతుని కథలు చెప్పుకొని జీవించువాడు (దాసరి)

హరిత్ర - పసుపు పచ్చని వన్నె కలది (పసుపు)

**హరిద్ర** - పసుపు పచ్చని వన్నె గల రత్నము (మరకతము)

**హరిప్రియ** - విష్ణువునకు ప్రియురాలు(లక్ష్మి)

**హరిబువ్వము** - వివాహమున నాల్గవనాటి రాత్రి ఆడుమగ పెండ్లి వారు కలసి విందారగించుట

**హరివాహనుడు** - విష్ణువునకు వాహనమైన వాడు (గరుత్మంతుడు) పచ్చని గుఱ్ఱములు కలవాడు (సూర్యుడు)

**హరిహయుడు** - పచ్చని గుఱ్ఱములు కలవాడు (ఇంద్రుడు, సూర్యుడు)

**హారీతకి** - రోగములు హరించునది (కరక్కాయ)

**హారుడు** - ప్రళయకాలమున సర్వమును హరించువాడు, (శివుడు)

**హర్మ్యము** - మనస్సును హరించునది (మేడ)

**హర్యక్షము** - పసుపువచ్చని కనులు కలది (సింహము - పచ్చకనుల మెకము)

**హర్యక్షుడు** - కుబేరుడు (పైడిరేడు)

**హర్యశ్వుడు** - బంగారు వన్నె గల గుఱ్ఱము వాహనమైనవాడు (ఇంద్రుడు హరిహయుడు)

**హలధరుడు** - హలాయుధుడు (బలరాముడు), నాగలి పట్టిన రైతు

**హలాయుధుడు** - నాగేలు ఆయుధముగా పట్టినవాడు (బలరాముడు)

**హల్య(ము)** నాగళ్ల సమూహము, నాగలిచే నొక పర్యాయము దున్నినది

**హల్లకము** - సంతోషమును జేయునది, (సూర్యకాంతిచే) విప్పారునది (చెంగలువ - ఎఱ్ఱ కలువ)

**హల్లీసకము** - స్త్రీలు మండలాకారముగ తిరుగుచు జేయు నృత్యము

**హల్లులు** - వ్యంజనాక్షరములు అ,ఇ,ఉ,ణ్, ఋ క్3 ఏ ఓ ఙ్ 4 ఐ ఔచ్ 5 హయవరట్ 6 లణ్ 7 ఞమఙణనమ్ 8 ఝభఞ్ 9 ఘఢధష్ 10 జ,బ,గ, డ, ద,శ్ 11 ఖఫఛఠథచటతవ్ 12 కపయ్ 13 శషసర్ 14 హల్ ఒకటవ సూ॥లోని చ్ నడుమనున్నవి (ణ్,క్) మొదలగు ఇత్సంజ్ఞలు పోగా) అచ్చులు 5 సూ॥నుండి 14వ సూ॥వరకు (ఇత్తులు పోగా) హల్లులగును (మహేశ్వర సూత్రాలు)

**హవనము** - హవిస్సును అగ్నిల్లో వేయుటకు వాడెడు చంద్రకఱ్ఱతో జేసిన కొయ్య గరిటె (స్రుక్కు), హవిస్సును మంత్ర పూర్వకముగా అగ్నిలో వేయుట

**హవనీయము** - హోమము చేయదగినది (హవిరాదికము)

**హవిర్భుక్కు** - హవిస్సును దినువాడు (వేల్పు - హవిర్భుజుడు)

**హవ్యము** - దేవతలకర్పింప దగిన అన్నము

హవ్యవహుడు, హవ్యవాహనుడు - హవి స్సును మోసికొనిపోవువాడు (అగ్ని)

**హవిస్సు** - అగ్నిహోత్రమున వేల్చుటకు ఇగుర బెట్టిన అన్నము

**హసంతి** - నవ్వుచున్నదాని వలె నుండునది (కుంపటి, మల్లె - హసంతిక)

**హసనీమణి** - హసని (కుంపటి) యందు మణివలె వెలయునది (నిప్పు)

**హస్తగతము** - తన అధీనము లోనికి వచ్చినది

**హస్తలాఘవము** - గారడి విద్య (ఇంద్రజాలము - కనికట్టు)

**హస్తామలకము** - అరచేతి యందలి యుసిరికాయ (కరతలామలకము)

**హస్తిపకుడు, హస్తిపుడు** - ఏన్గులను ఆహారాదికముచే రక్షించువాడు (మావటివాడు)

**హస్తిపాదుడు** - ఏనుగు పాదము వంటి పాదము కలవాడు (బోదకాలివాడు)

**హస్తిమశకాంతరము** - దోమకు ఏనుగునకు దోమకు గలవాసి

**హాటక గర్భుడు** - హిరణ్య గర్భుడు (నలువ)

**హాటకము** - మెరయునది (బంగారము)

**హాయనము** - ఋతువులను క్రమముగా విడుచునది (సంవత్సరము)

**హారకుడు** - దోచుకొనువాడు (జూదరి, దొంగ)

**హారము** - నూటయెనిమిగది ముత్తెములు కూర్చిన దండ, భిన్నములోని క్రింది భాగము

**హార్దము** - హృదయమునకు సంబంధించినది, హృదయమునకు ప్రియమైనది

**హాలాహల ధరము** -గరళమును ధరించునది (పాము)

**హాహాలము, హాహాలము** - హాహాకారములు చేయించు హాలాహల విషము

**హిందోళము** - శిశిరవసంత ఋతువుల సంధికాలమున బాడెడు ఒకానొక రాగము

**హింసకుడు** - చంపువాడు, బాధించువాడు

**హిమకరుడు, హిమగువు** - చల్లని వెలుగులు కలవాడు (చంద్రుడు)

**హిమధాముడు** - చల్లని కాంతి గలవాడు (శీతాంశుడు - చంద్రుడు)

**హిమము** - తాపమును బోగొట్టునది (మంచు)

**హిమవంతము** - మంచు కలది

**హిమవాలుక** - మంచు పొడి వలె చల్లనై తళ తళ లాడునది (కర్పూరము)

**హిమాంబువు** - చల్లని నీరు

**హిమాంశువు** - మిహికాకరుడు - చంద్రుడు

**హిమాచలము, హిమాద్రి, హిమాలయము** మంచుకొండ

**హిరణ్యగర్భుడు** - గర్భమున హిరణ్యము కలవాడు, హిరణ్యమయమైన గర్భము కలవాడు (బ్రహ్మ)

**హిరణ్యము** - పోవునది (ధనము, బంగారము)

**హిరణ్య రేతసుడు, హిరణ్య రేతుడు** - హిరణ్యము రేతస్సుగా గలవాడు (అగ్ని)

**హిరణ్యవాహము** - బంగారు వన్నెగల ప్రవాహము (శోణనదము - సోన అను ఏరు)

**హిరణ్యవాహుడు** - భక్తులకు సంపద లిచ్చువాడు (శివుడు)

**హిహూకము** - శరీరము ముడుచుకొన్న పిల్లి

**హీనోపమ** - హీనమైనయుపమానము గలది (ఒక కావ్య దోషము)

**హుతభుక్కు** - హవ్యమును తినువాడు (హుతాశనుడు - అగ్ని)

**హుతాశనుడు** - హోమద్రవ్యము (హవిస్సు) అశనముగా గలవాడు (అగ్ని)

**హుతాశుడు** - హవిస్సును తినువాడు (హుతాశి - అగ్ని)

**హృతము** - హరింపబడినది (ముషితము), ఆకర్షింపబడినది

**హృతాధికారుడు** - అధికారము నుండి తొలగింపబడినవాడు

**హృత్ప్రియము** - మనస్సున కిష్టమైనది

**హృదయంగమము** - మనస్సున కింపైనది (మాట)

**హృదయము** - హరింపబడునది (మనస్సు)

**హృదయశల్యము** - సూటిగా హృదయము నకు తాకుటచే బాధ కల్గించు ముల్లువంటి వార్త

**హృదయాళువు, హృదయి** - మంచి మనస్సు గలవాడు (సుమనస్కుడు)

**హృద్యము** - మనసునకింపైనది

**హృల్లాసము** - గుండె వేగముగా కొట్టుకొను జబ్బు

**హృల్లేఖము** - హృదయమును గీరునది (బాధ)

**హృషితుడు** - సంతోషము నొందినవాడు (హృష్టుడు)

**హృషీకము** - సంతోషసాధనమైనది (ఇంద్రియము)

**హృషీకేశుడు** - హృషీకములకు ప్రభువు (విష్ణువు)

**హెగ్గడి కత్తె** - అంతఃపురపు కావలికత్తె (పక్కెరాలు - ఎగ్గడికత్తె)

**హెగ్గ(డికాడు)డీడు** - అంతఃపురవు కావలి వాడు (అంగజాలుడు - సౌవిదల్లుడు)

**హేడకుడు, హేడుడు** - చూ॥పై (కంచుకి - హెగ్గడి)

**హేతుకుడు** - హేతువాదముచే మెలగువాడు

**హేతుమంతము** - గుర్తుకలది అనుమాన ప్రమాణంబున లింగమగు ధూమాదికము గలది (హేతుమత్తు). సప్రమాణమైనది

**హేతువు** - వ్యాపించునది, అనుమాన ప్రమాణమునకు సాధనమైనది

**హేత్వంతరము** - వాదములో వాది ఓడిపోవుటకు హేతువులైన ఇరువది రెండంశములలో ఒకటి, (తర్క) మరి యొక కారణము

**హేత్వాభాసములు** - పొందికలేనిహేతువులు (అనద్ధేతువులు - నవ్యభిచార, విరుద్ధ, సత్ప్రతిపక్ష, అసిద్ధ, బాధితంబులు - 5 విధములు ఒకచోటనే యుండవలెనని నియమములేనిదియు లక్ష్యము కాని తావునందు సైతము ప్రవర్తించునది యగు సవ్యభిచార హేతువు (సాధారణ, అసాధారణ, అనుపసంహారియని త్రివిధంబు) సాధ్యాభావ వ్యాప్యమైన హేతువు విరుద్ధము సాధ్యహేతువునకు సాధ్యాభావ సాధకంబగు హేత్వంతర మెచ్చట నుండునోయది సత్ప్రతిపక్షంబు మూడు విధములు దేనికి సాధ్యా భావము ప్రమాణాంతరములచే బాధితమగునో యది బాధిత హేతువు

**హేమంతము** - మార్గశీర్ష పుష్య మాసములు కల ఋతువు (మంచుకురిసెడు ఋతువు)

**హేమకారుడు** - బంగారు పనివాడు (కమసాలి - అగసాలెవాడు)

**హేమకూటము** - బంగారు శిఖరములు గల యొక పర్వతము (కింపురుష వర్షమందు కలదు)

**హేమదుగ్ధకము** - బంగారు వన్నె సొనకలది (అత్తిచెట్టు - హేమదుగ్ధము)

**హేమము** - పుటము పెట్టిన కొలది వన్నె పెరుగునది, లోహాంతరము (రాగి) తో గూడి వృద్ధియగునది (బంగారము)

**హేమలుడు** - బంగారము కొంత మిగుల్చు కొనువాడు (స్వర్ణకారుడు)

**హేమాంబరుడు** - పీతాంబరుడు

**హేమాద్రి** -బంగారు కొండ (మేరుపర్వతము)

**హేరంబము** - హే అని అరచునది (గేదె)

**హేరంబుడు** - భక్తులను వృద్ధి పొందించు వాడు, రుద్రుని నమీపమున నుండు వాడు (వినాయకుడు)

**హేలావతి** - విలాస చేష్టలు గలది (హొయలు కత్తె)

**హేష** - గుఱ్ఱము యొక్క సకిలింత

**హైమము** - బంగారముతో చేసిన నగ, మంచునీరు

**హైమవతి** - హిమవంతుని కొమార్తె (పార్వతి)

**హైయంగవీనము** - తొలినాడు చిలికి యెత్తిన అవు వెన్న, అప్పుడు కాచిన నెయ్యి

**హైహాయుడు** - హైహయదేశమునకు చెందినవాడు, హైహయదేశాధీశుడగు కార్తవీర్యార్జునుడు

**హోయలు బండి** - సాయంకాలమున గాలి కొరకు ఎక్కి తిరుగునట్టి బండి (కొల్లారు బండి)

**హోత** - ఋగ్వేదము తెలిసిన ఋత్విక్కు, (యాజకుడు) హోమము చేయువాడు (హోమి - హోత్రి)

**హోమ ధాన్యము** - హోమము చేయదగిన ధాన్యము (నువ్వులు)

**హోమ్యము** - అగ్నియందు వేల్వ దగినది (హోతవ్యము - హౌమ్యము)

**హోర** - రేయింబవలు (అహోరాత్రము - అహోరాత్ర పదములోని "అ" "త్ర" వర్ణముల లోపము - హోరా

**హోరాహోరి** - ముమ్మరముగా (హోరలు కొలది)

**హోళి పండుగ** - కామదహనోత్సవము (వసంతోత్సవము)

**హౌత్రము** - హోతకు సంబంధించినది

**హౌమ్యము** - హోమ్యము (నేయి)

**హ్రాదగ్రహము** - హ్రదమున (మడుగులో) నుండి పట్టుకొనునది (మొసలి)

**హ్రాదము** - కల్లోలములచే అవ్యక్తముగా మ్రోయునది (అగాధ జలాశయము)

**హ్రసిష్టము** - మిక్కిలి హ్రస్వమైనది

**హ్రస్వము** - దీర్ఘము లేని యక్షరము (ఒక మాత్ర గల వర్ణము, పొట్టి - కురుచ)

**హ్రస్వుడు** - హసింపబడువాడు (అల్పుడు, పొట్టివాడు)

**హ్రాదిని** - అవ్యక్తమైన ధ్వని గలది (ఏరు, నది, వజ్రాయుధము)

**హ్రీకము** - బెదరు చుండునది (ముంగిస)

**హ్రేష** - గుఱ్ఱపు సకిలింత (హేష)

**హ్లాదుడు** - సంతోషించినవాడు (తుష్టుడు)



